# అంతిమ

# దైవగ్రంథములో

# జ్ఞాన వాక్యములు


రచయిత: త్రిమత ఏకైక గురువు

ఆధ్యాత్మిక సామ్రాజ్య చక్రవర్తి, శతాధిక గ్రంథకర్త

ఇందూ జ్ఞాన ధర్మప్రదాత, సంచలనాత్మక రచయిత, త్రైత సిద్ధాంత ఆదికర్త

శ్రీశ్రీశ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు



www.thraithashakam.org

# అంతిమ దైవగ్రంథములో జ్ఞాన వాక్యములు

ఆధ్యాత్మిక సామ్రాజ్య చక్రవర్తి

అర్ధ శతాధిక గ్రంథకర్త, ఇందూ (హిందూజ్ఞాన) ధర్మప్రదాత

సంచలనాత్మక రచయిత, త్రైత సిద్ధాంత ఆదికర్త

**శ్రీశ్రీశ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు**


ప్రచురించిన వారు

**ఖుదా ఇస్లామిక్ స్పిరిచ్యువల్ సొసైటీ**

(Regd.No. : 459/2011)

త్రైత శకము–36 ప్రథమ ముద్రణ : సం॥ 2014

ప్రతులు : 1000 వెల : **360/-**

# యోగీశ్వరుల వారి సంచలనాత్మక రచనలు

## ఇందూ జ్ఞానవేదిక ప్రచురణలు

1) త్రైత సిద్ధాంత భగవద్గీత.
2) ఆధ్యాత్మిక ప్రశ్నలు-జవాబులు.
3) ధర్మము-అధర్మము.
4) ఇందుత్వమును కాపాడుదాం.
5) యజ్ఞములు (నిజమా-అబద్ధమా?).
6) దయ్యాల-భూతాల యదార్థసంఘటనలు.
7) సత్యాన్వేషి కథ.
8) మంత్రము-మహిమ (నిజమా-అబద్ధమా)
9) శ్రీకృష్ణుడు దేవుడా, భగవంతుడా.
10) గీతా పరిచయము (తెలుగు,ఇంగ్లీషు)
11) కలియుగము (ఎప్పటికీ యుగాంతము కాదు).
12) జనన మరణ సిద్ధాంతము.
13) మరణ రహస్యము.
14) పునర్జన్మ రహస్యము.
15) త్రైతాకార రహస్యము (త్రైతాకార బెర్ముడా)
16) కథల జ్ఞానము.
17) సామెతల జ్ఞానము.
18) పొడుపు కథల జ్ఞానము.
19) తత్త్వముల జ్ఞానము.
20) తిట్ల జ్ఞానము-దీవెనల అజ్ఞానము.
21) గీతం-గీత (పాటల జ్ఞానము).
22) తత్త్వార్థ బొమ్మల జ్ఞానము.
23) దేవాలయ రహస్యములు.
24) ఇందూ సాంప్రదాయములు.
25) మన పండుగలు (ఎలా చేయాలో తెలుసా?)
26) జ్యోతిష్యశాస్త్రము (శాస్త్రమా-అశాస్త్రమా?)
27) తల్లి తండ్రి.
28) గురు ప్రార్థనామంజరి.
29) త్రైతారాధన.
30) సమాధి.
31) ప్రబోధ.
32) సుబోధ.
33) ప్రసిద్ధి బోధ.
34) సుప్రసిద్ధి బోధ.
35) సిలువ దేవుడా?
36) మతాతీత దేవుని మార్గము.
37) సృష్టికర్తకోడ్-963.
38) మతము-పథము.
39) ప్రబోధానందం నాటికలు.
40) ఇందువు క్రైస్తవుడా?
41) నిగూఢ తత్త్వార్థ బోధిని.
42) ఆత్మలింగార్థము.
43) నాస్తికులు-ఆస్తికులు.
44) హేతువాదము-ప్రతివాదము.
45) గుత్తా.
46) ప్రబోధ తరంగాలు.
47) త్రైత సిద్ధాంతము.
48) రూపము మారిన గీత.
49) ఉపనిషత్‌లలో లోపాలు.
**50) ప్రథమ దైవగ్రంథము భగవద్గీత.**
**51) ద్వితీయ దైవగ్రంథములో జ్ఞానవాక్యములు.**
**52) అంతిమ దైవగ్రంథములో జ్ఞానవాక్యములు.**
53) ద్రావిడ బ్రాహ్మణ.
54) తీర్పు.
55) కర్మ పత్రము.
56) ప్రవక్తలు ఎవరు?
57) ధర్మశాస్త్రము ఏది?
58) మత మార్పిడి దైవద్రోహము.
59) త్రైతశక పంచాంగము.
60) త్రైత సిద్ధాంత ఆధ్యాత్మిక ఘంటు.
61) స్వర్గము ఇంద్రలోకమా!-నరకము యమరాజ్యమా!!
62) జీహాద్ అంటే యుద్ధమా?
63) మూడు గ్రంథములు, ఇద్దరు గురువులు.

# యోగీశ్వరుల వారి సంచలనాత్మక ప్రసంగాలు



DVD'S

01. సంతకము.
02. సాంప్రదాయము.
03. త్రైతశకము.
04. కోడిపుంజు-పాదరసము.
05. యుగము-యోగము
06. నైజం-సహజం.
07. ఆత్మకు వెంట్రుక గుర్తు.
08. పైత్యం-సైత్యం.
09. శైవము-వైష్ణవము.
10. ఇందూమహాసముద్రము.
11. సృష్ఠి-సృష్ఠికర్త.
12. కాయ-పండు-కాయ.
13. జ్ఞానము-విజ్ఞానము.
14. వార-మాస-వత్సర.
15. సేకూవలి-కూలిసేవా.
16. ధర్మము-అధర్మము.
17. ఏక్‌నిరంజన్-అలక్‌నిరంజన్.
18. గురువులేని విద్య గ్రుడ్డివిద్య.
19. బట్టతల.
20. భగవంతుడు.
21. ద్రావిడులు-ఆర్యులు.
22. ప్రభువు-ప్రభుత్వం.
23. భూతం-మహాభూతం.
24. ప్రభు-ప్రజ.
25. యాదవ్.
26. పుస్తకము-గ్రంథము.
27. వెలుగుబంటు.
28. ప్రకృతి-వికృతి.
29. మాట-మందు.
30. ఏకత-ఏకాగ్రత.
31. హరికాలు-హరచేయి.
32. పుట్టగోసి-మొలత్రాడు.
33. 1 2 3 గురుపౌర్ణమి.
34. చమత్కార ఆత్మ.
35. క్షమించరాని పాపము.
36. మాయకుడు-అమాయకుడు.
37. మరణము-శరీరము
38. ఎదమీదముద్ర-తల్లి తండ్రి గుర్తు.
39. ద్వితీయుడు-అద్వితీయుడు
40. బయటి సమాజం-
    లోపలి సమాజం.
41. సేవా శాతము.
42. ప్రపంచ శ్రద్ధ-పరమాత్మ శ్రద్ధ.
43. శ్రీకృష్ణాష్టమి.
44. దేవునిజ్ఞానము-
    మాయమహత్యము
45. తల్లి తండ్రి.
46. తల్లి తండ్రి-గురువు దైవము.
47. సమాధి.
48. మతము-పథము.
49. కలియుగము
50. దివ్యఖురాన్-హదీసు.
51. పుట్టుట-గిట్టుట.
52. తల్లి.

53. గోరు-గురు.
54. కర్మ మర్మము.
55. ఆత్మ.
56. తాత.
57. గురుపౌర్ణమి.
58. ఇందువు-హిందువు.
59. శ్రీకృష్ణజన్మ మధుర.
60. ఆత్మపని.
61. కర్మ లేని కృష్ణుడు-
కర్మ ఉన్న కృష్ణుడు.
62. త్రైత సిద్ధాంతము
63. సహజ మరణం-
తాత్కాలిక మరణం.
64. స్త్రీ-పు / లింగము
65. ఆధ్యాత్మిక ప్రశ్నలు-జవాబులు.
66. దేశం మోసం-దేహం మోహం
67. యోగీశ్వరుల జన్మదిన సందేశము.
68. జీర్ణ+ఆశయము
69. మేఘం ఒకభూతం-
రోగం ఒకభూతం.
70. దేవునికి మతమున్నదా?
71. ఇచ్ఛాధీన కార్యములు-
అనిచ్ఛాధీన కార్యములు.
72. ఏది ధర్మము
73. అధర్మ ఆరాధనలు.
74. మూడు పుట్టుకలు-రెండు జాగాలు
75. పుట్టినరోజు ఎవ్వరికీ రాదు.
76. నిదర్శ - నిరూప
77. నటించే ఆత్మ
78. సంచిత కర్మ
79. గురువు ఎవరు?
80. శ్రీకృష్ణుడు ఎవరు?
81. సుఖము-ఆనందము
82. టక్కుటమారా, ఇంద్రజాల
మహేంద్రజాల, గజకర్ణ గోకర్ణ.
83. భయం
84. దశ-దిశలు.
85. ఆడించే ఆత్మ
86. స్వార్థ రాజకీయం (స్వ+అర్థ రాజకీయం)
87. మూడు నిర్మాణాలు-ఒక పరిశుభ్రత
88. ఏది శాస్త్రము?
89. తెలుగులో మూడు-ఆరు-తొమ్మిది.
90. 6-3=6.
91. గుర్తింపబడనివాడు గురువు.
92. జ్ఞానము దగ్గర జాగ్రత్త!
93. చంద్రాకారము (బట్టతల).
94. మతములలో పవిత్రయుద్ధము.
95. మూడు గ్రంథములు.
96. ఏడు ఆకాశములు.



యూ ట్యూబ్ వీడియోలు
http://www.youtube.com/channel/UCkrD6R8nEU0-O7gNn46Ktfw

## ప్రబోధాశ్రమము (శ్రీకృష్ణమందిరము)

చిన్నపొడమల (గ్రా), తాడిపత్రి (మం), అనంతపురం (జిల్లా) A.P.
Cell : 9866512667, 9951675081, Fax : 08558-225966.

**ఇందూ జ్ఞానవేదిక**

**(రాష్ట్రకార్యాలయము)** Fax : 040-24146006.
శ్రీదేవికాంప్లెక్స్, ప్రభాత్‌నగర్,
చైతన్యపురి, దిల్‌సుఖ్‌నగర్, హైదరాబాద్
9848057951, 9491877239, 9848590172.

*****

**అనమల మహేశ్వర్** (ప్రసిడెంట్)
చవటపాల్యం (గ్రా), గూడూరు (మం),
నెల్లూరు జిల్లా. Cell : 9494631664,
9490809181, 8106065300.

*****

**బాలం లక్ష్మీనరసింహులు** (ప్రసిడెంట్)
కదిరి రోడ్డు, రాజానగర్, నీరుగట్టువారి
పల్లి, మదనపల్లి, చిత్తూరు జిల్లా.
Cell : 9440825533, 8519938999.

*****

**పోటు వెంకటేశ్వర్లు (గురూజీ)**
(ప్రసిడెంట్)
ధన్వంతరి హెల్త్ కేర్ సెంటర్,
హుజూర్‌నగర్, నల్లగొండ (జిల్లా)
Cell : 9848574803, 9491040963.

*****

**పి. ఆదినారాయణ** (ప్ర.సభ్యుడు)
భాగ్యనగర్ ముద్దిరెడ్డి పల్లి (గ్రా॥),
హిందూపురం (తా), అనంతపురం (జిల్లా).
Cell : 9440745800, 7259851861.

**కె.లక్ష్మీనారాయణాచారి** (ప్రసిడెంట్)
బ్యాటరీషాప్, నియర్ ఎస్.ఐ.యు చర్చి,
మార్కెట్‌స్ట్రీట్, ధర్మవరం, అనంతపురం (జి)
Cell :9440556968, 9290012413,
9440601136.

*****

**షఫీ షేక్** (K.I.S.S Member)
నొలంబూర్ , చెన్నై - 600 095
Cell : 9445554354, 9789963963.

*****

**డా॥యం. వెంకటేశ్వర రావు** (ప్రసిడెంట్)
MD (acu)
డోర్ నెం. 24-4-178, గోవింద నిలయం,
శాంతినగర్, నెల్లూరు జిల్లా - 524003.,
Cell : 9440615064, 9246770277.

*****

**టి. వీరనారాయణ రెడ్డి** (ప్ర.సభ్యుడు)
బట్టేపాడు గ్రా॥ ఆత్మకూరు మం॥,
నెల్లూరు (జిల్లా)., Pin : 523322.
Cell : 9494618322, 8374923363

*****

**బి. ఆదిశేషయ్య** (టీచర్) (ప్రసిడెంట్)
రామానుజం స్కూల్ దగ్గర, ఉప్పరవీధి,
గుత్తి, అనంతపురం (జిల్లా)
Cell : 9491362448, 7382986963.

*****

**కె.అశోక్‌బాబు** (టీచర్) (ప్రసిడెంట్)
రామాపురం (గ్రా), వి.కోట (మం).
చిత్తూరు జిల్లా Cell :9440305700,

**చెన్న ఆంజనేయులు** (కరస్పాండెంట్)
జ్ఞానోదయ హైస్కూల్, ఇటిక్యాల,
రాయికల్ మం॥, కరీంనగర్ (జిల్లా)
Cell : 95507 97782
*****

**డా॥బి. ధర్మలింగాచారి** (ప్ర.సభ్యుడు)
శ్రీ కనక మహాలక్ష్మి క్లినిక్,
(S కోట), విజయనగరము (జిల్లా).
Cell: 08966-275208, 9704911737
*****

**వి. శంకర రావు** (ప్ర.సభ్యుడు)
అశోక్‌నగర్, విజయనగరము (జిల్లా).
Cell : 9703534224, 9491785963.
*****

**ఎ. నాగేంద్ర** (ప్రెసిడెంట్) : 9493622669
క్రొత్త చెరువు (గ్రా, మం) అనంతపురం జిల్లా.
9959316410, 9949995090.
*****

**రౌతు శ్రీనివాసరావు** (ప్రెసిడెంట్)
ఏటుకూడు రోడ్, దర్గామాన్యం, గుంటూరు (జి)
Cell : 9948014366, 9052870853
*****

**డి. బాలాజీ** (వైస్ ప్రెసిడెంట్)
బంగారు పాళ్యం (గ్రా), చిత్తూరు జిల్లా.
Cell : 9985483241, 7396077408.
*****

**వై. రేణుక దేవి** (ఇ.సభ్యులు)
పద్మావతినగర్, తిరుపతి.
Cell : 9491773455, 9032903955.
*****

**పి. నాగయ్య** (ప్ర.సభ్యుడు)
వీకర్ సెక్షన్ కాలనీ, కర్నూలు (జిల్లా).
Cell : 9440244598, 9849303902,

**వి.సి.వర్మ (గురూజీ) ఆనందాశ్రమము**
మజ్జివలస (గ్రా, పోస్టు), భీమిలి (మం),
విశాఖపట్నం (జిల్లా) – 531162.
Cell : 9441567394, 9502172711.
*****

**ఎన్.బి. నాయక్** (ప్ర.సభ్యుడు)
పెదమడక, అగనంపూడి,విశాఖపట్నం (జిల్లా)
Cell : 7396492239, 9248315309
*****

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
మద్దిగట్ల (గ్రా), పెద్దమందడి (మం),
మహబూబ్‌నగర్ (జిల్లా).
Cell : 8790558815, 9440655409,
9701261165.
*****

**ఎన్.వి. రామకృష్ణ** (ప్ర.సభ్యుడు)
బొద్దాం (గ్రా), రాజాం (మం), శ్రీకాకుళం
Cell : 9494248963, 9959779187.
*****

**టి. ఉదయకుమార్** (ప్రెసిడెంట్)
బుధవారము మార్కెట్, భీమవరం-1,W.G
Cell : 9948275984, 7386433834.
*****

**టి.వి. రమణ** (ప్రెసిడెంట్)
ముదిగుబ్బ (గ్రా, మం), కదిరి (తా),
అనంతపురం జిల్లా-515511.
Cell : 9440980036, 8185020272.
*****

**వి. రామక్రిష్ణన్** (వైస్ ప్రెసిడెంట్)
నేతాజిరోడ్డు కుప్పం,చిత్తూరు జిల్లా.
Cell : 9652755110,

# విషయ సూచిక

| క్ర. సం. | గ్రంథములోని విషయము | పేజీ నెం. |
|---|---|---|

| క్ర. సం. | గ్రంథములోని విషయము | పేజీ నెం. |
|---|---|---|
| 113) | జనన మరణాలు ఎన్ని పొందినా చిట్టచివరికి అల్లాహ్‌యే గమ్యం | 467 |
| 114) | మతధర్మాలన్నీ వదలి చివరికి దైవధర్మం స్వీకరించాల్సిందే | 469 |
| 115) | అన్య (మత) ధర్మాన్ని ఆచరిస్తే పరలోకము దూరమే | 469 |
| 116) | నిజదైవాన్ని ఆరాధిస్తే పాపపుణ్యములు తొలుగుతాయి | 476 |
| 117) | జ్ఞానం, మార్గదర్శక జ్యోతి, గ్రంథజ్ఞానం- అతివాదులకు గిట్టదు | 478 |
| 118) | ప్రవక్త మరణిస్తే - మిగతావారు బ్రతికుంటారా? | 481 |
| 119) | మన చావుపుట్టుకలన్నీ ప్రకృతిద్వారానే దేవుడు కల్పిస్తాడు | 484 |
| 120) | మృతభూమికి జీవం పోసేవాడు దేవుడే | 486 |
| 121) | దేవతలకూ (జిన్నాతులకు) ఆచరణీయమైనది ఖురాన్ | 512 |
| 122) | మనుషులు ఆరాధించబట్టే జిన్నాతులకు మరింత పొగరు | 513 |
| 123) | స్త్రీ పురుషులు ఎవరికైనా వారిపుణ్యమే స్వర్గప్రాప్తి, పాపమే నరకప్రాప్తి | 515 |
| 124) | సంతానప్రాప్తి దైవము చేతుల్లోనే | 516 |
| 125) | ప్రాణము పోసేది, ప్రాణము తీసేది ఆయనే | 516 |
| 126) | దేవునికి భార్యే లేనప్పుడు సంతానం ఎలా కలుగుతుంది? | 518 |
| 127) | దేవుడు తలిస్తే అందరూ ఒక సమాజమే పరీక్షించుటే ఆయన అభిలాష | 523 |
| 128) | ఏ మానవమాత్రునిపై దైవసందేశాన్ని అవతరింప చేయలేదు | 525 |

వార్త అనగా మోసుకొని వచ్చునది. వాసన అనగా తీసుకొని వచ్చునది. వార్త అను శబ్ధమునుండి వాసన అను శబ్ధము పుట్టినది. పూర్వము చదువురాని కాలములో ఒక వార్తను ఒకచోటినుండి మరొక చోటికి పంపుటకు రాజులు ఒక వ్యక్తిచేత తమ సమాచారమును పంపెడి వారు. అట్లు సమాచారమును మోసుకొని పోయెడి వానిని **"వార్తాహరుడు"** అని అనెడివారు. వార్త అనగా సమాచారము అని అర్థముకాగా, హరుడు అంటే లేకుండా చేయువాడు అని అర్థము. వార్తను లేకుండా చేయువానిని వార్తాహరుడు అనెడివారు. ఇంకా అర్థమయ్యేటట్లు చెప్పుకోవాలంటే వార్తను చంపివేయువాడు అని అర్థము. ఇదేమి అర్థము, వార్తను తీసుకొనిపోవువాడు అనినా ఫరవాలేదు. వార్తను మోసుకొని పోయెడివాడు అనినా సరిపోతుంది. ఇది ఏదీ కాకుండా ఏకంగా వార్తను లేకుండా చేయువాడు అని ఎందుకు అన్నారు? అని కొందరు ప్రశ్నించవచ్చును. దానికి మా జవాబు ఈ విధముగా కలదు. ఒక సమాచారమును ఇంకొక చోటికి పంపునప్పుడు ఇప్పటికాలములో ఒక జాబు (లేఖను) వ్రాసి, దానిని ఇతరులు ఎవరూ చదవకుండా మడిచిపెట్టి మూతవేసి పంపుదుము. అది చేరవలసిన చోటికి చేరిన తర్వాత అక్కడ దానికున్న మూతను చింపి లేఖను తెరచి చూస్తే అప్పుడు దానిలోని సమాచారము తెలియును. అంతవరకూ ఆ కవర్‌ను చూచిన వారికి ఏ సమాచారమూ కనిపించదు. కవర్‌లోయున్న సమాచారము అంతవరకూ లేనట్లే కదా! అనగా తెలియనట్లే కదా! అలాగే పూర్వము ఒక రాజు మరియొక రాజువద్దకు రహస్య సమాచారమును పంపునప్పుడు, ఒక వ్యక్తిని నియమించుకొని వాని చేతికి ఏ ఉత్తరమూ (లేఖ) వ్రాసి ఇవ్వకుండా, ఇక్కడ చెప్పిన సమాచారమును తనలో దాచుకొని, గమ్యమును చేరిన తర్వాత చెప్పవలసిన రాజుకు ఆ సమాచారమును చెప్పెడివాడు. అంతవరకూ పంపబడిన వార్త వానిలో ఇమిడిపోయి

బయటికి తెలియకుండా పోయినది. అంటే అది చచ్చిన దానితో సమానమే అయిపోయింది. మధ్యలో ఆ మనిషిని చూడవచ్చును గానీ, ఆ వార్తను చూడలేరు. ఒక సమాచారము బయటికి తెలియకూడదను ఉద్దేశ్యముతో ఆ వార్తను చంపి మనిషిలో సమాధి చేసి పంపెడివారు. అందువలన పూర్వము వార్తను మోసుకొని వచ్చువానిని వార్తాహరుడు అనెడివారు.

వార్త అను పదమునుండి వాసన అను పదము పుట్టినది. వాసన యనగా తీసుకరాబడునదని అర్థము. వార్త మోసుక రాబడునదియైనప్పుడు వాసన తీసుకరాబడునదని చెప్పవచ్చును. వార్తను మనిషి మోసుక రాగలడు. అలాగే వాసనను గాలి తీసుకరాగలదు. మనిషిలోని వార్త ఎలా కనిపించదో, అలాగే గాలిలోని వాసన కూడా కంటికి కనిపించదు. వార్తాహరుడు వార్తను చెప్పునప్పుడు ఆ వార్త చెవుల ద్వారా ఇతరులకు తెలియుచున్నది. అలాగే వాసన గాలి ద్వారా ముక్కులకు చేరినప్పుడే ఆ వాసన ముక్కులకు తెలియుచున్నది. వార్తను తనయందు సమాధి చేసిన వానిని హరుడు అనినట్లు, వాసనను తనయందు ఇముడ్చుకొన్న గాలిని మారుతము అంటున్నాము. హరుడు అనగా చంపువాడు అని అర్థము ఎలాగయున్నదో, అలాగే మారుతము అనగా చంపునదియని అర్థము లేక మారణము చేయునది అని అర్థము. మారణము చేయుట వలన గాలిని మారుతము అంటున్నాము. హరించువాడు గనుక మనిషిని హరుడు అంటున్నాము. వార్త దగ్గర మనిషి వార్తాహరుడుగా మారుచున్నాడు. అట్లే వాసన దగ్గర గాలి గంధ మారుతముగా లేక వాసన మారుతముగా మారి పోయినది.

మన శరీరములో కొన్ని గ్రంథులున్నాయి అందు ఏడు ముఖ్యమైనవి. ఆ ఏడులో ఒకటి అతిముఖ్యమైనది. గ్రంథులలో తెలియని

విధానమున్నది. అక్కడ ఊరు ఊటలు ఎలా ఊరుచున్నవో, ఎందుకు ఊరుచున్నవో ఎవరికీ తెలియదు. తెలియని విధానము ఉన్నదానిని గ్రంథి అంటున్నాము. అతిముఖ్యమైన గ్రంథిలో ఏమి ఊరుతున్నదో కూడా ఎవరికీ ఇంతవరకు తెలియదు. రహస్యమున్న దానిని గ్రంథి అంటున్నాము. అలాగే రహస్య జ్ఞానమున్న దానిని గ్రంథము అంటున్నాము. గ్రంథము అను పదము గ్రంథి అను శబ్ధమునుండి పుట్టినది. గ్రంథి అనగా ఆత్మ రహస్యము ఇమిడియున్నది. అలాగే గ్రంథము అనగా ఆత్మ జ్ఞానరహస్యము ఇమిడియున్నది. గ్రంథిని గురించి తెలియగలిగితే అది ఆత్మశక్తితో పని చేయుచున్నదని తెలియగలరు. అలాగే గ్రంథమును గురించి తెలియగలిగితే జ్ఞానరహస్యమును గురించి తెలియవచ్చును. ఇప్పుడు మనము అంతిమ దైవగ్రంథమును చదువబోతున్నాము. అందులో అన్నీ జ్ఞాన రహస్యములే ఉన్నట్లు తెలిసినది. వాటిని విప్పి చెప్పుకొంటే అందులోని జ్ఞానము అర్థము కాగలదు. విప్పి చెప్పుకోకపోతే అందులోయున్న జ్ఞానమేదో ఎవరికీ తెలియకుండా పోగలదు. వార్తను కనిపించకుండా చేసినవాడు వార్తాహరుడు. వాసనను లేకుండా చేసినది గంధమారుతము. జ్ఞానమును తెలియకుండా దాచియుంచునది గ్రంథము. వార్తాహరుని ద్వారా వార్తను చెవులతో తెలియవచ్చును. వాసనను ముక్కులతో తెలియవచ్చును. అలాగే గ్రంథములోని జ్ఞానమును బుద్ధి ద్వారా తెలియవచ్చును. అందువలన బుద్ధి గ్రాహితశక్తి ఎవరెవరికి ఎంతయెంతయుండునో అంతయంతే జ్ఞానము అర్థముకాగలదు. ఇప్పుడు వార్త, వాసన అర్థమైనట్లే గ్రంథము అంటే ఏమిటి అన్న విషయము అర్థమయిపోయిందనుకొంటాను.

వార్తలలో చెడు వార్తలుండవచ్చును, మంచి వార్తలుండవచ్చును. అలాగే వాసనలలో సువాసనలుండవచ్చును, దుర్వాసనలుండవచ్చును. జ్ఞానములలో కూడా ఆత్మజ్ఞానముండవచ్చును, అజ్ఞానము ఉండవచ్చును.

ఇందులో మనకు అవసరమైనవి మంచివార్తలు, మంచి వాసనలు, ఆత్మజ్ఞానము అవసరము. ఆత్మజ్ఞానము ఒకే ఒక గ్రంథపఠనము ద్వారా తెలియవచ్చును. ఇప్పుడు వార్తలను, సువాసనలను కాకుండా జ్ఞాన విషయమును చూస్తే ఆత్మజ్ఞానము గ్రంథములలోని వివరము ద్వారానే తెలియనగును. అలా కాకపోతే గురువు చెప్పు వార్తలద్వారానయినా (జ్ఞానము ద్వారానయినా) తెలియవచ్చును. భూమిమీద గురువును గుర్తించుట కష్టము. చెప్పేవారంతా గురువులు కాదు అనుట కూడా సత్యమే. వార్తల విషయమును వదలివేస్తే గ్రంథములు మాత్రము ఇవి గ్యారంటీగా ఆత్మజ్ఞానమును తెలియజేయునవని తెలిసిపోయినది. అందువలన గ్రంథముల ద్వారా ఆత్మజ్ఞానమును అనగా దైవజ్ఞానమును తెలియవచ్చును. అయితే గ్రంథము అనగా రహస్యముతో కూడుకొన్నది అని తెలిసినది. ఇప్పుడు మనము చూడబోవు గ్రంథము అంతిమ దైవగ్రంథము. ఇంతకుముందు ప్రథమ దైవగ్రంథమును చూచాము. అందులో దాచిపెట్టబడిన విషయములు ఎక్కువగా లేకున్నా, అన్ని విషయములు సులభముగా అర్థమగునట్లు ప్రత్యక్షముగా చెప్పియున్నా, అది గ్రంథము అని పిలువబడుట చేత అందులో రహస్యముండుట సత్యమే అయినది. ప్రథమ దైవగ్రంథము అయిన భగవద్గీతలోని విషయములు చాలా భాగము ఇంతవరకు రహస్యముగానే నిలిచిపోయాయి. ఎవరికీ అర్థము కాలేదు. అందులో చెప్పిన కృష్ణుడు కూడా నేను చెప్పునది రాజ గుహ్యమైనదని చెప్పాడు. గుహ్యము అంటే రహస్యము, రాజగుహ్యము అంటే పెద్ద రహస్యము అని అర్థము. గీతలో యున్న విషయములు కనిపించుటకు సులభముగాయున్నా అవి గ్రంథమైన విషయములగుట వలన రహస్యముతో కూడుకొనియున్నవి. అందువలననే చాతుర్వర్ణము అను శ్లోకము ఇంతవరకూ అర్థము కాలేదని చెప్పవచ్చును. భగవద్గీతలో

మూల సిద్ధాంతమైన **"త్రైత సిద్ధాంతమే"** అర్థము కాలేదు. ఈ విధముగా ముఖ్యమైనది ఎంతయుందో అంత ఎవరికీ అర్థము కాలేదనియే చెప్పవచ్చును. కొందరికి ఈ మా మాట కోపమును తెప్పించియుండ వచ్చును. దానికి నేను ఏమీ చేయలేను హిందువులలో ఎవరు ఎంత స్థాయిలోయున్నా, భగవద్గీత ఆధ్యాత్మిక గ్రంథమయిన దానివలన అందులోని ఆధ్యాత్మికము దాచిపెట్టబడియుండుననీ, అది అందరికీ అగుపించదనీ చెప్పవచ్చును. అంతేకాక మేము చెప్పుమాట నిరూపణకు వచ్చునట్లు హిందూ సంస్థలయినవారు, హిందూ ధర్మమును కాపాడుతామని కంకణము కట్టుకొన్నవారు, మేము స్వచ్ఛమయిన హిందువులమనువారు అనంతపురము జిల్లా, గుంతకల్లులో సరస్వతి విద్యామందిరము ముందర సరస్వతి సాక్షిగా మేము రచించిన "త్రైత సిద్ధాంత భగవద్గీత" ను అగ్గిపెట్టి కాల్చివేశారు. భగవద్గీత అర్థము కాలేదనుటకు ఈ నిరూపణ చాలు కదా!

నేడు దేశములోయున్న భగవద్గీతలలోకెల్లా ఎక్కువ వివరమును ఇచ్చి దైవజ్ఞానమును దగ్గరగా అందరికీ అర్థము అగులాగున **"త్రైత సిద్ధాంత భగవద్గీత"** చేసినదని ఎంతోమంది అనుకొంటున్నా, కొందరికి మాత్రము త్రైత సిద్ధాంతము అను ఒక పేరుమాత్రము అర్థముకాలేదు. అక్కడే అందరూ మోసపోయి భగవద్గీతకు దూరముగాయున్నారు. మిగతా భగవద్గీతలు ఎన్నియున్నా త్రైత సిద్ధాంతములో చెప్పిన వివరము మరి ఏ సిద్ధాంతములో లేనందున అది ఇప్పటికీ చాలామందికి రహస్యముగానేయున్నది. చదివే ప్రజలకేగాక, గీతను వ్రాసిన స్వామీజీలకు కూడా అది రహస్యమైన గ్రంథమే అని చెప్పవచ్చును. అందుకే "ఎవరికీ" అను పదమును ఉపయోగించి అర్థము కాలేదని చెప్పాను. అది అర్థమయివుంటే నేడు భూమిమీదవున్న క్రైస్తవమునకుగానీ, ఇస్లామ్‌కుగానీ అందులో పుణాది ఉన్నదని తెలిసి పోయెడిది. అంటే బైబిలు గ్రంథముగానీ, ఖుర్ఆన్ గ్రంథముగానీ రెండు

గ్రంథములూ భగవద్గీతను ధృవీకరించుచున్నవని తెలిసెడిది. నేడు ప్రత్యక్షముగా అంతిమ దైవగ్రంథము ఖుర్‌ఆన్‌లో దేవుడు జిబ్రయేల్‌చే చెప్పించిన వాక్యములో ఖుర్‌ఆన్‌కంటే ముందు వచ్చిన దైవగ్రంథములను ఖుర్‌ఆన్ ధృవీకరించుచున్నదని చెప్పినా నేడు ఆ మాటను ఎవరూ గ్రహించడము లేదు. మరియొక చోట బైబిలు, ఖుర్‌ఆన్ రెండు గ్రంథములు ముందువచ్చిన గీతగ్రంథములో అసలయిన జ్ఞానమున్నదని ధృవీకరించు చున్ననూ క్రైస్తవులకూ, ముస్లీమ్‌లకూ అర్థముకాలేదు. భగవద్గీతలో యున్న జ్ఞానమే మిగతా రెండు గ్రంథములలోయున్నదను విషయము హిందువులకూ అర్థముకాలేదు.

వాస్తవము చెప్పాలంటే ప్రథమ దైవగ్రంథము, ద్వితీయ దైవగ్రంథము, అంతిమ దైవగ్రంథములని మనుషులకు మూడే మూడు గ్రంథములు ఇవ్వబడినవి. ఈ మూడిటియందు ఒకే దైవ జ్ఞానముండుట వలన వాటికి ముందు వెనుక దైవగ్రంథములను పేర్లు వచ్చినవి. మూడు దైవగ్రంథములలో ఆధ్యాత్మికమేయుండుట వలన గ్రంథములలోని ఆధ్యాత్మికము రహస్యముగా దాచిపెట్టబడియున్నదని చెప్పవచ్చును. అందువలననే మూడు సమాజముల వారికి మూడు గ్రంథముల వాస్తవికత అర్థము కాలేదనీ, వారికి అర్థమయినది అంటే అది మతములకు సంబంధించినదే అర్థమయినదనీ తెలియుచున్నది. వార్తాహరుడు అంటే వార్తను హరించినవాడు అని అర్థము ఉన్నట్లు, గంధమారుతము అంటే వాసనను లేకుండా చేసినది అన్నట్లు, గ్రంథము అనగా రహస్యముతో కూడుకొన్నది అని అర్థము గలదు. వార్తాహరుని నుంచి వార్త చెవి ద్వారానే తెలియనగును. అట్లే గంధమారుతము నుండి వాసనను ముక్కుల ద్వారానే తెలియదగును. అలాగే గ్రంథములోని ఆధ్యాత్మికము బుద్ధి ద్వారానే తెలియబడును. వార్తాహరుడు తనలో చంపబడిన వార్తను వాడు బయటికి

చెప్పితే దానిని చెవులద్వారా విని తెలియవచ్చును. అలాగే గ్రంథములోని విషయమును ఆత్మ తెలియజేసినప్పుడు మాత్రమే తమ బుద్ధి ద్వారా గ్రహించవచ్చును. ఆత్మ తెలియజేయాలనుకోకపోతే మనిషి గ్రంథమును ఎంత చదివినా అందులోని చిన్నముక్క కూడా అర్థము కాదు. అదే పరిస్థితే నేడు భూమిమీద నెలకొనియున్నది.

నేడు భూమిమీద మూడు గ్రంథములను మూడు సమాజముల వారు నాది ఈ గ్రంథము, నాది ఈ గ్రంథము అని పంచుకొని, నిర్ణయించుకొని మూడింటిని వారివారి గ్రంథములుగా చెప్పుకొంటున్నారు. ఎలా చెప్పుకొనినా ఆ గ్రంథములను వారు అందరూ చదువలేదు. చదివినా అవి అందరికీ అర్థము కాలేదు. గ్రంథము అను సూత్రము ప్రకారము అందులోని సమాచారము వారి బుర్రలకు, బుర్రలలోని బుద్ధికి అందలేదు. అలా బుద్ధి గ్రాహ్యమునకు రావాలంటే గ్రంథములో శక్తిరూపమైయున్న ఆత్మకు చదివేవాడు నచ్చియుండాలి. ఆత్మకు ఇష్టములేని వానికి గ్రంథము అర్థముకానట్లు ఆత్మ చేయుచున్నది. చదివిన తర్వాత వాని బుద్ధికి అది వాస్తవ భావములో కాకుండా వేరు భావములో అర్థమగుచున్నది. అందువలన నేడు గ్రంథములను వ్రాయువారు వేరు భావములో వాక్యమునకు అర్థమును వ్రాయడము జరుగుచున్నది. మేము చెప్పునది మూడు గ్రంథముల విషయములలో అలాగే కొనసాగుచున్నది. హిందువులకు భగవద్గీత అర్థము కాలేదు. క్రైస్తవులకు బైబిలు అర్థము కాలేదు. ముస్లీమ్‌లకు ఖుర్ఆన్ అర్థము కాలేదు. భగవద్గీత అర్థము కాలేదు అని మేము వ్రాసిన **"త్రైత సిద్ధాంత భగవద్గీత"** బయటికి వచ్చిన తర్వాత చాలామందికి తెలిసినది. అలాగే క్రైస్తవులకు బైబిలు అర్థము కాలేదు అనుటకు మేము వ్రాయబోవు **"సువార్త బైబిలు"** బయటికి వచ్చిన

తర్వాత తెలియగలదు. ఇకపోతే ముస్లీమ్‌లకు ఖుర్‌ఆన్ గ్రంథము అర్థమయినదా, అర్థము కాలేదా అను విషయము ఇప్పుడు మేము వ్రాసిన **"అంతిమ దైవగ్రంథములో జ్ఞాన వాక్యములు"** అను ఈ గ్రంథము ద్వారా తెలియగలదు.

ఖుర్‌ఆన్ గ్రంథములో 114 సూరాలు, 6236 ఆయత్‌లు గలవు. అందులో 112వ సూరా నా కిష్టమైనదిగా చెప్పుచూ అక్కడయున్న నాలుగు ఆయత్‌లకు వివరము చెప్పాము. 114 సూరాలలో 112వ సూరా ఒక్క దానినే పూర్తి చెప్పినట్లయినది. 6236 వాక్యములలో కేవలము 136 సమాచారములకు మాత్రమే వివరమును వ్రాయగలిగాము. మేము వ్రాసిన 136 సమాచారములు దాచిపెట్టబడిన జ్ఞానముగల వాక్యములేయని చెప్పవచ్చును. 136 వాక్యములలోనూ భావములను తప్పుగా అర్థము చేసుకొన్నారని కొంతవరకు అర్థము కాగలదు. ముఖ్యముగా ఈ గ్రంథమును గురించి మేము చెప్పబోవునది ఏమనగా! ఇంతవరకు ఖుర్‌ఆన్ అర్థము కాకపోయినా ఇప్పుడు ఈ గ్రంథముతో ఎవరికయినా ఖుర్‌ఆన్ గ్రంథము అర్థము కాగలదు. కొన్ని వాక్యములను చూచిన వారు ముస్లీమ్‌లు ఖుర్‌ఆన్‌లో ఇంత గొప్ప అర్థమున్నదా!యని కొందరూ, ఇంత గొప్ప వాక్యములున్నవా!యని మరి కొందరూ అంటున్నారు. ఖుర్‌ఆన్ గ్రంథమును ఇంతకు ముందే చదివి అర్థము చేసుకొన్నవారు ఈ గ్రంథమును చూచిన తర్వాత ఇంతవరకూ అర్థముకాని గ్రంథము ఇప్పుడు అర్థమయినదని కొందరు అంటున్నారు. తర్వాత మాకు అర్థమయినది వేరుగాయుండేది, దానికంటే ఇప్పుడే గొప్పగా అర్థమయినదని చెప్పుచున్నారు. ఇంతకుముందు ఎన్నడూ ఖుర్‌ఆన్ చదువనివారు, అరబ్బీ భాషలో చదివి అర్థముకానివారు తెలుగు భాషలో మేము వ్రాసిన ఖుర్‌ఆన్‌ను చదివిన తర్వాత ఖుర్‌ఆన్

గ్రంథములో ఇంత గొప్ప వాక్యములున్నవా! అంటున్నారు. ఈ గ్రంథమును చదివిన ప్రతి ఒక్కరినీ ఈ గ్రంథము ఉత్తేజపరచి దైవ జ్ఞానమును వారికి అందివ్వగలదు. అంతేకాక మిగతా మతములవారికి కూడా ఖుర్ఆన్ మీద కొంత అవగాహన ఏర్పడగలదు.

నేడు మూడు మతములలోనూ పరమత ద్వేషము అనునది చాలా ఎక్కువగాయున్నదని చెప్పవచ్చును. దానికి కారణము తన మతములో ఏముందో తెలియదు, తర్వాత పర మతములలో ఏమున్నదో తెలియదు. తన పర మతముల గ్రంథములలో ఏమి వ్రాసియున్నారో ఎవరూ చూడడము లేదు. తన మత గ్రంథముగా చెప్పుచున్న గ్రంథములో ఏమున్నదని చూచి, తర్వాత ఇతర మత గ్రంథములో ఏమున్నదని చూచి, ఒకవేళ తన మతమునకు వ్యతిరేఖముగా ఏమయినా ఉంటే, ఇతర మత గ్రంథమును నీవు విమర్శించినా అప్పుడు సత్యము మాట్లాడినట్లగును. అట్లుకాకుండా గ్రుడ్డిగా మాట్లాడితే తప్పగును. దానిని పరమత ద్వేషము అంటారు. దానివలన పాపము తప్ప ఏమీరాదు. నేడు ప్రతి మతము వారికీ వారి మత గ్రంథములో ఏమున్నదో తెలియకుండా పోయినది. ఇతర మత గ్రంథములను అసూయతో చూడడము తప్ప వాటిలో ఏమున్నదని చూచే వారు లేరు. మత సహనము అనునది పేరుకుయున్నా అందరిలో ద్వేషము తప్ప సహనము లేదు. ప్రస్తుత కాలములో భగవద్గీతను జాతీయ గ్రంథముగా ప్రకటించాలను వాదము తెరపైకి వచ్చినది. అన్ని టీ.వీ ఛానల్లకు దానిని గురించి ప్రసారము చేయడము ముఖ్యమైన పనిగా అయిపోయినది. మేము పది రోజులనుండి ఏదో ఒక ఛానల్‌లో ఆ చర్చలను చూస్తూనేయున్నాము. ఎవరితో ఈ విషయమును చర్చించాలను నది ఏమాత్రము లేకుండా వారికి ఇష్టమొచ్చిన వారితో చర్చలు జరుపడము మాకు విచిత్రముగా కనిపించుచున్నది.

హిందూమతములోని సిద్ధాంతకర్తలుగానీ, వారి ప్రతినిధులనుగానీ పిలిచి వారితో చర్చించి ఏది ఆమోదయోగ్యమో నిర్ణయించాలి. అటువంటి దానిని ఎవరికి ఇష్టమొచ్చిన వారితో వారు చర్చలు జరుపడము సమస్యను సాగదీసినట్లేగానీ, సమస్యను పరిష్కరించినట్లుకాదు. హిందూమతములో అద్వైత సిద్ధాంతము, విశిష్టాద్వైత సిద్ధాంతము, ద్వైత సిద్ధాంతములు గలవు. ఆ సిద్ధాంతములను ప్రతిపాదించిన వారిని హిందూమతములోని గురువులని చెప్పవచ్చును. అద్వైత సిద్ధాంతకర్త శంకరాచార్యులు చనిపోయాడు. విశిష్టాద్వైత సిద్ధాంతకర్త రామానుజాచార్యులు కూడా చనిపోయాడు. ద్వైత సిద్ధాంతకర్త మధ్వాచార్యులు కూడా చనిపోయాడు. ప్రస్తుత కాలములో గత 36 సంవత్సరములనుండి **"త్రైత సిద్ధాంతము"** బయటికి వచ్చినది. త్రైత సిద్ధాంతమును అనుసరించి **"త్రైత సిద్ధాంత భగవద్గీత"** వ్రాయబడి నది. దానిని చదివినవారు ఎంతోమంది హిందువులు ఆ భగవద్గీతను వ్రాసిన మమ్ములను ప్రశంసించుచున్నారు. కొందరికయితే త్రైత సిద్ధాంతము హిందూ మతమునకు సంబంధించిన సిద్ధాంతమని కూడా తెలియదు. ఒక్క హిందూ మతములో తప్ప సిద్ధాంతములు ఇతర మతములలో ఉండవను విషయము కూడా తెలియనివారు హిందువులలో కలరు. హిందూ మతములో త్రైత సిద్ధాంతకర్తగా నేను బ్రతికేయున్నాను. త్రైత సిద్ధాంతమును ఉపయోగించి ఇప్పటికి 56 గ్రంథములు వ్రాశాము. ఇంకా వ్రాయబోయేటివి గలవు. 56 గ్రంథములు స్వచ్ఛమయిన ఆధ్యాత్మికతను అందించాయని చదివిన ప్రజలందరూ అంటున్నారు. అయినా ప్రస్తుతము భగవద్గీతను జాతీయ గ్రంథముగా ప్రకటించాలని వచ్చిన వివాదమును గురించి ఎవరూ మీ ఉద్దేశ్యమేమి అని మమ్ములను అడుగలేదు.

ఎవరూ ఈ వివాదమును గురించి మమ్ములను అడుగకున్నా దానిని గురించి మేము ఏమంటున్నామంటే, భగవద్గీత 5150 సంవత్సరముల

క్రిందట పుట్టినా తర్వాత దానికి అనుసంధాన గ్రంథములు రెండు వచ్చినవి. భగవద్గీతలో చెప్పబడిన జ్ఞానమే మిగతా రెండు గ్రంథములలో యున్నప్పుడు మిగతా రెండు గ్రంథములతో కలిపి భగవద్గీతయగును గానీ, భగవద్గీత కృష్ణుడు చెప్పినది మాత్రమేకాదు. ఉదాహరణకు ఒక ఆవు పుట్టిందను కొందాము. ఆవు అందరికీ ఆమోదయోగ్యమైన సాధుజంతువే. ఆవు పుట్టిన రెండు సంవత్సరములకు దాని తలమీద రెండు కొమ్ములు వచ్చాయి. ఆవు పుట్టిన రెండు సంవత్సములకు వచ్చిన కొమ్ములను ఆవుకు సంబంధించినవి కావు, అవి గేదె జాతివి అని అంటామా? అనము కదా! అట్లే ఆవు పుట్టిన తర్వాత ఐదు సంవత్సరములకు పాలపొదుగు, దానికి నాలుగు చనుమొనలు వచ్చాయి అనుకొందాము. అప్పుడు వాటిని ఆవుకు సంబంధములేనివని అంటామా? ఆవు పుట్టిన రెండు సంవత్సరములకు గానీ, ఐదు సంవత్సరములకుగానీ ఆవును అనుసరించి పుట్టిన కొమ్ములను, పాలపొదుగును దానివి కావు అనము కదా! ఆవుకు అంటుకొని పుట్టిన దానివలన కొమ్ములను, పొదుగును ఆవుకు సంబంధించినవని, ఆవులోని భాగముగా లెక్కించుకొని, మొత్తము వాటితో కలిపి ఆవు అంటున్నాము. అటువంటప్పుడు భగవద్గీత ఒక ఆవు అనుకొనుము. భగవద్గీత పుట్టిన తర్వాత ఆవుకు కొమ్ములు వచ్చినట్లు బైబిలు పుట్టినది. బైబిలులో భగవద్గీతను అనుసరించిన జ్ఞానముంటూ అది భగవద్గీతను ధృవీకరించు చున్నది. అప్పుడు అది ఆవులో కొమ్ములు ఒక భాగమైనట్లు భగవద్గీతలో బైబిలు ఒక భాగముగానే పరిగణించాలిగానీ, దానిని వేరు గ్రంథముగా చెప్పుటకు వీలులేదు. ఎలా ఆవు కొమ్ములు ఆవువి కావు అని అనలేమో అట్లే బైబిలు భగవద్గీతకు సంబంధించినది కాదు అని అనలేము. అలాగే భగవద్గీత పుట్టిన తర్వాత బైబిలు పుట్టినది. బైబిలు పుట్టిన తర్వాత ఖుర్ఆన్ గ్రంథము పుట్టినది. ఆవుకు ముందు కొమ్ములు పుట్టాయి. తర్వాత

కొంత కాలమునకు పాలపొదుగు పుట్టినది కదా! అట్లే భగవద్గీత పుట్టిన తర్వాత బైబిలు, బైబిలు తర్వాత ఖుర్ఆన్ పుట్టడము జరిగినది. చివరిలో పుట్టిన పాలపొదుగు ఆవుకు అంటుకొని (తగులుకొని) పుట్టినట్లే, చివరిలో పుట్టిన ఖుర్ఆన్ కూడా భగవద్గీత జ్ఞానమునకు అనుసంధాన జ్ఞానముగా పుట్టినది. అంతేకాక భగవద్గీతను ఖుర్ఆన్ గ్రంథము కూడా ధృవీకరించు చున్నది. భగవద్గీతలోని జ్ఞానమును నిజమైన జ్ఞానమని అదియే నాలోయున్నదని ధృవీకరించి చెప్పుచున్నది. అటువంటప్పుడు చివరిలో పుట్టిన ఖుర్ఆన్ గ్రంథమును భగవద్గీతలోని భాగము కాదనుటకు వీలవుతుందా? బైబిలు, ఖుర్ఆన్ గ్రంథములు రెండూ కలిసినప్పుడు భగవద్గీత సంపూర్ణ గ్రంథమగును. ఆవుకు కొమ్ములు, పాలపొదుగును కలిపి సంపూర్ణ ఆవు అంటున్నాము. అంతకు ముందు అవి రెండూ లేనప్పుడు పుట్టినది ఆవు అయినా దాన్ని ఆవుదూడ అంటున్నాము. ఎప్పుడయితే కొమ్ములు, పాలపొదుగు వచ్చిందో అప్పుడు సంపూర్ణ ఆవుగా అది లెక్కించబడుచున్నది. అప్పుడు ఆవుదూడ యను పేరుండదు. అలాగే **భగవద్గీత సంపూర్ణ భగవద్గీత కావాలంటే భగవద్గీతకు అనుసంధానముగా యున్న బైబిలును, ఖుర్ఆన్‌ను కలిపి చెప్పవలసిందే.**

ఆవుకున్న కొమ్ములు నావియని, ఆవు నాదికాదు అంటే అది ఎంత తెలివి తక్కువగాయుండునో అంతే తెలివి తక్కువగా బైబిలునాది భగవద్గీత నాకు సంబంధములేదు అనువాడు కనుపించును. అట్లే పాలపొదుగు నాది ఆవు నాది కాదు అంటే ఎంత బుద్ధి తక్కువమాటయగునో అంతే బుద్ధి తక్కువగా ఖుర్ఆన్ నాది భగవద్గీతతో మాకేమి పని? అనువారు కనిపించగలరు. అయితే నేడు అదే జరుగుచున్నది. ఒకే ఆవును పట్టుకొని ముగ్గురు వ్యక్తులు ఆవు నాదియని ఒకడంటే, కొమ్ములు నావియని మరొకడు, పాలపొదుగు మాత్రము నాదియని ఇంకొకడు అంటున్నారు.

ఆవునాదియను మొదటివాడు తర్వాత పుట్టిన కొమ్ములు, పొదుగుతో నాకేమి సంబంధము? అవిరెండూ నావికావు, ఆవు మాత్రమే నాది అంటున్నాడు. మిగతా ఇద్దరు అలాగే కొమ్ములనొకడు, పాలపొదుగును ఒకడు నావి అంటున్నారు. అలా కొమ్ములు నావి అనువాడు కొమ్ములవైపే చూస్తున్నాడు, పాలపొదుగు నాది అనువాడు దానివైపే చూస్తున్నాడు. అవి రెండూ ఆవుకే యున్నా వారు ఆవును ఏమాత్రము గమనించడములేదు. అట్లున్నా ఒక రకముగా ఫరవాలేదుగానీ, నా కొమ్ములను నేను కోసుకొని పోతానని ఒకడు, నా పాల పొదుగును తీసుకొని పోతానని ఇంకొకడు పోట్లాడుకొన్నప్పుడంతా అనుకొంటున్నారు. వారి వాదనను తీర్చుటకు ఒక పెద్దమనిషి వచ్చి కొమ్ములు, పొదుగు రెండూ ఆవుకేయున్నాయి అవి వేరు వేరుకాదు అంటే ముగ్గురూ కలిసి బుద్ధి చెప్పిన వానిమీదికే దాడికి దిగారు. అయినా పెద్ద మనిషి అయినవాడు ఓపికతో ఎంతగా చెప్పినా వినకుండా చెప్పేవానినే మతిభ్రమించిన తెలివితక్కువ వానిగా లెక్కించారు. నేటి కాలములో భగవద్గీత యంటే ఏమిటి? దానికి అనుసంధానమైనవి ఏవి? అని తెలియకుండానే భగవద్గీతను జాతీయ గ్రంథముగా చేయవలెనని కొందరంటున్నారు. భగవద్గీత, బైబిలును, ఖుర్ఆన్‌ను కలిపి జాతీయ గ్రంథములని అనవచ్చును. దానిని దేవుడయినా ఒప్పుకొంటాడు. అట్లుకాకుండా ఒక్కదానినే చేస్తే కొమ్ములను, పాల పొదుగును లేని ఆవుదూడను ఆవు అన్నట్లుంటుంది. లేకపోతే ఆవుకున్న పొదుగును, కొమ్ములను తీసివేసి కొమ్ములులేని బోడి ఆవును, పొదుగులేని గొడ్డు ఆవును నిజమైన ఆవు అని చూపినట్లుంటుంది. అందువలన ఈ విషయమును గురించి లోతుగా ఆలోచించమని మేము సలహా ఇస్తున్నాము. ఇంకా మేము ఏమి చెప్పుచున్నామంటే!

కొంత కలబంద నారను తీసుకొని ఆ నారను మూడు పురులుగా త్రిప్పిపెట్టి, ఆ మూడు పురులను ఒక త్రాడుగా పేడవచ్చును. ఇంకా

బాగా అర్థము కావాలంటే, ఒక తలకున్న వెంట్రుకలను మూడు భాగములుగా చేసి, మూడు భాగములను ఒకదానిమీద ఒకటి ఎక్కించుచూ వస్తే అది జడగా తయారగును. ప్రతి దినము అందరూ అదే విధముగా తలకున్న వెంట్రుకలను జడగా చేసుకొంటున్నారు. అలాగే మూడు నార కట్టలను ఒక తాడుగా చేయవచ్చును. మూడు పురుల తాడులోయున్నదంతా కలబంద నారేగానీ వేరు ఏమీ లేదు. అందులో ఒక పురిగాయున్నది మాత్రము తాడు అంటాము, మిగతా రెండు పురులను తాడు అని అనము అనే దానికి వీలు అవుతుందా! కాదనియే చెప్పవచ్చును. ఒకే తలకున్న మూడు కట్టలలో ఒక కట్టలోనివి మాత్రమే వెంట్రుకలు అంటే, మిగతా రెండు కట్టలలోనివి వెంట్రుకలు కాదు అంటే సరిపోతుందా? ఎలా సరిపోతుంది. దానిని ఎవరూ ఒప్పుకోరు. మూడు భాగములుగా విభజింపబడి, మూడు కట్టలుగాయున్నంతమాత్రమున వాటిని వేరువేరుగా చెప్పుకోవడమే బుద్ధి తక్కువ పనియగును. తలలోని అన్నిటినీ వెంట్రుకలే అని చెప్పవలసిందే. ఒకే తలలోని వెంట్రుకలను మూడు భాగములుగా జడకొరకు విభజించితే వాటిలో ఇవి మాత్రము వెంట్రుకలు, ఇవి వెంట్రుకలు కాదు అనడము మూర్ఖత్వమేయగును. అలాగే మూడు పురులుగాయున్నది ఒకే తాడు, మూడు కట్టలుగాయున్నది ఒకే జడ. మూడు గ్రంథములుగాయున్నది ఒకే భగవద్గీత వీటిని ఎవరూ విభజించలేరు. విభజించిన అందరికీ అధిపతియైన దేవుడు ఒప్పుకోడు. ఒకవేళ ఒప్పుకొంటే రేపు దేవున్ని కూడా తల నాదియని ఒకడు, కాళ్ళు నావని ఒకడు, కాళ్ళు తలమాత్రము కాకుండా మధ్యలోనిది మాత్రము నాది అనువారు కూడా తయారయి దేవున్ని కూడా మూడు ముక్కలు చేయగలరు. అందువలన మూడు గ్రంథములను వేరువేరుగా చెప్పితే దేవుడు కూడా ఒప్పుకోడు. ఒకవేళ ఈ దినము ఆయన కళ్ళు మూసుకొని కూర్చుంటే రేపు ఆయనను కూడా

పంచుకోగలరు. అందువలన దేవుడు అన్నీ తెలిసిన మేధావి. కనుక ఆయనకు ముప్పు ఏర్పడు దానిని ఓర్చుకోడు, ఒప్పుకోడు.

ఎప్పుడు మనిషిలో అజ్ఞానముంటుందో అప్పుడు మనిషి విచక్షణ లేకుండా పనులు చేయాలనుకుంటాడు. అందువలన మేము మనిషిలోని అజ్ఞానమును తీసివేసి అందరికీ దేవుడు ఒక్కడేయని తెలుపు నిమిత్తము, అలాగే అందరూ వేరువేరుగా చెప్పుచున్న గ్రంథములు మూడూ ఒకటేయని తెలుపు నిమిత్తము ఈ గ్రంథమును వ్రాశాము తప్ప ఏదో మత ప్రచారమునకని చెప్పవద్దండి. మమ్ములను కూడా కలుషితము చేయవద్దండి. మా బోధలు గ్రహించండి. అప్పుడు మేము ఎవరిమో మీకే అర్థముకాగలదు. నన్ను ఫలానా మతస్థుడని చెప్పుటకు వీలుపడదు. నేను మతమును ప్రచారము చేయుచున్నాడనుటకు కూడా వీలుపడదు. జ్ఞానచూపుతోనే మీరు నన్ను చూడండి. అజ్ఞాన చూపుతో చూడవద్దండి. ఇప్పుడు మీరు చదువబోయే మా వ్రాతను విచక్షణతో చదవండి. ద్వేషబుద్ధితో మాత్రము చదువవద్దు. ద్వేషముతో చదివితే అప్పుడు నా వ్రాత కూడా తెలియబడదు.

ఇట్లు

**ప్రబోధానంద యోగీశ్వర్**

# ఉత్తరములు

మేము దైవసేవగా భావించి వ్రాసిన గ్రంథములను చదివిన ఎందరో ముస్లీమ్‌లు నాకు ఉత్తరములు వ్రాయడము జరుగుచున్నది. అందులో మాకు జాబు వ్రాసిన ముస్లీమ్‌లందరూ మమ్ములనూ, మా జ్ఞానమునూ ప్రశంసిస్తూ వ్రాశారుగానీ, ఇంతవరకు మమ్ములను, మా జ్ఞానమును ఎవరూ విమర్శించలేదు. మమ్ములను మా జ్ఞానమును అర్థముకాని హిందువులే

విమర్శించారు తప్ప ఇతర మతములవారు ఎవరూ విమర్శించలేదు. తక్కువగా గానీ, అగౌరవముగా గానీ మాట్లాడలేదు. మేము గతములో వ్రాసిన కొన్ని గ్రంథములను చదివిన ముస్లీమ్‌లు వ్రాసిన జాబులు నిన్న ఒకటి, ఈ దినము ఒకటి నాకు చేరినవి. అందులో వారు వ్రాసిన వ్రాతను మీ ముందు ఈ గ్రంథములో ఉంచుతున్నాము. అలా ఉంచడములో మా ఉద్దేశ్యము మీరు కూడా వారివలె దేవుని జ్ఞానమును అర్థము చేసుకోగలరను నమ్మకముతో అలా చేయుచున్నాము. ముస్లీమ్‌లే నమ్ముచున్నప్పుడు మేమెందుకు నమ్మలేదను ప్రశ్న హిందువులకు రావాలని, ఈ జాబులను వ్రాసిన ముస్లీమ్‌లను చూచి, మిగతా మతములవారు కూడా మత రహిత జ్ఞానమును అర్థము చేసుకోగలరను ఉద్దేశ్యముతో నిన్న, ఈ రోజు వచ్చిన ఉత్తరములను ఇక్కడ ప్రచురించుచున్నాము. వారి ఉత్తరములను మేమెందుకు చూడాలని కొందరు ప్రశ్నించవచ్చును. దానికి జవాబుగా మేము ఇలా చెప్పుచున్నాము.

ఎవరు వ్రాసినా, ఏ మతస్థుడు వ్రాసినా దానిని ఉత్తరము అంటాము. ఉత్తరము అయిన దేనినయినా చదువవలెనని పూర్వము పెద్దలు చెప్పెడివారు. వారి మాటప్రకారము దేనిని చదువకున్నా ఉత్తరమును మాత్రము కొందరు చదివెడివారు. ఉత్తరము అనగా! సారాంశమైనదని అర్థము. అందువలన ఉత్తరములలో కొన్ని ముఖ్యమైన వాక్యములే ఉండును. తక్కువ వ్రాత, ఎక్కువ సమాచారము అన్నట్లుండును. ఏ ఉత్తరములో అయినా సారాంశమైన విషయమే ఉండును. ఉత్తరము అనగా నాలుగు దిక్కులలో చివరిదిక్కు. సూర్యోదయమున మనిషికి ఎదురుగా యున్నది తూర్పు కాగా, వెనుకయున్నది పడమరకాగా, కుడిప్రక్క యున్నది దక్షిణము, ఎడమ ప్రక్కయున్నది ఉత్తరము అగును. దిశలలో కూడా

ఉత్తరమునకు ఒక ప్రత్యేకత కలదు. ఏ ఊరిలోనయినా ఊరికి ఉత్తరము దిక్కులోనే స్మశానమును ఏర్పాటు చేయుదురు. ఊరికి ఉత్తరముననే స్మశానముండును. స్మశానమును చూచిన వారికి వైరాగ్యము కలుగును. ఎంతో జ్ఞానులయినవారికి కూడా కలుగని వైరాగ్యము, ఊరికి ఉత్తరమున కల్గునని పెద్దలు చెప్పగా విన్నాము. దీనినిబట్టి ఉత్తరము అనగా సారాంశమైనదని దానివలన జ్ఞానము కూడా కల్గునని మనము వ్రాసుకొను సమాచారమునకు ఉత్తరము అను ఒక దిక్కుకుయున్న పేరునే ఉంచారు. దిశలలో ఉత్తరదిశ పేరును పొందిన మాకు చేరిన ఉత్తరములలో ఒక దానిని ముందు చూస్తాము. ఈ రోజు 17.12.2014 వచ్చిన ఉత్తరము ఇలా కలదు.

**వహీద్, కలకత్తా,**

**తేది : 17-12-2014.**

**అయ్యా!** మిమ్ములను ఎలా సంబోధించాలో, ఎలా పిలువాలో నాకు తెలియదు. అందువలన అయ్యా! అన్నాను. మీరు వ్రాసిన ఎనిమిది గ్రంథములను నేను చదివాను. వాస్తవానికి నేను ఒక ముస్లీమ్‌ను. నా పేరు వహీద్. నాకు చిన్నతనములోనే తల్లితండ్రులు చనిపోయారు. అప్పటినుండి ఎన్నో కష్టములు పడి జీవితములో పైకివచ్చినవాడిని. కష్టాలు వచ్చాయి కావున దేవున్ని తలచుకొనేవాడిని. అప్పటినుండి దేవుడు దేవుని జ్ఞానము నాకు ఎంతగానో ఆసక్తిని కల్గించాయి. నేను ఖుర్‌ఆన్ గ్రంథమును చదివాను, బైబిలు చదివాను, భగవద్గీతను చదివాను. చిన్న తనములోనే తల్లితండ్రులులేని నేను కొన్నాళ్ళు హిందువుల ఇంట్లో పెరిగాను. అప్పుడు భగవద్గీతను నాకు పదునెనిమిది వయస్సున్నప్పుడే చదివాను. తర్వాత హిందూ కుటుంబము క్రైస్తవులుగా మారిపోయారు. వారు క్రైస్తవులుగా

మారి బైబిలు చదవడము వలన నాకు ఇరవై సంవత్సరముల వయస్సులో బైబిలును చదివాను. తర్వాత ఆ కుటుంబమునుండి దూరముగా కలకత్తాకు వచ్చి ఉద్యోగము చేసుకొంటూ బ్రతుకుచున్నాను. పుట్టుకతో నేను ముస్లీమ్ అయినందున ఖుర్‌ఆన్‌ను తప్పక చదవాలను ఉద్దేశ్యముతో చదివాను. నేను ఖుర్‌ఆన్‌ను తెలుగులోయున్న దానినే చదివాను. అయితే అందులో నుంచి ఒక్కముక్క కూడా అర్థము కాలేదు. భగవద్గీత కొంత అర్థమయినది, బైబిలు కూడా అర్థమయినదిగానీ, అది భగవద్గీతకు విభిన్నముగా అర్థమయినది. భగవద్గీత జ్ఞానమువేరు, బైబిలు జ్ఞానము వేరనీ, రెండూ రెండు మతముల జ్ఞానమనీ అందరికీ అర్థమయినట్లే నాకూ అర్థమయినది. చెప్పాలంటే బైబిలు మీద, భగవద్గీత మీద నాకు సదభిప్రాయము లేదు. వారు చెప్పే దేవుడు వేరు అల్లావేరు అనుకొనేవాడిని. ఖుర్‌ఆన్ అర్థము కాకపోయినా ముస్లీమ్ పెద్దలు చెప్పు జ్ఞానము నాలో పూర్తి వంటబట్టినది. అందువలన అన్ని మతములకంటే ఇస్లామ్‌యే గొప్పదనీ, అల్లానే గొప్పవాడనీ అనుకొనేవాడిని. అట్లు నేను ఒక ముస్లీమ్ మతమువాడిగా యుండి పోయాను.

అయితే ఈ మధ్య మీ గ్రంథములు చదివిన తర్వాత నాకు పూర్తిగా కనువిప్పు అయినది. నేను ఒక మతస్థుడిని అను భావము పోయి నేను ఒక మనిషిని అను భావము వచ్చినది. నేను ఎంతో తెలిసినవాడిని అను భావముపోయి, ఏమీ తెలియనివాడిని అను భావము వచ్చినది. ఎంతో తెలియవలసినది ఉన్నదని, ఇంతవరకూ నాకు ఏమీ తెలియదని అర్థమయినది. మీరు వ్రాసిన ఎనిమిది గ్రంథములే నా దిశ దశలను రెండింటినీ మార్చివేశాయి. నాలో ఉన్న చీకటిపోయి దీపము వెలిగినట్లయి నది. నా జీవితములో ఊహించలేని జ్ఞానమలుపు తిరిగినది. నేను చిన్న

చిన్న గ్రంథములను ఎన్నో చదివాను. ఎంతోమంది చెప్పగా విన్నాను. అయితే నేను చదివినవి, విన్నవి రెండూ అసత్యములని అర్థమయిపోయినది. మీరు తెలిపిన జ్ఞానము ఒక ఖడ్గములాంటిది. ఏ సంశయమునయినా త్రెంచివేయగల శక్తి దానికున్నది. మీరు వ్రాసిన **"స్వర్గము-నరకము"**, **"జీహాద్ అంటే యుద్ధమా?"**, **"మూడు గ్రంథములు-ఇద్దరు గురువులు-ఒక బోధకుడు"**, **"త్రైత సిద్ధాంతము"**, **"సమాధి"**, **"పునర్జన్మ రహస్యము"**, **"మరణ రహస్యము"** మొదలగు పుస్తకములను చదివిన తర్వాత నాలోయున్న సంశయములన్నీ పూర్తిగా లేకుండాపోయాయి. అన్నిటికంటే ముఖ్యముగా నాకు ఇంతవరకూ అర్థముకాని ఖుర్ఆన్ గ్రంథములోని వాక్యములు సులభముగా అర్థమయినాయి. మీరు చెప్పిన జ్ఞానమంతా తెలిసిన తర్వాత బైబిలు, ఖుర్ఆన్, భగవద్గీత మూడూ ఒకే సారాంశమున్న గ్రంథములని తెలిసిపోయినది. వాటిలోయున్నది ఒకే జ్ఞానమని తెలిసిపోయినది. మీరు చెప్పిన జ్ఞానము మూడు మతములకు సంబంధించినదిగాయుంటూ, దేనిమీదా అసూయలేకుండా ఉండు విధానము తెలిసిపోయినది. మీరు మూడు గ్రంథములలోని జ్ఞానమును సమన్వయము చేసి చెప్పిన విధానమును చూచిన తర్వాత నేను ఫలానా మతమువాడినని ఎవరూ చెప్పలేరు. మీరు చెప్పిన ప్రతి విషయమూ, ప్రతి జ్ఞానమూ ఎంతో సత్యమైనది.

16.12.2014 మంగళవారము ఈ దినము పాకిస్థాన్‌లో పెషావర్ పట్టణమందు ఒక స్కూలుపై ఉగ్రవాదులు దాడిచేసి విచక్షణారహితముగా కాల్పులు జరిపి 132 మంది పిల్లలను 9 మంది పెద్దలను చంపివేశారు. ఆ వార్తను ఇప్పుడే టీ.వీలో చూచాను. అప్పుడు మీరు వ్రాసిన **"స్వర్గము, నరకము"** గ్రంథము జ్ఞాపకము వచ్చినది. ఉగ్రవాదులను గురించి మీరు వ్రాసినది నూటికి నూరుపాళ్ళూ సత్యమని తెలిసినది. ఖుర్ఆన్ జ్ఞానము

అర్థముకాక పోయినందున ఇస్లామ్ సమాజములో ఉగ్రవాదులు తయారయినారనీ, కేవలము స్వర్గము కొరకు ఉగ్రవాదులుగా మారినారనీ చెప్పిన విషయము పూర్తి నిజమని పాకిస్థాన్‌లో స్కూలుమీద ఉగ్రవాదులు జరిపిన దాడి నిరూపించుచున్నది. దైవగ్రంథముగా భావించు ఖుర్‌ఆన్ గ్రంథములోని జ్ఞానమే అర్థముకాకపోయినందున మనుషులు ఉగ్రవాదులుగా మారుటకు కారణమయినదని చెప్పినమాట నూరుపాళ్ళు సత్యమని తెలిసినది. స్వర్గమును గురించి దేవుడు చెప్పిన దానిని వేరు విధముగా మనుషులు చెప్పుకోవడము వలన, కొందరు స్వార్థపరులు స్వర్గమును ఎరగా చూపి, స్వర్గములో సుఖములను అనుభవించాలంటే దేవుని కొరకు చనిపోవాలని చెప్పి, దేవుని జ్ఞానములో స్వర్గమునే గొప్పగా చెప్పి, దానిని అనుభవించుటకు దేవుని పని చేయాలనీ, దేవుని పనిచేస్తూ చనిపోతే నేరుగా స్వర్గమునకు పోవచ్చుననీ, తప్పు సమాచారమును కొంతమంది ముస్లీమ్ యువకులకు చెప్పి వారిచేత ఇదే దేవునిపనియని ఉగ్రవాదమును చేయిస్తూ, ఉగ్రవాదులు గా చనిపోవడమే నిజముగా దేవునికొరకు చనిపోవడమని చెప్పి ఉగ్రవాద చర్యలకు ప్రేరేపిస్తున్నారని మీరు చెప్పినది నేడు అక్షరాలా నిజమైనది. స్వర్గములో అందమైన స్త్రీల పొందుకోరిన యువకులు వారు దేవుని మార్గములో చనిపోయి స్వర్గమునకు పోవాలని నిర్ణయించుకొని, ఆ ఆశ కొరకు వారు చనిపోవుటకు ఏమీ తెలియని చిన్నారులను, పసిపిల్లలను చంపుటకు వెనుకాడలేదు. భూమిమీద సుఖములు కరువైనవారు, బ్రతుకులు బరువైనవారు సులభముగా వచ్చు స్వర్గ సుఖములకొరకు ఆశపడి వారు చనిపోవుటకు ఇతరులను చంపుతున్నారని మీరు చెప్పినది ప్రపంచమునకు తెలియని సత్యము.

ఉగ్రవాదులయినవారు దేవుని మార్గములో, దేవుని పనిచేయు వారమని ఇతరుల చేత నమ్మినవారై, వారు స్వర్గమునకు పోవుటకు తాము

దేవునికొరకు చనిపోవాలని తెలిసీ, ఇతరులను చంపుటకు తప్పు నిర్ణయమును తీసుకొని చనిపోవుటకే తెలిసి, తెగించి మారణహోమమునకు దిగుచున్నారని, వారి మనస్సులో అంతకంటే వేరు లేదన్నది నేడు పాకిస్థాన్‌లో జరిగిన దానినిబట్టి తెలిసిపోయినది. మీరు చెప్పినట్లు వారు చనిపోవుటకే నిర్ణయించుకొని వచ్చారు. అందువలన కొందరు తమలో తామే పేల్చుకొని చనిపోయారు. కొందరు సైనికుల దాడిలో చనిపోయారు. మీరు చెప్పినట్లు వారు తప్పించుకొని పోవాలను ప్రణాళికతో అక్కడికి రాలేదు. చనిపోవాలను నిర్ణయముతోనే వచ్చారు. చనిపోతే శాశ్వతముగా స్వర్గములో అందమైన ఆడవారితో ఉండవచ్చునను తప్పుడు జ్ఞానముతోనే వారు అలా చేశారు. మీరు వ్రాసిన **"స్వర్గము, నరకము"** గ్రంథము చదివిన తర్వాత నేను ముస్లీమ్‌గా పుట్టి ఖుర్‌ఆన్ జ్ఞానమును అర్థము చేసుకోలేనందుకు ఎంతో సిగ్గుపడుచున్నాను. మీ గ్రంథము చదువకముందు కాఫీర్‌లుగాయున్న హిందువులను చంపి నేను కూడా స్వర్గమునకు పోవాలనుకొన్నవాడినే. మాలోయున్న భావము తప్పు భావము అని మీ గ్రంథముతో తెలిసిపోయినది. ఆ విషయము మిగతావారికి తెలియక పోవడము వలన ఉగ్రవాదము అనేది ఉంది. అది ఘోరమైన మారణ హోమము చేయుచున్నది. ఉగ్రవాదము పోవాలంటే ప్రతి ఒక్కరూ **"స్వర్గము-నరకము"** గ్రంథము చదవాలని నేను అనుకొంటున్నాను. "స్వర్గము నరకము"ను చదివినవారు ఎవరుగానీ ఉగ్రవాదిగా మారరు. నిజమైన దేవుని జ్ఞానము వానికి తెలుస్తుంది.

మీరు వ్రాసిన **"మూడు గ్రంథములు-ఇద్దరు గురువులు-ఒక బోధకుడు"** గ్రంథమును చదివిన తర్వాత మిమ్ములను గురువుగా పిలువాలని అనిపించినా, ఆ మాటను మీరు ఒప్పుకోరని ఒకవైపు అనుకొంటున్నాను.

మిమ్మలను మేము బయటికి చెప్పలేనంత గొప్ప భావముతో మా మదిలో ఒప్పుకొన్నాము. మీరు బయటికి మనిషే మా లెక్కలో ఇంకా గొప్పయే. మీరు రేపు నెలలో ఖుర్ఆన్ గ్రంథమును విడుదల చేయనున్నారని ఇతరుల ద్వారా తెలుసుకున్నాను. మీ గ్రంథ పరిచయముతో మీరు చెప్పు జ్ఞానము ఏ స్థాయిలో ఉంటుందో అర్థము చేసుకోగలము. మీరు ఖుర్ఆన్ గ్రంథము లోని వాక్యములను వ్రాయుచున్నారంటే అది మా అదృష్టముగా భావించు కొంటున్నాము. మాకు ఖుర్ఆన్ ఇంతవరకూ అర్థముకాలేదు. మీ రచనతో సంపూర్ణముగా అర్థము కాగలదని అనుకొంటున్నాము. మీ రచనలన్నీ మతములకు అతీతముగా కేవలము దేవుని జ్ఞానమును మాత్రమే చెప్పాయి. మీరు వ్రాసిన **"త్రైత సిద్ధాంత భగవద్గీత"** ఈ మధ్యనే నాకు దొరికింది. దానిలో కేవలము రెండు అధ్యాయములు మాత్రమే చదివాను. చాలా అద్భుతముగాయున్నది. తొందరలోనే పూర్తిగా చదువగలను. ఇప్పుడు ఖుర్ఆన్ గ్రంథమును వ్రాయుచున్నట్లు మా మిత్రుల ద్వారా తెలిసినది. తర్వాత మా కోరిక మేరకు బైబిలును కూడా మీరు వివరణతో వ్రాస్తే మేము సంతోషించగలము. మీ వ్రాతతో మూడు గ్రంథములకు నిజమైన అలంకారము ఏర్పడగలదు. అప్పుడు మనుషులకు మూడు గ్రంథముల అందము, ఆనందము తెలియగలదు. మూడు గ్రంథములలో ఒకే రుచి గలదనీ, ఒకే అందముకలదనీ, ఒకే ఆనందము కలదనీ చెప్పగల స్థోమత మీకు తప్ప భూమిమీద ఎవరికీ లేదని నమ్ముచున్నాను. నేను మీకు మొదట వ్రాసిన జాబు ఇది. ఇందులో ఏమైనా తప్పులుంటే క్షమించమని కోరుచున్నాను.

ఇట్లు

**వహీద్,**

ఇచ్ఛాపురమువాసి, కలకత్తా ఉద్యోగి.

**తేది : 14.12.2014**

పూజ్యులైన **శ్రీశ్రీశ్రీ ప్రబోధానంద యోగీశ్వరుల**వారి పాదములకు నమస్కారములు.

**స్వామీ!** నా పేరు మహ్మద్ మాది చిన్న పల్లెటూరు. పల్లెటూరు అయినప్పటికీ మా బంధువుల వలన ఇస్లాం ప్రభావం నాపై బాగానే పడింది. ఏ విషయాన్నీ అంత త్వరగా ఒప్పుకోని మనస్సు ఉండడం చేత, ఇస్లాంలో అనేక సందేహాలు, మా బావగారిని అడిగితే వారు చెప్పింది హదీసులలోని జ్ఞానం. ఏదో తెలుసుకోవాలనిపించేది. సైన్సు ఉపాధ్యాయుడిని కావడముతో రాత్రిళ్ళు అంతులేని నక్షత్రాలు చూస్తూ అనేక ప్రశ్నలతో విశ్వం పుట్టుక, దైవం గురించి ఆలోచిస్తూ ఉండేవాడిని. 8వ తరగతి నుండే మా తెలుగు మాస్టారు వల్ల సాహిత్యం మీద మక్కువ కలిగింది. తర్వాత రామాయణ భారతాలు (ఉషశ్రీగారి) చదివాను. పతంజలి యోగసూత్రాలు, ఇంకా యోగా మీద గ్రంథాలు చదివాను. డా॥ వేదవ్యాస్ (ఐ.ఎ.యస్) గారి "వేదాలలో హిందూమతం" ఆ గ్రంథాల సిరీస్ చదివాను. ఏదో దొరికినట్లే అనిపించేది, కాని ఇది కాదు, ఇంకా ఏదో ఉంది, ఏదో కావాలి అనిపించేది. 2002 సం॥లో "శ్రీకృష్ణ చరిత" గ్రంథాన్ని చదివి ఒక రోజంతా ఏడ్చాను. Luxury Man, శృంగారపురుషుడు అనే పండిత పామరలోకం, ఆయన గురించి ఏమీ తెలుసుకోలేదనిపించింది. బాల్యంనుండి అరిష్టాలు, కష్టాలు, శరీరముపై యుద్ధగాయాలు తెలుసుకొని బాధపడ్డాను. నమాజు సమయములో ఆయన రూపం గుర్తుకు వచ్చేది. "కృష్ణా! మాకు ఆరోగ్యాన్నీ, ఆయుష్షునూ, ఐశ్వర్యాన్నీ, ఆధ్యాత్మికతను ప్రసాదించు తండ్రీ" అని ప్రార్థించేవాడిని, రోదించేవాడిని. నా ప్రార్థన ఫలించింది అనుకుంటాను.

ఒక రోజు కరెంట్‌బిల్ కట్టడానికి వెళుతుంటే మన ప్రచార వ్యాను నాకు కనిపించింది. అక్కడ **"శ్రీకృష్ణుడు దేవుడా? భగవంతుడా?"** గ్రంథం నన్ను అయస్కాంతంలా ఆకర్షించింది. అక్కడ మన దైవసేవకులు ఆహ్వానించారు. కరెంట్‌బిల్‌కు సంబంధించిన రూ॥600/- మాత్రమే ఉన్నాయి. ఏ ఆలోచనా లేకుండా ఎన్ని వీలయితే అన్ని గ్రంథాలు ఇవ్వమన్నాను. **"శ్రీకృష్ణుడు దేవుడా? భగవంతుడా?"**, **"సమాధి"**, **"మరణ రహస్యము"**, **"జనన మరణ రహస్యము"**, ఇంకా ఒక గ్రంథం, మొత్తం 5 గ్రంథాలు ఇస్తే వారంరోజుల్లో బఠానీ గింజల్లా నమిలాను. అద్భుతం! అనిపించింది. రామునిపై అభిమానం ఉండేది. ఆయన జీవిత కాలంలో తాను ఏడ్వడం తప్ప జ్ఞానం బోధించి ఎవరి ఏడ్పులూ పొగొట్టలేదని తెలిసింది. దేవుడు, భగవంతుడికి తేడా తెలిసింది. **'శ్రీకృష్ణుని మరణం లోకానికి కనువిప్పు'** చదివి ఆశ్చర్యానికి లోనయ్యాను. **'సమాధి'** చదివి షాక్ అయ్యాను. చనిపోయిన ముస్లీంలను పూడ్చిపెడితే ప్రళయం వరకు వారి ఆత్మ అలాగే ఉంటుందనుకున్న మూఢనమ్మకం ఎగిరిపోయింది. జోడు ఆత్మలు కలిసి పునర్జన్మలకు వెళతాయని తెలిసి ఆనందంలో తబ్బిబ్బయ్యాను.

వెంటనే స్వామివారి గ్రంథాలు మొత్తం కావాలని నాగేంద్రగారికి ఫోన్ చేసి వారి అకౌంటులో డబ్బులు వేసి గ్రంథాలన్నీ పంపమన్నాను. కానీ వారు స్వామివారు పంపారని స్వయంగా వచ్చి స్వామివారి గురించి పరిచయం చెప్పి ఏయే గ్రంథాలు ముందు చదువాలో వివరించి వెళ్ళారు.

స్వామీ! ఎన్నో ప్రవచనాలు విన్నాను. సామవేదం షణ్ముగశర్మ, చంద్రశేఖర సిద్ధాంతి, పరిపూర్ణానందస్వామి, పూర్ణానంద స్వామి, చినజీయర్ స్వామి, చాగంటి కోటేశ్వరరావువంటి ఉద్ధండ పండితుల జ్ఞానం విన్నాను. కానీ మన గ్రంథాలు, డీ.వి.డీలు చెప్పిన జ్ఞానం పరమాత్మ జ్ఞానమనీ,

వారు చెప్పినది మాయా జ్ఞానమని తెలిసింది. ఈ ఉత్తరం వ్రాస్తున్న సమయానికి 14-12-2014 సాయంత్రం 6.30 గం॥లకు భక్తి టీ.వీలో "భగవద్గీత-భారతీయత" అంశం పై లైవ్ కార్యక్రమం ఉద్ధండ పండితుల సమక్షంలో ప్రత్యక్ష ప్రసారంగా వస్తున్నది. గొప్ప పండితులని పేరుగాంచిన శ్రీ సంపూర్ణానందస్వామిగారు "భగవద్గీత చాలాగొప్పది, మన దేశానికే గర్వకారణం, ఉపనిషత్తుల సారాన్నీ, వేదాల జ్ఞానాన్నీ కలిపి శ్రీకృష్ణుడు అర్జునునికి ఉపదేశించినదే భగవద్గీత" అని అంటుంటే ఆయన అమాయకత్వానికి నవ్వువచ్చింది. మీ జ్ఞానం ముందు అందరూ అజ్ఞానులే అని మరోసారి నిరూపితమైంది. యజ్ఞాలు, యాగాలు చేసి దేవతలకు ఆహుతులు ఇచ్చి సుఖాలు పొందమని గీతలో చెప్పాడని అనడం ఎంత అమాయకత్వం? ఆత్మ అని ఒకరు సంబోధిస్తుంటే ఒకరు జీవాత్మ అంటారు. శరీరములో మూడు ఆత్మల విషయం, ఈ మూఢాత్మలకు తెలియకుండా పోయింది. ఇంకెన్ని జన్మలకు ఈ జ్ఞానం వారికి లభిస్తుందో కదా! అని అనిపించింది.

ఇటివలి గ్రంథాలు కూడా చాలా బాగున్నాయి స్వామీ! **"జీహాద్ అంటే యుద్ధమా?"** ఈ గ్రంథం ఈ కాలానికి ముఖ్యంగా ముస్లీమ్‌లు చెప్పే, చేసే పవిత్ర యుద్ధానికి చెంప ఛెళ్ళుమనిపిస్తుంది. పవిత్ర ఖురాన్‌లోని వాక్యాలు స్థూలంగా అర్థం చేసుకుని అమాయకపు ముస్లీం యువకులను ఎలా బలి చేస్తున్నారో చక్కగా వివరించారు. ఈ గ్రంథం చదివితే దేవుని పేరుతో చేసే జీహాద్ దుర్మార్గమనీ, యుగయుగాలు దేవుని పాపం అనుభవించినా పోదని చాలామంది తెలుసుకునే అవకాశం ఉంది.

**"స్వర్గం ఇంద్రలోకమా? నరకం యమరాజ్యమా?"** గ్రంథం కూడా మరో సంచలనాత్మక గ్రంథం. అంతకుముందు చెప్పిన జ్ఞానానికి పరాకాష్ఠ

ఇందులో ఉంది. మా బావ అంటూ ఉంటాడు. "నమాజ్, జకాత్, రోజా, హజ్‌లాంటివి. స్వర్గములో సుఖాలను అనుభవించేందుకు ఉపకరిస్తాయి. స్వర్గంలో ఒక మగానికి 70 మంది అందమైన స్త్రీలు సర్వసుఖాలు అందిస్తారు" అని. ఈ గ్రంథంలో స్వామివారు "స్త్రీల సంగతేమిటి? వారికి అందమైన మగాళ్ళు దొరుకుతారా?" అని ముస్లీం పెద్దలనడిగితే "స్త్రీలకు మజీద్‌లో, స్వర్గంలో ఎక్కడా ప్రవేశం లేదు. ఖురాన్‌లో ఎక్కడా చెప్పలేదని" ఇచ్చిన జవాబు కళ్ళు తెరిపించేలా ఉంది. దిమ్మ తిరిగేలా స్వామివారు అడిగిన ప్రశ్నలకు నీళ్ళు నములుతూ ఏదో ఒకటి స్థూలంగా చెప్పారు తప్ప అందులో నిజం లేదని తెలిసింది.

**"మూడు గ్రంథాలు, ఇద్దరు గురువులు, ఒక బోధకుడు"** మాకు అద్భుతమైన జ్ఞాన ప్రసాదం. పవిత్ర ఖురాన్ గ్రంథములోని వివిధ సూరాలను, ఆయత్‌లను చూపుతూ సూక్ష్మజ్ఞానాన్ని బాగా చెప్పారు. భగవద్గీత, బైబిలు గురించి ఎవరూ ప్రశ్నించని, ఎదురులేని జ్ఞానాన్ని అందించారు.

స్వామివారి సేవకులవలె నేనూ జ్ఞానప్రచారం చేయదలచి **"శ్రీకృష్ణుడు దేవుడా? భగవంతుడా?"** గ్రంథాన్ని మా పాఠశాలలో వరుసగా ముగ్గురు టీచర్లకిచ్చాను. అందులో ఇద్దరు టీచర్లు "ప్రబోధానంద స్వామి ఎవరు? ఆయన పేరు ఎక్కడా వినలేదు, ఏ టీ.విలో చూడలేదు. అయినా రాముడు దేవుడుకాదని చెప్పే కనీస అర్హత ఆయనకున్నదా? అసలు ఆయనెవరు, ఇలాంటి గ్రంథం వ్రాయడానికి?" అన్నారు. అందుకు నేను "రాముడు ఎక్కడా ధర్మాలు చెప్పలేదు, యజ్ఞయాగాదుల ద్వారా నన్ను చేరలేరని చెప్పిన శ్రీకృష్ణునికి వ్యతిరేఖంగా వాటిని రక్షించడానికి పూనుకున్నాడు. ఇది దేవుని మాటకు వ్యతిరేఖం కదా! ఇది మా స్వామివారు

కూడా ఋజువులతో చెప్పారండి.” అని మృదువుగా వివరించాను. రాముడు దేవుడేనని “ఆ సుందరాంగుడు, ఆ సుగుణాభిరాముడు” అని వల్లించడం మొదలు పెట్టారు. వారిలో ఒకరు బ్రాహ్మణులుకాగా మరొకరు రెడ్డి! నేనేమో ముస్లీం! ఇదికూడా ఒక కారణమైంది. తురకవాడు మాకు జ్ఞానం చెప్పడం ఏమిటి? అనుకున్నారు కాబోలు. మతాలకతీతంగా ఎవరు జ్ఞానం చెప్పినా వినాలని మీరన్నమాటలు వారు పట్టించుకోలేదు.

ఒకసారి మన ప్రచారం వ్యాను మా స్కూలు ప్రక్కన ఆగింది. మన దైవసేవకుడు ఒకరు కొన్ని గ్రంథాలు తీసుకొని రాగా, ఆయనకెదురేగి పరిచయం చేసుకుని సాదరంగా ఆహ్వానించాను. మా హెచ్.యం. గారికి ఈ గ్రంథాలు చాలా జ్ఞానం కలుగజేసే భాండాగారాలని మన లైబ్రరీకి తీసుకోమని సూచించాను. మళ్ళీ అదే వ్యతిరేఖత. వారికి జ్ఞానం గట్టు దొరికేలా లేదనిపించింది.

నిరాశపడలేదు 7,8,9 తరగతుల విద్యార్థులకు రోజూ కొంచెం కొంచెం మీ జ్ఞానము చెప్పడం ప్రారంభించాను. మంచి స్పందన, చక్కగా విన్నారు. దాదాపు 4 నెలలనుండి వారికి వీలు చూసుకుని బోధిస్తున్నాను. స్వామీ! మీ పేరు తెలుసు వారికి. పరీక్ష పెడితే చక్కగా జవాబులిస్తారు. దేవుని ధర్మాలు గురించి వారే అడుగుతారు. నువ్వెవరు? నీ శరీరములో ఎవరెవరున్నారు? ఎక్కడెక్కడ ఉన్నారు? త్రైతమంటే ఏమిటి? భగవంతుడు ఎవరు?లాంటి ప్రశ్నలకు జవాబులు చెప్పగలరు. కొందరు విద్యార్థులకు చిన్నచిన్న గ్రంథాలు ఇచ్చి చదువమంటున్నాను. చదువుతున్నారు. సందేహాలు అడిగి తెలుసుకుంటున్నారు. 10వ తరగతి విద్యార్థులకు **“దయ్యాలు భూతాలున్నాయా?”** అనే అంశాన్ని వారికి ప్రాజెక్ట్‌వర్కు క్రింద ఇచ్చాను. వారు తెలిసిన పండితులను అడిగితే ఉన్నాయన్నారట, ఇంకా

కొంతమంది లేవు అన్నారట. కొందరు ఉపాధ్యాయులు “ఒరేయ్ దయ్యాలు లేవురా? అవిగనుక ఉంటే మన శాస్త్రవేత్తలు వాటి జుట్టుపట్టి ఈడ్చుకొచ్చి చెట్టుకు కట్టేసి దానిపేరు అడిగేవారు. అవి లేవు, ఉంటే నీలాగా నాలాగా కనబడుతాయి కదా!” అనే సమాధానం ఇచ్చారట. చివరకు నేను మీ **“దయ్యాల భూతాల యదార్థ సంఘటనలు”** గ్రంథాన్ని చూపించి కొన్ని సంఘటనలు చెప్పాను. జీవులలో 10 అంశాలతో ఉండేది స్థూల శరీరము అనీ 15 అంశాలతో ఉండి స్థూల శరీరంలో ఉండేది సూక్ష్మశరీరం అనీ చెప్పాను. స్థూల శరీరాన్ని వదిలి 15 అంశాల సూక్ష్మశరీరం జోడు ఆత్మలతో బయటకు వస్తే దానిని దయ్యం అంటారని వివరించి ప్రాజెక్ట్ వర్కు పూర్తి చేయించాను. విద్యార్థులు అద్భుతం! అన్నారు.

స్వామీ! అవధులు లేని మీ జ్ఞానధారను ఆనందంతో ఆస్వాదిస్తున్నాను. ఇదే రోజు మీ డీవిడీను 4జిబిలో డౌన్‌లోడ్ చేసి ఒక మిత్రునికి ఇవ్వబోతున్నాను. మీ గ్రంథాలన్నీ ఉన్నాయి. రెండవసారి చదువుతున్నాను. మళ్ళీ క్రొత్త క్రొత్తగానే ఉంటూ క్రొత్త విషయాలు అవగతం అవుతున్నాయి. ఏం జరిగినా OK.Everything is OK. కర్మ అంటని విధానాన్ని ఇపుడిపుడే నేర్చుకుంటున్నాను. నా పిల్లలకు, భార్యకు కూడా ఈ జ్ఞానాన్ని చెబుతున్నాను.

స్వామీ! భగవంతుడు శ్రీకృష్ణుడు, ఏసు చెప్పిన ఆదర్శకర్త, ఆదరణకర్త ఎవరో నేను గుర్తించాను. **ఇంతకన్నా నాకు ఏం కావాలి.** మిమ్మల్ని తలుచుకోగానే కళ్ళవెంట నీళ్ళు తిరుగుతాయి. ఉంటాను స్వామీ...

తమ జ్ఞాన సేవకకుడు

KHUDA ISLAMIC SPIRITUAL SOCIETY
ఖుదా ఇస్లామిక్ స్పిరిచ్యువల్ సొసైటీ
(Regd.No. : 459/2011)

# ముఖ్య ఉద్దేశాలు

1. పవిత్ర ఖురాన్ గ్రంథములోని ధర్మములను సంరక్షించుట మరియు ప్రచారము చేయుట.

2. పవిత్ర ఖురాన్ గ్రంథములోని దైవజ్ఞానమునకు భంగం కలుగకుండా హిందూ, క్రైస్తవములతో సమన్వయపరుచుట.

3. పవిత్ర ఖురాన్ గ్రంథములోని హజ్రత్ ముహమ్మద్ ప్రవక్త (సం) గారి గౌరవమునకు లోటు లేకుండా చూచుట.

4. పవిత్ర ఖురాన్ గ్రంథములోని వాక్యములకు దేవుని విధానంలోని భావమును విశధీకరించి చెప్పుట.

5. పవిత్ర ఖురాన్ గ్రంథములోని పవిత్రతను ఇస్లామ్‌లో మరి ఏ గ్రంథములతో సరిపోల్చకుండా చూచుట.

6. పవిత్ర ఖురాన్ గ్రంథములోని ప్రవక్తకుగానీ, అల్లాహ్‌కుగానీ ఆటంకమును కలుగజేయు అర్థము కాని వాక్యములకు ఎవరూ ఎదురాడని వివరమును తెలుపుట.

7 పవిత్ర ఖురాన్ గ్రంథములోని దైవవాక్యముల తర్వాతనే ముస్లీమ్‌లకు హదీసు గ్రంథములోని వాక్యముల ప్రాధాన్యతయని తెలుపుట.

8. పవిత్ర ఖురాన్ గ్రంథములోని ధర్మము దైవముది, జ్ఞానము ప్రవక్తది, ఆచరణ మనుషులది. అందువలన ఇస్లామ్ మానవులందరికీ ఆచరణ యోగ్యమైనదని తెలుపుట.

9. పవిత్ర ఖురాన్ గ్రంథములోని ధర్మములు ప్రతి మనిషికీ సంబంధించినవనీ, హదీసు గ్రంథములోని వాక్యములు ముస్లీమ్‌లకు మాత్రమే సంబంధించినవని తెల్పుట.

10. పవిత్ర ఖురాన్ గ్రంథములోని దైవధర్మములను ముస్లీమ్‌లు మొదట తెలియవలెననీ, తర్వాత హదీసు సాంప్రదాయములను తెలియవలెననీ తెల్పుట.

11. పవిత్ర ఖురాన్ గ్రంథములోని దైవదూత యొక్క వాణిని ప్రవక్త శ్రీ ముహమ్మద్ గారు (సం) తెలియజేసినదనీ, ప్రవక్త పరమపదించిన తర్వాత 121,145,149,168, సంవత్సరములకు వచ్చిన హదీసు గ్రంథములు ముస్లీమ్ పండితులు తెలియజేసినవనీ, అందువలన ఇస్లామ్‌లో మొదటి స్థానము పవిత్రఖురాన్ గ్రంథముదని తెల్పుట.

12. పవిత్ర ఖురాన్ గ్రంథములోని దైవధర్మములను తెలిస్తే శాశ్వతమైన పరలోకమునకూ, హదీసు గ్రంథములోని సాంప్రదాయములను తెలిస్తే స్వర్గలోకమునకూ పోవుదురని తెల్పుట.

# అంతిమ దైవగ్రంథములో జ్ఞానవాక్యములు

## గ్రంథము వ్రాయుటకు ప్రేరణ

28.09.2014 తేదీన స్వర్గము నరకమును గురించి వ్రాయాలను కొని అదేరోజు **"స్వర్గము ఇంద్రలోకమా!-నరకము యమరాజ్యమా!!"** అను గ్రంథమును ప్రారంభించి 7.10.2014 తేదీకి గ్రంథమును తయారు చేసి బయటకు ఇవ్వడము జరిగినది. తర్వాత 9.10.2014 తేదీన **"జీహాద్ అంటే యుద్ధమా?"** అను గ్రంథమును వ్రాయుటకు ప్రారంభించి 19.10.2014 తేదీకి గ్రంథమును తయారుచేసి బయటకు ఇవ్వడము జరిగినది. ఆ తర్వాత 20.10.2014 తేదీన **"మూడు గ్రంథములు, ఇద్దరు గురువులు, ఒక బోధకుడు"** అను గ్రంథమును ప్రారంభించి 29.10.2014 తేదీకి తయారుచేసి ఇవ్వడము జరిగినది. చెప్పితే, ఎవరూ నమ్మలేనంత వేగముగా ఒక నెల వ్యవధిలో మూడు గ్రంథములను తయారు చేసి ఇవ్వడము జరిగినది. క్రొత్తగా ఏ గ్రంథము తయారయినా మొదట మూడు వందల గ్రంథములను బయట ప్రజలకు ఉచితముగా ఇవ్వడము మొదటినుండి ఆనవాయితీగా చేస్తున్నాము. అట్లు చేయడము దేవుని సేవగా భావించి చేయుచున్నాము. ఆ కార్యములో భాగముగా మా అనుచరులు (భక్తులు) **"స్వర్గము ఇంద్రలోకమా!-నరకము యమరాజ్యమా!!"** అను గ్రంథమును అనంతపురము జిల్లాలో ఉచితముగా పంచడము జరిగినది. **"స్వర్గము, నరకము"** గ్రంథములో స్వర్గము వస్తుందను ఆశతో ముస్లీమ్‌లు ఉగ్రవాదులుగా తయారై తాము చనిపోవడమేకాక ఇతరులనూ చంపుచున్నారని, ఇతరులను చంపడము దేవునిసేవలో భాగమని వారు తలచి ఇతరుల గొంతులు కోయుచున్నారనీ, అలా చేస్తూ చనిపోతే స్వర్గము వస్తుందను నమ్మకముతో అట్లు చేయుచున్నారనీ, అది మంచి పద్ధతికాదు,

దేవుని జ్ఞానము కాదని, దేవుడు దానిని ఒప్పుకోడని ఖుర్‌ఆన్‌లోని కొన్ని వాక్యములను సాక్ష్యముగా చూపుచూ వ్రాయడము జరిగినది. ఒక్క ముస్లీమ్ మతమువారినే కాకుండా స్వర్గ, నరకముల యెడల హిందువుల కున్న చెడు అభిప్రాయమునూ, క్రైస్తవులకున్న అజ్ఞానమునూ అన్నిటినీ బయట పెట్టుచూ వ్రాస్తూ, స్వర్గమంటే ఇదియనీ, నరకమంటే ఇదియనీ వివరిస్తూ చెప్పి వ్రాయడము జరిగినది.

**"స్వర్గము, నరకము"** గ్రంథములను ఉచితముగా పంచిన తర్వాత రెండవ గ్రంథము **"జీహాద్ అంటే యుద్ధమా?"** అను గ్రంథము కూడా తయారయిన తర్వాత ఆ గ్రంథమును 28.10.2014 మంగళవారము దినమున అనంతపురములో మా భక్తులు మొదట కలెక్టర్ ఆఫీస్‌లోనూ తర్వాత యస్.పి. ఆఫీసులోనూ ఇవ్వడము జరిగినది. అప్పుడు అంతకు ముందు ఇచ్చిన **"స్వర్గము, నరకము"** గ్రంథమును చదివినవారు మీ గ్రంథములు బాగున్నాయి, ఇప్పటి సమాజమునకు ఎంతో అవసరము, అన్ని పోలీస్‌స్టేషన్లలో ఇవ్వమని యస్.పి ఆఫీస్‌లో చెప్పగా అలాగే అన్ని స్టేషన్‌లలో ఇవ్వడము జరిగినది. అన్నిచోట్లా అందరూ సంతోషముగా మా గ్రంథములను తీసుకొని **"స్వర్గము, నరకము"** ను చదివాము చాలా బాగుంది అని చెప్పడము జరిగినది. అయితే అనంతపురము త్రీటౌన్ పోలీస్‌స్టేషన్ లోని యస్.ఐ. ముస్లీమ్ మతస్థుడు అయినందున అతను అసూయతో దురుసుగా మాట్లాడడము జరిగినది. అతను దూషణగా మాట్లాడిన మాటలలో, ఖుర్‌ఆన్ గ్రంథములోని వాక్యములను వ్రాశాడు ఇతనికి ఏమి తెలుసుయని ఖుర్‌ఆన్ వాక్యములను వ్రాశాడు? (ఈ మాటనే ఇంకా అసభ్యముగా అడిగాడు) ఎవరి అనుమతితో వ్రాశాడు? ఈయన నాకు కనిపిస్తే ఖుర్‌ఆన్ గురించి నీకు ఏమి తెలుసునని అడుగుతాను? అని

అనడము జరిగినది. అక్కడ ఘర్షణ వాతావరణము ఏర్పడిన దానివలన అక్కడి మిగతావారు సర్దిచెప్పడము వలన మావారు ఏమీ మాట్లాడకుండా వచ్చారు. సమాజములో ఇటువంటివారు ఎందరో ఉండవచ్చును. వారి ప్రశ్నలకు కూడా మేము జవాబు ఇవ్వవలసిన బాధ్యతయుంది. అటువంటి వారికి మా జవాబు ఈ విధముగా యున్నది.

మేము సమాజమునకు ఎంతో మేలు చేయాలను ఉద్దేశ్యముతో స్వర్గము కొరకు ఇతరులను చంపుటే ధ్యేయముగా పెట్టుకొన్నవారికి "ఇతరులను చంపితే స్వర్గము రాదు, ఖుర్‌ఆన్‌లో అలా వ్రాయలేదు" అని గ్రంథములోని వాక్యములనే వివరించి చెప్పాము. దానిని ఓర్చుకోలేక అసహనముతో ఒక పోలీస్ ఉద్యోగి అలా మాట్లాడడము ఆశ్చర్యము! ఎందరికో మంచిగా కనిపించినా, అతను ఒక్కడు అలా మాట్లాడడము వెనుక మతద్వేషము తప్ప ఏమీ లేదని తెలియుచున్నది. మా గ్రంథమును చదివిన ఎందరో ఉన్నతస్థానములోయున్న ముస్లీమ్ పెద్దలు ఎంతో బాగున్నదని ప్రశంసించుచుండగా, ఇటువంటివారు కొందరు వ్యతిరేఖముగా మాట్లాడడము కూడా జరుగుచుండును. మేము వారి మాటలకు కూడా జవాబును ఇవ్వదలచి ఇలా అడుగుచున్నాము. మేము ఎక్కడయినా ఖుర్‌ఆన్ గ్రంథమును గురించి తక్కువగాగానీ, వ్యతిరేఖముగాగానీ మాట్లాడినామా? ఖుర్‌ఆన్‌ను అడ్డము పెట్టుకొని అక్రమములు చేయువారికి అది మంచి పద్ధతికాదని హితము చెప్పాము. మేము ఒక్క ముస్లీమ్ మతములోని వారికేగాక, దైవగ్రంథము అయిన భగవద్గీతకు వ్యతిరేఖముగా నడుచుకొను హిందువులను కూడా మందలించి ఇది మంచిపద్ధతి కాదు, దేవుని దృష్ఠిలో అధర్మమగునని చెప్పాము. అలాగే అంతిమ దైవగ్రంథమయిన ఖుర్‌ఆన్ గ్రంథములోని వాక్యములను అర్థము చేసుకోలేనివారిని, వాటిని తమ

ఇష్టానుసారము అపార్థము చేసుకొని దేవుడు చెప్పని వాటిని కూడా దేవుడు చెప్పాడని అక్రమాలు చేయువారిని, అవి దేవునికి సరిపోని చర్యలని, అలా దేవుడు ఎక్కడా ఏ వాక్యములోనూ చెప్పలేదనీ, అలా చెప్పని కార్యములను చేస్తే పాపము వస్తుందని హెచ్చరించుచూ వచ్చాము. ఖుర్‌ఆన్ ఒక్క ముస్లీమ్ మతమునకు సంబంధించిన గ్రంథము కాదు. అది సర్వమానవులకు సమానముగా చెప్పినది. అందువలన ఆ గ్రంథము మీద బాధ్యత ముస్లీమ్‌లకు ఎంతయుంటుందో, అంతే బాధ్యత ఆ గ్రంథమును విశ్వసించిన హిందువులకు కూడా యుంటుంది. భగవద్గీత ప్రథమ దైవగ్రంథమని మాకు తెలుసు. అలాగే ఖుర్‌ఆన్ అంతిమ దైవగ్రంథమని కూడా మాకు తెలుసు. రెండు గ్రంథములలో ఒకే దైవజ్ఞానమున్నదని కూడా మాకు తెలుసు. రెండిటినీ సమాన గౌరవముతో మేము చూస్తున్నాము. మాకు మత ద్వేషములుగానీ, అసూయలుగానీ ఉండవు. మేము వ్రాసిన 64 గ్రంథములయందు మూడు మతములలో ఒక మత గ్రంథమును తక్కువ చేసి చెప్పడము అనే ప్రసక్తేయుండదు. మేము ఒక గురువుగా మనుషులకు హితము చెప్పాము తప్ప, చెడు చెప్పలేదు కదా! మేము ఏమి చెప్పినా సమాజములో కనువిప్పు అవుతుంది. ఆధ్యాత్మిక రంగములో ఒక స్పందన వస్తుంది.

నేను ఒక్కడినే కాకుండా నాలాంటివారు ముస్లీమ్‌లలో కూడా యుండి ప్రజలకు హితము చెప్పుటకై ఎందరో ముస్లీమ్ పెద్దలు, ఆధ్యాత్మికవేత్తలు ఎన్నో గ్రంథములను వ్రాశారు. ఎన్నో ఉపన్యాసము లను చెప్పారు. వారు ముస్లీమ్‌లయినా భగవద్గీతను, వేదములను, ఉపనిషత్తులను, పురాణములను వారి రచనలలో వాడుకొని అవసరమొచ్చిన చోట ఆ గ్రంథములలోని వాక్యములను సాక్ష్యముగా చెప్పి వ్రాయడము,

ఉపన్యసించడము జరిగినది. నేను హిందువుగాయుండి మా గ్రంథములలోని వాక్యములను ఎవరిని అడిగి వ్రాశారు అని వారిని అడిగామా? మేము ఎప్పుడూ అలా అడుగలేదు. ఎందుకనగా! భగవద్గీత దైవగ్రంథము, దైవ గ్రంథము ఏదయినా సర్వమానవుల కొరకు చెప్పినదే అయినందున భగవద్గీతను ఏ మతమువారయినా చదువుకోవచ్చును, అందులోని వాక్యములను చెప్పుకోవచ్చును. అలాగే ఖుర్ఆన్ గ్రంథము కూడా దైవగ్రంథము అయినందున దానిమీద ఒక్క ముస్లీమ్ మతము వారికే కాకుండా మిగతా అన్ని మతములలో పుట్టినవారికీ భక్తి విశ్వాసములు ఉ ండవచ్చును. అందులోని వాక్యములను చదువుకోవచ్చును, చేతనయితే చెప్పుకోవచ్చును. దైవగ్రంథములు మూడు సర్వమానవుల కొరకు చెప్పబడినవి. వాటిమీద ఎవరికయినా భక్తియుండవచ్చును గానీ, భక్తికి ఎవరి అనుమతీ అవసరము ఉండదు. అందువలన మేము మా భగవద్గీతలోని వాక్యములను మీరు ఎందుకు చెప్పుచున్నారని ఎవరినీ అడుగలేదు. మేము ఖుర్ఆన్ గ్రంథములోని వాక్యములకు వివరము చెప్పితే, ఆ వాక్యములను చూపి హితము చెప్పితే, ముస్లీమ్ పెద్దలను అడిగి ఖుర్ఆన్ వాక్యములను వ్రాయాలి అంటే అది తెలివి తక్కువ మాటయగును. మీ మాట ప్రకారమైతే భగవద్గీత వాక్యములను వ్రాసుకొన్న ముస్లీమ్‌లను మేము ఎవరి అనుమతితో భగవద్గీతను వాడుకొన్నారని అడుగవలెనా? మేము ఎప్పటికీ అలా అనము. మేము దేవుని విషయములో అంత అజ్ఞానులము కాదు.

ఇక్కడ మరొక విషయము మేము వ్రాసిన చాలా గ్రంథములలో ఖుర్ఆన్ వాక్యములను అవసరమున్న చోటంతా భగవద్గీత వాక్యములతో జోడించి చెప్పాము. వాటిని చూచిన తెలివితక్కువ మనుషులు ఖుర్ఆన్

గ్రంథమును గురించి ఏమి తెలుసునని అందులోని విషయములను వ్రాశారు? అని ప్రశ్నించడము జరిగినది. దానికి నేను సూటిగా చెప్పునదేమనగా! ప్రజలకు ఏమి తెలియదో దానిని మేము తెలిసి వ్రాశాము అని చెప్పుచున్నాము. ఖుర్ఆన్ గ్రంథమును ముస్లీమ్‌లందరూ చదువలేదు. ఒకవేళ అరబ్బీభాషలో చదివినా దాని అర్థము తెలియదు. అయితే నేడు మేము చెప్పు ఖుర్ఆన్ భావములను ఎందరో ముస్లీమ్‌లు తెలుసుకోగలిగారు. వారికి ఖుర్ఆన్‌లో తెలియని విషయములన్నిటికీ వివరమును నన్ను అడిగి తెలుసుకొంటున్నారు. కొన్ని వాక్యములను ఎవరు చెప్పినా అందులో సత్యము లేదని నావద్దకు వచ్చి తెలుసుకొని తృప్తి చెందుచున్నారు. అటువంటివారు నన్ను ఏమి తెలిసి వ్రాశారు అని ప్రశ్నించిన వారిని చూచి నవ్విపోతారు. అలా తెలివితక్కువగా మాట్లాడువారికి ఖుర్ఆన్ గ్రంథములో నాకెంత తెలుసో తెలియుటకు గ్రంథములోని ఒక ఆయత్‌ను చూపి దానికి ఇంతవరకు ఎవరికైనా అర్థము తెలుసా? అని ప్రశ్నించుచున్నాను. నాకు ఎంత తెలుసు అని అడిగినవారు ఎవరైనా ఆ ఆయత్‌కు సరియైన జవాబును, తిరిగి ప్రశ్న రాని జవాబును చెప్పమను, చెప్పగలరేమో! ఇప్పుడు కాకున్నా ఒక సంవత్సరమునకయినా చెప్పగలరా!యని నేను అడుగుచున్నాను.

దాదాపు నాలుగు సంవత్సరముల క్రితము నేను, ముస్లీమ్ పెద్దలు విశాఖపట్టణములో ఒక చర్చిలో కలియడము జరిగినది. అప్పుడు పదిమంది పెద్దలు నన్ను ఇస్లామ్‌లోనికి (ముస్లీమ్ మతములోనికి) చేరమని ఆహ్వానించడము జరిగినది. నన్ను అలా పిలుచుటకే ఆ దినము అందరూ కలిసారనుకొంటాను. అప్పుడు నేను మతము మారను అనకుండా నేను అడిగిన ఖుర్ఆన్‌లోని ఆయత్‌కు వివరమును చెప్పితే నేను మీ మతములోనికి వస్తాను అని ఒక షరతును పెట్టడము జరిగినది. ఆ దినము **6వ సూరా,**

**౨౮వ ఆయత్‌ను** గురించి అడిగాము. దానికి వారు ఆ దినము సరియైన సమాధానము చెప్పలేకపోయి, చివరకు ఇంటర్‌నెట్‌లో దీనిని గురించి వ్రాసియుంటారు తర్వాత చూచి వివరమును చెప్పుతామని చెప్పిపోవడము జరిగినది. ఆ రోజు అరబ్బీభాషలో ఖుర్‌ఆన్‌ను ధారాళముగా చెప్పు పండితులే వెనుదిరిగి పోయారు. ఆ దినము వారు మీకు ఖుర్‌ఆన్‌ను గురించి ఏమి తెలుసు? అని నన్ను ప్రశ్నించలేదే! ఈ రోజు నన్ను అడిగిన వారికంటే వారు తక్కువవారా? అంతెందుకు ఖుర్‌ఆన్‌ను గురించి ఏమి తెలుసునని ప్రశ్నించిన వారిని ఇప్పుడు నేను అడుగుచున్నాను. నాకంటే నీవు ఎక్కువ తెలిసినవాడివయితే ఈ ఆయత్‌కు వివరము చెప్పగలవా? అని ప్రశ్నించుచున్నాను. అది మహాజ్ఞాని అయిన జిబ్రయేల్ గ్రహము చెప్పిన దైవవాక్యము. దానికి పది సంవత్సరములు గడువు ఇచ్చినా ఎవరూ వివరణ చెప్పలేరు. అది దేవుడు చెప్పితే మనిషి గ్రహించుకోవలసిందేగానీ, మనిషికి స్వయముగా దానిని గురించి తెలియదు.

అజ్ఞానమార్గములో యున్నవారు నన్ను మరొక విధముగా ప్రశ్నించుచూ ఇలా అంటున్నారు. "మీరు ఏ విషయమును కూడా నేను చెప్పుచున్నాను అనకుండా, నాకు నా ఆత్మ (దేవుడు) తెలియజేసిన దానిని చెప్పుచున్నానని చాలాచోట్ల వ్రాశారు. మీది మీరే నమ్మకముగా చెప్పకుండా, లోపల దేవుడు చెప్పితే చెప్పుచున్నానని అంటున్నారు. మీకు చెప్పే దానిని ధైర్యముగా నేను చెప్పుచున్నానని చెప్పవచ్చును కదా! మీరు ధైర్యముగా చెప్పలేని విషయములను, మీది మీకే నమ్మకములేని విషయములను మేమెలా నమ్మాలి?" అని అంటున్నారు. దానికి మా జవాబు ఏమనగా! ఆధ్యాత్మికము తెలిసినవాడు తన శరీరములోని ఆత్మ విషయము తెలిసినవాడు, జ్ఞాని అయినవాడు ఎవడుగానీ, ఖుర్‌ఆన్ గ్రంథములో 50వ సూరా 21వ

ఆయత్‌కు అర్థము తెలిసినవాడు ఎవడుగానీ, భగవద్గీతలో మోక్ష సన్న్యాస యోగమున 61వ శ్లోకమునకు వివరము తెలిసినవాడు ఎవడుగానీ తాను చేయు ఏ పనినీ తనమీద పెట్టుకోక అన్నీ దేవుడే చేయిస్తున్నాడనిగానీ, అన్నీ దేవుడే చెప్పుచున్నాడనిగానీ, అందరినీ దేవుడే ఆడించుచున్నాడనిగానీ చెప్పవలసియుండును. అట్లుకాకుండా నేనే చెప్పుచున్నాననిగానీ, నేనే చేయుచున్నానను భావముగానీ మనిషిలో ఉండకూడదు. దేనినీ తనమీద పెట్టుకోకుండా చేయువానిది భగవద్గీతలో చెప్పినట్లు కర్మయోగమగును. అట్లు కాకుండా ప్రతి పనిలోనూ తానే చేయునట్లు భావించుకొనువానిది అజ్ఞానమగును. అది కర్మయోగము కాదు. కర్మరోగమగును. అందువలన ఒక విషయమును బయటికి కనిపించునట్లు మేమే చెప్పుచున్నప్పటికీ, లోపల మా భావములో మేము అను భావము ఉండక, సర్వమునకూ మూలకర్తయైన దేవుడే చేయిస్తున్నాడని తెలిసియుండి, అట్లే బయటికి కూడా చెప్పడము జరుగుచున్నది. అది జ్ఞానము తెలియని అజ్ఞానులకు విచిత్రముగా తోచినా తెలిసినవారికి అదియే సరియైన పద్ధతని తెలియును.

భూమిమీద ఇటువంటి ప్రశ్నలను అడుగువారు ఎన్నోచోట్ల ఎందరో యున్నారు. అందులన వారి ప్రశ్నలకు కూడా జవాబును ఇవ్వదలచిన దేవుడు ఒక పోలీస్ ఉద్యోగిని దురుసుగా మాట్లాడునట్లు చేసి అందులో మూడు ప్రశ్నలను వచ్చునట్లు చేశాడు. తర్వాత ఇవతలివైపు నుండి ప్రశ్నలకు జవాబులు వచ్చునట్లు దేవుడే చేశాడు. దేవునికి తెలియకుండా, దేవుడు సంకల్పించకుండా ఏదీ జరుగదు. ప్రశ్నలకు జవాబులను నానుండి చెప్పించాడు. ఈ తతంగము ఎవరికీ తెలియదు. పైన జరుగుదానిని మాత్రమే చూచువారికి లోపల జరిగించునదేదో తెలియదు. ఈ విషయము ఇంతటితో ఆగిపోక ఈ ప్రశ్నలను ప్రేరణగా చేసి, నా చేత ఖుర్‌ఆన్

గ్రంథమునకు వివరమును వ్రాయించుటకు రంగమును సిద్ధము చేశాడు. నేను ఖుర్‌ఆన్ గ్రంథములోని కొన్ని వాక్యములకు ధర్మయుక్తముగా, శాస్త్రబద్ధముగా వ్రాయుటకు ప్రేరణ జరుగడమును దేవుని ఆజ్ఞగా భావించి ఆ కార్యమును చేయుటకు పూనుకోవడము జరిగినది. ఇక్కడ కనిపించే కార్యములను మనిషి చేసినా, కనిపించని కారణమై చేయించేవాడు మరొక డున్నాడని మరువకూడదు. అందువలన ఖుర్‌ఆన్ గ్రంథమునకు వివరమును వ్రాయడము అందరికీ కనిపించే నేను చేసినా, ఎవరికీ కనిపించక చేసినవాడు వేరుగా యున్నాడు. వాడు ఎవడో తెలుసుకోవడమే నిజమైన జ్ఞానము. నిజమైన ఆధ్యాత్మికము.

ఇక్కడ కొందరు ఒక ప్రశ్న అడుగుటకు అవకాశము గలదు. అదేమనగా! "నీవు ఇందూమతములోనివాడివి, ఖుర్‌ఆన్ గ్రంథము ఇస్లామ్ మతములోనిది. నీ మతములోని భగవద్గీత గ్రంథమునకు నీవు వివరము వ్రాయవచ్చునేమోగానీ, ఇస్లామ్ మతములోని ఖుర్‌ఆన్ గ్రంథములోని వాక్యములకు వివరమును వ్రాయాలి అంటే ఎంతో కష్టమగును కదా! అందువలన ఖుర్‌ఆన్ గ్రంథములోని వాక్యములకు వివరమును వ్రాయడము సాధ్యమగునా? మీరు లోపలివాడు, బయటివాడు అని చెప్పక బయటి మీరు ఎలా వ్రాయగలరో మాకు అర్థమగునట్లు చెప్పండి?" అని అడుగ వచ్చును. దానికి మా జవాబు ఏమనగా! ప్రపంచములోని పన్నెండు మతములలో మూడు మతములే ముఖ్యమైనవి మరియు పెద్దవి. దేవుడు నేను మానవులకు మూడు విధములుగా జ్ఞానమును తెలియజేస్తానని చెప్పి మూడు విధములుగా తెలియజేసిన జ్ఞానము మూడు పెద్ద మతములయిన ఇందూ, ఇస్లామ్, క్రైస్తవములలోనే కలదు. అందులో మొదటిది ఇందూత్వము. తర్వాతది క్రైస్తవము, చివరిది ఇస్లామ్. మొదటిదయిన

ఇందు సమాజములో పుట్టినవాడను నేను. ఇందూ సమాజమునకు అలవాటైన గ్రంథము అన్నిటికంటే ముందు పుట్టిన భగవద్గీత. ముందు పుట్టిన భగవద్గీత నాకు బాగా తెలుసు. నిజము చెప్పాలంటే అందులోని ఒక శ్లోకము కూడా నాకు రాదుగానీ, వాటి భావము మాత్రము నాకు తెలుసు. ఇంకా నిజము చెప్పాలంటే శ్లోకాల భావము నాకు తెలియదుగానీ నాలోయున్న భావమునకు సరిపడు శ్లోకములే భగవద్గీతలో ఉన్నాయి. ఏమీ అర్థము కాకుండా, ఒక పద్ధతి లేకుండా ఇలా చెప్పుచున్నాడేమిటి! అని అనుకోవద్దండి. ఇది ఒక భగవద్గీతకు సంబంధించిన విషయమే కాదు. మిగతా రెండు గ్రంథముల విషయములో కూడా నాలోయున్న భావనే అందులో వాక్యములుగా యుండడము జరిగినది. అందువలన మొదట భగవద్గీతలోని జ్ఞానము నాకు సులభమైపోయినది. అంతేకాక భగవద్గీత గ్రంథమును నేను చదువకముందే అవి నాలోయున్న భావములే కనుక ఆ గ్రంథము నాకు సులభమైనది. కావుననే నేను వ్రాసిన భగవద్గీతలోని వివరము ఎందరో రచయితలు వ్రాసిన గ్రంథములలోని వివరములకంటే ఎంతో బాగుండును. ఎంతో సత్యముగా ఉండును. మిగతా రెండు గ్రంథములయందు కూడా నేను చదువకముందే చెప్పిన వాక్యములు అందులో ఉండడము జరిగినది. మిగతా రెండు గ్రంథములు కూడా భగవద్గీతను అనుసరించి పుట్టినవే అయినందున, భగవద్గీత నాకు ఎంత సులభమయినదో, మిగతా రెండు గ్రంథములు కూడా అంతే సులభముగా నాకు కనిపించాయి. అందువలన ఏ గ్రంథములోని విషయమునైనా సులభముగా చెప్పగలము. మిగతా గ్రంథములకు వివరమును నేను చెప్పినప్పుడే దాని విలువ, గొప్పదనము ప్రజలు గ్రహించ గలుగుచున్నారు. నేను వివరించి చెప్పనంత వరకు అవి సరిగా ఎవరికీ

అర్థము కావడము లేదు. ఇదంతయూ గమనించిన తర్వాత అందరికీ అర్థము అగుటకు, మూడు గ్రంథముల వివరము వ్రాయదలచాను. భగవద్గీతను వ్రాశాను. ఇప్పుడు ఖుర్ఆన్ వాక్యములను వ్రాయుచున్నాను.

ఖుర్ఆన్ గ్రంథములో ఇందూ పవిత్ర వాక్యములున్నాయి అనడములో అర్థమేమి? ఖుర్ఆన్ అంటే ముస్లీమ్‌ల గ్రంథము కదా! ఇందూ వాక్యములు అంటే హిందూమతమునకు సంబంధించిన మాటలు కదా! హిందువుల వాక్యములు ముస్లీమ్‌ల గ్రంథములో యుండునా? అను ప్రశ్న ఈ గ్రంథము చూస్తూనే కొందరికి రావచ్చును. దానికి మా జవాబు ఇలా కలదు. ఖుర్ఆన్ గ్రంథము ముస్లీమ్‌ల గ్రంథము అని అనుకోవడము పొరపాటు. ఖుర్ఆన్ గ్రంథము సర్వమానవులకు సంబంధించిన గ్రంథమని ఖుర్ఆన్ గ్రంథమందే 81వ సూరా, 27వ ఆయత్‌నందు కలదు చూడండి. **(81-27)"ఇది సమస్త లోక వాసులకొరకు హితోపదేశము"** అని కలదు. ఈ వాక్యము ప్రకారము ఖుర్ఆన్ గ్రంథము సమస్త ప్రజలకు చెప్పిన హితోపదేశము లేక జ్ఞానోపదేశమని చెప్పవచ్చును. ఇకపోతే ఇందూ వాక్యములనుటకు అర్థమేమనగా! ఇందూ అంటే ఒక మతమునకు సంబంధించిన పదము కాదు. ఇందూ అంటే జ్ఞానము అని అర్థము. ఖుర్ఆన్ గ్రంథములోయున్న 'జ్ఞానవాక్యములు' అనుమాటను 'ఖుర్ఆన్‌లో ఇందూ వాక్యములు' అని వ్రాశాము. ఇక్కడ కొందరికి ఒక ప్రశ్న రావచ్చును. అదేమనగా! ఖుర్ఆన్‌లో జ్ఞానవాక్యములు అని మీరు చెప్పితే, ఖుర్ఆన్‌లో మీరు చెప్పిన కొన్ని వాక్యములు మాత్రము జ్ఞానవాక్యములన్నట్లు, మిగతావన్నీ జ్ఞానవాక్యములు కాదు అన్నట్లుండును కదా!యని అడుగవచ్చును. దానికి మా జవాబు ఈ విధముగాయున్నది. మేము చెప్పిన వాక్యములు మాత్రము జ్ఞానవాక్యములు అను ఉద్దేశ్యముతో ఆ మాటను మేము వ్రాయలేదు. మాకు

ఖుర్‌ఆన్ గ్రంథములో అర్థమయిన వాక్యములను, నాకు వివరము తెలిసిన వాక్యములను మాత్రమే నేను వ్రాయుచూ నాకు తెలిసినవన్నీ జ్ఞానవాక్కులే యని వ్రాశాము. నాకు తెలియనివన్నీ జ్ఞానవాక్యములు కాదని నేను చెప్పలేదు కదా! నాకు తెలిసినంతవరకు ఖుర్‌ఆన్ దైవగ్రంథమని ఎన్నోమార్లు చెప్పాము.

భారతదేశమునందు, ఆదిలోనే ఇందూధర్మములు దేవునిచేత చెప్పబడి, దేవుడు చెప్పిన ధర్మముల ఆధారముతో ఇందూసమాజము ఏర్పడినది. ఇందూసమాజము కృతయుగములో ఏర్పడి ఎంతో జ్ఞానముతో కూడుకొని ఉండేది. ద్వాపరయుగ చివరిలో ఇందూసమాజములో జ్ఞానము ఏమాత్రము తెలియకుండా పోయినప్పుడు కృష్ణుడు వచ్చి భగవద్గీత జ్ఞానమును చెప్పడము జరిగినది. అప్పుడే భగవద్గీత గ్రంథముగా తయారయినది. తర్వాత 3000 సంవత్సరములకు ఏసు చెప్పిన **"సువార్తబైబిలు"** తయారయినది. ఆ తర్వాత 600 సంవత్సరములకు ముహమ్మద్ ప్రవక్త ద్వారా జిబ్రయేల్ చెప్పిన జ్ఞానము **"ఖుర్‌ఆన్"** గ్రంథముగా తయారయినది. సృష్ట్యాదిలో దేవుడు ఆకాశవాణి ద్వారా సూర్యునికి చెప్పించిన జ్ఞానమునే తిరిగి కృష్ణుడు అర్జునునకు చెప్పాడు. రెండవమారు అదే జ్ఞానమే బైబిలుగా తయారయినది. మూడవమారు కూడా అదే జ్ఞానమే ఖుర్‌ఆన్ గ్రంథముగా తయారయినది. మొదట కృష్ణుడు అర్జునునకు చెప్పిన జ్ఞానము భగవద్గీతగా తయారయినది. మొదట తయారయిన భగవద్గీతను ఆధారము చేసుకొని మిగతా రెండు గ్రంథములు తయారయినవి. అందువలన మిగతా రెండు గ్రంథములకు భగవద్గీత మాతృగ్రంథముగాయున్నది. అంతేకాకుండా గీతలోని జ్ఞానమే బైబిలు, ఖుర్‌ఆన్ గ్రంథములలో యుండుట వలన ముందు వచ్చిన గ్రంథము

యొక్క జ్ఞానమును ధృవీకరించుటకే బైబిలు, ఖుర్ఆన్ గ్రంథములు వచ్చినవని ఖుర్ఆన్ గ్రంథములో రెండు మూడుచోట్ల చెప్పడమైనది. ఈ విధముగా చూస్తే ముందువచ్చిన గ్రంథములోని జ్ఞానమే ఖుర్ఆన్‌లో కూడా యున్నదని అర్థమగుచున్నది.

**భగవద్గీత, బైబిలు, ఖుర్ఆన్ మూడు దైవగ్రంథములే.** ప్రథమ దైవగ్రంథము భగవద్గీతకాగా, ద్వితీయ దైవగ్రంథము బైబిలుకాగా, అంతిమ దైవగ్రంథము ఖుర్ఆన్ గ్రంథమని తెలిసిపోయినది. మూడు గ్రంథములూ దైవగ్రంథములే అగుటవలన ఆ మూడింటినీ దేవుడే చెప్పాడని లేక దేవుడు ఇతరుల చేత చెప్పించాడని తెలియుచున్నది. ఇంకొక విధముగా చెబితే దేవుడు తన అంశచేత జీవాత్మను, ఆత్మను తయారు చేశాడు. దేవుడు మూడు ఆత్మలుగా ఉన్నాడని అర్థము. పరమాత్మ ఒకటికాగా, ఆత్మ రెండవదికాగా, జీవాత్మ మూడవదని తెలియవలెను. ఈ మూడు ఆత్మల చేత చెప్పబడినవే మూడు దైవ గ్రంథములని ఒక విధానము ద్వారా తెలియబడినది. అందులో **పరమాత్మ హోదాలో చెప్పబడినది భగవద్గీత, ఆత్మ హోదాలో చెప్పబడినది బైబిలు గ్రంథము, జీవాత్మ హోదాలో చెప్పబడిన గ్రంథము ఖుర్ఆన్ గ్రంథము.** అందులో చూచితే ఆత్మల హోదాకు తగినట్లే వాక్యములుండును. ఈ విషయము మీకు బాగా అర్థము కావాలంటే మా రచనలలోని **"మూడు గ్రంథములు, ఇద్దరు గురువులు, ఒక బోధకుడు"** అను గ్రంథము చదివితే అనుమానము లేకుండా అర్థము కాగలదు.

జిబ్రయేల్ గ్రహము ముహమ్మద్ ప్రవక్తగారికి చెప్పిన జ్ఞానమే ఖుర్ఆన్ గ్రంథములో యున్నది. జిబ్రయేల్ తాను ఒక జీవునిగాయుంటూ ఒక మనిషి దేవుని జ్ఞానమును మరొక మనిషికి తెలియజేస్తే ఎలా చెప్పగలడో అదే విధముగా జ్ఞానమును ప్రవక్తగారికి చెప్పడమైనది. సృష్ట్యాదిలో దేవుడు

ఆకాశవాణి ద్వారా సూర్యునికి తెలియజేసిన జ్ఞానమే ఖుర్ఆన్‌లో జిబ్రయేల్ తెలియజేశాడు. కావున ఖుర్ఆన్ గ్రంథము దైవ గ్రంథము అని చెప్పబడినది. ఖుర్ఆన్ దైవగ్రంథమగుట చేత అందులో మాకు అర్థమయిన వాక్యములను ఈ గ్రంథములో వివరించి వ్రాయడమైనది. అందువలన ఈ గ్రంథమునకు "ఖుర్ఆన్‌లో ఇందూ పవిత్ర వాక్యములు" అని పేరుపెట్టి చెప్పుచున్నాము. ఇందులో చెప్పిన వాక్యములన్నియూ ఎక్కువ సూక్ష్మజ్ఞానముతో కూడుకొని యుండును. నేడు భూమిమీద ప్రజలందరూ ఎక్కువగా స్థూలజ్ఞానమునకే అలవాటైపోయియున్నారు. అందువలన సూక్ష్మముగా చెప్పిన వాక్యములు సులభముగా అర్థము కాకపోవచ్చును. అర్థము కానివాటిని సూక్ష్మముగా చూచినప్పుడు అర్థము కాగలవు. దేవుడు చెప్పిన సూక్ష్మ భావములను మనిషి స్థూలముగా అర్థము చేసుకొంటే ఎప్పటికీ అర్థముకావు.

మనిషి శరీరములో పది (10) భాగములు స్థూలముగా కలవు. పదిహేను (15) భాగములు సూక్ష్మముగా కలవు. అందరికీ తెలిసినట్లు మనస్సు, బుద్ధి, చిత్తము, అహము అనునవి కంటికి కనిపించవు. అలాగే జీవాత్మ ఎలాగున్నదో, పుట్టినప్పుడు శరీరములోనికి ఎలా వస్తున్నదో, చచ్చినప్పుడు శరీరమునుండి ఎలా పోవుచున్నదో ఎవరికీ కనిపించడము లేదు. కనిపించని జీవాత్మను సూక్ష్మమనక స్థూలమని ఎవరూ అనలేరు. జీవాత్మయే స్థూలము కాకుండా సూక్ష్మముగా యున్నప్పుడు జీవాత్మకంటే పెద్దయైన ఆత్మ, పరమాత్మలు ఏమాత్రము కనిపించక సూక్ష్మముగానే యున్నట్లు తెలియుచున్నది. అలాంటప్పుడు పరమాత్మయనబడు దేవుని జ్ఞానము అంతయూ సూక్ష్మముగానేయుండును. ఒక శరీరములో 40 శాతము స్థూలముండగా 60 శాతము సూక్ష్మమున్నది. దేవుని జ్ఞాన విషయానికి వస్తే 25 శాతము స్థూలజ్ఞానము, 75 శాతము సూక్ష్మజ్ఞానము

కలదు. శరీరము ఆధారముగాయుండగా శరీర ఆధారముతో సూక్ష్మముండును. ఒక ఇంటికి పునాదులను లోతుగా త్రవ్వి రాళ్ళతో పూడ్చి తర్వాత పునాదుల మీద చెక్కతోగానీ, ఇటుకతోగానీ, రాయితోగానీ ఇల్లును కట్టవచ్చును. అయితే ఇల్లు పైన స్థూలముగా కనిపించినా, ఇంటికి ఆధారమైన పునాదులు ఏమాత్రము కనిపించవు. ఇంటికి పునాదులు సూక్ష్మమైనవికాగా, ఇల్లు స్థూలమైనదిగా యున్నది.

ఇంటి పునాదులను పూర్వము గుణాదులు అని పిలిచెడివారు. నేడు కూడా అక్కడక్కడ పునాదులను గుణాదులని అంటున్నారు. గుణాది అనుమాట ఆధ్యాత్మికమునకు సంబంధించిన మాటయని గుర్తుంచుకోవలెను. శరీరములో గుణములుండుట అందరికీ తెలుసు. శరీర విషయానికి వస్తే శరీరము బయటికి స్థూలముగా కనిపించుచున్నది. శరీరములోపల గుణములు కనిపించక సూక్ష్మముగాయున్నవి. ఏ విధముగా అయితే పునాదులు భూమిలో కనిపించకయుండి బయట కనిపించే ఇంటికి ఆధారముగాయున్నవో, అదే విధముగా గుణాదులు శరీరములోపల కనిపించకయుండి బయట కనిపించే శరీరమునకు ఆధారముగా యున్నవి. ఇంటికి సూక్ష్మముగా యున్నవి పునాదులు, ఇల్లు స్థూలముగాయున్నది. అలాగే శరీరములో సూక్ష్మముగాయున్నవి గుణాదులు, శరీరము స్థూలముగా యున్నది. ఇంటికి పునాదులు ఆధారము. అలాగే శరీరమునకు గుణాదులు ఆధారము. స్థూలముగా యున్నవాటిని **"ముహ్కమాత్"** యని ఖుర్ఆన్ గ్రంథములో చెప్పారు. అలాగే సూక్ష్మముగా యున్నవాటిని **"ముతషాబి హాత్"**యని కూడా చెప్పారు. స్థూల ఇల్లు సూక్ష్మపునాదులకు కారణమైనట్లు, స్థూల విషయములు సూక్ష్మ జ్ఞానవిషయమునకు మూలాధారముగాయున్నవి.

స్థూల, సూక్ష్మ విషయములు ఆధ్యాత్మికములో చాలా ముఖ్యమైనవి. అందువలన ఈ గ్రంథము మొదటిలోనే స్థూల, సూక్ష్మములను గురించి మహాజ్ఞాని అయిన జిబ్రయేల్ ముహమ్మద్ ప్రవక్తగారితో 3వ సూరా, 7వ ఆయత్‌నందు ఇలా అన్నాడు. **(3-7) "నీపై ఈ గ్రంథమును అవతరింప జేసిన వాడు దేవుడే. ఇందులో సుస్పష్టమైన స్థూల విషయములు (ముహ్కమాత్ విషయములు) ఉన్నాయి. అవి గ్రంథానికి మూలము మరికొన్ని బహు విధ భావములతో కూడుకొన్న సూక్ష్మ విషయములు (ముతషాబిహాత్ విషయములు) ఉన్నాయి. హృదయములో వక్రత యున్నవారు ఇందులోని సూక్ష్మవచనముల (ముతషాబిహాత్ వచనముల) వెంటపడి ప్రజలను తప్పుదారి పట్టించటానికి ప్రయత్నిస్తారు. తమ ఉద్దేశములకు సరిపడునట్లు అర్థములను చెప్పుతారు. నిజానికి ముతషాబిహాత్ (సూక్ష్మ వచనముల) వాస్తవ అర్థము దేవునికి తప్ప మరెవరికీ తెలియదు. అయితే జ్ఞానములో పరిపక్వత పొందిన వారు మాత్రము "మేము వీటిని విశ్వసించాము. ఇవన్నీ మా దేవుని తరపున వచ్చినవే!" అని అంటారు. వాస్తవానికి బుద్ధి, జ్ఞానము మీద శ్రద్ధగలవారు మాత్రమే హితబోధను గ్రహిస్తారు."**

అలీ ఇమ్రాన్ అను మూడవసూరాలో పై వాక్యము ఎంతో ముఖ్యమైనది. ఈ వాక్యమును అర్థము చేసుకోగలిగితే ఖుర్ఆన్ గ్రంథమును మనము అర్థము చేసుకొన్నామా లేదాయని తెలియగలదు. ఈ వాక్యముతో మనిషిలోని విచక్షణా జ్ఞానము పనిచేయుట వలన దైవగ్రంథమును అర్థము చేసుకొనుటకు వీలగును. తర్వాత ఇతరులు చెప్పు జ్ఞానము సరియైనదో కాదో కూడా గుర్తించవచ్చును. అంతేకాక దైవజ్ఞానములో ఏది స్థూల జ్ఞానమో, ఏది సూక్ష్మజ్ఞానమో కూడా తెలియవచ్చును. దేవుడు ప్రత్యేకించి

ఈ వాక్యమును చెప్పి తాను ప్రజలకు ఇచ్చిన దైవగ్రంథములలో స్థూల, సూక్ష్మములనబడు రెండు రకముల జ్ఞానము కలదని చెప్పాడు. దేవుని జ్ఞానము అందరికీ తెలిసే విధముగా స్థూలముగా కొంతయుండినా, ఎవరికీ తెలియని జ్ఞానముగా సూక్ష్మముగా ఎన్నో విషయములు గలవు. ఎవరు ఎన్ని విధముల దేవుని జ్ఞానమును వర్ణించి చెప్పినా, దేవుని సూక్ష్మమైన జ్ఞానము తమకు తెలుసునని వారి ఇష్టానుసారము, వారికి అనుకూలమైనట్లు వర్ణించి జ్ఞానమును చెప్పువారు గలరు. తమ అభిప్రాయమునకు సరిగా ఏమాత్రము శాస్త్రబద్ధత లేకుండా చెప్పు జ్ఞానము వలన దానిని వినిన వారు తప్పుదారి పట్టిపోవు అవకాశము గలదు. ఎవరు ఎన్ని చెప్పినా **దేవుని జ్ఞానము దేవునికి తప్ప మరి ఏ ఇతర మానవునికీ తెలియదు.** అయితే కొందరు మేము దేవుని జ్ఞానమును గ్రహించాము అని అనగలరు. వాస్తవముగా బుద్ధి, శ్రద్ధయున్నవారు దేవుని జ్ఞానమును గ్రహించగలరు అని తెలియుచున్నది.

ఈ వాక్యములో బాగా గమనించవలసిన విషయమేమనగా! దేవుని జ్ఞానము దేవునికి తప్ప ఎవరికీ తెలియదు అనుమాట చాలా గొప్పది. దీనినిబట్టి దేవుని జ్ఞానము భూమిమీద ఏ మనిషికీ తెలియదనియే చెప్పాలి. ఇక్కడొక ప్రశ్న కొందరికి రాగలదు. అదేమనగా! ప్రస్తుత కాలములో ఎందరో గురువులు, స్వామీజీలు తమకు ఎంతో జ్ఞానము తెలిసినట్లు బోధించుచున్నారు కదా! ఎందరో ఎంతో కాలము ధ్యానము చేసి తమ అనుభవముతో భూమిమీద జ్ఞానమును తెలియజేయుచున్నారు కదా! ఎందరో బోధకులు జ్ఞానమును బోధించుచుండగా, దేవుని జ్ఞానము దేవునికి తప్ప ఇతరులకు తెలియదని చెప్పితే, ప్రస్తుత కాలములో బోధించే వారందరికీ తెలియదనియేగా! అర్థము. అలా అయితే నేడు బోధించే

మనుషులకు ఎవరికీ దైవజ్ఞానము తెలియదా? అను ప్రశ్న వస్తుంది. దీనికి మీరేమంటారని అడుగవచ్చును. దానికి మా సమాధానము ఈ విధముగా గలదు. దేవుడు మొదట చెప్పితే తర్వాత అందరికీ తెలియును. తర్వాత దేవుడు చెప్పిన జ్ఞానమును ఇతరులకు చెప్పవచ్చును. అంతేగానీ దేవుని జ్ఞానమును ఎవరూ చెప్పలేరనీ, ఎవరికీ తెలియదని దేవుడు కూడా చెప్పలేదు కదా! శ్రద్ధ, బుద్ధియున్నవారికి నేను చెప్పిన జ్ఞానము తెలియునని చెప్పాడు కదా! ఒక ఆధ్యాత్మిక విషయము లేక ఆధ్యాత్మిక జ్ఞానము ఏదయినా మొదట దేవుడు చెప్పనిదే ఎవరికీ తెలియదు. దేవుని జ్ఞానము దేవునికి తప్ప ఏ మనిషికీ తెలియదు. దేవుని జ్ఞానము దేవునికే తెలిసియుంటుంది. ఎందుకనగా! దేవున్ని ఎవరూ చూడలేదు. అటువంటప్పుడు దేవుడు ఫలానాయనిగానీ, ఇట్లున్నాడని గానీ, ఆయన విషయమిదియనిగానీ ఎవరికీ తెలియదు కదా! అందువలన దేవుడు తన విషయమును తానే మొదట చెప్పవలసియుండును. దేవుడు ఒకమారు చెప్పితే దానిని ఇతర మనుషులు తెలుసుకొనవచ్చును. తెలిసినదానినే ఇతరులకు చెప్పవచ్చును. దేవుడు చెప్పనిదే ఎవరికీ తెలియదని చెప్పాము. దేవుడు చెప్పిన తర్వాత దానినే ఎవరు ఎవరికయినా బోధించుకోవచ్చును. ఒకమారు దేవుడు చెప్పనిదే ఏ మనిషీ స్వయముగా దేవుని జ్ఞానమును చెప్పలేడు. సాధారణ మానవుడు గురువని గానీ, స్వామియనిగానీ, ఏ విధమైన పేరునయినా పెట్టుకోవచ్చును, అంతమాత్రమున అతను స్వయముగా దేవుని జ్ఞానమును చెప్పునని చెప్పలేము.

ఇక్కడ మరియొక ప్రశ్న రావచ్చును. అదేమనగా! దేవుడు ఒకమారు తన జ్ఞానమును తెలియజెప్పినా, దానిని నేడు బోధించువారందరికీ సరిగా తెలిసిందా? లేక కొద్దిగా తెలిసిందా? లేక ఏమాత్రము అర్థముకాని

వారున్నారా? అందరూ దేవుని జ్ఞానమును సక్రమముగా బోధించుచున్నారా? అని ప్రశ్నించవచ్చును. దానికి మా జవాబు ఈ విధముగా కలదు చూడండి. దేవుడు చెప్పిన భగవద్గీతా జ్ఞానము, బైబిలు జ్ఞానము, ఖుర్ఆన్ జ్ఞానము ప్రస్తుత కాలములోయుండినా, ఆ మూడు గ్రంథములు దైవగ్రంథములే అయినా, మూడు గ్రంథములలో ఒకే దేవున్ని గురించిన జ్ఞానముండినా నేడు బోధించువారు మూడు గ్రంథములు వేరు వేరు మతములవనీ, వేరు వేరు దేవుళ్ళవనీ, అందులోని జ్ఞానముకూడా వేరువేరుగా యున్నదనీ చెప్పుకోవడమునుబట్టి దేవుడు చెప్పినది వీరికి ఏమాత్రము అర్థము కాలేదని చెప్పవచ్చును. దేవుడు చెప్పినది సరిగా తెలిసియుంటే మూడు గ్రంథములను ఒకే జ్ఞానముగా చెప్పెడివారు. అట్లు కాకుండా మూడు మతములుగా విభజించి మూడు జ్ఞానములుగా చెప్పుచున్నారంటే వారికి సక్రమముగా తెలియలేదనియే చెప్పాలి. హృదయములో వక్రతయున్నవారు దేవుడు చెప్పినది చెప్పక తమ సొంత భావములను చేర్చి చెప్పడము వలన అది దారితప్పిన జ్ఞానమగును. శాస్త్రబద్ధత లేని జ్ఞానమగును. అప్పుడు దానిలో సంశయములే ఉండునుగానీ జవాబులు ఉండవు. అటువంటి జ్ఞానము చేత ప్రజలు తప్పుదారి పట్టిపోవుదురుగానీ జ్ఞానులుగా మారలేరు.

దేవుడు చెప్పిన గ్రంథములలో స్థూలమయిన వాక్యములు గలవు, అట్లే సూక్ష్మమైన వాక్యములు గలవు. సూక్ష్మమైన వాక్యములలోని జ్ఞానము దేవునికి తప్ప ఎవరికీ తెలియదు. ఇప్పుడు ఇక్కడ ఒక ప్రశ్న రాగలదు, అదేమనగా! దేవుని గ్రంథములలోని సూక్ష్మమైన వాక్యముల వివరము దేవునికి తప్ప ఏ మనిషికీ తెలియనప్పుడు, దేవుడు వచ్చి చెప్పనప్పుడు దేవుని జ్ఞానము మనుషులకు ఎలా తెలుస్తుంది? అని ప్రశ్నించవచ్చును. దానికి మా జవాబు ఇలా కలదు చూడండి. ఖుర్ఆన్ గ్రంథములో **3వ**

**సూరా, 7వ ఆయత్‌నందు "జ్ఞానములో పరిపక్వత చెందినవారు మేము వీటిని నమ్ముచున్నాము. ఇవన్నియూ దేవునివద్దనుండి వచ్చిన వాక్యములే అంటారు. బుద్ధి, శ్రద్ధ యున్నవాడు మాత్రమే దేవుని జ్ఞానమును గ్రహించ గలుగుతాడు"** అని వున్నది. ఇక్కడ మనము కొద్ది లోతుగా ఆలోచించక పోతే ఈ వాక్యములోని విషయము ఏమాత్రము అర్థముకాదు. అందువలన ఈ విషయమును లోతుగా ఆలోచించాలని చెప్పాము. శ్రద్ధ, బుద్ధియున్న వాడు గ్రహించును అను వాక్యమును చూస్తే గ్రహించువాడు గ్రంథములో చూచి గ్రహించలేడు అని తెలిసిపోయినది. గ్రంథములోని సూక్ష్మవాక్యము లకు అర్థము ఏ మనిషికీ తెలియదు. వాటి భావము దేవునికి తప్ప ఏ మానవునికీ తెలియదు అని జిబ్రయేల్ చెప్పినట్లు గ్రంథములయందుగల సూక్ష్మవాక్యములు ఎవరికీ తెలియడము లేదు. అయితే బుద్ధి శ్రద్ధయున్న వారు గ్రహించగలరు అని కూడా చెప్పియున్నారు. అటువంటప్పుడు ఎలా గ్రహించుతారు? అని ఆలోచించక తప్పదు. అప్పుడు ఒకే మార్గమున్న దని దేవుని జ్ఞానము దేవునికే తెలియును కావున, వాటిని దేవుడు చెప్పినప్పుడు మాత్రమే మనిషి గ్రహించగలుగు అవకాశమున్నదని తెలియుచున్నది.

దేవుని జ్ఞానము దేవునికే తెలియునప్పుడు దేవుడు స్వయముగా చెప్పితేనే మనుషులు గ్రహించగలరు తప్ప ఇంక ఇతర మార్గమే లేదని తెలియుచున్నది. ఒక సూత్రము ప్రకారము దేవుడు ప్రత్యక్షముగా ఎవరితోనూ మాట్లాడడు. అదే విషయమునే ఖుర్‌ఆన్ గ్రంథములో 42వ సూరా 51వ ఆయత్‌నందు చెప్పడమైనది. ఈ వాక్యము ప్రకారము దేవుడు వచ్చి చెప్పడు, అలా అయితే మనిషి ఎలా గ్రహించగలుగుతాడు? అను ప్రశ్నకు తప్పనిసరిగా దేవుడు చెప్పవలసిందేగానీ, ఇతరులకు తెలియదు

కావున ఇతరులు చెప్పుటకు అవకాశమే లేదు. అయితే ఇటువంటి చిక్కు సమస్యలను దేవుడే పరిష్కరించాలి, కావున దేవుడు దేవునిగా చెప్పకుండా దేవుడు మారువేషములో వచ్చి చెప్పితే, ఒక విధముగా దేవుడే స్వయముగా చెప్పినట్లాయుండును. మరొక విధముగా చెప్పినవాడు దేవుడు కాదు కదా! చెప్పినది ఎవరో అన్నట్లు యుండును. అందువలన దేవుడు దేవునిగా రాకుండా, దేవుడు ఎట్లుండువాడు అట్లేయుంటూ, తనలోని ఒక అంశను మారువేషములో ఇతను దేవుడు అని ఎవరూ గుర్తుపట్టనట్లు చేసి, భూమిమీద మనుషుల మధ్యలోనికి పంపుచున్నాడు. ఇప్పుడు పంపినవాడు దేవుడే, వచ్చినవాడు దేవుడే. దేవుడు సముద్రములాంటివాడు. మారువేషములో వచ్చిన దేవుడు సముద్రములోనుండి బయటికి ఎగిరిపడిన నీటి బిందువు లాంటివాడు. ముఖ్యముగా గమనించవలసినది ఏమంటే సముద్రములో యున్నదీ నీరే, ఎగిరి పడిన బిందువులో ఉండునదీ నీరే. అదే విధముగా దేవుడూ, మారువేషములోయున్న దేవుడూ ఇద్దరూ ఒకటే. సముద్రములోని నీరు, ఎగసిపడిన బిందువులోని నీరు రెండూ ఒకే లక్షణము కల్గియున్నట్లు విశ్వవ్యాపి అయిన దేవుడు, మారువేషములో మనిషివలె వచ్చిన దేవుడు ఇద్దరూ ఒకే లక్షణములు కల్గియున్నారు. ఒకే జ్ఞానము కల్గియున్నారు.

దేవుడు కనిపించకయుండువాడు అట్లేయుంటూ ఆయన నుండి కనిపించువాడు బయటికి వచ్చి మాట్లాడి మనుషులకు జ్ఞానమును చెప్పుచున్నాడు. అలా దేవుడే ఏదో ఒక ఉపాయముతో తన ధర్మములకు భంగము కలుగకుండా సాకారరూపముగా ప్రపంచములోనికి వచ్చి తాను స్వయముగా చెప్పవలసిన వాటిని తానే చెప్పిపోవును. అప్పుడు కనిపించి చెప్పినవాడు దేవుడని ఎవరూ నమ్మరు మరియు నమ్మలేరు. నిరాకారమైన దేవుడు సాకారరూపముతో వచ్చి మనుషులకు తెలియని జ్ఞానమును

చెప్పినప్పుడు దానిని మనిషి గ్రహించగలుగుచున్నాడు. బుద్ధి, జ్ఞానము గలవారు మాత్రమే దేవుడు మనిషిగా వచ్చి చెప్పిన మాటలను గ్రహించ గలుగుచున్నారు. అదే విషయమునే 3వ సూరా, 7వ ఆయత్‌నందు చివరిలో వ్రాశారు. అయితే ముస్లీమ్ సమాజములో దేవుని మీద గొప్ప భావము ఉండుట వలన దేవుడు మనిషిగా రాడు అని వారు గట్టిగా చెప్పుకోవడము జరుగుచున్నది. వారి పెద్దలు దేవుడు మనిషిగా అవతరించడు అని చెప్పి యుండుట వలన అదే సత్యమని ముద్రవేసుకొని ఇతరులు ఎవరు చెప్పినా నమ్మేస్థితిలో లేరు. మేము మనిషి దేవుడుకాడు గానీ, దేవుడు మనిషిగా మారగలడు అని చెప్పుచున్నాము. దేవుడు మనిషిగా రాడు అని ముస్లీమ్‌లు అంటున్నారు. మేము మనిషి దేవుడు కాలేడుగానీ, దేవుడు మనిషిగా రాగలడని చెప్పుచున్నాము. మేము ఏ మనిషీ దేవుడు కాడు అని చెప్పి తర్వాత దేవుడు మనిషిగా రాగలడు అని చెప్పితే మనిషిని దేవుడని చెప్పినట్లే కదా!యని కొందరడుగవచ్చును. ఇక్కడ కొందరు తికమక పడి మేము చెప్పినదే తప్పని అనుకోవచ్చును. అయితే మేము చెప్పుదానిలో కొంత ప్రత్యేకతయున్నది. మనిషి దేవుడుగా వస్తాడు అంటే అది తప్పగును అశాస్త్రీయమగును. దేవుడు మనిషిగా వస్తాడు అంటే అది ధర్మమగును. దేవుడు చెప్పినమాట నెరవేరినట్లగును. శాస్త్రీయమగును. దేవుడు మనిషిగా రాడు అంటే దేవుడు ఆ మాటను ఒప్పుకోడు. అంతేకాక ఖుర్‌ఆన్ గ్రంథములో దేవుడు చెప్పినమాటకు వ్యతిరేఖముగా చెప్పినట్లగును. ఖుర్‌ఆన్ గ్రంథములో 89వ సూరాలో 22వ ఆయత్‌నందు **(89-22) "దేవదూతలు బారులు తీరియుండగా దేవుడు అవతరిస్తాడు"** అని కలదు. ఎవరికీ కనిపించని దేవుడు కనిపిస్తూయుంటే దేవదూతలయినవారు ఆయనను చూచి ఆయన మీద గౌరవముతో భక్తి, భయముతో వరుసగా నిలబడి

యుందురని అర్థమగుచున్నది. ఖుర్‌ఆన్ వాక్యమునుబట్టి దేవుడు మనిషిగా రాగలడని నమ్ముచున్నాము. ఆయన తన భక్తులయిన వారికి తన జ్ఞానమును చెప్పు నిమిత్తమే మనిషిగా భూమిమీదికి వస్తాడు. ధర్మసంస్థాపన నిమిత్తము ప్రతి యుగమునందు నేను పుట్టుచుందునని భగవద్గీతలో చెప్పుచూ **"ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే"** అని అన్నాడు. ఖుర్‌ఆన్‌లో కూడా "తన సేవకులయిన దూతలు వరుసగా నిలబడియుండగా దేవుడు అవతరిస్తాడు" అని మహాజ్ఞాని జిబ్రయేల్ చెప్పాడు.

89వ సూరా, 21వ ఆయత్‌నందు స్థూలమైనవాక్యము కాకుండా సూక్ష్మమైన వాక్యము గలదు. అది ఇలా **(89-21) "భూమిని ఎడాపెడా దంచి తుత్తునియలుగా చేయుటం జరిగినప్పుడు మీ ప్రభువు అవతరిస్తాడు"** అని గలదు. "భూమిని దంచి పిండిపిండిగా లేక ముక్కలు ముక్కలుగా చేయటము జరిగినప్పుడు" అను విషయమును స్థూలముగా భూమిని దంచి పగుల గొట్టడము అని అర్థము. దేవుని అవతరణకు భూమిని ఎడాపెడా దంచి తుత్తునియలు చేయడమునకు ఏమిటి సంబంధమని ప్రశ్నించితే ఎవరూ సమాధానమును చెప్పలేరు. ఈ వాక్యమునకు స్థూల భావమునకు ఏమాత్రము సరిపోదు. అక్కడ ఏదో మరుగుపెట్టి చెప్పడమైనదని అర్థమగుచున్నది. మరుగుపెట్టిన లేక దాచిపెట్టి చెప్పిన విషయమేమని చూడంగా చూడంగా కొంత కాలమునకు అది అర్థముకాగలదు. ఆ వాక్యములోని విషయమును కొంచెము గుహ్యముగా (రహస్యముగా) చెప్పుట కొరకు భూమిని దంచి తునకలు చేసినప్పుడు దేవుడు అవతరిస్తాడు అను వాక్యమును ఆలోచించి చూడగా చూడగా ఎప్పుడో ఒకప్పుడు అందులోని నిజము తెలియగలదు. ఎవరికి ఎప్పుడు తెలియగలదోగానీ, నాకు వెంటనే ముందే నాలోయున్న భావమునకు ఆ

వాక్యము సరిపోయినది. శ్రద్ధలేని వారికి సులభముగా అర్థము కాకూడదని వాక్యము యొక్క రూపమును మార్చి చెప్పారు.

సకల వృక్ష, లతల, చెట్ల జాతులన్నియూ భూమినుండే పుట్టుచున్నవి. అట్లే సకల మానవులు, జంతువులు తల్లిగర్భమునుండి పుట్టుచున్నవి. సకల వృక్ష జాతులకు పుట్టుక స్థానమైన భూమితో సమానముగా మానవజాతికి పుట్టుక స్థానమైన తల్లిగర్భమును పోలికగా పోల్చి, తల్లిగర్భమును భూమిగా పై వాక్యములో చెప్పడమైనది. తల్లి శిశువును ప్రసవించునప్పుడు గర్భాశయములోని గర్భసంచి (మావి) ముక్కలుగా పగిలిపోయి అందులోని శిశువు ప్రసవింపబడుచున్నాడు. మావి (గర్భసంచి) ముక్కలుగా చీలి పోవడమును "భూమిని దంచి తుత్తునియలు చేయడము జరిగినప్పుడు" అని పోల్చి చెప్పారు. అప్పుడే నీ ప్రభువు అవతరిస్తాడు. (నీ దేవుడు ఉద్భవిస్తాడు) అని చెప్పారు. దీనిలోని రహస్య అర్థము ఏమంటే దేవుడు గర్భస్థ శిశువుగా పుట్టుతాడనీ లేక దేవుడు ఒక మనిషిగా తల్లిగర్భమున జన్మించుతాడనీ తెలియుచున్నది. దేవుడు భూమిమీద పుట్టినా, దేవుడు మొదట ఎట్లున్నాడో అట్లే ప్రపంచమంతా వ్యాపించి ఎవరికీ తెలియకుండా యున్నాడు. అయితే దేవుడు సాకారముగా ఒక మనిషిగా పుట్టినా, ఆ జన్మను దేవుడేయని అనాలి. ఇక్కడ సృష్ట్యాదినుండి ఎవరికీ కనిపించక యున్న దేవుడూ ఉన్నాడు. అదొకరకము. ఇంకొక రకము, అప్పుడప్పుడు భూమిమీద జన్మించి కనిపించు దేవుడూ యున్నాడు. ద్వాపరయుగములో కృష్ణుని జన్మవద్ద అదే జరిగినది. కృష్ణుడు కనిపించే దేవుడు. పరమాత్మ కనిపించని దేవుడు. దీనితో దేవునికి సాకారము, నిరాకారము అని రెండు ఆకారములు గలవని తెలియుచున్నది. నిరాకారములోని దేవుడు తల్లిగర్భము నుండి పుట్టవలసిన పనిలేదు. సాకారమైన దేవుడు తల్లిగర్భము నుండి

పుట్టవలసి వస్తున్నది. అలా పుట్టిన వానిని ప్రత్యేకమైన పేరుతో పిలువడము ఆధ్యాత్మికములో గలదు.

దేవునికి రెండు ఆకారములుయున్నా నిరాకారము శాశ్వతమైనది. సాకారము అశాశ్వతమైనది. సాకారముగా వచ్చిన దేవుడు కొంతకాలము సాకారముగాయుండి తర్వాత చాలాకాలము కనిపించకుండా పోవును. సాకార రూపముగా దేవుడు పుట్టుటకు వేలు లేక లక్షల సంవత్సరములు పట్టవచ్చును. ధర్మస్థాపన అవసరమైనప్పుడు మాత్రమే దేవుడు సాకారముగా యుండి చెప్పుటకు జన్మించవలసియున్నది. దేవునికి చావుగానీ, పుట్టుకగానీ లేవు. అయితే సాకారమున చావు పుట్టుక రెండూయున్నవి. అయితే సాకారములో దేవునికి పుట్టుక చావు రెండూ ఉన్నాయి కదా! అని ఎవరయినా అడుగవచ్చును. దానికి మా జవాబు ఏమనగా! దేవుడు సాకారమున పుట్టినప్పుడు ఆయనను దేవుడు అని చెప్పడము లేదు. జన్మలోయున్న దేవున్ని **"భగవంతుడు"** అను ప్రత్యేకమైన పేరుతో పిలుస్తున్నాము. దేవుడు భగవంతుడే అయినా, భగవంతుడు దేవుడే అయినా జన్మలోయున్న వానిని దేవుడు అని చెప్పుటకు వీలులేదు. శరీరముతో యున్న దేవున్ని భగవంతుడేయనాలి గానీ దేవుడు అని అనకూడదు. భగవంతునికి జన్మయున్నదిగానీ, దేవునికి జన్మలేదు. ఇక్కడ మేము చెప్పిన విషయమునే ప్రథమ దైవగ్రంథమయిన భగవద్గీతలో స్వయముగా భగవంతుడే ఈ విధముగా చెప్పుచున్నాడు. క్రింది శ్లోకములో చూడండి. భగవద్గీతలో జ్ఞానయోగము అను అధ్యాయమున ఆరవ (6వ) శ్లోకమందు ఇలా కలదు.

శ్లో॥ అజోపి సన్నవ్యయాత్మా భూతానా మీశ్వరోపిసన్ ।
ప్రకృతిం స్వామధిష్ఠాయ సంభవామ్యాత్మ మాయయా ॥

**భావము :-** "చావు పుట్టుకలేని వాడనయ్యూ, అఖిల జీవరాసులకు

దేవుడనయ్యూ, నా ప్రకృతిని ఉపయోగించుకొని నేను మాయ జన్మను (గుణములతో కూడిన శరీరముగల జన్మను) పొందుచున్నాను."

ఈ శ్లోకములో భగవంతుని వేషములోయున్న దేవుడు చెప్పు విషయము కలదు. భగవద్గీతను భగవంతుడు చెప్పినా అక్కడ మూడవ పురుషుడైన దేవుడే స్వయముగా చెప్పాడని **"మూడు గ్రంథములు, ఇద్దరు భగవంతులు, ఒక బోధకుడు"** అను గ్రంథములో వివరించి చెప్పుకొన్నాము. భగవద్గీతలోని దేవుని వాక్యము ప్రకారము దేవునికి చావుపుట్టుకలు లేవు. అంతేకాదు ఆయన సర్వప్రపంచమునకూ దేవుడు. అయినా ఆయన తన ప్రకృతిని ఉపయోగించుకొని ప్రకృతితో కూడిన శరీరమును ధరించి, గుణములతో కూడిన మనిషిగా పుట్టుచున్నాను అని చెప్పాడు. అలా పుట్టిన భగవంతుడు ధర్మసంస్థాపన చేయుటకే పుట్టానని అదే భగవద్గీతయందు చెప్పడమైనది. ప్రజలకు ధర్మములను తెలియజేయు కార్యమును దేవుడు భగవంతునిగా యున్నప్పుడు చేయునని తెలిసినది. అదే విషయమునే బుద్ధి, శ్రద్ధయున్నవాడు దేవుని జ్ఞానమును గ్రహించగలుగును అని ఖుర్‌ఆన్ గ్రంథములో చెప్పాడు. దేవుడు మనిషిగాయున్నప్పుడు మనిషికి అర్థము కాని విషయములను వివరముగా చెప్పును. అప్పుడు ఎవనికయితే బుద్ధి, శ్రద్ధయున్నదో వానికి మాత్రము ఆ విషయములు అర్థమగును. వాడే గ్రహించగలుగును. **ఖుర్‌ఆన్ గ్రంథములో 3వ సూరా, 7వ ఆయత్‌నందు, 89వ సూరా, 21, 22 ఆయత్‌లయందు దేవుడు మనిషిగా వచ్చి పుట్టునని స్థూలముగా కాకుండా సూక్ష్మముగా చెప్పియున్నాడు.** అయితే మనిషి స్థూల విషయములకే అలవాటుపడిపోయి సూక్ష్మవిషయమును పూర్తిగా వదలివేసిన దానివలన, ఖుర్‌ఆన్‌లో రెండుచోట్ల చెప్పిన మాటలు ముస్లీమ్‌లకు ఎవరికీ అర్థము కాకుండాపోయినవి.

దేవుడు తన గ్రంథములలో ఎంతో జ్ఞానమును చెప్పియున్నప్పటికీ, దానిని అర్థము చేసుకోలేనివారు కొందరు ఆ వాక్యములకు తప్పు అర్థమును చెప్పి ప్రజలను తప్పుదారి పట్టిస్తే దేవుడు ఓర్చుకోడు. ఆ తప్పుకు శిక్ష తప్పకుండాయుంటుంది. కొందరు దేవుడే దిగివచ్చి తన జ్ఞానమును వివరించి చెప్పినా అశ్రద్ధతో, అసూయతో దేవుడు చెప్పిన దానిని అర్థము చేసుకోకుండా తనకే తెలుసునను గర్వముతో, అహంకార భావముతో దేవుని వాక్యములకు అసత్య అర్థాలు చెప్పి ఇదే నిజమైన జ్ఞానమని ప్రజలను తప్పు భావములోనికి పంపువారిని దేవుడు గమనిస్తూయున్నాడు. అటువంటి వారికి శిక్ష తప్పదు. దేవుడు నేను శరీరమును ధరించి వచ్చి జ్ఞానమును చెప్పెదనని ఖుర్‌ఆన్ గ్రంథములో రెండుచోట్ల సూక్ష్మభావముతో కూడిన సూచనలు ఇచ్చియుండగా, ఆ రెండు ఆయత్‌లలోని భావములను అసత్యముగా మార్చి దేవుడు పుట్టడు అని స్థూల భావముతో ప్రచారమును చేశారు. అటువంటి వారి గురించి ఖుర్‌ఆన్ గ్రంథములో 41వ సూరా, 40వ ఆయత్‌నందు ఇలా చెప్పారు చూడండి. **(41-40) "మా వాక్యాల విషయములో వక్రవైఖరిని అవలంభించి అసత్యాలను మార్చి చెప్పువారిని మేము చూస్తూనేయున్నాము. అగ్నిలో పడవేయబడే వాడు మేలా? లేక ప్రళయదినాన సురక్షితముగా ప్రశాంత స్థితిలో వచ్చేవాడు మేలా? మీరు ఇష్టమొచ్చింది చేసుకొంటూపోండి. ఆయన మీరు చేసే పనులన్నిటినీ చూస్తూనేయున్నాడు."**

ఖుర్‌ఆన్‌లో ఈ వాక్యమును జిబ్రయేల్ ఎందుకు చెప్పాడో గమనించితే, ఖుర్‌ఆన్ గ్రంథములో సూక్ష్మమైన (ముతషాబిహాత్) వాక్యములు 75 శాతము ఉండుట వలన, ఈ గ్రంథములోని విషయములు అర్థము కాకపోవుటవలన, చాలామంది స్థూల భావముతో అర్థము చేసుకొని అది

సత్యమా! కాదా!యని చూడకుండా సూక్ష్మభావములకు అసత్యములైన స్థూల అర్థములను చెప్పు అవకాశము ఎక్కువగా యున్నది. అందువలన ముందూ వెనుకా చూడకుండా దైవ వాక్యములకు అసత్యమైన అర్థాలు చెప్పి అదే నిజమంటున్నారు. అటువంటివారికి శిక్ష తప్పదని ఈ ఆయత్‌లోని సారాంశము గలదు. **ఒక విషయమును వ్రాయుటకు ముందు లేక చెప్పుటకు ముందు ఆ విషయమున్న వాక్యము స్థూలమైనదా? లేక సూక్ష్మమైనదా?యని చూడవలసిన అవసరమున్నది. దేవుని జ్ఞానమంతయూ శాస్త్రబద్ధమైనదగుట వలన గ్రంథములోని ఒక విషయమును చెప్పుటకు ముందు తాను చెప్పునది శాస్త్రబద్ధమో కాదో చూడవలసిన అవసరమున్నది. రెండు కోణములలో జాగ్రత్తగా పరిశీలించిన తర్వాత తాను చెప్పు విషయము అసత్యము కానట్లు చూచుకోవలయును.** ఉదాహరణకు 3వ సూరా, 7వ ఆయత్‌ను గురించి వ్రాసినవారు, చెప్పినవారు అటువంటి మూడు నిబంధనలను గమనించకుండా వ్రాసినందున మిగతావారందరూ సూక్ష్మ విషయములను పూర్తి వదలివేసి అన్నిటినీ స్థూల భావముతోనే చూచుటకు మొదలు పెట్టారు. అందువలన ఖుర్‌ఆన్‌లోని విషయములు చాలా భాగము మనిషికి అర్థము కాలేదనియే చెప్పవచ్చును. ఉదాహరణకు **89వ సూరా, 21వ ఆయత్‌లో "భూమిని ఎడాపెడా దంచి తుత్తునియలుగా చేయడము జరిగినప్పుడు మీ ప్రభువు అవతరిస్తాడు"** అని యున్నప్పుడు భూమి అంటే ఏమిటి? ఎడాపెడా దంచడము అంటే ఏమిటి? తుత్తునియలు చేయడము అంటే ఏమిటి? అని ఎవరూ యోచించలేదు. అసలుకు ఈ వాక్యము స్థూల భావమునకు సంబంధించినదా లేక సూక్ష్మభావమునకు సంబంధించినదా! యని చూడలేదు. కొందరు స్థూలముగా భావించి భూమి బద్ధలగుటను ప్రళయములో జరుగు కార్యమని చెప్పారు. ప్రళయములో అంతా

నాశనమయి పోయినప్పుడు దేవుడు ఎందుకు అవతరిస్తాడు? అని ఎవరూ యోచించలేదు.

ఇక్కడ 89వ సూరా, 21వ వాక్యమును స్థూలముగా చూచుట వలన ఆ వాక్య వివరములో శాస్త్రీయత లేకుండా పోయినది. అంతేకాకుండా స్థూలభావ వివరణయంతయూ అసత్యముతో కూడుకొన్నదైపోయినది. ఇదే వాక్యమును సూక్ష్మభావముతో చూడగలిగితే దానికి చెప్పిన వివరమంతయూ సత్యముతో కూడుకొన్నదగును. అంతేకాక చెప్పిన విషయమంతయూ శాస్త్రబద్ధమైనదిగా ఉండును. ఉదాహరణకు ప్రత్యక్ష ప్రమాణ విషయమును ఒకదానిని తీసుకొని చూస్తాము. ఒక గర్భిణీ స్త్రీ ప్రసవ సమయములో గర్భకోశము యొక్క నొప్పితో బాధపడడమును చూస్తే 'భూమిని ఎడాపెడా దంచినట్లున్నది' అను వాక్యమునకు పూర్తిగా సరిపోవుచున్నది. హెచ్చు తగ్గులుగా వచ్చు ఆ బాధను ఎడాపెడా దంచినట్లున్నదనియే చెప్పవచ్చును. భూమిబద్దలై తుత్తునియలుగా మారినదనుమాట గర్భసంచి అయిన మావి పగిలిపోయి ముక్కలయినదను మాటకు సరిపోవును. శిశువు గర్భమునుండి ప్రసవింపబడు సమయమును వర్ణించుచూ, ఆ సమయములో తల్లి పడేవేదనను సమానముగా వర్ణించి, సమానమైన దానిని పోల్చి చెప్పడమును ఉదాహరణ అని చెప్పవచ్చును. ఉదాహరణలో చెప్పిన విషయము ఏముంది అని తెలియకుండా దాచిపెట్టి చెప్పడమును సూక్ష్మముగా చెప్పినట్లగును. ప్రసవమును, ప్రసవవేదనను వాక్యములో దాచి చెప్పడమును ఆ విషయమును చెప్పినట్లగును. అలా చెప్పిన విషయములను మూటగట్టి ముడివేసిన విషయములని చెప్పవచ్చును. ఆధ్యాత్మిక రంగములో అటువంటి విషయములు ఎక్కువగా చెప్పబడియున్నవి. అందువలన ఖుర్ఆన్ గ్రంథములో సూక్ష్మమైన వాక్యములు ఉన్నాయి అని ముందే మూడవ (3వ) సూరాలోనే జిబ్రయేల్ చెప్పాడు.

**'దేవుడు తల్లిగర్భమునుండి పుట్టును'** అను విషయమును చాటుగా మూటకట్టి ఇచ్చినట్లు **'భూమి పగిలి తునకలైపోయినప్పుడు దేవుడు ఉద్భవిస్తాడు'** అని చెప్పాడు. అక్కడ కొద్దిగా చాటుగా ఆ మాటను చెప్పి యుండడము వలన అది బుద్ధి, శ్రద్ధ లేనివారికి అర్థము కాకుండా పోయినది. బుద్ధి, శ్రద్ధయుండి జ్ఞానములో పరిపక్వత చెందిన వారు ఆ విషయము మాకర్థమయినదని అంటున్నారు. ఖుర్‌ఆన్‌లో చెప్పబడిన ఒక్క సూక్ష్మ వాక్యములోనే ఇంతగా తికమకపడిపోయి, అక్కడ వ్రాసిన దానిని అర్థము చేసుకోలేక పోయినందున, చాలామంది దేవుడు మనిషిగా పుట్టడు అంటున్నారు. దేవుడు మనిషిగా పుట్టకపోతే ఖుర్‌ఆన్ గ్రంథములో చెప్పిన 89వ సూరా, 21వ వాక్యమునకు విలువేలేదు. ఖుర్‌ఆన్ గ్రంథములో దాదాపు 75 శాతము వాక్యములు సూక్ష్మముగాయున్నట్లు తెలియుచున్నది. ఒక్క వాక్యమునే అసత్యముగా అర్థము చేసుకొన్నట్లు ఇప్పుడు మనకు అర్థమయినదంటే మిగతా ఎన్నో వాక్యములు కూడా అసత్యముగానే అర్థమయివుండునని అనుకోక తప్పదు.

ఇటువంటి విషయమునే మరొక దానిని చూచిన ఎడల ఖుర్‌ఆన్ గ్రంథము మనకు ఎంతవరకు అర్థమయినదో తెలియగలదు. ఖుర్‌ఆన్ గ్రంథములో 43వ సూరా 4వ ఆయత్‌ను చూచిన ఎడల ఇలా కలదు. **(43-4) "నిశ్చయముగా ఇది మాతృగ్రంథములో యున్నది. మా వద్ద అది ఎంతో ఉన్నతమైన వివేకముతో నిండిన గ్రంథముగాయున్నది." ఈ వాక్యముకంటే ముందు 3వ వాక్యములో "మీరు అర్థము చేసుకోవటానికి మేము దీనిని అరబ్బీ ఖుర్‌ఆన్‌గా వ్రాశాము"** అని కూడా కలదు. మొదట అరబ్ దేశములో ఖుర్‌ఆన్ గ్రంథము చెప్పబడినది. అక్కడి ప్రజలకు అరబ్బీ భాషే వచ్చును కనుక అక్కడి ప్రజలకు అర్థమయ్యే

దానికి ఖుర్‌ఆన్ గ్రంథమును అరబ్బీ భాషలోనే చెప్పడము జరిగినది. అరబ్బీభాషలో చెప్పిన ఖుర్‌ఆన్ గ్రంథము మాతృగ్రంథములో (తల్లి గ్రంథములో) యున్నది అని కలదు కదా! ఇక్కడ మాతృగ్రంథమంటే ఏదని ఎవరయినా ప్రశ్నించవచ్చును. దానికి జవాబు ఏమనగా! వాక్యము మొదటిలోనే 'నిశ్చయముగా ఇది మాతృగ్రంథములో ఉన్నది' అని ఉండుట వలన ఖుర్‌ఆన్‌కు ఒక మాతృ గ్రంథమున్నదని తెలియుచున్నది. ఇక్కడ బాగా గమనించవలసిన విషయమేమంటే, ఇది మాతృగ్రంథములోయున్నది అని చెప్పిన తర్వాత 'అది మా వద్ద ఎంతో ఉన్నతమైన వివేకముతో నిండిన గ్రంథముగా యున్నది' అని చెప్పారు. ఈ వాక్యములో ఇది (ఖుర్‌ఆన్) నిశ్చయముగా మాతృగ్రంథములో యున్నదని చెప్పారు. దీనికంటే ముందు 'ఖుర్‌ఆన్ గ్రంథమును అరబ్బీ భాషలోనే ఇచ్చాము' అని చెప్పారు. అందువలన రెండవ వాక్యములో ఖుర్‌ఆన్ గ్రంథమును ఉద్దేశించి ఇదియని చెప్పి మాతృగ్రంథములో యున్నది అన్నారు. అప్పుడు ఖుర్‌ఆన్ గ్రంథమువేరు, మాతృగ్రంథము వేరని ఎవరికయినా అర్థము కాగలదు. చివరిలో చెప్పినమాటలో "అది మావద్ద ఎంతో ఉన్నతమైన వివేకముతో నిండిన గ్రంథముగాయున్నది" అని చెప్పారు. రెండవమారు చెప్పిన వాక్యములో అది అని సంబోధించిన దానివలన ఖుర్‌ఆన్‌కు మాతృ గ్రంథమైన గ్రంథము అని అర్థమగుచున్నది. ఖుర్‌ఆన్‌కు మాతృగ్రంథముగా యున్న గ్రంథము ఎంతో గొప్పది అని చెప్పుచూ అది మావద్ద ఎంతో ఉన్నతమైన జ్ఞానముతో నిండియున్నది అని చెప్పారు. ఉన్నతమైన జ్ఞానముతో నిండిన గ్రంథము మాతృ గ్రంథమయినప్పుడు అది మావద్ద ఉన్న గ్రంథమే అని చెప్పినప్పుడు, అలా ఖుర్‌ఆన్‌కంటే ముందువున్న గ్రంథమేదియనీ, అది ఎప్పుడు తయారయినదనీ చూస్తే అది ఖుర్‌ఆన్‌కంటే

ముందు వచ్చిన ఇంజీలు గ్రంథముకంటే ముందేయున్న గ్రంథమని తెలియుచున్నది. అంతటితో ఆగక ఆ గ్రంథము ఎప్పుడు తయారయినదని ప్రశ్నించుకొని చూస్తే ఖుర్ఆన్‌కు మాతృగ్రంథము ఫలానాయని తేలిపోవుచున్నది.

ఖుర్ఆన్ గ్రంథముతో ఎక్కువగా ముడిపడియున్న ముస్లీమ్‌లకు ఖుర్ఆన్ యొక్క మాతృగ్రంథము ఏదో తెలిసిందా!యని వారిని ప్రశ్నించి అడిగితే వారికి అర్థమయిన విధానమే వేరని తెలిసిపోవుచున్నది. వారు ఏమాత్రము ఆలోచించకుండా ఒక నిర్ణయానికి వచ్చి ఆ నిర్ణయములోనే స్థిరముగా నిలిచిపోయారు. నేను వయస్సు మళ్ళిన ఒక ముస్లీమ్ పెద్దను ఖుర్ఆన్ యొక్క మాతృగ్రంథము ఏది? అని అడిగాను. అప్పుడతడు ఇలా చెప్పాడు "ఖుర్ఆన్ గ్రంథము మొదట చేతితో వ్రాయబడినది. మొదట శిలాఫలకములమీద చేతితో వ్రాయబడి నేటికినీ మక్కాలో అలాగే దాచి పెట్టబడినది. అలా వ్రాయబడిన గ్రంథమును అటుంచి దానినుండి మిగతా ఖుర్ఆన్ గ్రంథములను తయారు చేశారు. అలా మొదటనే వ్రాయబడిన శిలా ఫలకముల గ్రంథమును తల్లి గ్రంథము లేక మాతృ గ్రంథము అంటారు. అది ఎంతకాలమైనా మాతృగ్రంథముగా చెక్కు చెదరకుండా ఉంటుంది" అని అనడము మేము వినడము జరిగినది. ఆయనకు తెలిసినది ఆయన చెప్పాడు. ఆయన ఒక్కడేకాక మరికొంతమంది ముస్లీమ్ పెద్దలను అడిగినా అదే విధముగా చెప్పారు. వారి ఉద్దేశ్యములో మొదట వ్రాయబడిన ప్రతిని తల్లిగ్రంథమనీ, తర్వాత వ్రాయబడిన గ్రంథములన్నియూ పిల్లగ్రంథములనీ అనుకొన్నారు. ఇక్కడ కొంత ఆలోచిస్తే వారి నమ్మకమును ఎవరూ కాదనుటకు వీలులేదు, ఎవరి నమ్మకము వారిది. అలా కాకుండా సత్యమేమి అని ఆలోచిస్తే మరొక విధముగా తెలియగలదు.

వాక్యములో ఖుర్ఆన్‌కంటే వేరుగా యున్న గ్రంథమని, ఖుర్ఆన్ గ్రంథము కాదని తెలియుచున్నది. ఖుర్ఆన్ అరబ్బీభాషలో తయారు చేయబడినదని చెప్పినవారు ఇది మాతృగ్రంథములోనిదేయని చెప్పి అది అనగా మాతృగ్రంథము గొప్ప జ్ఞానముతో నిండినదని ప్రత్యేకముగా చెప్పారు. మాతృగ్రంథము ఖుర్ఆన్ గ్రంథముకంటే వేరైనదనీ, ఖుర్ఆన్ గ్రంథము కాదని ఆ మాటతో తెలిసిపోవుచున్నది.

మాతృగ్రంథమును గురించి ముస్లీమ్ పండితులు ఖుర్ఆన్ గ్రంథములోనే వారి అభిప్రాయములను ఈ విధముగా వ్రాశారు చూడండి. ***"మాతృగ్రంథము అంటే అసలైన గ్రంథము అని అర్థము. అంటే గతములో దైవప్రవక్తలందరి మీద అవతరింపజేసిన గ్రంథములన్నీ ఉద్భవించిన గ్రంథము అని అర్థము"*** ఈ మాటను గ్రహిస్తే వాస్తవమైన మాటగా యున్నది. ముహమ్మద్ ప్రవక్త ఆఖరి ప్రవక్తయైనప్పుడు, అంతకంటే ముందు వచ్చిన ప్రవక్తలందరిమీద అవతరింపజేసిన జ్ఞానముగల అసలు గ్రంథమని చెప్పినప్పుడు, ఖుర్ఆన్‌కంటే ముందు పుట్టిన గ్రంథముల జ్ఞానమంతయూ ఒకే ఒక మూలగ్రంథములోనిదనీ, అన్నిటికీ మూలగ్రంథమైనదే మాతృ గ్రంథమనీ చెప్పవచ్చును. ఒక గ్రంథములోని సారాంశమును ఆధారము చేసుకొని వేరువేరు గ్రంథములు ఎన్నివచ్చినా అన్నిటికీ తల్లిగ్రంథము లాంటిది మొదటి గ్రంథమని అందరికీ అర్థమయినది. అట్లు కాకుండా స్థూలముగా కనిపించే అక్షరములను ఆధారముగా చెప్పకూడదు. సూక్ష్మముగాయున్న జ్ఞానమును ఆధారము చేసుకొని మాతృగ్రంథమును గుర్తించవచ్చును. అన్నిటికంటే ముందు పుట్టినది, ప్రవక్తలందరికీ చెప్పిన జ్ఞానము ఎక్కడగలదో అదే తల్లి గ్రంథము.

సృష్ట్యాదిలోనే దేవుడు సూర్యునికి ఆకాశవాణి ద్వారా జ్ఞానమును చెప్పాడు. అదియే అన్నిటికంటే ముందుపుట్టిన జ్ఞానము. అదే జ్ఞానమే దేవుడు ఇంకా రెండు విధములుగా భూమిమీద ముగ్గురు ప్రవక్తల ద్వారా తెలియజేశాడు. బైబిలు గ్రంథములోని జ్ఞానమునకూ, ఖుర్ఆన్ గ్రంథములోని జ్ఞానమునకూ మరియు మొదటి గ్రంథమయిన భగవద్గీత గ్రంథములోని జ్ఞానమునకూ మొదట సృష్ట్యాదిలో చెప్పిన జ్ఞానమే ఆధారము. అందువలన ఆ మొదటి జ్ఞానమునే మాతృజ్ఞానమని చెప్పవచ్చును. మొదట చెప్పిన జ్ఞానమే తర్వాత తౌరాత్ గ్రంథముగా వ్రాయబడినది. ఆ తౌరాత్ గ్రంథమే బైబిలుకు, ఖుర్ఆన్‌కు ఆధారముగాయుండుట వలన దానినే అన్ని గ్రంథములకు మాతృగ్రంథముగా చెప్పవచ్చును. ఖుర్ఆన్ గ్రంథమందు స్వయముగా జిబ్రయేల్ తౌరాత్ గ్రంథమును గురించి చెప్పిన వాక్యములు ఎన్నో గలవు. వాటిని ఇక్కడ గమనించితే తౌరాత్ గ్రంథము యొక్క విశిష్ఠత తెలియును. ఖుర్ఆన్ గ్రంథములో 5వ సూరా, 46వ ఆయత్ నందు ఇలా కలదు చూడండి. **(5-46) "ఆ ప్రవక్తల తర్వాత మేము మర్యమ్ (మరియమ్మ) కుమారుడు ఈసాను (ఏసును) పంపాము. అతను తనకు పూర్వము వచ్చిన తౌరాతు గ్రంథమును సత్యమని ధృవీకరించే వాడు. మేము అతనికి ఇంజీలు (బైబిలు) గ్రంథాన్ని ఇచ్చాము. అందులో (బైబిలులో) మార్గదర్శకమూ, జ్యోతీ ఉండేవి. అది తనకు ముందున్న తౌరాతు గ్రంథమును ధృవీకరించేది. అంతేకాక అది దైవభీతి కలవారికి మార్గదర్శినిగా, హితబోధినిగా ఉండేది."** ఇక్కడవున్న ఒక వాక్యమును చూస్తూనే తౌరాతు గ్రంథమంటే ఏమిటి? అని తెలిసిపోవుచున్నది. ప్రపంచములో మూడు దైవగ్రంథములు గలవు. వాటిని అనుసరించి **ఇందూ, ఇస్లామ్, క్రైస్తవ** అను మూడు

సమాజములున్నవి. ఈ వాక్యములో ఏసును పంపి అతని ద్వారా బైబిలు గ్రంథమును ప్రజలకు ఇచ్చినట్లు గలదు. బైబిలు గ్రంథము రెండువేల సంవత్సరముల పూర్వము మనుషుల మధ్యలోనికి వచ్చినట్లు తెలుసు. దానికంటే మూడువేల (3000) సంవత్సరముల ముందు కలియుగము మొదటిలో ద్వాపరయుగము చివరిలో భగవద్గీత గ్రంథము వచ్చిన విషయము అందరికీ తెలుసు. ఇక్కడ చెప్పిన తౌరాతు గ్రంథము ఏది?యని చూచినట్లయితే అన్ని విధములా భగవద్గీత గ్రంథమేయని తెలియుచున్నది. బైబిలు గ్రంథముకంటే ముందున్న గ్రంథము భగవద్గీత తప్ప ఏదీ లేదు. అందువలన భగవద్గీతయే తౌరాతు గ్రంథమని చెప్పవచ్చును. భగవద్గీతలో యున్న జ్ఞానమే బైబిలులో ఉండుట వలన బైబిలు తనకు ముందున్న భగవద్గీతను ధృవీకరించుచున్నదని తెలియుచున్నది. అంతేకాక తౌరాతు అంటే భగవద్గీతయనీ తెలియునట్లు తౌరాతు పదమునకు అర్థము భగవద్గీతతో సరిపోవుచున్నది.

ఖుర్‌ఆన్ గ్రంథములో మిగతా చోట్ల కూడా తౌరాత్ అను పేరుతో కొన్ని వాక్యములు గలవు. ఆ వాక్యములన్నీ సరియైన భావముతో అర్థమగుటకు తౌరాతు అని చెప్పబడిన చోటంతా భగవద్గీతను ఆ స్థానములో ఉంచుకొని చదువుకోవలెను. తౌరాతు స్థానములో భగవద్గీతను ఉంచుకొని చెప్పుకోవడము వలన అన్ని రకముల దైవభావము సరిపోవును. ఇప్పుడు ఇంకా తౌరాతు అను పేరుతోయున్న వాక్యములను ఇక్కడ చెప్పుకొందాము. **5వ సూరా, 48వ వాక్యములో "మేము నీవైపుకు ఈ గ్రంథాన్ని (ఖుర్‌ఆన్‌ను) సత్యసమేతముగా అవతరింపజేశాము. ఇది తమకన్నా ముందు వచ్చిన గ్రంథాలను సత్యమని ధృవీకరిస్తున్నది. నీ వద్దకు వచ్చిన సత్యమును వీడి వారి మనోవాంఛలను అనుసరించకు"**

అని గలదు. మరియొక చోట 5వ సూరాలోనే 68వ ఆయత్‌నందు ఇలా కలదు చూడండి. **(5-68) "ఓ గ్రంథవహులారా! మీరు తౌరాతునూ, ఇంజీలునూ (భగవద్గీతను, బైబిలును) మీ ప్రభువు తరఫున మీవద్దకు పంపబడిన దానినీ (ఖుర్ఆన్ గ్రంథమును) మీ జీవితాలలో నెలకొల్పు వరకు మీరు ఏ ధర్మముపైనా లేనట్లే"** అని కూడా చెప్పారు. ఇంకా 5వ సూరా, 44వ ఆయత్‌నందు పూర్తి ఇలా వ్రాయబడియుంది. **(5-44) "మేము తౌరాతు గ్రంథమును అవతరింపజేశాము. అందులో మార్గ దర్శకత్వము, జ్యోతి ఉన్నాయి. ఈ తౌరాతు గ్రంథ ఆధారముగానే ముస్లిమ్‌లైన ప్రవక్తలు, రబ్బానీలు, ధర్మవేత్తలు, యూదుల సమస్యలను పరిష్కరించే వారు"** అని కలదు. అంతేకాక 62వ సూరాలో, 5వ ఆయత్‌నందు ఇలా కలదు. **(62-5) "తౌరాతు గ్రంథము ప్రకారము ఆచరించాలని ఆదేశించినప్పటికీ, దానికి అనుగుణముగా ఆచరించనివారు ఎన్ని గ్రంథములను అనుసరించినా, అటువంటి వారిని ఎన్నో గ్రంథములను వీపుమీద మోయు గాడిదలాంటి వారని ఉపమానముగా చెప్పవచ్చును. దేవుని వాక్యములను ధిక్కరించిన వారి దృష్టాంతము చాలా చెడ్డది. దుర్మార్గపు జనులకు అల్లా సన్మార్గము చూపడు"** అని వ్రాయబడి యున్నది. ఈ వాక్యములన్నిటినీ గమనించి 68వ వాక్యమును చూస్తే అందులో తౌరాతు గ్రంథము తెలియక పోతే మరియు బైబిలు, ఖుర్ఆన్ గ్రంథముల ధర్మములు తెలియకపోతే ఏ ధర్మములో లేనట్లేయనగా వాడు ఏ మతమునకూ సంబంధించినవాడు కాడు అని చెప్పినట్లేయని గలదు. ఒక క్రైస్తవుడు తన గ్రంథముకాక దానికంటే ముందుగల తౌరాతు ధర్మములను తెలియకపోతే వాడు బైబిలు చదివినా అతడు క్రైస్తవుడు కానట్లేయని అర్థము. అలాగే ఒక ముస్లీమ్

తన గ్రంథమైన ఖుర్ఆన్‌ను చదివినప్పటికీ తౌరాతు గ్రంథములోని జ్ఞానమును తెలియకపోతే వాడు ముస్లీమ్ ధర్మములో లేనట్లేయగును. అప్పుడు వానిని పూర్తిగా ముస్లీమ్ అని చెప్పుటకు కూడా వీలులేదని పై 68వ ఆయత్‌లో చెప్పడమైనది. ఇంకా విశేషమేమంటే తౌరాతు గ్రంథమును అనుసరించక మిగతా గ్రంథములను చదివినా లేక వాటిని అనుసరించినా గ్రంథములను వీపుమీద మోయు గాడిదలాంటివానిగా ఖుర్ఆన్ గ్రంథము 62వ సూరాలో 5వ వాక్యములో కలదు. దీనిప్రకారము క్రైస్తవుడుగానీ, ముస్లీమ్‌గానీ తప్పనిసరిగా వారి గ్రంథముకంటే ముందు వచ్చిన తౌరాతును (భగవద్గీతను) తప్పక తెలిసియుండాలి అని అర్థము. ఇక్కడ చెప్పినట్లే బైబిలు భగవద్గీతను ఇది సత్యమైన గ్రంథమని ధృవీకరించుచున్నది. అలాగే ఖుర్ఆన్ గ్రంథము కూడా భగవద్గీత దైవధర్మములు గల గ్రంథమని సాక్ష్యమిచ్చుచున్నది (ధృవీకరించుచున్నది). 5వ సూరా, 48వ వాక్యములో ఖుర్ఆన్ గ్రంథము తౌరాత్ గ్రంథమును ధృవీకరించినట్లు, 5-48లో బైబిలు తౌరాతు (భగవద్గీతను) సత్యమని ధృవీకరించినట్లు గలదు. బైబిలు, ఖుర్ఆన్ గ్రంథములు రెండూ భగవద్గీతను దైవగ్రంథమని ధృవీకరించు నిమిత్తము వచ్చాయి. అందువలన బైబిలుకు, ఖుర్ఆన్‌కు రెండిటికీ పుట్టినిల్లులాంటిది భగవద్గీతయని ఈ రెండు గ్రంథముల ద్వారా తెలియుచున్నది. ఖుర్ఆన్ గ్రంథములో తౌరాత్ ప్రస్తావన ఉండినప్పటికీ తౌరాత్ గ్రంథము ఏదో ఎవరికీ ఇంతవరకూ తెలియదు. తౌరాతు గ్రంథము ఏ భాషలో తయారయి నదో తెలియదు. ఇంతవరకు దానిని చూచినామని చెప్పువారు లేరు. ఎందుకనగా భగవద్గీతయే అన్నిటికంటే ముందు పుట్టిన తౌరాత్ గ్రంథమని ఎవరికీ తెలియదు.

తౌరాతు గ్రంథము ఖుర్‌ఆన్ గ్రంథమునకు మాతృగ్రంథమనీ, ఖుర్‌ఆన్‌లోని ముఖ్యమైన జ్ఞానమంతయూ భగవద్గీత లేక తౌరాతు గ్రంథములోనే కలదని, అందువలననే ఖుర్‌ఆన్ గ్రంథమునకు భగవద్గీత మాతృగ్రంథమయినదని చెప్పవచ్చును. బైబిలు 2000 సంవత్సరము లప్పుడు పుట్టినది. ఖుర్‌ఆన్ 1400 సంవత్సరములప్పుడు పుట్టినది. భగవద్గీత రెండు గ్రంథములకంటే ముందు ఇప్పటికి 5150 సంవత్సరముల క్రిందట పుట్టినది. అందువలన బైబిలు, ఖుర్‌ఆన్ గ్రంథముకంటే ముందు వచ్చిన తౌరాతు గ్రంథము భగవద్గీతేయని దృఢముగా చెప్పుచున్నాము. బైబిలు గ్రంథములోని జ్ఞానము, ఖుర్‌ఆన్ గ్రంథములోని జ్ఞానము భగవద్గీతలో ఉండుట వలన ఖుర్‌ఆన్‌లో చెప్పిన తౌరాతు గ్రంథము భగవద్గీతయేయని రుజువగుచున్నది. బైబిలులో ఆ గ్రంథమునకంతటికీ ఆధారమైన జ్ఞానమే, తండ్రి, కుమారుడు, పరిశుద్ధాత్మయనునదే యని చెప్పవచ్చును. అదే ముఖ్యమైన జ్ఞానమని ఎందుకు చెప్పుచున్నామనగా! తండ్రి, కుమారుడు, పరిశుద్ధాత్మ అను ముగ్గురితో కూడుకొన్న మాటలనే ప్రజలకు ఉపదేశముగా బోధించమని ఏసు తన శిష్యులకు చెప్పాడు. అందువలన అదే ఆ గ్రంథములో ముఖ్యమైన జ్ఞానమని చెప్పవచ్చును. అలాగే ఖుర్‌ఆన్ గ్రంథములో కూడా 50వ సూరా, 21వ ఆయత్‌లోనున్న జ్ఞానమే గ్రంథము పైకి గొప్ప జ్ఞానమని చెప్పవచ్చును. ఆ వాక్యములో తోలబడేవాడు, తోలేవాడు, సాక్షిగా చూచేవాడు అని ముగ్గురిని గురించే చెప్పారు. బైబిలులోని వాక్యము, ఖుర్‌ఆన్‌లోని వాక్యము రెండిటిలోనూ ముగ్గురిని గురించియున్నది. అయితే ఎవరూ గుర్తించలేని విధముగా ముగ్గురును రెండు గ్రంథములయందు వేరువేరుగా చెప్పియున్నారు. ఈ రెండు గ్రంథములలోని ముగ్గురు విషయమునే భగవద్గీతలో ముందే క్షరుడు,

అక్షరుడు, పురుషోత్తముడు అని చెప్పియున్నారు. గీతలో చెప్పిన ముగ్గురు పురుషుల జ్ఞానమే అందులో గొప్పది. ముఖ్యముగా ముగ్గురు పురుషుల జ్ఞానమును చెప్పుటకే భగవద్గీత తయారయి వచ్చినది. అదే ముగ్గురు పురుషులను బైబిలులో తండ్రి, కుమారుడు, పరిశుద్ధాత్మయని చెప్పడమైనది. అట్లే అదే ముగ్గురు పురుషులను గురించి ఖుర్ఆన్ గ్రంథములో తోలేవాడు, తోలబడేవాడే వాడు, సాక్షిగా చూచేవాడు అని చెప్పడము జరిగినది. దీనినిబట్టి భగవద్గీతలో చెప్పిన క్షర, అక్షర, పురుషోత్తముల జ్ఞానమునే బైబిలు, ఖుర్ఆన్ గ్రంథములు రెండూ ధృవీకరించుచున్నవని తెలిసి పోయినది. ఇదంతయూ గమనించిన తర్వాత భగవద్గీత జ్ఞానమే రెండు గ్రంథములలో ఉండుట వలన, రెండు గ్రంథములకు భగవద్గీత తల్లి గ్రంథమయినదని చెప్పవచ్చును.

అన్నిటికంటే ముందు తయారయిన గ్రంథము భగవద్గీతయని చెప్పితే కొందరు తమ అభ్యంతరమును తెలుపుచున్నారు. వారు ఇలా అడుగుచున్నారు. “5000 సంవత్సరముల క్రితము బైబిలు, ఖుర్ఆన్‌కంటే ముందు భగవద్గీత తయారయిన మాట వాస్తవమే. అయినా దానికంటే ముందు త్రేతాయుగములోనే రామాయణము తయారయినది కదా! ద్వాపర యుగము చివరిలో భగవద్గీత తయారయినది, ద్వాపరయుగములోనే భగవద్గీతకంటే ముందు నాలుగు వేదములు, పదునెనిమిది పురాణములు తయారయినవి కదా! అటువంటప్పుడు అన్నిటికంటే ముందు భగవద్గీత గ్రంథము తయారయినదని చెప్పుట అసత్యమగును కదా!యని” అడుగ వచ్చును. దానికి మా జవాబు ఈ విధముగా యున్నది చూడండి. త్రేతా యుగములో రామాయణము, ద్వాపరయుగములో వేదములు, ఉపనిషత్తులు గ్రంథములుగా తయారయినమాట వాస్తవమే. అవన్నియూ భగవద్గీతకంటే

ముందు తయారయిన గ్రంథములని మేము ఒప్పుకొంటున్నాము. అయితే ఇక్కడ మేము చెప్పిన మాటకూడా వాస్తవమే. ఎలాగంటే మేము చెప్పినది దైవగ్రంథములను గురించి, రామాయణముగానీ, వేదములుగానీ, ఉపనిషత్తులుగానీ అవి పూర్తి ఆధ్యాత్మిక గ్రంథములుకావు. వాటిలో ఎక్కడయినా కొంత ఆధ్యాత్మిక విషయములుండినా, ఎక్కువగా ప్రపంచ సంబంధ విషయములే అందులో ఉండుట వలన, వాటిని దైవగ్రంథములుగా చెప్పుటకు వీలులేదు. రామాయణమును, వేదములను, పురాణములను మనుషులు చెప్పినవే. అయితే భగవద్గీత స్వయముగా దేవుని అంశ అయిన భగవంతుడు చెప్పినది. అందువలన భగవద్గీత దైవగ్రంథమయినది. ఆధ్యాత్మిక గ్రంథములలో మొదట తయారయిన గ్రంథము భగవంతుడు చెప్పిన భగవద్గీత. తర్వాత రెండవ గ్రంథము భగవదంశ అయిన ఏసు చెప్పిన బైబిలు గ్రంథము, ఆ తర్వాత మూడవ గ్రంథము మహాజ్ఞాని అయిన జిబ్రయేల్ చెప్పిన ఖుర్ఆన్ గ్రంథము. అందువలన భగవద్గీతకంటే ముందు ఎన్ని గ్రంథములు తయారయినా అవన్నియూ దైవగ్రంథములుగా లెక్కింపబడవు. కావున దైవగ్రంథములలో ముందు పుట్టినది భగవద్గీతయేనని చెప్పవచ్చును. భగవద్గీతయే తౌరాతు గ్రంథము! భగవద్గీతయే బైబిలు, ఖుర్ఆన్‌కు మాతృగ్రంథము!

ప్రపంచములోని పన్నెండు మతములలో ముఖ్యమైనవి, పెద్దవి, దేవునిచేత జ్ఞానము పంపబడిన గ్రంథములు గలవి మూడే మూడు మతములు గలవు. అందులో పురాతనమైనది ఇందూమతముకాగా, రెండవది క్రైస్తవమతము, మూడవది ముస్లీమ్ మతము. అయితే నేడు జనాభా సంఖ్యనుబట్టి మొదటిదయిన ఇందూమతము మూడవదయినది. రెండవ దయిన క్రైస్తవము మొదటి స్థానములోనూ, మూడవదయిన ఇస్లామ్

రెండవ స్థానములోనూ ఉండడమైనది. ఏది ఎన్నో స్థానములోయున్నా ఇందూమతము పుట్టుకలో మొదటిది. జ్ఞానములో మిగతా రెండు గ్రంథములకు ఆధారమైనది. భగవద్గీతలో చెప్పిన జ్ఞానము మిగతా రెండు గ్రంథములలో ఉండును. గీతలో చెప్పిన దానికి బైబిలులోగానీ, ఖుర్ఆన్‌లో గానీ వ్యతిరేఖముగా ఉండదు. అట్లే బైబిలు, ఖుర్ఆన్‌లో చెప్పిన జ్ఞానమునకు వ్యతిరేఖముగా భగవద్గీతలో ఉండదు. మూడు గ్రంథములలో సమన్వయ జ్ఞానముండును. ఇప్పుడు కొందరు ఒక ప్రశ్నను అడుగవచ్చును, అదేమనగా! మీరు మూడు గ్రంథములలో ముఖ్యమైన జ్ఞానము, ముగ్గురు పురుషుల జ్ఞానమనీ, అదే మూడు ఆత్మల జ్ఞానమనీ చెప్పారు కదా! మీ మాట ప్రకారము మూడు గ్రంథములలో ముగ్గురు పురుషుల జ్ఞానముండినా, ఒక ఖుర్ఆన్‌లో మాత్రము 5వ సూరా 73వ ఆయత్‌లో కొంత వ్యతిరేఖత కనిపించినట్లున్నది. దీనికి మీరేమంటారు? అని అడుగవచ్చును. దానికి మా జవాబు ఇలా కలదు. ఒక గ్రంథములో వ్రాసినది మరొక గ్రంథములో వ్యతిరేఖముగా ఉండదని చెప్పాము కదా! అందువలన భగవద్గీతలో వ్రాసిన దానికి మిగతా రెండు గ్రంథములలో వ్యతిరేఖతయుండదు. 5-73లో చెప్పినమాటలో వ్యతిరేఖత ఏమీ లేదుగానీ అర్థము చేసుకోవడములో పొరపాటుపడుటకు అవకాశము గలదు. కొంత అజ్ఞానముచే క్రైస్తవములో ఏసును, ఏసుతల్లి మరియమ్మను, యెహోవాను ముగ్గురినీ దేవునిగా లెక్కించడము జరుగును. అట్లే హిందూమతములో విష్ణు, ఈశ్వర, బ్రహ్మలను ముగ్గురినీ దేవుళ్ళుగా కొందరు లెక్కించడము జరుగుచున్నది. దీనినిబట్టి దేవున్ని ముగ్గురుగా చెప్పకూడదని ఆ వాక్యములో చెప్పారు తప్ప ఇతర వ్యతిరేఖత ఏమీ లేదు. 5-73 వాక్యము ఇలా కలదు. **(5-73) "దేవుడు ముగ్గురుగా యున్నాడు అని అన్నవారు ముమ్మాటికీ తిరస్కారానికి**

**పాల్పడినట్లే, వాస్తవానికి దేవుడు ఒక్కడే తప్ప ముగ్గురు లేరు. వారుగనుక తమ మాటను మానుకోకపోయిన, వారికి దేవుడు ఒక్కడేయను మాటను తిరస్కరించువారికి బాధాకరమైన శిక్ష తప్పకయుంటుంది?"**

ఇక్కడ దేవుడు ఒక్కడుకాడు ముగ్గురు అనువారు దైవ తిరస్కారానికి పాల్పడినట్లేయగుననీ, దేవుడు ఒక్కడేయని చెప్పితే అది దైవ తిరస్కారము కాదు. దైవాన్ని అంగీకరించినట్లగును. మూడు గ్రంథములలోని ముగ్గురు పురుషులలో ఒకడే దేవుడని మిగతా ఇద్దరు పురుషులు దేవుడు కాదని చెప్పడములో తప్పులేదు కదా! త్రైత సిద్ధాంతములో మూడవవాడు మాత్రమే ఉత్తమ పురుషుడు. అతడు మాత్రమే దేవుడు, అతడే పరమాత్మ, అతడే ఆరాధించదగినవాడు అని చెప్పడములో ఏమీ తప్పులేదు కదా! అయితే కొన్ని ఖుర్ఆన్ గ్రంథములలో 5-73వ వాక్యమునందు వాక్యమును అనువాదము చేయడములో తప్పు వ్రాసినట్లున్నది. అక్కడ ఏమి వ్రాశారో గమనించితే ఇలా కలదు. "దేవుడు (అల్లాహ్) ముగ్గురిలో మూడవవాడు" అని అంటే తప్పు. అది దైవతిరస్కారమగును. వాస్తవానికి దేవుడు ఒక్కడే గలడు అని ఉన్నది. ఇప్పుడు ఈ వాక్యమునుబట్టి చూస్తే, దేవుడు ముగ్గురిలో మూడవవాడు మాత్రమే అని అంటే దేవుడు ఒక్కడేయని చెప్పినట్లు కాదా! అలాంటప్పుడు అది దైవ తిరస్కారము ఎలా అగును? పై వాక్యములో దేవుడు ముగ్గురిలో మూడవవాడు అనినా ఒకటే, ఇద్దరు కాదు మూడవ వాడు ఒక్కడే దేవుడు అనినా ఒక్కటే అగును. కొన్ని ఖుర్ఆన్ గ్రంథములలో అనువాద లోపమువలన అలా వ్రాసుకొన్నారు. దేవుడు ముగ్గురుగా యున్నాడు అంటే తప్పు. దేవుడు ముగ్గురిలో ఒకడుమాత్రమే అంటే ఒప్పు అగును.

దేవుని అంశ మూడు భాగములుగా విభజింపబడి ముగ్గురు పురుషులుగా యుండినా, అందులో మొదటి ఇద్దరు పురుషులు దేవుడు కారు. ఇద్దరికంటే ఉత్తమమైన మూడవవాడు ఒక్కడే దేవుడు అనబడును. దేవుడు ఒక్కడే యను సూత్రము ముందు భగవద్గీతలో చెప్పబడినది. తర్వాత వచ్చిన రెండు గ్రంథములలోనూ అదే మాట చెప్పడమైనది. భగవద్గీతలోని వాక్యమునకూ, బైబిలు, ఖుర్ఆన్ గ్రంథములలోని వాక్యములకూ భావములో ఏమాత్రము తేడాలేదు. మూడు గ్రంథములలో ముగ్గురు పురుషులను గురించి వ్రాసిన భాషలోగానీ, చెప్పిన పేర్లలోగానీ తేడాయుండవచ్చునుగానీ భావములో ఏమాత్రము తేడాయుండదు. మూడు గ్రంథములలో యున్న జ్ఞానమును చెప్పినవాడు ఒక్కడే అయివుండుట వలన, మూడు గ్రంథములలో ఒకదానికొకటి సమన్వయము కల్గిన జ్ఞానముండునుగానీ, వ్యతిరేఖ జ్ఞానముండుటకు అవకాశమేలేదు. ముగ్గురు పురుషుల జ్ఞానమును మొదటి మాతృగ్రంథమైన భగవద్గీతలో చెప్పగా, అదే జ్ఞానమే మిగతా బైబిలు గ్రంథములోనూ, అలాగే ఖుర్ఆన్ గ్రంథములోనూ వ్రాయబడియున్నది. ఖుర్ఆన్ గ్రంథములో తోలేవాడు అని చెప్పితే, బైబిలు గ్రంథములో తండ్రియని వ్రాయబడియున్నది. భగవద్గీతలో అక్షరుడు అని వ్రాయబడి యున్నది. ఇక్కడ మూడు ఆత్మలలో మధ్యలో ఆత్మను వేరువేరు పేర్లతో చెప్పడమైనదిగానీ, ఆ పేర్లన్నీ రెండవ ఆత్మకే వర్తించునని మూడు మతము లోని వారికి తెలియదు. అందువలన మూడు గ్రంథముల జ్ఞానములో సమన్వయమున్నా, అర్థము తెలియని మూడు మతములలో సమన్వయము లేదు.

కొందరు ఈ మధ్యకాలములో నన్ను ఒక ప్రశ్న అడిగారు. అదేమనగా! మీరు ఖుర్ఆన్ గ్రంథములోని వాక్యములను వ్రాసినా, బైబిలు

గ్రంథములోని వాక్యములను వ్రాసినా వాటిని ఇందూ వాక్యములని అంటున్నారు. హిందూమతము ప్రత్యేకమయినదిగా ఉన్నప్పుడు దాని పేరును ఈ వాక్యములముందు ఎందుకు ఇరికించారు? ఇప్పుడు మీరు వ్రాయుచున్న ఖుర్ఆన్ గ్రంథములో కూడా **"ఇందూ పవిత్రవాక్యములు"** అని అన్నారు. అలా దేనికి అన్నారు? అని ప్రశ్నించారు. దానికి మేము ఈ విధముగా సమాధానము చెప్పాము. ఇందూ అనేది భాషరీత్యా జ్ఞానము, జ్ఞాని అని అర్థము. ఇక్కడ సందర్భానుసారముగా ఇందూ అనే పదమును జ్ఞానము అని అర్థము చేసుకోవాలి. ఏ మతములో అయినా కొంత జ్ఞానముండగా దానితోపాటు కొంత అజ్ఞానము కూడా ఉండును. భగవద్గీత పుట్టినప్పుడు అందులో అంతా జ్ఞానమేయుండినా అది పెరిగినప్పుడు అందులో కూడా కొంత అజ్ఞానము చోటు చేసుకోవడము జరిగినది. అలాగే మిగతా రెండు గ్రంథములలో కూడా అజ్ఞానము కొంతకుకొంత చేరియుండ వచ్చును. మేము భగవద్గీతను **"త్రైత సిద్ధాంత భగవద్గీత"**యను పేరుతో వ్రాశాము. మేము వ్రాసినప్పుడు భగవద్గీతలో కలిసియున్న అజ్ఞాన శ్లోకములను వదలివేసి, కేవలము జ్ఞానమునకు సంబంధించిన శ్లోకములనే వ్రాయడము జరిగినది. అప్పుడు మేము జ్ఞాన శ్లోకములనే వ్రాయు చున్నాము. అజ్ఞానమునకు సంబంధించిన వాటిని వదిలివేశాము అని అర్థము వచ్చునట్లు ఇందూ వాక్యములు అని పెట్టడము జరిగినది. జెల్లెడ పట్టని గోధుమపిండిని గోధుమపిండే అంటాము. అది చూచేదానికి శుభ్రముగానే కనిపించును. అయినా జెల్లెడ పట్టితే అందులో కనిపించక యుండిన చిన్నచిన్న పొట్టు బయటపడును. జెల్లెడ పట్టిన తర్వాత కూడా గోధుమపిండి మొదట కనిపించినట్లే కనిపించును. అయినప్పటికీ అది శుభ్రము చేసిన పిండియగును. అటువంటి పిండిని జెల్లెడ పిండియని

చెప్పితే తప్పులేదు కదా! అదే విధముగా జ్ఞానము కూడా మొదట అంతా జ్ఞానమువలె కనిపించినా ఇందూ అను జెల్లెడను ఉపయోగించిన తర్వాత అందులోని కనిపించకయున్న అజ్ఞానమంతా బయటపడును. అప్పుడది స్వచ్ఛమైన జ్ఞానమగును. అది స్వచ్ఛమయిన జ్ఞానమని తెలియునట్లు ఏ విధముగా అయితే శుభ్రము చేసినపిండిని జెల్లెడ పిండి అని అంటున్నామో, అదే విధముగా జ్ఞానమునకు ఇందూ వాక్యములు అని చెప్పడములో తప్పు లేదు.

మేము ఒక గ్రంథములోని జ్ఞానమును బాగా విశ్లేషించి చూచి అందులో ఏదయినా అజ్ఞానము దాగియుందేమోనని పరిశీలించి, అందులో కనిపించిన అజ్ఞానమును వదిలివేసి మిగిలిన స్వచ్ఛమైన జ్ఞానమునే చెప్పుచుందుము. ఆ విధముగా ఎవరో ఒకరు చేయాలి. అప్పుడయితేనే కాలక్రమమున జ్ఞానములో కలిసిపోయిన అజ్ఞానము బయటపడగలదు. ఎవరో ఒకరు చేయవలసిన పనిని దేవుడు మాకు అవకాశమిచ్చి మా ద్వారా చేయించడము మా అదృష్టముగా మేము భావించుచున్నాము. మేము ఎంతో పరిశోధించి భగవద్గీతలోని కల్పిత శ్లోకములను, అజ్ఞానపు మాటలను బయటపెట్టడము జరిగినది. ప్రథమ దైవగ్రంథములోనే కొంత అజ్ఞానము కలిసియుంటే తర్వాత వచ్చిన మధ్యమ, అంతిమ దైవగ్రంథము లలో కూడా అంతో ఇంతో అజ్ఞానము కలిసియుండును. మేము మిగతా రెండు గ్రంథములను కూడా పరిశీలించి ఒక నిర్ణయమునకు వచ్చి వ్రాయడము జరిగినది. అయితే ఈ రెండు గ్రంథములలో ఏది అజ్ఞాన వాక్యమో మేము చెప్పలేదు. ఏది జ్ఞానవాక్యమో దానిని మాత్రమే వ్రాయాలనుకొన్నాము. వాటిలో కూడా నేను కొన్ని జ్ఞానవాక్యములనే వ్రాయుచున్నాను. నేను వ్రాయని జ్ఞానవాక్యములు కూడా ఎన్నో ఉన్నవి.

అందువలన వ్రాసినదే నిజమైన గ్రంథము, వ్రాయనిది అంతా అజ్ఞానమేమో! నిజమైన గ్రంథము కాదేమో! అని ఎవరూ అనుకోకూడదు.

పూర్వము భారతదేశమును జ్ఞానముగలదేశమనీ, జ్ఞానులు గల దేశమనీ భావించి ఇందూ దేశము అనెడివారు. ఇందూ దేశముగ ప్రపంచములో భారతదేశమొక్కటే యుండేది. కృతయుగములో భారత దేశమంతా జ్ఞానులతో నిండియుండేది. అందువలన భారతదేశమును ఫలానాయని గుర్తింపుగా ఇందూదేశము అని అన్నారు. ఈనాడు మేము గ్రంథము ముందరో, వెనుకో ఇందూ శబ్ధమును పెట్టి గ్రంథములో జ్ఞానమే కలదు, కొద్దిగ కూడా అజ్ఞానము లేదని చెప్పుచున్నాము. ఇందూ అని చెప్పడములో అంతేతప్ప వేరు భావము ఏమీ లేదు. అయితే బియ్యములో రాళ్ళు తక్కువయున్నప్పుడు రాళ్ళను మాత్రము వేరివేస్తాము. అలాకాకుండా బియ్యములో బియ్యముకంటే రాళ్ళే ఎక్కువయుండి బియ్యమే తక్కువ యున్నప్పుడు బియ్యమును మాత్రమే వేరి తీసుకొంటాము. అదే విధముగా మూడు గ్రంథములను చెప్పునప్పుడు ఇందూ పదమును ఉపయోగించినా భగవద్గీతలో మాత్రము కల్పిత శ్లోకాలను బయటపెట్టి ఇవి దేవుడు చెప్పినవి కావు అని తేల్చివేశాము. మిగతా రెండు గ్రంథములలో ఇది అజ్ఞానమునకు సంబంధించినదని ఏ వాక్యమూ మేము బయటపెట్టలేదు. ఆ గ్రంథములలో మా పరిశీలన ఎక్కువలేదు కావున నాకు తెలిసిన కొన్ని వాక్యముల వరకే వ్రాశాము. నాకు తెలియని వాక్యములు ఎన్నోయున్నాయని తెలియవలెను.

దేవుడు తన జ్ఞానమును భూమిమీద ప్రజలకు మూడు విధముల తెలియజేయగా చివరికది మూడు మతములుగా మారిపోయినది. మనిషి దేనికీ కారకుడు కాకున్ననూ, మనిషి అజ్ఞానమునుబట్టి మూడు మతములు తయారయినవి. పైకి కనిపించునట్లు మనిషి మూడు మతములను తయారు

చేసుకొన్ననూ దేవునికి తెలియకుండా ఏమీ జరుగవు. మనిషి జ్ఞానమును కోరుకొంటే జ్ఞానమువైపు, అజ్ఞానమును కోరుకొంటే అజ్ఞానమువైపు దేవుడు పంపగలడు. అదే విధముగా మనిషి కోరుకొన్నట్లు మనిషి మతములవైపు పంపబడ్డాడు. మనిషి జ్ఞానమును మతముగా మార్చుకొనినా అంతటితో ఆగక జ్ఞానమునకు చేర్పులు కూర్పులు చేసి మతమునకు సరిపోవునట్లు జ్ఞానమును చెప్పుకొనేదానికి మొదలు పెట్టాడు. ఆ నేపథ్యములో దేవుడు చెప్పిన జ్ఞానమునకు ఉన్న భావమును మార్చి లేని భావమును చెప్పుకొనే దానికి మొదలు పెట్టాడు. మతము కొరకు కాకపోతే దేవుడు చెప్పిన జ్ఞానమును ఉన్న భావముతోనే చెప్పుకోవచ్చును. మతము అభివృద్ధి అను ఉద్దేశ్యముతో హిందువులు కాలానుగుణముగా ఉన్నజ్ఞానమును వదిలి లేని జ్ఞానమును తెచ్చుకొన్నారు. అలాగే మిగతా మతముల వారు లేని జ్ఞానమును సృష్ఠించుకోకపోయినా ఉన్న జ్ఞానమునకే కొత్త రంగు పూసి కొత్త భావములను చేర్చి చెప్పుకోవడము జరుగుచున్నది.

ముస్లీమ్ అంటే నేడు ఒక మతమువాడని అందరూ అనుకోవడము జరుగుచున్నది. ముస్లీమ్ అంటే నెత్తిన టోపి, క్రింద గడ్డముగలవానిగా యుండువాడని కొందరి భావము. సమాజములో వేషధారణలో కొంత తేడాతోయుంటే తలమీద చిన్నటోపియున్నా క్రింద గడ్డముయున్నా అతనిని ముస్లీమ్ మతస్థుడు అనడము జరుగుచున్నది. ప్రజలకు అలవాటైన భాషలో చెప్పితేనే అర్థమవుతుంది. కావున మేము వ్రాసిన వ్రాతలో కూడా ముస్లీమ్ మతములో అని వ్రాయవలసివచ్చినది. వాస్తవానికి 'ముస్లీమ్' అను పదము మతమునకు సంబంధించినది కాదు. దేవుని జ్ఞానమును తెలిసి, సర్వమునకూ దేవుడే అధిపతియని తెలిసి, దేవుని మీద శ్రద్ధకల్గి దేవునికి ఎవడు విధేయుడుగా ఉంటాడో వానిని ముస్లీమ్ అనవచ్చును. ఒక్క మాటలో

చెప్పాలంటే దేవునికి నిజమైన భక్తునిగా ఎవడయితే ఉంటాడో వానిని ముస్లీమ్ అనవచ్చును. ఇంకొక విధముగా చెప్పితే దేవుని జ్ఞానమును తెలిసి దేవునిసేవ చేయువాడు ముస్లీమ్ అని చెప్పవచ్చును. అయితే నేడు ముస్లీమ్ అంటే తురకవాడనీ, తురక మతమువాడనీ అందరూ అనుకోవడము జరుగుచున్నది.

అన్నిటికంటే ముందు పుట్టిన హిందూమతములో ఇటువంటి దురలవాటే ఒకటున్నది. ఇందువు అంటే హిందూమతస్థుడనీ, ఇందూ అనేది ఒకమతమనీ అదే నేడు హిందూ అని పిలువబడుచున్నదనీ మిగతా మతస్థులు అనుకోవడము జరుగుచున్నది. వాస్తవానికి ఇందూ అంటే జ్ఞానము అని అర్థము. దేవుని జ్ఞానము కల్గినవాడు ఇందువు అనియు దేవునికి విధేయుడుగాయుంటూ దేవునిసేవ చేయువానిని ఇందువు అంటారని మేము ఒకవైపు చెప్పుచున్నా, నేటి హిందువులు మా మాటను లెక్క చేయకుండా చాలామంది హిందుత్వమనేది ఒక మతమని, మనది హిందూమతమని మాకు వ్యతిరేఖముగా చెప్పుచున్నారు. ముస్లీమ్‌లు అనినా ఇందువులు అనినా రెండూ ఒకే అర్థమునిచ్చుచున్నవి. రెండిటి అర్థములో దేవున్ని విశ్వసించినవారనీ, దేవునికి విధేయులయిన జ్ఞానులని ఉండగా ఇటు ఇందువులు అటు ముస్లీమ్‌లు తమది మతమని చెప్పుకొంటున్నారు. అలా చెప్పువారు ఎవరయినా దేవుని జ్ఞానమును మూసిపెట్టి మాట్లాడినట్లే యగును. ముస్లీమ్ అంటే తురక మతస్థుడనీ, ఇందువు అంటే హిందూ మతస్థుడనీ చెప్పుకొంటే దేవుని వాక్యమునకు అర్థమును మార్చి చెప్పినట్లగును. ఈ విషయమును గురించి ఖుర్‌ఆన్ గ్రంథములో అల్ బఖర అను 2వ సూరాలో 159వ ఆయత్‌నందు ఇలా కలదు చూడండి.

**(2-159) "మేము అవతరింపచేసిన నిదర్శనాలను మరియు**

**సన్మార్గమును ప్రజల కొరకు గ్రంథములో విశదపరచిన తర్వాత కూడా వాటిని దాచిపెట్టే వారిని దేవుడు శపిస్తాడు. ఇంకా వేరే శపించేవారు కూడా వారిని శపిస్తారు."**

ఈ వాక్యములో దేవుడు చెప్పిన భావములను తన స్వార్థముకొరకో, తన మతముకొరకో దాచిపెట్టి వేరు భావములను చెప్పువానిని, ఇందూ అంటే జ్ఞానియని దేవుడు చెప్పియుండగా, ఇందూ అంటే ఒక మతమని చెప్పువానిని, ముస్లీమ్ అంటే దేవున్ని విశ్వసించినవాడు అని దేవుడు అర్థము చెప్పియుండగా ఆ భావమును దాచిపెట్టి ముస్లీమ్ అంటే ఒక మతస్థుడని చెప్పువానిని దేవుడు శపిస్తాడు అని యున్నది. శాపము అనగా శాసనము లతో కూడుకొన్నదని అర్థము. శాసనము అనగా తప్పక జరిగి తీరునదని అర్థము. ఈ అర్థముల ప్రకారము శాపము అనగా చెప్పినది జరిగి తీరునదని అర్థము. దేవుడు ఏ మాట చెప్పినా అది జరిగి తీరును కనుక దానిని శాపము అంటాము. దేవుడు తన జ్ఞానమునకు భావమును మార్చి చెప్పువానిని అధోగతిపాలగునట్లు శపించును. దేవుని పాలనలో యుండే పాలకులు కూడా శపించుశక్తిగల వారుగాయుండుట వలన, దేవుని జ్ఞానమునకు వక్రమార్గములో అర్థములు చెప్పి, విశాలమైన దైవజ్ఞానమునకు సంకుచితమైన భావములను అంటగట్టు వారిని గ్రహములు, భూతములు, మహాభూతములుగాయున్నవారు కూడా మనిషిని శపింతురు. దేవుని శాపమునకు మరియు దేవుని పాలకుల శాపమునకు గురియైనవాడు జన్మ జన్మకు అధోగతిపాలగును. చివరికి పూర్తి అజ్ఞానిగా మారిపోవును.

దేవుని శాపానికిగానీ, దేవుని పాలకుల శాపానికిగానీ గురియై జీవించుటకంటే దురదృష్టము మరొకటి లేదు. కొందరు బుద్ధి తక్కువ వారు గర్వముతో నిండినవారై, ఒకవైపు ఇది మంచిదికాదుయని జ్ఞానులు

హెచ్చరించుచున్నా లెక్కచేయక తమకు తెలిసినదే జ్ఞానమనీ, తమకు తెలియనిది అజ్ఞానమనీ తలచి తనను తాను దేశరక్షకునిగానో, మత రక్షకుడిగానో తలచి ఇందూ పదమును చూచి అది ఉండవలసినది హిందూ అని తమకు తెలిసినవారిలాగా వాదించుచూ జ్ఞానులను సహితము ఇబ్బంది పెట్టి హేళన చేయుచుందురు. జ్ఞానులు మతమునకు సంబంధము లేకుండా చెప్పిన జ్ఞానమును, మతమునకు సంబంధించినదిగా చెప్పుచూ, 'ఇందూ' అను పదము 'హిందూ' మతమునకే సంబంధించినది కాదు, ఏదో ఇతర మతమునకు సంబంధించినదని, మాట్లాడడమేకాక ఇందూ అని జ్ఞాన అర్థముతో కూడుకొన్న పదమును చెప్పినవారిని ఇతర మత ప్రచారకులుగా వర్ణించి వారిని ఇబ్బంది పెట్టాలని చూచుచుందురు. నేడు మేము అటువంటి ఇబ్బందులను చాలా ఎదుర్కొన్నాము. హిందూ ధర్మరక్షకులమని, హిందూ మతరక్షకులమని, మరికొన్ని ఇతర పేర్లు పెట్టుకొన్న వారు తాము క్షీణించి పోవుచున్న హిందూమతమును కాపాడుటకు కంకణము కట్టుకొన్నవారమని చెప్పుకొనుచూ, ఏమాత్రము ఇందూధర్మములను గానీ, భగవద్గీత సూత్రములనుగానీ, కొద్దిపాటి ఆత్మజ్ఞానముగానీ తెలియనివారై, తమ మతమేది, పరాయిమతమేదియని గుర్తించనివారై, స్వచ్ఛమైన ఇందూ ధర్మములను బోధించుచూ, ఇందూ ధర్మసిద్ధాంతకర్తలలో శంకరాచార్య, రామానుజాచార్య, మధ్వాచార్యుల తర్వాత నాల్గవవానిగా యున్న మమ్ములను కూడా లెక్కచేయక, మా బోధలను అర్థము చేసుకోలేక, మేము ఇందూ అంటే అది హిందూ మతమునకు సంబంధించినది కాదనీ, మేము త్రైత సిద్ధాంతకర్తలము అంటే త్రైతమంటే క్రైస్తవమనీ, మేము క్రైస్తవమును ఇందూ అను పదముచాటున దొంగగా బోధిస్తున్నామనీ, హిందూ మతము లోని వారిని క్రైస్తవులుగా మార్చుటకు మేము బోధలు చెప్పుచున్నామని ఆరోపించుచుందురు.

ఈ విధముగా ఒక్క హిందూమతములోనే కాకుండా మిగతా మతములలో కూడా ఏమాత్రము దైవజ్ఞానములేని మతచాంధసవాదులు న్నారు. అటువంటి మతచాంధసులు దైవజ్ఞానమును ఏమాత్రము గుర్తించని వారై, మతవాదనలలో మునిగిపోయి, మతము కొరకు దైవజ్ఞానమునకు అర్థమును మార్చి చెప్పుచూ, జ్ఞానమును చెప్పువారిని తమవారని తమ మతము వారని కూడా గుర్తించక పరాయి మతమువారనీ, పరాయి మతమును ప్రచారము చేయుచున్నారను ముద్రవేసి, స్వమతములోని జ్ఞానులను గ్రుడ్డిగా ఇతర మతస్థులుగా భావించి ఇబ్బందులపాలు చేయు చుందురు. అటువంటి వారికి దేవుని శిక్ష తప్పదు. అలాగే గ్రహముల, భూతముల, మహాభూతముల శాపము తప్పదు. అటువంటివారు రాబోయే కాలములో శిక్షకు గురికాగలిగినా, దానిని ముందే దేవుడు హెచ్చరించినా ఏమాత్రము లెక్కచేయనివారై తాము సరియైనవారమే అన్నట్లు ప్రవర్తించు చుందురు. గ్రహములకో, భూతములకో కోపమువచ్చి మొన్న విశాఖలో వచ్చిన హుదూస్ తుఫాన్‌లాగా వచ్చి ఎంతో నష్టమును కల్గించినా, ఎంతో కష్టమును కల్గించినా, తమలో ఏమయినా తప్పున్నదేమోనని చూచుకోక ఇదంతయూ సర్వసాధారణముగా జరుగునదని సులభముగా కొట్టివేయు చుందురు. ఒక చెట్టును పెకళించి క్రిందపడవేయుటకు ఎన్ని క్యాలరీల బలము కావాలి? ఒక కరెంటు స్థంభమును పడత్రోయుటకు ఎంతశక్తి కావాలని ఏమాత్రము యోచించరు. అంతబలము శూన్యములో ఎలా వచ్చినదని ఏమాత్రము గ్రహించరు. కనీసము గ్రహించుటకు ప్రయత్నము కూడా చేయరు.

ఈ విధముగా అజ్ఞానులు అనేక రకములుగా భూమిమీద జీవించుచూ జ్ఞానులకు కంటకులుగామారి పాపమును సంపాదించు

కొనుచూ జీవితమును సాగించుచున్నారు. అటువంటివారిని గ్రహములు ప్రమాదముల రూపములోనూ, భూతములు ప్రకృతివైపరీత్యముల రూపములోనూ ఒకవైపు శిక్షించుచున్నా, ఇదంతయూ తాము చేసుకొన్న పాపము వలన, తప్పిదము వలన వచ్చినదే కదా!యని స్పృహలేనివారై తిరిగి దేవునికి, దేవుని జ్ఞానమునకు వ్యతిరేఖముగా ప్రవర్తించుటకే ప్రాధాన్యత నిచ్చుచుందురు. ఈ విధముగా ఎందరో అజ్ఞానులు ప్రవర్తించుచుండగా, కొందరు మాత్రము దైవజ్ఞానమే తన జీవితాశయముగా బ్రతుకువారున్నారు. అటువంటి వారు జ్ఞానులుగా ప్రవర్తించుచుండగా, చాలామంది సాధారణ జీవితము గడుపుచూ, అటు అజ్ఞానులుగా కాకుండా, ఇటు జ్ఞానులుగా కాకుండా మధ్యరకముగా బ్రతుకుచుందురు. అటువంటి వారికి జ్ఞానము అవసరములేదు. అట్లే అజ్ఞానమూ అవసరము లేదు. వారికి కావలసింది డబ్బుమాత్రమే, ఉదయము లేచింది మొదలు డబ్బును గురించిన చింత, డబ్బును గురించిన కార్యములు చేయుచుందురు. అటువంటివారికి దేవుడే దిగివచ్చి చెప్పినా, నీ జ్ఞానముతో మాకేమి పని? అదేమయినా కూటికి వస్తుందా? గూటికివస్తుందా? మాకేదయినా లాభము వచ్చే పనుంటే చెప్పుమని అడుగగలరు. ఇటువంటివారు జ్ఞానముతోగానీ, అజ్ఞానముతో గానీ సంబంధములేకుండా మధ్యరక జీవితమును గడుపుచుందురు. అట్లున్నవారు భవిష్యత్తులో జ్ఞానులుగా అయినా మారవచ్చును లేక అజ్ఞానులుగా అయినా మారవచ్చును. మధ్యరక జీవితము గడుపువారు పూర్తి నాస్తికులు కారు, అట్లే పూర్తి ఆస్తికులుగారు. వారు మధ్యరకముగా దేవుని మీద భక్తి యున్నా, వారు దేవున్ని మ్రొక్కినా వారి సుఖములకొరకు, వారి లాభములకొరకు, వారి రోగములకొరకు, వారి కోర్కెలకొరకు మ్రొక్కుచుందురు. వారికి దేవుడు ఎవరో తెలియకున్నా, తాము మ్రొక్కుచున్న

వారిలో చిన్న దేవుడు ఎవరో, పెద్ద దేవుడు ఎవరో తెలియకున్నా తమ లాభముల కొరకు తమ కోర్కెల కొరకు దేవుళ్ళందరికీ సమానముగా మ్రొక్కుచుందురు. ఇదంతా హిందూమతములో ఎక్కువగా యున్నది. క్రైస్తవ మతములో దేవుడు ఒక్కడే అను ధ్యాసను వదలి ఒకరు ఏసును, మరొకరు ఏసు తల్లియైన మేరీ మాతను, మరొకరు యెహోవా దేవున్ని మ్రొక్కుచుందురు. క్రైస్తవులు ముగ్గురిలో ఎవరిని మ్రొక్కినా, ఎవరిని ప్రార్థించినా వారి కొరకు, వారి పిల్లలకొరకు, వారి జీవితము బాగా గడచుట కొరకు ప్రార్థన చేయుచుందురు.

ప్రపంచములోని ప్రజలు కొందరు జ్ఞానులుగా, మరికొందరు అజ్ఞానులుగా జీవించుచుండగా మిగిలిన చాలామంది మధ్యరకము భక్తులుగా బ్రతుకుచున్నారు. మూడు రకములవారూ తామే నిజమైన భక్తులమనీ, తమనే దేవుడు ఎక్కువగా ప్రేమించుచున్నాడనీ అనుకొను చుందురు. అయితే ఆ మాట జ్ఞానులయిన వారి యెడల మాత్రము సత్యము. మిగతావారి యెడల అసత్యము. జ్ఞానులయిన వారు తమ జీవితములో ఎక్కువ భాగము దేవుని జ్ఞానముకొరకు, దేవునిసేవకొరకు ఉపయోగించుచుందురు. అటువంటి వారు ప్రాపంచిక సుఖములను, లాభములను ఆశించక అవి కర్మానుసారము వచ్చి పోవుచుండునని తలచి వాటిని గురించి దేవున్ని ఎప్పటికీ కోరక, ధన సముపార్జన మీద ఆసక్తి చూపక, కేవలము జ్ఞాన సముపార్జనమీద మాత్రము ధ్యాస కల్గియుందురు. అటువంటివారికి జీవితములో ఏవయినా బాధలు కల్గినా అవన్నియూ కర్మవలన కలుగునవే ననీ, జ్ఞానమునకూ తమబాధలకూ ముడివేయక రెండూ వేరువేరు విభాగములని అనుకొనుచూ జీవితమును సాగించు చుందురు. మూడు రకముల జీవితము సాగించువారిలో జ్ఞానులు

ఉత్తములు, అజ్ఞానులు అధములు. మిగిలిన భక్తులు అవసరమునుబట్టి మ్రొక్కువారు అయినందున, తర్వాత జీవితములో ఎటువైపు అయినా మారగల అవకాశముండుట వలన వారిని మధ్యరకమువారిగా లెక్కించుచున్నాము. మధ్యరకము మనుషులు గానీ, అధమరకము మనుషులుగానీ చనిపోయిన తర్వాత తిరిగి పుట్టుచుందురు. భగవద్గీతలో చెప్పినట్లు వారికి జనన మరణములు తప్పవు. అటువంటివారు మరణము తర్వాత వారిని స్పృహలేని సమాధి స్థితినుండి దేవుడు తిరిగి లేపుచున్నాడు. అనగా తిరిగి క్రొత్త జీవితమును ఇచ్చి గడచిపోయిన జన్మలోని పాపపుణ్యముల ఫలితములయిన సుఖ దుఃఖములను అనుభవించునట్లు చేయుచున్నాడు. సుఖదుఃఖములను అనుభవించడమే వారికి జీవితముగా గడుచుచున్నది.

ఇకపోతే ఉత్తమశ్రేణికి సంబంధించిన జ్ఞానులు జ్ఞానమే తమ జీవితముగా గడుపుట వలన, వారు జీవించినప్పుడు సంపాదించిన జ్ఞానశక్తి వలన వారికర్మయంతయూ కాలిపోయివుండును. కనుక వారు చనిపోయిన తర్వాత తిరిగి పుట్టరు. వారు శరీరమును ధరించరు. అనగా మళ్ళీ జన్మ వారికుండదు. ఇప్పుడు ఇతరులు ఒక ప్రశ్న అడుగుటకు అవకాశము గలదు. అదేమనగా! చనిపోయిన తర్వాత తిరిగి ఇటువంటి జన్మయే కల్గునని మూడు దైవగ్రంథములలో ఉన్నది. అయితే మీరు ఇక్కడ జ్ఞానమార్గములోయున్న వారు చనిపోతే మళ్ళీ వాడు పుట్టడు అని చెప్పుచున్నారు కదా! చనిపోయిన తర్వాత పుట్టకుండాపోతే వాడు ఎక్కడుండును? అని అడుగవచ్చును. దానికి మా జవాబు ఇలా కలదు. "జ్ఞానమార్గములో జీవితమును గడిపినవాడు చనిపోయిన తర్వాత పుట్టితే తిరిగి ఎప్పుడో ఒకప్పుడు తిరిగి చనిపోవలసివస్తుంది. అయితే

జ్ఞానిగాయుండి కర్మను కాల్చుకొని చనిపోయినవాడు తిరిగి పుట్టుటకు అవకాశమేలేదు. ఎందుకనగా! జ్ఞానిగాయుంటూ జ్ఞానమార్గములోనే జీవితము సాగించినవానికి ఎప్పుడు మరణము వచ్చినా అది ఆఖరీమరణమై యుండును. మరణములో మొత్తము నాలుగురకముల మరణములు గలవు. అధమగతి అజ్ఞానులుగానీ, మధ్యతరగతి భక్తులుగానీ చనిపోతే వారు మూడు మరణములలో ఏదో ఒకదానిని పొందుదురు. మూడు రకముల మరణములు వరుసగా ఇలా కలవు 1) కాల మరణము. 2) అకాల మరణము 3) తాత్కాలిక మరణము. ఈ మూడు మరణములలో ఏ ఒక్క దానినీ జ్ఞాని అయినవాడు పొందడు. జ్ఞాని అయినవాడు చివరి నాల్గవ దయిన ఆఖరీమరణమును పొందును. అప్పుడు పొందినదే ఆఖరీ మరణము అయినందున వాడు తిరిగి చనిపోవుటకు వీలులేదు. రెండవ మారు మరణములేనందున వాడు పుట్టే అవసరమే లేదు. ఒకవేళ పుట్టితే పుట్టినవాడు తిరిగి మరణించవలసియుండును. జ్ఞాని అయినవాడు తిరిగి మరణించేది యుండదు. జ్ఞాని పొందినది చివరి మరణము కావున దాని తర్వాత మరణము అనునది వచ్చుటకు వీలులేదు. మరణములేని వాడు మొదట పుట్టే అవసరమే లేదు. అందువలన జ్ఞానిగామారి, జ్ఞానమార్గములో జీవితమును సాగించినవాడు జననమరణములకు అతీతుడైపోవును. అనగా వానికి చావుపుట్టుకలు రెండూ లేవని అర్థము.

సంపూర్ణ జ్ఞానియై చనిపోయినవానికి రెండవ చావువుండదు. కాబట్టి వానికి రెండవ పుట్టుక కూడా యుండదు. చావుపుట్టుక లేనివాడు దేవునియందు ఐక్యమైపోవును. దేవునియందు ఐక్యమైపోయినవాడు ఎల్లకాలము దేవునియందే జీవించియుండును. దేవుడు కాలము నేనేయని ప్రథమ దైవగ్రంథములో చెప్పియుండడము వలన దేవునియందు ఐక్యమై

యున్నవానిని చనిపోయాడు అని అనకుండా కాలమైపోయాడు అని అనాలి. లేకపోతే పరమపదము పొందాడు అనాలి. అట్లు చెప్పుట వలన అతడు సాధారణముగా చనిపోయి తిరిగి పుట్టలేదనీ, అతను పుట్టని గిట్టని ప్రదేశములో దేవునియందు చేరిపోయాడనీ అందరికీ అర్థమైపోవును. జ్ఞానియైనవాడు పూర్తిగా కర్మశేషము లేకుండా చేసుకొనియుంటే తిరిగి పుట్టడు. ఒకవేళ కొంతకర్మ మిగిలియుంటే దానిని అనుభవించుటకు తిరిగి పుట్టవలసియుండును. చివరకు కర్మ పూర్తి అయిపోయిన వాడే తిరిగి పుట్టడని తెలియాలి. అయితే ఒక జ్ఞాని చనిపోయినప్పుడు అతని కర్మ పూర్తి అయిపోయినదీ లేనిదీ బయట ప్రజలకు తెలియదు. అప్పుడు చనిపోయిన జ్ఞాని ఆఖరీమరణము పొందాడా లేదా అని తెలియుటకు వీలులేదు. అందువలన చివరి మరణమును పొందినవానిని గుర్తించలేక వానిని కూడా చనిపోయాడు అని చెప్పడము జరుగుచున్నది. ఒకవేళ వాడు ఆఖరీమరణమును పొందియుంటే అప్పుడు వానిని చనిపోయాడు అని చెప్పడము తప్పగును. అందువలన జ్ఞాని అయినవాడు, మోక్షము కొరకు ప్రయత్నించువాడు చివరి మరణము పొందాడా లేదాయని తెలియుటకు దేవుడు సూత్రమును చెప్పాడు. ఆ సూత్రము ప్రకారము ఒక జ్ఞానిగానీ లేక ఒక యోగిగానీ చనిపోతే అతడు మోక్షమును పొందాడనీ, దేవునియందు ఐక్యమయియున్నాడనీ చెప్పవచ్చును. ఆ సూత్రము ప్రకారము చనిపోకపోతే అతడు దేవునియందు ఐక్యము కాలేదనీ, అతడు తిరిగి జన్మకు పోయాడనీ చెప్పవచ్చును.

అంతకీ ప్రథమ దైవగ్రంథములో అక్షర పరబ్రహ్మయోగమున 23, 24, 25 శ్లోకములలో భగవంతుడు చెప్పిన సూత్రము ఏమి అని చూస్తే ఆ సూత్రము ఇలా కలదు.

23వ శ్లో॥ యత్రకాలే త్వనావృత్తిమ్ ఆవృత్తిం చైవ యోగినః ।
ప్రయాతా యాంతి తం కాలం వక్ష్యామి భరతర్షభ ॥

24వ శ్లో॥ అగ్నిర్జ్యోతిరహః శుక్ల షణ్మాసా ఉత్తరాయణమ్ ।
తత్ర ప్రయాతా గచ్ఛంతి బ్రహ్మ బ్రహ్మవిదో జనాః ॥

25వ శ్లో॥ ధూమో రాత్రిస్తథా కృష్ణ షణ్మాసా దక్షిణాయణమ్ ।
తత్ర చాంద్రమసం జ్యోతిః యోగీ ప్రాప్య నివర్తతే ॥

**భావములు :** "యోగులయినవారు ఏ కాలములో చనిపోతే తిరిగి పుట్టుతారో, ఏ కాలములో చనిపోతే తిరిగి పుట్టరో ఆ కాలమును గురించి చెప్పుతాను విను."

"పగటి పూట, సూర్యరశ్మియున్న సమయములో, శుక్లపక్షములో, ఉత్తరాయణములో చనిపోయిన యోగి దేవునియందు ఐక్యమైపోయి తిరిగి పుట్టడు."

"మేఘముల నీడ పడినప్పుడు, రాత్రియందునూ, కృష్ణపక్షమున, దక్షిణాయణమున చనిపోయిన యోగి జ్ఞాన తేజమును పొంది తిరిగి జన్మించును." అని కలదు. ఇక్కడ చెప్పిన కాలప్రమాణము ప్రకారము చనిపోయిన యోగిని (జ్ఞానిని) మోక్షము పొందాడా లేదాయని తెలియ వచ్చును. దానిప్రకారము మోక్షము పొందనివానిని చనిపోయాడు అని చెప్పితే, అతడు తిరిగి పుట్టునని ఎవరయినా అర్థము చేసుకోగలరు. ఒకవేళ కాలప్రమాణము ప్రకారము చనిపోయిన యోగి మోక్షము పొంది, దేవునియందు ఐక్యమైయుంటే, అతనిని కాలమైపోయాడు అనిగానీ, పరమ పదించాడనిగానీ, పరమపదము పొందాడు అనిగానీ చెప్పవలెను. అట్లు

చెప్పుటవలన చనిపోయిన యోగి ఆఖరీ మరణము పొందాడనీ, అతడు తిరిగి పుట్టక దేవునియందు సజీవముగా ఎల్లకాలము జీవించియుండుననీ ఇతరులు తెలియగలరు. ఇదే విషయమునే ఖుర్‌ఆన్ గ్రంథమునందు 2వ సూరా, 154వ ఆయత్‌నందు ఇలా కలదు. **(2-154) "అల్లాహ్‌మార్గములో చంపబడిన వారిని మృతులు అని అనకూడదు. వారు బ్రతికే యున్నారు. కానీ ఆ విషయము మీకు అర్థము కాదు"** ఈ వాక్యములో మేము పైన చెప్పినట్లే కలదు. దేవునిమార్గములో వుండి చనిపోయిన వారిని మృతులు అని చెప్పవద్దండియని చెప్పారు. అలా చనిపోయినవారు జీవించియే యున్నారని కూడా చెప్పారు. అయితే ఎలా జీవించియున్నారని గానీ, ఎక్కడ జీవించియున్నారనిగానీ ఈ వాక్యములో చెప్పక ఆ విషయము మీకు అర్థము కాదు అని అన్నారు. మోక్షమును లేక దేవునియందు ఐక్యమైయుండు విధానము అంతసులభముగా అందరికీ అర్థము కాదని ఆ మాటలోని భావము. ఆ మాటకొస్తే ఖుర్‌ఆన్ గ్రంథములో ఎక్కడయినా సందర్భానుసారము మోక్షము గురించి చెప్పియున్నా ఖుర్‌ఆన్ గ్రంథమునకు వివరమును వ్రాసినవారు మోక్షమును స్వర్గముగా వర్ణించి చెప్పారు. మోక్షము దేవునియందు ఐక్యమైపోవు విధానమని చాలామందికి తెలియదు.

ఖుర్‌ఆన్ గ్రంథములో మోక్షమును గురించి ఎక్కడ చెప్పినా దాని వివరము తెలియనివారు మోక్షమును స్వర్గమనే అనుకొన్నారు. స్వర్గము వేరు మోక్షము వేరని వారు అనుకోవడము లేదు. గ్రంథములో 40వ సూరా, 39, 40, 41 ఆయత్‌లలో మోక్షమును గురించి జిబ్రయేల్ చెప్పడము జరిగినది. ఆ వాక్యములను ఇక్కడ చూస్తాము. **(40-39) "ఈ ప్రాపంచిక జీవిత సౌఖ్యాలు తాత్కాలికమైనవి. పరలోకమే శాశ్వతముగా ఉండే నిలయము. (40) ఎవడయినా పాపానికి**

**పాల్పడినా, పుణ్య కార్యములు చేసినా దానికి సమాన ఫలమే వారికి లభిస్తుంది. స్త్రీ అయినా పురుషుడయినా వారు కనుక విశ్వాసి అయివుంటే వారు మోక్షములో ప్రవేశిస్తారు. అక్కడ వారికి చెప్పలేనంత ఉపాధి లభిస్తుంది. (41) మేము మిమ్ములను మోక్షము వైపునకు పిలుస్తుంటే, మీరు నన్ను నరకాగ్నివైపు పిలుస్తారేమిటి?"** అని కలదు. పై మూడు వాక్యములు మోక్షమును గురించి చెప్పినవేగానీ స్వర్గమును గురించి చెప్పినవి కావు. మోక్షము అంటే ముక్తి, లేక విడుదలయని అర్థము. కర్మల బంధమునుండి ఎప్పుడు విడుదల పొందితే అప్పుడు మనిషి మోక్షము పొందడము జరుగును. వానికి కర్మలేదు కాబట్టి వాడు శరీరము ధరించి పుట్టక దేవునియందు జీవించి యుండును. అటువంటివానికి మరణములేదు. అట్లే పుట్టుక లేదు. మోక్షము లేక పరలోకము ఎప్పటికీ శాశ్వతముగా యుండునది. మోక్షము శాశ్వతమైనది కాగా, ప్రాపంచిక జీవిత సుఖములు అనగా స్వర్గసుఖములు అశాశ్వతమైనవి. అందువలన జీవిత సుఖములు ఎన్నియున్నా వాటిని స్వర్గ సుఖములని అంటాము. స్వర్గ సుఖములన్నీ తాత్కాలికమేయని చెప్పవచ్చును. ఎందుకనగా ఒక గంట పుణ్యఫలము చేత సుఖమును అనుభవించినవాడు తర్వాత వచ్చు పాపఫలితమును అనుభవించడములో కష్టాలపాలయి అనేక బాధలు అనుభవించవలసియుండును. కష్టాలు, బాధలు అనుభవించడమే నరకమని తెలియవలెను.

ఇదే విషయమును గురించి ప్రథమ దైవగ్రంథమయిన భగవద్గీతలో రాజవిద్యా రాజగుహ్య యోగమను అధ్యాయమున 21వ శ్లోకములో చెప్పడమైనది.

శ్లో॥ తేతం భుక్త్వా స్వర్గలోకం విశాలం క్షీణే పుణ్యే మర్త్యలోకం విశన్తి ।
ఏవం త్రయీధర్మ మనుప్రపన్నా గతాగతం కామకామా లభన్తే ॥

**భావము :-** "స్వర్గ లోకములో సుఖములనుభవించిన తర్వాత నరకలోకమునకు వచ్చుచుందురు. ఈ విధముగా మూడు గుణముల కోర్కెలుగలవారికి మూడు గుణ కర్మల వలన అశాశ్వతమైన సుఖములు లభించుచుండును." ఈ భావమును చూచిన తర్వాత స్వర్గనరకములు రెండూ అశాశ్వతమైనవనీ, స్వర్గనరకములకు మోక్షము వేరుగాయున్నదనీ తెలియుచున్నది. పైన 40వ వాక్యములో ఎవడయినా పాపానికి పాల్పడినా, పుణ్యానికి పాల్పడినా, దానికి సమానమైన ఫలితమే వస్తుందని చెప్పారు. దాని అర్థము పుణ్యానికి స్వర్గము, పాపానికి నరకమని అర్థము. అయితే దేవుని మీద విశ్వాసమును పెంచుకొన్న జ్ఞానులయిన వారికి మోక్షము లభిస్తుందని కూడా చెప్పారు. "స్వర్గనరకములు అశాశ్వతమైనవనీ, మోక్షము శాశ్వతమైనదని" దేవుని జ్ఞానము చెప్పినా, మనిషి దేవుని జ్ఞానమును లెక్క చేయకుండా, అశాశ్వతమైన స్వర్గసుఖములవైపు పరుగెడుతున్నాడు. స్వర్గముతో పాటు నరకమును కూడా అనుభవిస్తున్నాడు.

మనిషి చనిపోయిన తర్వాత స్వర్గ, నరకములుంటాయని హిందువులు చెప్పగా, ముస్లీమ్‌లు మనిషి చనిపోయిన తర్వాత, భూమిలో పూడ్చిపెట్టిన తర్వాత ప్రళయము సంభవించిన రోజు దేవుడు వచ్చి మనిషిని స్వర్గమునకు, లేక నరకమునకు పంపుతాడని చెప్పుచున్నారు. అయితే దైవ గ్రంథములలో చెప్పిన విధానము ప్రకారము మనిషి ఒక జన్మలో చేసుకొన్న పాపపుణ్యములను రెండవ జన్మలో కష్టసుఖముల రూపమున అనుభవించుననియున్నది. ప్రథమ దైవగ్రంథములో వివరముగా చెప్పగా, అంతిమ దైవగ్రంథములో కొంత సూక్ష్మముగా ఈ విషయములను గురించి

చెప్పడము జరిగినది. అయితే ఖుర్ఆన్ గ్రంథములో చెప్పిన సత్యమును మనిషి అర్థము చేసుకోవడములో పొరపాటుపడినాడు. అందువలన ఖుర్ఆన్ గ్రంథములో స్వర్గ, నరకముల మరియు మోక్షముల గురించి చెప్పిన విషయములను వేరుగా అర్థము చేసుకోవడము వలన స్వర్గ నరకములు ఎప్పుడో వస్తాయని చెప్పుకోవడమేకాక మోక్షమును కూడా స్వర్గము క్రిందికే జమకట్టుకొని వ్రాసుకోవడము జరిగినది.

స్వర్గముగానీ, నరకముగానీ, మోక్షముగానీ మనిషి చనిపోయిన తర్వాతనే లభించును. పుట్టిన ప్రతి మనిషికీ మరణము తప్పక యుంటుంది. మనిషి మరణమును పొందడము ప్రత్యక్షముగా చూస్తున్నాము. అయితే మనిషి చనిపోయిన తర్వాత తిరిగి పుట్టుచున్నాడనీ ప్రథమ దైవగ్రంథములో, అంతిమ దైవగ్రంథములోయున్నా, మనిషి అక్కడ చెప్పిన విషయమును అర్థము చేసుకోలేక మనిషి ఒకేమారు పుట్టి, ఒకేమారు చనిపోతాడు. తర్వాత రెండవమారు పుట్టడు, రెండవమారు చనిపోడుయని అనుకొంటున్నారు. ఆ విషయమును ఖుర్ఆన్ గ్రంథములో వ్రాయకున్నా, ప్రతి ముస్లీమ్ మనిషికి రెండవ జన్మలేదు, రెండవ మరణము లేదు అంటున్నారు. ఆ మాట ఖుర్ఆన్ గ్రంథమునకు వ్యతిరేఖమని వారు ఏమాత్రము అనుకోలేదు. పైగా వారు అనుకొన్నదే ఖుర్ఆన్‌లో దేవుడు చెప్పాడని అనుకొంటున్నారు. కొందరు మతపెద్దలు చెప్పిన విషయమునే నమ్ముట వలన ఆ విధముగా మిగతా ముస్లీమ్‌లు అనుకోవడము జరుగుచున్నది. ముస్లీమ్‌లందరూ ఖుర్ఆన్ గ్రంథము చదువలేదు. కొందరు చదివినా అరబ్బీభాషలో చదువుట వలన అది ఏమాత్రము అర్థము కావడములేదు. అరబ్బీ అక్షరములను నేర్చుకొని గ్రంథమును చదివిన వారికి అరబ్బీభాష తెలియకపోవడము వలన చదివిన వారికి అందులోని భావము ఏమాత్రము అర్థము కాలేదు.

ఖుర్‌ఆన్ గ్రంథమును అరబ్బీభాషలో చదువుట వలన చదివామను తృప్తి తప్ప అందులో ఏమి విషయమున్నదో తెలియదు. విషయమే తెలియనప్పుడు ఆ విషయములోని భావము తెలియుటకు అవకాశమే లేదు. అందువలన ఖుర్‌ఆన్ చదివినవారికి కూడా ఖుర్‌ఆన్‌లో ఏమున్నదీ తెలియదు. అందువలన ఎవరో మొదటివారు చెప్పిన విషయమునే ఒకరికొకరు పరంపరగా చెప్పుకోవడము జరుగుచున్నదిగానీ, అందరికీ వాస్తవముగా ఖుర్‌ఆన్ గ్రంథములో ఏమున్నదో తెలియకుండా పోయినది. ముస్లీమ్ సమాజములో ఎక్కువగా వినిన దానిమీదనే ఆధారపడడము జరుగుచున్నది. చదివిన దానిమీద ఆధారపడి జ్ఞానము తెలియడము లేదు. ఒకవేళ ఎవరయినా తాము స్వయముగా ఖుర్‌ఆన్ గ్రంథమును చదివి తెలుసు కొనుటకు ప్రయత్నించినా, అందులోని విషయములు కొన్ని స్థూలముగా, కొన్ని సూక్ష్మముగా యుండుట వలన స్థూలమైన విషయములు అర్థమయినా, సూక్ష్మమైన విషయములు ఏమాత్రము అర్థముకావు. అటువంటప్పుడు ఆ విషయములు తెలియకుండాపోవుచున్నవి. అక్కడ ఒక విషయముంటే మరొక విషయముగా అర్థము చేసుకొనుట వలన, వాస్తవ జ్ఞానము తెలియకుండా పోయినది.

చావుపుట్టుకల విషయములోనికి వస్తే ఖుర్‌ఆన్ గ్రంథము ఎంతో సూక్ష్మముగా వ్రాసిన విషయమగుట చేత, ఆ విషయము ఎవరికీ అర్థము కాక జన్మలున్నాయని చెప్పినా జన్మలు లేవని అర్థము చేసుకొంటున్నారు. పూర్వమునుండీ జన్మల విషయములో పొరపడిపోయిన కొందరు ఒకరికొకరు జన్మలు లేవని చెప్పుకోవడము వలన, క్రొత్తగా గ్రంథము చదివిన వారికి కూడా గ్రంథములో జన్మలు లేనట్లే అర్థమగుచున్నది. అది ఖుర్‌ఆన్‌కు వ్యతిరేఖమైన మాటయని ఎవరూ అనుకోవడము లేదు. చావు

పుట్టుకలను గురించి ఖుర్‌ఆన్ గ్రంథములో ఏమి చెప్పారని గమనించితే సూరా 6లో ఆయత్ 2 నందు ఇలా కలదు. **(6-2) “ఆయన మనుషులను మట్టితో చేశాడు. ఆపైన ఒక గడువును నిర్ధారించాడు. మరో నిర్ణీత గడువు మాత్రము అల్లాహ్‌వద్ద మాత్రమే యున్నది. అయినా మీరు సంశయానికి లోనైయున్నారు.”** ఇక్కడ ఈ వాక్యమును గమనించితే చివరిలో “మీరు సంశయానికి లోనైయున్నారు” అని చెప్పారు. నేను చెప్పినా మీరు నమ్మకుండా అనుమానముతో యున్నారు అనియేగా అందులోని అర్థము. ఖుర్‌ఆన్ గ్రంథములో సూక్ష్మ విషయమున్నచోటంతా, మనిషి అర్థముచేసుకొనుటకు కష్టముగా యున్నచోటంతా వాక్యము చివరిలో ఇక్కడ చెప్పినట్లు ఏదో ఒక వాక్యమును చెప్పియుండుటను గమనించ వచ్చును. ఇదే సూరాలోనే 9వ వాక్యము చివరిలో “మీరు ఎటువైపు పోతున్నారు” అని వ్రాశారు. ఇట్లు ఏదో ఒక చిన్న వాక్యమును వాక్యము చివరిలో చేర్చి, ఈ వాక్యము అర్థము చేసుకోవడములో చాలా కష్టమైనది, సులభముగా అర్థముకాదు జాగ్రత్తయని హెచ్చరిక చేయుచున్నారు. ఇప్పుడు పై వాక్యము చివరిలో మీరు సంశయానికి లోనైయున్నారు అని చెప్పారు అంటే, ఇది కూడా సూక్ష్మభావముతో కూడుకొన్న వాక్యమని అర్థమగు చున్నది. ఇప్పుడు ఈ వాక్యమును పరిశీలించి చూచితే వాక్యము మొదటిలోనే ఆయన మనుషులను మట్టితో చేశాడు అని కలదు. అలా చెప్పినప్పుడు మనుషుల బొమ్మలను కుమ్మరివాడు మట్టితో చేయుట సహజమే అయినా, ఇక్కడ ప్రాణముగల మనుషులను తయారు చేసిన వాడు దేవుడేయని తెలియవలెను. రెండవ వాక్యములో ఆపైన ఒక గడువును నిర్ధారించాడు అని కలదు. మనిషిని తయారు చేసిన దేవుడు కుమ్మరివలె బొమ్మ మనిషిని తయారు చేయకుండా కదలాడే బొమ్మవలెనున్న మనిషిని

తయారు చేశాడు. కుమ్మరి మట్టితో బొమ్మను చేయగా దేవుడు కూడా మట్టితోనే మనిషి బొమ్మను తయారు చేశాడు. కుమ్మరి మట్టితో చేసిన బొమ్మలో ఆకారమున్నట్లే దేవుడు తయారు చేసిన మనిషి బొమ్మలో కూడా ఆకారమున్నది.

ఒక విధముగా దేవున్నీ, కుమ్మరినీ ఒక విధముగా పోల్చుకొని చూడవచ్చును. ఇద్దరు చేసినవీ మనిషి బొమ్మలే అనుకొనుము. అయితే ఇది మనిషి చేసిన మనిషిబొమ్మ, ఇది దేవుడు చేసిన మనిషిబొమ్మయని గుర్తించవచ్చును. చేసినవాడు కుమ్మరి అయినా, అది కదలని బొమ్మ అయినా, కుమ్మరి చేత చేయించినవాడు అసలయిన కుమ్మరి దేవుడేయని తెలియవచ్చును. కనిపించే కుమ్మరి మనిషిబొమ్మను మట్టితో చేసినట్లు, కనిపించని కుమ్మరియైన దేవుడు కదలాడే మనిషి బొమ్మను మట్టితోనే చేశాడు. కనిపించే కుమ్మరి మనిషి బొమ్మను మట్టితో చేశాడని అందరూ చెప్పగలరు. అయితే దేవుడు చేసిన కదలాడే మనిషి బొమ్మను ఖుర్ఆన్ యందు 6వ సూరా, 2వ వాక్యములో దేవుడు మనుషులను మట్టితో చేశాడు అని చదివినా అది చదివేవరకేగానీ మనిషి మట్టితో తయారయినాడని ఎవరూ ఒప్పుకోరు. మేము విజ్ఞానులము అనువారు అదంతా మూఢనమ్మకము అంటారు. దేవుని వాక్యములో సత్యమున్నదని ఎవరూ గ్రహించరు. "గ్రంథములో వాక్యమున్నది, చదివాము చదివితే అదే నిజమని నమ్మాలా? మనిషి మాంసము ఎముకలతో తయారయినాడుగానీ నిజముగా మట్టితో తయారు కాలేదు కదా!" అని ప్రశ్నించువారున్నారు.

దేవుడు మనిషిని మట్టితో తయారుచేసిన విషయమును అటుంచి కుమ్మరి తయారు చేసిన మనిషిబొమ్మను వివరించుకొని చూస్తాము. కుమ్మరి

మనిషే అయినా ఆ మనిషిని ఆడించువాడు, కదిలించువాడు, నడిపించు వాడు మరొకడు ఉన్నాడు. మనిషి శరీరములోనే ఉండి మనిషిని ఆడించువాడు బయట కనిపించు కుమ్మరిచేత మనిషి బొమ్మను తయారు చేయించాడు. పైకి కనిపించు కుమ్మరి బొమ్మను తయారు చేసినా మట్టితోనే చేయాలి. అయితే ఒక్క మట్టితోనే బొమ్మ కాదు. మన్నులోనికి నీరును కలిపి చేతులతోనూ తొక్కుచూ, చేతులతో కుమ్ముచూ మట్టిని బాగా మెత్తగా కలుపుకోవాలి. తర్వాత బురదతో బొమ్మను చేసి గాలికి ఆరబెట్టాలి. గాలికి ఆరిన తర్వాత అగ్గితో కాల్చాలి. అప్పుడు బొమ్మ గట్టిపడిపోవును. అగ్గితో కాల్చిన బొమ్మను నీటిలో వేసినా అది కరిగిపోక గట్టిగాయుండును. చేతులతో మట్టిని కుమ్ముచూ బొమ్మను చేయుటవలన బొమ్మను చేసినవానిని కుమ్మరి అని పేరుపెట్టి చెప్పడము జరిగినది. కుమ్మరి ఒక బొమ్మను తయారు చేయుటకు మట్టిని వినియోగించి దానికి మిగతా నాలుగు భూత భాగములను చేర్చుట వలన బొమ్మ తయారయినది. అలా చేసిన బొమ్మ కదలనిదయినా అది పంచభూత నిర్మితమయినదగుట వలన అందులో కూడా జీవము చేరుచున్నది. అలా జీవమున్న బొమ్మను విగ్రహము అంటాము.

ఇప్పుడు దేవుడు చేసిన మనిషిని గురించి మాట్లాడితే బయట బొమ్మలో పంచభూతములు వినియోగించబడినట్లు మనిషిలో కూడా పంచ భూతములు వినియోగించబడినాయి. అందువలన మనిషి శరీరములోనికి జీవుడు చేరినాడు. అలా చేరిన జీవుడు వినిన దానిని గ్రహించుశక్తి గలవాడై యున్నందున జీవున్ని గ్రహము అని అంటున్నాము. కుమ్మరి చేసిన బొమ్మను వేలితో గీకి చూస్తే మట్టివచ్చును. అలాగే దేవుడు చేసిన మనిషి చర్మమును వేలితో రాపిడిచేస్తే మట్టియే వచ్చును. స్నానము చేసిన తర్వాత

శుభ్రముగాయున్నప్పుడు వేలితో రుద్దితే మట్టియే వచ్చును. అలా మట్టి వచ్చుటకు కారణము దేవుడు మనిషిని మట్టితోనే చేశానని ఖుర్ఆన్ గ్రంథములో చెప్పాడు కదా! అది మూఢనమ్మకము కాదుయని విజ్ఞానులు తెలియునట్లు చర్మము మీద తిక్కితే మట్టిరావడము జరుగుచున్నది. అలా మట్టితో తయారు చేసిన మనిషిగానీ, మనిషిబొమ్మగానీ జీవమే కల్గియున్నాయి. అయితే మనిషిలో గానీ, మనిషి బొమ్మలోగానీ ఉన్న జీవుడు ఆ బొమ్మలలో కొంతకాలముండునట్లు దేవుడు ఒక గడువును ఉంచాడు. మట్టిబొమ్మ లోపలి విషయము ఎవరికీ తెలియదుగానీ, మనిషి శరీరములోని విషయము అందరికీ తెలియుచున్నది. కావున దానిని గురించి చెప్పుకుంటే, మనిషి కొంత కాలము బ్రతికి తర్వాత చనిపోవడము జరుగు చున్నది. ఒక మనిషి ఎంతకాలము బ్రతకాలి, ఎప్పుడు చనిపోవాలి అని ఒక గడువును దేవుడు మనిషిని పుట్టించినప్పుడే నిర్ణయించియుండును. అందువలన పై వాక్యములో ఒక గడువును దేవుడు నిర్ధారించాడు అని చెప్పారు. దేవుడు మనిషి జీవిత కాలమును నిర్ధారించిపెట్టాడు. జీవిత కాలము ముగియు సమయమును గడువు అని చెప్పారు. ఎప్పుడు గడువు వచ్చునో అప్పుడు మరణము వచ్చును. మరణముతో మనిషికి ఒక జీవితము అగుచున్నది. మనిషి పుట్టినప్పటినుండి మరణించు వరకు ఒక జీవితము అగుచున్నది. పుట్టుకతో ప్రారంభమయిన జీవితము మరణముతో అంత్య మగుచున్నది. ఒక జీవితములోని మరణమును ఆ జీవితపు గడువు అని చెప్పవచ్చును.

దేవుడు మనిషిని పుట్టించినప్పుడే ఆ జీవితము ఎప్పుడయిపోవునది ముందే నిర్ణయించియుండును. జీవితము అయిపోయిన వెంటనే మనిషికి తిరిగి రెండవ జన్మను దేవుడు కల్గించుచున్నాడు. కావున దేవునివద్ద రెండవ

గడువు కూడాయున్నదని చెప్పవచ్చును. దేవుడు రెండవ గడువును కూడా నిర్ధారించియున్నాడు కావున మనిషికి రెండవ జన్మ, రెండవ మరణము రెండూ ఉన్నాయని తెలియుచున్నది. అదే పద్ధతి ప్రకారము రెండవది గడచునప్పుడు రెండవ దానినిబట్టి మూడవ గడువు నిర్ణయమగును. ఈ పద్ధతి ప్రకారము ఒకదాని తర్వాత రెండవ గడువు తయారగుట వలన మనిషికి వరుసగా జన్మలు మరియు మరణములు కల్గుచున్నవని చెప్పవచ్చును. ఖుర్‌ఆన్‌లో ఈ వాక్యమును చూచిన తర్వాత మనిషి ఒకమారే పుట్టును ఒకేమారే మరణించును అను కొందరిమాట అసత్యమని తెలియుచున్నది. ఖుర్‌ఆన్ గ్రంథములో ఇంకా కొన్నిచోట్ల మనిషికి జన్మలున్నాయని చెప్పినమాటను దృఢపరచుటకు ఇంకా కొన్ని వాక్యములు గలవు. సూరా 7లో, ఆయత్ 29లో ఇలా కలదు చూడండి. **(7-29) "మొదటిసారి అల్లాహ్ మిమ్మల్ని ఎలా పుట్టించాడో, మలిసారి కూడా మీరు అలాగే పుట్టించబడతారు".** ఈ వాక్యమును చూచిన తర్వాత మొదట జన్మ ఎలా కల్గినదో, అలాగే రెండవ జన్మకూడా కలదని అందరికీ తెలిసిపోవుచున్నది. ఎవడయినా రెండవ జన్మలేదు అంటే ఖుర్‌ఆన్‌లో దేవుని వాక్యమునకు వ్యతిరేఖముగా మాట్లాడినట్లగును. అల్లాహ్ మాటకు వ్యతిరేఖముగా మాట్లాడినవాడు ముస్లీమ్‌యే కాదు, అతను దేవునికి విధేయుడెట్లగును? అట్టివానిని దేవునిపట్ల తిరస్కార వైఖరి అవలంబించిన వానిగా లెక్కించవలెను. ఈ విషయమును గురించి ఖుర్‌ఆన్ గ్రంథములో సూరా 13లో, ఆయత్ 5నందు ఇలా కలదు. **(13-5) "ఓ ప్రవక్తా! నీవు ఆశ్చర్యపడవలసియుంటే, ఏమిటి? మరణించి మట్టి అయిపోయిన తర్వాత మళ్ళీ క్రొత్తగా పుట్టించబడతామా? అన్నవారి మాటలపై ఆశ్చర్యపోవాలి. తమ ప్రభువుపట్ల తిరస్కారవైఖరిని అవలంబించిన**

**వారు వీరే, గొలుసులు వేయబడేది వారి మెడలోనే, నరకములో వీరే కలకాలము ఉంటారు".**

ఇక్కడ ఒక కథను చెప్పుకొన్న తర్వాత పై వాక్యమునకు వివరము చెప్పుకొందాము. పూర్వము అడవి ప్రాంతములో ఒక గురువు పదిమంది శిష్యులు జీవనము సాగించుచూ, జ్ఞానసాధన చేయుచూ మోక్షము మీద ఆసక్తి కల్గియుండిరి. వారిలో ఒక శిష్యుడు ప్రమాదవశాత్తూ ప్రవహించు నీటిలోపడి చనిపోయాడు. మరణములు నాలుగు విధములు కాగా, అందులో ఓంకార్ అను శిష్యుడు అకాలమరణమును పొందడము జరిగినది. కాలమరణమును పొందినవాడు వెంటనే జన్మకు పోతాడు. అకాలమరణము పొందినవాడు రెండవ జన్మకు పోవడము జరుగదు. అకాలమరణమును పొందినవాడు పది భాగముల స్థూల శరీరమును కోల్పోయి, పదిహేను భాగముల సూక్ష్మశరీరముతో సజీవముగానే భూమిమీద యుండును. ఆ విషయము గురువుగారికి బాగా తెలుసు. మిగిలిన పదిహేను భాగములలో ఒకడు జీవుడుకాగా, మిగతా పదునాలుగు సూక్ష్మ శరీరమునకు సంబంధించినవైనందున కనిపించవు. జీవుడు కూడా సూక్ష్మ మైనవాడే కనుక ఎవరి దృష్టికీ కనిపించడు. మొత్తము పదిహేను భాగములు కనిపించక యుండడము వలన ఓంకార్ చనిపోయినా అతని పైశరీరము మాత్రము మరణించినది. లోపల శరీరమైన సూక్ష్మశరీరము అలాగే బ్రతికేయున్నది. అందువలన అకాల మరణము పొందినవాడు రెండవ జన్మకుపోడని చెప్పాము. ఓంకార్‌కు పూర్తి ఆయుష్షు 38 సంవత్సరములు కాగా అతడు 32 సంవత్సరములకే అకాలములో మరణించాడు. అతడు మరణించిన తర్వాత ఇంకా ఆరు (6) సంవత్సరములు బ్రతుకవలసి యున్నది.

బయటికి అందరి దృష్టిలో ఓంకార్ చనిపోయినా, అతను పొందిన మరణము అకాలమరణమైనందున ఓంకార్ పూర్తి చనిపోలేదని గురువు గారికి బాగా తెలుసు. ఓంకార్ చనిపోయిన తర్వాత అతను తొమ్మిదిమంది శిష్యులవద్దనే యుంటూ ఆశ్రమములోనే కాలము గడుపుచుండెను. తాను అకాలమరణము పొందిన దానివలన మిగతా శిష్యులకు కనిపించననీ, అందువలన వారు తనను పలకరించరనీ ఓంకార్‌కు తెలియుటవలన ఇక తన బ్రతుకు ఇంతేనను నిర్ణయముతో గురువుగారు చెప్పు జ్ఞానబోధలు వింటూ కాలము గడుపుచుండెను. ఆ విధముగా ఓంకార్ చనిపోయి ఆరు నెలల కాలమయినది. అంతలో ఒకరోజు వారి ఆశ్రమములో దొంగ తనము జరిగినది. అడవికి ప్రక్క గ్రామములోయుండే ఒక దొంగ, గురువు గారి ఆశ్రమములో ప్రవేశించి పంచలోహములతో చేసిన పాండురంగ స్వామి ప్రతిమను ఎత్తుకొని పోయాడు. దొంగ రాత్రిపూట ప్రవేశించిన దానివలన ఆ సమయములో గురువు శిష్యులు అందరూ నిద్రించుచుండిరి. అయితే ఓంకార్ ఒక్కడు మేల్కొనియుండెను. అతను మేల్కొనియుండుట వలన దొంగ ఆశ్రమములోనికి ప్రవేశించినదీ, అతను ఆశ్రమమంతా వెదకినా ఏమీ దొరకనిదీ, అంతా ఓంకార్ చూస్తూయుండెను. దొంగ ఆశ్రమములో అరగంటసేపు వెదికి ఏమీ దొరకక చివరకు పంచలోహ విగ్రహమును ఎత్తుకొని పోవడమును ఓంకార్ చూచాడు. అయితే ఓంకార్ సూక్ష్మశరీరముతో యుండుట వలన తాను దొంగతనమును నివారించలేక పోయాడు, దొంగను పట్టుకోలేకపోయాడు.

ఉదయము గురువు శిష్యులు అందరూ లేచిన తర్వాత ఆశ్రమములో పాండురంగస్వామి ప్రతిమ లేకపోవడమును చూచి ఆశ్చర్య పోయారు. దొంగతనము జరిగిన విషయము వారికి ఏమాత్రము తెలియదు.

అయితే పాండురంగస్వామి ప్రతిమ కనిపించకపోవడమును గురించి అనేకరకముల ఆలోచనలు వచ్చాయి. చివరకు ఆశ్రమములో సరియైన పూజలు చేయకపోవడము వలన పాండురంగస్వామికి కోపమువచ్చి అదృశ్యమైపోయాడని అనుకోవడము జరిగినది. అదే విషయమునే ఒకరికొకరు చెప్పుకొనుచుండగా ఓంకార్ ఆ విషయమును విన్నాడు. పాండురంగస్వామి ప్రతిమను దొంగ ఎత్తుకుపోయాడను విషయము ఒక్క ఓంకార్‌కు మాత్రమే తెలియుట వలన ఆ విషయమును తమ గురువుగారికి ఓంకార్ తెలియజేయాలనుకొన్నాడు. ఓంకార్‌కు భౌతిక శరీరము లేనందున అతడు ఇతరుల శరీరములోనికి ప్రవేశించి చెప్పవలసిన అవసరము ఏర్పడినది. అప్పుడు ఓంకార్ మిగతా తొమ్మిదిమంది శిష్యులలో ఒక శిష్యునిలో చేరి ఆ శరీరము ద్వారా గురువుగారితో మాట్లాడాడు. గురువు గారు ఓంకార్ మరొక శిష్యుని శరీరములోనికి ప్రవేశించి మాట్లాడుచున్నాడని గ్రహించగలిగాడు. అప్పుడు ఓంకార్ ద్వారా పాండురంగ స్వామి ప్రతిమ విషయమును తెలుసుకొన్నాడు. ఓంకార్ చనిపోయి ఆరునెలలు గడచిన తర్వాత ఓంకార్ మరొక శరీరము నుండి తమతో ప్రత్యక్షముగా మాట్లాడినందుకు ఐదుగురు శిష్యులు మాత్రము సంతోషపడినారు. మిగతా నలుగురు ఊరకయుండిపోయారు.

అంతటితో ఆ సమాచారము అయిపోగా, ఆరు సంవత్సరముల తర్వాత ఓంకార్ పూర్తి చనిపోయినవాడై మరొకచోట జన్మించడము జరిగినది. ఆ విషయము గురువు తన గ్రాహితశక్తితో గుర్తించగలిగాడు. అప్పుడు ఓంకార్ రెండవ జన్మలో వచ్చియున్నాడు అని చెప్పితే నలుగురు శిష్యులు గురువుగారి మాటను నమ్మలేదు. ఐదుమంది శిష్యులు గురువుమాటను నమ్మినారు. మిగతా నలుగురు శిష్యులు ఓంకార్ మరొక

శరీరమునుండి మాట్లాడినప్పుడు మౌనముగాయుండిపోయినవారే ఓంకార్ పుట్టాడని చెప్పినా గురువుగారి మాటను నమ్మలేదు. అలా వారు నమ్మకపోవడమునకు కారణమేమనగా! ఆ నలుగురూ ముస్లీమ్‌మతము వారు, చిన్నతనములో పన్నెండు (12) సంవత్సరముల వయస్సులో ఇద్దరు అనాథలుగా వచ్చి ఆశ్రమములో చేరగా, ఇరవై (20) సంవత్సరముల వయస్సులో మరో ఇద్దరు అనాథలుగావచ్చి ఆశ్రమములో చేరిపోయారు. 20 సంవత్సరముల వయస్సులో వచ్చినవారు ఆ వయస్సుకే వారి మతపెద్దలు చెప్పిన మతములోని సూత్రములన్నీ తెలిసియుండుటవలన మిగతా ఇద్దరికీ కూడా అదే జ్ఞానమును చెప్పారు. మొత్తానికి నలుగురు ముస్లీమ్‌లలో ఇద్దరు 22 సంవత్సరముల వయస్సువారుకాగా, ఇద్దరు 40 సంవత్సరముల వయస్సు వారుండిరి. ఆ నలుగురూ మనిషి తిరిగి పుట్టడు అని గాఢముగా నమ్మిన వారైయుండుట వలన వారు గురువుగారి మాటను సత్యముగా తలువలేదు. తర్వాత రెండవరోజు గురువుగారికి నలుగురు ముస్లీమ్ శిష్యులు తమలోని భావమును బయటికి వెలిబుచ్చుచూ ఈ విధముగా ప్రశ్నించారు. "ఓంకార్ చనిపోయి ఆరు సంవత్సరములయినది. ఓంకార్ మరణించి మట్టియైపోయిన తర్వాత మళ్ళీ క్రొత్తగా పుట్టించబడుతాడా?" అని అడిగారు. అప్పుడు గురువుగారు ఇలా చెప్పారు. "ప్రథమ దైవ గ్రంథమయిన భగవద్గీతలో భగవంతుడు **సాంఖ్యయోగమున 27వ శ్లోకమందు "జాతస్య హి ధృవో మృత్యు ర్ధ్రువం జన్మ మృతస్యచ"** అని చెప్పాడు. దాని భావము ప్రకారము **"జన్మించినది చచ్చుటకొరకే, చచ్చుట జన్మించుటకే ఇది అనివార్య కార్యము"** అని అన్నాడు. ఇది ధర్మశాస్త్రమయిన భగవద్గీతలోని దేవునిమాట. ఈ మాటను విశ్వసించని వాడు దేవునిపట్ల తిరస్కారవైఖరి అవలంబించినట్లగును అని చెప్పాడు.

పై వాక్యములో శరీరము నశించి మట్టియైపోయినా జీవుడు తిరిగి జన్మించుననీ, ఆ మాటను నమ్మలేనివాడు దేవున్ని కూడా నమ్మనివాడేయనీ చెప్పాడు తప్ప జన్మలు లేవని చెప్పలేదు కదా! పై వాక్యము (13-5)లో జన్మలున్నాయనియే చెప్పారు. 7-29 వాక్యములో **(7-29) "మొదటిసారి దేవుడు మిమ్మల్ని ఎలా పుట్టించాడో, రెండవమారు కూడా మీరు అలాగే పుట్టబడుతారు"** అని చెప్పారు. అంతేకాక సురా 22, ఆయత్ 66 లో ఇలా కలదు చూడండి. **(22-66) "మీకు జీవనము ప్రసాదించిన వాడు ఆయనే, మరి ఆయనే మరణమును ఇస్తాడు, మళ్ళీ ఆయనే మిమ్మల్ని తిరిగి బ్రతికిస్తాడు. అయినా మానవుడు మేలును మరచేవాడే"** ఇదే ఖుర్ఆన్ గ్రంథములో మరియొకచోట సూరా 36, ఆయత్ 68లో జిబ్రయేల్ ముహమ్మద్ ప్రవక్తగారికి ఇలా చెప్పాడు. **(36-68) "మేము వృద్ధాప్యానికి చేరినవారిని మళ్ళీ జనన స్థితికి తీసుకపోతాము. అయినా వాళ్ళు అర్థము చేసుకోరేమిటి?"** అని చెప్పారు. అంతేకాక ఇదే ఖుర్ఆన్ గ్రంథమందు సూరా 40, ఆయత్ 11లో **(40-11) "మా ప్రభూ! నీవు మాకు రెండుసార్లు చావునిచ్చావు, రెండుసార్లు బ్రతుకును ఇచ్చావు. ఇప్పుడు మేము మా పాపాలను ఒప్పుకొంటున్నాము. మరి ఇప్పుడు మేము బయటపడే మార్గము ఏదయినా ఉందా? అని విన్నవించుకుంటారు."** ఇంతవరకు ఆరు వాక్యములను చూచాము. ఆరు వాక్యముల లోనూ మనిషి చనిపోయిన తర్వాత జన్మలున్నాయని చెప్పారుగానీ, లేవని ఎక్కడయినా చెప్పారా? 36-68లో అయినా వాళ్ళు అర్థము చేసుకోరేమిటి? అని కూడా అడగడము జరిగినది. జన్మలున్నాయని చెప్పినా ఆయత్‌లలో వ్రాసియుంచినా, ఇంకా కొందరు అర్థము చేసుకోవడము లేదు, నా మాటలను విశ్వసించడములేదు అని దేవుని తరపున జిబ్రయేల్ చెప్పాడు.

గ్రంథములలోని విషయములను మనిషి విశ్వసించకపోతే ఆ విషయములను ఏ మనిషీ వివరించి చెప్పలేడు కనుక దేవుడు తనవైపు నుండి ఒక ప్రతినిధిని పంపును. దేవునివద్దనుండి వచ్చిన ప్రతినిధిని దేవుని దూత అంటారు. **దేవుని దూత వచ్చినప్పుడు అంతవరకూ తెలియని విషయములు పూర్తి వివరముగా తెలియబడును.** ఈ విషయమును గురించి ఖుర్‌ఆన్ గ్రంథములో సూరా 2, ఆయత్ 30లో ఇలా చెప్పారు. **(2-30) "నేను భువిలో ప్రతినిధిని చేయబోతున్నాను అని ప్రభువు తన దూతలతో అన్నప్పుడు భూమిలో కల్లోలాన్ని రేకెత్తించి, రక్తం ప్రవహింపజేసేవాడిని ఎందుకు సృష్టిస్తావు ప్రభూ! నిన్ను స్తుతించటానికి, ప్రశంసించటానికి, నీ పవిత్రతను కొనియాడడానికి మేమున్నాము కదా! అని వారన్నారు. దానికి అల్లాహ నాకు తెలిసినవన్నీ మీకు తెలియవు"** అని అన్నాడు. ఈ వాక్యములో మనుషులకు అర్థముకాని విషయములను తెలుపు నిమిత్తము, జన్మలు ఉన్నాయని గ్రంథములో వ్రాసియుంచినా, అర్థముకానివారికి నిజమైన భావముతో జ్ఞానమును తెలియజేయుటకు తన ప్రతినిధిని భూమిమీదకు పంపుతానని తన పరిపాలనా దూతలతో చెప్పగా, అంతకుముందు వచ్చి పోయిన ఏసును దృష్టిలో పెట్టుకొని జ్ఞానముతో కల్లోలాన్ని రేకెత్తించేవాడిని అని చెప్పారు. తర్వాత రక్తము వలన పాపము పోతుందని ఏసు రక్తమును ప్రవహింపజేశాడని (కార్చినాడని) ఏసులాంటి వాడు మాకు వద్దు అన్నారు. అప్పుడు తన పాలకులతో దేవుడు నాకు తెలిసినవన్నీ మీకు తెలియవు అని అన్నాడు. దేవుడు ఎవరిని పంపుతాడో, ఎటువంటివానిని పంపుతాడో ఆయనకే తెలుసు. ఏసు విషయములో అందరూ రక్తము వలన పాపము పోతుంది. రక్తము కార్చడము వలన పాపరక్షణ కలుగుతుందియని అందరూ అంటున్నారు. కానీ ఆ విధముగా

ఏసు ఎప్పుడూ చెప్పలేదు. బయట ఏమి జరిగినా చివరకు స్వచ్ఛమయిన జ్ఞానమును చెప్పు ప్రతినిధినే పంపును. దేవుని ప్రతినిధియంటే దేవునికి కొద్దిగా తక్కువయుండేవాడేగానీ అతను దుష్టుడో, దుర్మార్గుడోకాడు. ప్రతినిధియంటే అంటే అర్థము ఇలా కలదు. **"నిధి"** యంటే **"ధనము"** **"ప్రతి"** యనగా **"దేవునికి మారుగాయున్న"** అని అర్థము. దేవునివద్ద జ్ఞానధనము ఎంతయుందో అంత జ్ఞానధనము కలవాడుయని అర్థము. అటువంటివాడు భూమిమీదికి వస్తే అతను దేవునికి మారురూపుగా, లేక దేవునికి మారు పేరుగాయుండును. అతనిని చూచిన పరిపాలనా దూతలందరూ తెలియకనే నమస్కరింతురు. దేవుని పాలనలోని దూతలే నమస్కరించినప్పుడు సాధారణ వాసులైన వారందరూ తప్పక నమస్కరింతురు. ఈ విషయమును ధృవీకరించుటకు ఖుర్ఆన్‌గ్రంథములో సూరా 15, ఆయత్ 29,30లలో దేవుడు ఇలా చెప్పాడు. **(15-29) "నేను అతన్ని పూర్తిగా తయారు చేసి అతనిలో నా ఆత్మను ఊదినప్పుడు మీరంతా అతనిముందు సాష్టాంగపడండి. (30) దేవదూతలందరూ సాష్టాంగపడ్డారు."** ఈ వాక్యములోని వివరమును బాగా గమనించవలసి యున్నది. అలా కాకపోతే దేవుడు చెప్పినమాటకు వ్యతిరేఖముగా నడచినట్లగును. వాక్యము యొక్క వివరమేమనగా! దేవుడు ఒక మనిషిని తయారుచేసి అతనిలోనికి దేవుని ఆత్మనే ఊదాడు. అప్పుడు ఆ మనిషిలో సాక్ష్యాత్తూ దేవుడేయున్నాడని చెప్పవచ్చును. ఎందుకనగా! దేవుని ఆత్మే అతనిలో ఉండుట వలన అతనిని దేవునితో సమానముగా చెప్పడముగానీ, దేవుడనడముగానీ తప్పులేదు. మనిషి దేవుని జ్ఞానమును విశ్వసింపక అనుమానముతో కూరుకు పోయినప్పుడు, తన జ్ఞానమును తానే వివరించి చెప్పుటకు దేవుడు తప్పక మనిషి అవతారములో రావలసియున్నది.

అటువంటివారు తప్పక తల్లిగర్భమునుండే పుట్టవలసియున్నది. అలా పుట్టివచ్చిన దేవుని ఆత్మను ధరించినవానిని ప్రత్యేకమైన పేరుతో భగవంతుడు అని అనడము జరుగుచున్నది. భగవంతుడు అనగా! భగము నుండి పుట్టినవాడు అని అర్థము. భగము అనగా తల్లి గర్భము అని అర్థము. దేవుడు తన ప్రతినిధిని, తన ఆత్మతోనే కనిపించే మనిషిగా పంపినప్పుడు అతనిముందు అందరూ సాష్టాంగ పడవలసిందే. అతడు కనిపించే దేవుడని తెలిసిన ప్రతి ఒక్కరూ భగవంతున్ని నమస్కరింతురు. దేవుని పాలనలోని పాలకులందరికీ అనగా గ్రహములకు, భూతములకు ఫలానా మనిషి భగవంతుడు అని తెలిసినందున వారు తమ ప్రభువు ప్రత్యక్షముగా వచ్చాడని సంతోషించి భగవంతునికి సాష్టాంగపడడము జరుగుచున్నది.

సాష్టాంగ నమస్కారము అనగా ఎనిమిది అంగములు భూమికి తగులునట్లు సాగిలపడి నమస్కరించడము అని అర్థము. స్థూల శరీరము పది భాగములుగా యుండగా అందులో రెండు భాగములు తప్ప మిగతా అన్ని భాగములు భూమికి తగులునట్లు బోర్లపడి నమస్కరించడము అని అర్థము. సాష్టాంగ నమస్కారములో చెవులు, గుదస్థానము తప్ప మిగతా ఎనిమిది భాగములు భూమిమీద ఆనించి నమస్కరించడము ఆచరణగా యున్నది. ప్రపంచములో మూడే నమస్కారములు గలవు. ఒక మనిషిని గౌరవించు నిమిత్తము, అతనిలోని గొప్పతనమును అంగీకరించు నిమిత్తము నమస్కారములు చేయడము జరుగుచున్నది. ప్రపంచములోని మూడు నమస్కారములలో ఒకటి నమస్కారము, రెండు సాష్టాంగ నమస్కారము, మూడు దశాంగ నమస్కారము అని కలవు. చేతులతో మాత్రము చేయునది నమస్కారముకాగా, ఎనిమిది అంగములను భూమిమీద వంచి పడుకొని చేయు నమస్కారమును సాష్టాంగ నమస్కారము అని అంటాము. పది

అవయవములను అనగా మొత్తము స్థూల శరీరమును వంచి భూమికి తగులునట్లు చేసి నమస్కరించడమును దశాంగ నమస్కారము అని అంటాము. సాష్టాంగ నమస్కారములో బోర్లపడుకొని నమస్కరిస్తే ఎనిమిది అంగములు భూమికి తగులును. దశాంగ నమస్కారములో శరీరములో మిగిలిన చెవులు, గుదము కూడా భూమికి తగులునట్లు చేసి నమస్క రించడము జరుగుచున్నది. అదెలాయనగా! మనిషి మొదట సాష్టాంగపడిన తర్వాత కుడిప్రక్కకు పొర్లడము చేస్తే పూర్తి ఒకమారు పొర్లినప్పుడు చెవులు గుదస్థానము భూమికి తగలడము జరుగుచున్నది. ఒకమారు పొర్లి నమస్కరిస్తే దానిని దశాంగ నమస్కారము అనడము జరుగుచున్నది. అనేకమార్లు పొర్లుచూ చేయు నమస్కారములను పొర్లు దండములు అంటారు.

పూర్వము సాధారణమైన లేక సమానమైన మనిషిని గౌరవించు నిమిత్తము నమస్కారమును చేసెడివారు. మనిషికి చేతులతో నమస్కరించడము ఇప్పటికీ గలదు. భగవంతుని విషయములోగానీ, గురువు వద్దగానీ నమస్కరించునప్పుడు సాష్టాంగ నమస్కారమును చేసెడివారు. దేవునివద్ద నమస్కరించునప్పుడు దశాంగ నమస్కారము చేసెడివారు. దేవుని వద్ద అనగా! దేవునికి మారురూపుగాయున్న ఈశ్వరలింగమువద్ద మాత్రము దశాంగ నమస్కారము చేసెడివారు. గురువువద్దగానీ, భగవంతునివద్ద గానీ, పద్ధతిగా సాష్టాంగ నమస్కారమును చేసెడివారు. ఈ విధముగా పూర్వము పద్ధతులన్నీ తెలిసి ఆచరణలను ఆచరించెడివారు. నేడు అట్లు కాకుండా హద్దూపద్దూ లేని ఆచరణలను ఆచరించుచున్నారు. చిన్న దేవుళ్ళ గుడివద్దకూడా పొర్లుదండములు చేయుచున్నారు. గురువులవద్ద సాధారణ నమస్కారమును చేయుచున్నారు. నేడు పూర్వమున్న ఆచరణ ఏమాత్రము తెలియకుండా పోయిన దానివలన నమస్కారములన్నీ మారిపోయాయి.

భూమిమీదికి దేవుడు భగవంతునిగా వచ్చినా ఎవరూ ఆయనను గుర్తించలేరు. అందువలన ఎవరు భగవంతుడని తెలియదు కావున జ్ఞానము చెప్పు ప్రతివానినీ భగవంతుడేమోనని చూడవలసియున్నది. గ్రంథములలోని జ్ఞానమును చదివి చెప్పువాడుగానీ, చదువకుండా జ్ఞాపక శక్తితో చెప్పువాడుగానీ భగవంతుడు కాదుయని తెలియవచ్చును. ఎక్కడయితే లేకుండా పోయిన ధర్మములను చెప్పుచున్నారో, ఎక్కడయితే ఎవరికీ తెలియని రహస్యములను, ఏ గ్రంథములో వ్రాయని జ్ఞానమును చెప్పుచున్నారో అక్కడ భగవంతుడు ఉన్నాడని గుర్తించవచ్చును. భగవంతుడు భూమిమీదికి కొన్ని వేల సంవత్సరములకో, లక్షల సంవత్సరములకో భూమిమీదికి వచ్చి తెలియకుండా పోయిన ధర్మములను తెలియజేసిపోవును. అప్పుడు మాత్రము భగవంతున్ని గుర్తించుటకు వీలుకల్గును. అంతవరకు బోధకులలో పెద్ద బోధకున్ని గురువుగా భావించి సాంప్రదాయము ప్రకారము సాష్టాంగ నమస్కారములు చేయవచ్చును.

ప్రపంచ విషయములలో ఒక పెద్ద ఉద్యోగికి చిన్న ఉద్యోగి గౌరవించుచూ నమస్కారము చెప్పుచుండును. ఒకవేళ చిన్న ఉద్యోగి పెద్ద ఉద్యోగికి నమస్కారము చెప్పకపోతే, పెద్దఉద్యోగి తన గౌరవమునకు భంగము వాటిల్లినట్లు తలచి, నమస్కారము చేయనందుకు ప్రతిఫలముగా అవకాశము వచ్చినప్పుడంతా చిన్న ఉద్యోగిని వేధించను మొదలు పెట్టును. అందువలన పెద్ద ఉద్యోగిని చూచి అతనికి భయపడి చిన్న ఉద్యోగులు నమస్కారము చేయుచుందురు. ఈ విధముగా బయట ప్రపంచములో యుంటే ఆధ్యాత్మిక ప్రపంచములో కూడా పెద్దవారికి చిన్నవారు గౌరవించు నిమిత్తము భక్తితో నమస్కరించవలెనని కలదు. బయట ప్రపంచములో భయముతో నమస్కరించవలసియుంటే ఆధ్యాత్మిక రాజ్యములో కేవలము

భక్తితో గౌరవించవలసియుండును. అయితే మనిషిలో గుణ ప్రభావము ఎక్కువయినప్పుడు మనిషిలో భక్తి లేకుండాపోవడము వలన ఆధ్యాత్మికములో ఎంతపెద్దవానినయినా లెక్కచేయక నమస్కారము చేయనివారు కలరు. అటువంటివారిలో గర్వము అను గుణప్రభావము ఎక్కువగాయుండును. దేవుడు మనిషిరూపములో భగవంతునిగా వచ్చినప్పటికీ గుణ ప్రభావ మునున్నవారు భగవంతునికి కూడా నమస్కరించరు. ఈ విషయమై ఖుర్ఆన్ గ్రంథములో సూరా 15, ఆయత్ 31, 32, 33 లలో ఇలా కలదు చూడండి. **(15-31) "ఇక్కడ ఇబ్లీసు తప్ప సాష్టాంగపడేవారిలో అందరూ సాష్టాంగపడినారు. (32) "ఓ ఇబ్లీస్! సాష్టాంగ పడేవారిలో నీవు ఎందుకు చేరలేదు? అని అల్లాహ్ (దేవుడు) అడిగాడు." (33) "కుళ్ళి ఎండిన నల్లని మట్టితో నీవు సృష్టించిన మనిషి ముందు నేను మోకరిల్లను." అని ఇబ్లీసు తెగేసి చెప్పాడు."** ఈ వాక్యములో ఇబ్లీసు అను క్రొత్తపదము వచ్చినది. గుణప్రభావములకు లోనైనవారిని ఇబ్లీస్ అని అనవచ్చును. ఆధ్యాత్మిక రంగములో మాయ ప్రభావము పొందినవానిని మాయావి అని అంటారు. అలాగే గుణప్రభావములను పొందిన వానిని ఇబ్లీస్ అని అనవచ్చును. ఇబ్లీసునే మాయ అనియూ, సైతాన్ అనియూ, సాతాన్ అనియూ ఒక్కొక్క మతమునందు ఒక్కొక్క విధముగా పిలుచు చుందురు.

భూమిమీదికి దేవుడు భగవంతునిగా వచ్చినప్పుడు ఇతరులు ఆయనను గుర్తించి సాష్టాంగ నమస్కారములు చేయుచుండగా, గర్వముతో నిండినవాడు నేను మ్రొక్కాలా!యను మదముతో భగవంతునికి కూడా నమస్కారము చేయడు. అటువంటి వానిని అరబ్బీభాషలో "ఇబ్లీసు" అని అంటారు. ఒకవేళ నీవు ఎందుకు నమస్కారము చేయలేదని అడిగితే

నాతో సమానముగాయున్న మనిషికి నేను మ్రొక్కను అంటాడు. అటువంటి వారి దృష్టిలో ఎంతటివారనైనా తమకంటే తక్కువగా చూచుదురు. వారికి జ్ఞానము యొక్క విలువ ఏమాత్రము తెలియదు. బయటి ప్రపంచములో నేను పెద్ద హోదాగల్గిన ఉద్యోగములో యున్నాను అటువంటి పనీపాటా లేకుండా సోమరిపోతులై జ్ఞానము చెప్పుకొను వానికి నేను నమస్కరించాలా! యను గర్వము కల్గియుందురు. తాను ప్రపంచములో మాత్రమే పెద్దయనీ, ప్రపంచమునకంటే ఆధ్యాత్మికము ఎంతో గొప్పదనీ తెలియనివారు, ఆధ్యాత్మికమునకంటే తామే అధికులుగా భావించుకొని, గురువులకు నమస్కరించెడివారు కాదు. ఒక మనిషికి నేను ఫలానావాడిని నమస్కరించాలా!యని భగవంతునినయినా తనకంటే తక్కువవానిగా భావించి నమస్కరించకపోగా, హేళనగా కూడా మాట్లాడువారు కలరు. అటువంటి వాడు ఆధ్యాత్మిక గొప్పతనమునూ, ఆధ్యాత్మికశక్తినీ కనుగొనలేడు. ఇతరులు ప్రపంచ విషయములో ఎంత గొప్పవాడయినా ఆధ్యాత్మికములో చాలా చిన్నవారేయని తలచి, ఒక ఆధ్యాత్మికవేత్త అయిన వానిని, గురువుగాయున్న వానిని, భగవంతుడేమో!యని తలచి నమస్కరించుచున్నా, నమస్కరించు వారికంటే చిన్న హోదాలో యుండినా తన గర్వము చేత తనలాంటి మనిషికి ఎందుకు మ్రొక్కాలియని ఇబ్లీసు (గుణముల) ప్రభావము పొందిన వాడు అనుకోవడము జరుగుచున్నది.

ఇక్కడ 29వ ఆయత్‌లో దేవుడు నా ఆత్మను నింపి నా ప్రతినిధిని భూమిమీదికి ప్రజలకు జ్ఞానమును చెప్పెడి నిమిత్తము పంపుతానన్నాడు. అలా వచ్చినవాడు ప్రత్యేకమైన ఆత్మతో వస్తున్నాడు గనుక అతనిని భగవంతుడు అంటున్నాము. భగవంతుడు సాధారణ మనిషేగానీ ఒక్క జ్ఞానము చెప్పడములో తప్ప దేనియందూ ఏ ప్రత్యేకతా లేనివాడైయుండును.

ప్రపంచములో ప్రత్యేకత లేనివానిని, ప్రపంచములో హోదాకల్గిన వాడు గౌరవించడు. ఎంతపెద్ద ఆధ్యాత్మికవేత్తనయినా, వారి జ్ఞానమునుగానీ, వారి ఆధ్యాత్మికమునుగానీ గర్వము కల్గినవారు గౌరవించరు, నమస్కరించరు. అటువంటివారిని ఇబ్లీసులని చెప్పవచ్చును. అలా గర్వముతో నిండినవారు నమస్కరించకపోగా గురువుయొక్క, భగవంతుని యొక్క విలువ తెలియక వారినే హేళనగా మాట్లాడడము, అవమానించడము చేయుచున్నారు. ఆ విధముగా అవమానించినా, హేళన చేసినా వారికి శిక్ష తప్పదు. ఒక సంఘటనలో గురువును హేళనగా మాట్లాడి వారి శిష్యులను ఇద్దరిని రెండు గంటలసేపు నిర్బంధించడము జరిగినది. జ్ఞానప్రచారములో గ్రంథములను ఇంటింటికీ ప్రచారము చేయుచూ దేవునిసేవ చేయు ఇద్దరు వ్యక్తులను ఒక పోలీస్ అధికారి తమ ఇంటి తలుపు తట్టి పిలిచినందుకు ఆగ్రహించి జ్ఞానమును, గురువును, జ్ఞానసేవ చేయువారిని వైజాగ్‌లో రెండు సంవత్సరముల క్రితము నిర్బంధించినందుకు కోపముతో మేఘములు తమశక్తిని హుదూస్ తుఫాన్‌లో చూపి ఆ ప్రాంతము వారినందరినీ హెచ్చరించాయి.

దేవుడు తన మూడు గ్రంథములలో ఎంతో జ్ఞానమును ఇమిడ్చి చెప్పాడు. దానిని అర్థము చేసుకొను స్థితిలో మనిషి లేనందున మూడు గ్రంథముల వివరమును తెలియజేయు నిమిత్తము దేవుడు తన ప్రతినిధిని పంపుతాను అని చెప్పడమేకాక, వచ్చే ప్రతినిధి మనిషిగానే వస్తాడనీ, వచ్చిన వానికి సాష్టాంగ నమస్కారము చేయమని కూడా చెప్పినట్లు ఖుర్ఆన్ గ్రంథములో కలదు. అంతేకాక తన ప్రతినిధియైన భగవంతున్ని సాధారణ మనిషిగా లెక్కించి నమస్కరించని వారు కూడా యున్నారని వారిని ఇబ్లీసు అంటారనీ చెప్పారు. గుణ ప్రభావములున్న వానికి ఇబ్లీసు అని పేరు

పెట్టడము జరిగినదని, అతనినే ఖుర్ఆన్‌లో సైతాన్ అని సంబోధించడము జరిగినది. మొత్తము మీద దేవుడు పంపిన తన ప్రతినిధికి దేవదూతలందరూ సాష్టాంగపడి నమస్కరించినా, గుణములలో నిండినవాడు నమస్కరించడని చెప్పారు. అది మంచి పద్ధతి కాదనీ అటువంటి వారికి నరకమే గతియని కూడా అదే సూరాలో 43వ ఆయత్‌లో చెప్పడము జరిగినది. అయితే ఇక్కడ కొందరు 29,30 వాక్యములకు వివరమును వ్రాయుచూ అందులో చెప్పిన సాష్టాంగ నమస్కారమును గురించి వారి అభిప్రాయమును ఇలా చెప్పారు.

**"ఈ సాష్టాంగ ప్రణామము గౌరవార్థము చేయుచున్నదేగానీ, దాస్యం నిమిత్తము కాదు. అదీకాక ఇది అల్లాహ్ ఆజ్ఞ, దాన్ని పాటించడము తప్పనిసరి అన్న విషయములో ఎటువంటి సందేహానికీ లేశమైనా ఆస్కారము లేదు. అయితే అంతిమ దైవప్రవక్త షరియత్ (ధర్మము) ప్రకారము గౌరవార్థము కూడా ఈ రకమయిన సాష్టాంగ ప్రణామము చేయడము సమ్మతము కాదు"** అని వ్రాశారు. ఇక్కడ షరియత్ అంటే ఇస్లామీయ ధర్మశాస్త్రము అని కొందరంటున్నారు. అదెంతమటుకు నిజమో నాకు తెలియదుకానీ దేవుడు చెప్పినదే ధర్మముగానీ, మనుషులు చెప్పినది ధర్మము కాదని జ్ఞానులయినవారు ఎవరయినా అంటారు. ఈ వాక్యమునకు వివరము చెప్పకుండావుంటే బాగుండేది. 29 నుండి 30, 31 వాక్యములలో వ్రాసిన దానినిబట్టి చూస్తే దేవుని మాటకు వ్యతిరేఖముగా వివరమును వ్రాసినట్లున్నది. అల్లాహ్ చెప్పినమాటను ఏ మానవుడూ ఖండించుటకు వీలులేదు. అది కాదు, ఇది అవును అని చెప్పితే దేవునిమాటనే కాదన్నట్లగును. ఒకప్రక్క దేవుని ఆజ్ఞను పాటించడము తప్పనిసరి అంటూనే షరియత్ ప్రకారము నమస్కారము

చేయడమే తప్పు అంటే  ఇబ్లీసు కూడా అదేమాటనే కదా చెప్పుచున్నది. అప్పుడు ఇబ్లీసు మాటను సమర్థించినట్లగును.  దేవుడు చెప్పినదే అసలయిన షరియత్‌యనీ మనుషులు చెప్పినది షరియత్ అని అనిపించుకోదని మేము అనుకొంటున్నాము.  దేవుడు చెప్పిన షరియత్ ప్రకారము  ఒక మనిషి ఇంకొక మనిషికి సాష్టాంగముగా నమస్కరించడము తప్పగును. సాష్టాంగ నమస్కారమునకు దేవుడుగానీ, దేవుని ప్రతినిధిగానీ అర్హులుగా యున్నట్లు దేవుడే చెప్పితే  అదికూడా సమ్మతము కాదు అంటే,  ఆ మాట దేవునికి వ్యతిరేఖముగా మాట్లాడినట్లగునేమోనని మా అభిప్రాయము.  న్యాయముగా మాట్లాడితే మా అభిప్రాయము కూడా అదే అగును.

మాయ లేక సైతాన్ లేక ఇబ్లీసు మనుషుల తలలోనున్న గుణముల మీదయుంటూ,  తన ప్రభావమును అతనిమీద చూపి, మనిషిని దేవునికి వ్యతిరేఖముగా మార్చును.  అయితే దేవునిమీద విశ్వాసమున్నవాడు, దేవుని వైపు పూర్తి జ్ఞానిగాయున్నవాడు  మాయ వలలో పడక, గుణప్రభావములో చిక్కుకోక దేవుని మాటనే గొప్పగా తలచుచూ, మాయ మాటను లెక్కచేయడు. ఎవడయితే దేవునివైపు లేడో, ఎవడయితే అజ్ఞానిగా యుండునో, అతడు మాయ (ఇబ్లీసు) మాటల వలలో చిక్కుకొని  దేవునిమాటను లెక్కచేయక మాయమాటనే వినును.  ఆ విషయము అర్థముకావాలంటే  ఖుర్ఆన్ గ్రంథములో సూరా 15, ఆయత్ 39,40, 41, 42, 43 లలో ఇలా కలదు చూడండి. **(15-39) "ఓ ప్రభూ! నీవు నన్ను అపమార్గము పట్టించినందు వలన  నేను భూమండలములోని మానవులకు పాపాన్ని అందముగా కనిపించేలా చేస్తాను.  వారినందరినీ పెడత్రోవ పట్టిస్తాను అని ఇబ్లీసు చెప్పాడు.  (40) అంతేగాక ఇట్లు కూడా అన్నాడు.  నీ**

**ద్వారా ఎన్నుకోబడిన ప్రత్యేక దాసులను తప్ప అందరినీ తప్పుదారి పట్టిస్తాను అన్నాడు. (41) అప్పుడు అల్లాహ్ (దేవుడు) ఇలా సెలవిచ్చాడు. నన్ను చేరే ఋజుమార్గము ఇదే. (42) నా దాసులపైన నీ అధికారము సాగదు. నీ అధికారము నిన్ను అనుసరించే భ్రష్టులపై సాగుతుంది. (43) అలాంటి వారందరి కోసము వాగ్దానము చేయబడిన చోటు నరకము గలదు."** ఈ వాక్యములను చూచిన తర్వాత జ్ఞానము విలువ, దేవుని గొప్పతనము తెలిసినవారు మాయ మాటలను వినరు, దేవునికి వ్యతిరేఖముగా ప్రవర్తించరు. అలాగే జ్ఞానము తెలియని వారిని మాత్రమే మాయ మార్చగలదనీ, వారు మాత్రమే దేవుని మాటకు వ్యతిరేఖముగా మాట్లాడడముగానీ, చేయడముగానీ ఉండును అనీ తెలిసిపోవుచున్నది.

ఇదే విషయమునే భగవద్గీతలో విజ్ఞాన యోగమను అధ్యాయమున 14వ శ్లోకమందు ఈ విధముగా చెప్పడమైనది.

శ్లో॥ దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా ।
మామేవ యే ప్రపద్యన్తే మాయా మేతాం తరన్తితే ॥

**భావము :-** "నేను తయారు చేసియుంచిన నా మాయను దాటుట చాలా దుర్లభము. ఎవరితోనూ సాధ్యమయ్యేపనికాదు. అయితే ఎవడయితే నన్ను శరణుజొచ్చియున్నాడో వాడు మాత్రము నా మాయను దాటగలడు. అటువంటి వానిని మాయ ఏమీ ఆటంకపరచదు. నన్నుగానీ, నా జ్ఞానమును గానీ ఆశ్రయించనివాడు మాయను ఎప్పటికీ దాటలేడు" అని కలదు కదా! దీనినిబట్టి చూస్తే భగవద్గీతలో చెప్పిన విషయమునే ఖుర్ఆన్‌లో 15వ సూరా 39, 40, 41, 42 వాక్యములలో చెప్పియున్నారని తెలియుచున్నది.

ఖుర్‌ఆన్‌లో 15వ సూరాలో చెప్పిన విషయము భగవద్గీతలోని విజ్ఞాన యోగములోని విషయమును ధృవీకరించుచున్నది.

మాయ అనునది ప్రతి మనిషి తలలోయున్నది. ఒకడు మాయలో పడినాడు అంటే వాడు బయటపడలేదు. వాని తలలోనే వాడు మాయలో పడుచున్నాడు. మాయ అనగా గుణముల భావము అని అర్థము. భగవద్గీతలో విజ్ఞానయోగములో 14వ శ్లోకమందు ***"గుణమయీ మమ మాయా"*** అని ఉంది కదా! **"గుణములతో కూడుకొన్నదే మాయ అంటారు"** అని దాని అర్థము. గుణ ప్రభావములోపడనివాడు ఆత్మజ్ఞానమును తెలియగలుగును. మనిషి తలలో గుణములున్న స్థలములోనే ఆత్మకూడా యున్నది. గుణములలో యున్నవాడు ఆత్మజ్ఞానమును తెలియలేడు. గుణముల స్థానమును వదిలి ఆత్మస్థానమును చేరినవాడు ఆత్మజ్ఞానమును తెలియగలడు. ఆత్మజ్ఞానమును తెలియగలిగితే దేవుని జ్ఞానమంతయూ తెలిసిపోవును. ఆత్మస్థానములో లేకుండా గుణముల స్థానములోయుంటే అటువంటివానికి ప్రపంచ విషయములు తప్ప దేవుని విషయములు ఏమాత్రము తెలియవు. ప్రతి మనిషి శరీరములో తలయందు గుణముల సామ్రాజ్యము ఎలాయున్నదో, అలాగే ఆత్మ సామ్రాజ్యము ఎలాగున్నదో గమనించితే ఇలా ఉన్నదని తెలియగలదు. (ఇప్పుడు చిత్రపటము రూపములో తెలియజేయు దృశ్యములు ఎవరి స్థూల కన్నులకు కనిపించునవి కావు. ఆ దృశ్యములన్నియూ సూక్ష్మమైనవి. అవన్నియూ ఒక్క జ్ఞాన దృష్టికి మాత్రము తెలియబడు దృశ్యములు. ఇక్కడ చూపు దృశ్యములే ప్రపంచము లోని మనుషులందరిలో ఉండునని తెలియవలెను. బుద్ధిని వికసించుకొని చూడండి.)




బ్రహ్మ, కాల, కర్మ, గుణచక్రముల సముదాయము

ఈ నాల్గుచక్రముల సముదాయము మన తల మధ్య భాగములో కనుబొమలకు సమానముగా ఉండును. అన్నిటికంటే క్రిందవున్న చక్రమును గుణచక్రము అని అంటున్నాము. తలలో ముఖ్యమైన గుణచక్రమును పరిశీలించి చూస్తే అది మూడు మరియు ఒకటి మొత్తము నాలుగు భాగములుగాయున్నది. గుణచక్రము ఒక్క దానిని ఎదురుగా పెట్టిచూస్తే ఎట్లున్నది. తర్వాత పేజీపటములో చూడవచ్చును.

చక్రములో ఎదురుగా కనిపించు నాలుగు భాగములలో బయట నుండి మొదటి భాగమును తామస గుణభాగము అంటాము. రెండవ దానిని రాజస గుణ భాగము అంటాము. మూడవ దానిని సాత్త్విక గుణ భాగము అంటాము. నాల్గవదయిన చివరి భాగమును ఆత్మ భాగము అంటాము. ఈ గుణచక్రములో నాలుగు భాగములయందు, మూడు గుణ భాగములు కాగా, ఒకటి ఆత్మ భాగముగాయున్నది. మూడు గుణ భాగముల




గుణచక్రము

యందు ప్రపంచ సంబంధ గుణములు ఉండగా, చివరిలో మధ్యనయున్న ఆత్మభాగములో ఆత్మజ్ఞానము సంపూర్ణముగాయున్నది. మూడు గుణ భాగములను కలిపి ఒక భాగముగా, ఆత్మభాగమును ఒక భాగముగా లెక్కించితే గుణచక్రము గుణములను ఒక భాగముగాయుండగా, దైవ జ్ఞానము లేక ఆత్మజ్ఞానము అనునది ఒక భాగముగాయున్నది. అయితే గుణభాగము, నాలుగులో మూడింతలుండగా, ఆత్మభాగము ఒకింత మాత్రమున్నది. 75 శాతము గుణములుండగా, కేవలము 25 శాతము జ్ఞానము కలదు. శరీరములో పుట్టిన జీవుడు పైన కనిపించు గుణచక్రము లోనే నివాసముంటున్నాడు. జీవుడు నాలుగు భాగములలో మొదటి భాగములోయుంటే వానిని తామస గుణముకలవాడు అని అంటాము. అలాగే రెండవ స్థానములోయుంటే వానిని రాజస గుణముకలవాడని అంటాము. అట్లే మూడవ భాగములోయుంటే వానిని సాత్త్విక గుణము

కలవాడని అంటాము. అంతేకాక తామసుడు, రాజసుడు, సాత్త్వికుడు అని వాడు ఉన్న స్థానములనుబట్టి జీవునికి పేరుపెట్టడము జరిగినది. ఈ మూడు గుణ భాగములయందు జీవుడు ఏదో ఒక గుణ భాగమందు ఉండును. ప్రతి శరీరములలోనూ ఉన్న జీవుళ్ళు వారివారి కర్మనుబట్టి ఆయా జీవుడు ఆయా భాగముయందు ఉండుట జరుగును. జీవాత్మ లేక జీవుడు అనబడువాడు ఏ గుణ భాగములో ఉండునో వాడు ఆ భాగములో యున్న గుణముల భావములో కలిసిపోవును.

జీవుడు స్థిరస్థాయిగా ఒక గుణ భాగములో యుండక మూడు భాగములయందు తిరుగుచుండును. అలా తిరిగినా తనకు ఇష్టమైన భాగములోనే ఎక్కువ కాలముండును. ఎక్కువ ఏ గుణభాగములో యుండునో ఆ గుణ భాగము పేరుతో ఆ జీవున్ని పిలువడము జరుగుచున్నది. మొదటి భాగములో ఎక్కువ కాలముంటూ మిగతా రెండు భాగములలోనికి అప్పుడప్పుడు కొద్దిసేపు పోయి వచ్చు జీవున్ని తామసుడు అని పిలువ వచ్చును. అలాగే రెండవ భాగములో ఎక్కువ కాలముండువానిని రాజసుడు అనీ, మూడవ భాగములో ఎక్కువ కాలముండువానిని సాత్త్వికుడు అని అంటాము. మూడు గుణ భాగములలోని గుణ ప్రభావములను మాయ అని భగవద్గీతలో చెప్పగా, ఖుర్ఆన్ గ్రంథములో ఇబ్లీసు లేక సైతాన్ అని అన్నారు. ఏ జీవుడయినా గుణభాగములలోనే నివసించుచూ అక్కడున్న గుణభావములను పొందుచున్నాడు కావున, వానిని ఇబ్లీసు అని చెప్ప వచ్చును. ఇబ్లీస్ అనునది గుణముల భావములు తప్ప అదొక మనిషి కాదు, అదొక శక్తికాదు. గుణచక్రములోని గుణభాగములను విశ్లేషించి చూస్తే మాయయొక్క లేక ఇబ్లీసుయొక్క విషయము సంపూర్ణముగా తెలియును. గుణచక్రములోని ఒక్క భాగములో 12 గుణములుండును.

అందులో ఆరు మంచి గుణములు, ఆరు చెడుగుణములు ఉన్నవి. చెడు గుణములను శత్రువర్గ గుణములనీ, మంచి గుణములను మిత్రవర్గ గుణములనీ అనుచున్నాము. మంచి చెడు గుణములన్నిటినీ కలిపి మాయ అని అంటున్నాము. మూడు గుణ భాగములలో పన్నెండు గుణములు ఎలాయున్నదీ క్రిందగల పటములో చూడవచ్చును.

మాయ స్వరూపము పన్నెండు గుణముల రూపములోయుండగా, పన్నెండు గుణములు ఒక్కొక్కటి తొమ్మిది భాగములుగా చీలిపోయి మొత్తము ఒక భాగములో 12×9=108 గుణములుగా మారిపోయినవి. మొత్తము మూడు భాగములలో 324 గుణములున్నట్లు తెలియుచున్నది. ప్రతి మనిషి శరీరములోనూ గుణచక్రము కలదు. అందులో ఇబ్లీసు (మాయ) నివాసము గలదు. ఎవడు గుణ ప్రభావములో పడిపోయాడో వానిని కూడా ఇబ్లీసు క్రిందికి జమకట్టవలసిందే. పుట్టిన ప్రతి మనిషి తలలోనూ తామస, రాజస, సాత్త్విక గుణ భాగములు మూడు కలవు. హిందువులకు తలలో నాలుగుచక్రములు, అందులో క్రింద గుణచక్రము ఉన్నట్లు మిగతా అన్ని



**గుణచక్రము**

మతముల వారి తలలో కూడా అదే గుణ విధానముండును. కులము, మతముతో ప్రసక్తి లేకుండా మనిషి అయిన ప్రతివానికీ మూడు గుణభాగములు ఉండును. అందులో ఒక్కొక్క దానియందు 108 గుణముల ప్రకారము మొత్తము మూడు భాగములలో 324 గుణములున్నవి. ఇబ్లీసు 324 వేషములతో యుండుట వలన ఇబ్లీసును ఎవరూ గుర్తించలేరు. హిందువయినా, ముస్లీమ్ అయినా, క్రైస్తవుడయినా మూడు గుణ విభాగములలోని గుణములందు చిక్కుకొని యుండును. గుణముల భావములో మునిగియున్నవాడు ఎల్లప్పుడూ ప్రపంచ విషయములలోనే చిక్కుకొనియుండును. అందువలన అందరికీ మాయ ఒక్కటే, అలాగే అందరికీ దేవుడు ఒక్కడేయని చెప్పవచ్చును.

గుణచక్రములో మూడు గుణ భాగముల మధ్యలోగల నాల్గవ స్థానమును ఆత్మస్థానము అని చెప్పుచున్నాము. జీవుడు ఎంతో ప్రయత్నము చేస్తే నాల్గవస్థానమును చేరవచ్చును. నాల్గవ ఆత్మస్థానమును చేరినవాడు అక్కడున్న ఆత్మజ్ఞానము మీద ధ్యాసకల్గి ఆత్మ చింతన చేయుటకు మొదలు పెట్టును. నాల్గవస్థానము గుణచక్రమునకు ఆధారముగాయున్న బ్రహ్మానాడిలో యున్నది. మూడు గుణ భాగములు గుణచక్రములో ఒకదాని కొకటి ఆనుకొని చిన్నపొరలాంటి హద్దును కల్గియుండుట వలన జీవుడు గుణ భాగములను సులభముగా దాటుచున్నాడు. అయితే ఆత్మ భాగము లోనికి పోవుటకు మందముగాయున్న నాడీ గోడ అడ్డముగా యుండుట వలన జీవుడు ఆత్మ భాగములోనికి సులభముగా రాలేకయున్నాడు. తర్వాత పేజీపటములో ఆత్మ భాగమును దాటుటకు నాడీ గోడ ఎలా అడ్డమున్నదో చూడవచ్చును.



**గుణచక్రములో బ్రహ్మనాడి గోడ సులభముగా దాటుటకు వీలుకాని విధముగా మందముగాయున్నది.**

గుణచక్రము నిర్మాణములోనే దేవుడు మూడు భాగములను సులభముగా దాటుటకు గుణభాగముల మధ్యలో చిన్నపొరను యుంచాడు. ఆత్మభాగములోనికి ఎవడుగానీ సులభముగా పోకుండావుండునట్లు మధ్య భాగములో నాడీపొరను మందముగా యుంచాడు. శరీరములో నాలుగు చక్రముల సముదాయమును దేవుడే ఆదిలోనే నిర్ణయించి నిర్మించాడు. మనిషికి మూలమంతయూ ఆ నాలుగుచక్రములలోనే యుంచాడు. పైనగల బ్రహ్మచక్రము సృష్టికి సంబంధించినదికాగా, దేవుని పగలును రాత్రిని సూచించుచున్నది. పైనుండి రెండవ చక్రము కాలచక్రమై మనిషి ఏ కాలములో ఏ కర్మ అనుభవించవలయునో సూచించుచున్నది. పైనుండి మూడవ చక్రము లేక క్రిందినుండి రెండవ చక్రములో మనిషి చేసుకొన్న పాపపుణ్యములన్నియూ నిలువ చేయబడియున్నవి. కర్మచక్రము పన్నెండు భాగములుగాయుండి అందులో అన్ని కర్మలూ వ్రాయబడియున్నవి. పైన గల కాలచక్రములోని పన్నెండు గ్రహముల అనుమతి మేరకు కర్మచక్రము లోని కర్మ మనిషి జీవితములో ఆచరణకు వచ్చి, మనిషి కష్టసుఖములను అనుభవించుచున్నాడు. క్రిందచక్రము గుణచక్రము అతి ముఖ్యమైనది. మనిషి శరీరములోని జీవుడు గుణచక్రములోనే నివసించుచున్నాడు. గుణచక్రములోనే మాయ అని అనబడు గుణములు పన్నెండు గలవు. గుణచక్రమును గురించి, అందులోని పన్నెండు గుణముల గురించి కొంత వరకు చిత్రపటముల ద్వారా తెలుసుకొన్నాము.

మనిషి జీవితమంతయూ పన్నెండు గుణముల ప్రభావము మీద ఆధారపడి యుండును. పన్నెండు గుణములు పైనగల కర్మ మీద ఆధారపడి పనిచేయుచుండును. కర్మనుబట్టి గుణములను ప్రేరేపించువాడు ఆత్మ. ఆత్మ అనునది శరీరములో బ్రహ్మనాడిని కేంద్రముగా చేసుకొనియున్నది. ఆత్మ శరీరమునకంతటికీ అధిపతియైయుంటూ నాలుగు చక్రముల దగ్గర బ్రహ్మనాడిలోయున్నది. కర్మను మనిషిచేత అనుభవింపచేయువాడు ఆత్మయే. కాలానుసారము కర్మను అనుభవింపజేయుటకు కావలసిన గుణములను ప్రేరేపించి వాటి ప్రభావముచేత మనిషిని కార్యములలో లగ్నముచేసి, ఆ కార్యముల ద్వారా మనిషిని కష్టసుఖములను అనుభవించునట్లు చేయు చున్నాడు. ఇదంతయూ ప్రపంచ సంబంధ కార్యములలో నియమ నిబద్ధత ఆత్మ ఆచరణగాయున్నది. ఇక ప్రపంచ విషయము కాకుండా ఆధ్యాత్మిక విషయమునకు వచ్చిచూస్తే, ఇక్కడ కర్మకు సంబంధము లేకుండా ఆత్మ తన ఇష్టానుసారము చేయగలదు. ఒక మనిషిని దేవునివైపు పంపవలెనన్నా లేక దేవునినుండి దూరముగా అజ్ఞానము వైపు పంపవలె ననినా ఆత్మయే ఆ పనిని చేయగలదు. ఆత్మ అలా చేయుటకు కారణము గలదు. ఎవడయితే దేవునికి ఇష్టుడో, ఎవడయితే దేవునికి ఇష్టుడు కాడో ప్రకృతికి తెలుసు. ప్రకృతి ఆజ్ఞప్రకారము శరీరములో ఆత్మ పనిచేసి మనిషిని జ్ఞానమువైపుగానీ, అజ్ఞానము వైపుగానీ పంపుచున్నది.

మనిషి తలలోని గుణచక్రములో పన్నెండు గుణములు గలవు. పన్నెండు గుణములలో ఆరు పుణ్యము సంపాదించుపెట్టునవిగాయున్నవి. అలాగే ఆరు గుణములు పాపమును సంపాదించిపెట్టునవిగా యున్నవి. గుణచక్రములోని మూడు భాగములలోనూ పన్నెండు గుణములుండుట వలన మూడు భాగములలో జీవుడు ఎక్కడయున్నా, పాపపుణ్య కర్మలు

వచ్చుచుండును. మూడు గుణ భాగములను జీవుడు వదలి, మూడు గుణ భాగములకు ఆవలయున్న లేక మధ్యలోయున్న ఆత్మ భాగములోనికి వస్తే అతనికి గుణముల ధ్యాసరాదు, కర్మల సంపాదనయుండదు. మొత్తము మీద ప్రపంచ చింతయే లేకుండా పోవును. మూడు గుణములలో యున్న జీవుడు కర్మబద్ధుడై, ఎల్లప్పుడూ ప్రపంచ చింతలలోనే మునిగి, దేవుని ధ్యాస లేనివాడై, దేవునికి దూరముగా అజ్ఞానమార్గములో పోవుచుండును. మూడు గుణములను వదలి ఆత్మ భాగములోనికి వచ్చిన జీవుడు ప్రపంచ విషయములను వదలినవాడైయుండి, ఆత్మచింతన చేయుచూ దేవుని మార్గములో ప్రయాణించుచుండును. ఒక జీవుడు గుణభాగములో యుండునట్లు చేయువాడుగానీ, ఆత్మ భాగములోయుండునట్లు చేయువాడు గానీ ఆత్మయే. జీవుడు స్వయముగా ఎక్కడా పోలేడు. జీవున్ని నడుపగలది ఆత్మయే. జీవున్ని గుణములందుంచవలయుననినా లేక ఆత్మభాగములో యుంచవలెననినా ఆత్మయే చేయవలెను. ఆత్మ గుణముల మధ్యలోయున్న జీవున్ని నడుపడమేగాక, శరీరములోని 24 భాగములనూ నడుపుచున్నది. ఆత్మ సూక్ష్మశరీరమునూ, స్థూలశరీరమునూ వ్యాపించియుండి, అందులోని ప్రతి అవయవమునూ, ప్రతి భాగమునూ కదలించి నడుపుచున్నది.

ఒక మనిషి ప్రపంచ విషయములలో చిక్కుకొనియుండుటకుగానీ, దేవుని జ్ఞాన విషయములలోయుండుటగానీ బయటి విషయములు శరీరము లోనికి చేరుటనుబట్టి ప్రారంభమగును. మనిషికి బయటి విషయములు లోపలికి చేరుటకు ఐదు ఇంద్రియములు పనిచేయును. వాటినే జ్ఞానేంద్రియములు అంటాము. జ్ఞానేంద్రియములు వరుసగా 1) కన్ను, 2) చెవి, 3) చర్మము, 4) ముక్కు, 5) నాలుక. ఇందులో కన్ను, చెవి రెండు చాలా ముఖ్యమైనవి. వీటి ద్వారానే మనిషిలోనికి జ్ఞానముగానీ,

అజ్ఞానముగానీ ప్రవేశించును. శరీరములోని ఐదు జ్ఞానేంద్రియములను నడుపువాడు ఆత్మయే. ఐదు జ్ఞానేంద్రియముల ద్వారా వచ్చిన సమాచారమును లోపలగల బుద్ధి మరియు జీవునివరకు మనస్సు ద్వారా చేర్చునది ఆత్మయే. ఒక మనిషిని అజ్ఞానమువైపు పంపాలని అనుకొన్నప్పుడు వానికి బయటనుండి వచ్చు విషయములను లోపల జీవునివరకు చేర్చి, జీవున్ని గుణములయందే యుంచి గుణముల భావమునే పొందునట్లు చేయుచుండును. ఒకవేళ ఎక్కడయినా అతని చెవులకు జ్ఞానబోధలు వినిపించినా లేక జ్ఞానమునకు సంబంధించిన చిత్రపటములు కనిపించినా వాటిని కన్నులు చూచినా, చెవులు వినినా ఆ విషయము లోపలికి ప్రవేశించి బుద్ధికి చేరినా, బుద్ధి వివరించి చెప్పునంతవరకు జీవునికి తెలియదు. అప్పుడు బుద్ధికి జ్ఞానము అర్థము కాకుండా చేసి, బుద్ధినుండి జీవునికి జ్ఞానము చేరకుండా ఆత్మ చేయగలదు.

దేవుడు తనకిష్టమైనవానిని జ్ఞానమార్గములోనికి పంపగలడు. ఇష్టము లేనివానిని అజ్ఞానమార్గములోనికి పంపగలడు. దేవుని జ్ఞానము మీద శ్రద్ధలేనివాడు దేవునికి ఇష్టుడుకాడు. దేవున్ని విశ్వసించనివాడు, దేవుని జ్ఞానము మీద శ్రద్ధలేనివాడు, దేవుని జ్ఞానమును వినినప్పటికీ, చదివినప్పటికీ వానిబుద్ధికి అర్థము కాకుండా ఆత్మ చేయగలదు. అప్పుడు బుద్ధి చేతనే తెలియదగిన జీవాత్మకు ఏమీ తెలియకుండా పోవును. అప్పుడు చెవుల ద్వారా వినినదిగానీ, కన్నులద్వారా చూచినదిగానీ అవగాహనకు రాకుండాపోవును. అందువలన వానికి కన్నులు, చెవులు ఉపయోగపడ నట్లుయగును. ఇదే విషయమునే ఖుర్‌ఆన్ గ్రంథములో కూడా చెప్పారు. ఖుర్‌ఆన్ గ్రంథములో అల్ బఖర అను రెండవ (2) సూరాలో ఏడవ (7) ఆయత్‌నందు ఇలా చెప్పారు. **(2-7) "అల్లాహ్ వారి హృదయాలపై,**

**వారి చెవులపై ముద్రవేశాడు. వారి కళ్ళపై పొరవుంది. ఇంకావారికి మహా ఘోరమైన శిక్షవుంది."** అనికలదు. దీని భావము ప్రకారము వారి చెవులు మూసివేసిన దానితో సమానమైపోయాయి అని, అలాగే వారి కన్నులకు పొరలు వచ్చి చూడలేని స్థితిలో ఉన్నాయనీ, మరియు వారి బుద్ధికి కూడా అర్థము కాలేదని హృదయము మీద ముద్రవేశాడు అని చెప్పారు. అటువంటివారికి ఎన్ని విధముల చెప్పినా వారు దేవున్ని నమ్మరు. అందువలన సూరా రెండులో ఆయత్ ఆరులో **(2-6)** ఇలా వుంది. **"అవిశ్వాసులను నీవు భయపెట్టినా, భయపెట్టకపోయినా ఒక్కటే వారు విశ్వసించరు."** వారిని గురించి రెండవ సూరాలోనే ఇంకా రెండు చోట్ల (2-18), (2-171) ఈ విధముగా చెప్పారు. **(2-18) "వారు చెవిటివారు, మూగవారు, గ్రుడ్డివారు ఇకవారు సరియైన దారికి మరలిరారు." (2-171) "సత్య తిరస్కారులకు ఉపమానము ఈ విధముగా చెప్పవచ్చును. పశువుల కాపరియొక్క కేకను, అరుపును మాత్రమే వినే పశువులవంటివారు. అటువంటివారికి ఆలోచన అన్నమాటే యుండదు. వారు చెవిటివారు, మూగవారు, గ్రుడ్డివారు. వారు అర్థము చేసుకోరు."** పశువులు తమ కాపరియొక్క కేకను అరుపును మాత్రము గ్రహించి మిగతా ఇతర మాటలనుగానీ, ఇతరుల కేకలను వినినప్పటికీ వాటి శబ్ధములోని అర్థమును గ్రహించనట్లు కొందరు తాము ఎల్లప్పుడూ విను అజ్ఞానపు మాటలను తప్ప, ఇతరుల జ్ఞానపు మాటలను అర్థము చేసుకోలేరు. అందువలన వారిని చెవులున్న చెవిటివారిగా, కన్నులున్న గ్రుడ్డివారిగా, నోరున్న మూగవారిగా చెప్పవచ్చును. దేవుడు తనను నమ్మని వారిని తననుండి దూరము చేయును. దేవుడు ఆ పనిని స్వయముగా చేయకున్నా శరీరములోని ఆత్మయే దేవుని పనిని చేసిపెట్టును.

అందువలన దేవునికి విధేయులై యున్నవారు మాత్రమే దేవునికి దగ్గరవారు కాగలరని చెప్పుచున్నాము.

ఇక్కడ కొందరికి ఒక ప్రశ్న రావచ్చును. అదేమనగా! దేవునికి విధేయులైయున్న వారిని మంచిమార్గములో పంపించి, విధేయులు కానివారిని చెడుమార్గములో పంపుతాను అని దేవుడు అన్నాడంటే, ఒక విధముగా అన్యాయము కాదా! మనిషి దేవున్ని ఎందుకు నమ్మాలి? నమ్మితే మంచివాడు, నమ్మకపోతే చెడ్డవాడా? ఇప్పుడు మనమున్నామనుకో! మనతో మాట్లాడిన వారు మాత్రము నాకు మంచివారు, మనతో మాట్లాడని వారంతా చెడ్డవారు అంటే అది స్వార్థముతో చెప్పినట్లు కాదా! నాకు డబ్బులిచ్చిన వాడు మంచివాడు, డబ్బులు ఇవ్వనివాడు చెడ్డవాడు అంటే అది అన్యాయమగును కదా! అలాంటప్పుడు దేవుడు తనను నమ్మినవాడే తనకు మంచివాడు, ఇష్టుడు అనీ, నమ్మనివాడు చెడ్డవాడు, అయిష్టుడనీ చెప్పడము అన్యాయము కాదా!యని అడుగవచ్చును. దానికి జవాబు ఈ విధముగా కలదు. నేను ఒక ఉదాహరణను చెప్పుతాను విను. నేను రెండు ఇళ్ళను యాభైలక్షలు ఖర్చుపెట్టి కట్టించాను. అంతడబ్బు ఖర్చుపెట్టి కట్టించిన తర్వాత ఆ రెండు ఇళ్ళను ఇద్దరు మనుషులకు కిరాయికి ఇచ్చాను. అయితే అందులో ఒకడు కిరాయి సక్రమముగా ఇస్తున్నాడు. రెండవవాడు కిరాయిని ఇవ్వకుండా ఇల్లు తనదేనన్నట్లు ఉన్నాడు. అప్పుడు నాకు కిరాయి సక్రమముగా ఇచ్చువాడు మంచివాడగును. కిరాయి ఇవ్వనివాడు చెడ్డవాడగును. నా ఇంట్లో ఉంటూ నాకు కిరాయి ఇవ్వకుండా తనదే స్వంతము అన్నట్లు ప్రవర్తించువానిని నేను చెడ్డవాడు అనడములో ఎలాంటి అన్యాయము లేదు. అదే విధముగా మానవుని శరీరములను దేవుడు తయారుచేసి మనుషులకు ఇచ్చాడు. మనుషులు దేవుడు ఇచ్చిన

శరీరములలో నివసించుచున్నారు. దేవుడు నిర్మించిన శరీరములో నివసిస్తూ, దేవుడు అంటే ఎవరో మాకు తెలియదు, దేవునితో మాకేమి పని? అని అంటే వాడు దేవునికి చెడ్డవాడు కాక మరేమవుతాడు? దేవుని సొమ్మును వాడుకొంటూ దేవుడు ఎవరు? అని అనువారంత అన్యాయస్థులు ఎవరూ ఉండరని అనవచ్చును.

దేవుడు సృష్ఠి అనుదానిని తయారు చేసి, సృష్ఠి ఎప్పటికీ ఉండునట్లు ఎందరో పాలకులను నియమించి ప్రపంచమును నడుపుచున్నాడు. మనుషులు జీవించుటకు ఎన్నో వసతులు కల్పించాడు. పంటపండుటకు వర్షములను కురిపిస్తున్నాడు. మనుషులు ఆరోగ్యముగాయుండుటకు ఆక్సిజన్ కల్గిన గాలిని చెట్లద్వారా ఇస్తున్నాడు. వాతావరణము సమపాళ్ళుగా ఉండునట్లు సూర్యరశ్మిని చేకూర్చుచున్నాడు. ఈ విధముగా మనిషి ఆరోగ్యముగా బ్రతుకుటకు బయట వాతావరణములో అనుకూలించ డమేకాక, శరీరములోపల అనేక విధముల ఎన్నో పనులు చేయుచూ, శ్వాసను నడుపుచూ, తిన్నదానిని జీర్ణము చేయుచూ, అనేకమయిన పనులను దేవుడు చేసిపెట్టుచుండగా, అన్ని రకముల సహాయము చేయువానిని నమ్మకపోతే, అయన ఎవరో అంటే అట్టివాడు దేవునికి నమ్మకద్రోహికాక ఎట్లు సరిపోవువాడగును? నీ ఇంటిలోనివాడు నీకు కిరాయి ఇవ్వక పోవడమేగాక, కనీసము నిన్ను ఇంటియజమాని అని కూడా అనకపోతే నీకు కోపమురాదా? నీ ఇంటిలో ఉండి ఇల్లు నీదని, దానికి యజమాని నీవని అననివాడు నీకు అయిష్టుడేయగును కదా! అలాగే శరీరమను ఇంటికి యజమాని అయిన దేవున్ని ఏమాత్రము లెక్కచేయక, ఇంటి యజమానిని నేనేనన్నట్లు ప్రవర్తించువాడు దేవునికి అయిష్టుడుకాక ఏమగును? శరీరమను గృహమును ఇచ్చిన వానిని లెక్కచేయనప్పుడు

తర్వాత తన ధనము అయిన జ్ఞానమును శరీరములోయున్న జీవునికి లభించకుండా దేవుడు చేయగలడు. శరీరమునకు యజమాని అయిన వాడు, శరీరమును తయారు చేసినవాడు, శరీరములోని సమస్తమును సృష్ఠించినవాడు, శరీరములో జీవుడు బ్రతుకుటకు కావలసిన సమస్తమును శరీరము బయట, శరీరములోపల దేవుడు తయారు చేసియుంచాడు. అయితే దేవుడు సమస్తమును లోపల బయట తయారుచేసి ఇచ్చాడని మనిషి తెలియలేక పోవుచున్నాడు. కనీసము దీనినంతటినీ ఎవరు తయారు చేశారని కూడా అనుకోవడము లేదు. తాను అనుభవించడము తప్ప ఇదంతా ఎక్కడిది అని ఏమాత్రము అనుకోని వానిని మూర్ఖుడనక ఏమనాలి?

దేవుడు సర్వమునకు సృష్ఠికర్తయని చెప్పుటకు ఖుర్ఆన్ గ్రంథములో సూరా 2, ఆయత్ 29లో ఇలా అన్నాడు. **(2-29) "దేవుడు మీ కోసము భూమిలోయున్న సమస్త వస్తువులను సృష్ఠించాడు. తర్వాత ఆకాశము వైపునకు ధ్యాసను మరల్చి తగురీతిలో సప్తాకాశములను నిర్మించాడు. ఆయన అన్నీ తెలిసినవాడు"** ఈ వాక్యములోని విషయము బాగా అర్థమగుటకు మరొకచోట సూరా 29, ఆయత్ 44లో చూస్తాము. అక్కడ ఇలా వ్రాసియున్నది. **(29-44) "అల్లాహ్ ఆకాశాలనూ, భూమినీ సత్యబద్ధముగా సృష్ఠించాడు. ఆకాశాలను భూమిని పరమార్థముతో సృష్ఠించాడని తెలిసితే, ఇందులో గొప్ప నిదర్శనము దొరుకుతుంది".** ఇక్కడ వాక్యములలోని వివరమును గ్రహించితే ఇలా కలదు. 2-29 వాక్యములో సప్తాకాశములను దేవుడు నిర్మించాడు అని కలదు. తర్వాత 29-44వ వాక్యములో ఆకాశములను భూమిని సత్యబద్ధముగా తయారు చేశాడు అని అన్నారు. ఇంకా బాగా అర్థమగుటకు ప్రక్కనే భూమిని ఆకాశములను పరమార్థముతో సృష్ఠించాడని చెప్పారు. చివరిలో

పరమార్థము ప్రకారము ఇందులో నిదర్శనమున్నదియని కూడా చెప్పారు. అన్ని పదములకు అర్థమును గ్రహించినచో పై వాక్యములలోని నిజార్థము తెలిసిపోవును. ఇందులో నిదర్శనమున్నది అను మాటను విడదీసి చూస్తే దర్శనము అనగా కనిపించడము అని అర్థము లేక చూడడము అని అర్థము. ని అనగా లేదు, కాదుయని అర్థము. నిదర్శనము అనగా కనిపించునది కాదు అనియూ లేక చూచునది కాదు అని అర్థము. దీనిప్రకారము ఇక్కడ చెప్పిన విషయము అనగా పై వాక్యములలోని విషయము అంతయూ సూక్ష్మమైనదనీ స్థూలమైనది కాదని తెలిసిపోవుచున్నది. ఇప్పుడు పై వాక్యములలో చెప్పిన భూమి ఆకాశములను పరమార్థముగా సూక్ష్మముగా అర్థము చేసుకోవలసియుండును. భూమియనినా, ఆకాశములు అనినా స్థూలముగా అర్థము చేసుకొంటే నిజమైన భావము తెలియకుండాపోవును. వాస్తవానికి స్థూలముగా ఒక ఆకాశమే కనిపించునుగానీ, ఏడు ఆకాశములు ఎక్కడా కనిపించవు. అందువలన ఏడు ఆకాశములు తెలియాలంటే సూక్ష్మముగా అర్థము చేసుకోవాలి.

29వ వాక్యములో మీ కోసము దేవుడు భూమిలోయున్న సమస్తమును సృష్ఠించాడు అని కలదు. మనకోసము అనగా మానవులకొరకు దేవుడు భూమిని సృష్ఠించాడు అను వాక్యములో భూమి అను పదము అందరికీ స్థూలముగా కనిపించు భూమిగా అర్థమయి ఉంటుంది. అయితే ఇక్కడ స్థూలముగా కాకుండా సూక్ష్మముగా భూమి అని అంటే మనిషి శరీరము అని తెలియవలెను. భూమిలోయున్న సమస్తమును సృష్ఠించాడు అంటే శరీరములోని సమస్త అవయవములను, సమస్త భాగములను సృష్ఠించాడని అర్థము. శరీరములో నాలుగు చక్రములు దాని మధ్యలోని బ్రహ్మనాడి అనునవి ప్రత్యేకమయినవి. మనిషి చనిపోయినప్పుడు

శరీరమును వదలి బ్రహ్మనాడితో సహా నాలుగుచక్రములు బయటికి పోవును. అందులో జీవాత్మ, ఆత్మ ఉండడమేకాక వాడుచేసుకొన్న కర్మ, వాని గుణములు అన్నీయుండును. మొత్తము నాలుగుచక్రముల చట్రమును ఆకాశము అని అనవచ్చును. నాలుగుచక్రములకు ఆధారముగా, ఇరుసుగా యున్న బ్రహ్మనాడిలో ఆత్మయున్నదని చెప్పుకొన్నాము కదా! ఆ బ్రహ్మనాడి నాలుగు చక్రములనుండి క్రింద గుదస్థానము వరకు వ్యాపించియున్నది. తలనుండి క్రిందివరకు వ్యాపించియున్న బ్రహ్మనాడి మొత్తము ఏడు భాగములుగాయున్నది. ఏడు భాగములను ఏడునాడీకేంద్రములని అంటున్నాము. పైన తలలోగల నాడీకేంద్రములో నాలుగుచక్రములు గలవు. అక్కడినుండి క్రిందివరకు ఆరు నాడీకేంద్రములున్నవి. మొత్తము ఏడు నాడీకేంద్రములను ఏడు ఆకాశములుగా పై వాక్యములో చెప్పారు. భూమిని శరీరముగా పోల్చుకొని చూస్తే ఏడు ఆకాశములను ఏడు నాడీకేంద్రములుగా పోల్చుకొని చూస్తే ఈ వాక్యములోని నిగూఢమైన జ్ఞానమంతయూ అర్థమైపోగలదు. శరీరములోని ఏడు నాడీకేంద్రములను ఏడు ఆకాశములుగా గ్రహించగల్గినప్పుడు ఈ వాక్యములోని నిదర్శనము దర్శనము కాగలదు. అట్లు కాకపోతే ఏడు ఆకాశములు బయట ఎక్కడా ఎవరికీ కనిపించవు. బయట ప్రపంచములోయున్నది ఒక్క ఆకాశమేగానీ, ఏడు ఆకాశములు లేవు. అందువలన ఈ వాక్యమునకు స్థూల అర్థము సరిపోదు, సూక్ష్మ అర్థము మాత్రము సరిపోవును.

ఒక మనిషి జీవించుటకు శరీరము లోపల, శరీరము బయట అన్నీ అనుకూలముగా ఉండునట్లు దేవుడు శరీరము లోపల శరీరము బయట సమస్తమునూ సృష్ఠించాడు. శరీరము బయటా లోపలా తన సృష్ఠినంతటినీ దేవుడు గమనిస్తూనేయున్నాడు. దేవుడు స్వయముగా ఏ

పని చేయకున్నా, తన పాలకులే లోపల బయట సమస్త కార్యములనూ చేయుచున్నారు. దేవుడు అపరిమితుడు, అగోచరుడు. ఆయన అంతటా వ్యాపించియున్నాడు మరియు ఎవరికీ కనిపించక యున్నాడు. దేవున్ని ఎవరూ చూడలేదు, దేవుడు అందరినీ చూస్తున్నాడు. దేవుడు తాను సృష్ఠించిన దానిమీదయంతా అజమాయిషీ కల్గియున్నాడు. దేవుడు స్థూలము కాదు, సూక్ష్మము. అందువలన దేవుడు ఎవరి దృష్ఠికీ కనిపించక సృష్ఠి అంతా అణువణువునా వ్యాపించియున్నాడు. ఆ లెక్క ప్రకారము దేవుడు మనిషి శరీరము లోపల మరియు బయట వ్యాపించియున్నాడు. అంతటా వ్యాపించి అన్నిటికీ సాక్షిగాయుండుట వలన ఎవరికీ తెలియని రహస్య విషయములన్నియూ ఆయనకు తెలుసు. ఒక మనిషి తన మనసులో ఏమయినా అనుకొన్నా, దానిని రహస్యముగా పెట్టుకొనియుండినా, ఆ మనిషి శరీరములో మనస్సుకూ, జీవునికీ సాక్షిగాయున్న పరమాత్మకు అన్నీ తెలిసిపోవును. ఎక్కడ రహస్యములున్నా ఆ రహస్యములన్నీ రహస్యముగా శరీరములోయున్న దేవునికి తెలియును. అందువలన జీవాత్మకు రహస్యములుండవచ్చునుగానీ, పరమాత్మకు రహస్యములుండవు. అందువలన ఈ విషయమును ఖుర్ఆన్ గ్రంథములో కూడా చెప్పారు. ఖుర్ఆన్ గ్రంథములో సూరా 6, ఆయత్ 59లో ఇలా కలదు చూడండి.

**(6-59) "అగోచరాల తాళము చెవ్వులు అల్లాహ్ వద్దనే ఉన్నాయి. అల్లాహ్‌కు (దేవునికి) తప్ప ఇతరులెవరికీ వాటి గురించి తెలియదు. భూమిలోనూ, సముద్రములోనూ ఉన్న వస్తువులన్నిటి గురించీ ఆయనకు తెలుసు. రాలే ఆకుకూడా ఆయనకు తెలియకుండా రాలదు. నేలలోని చీకటి పొరలలో పడే ఏ గింజ అయినా, పచ్చిది ఎండినది ఏది అయినా స్పష్టమైన గ్రంథములో నమోదైయున్నది."**

ఇదే విషయమునే మనకు బాగా అర్థమగుట కొరకు మరియొకచోట కూడా చెప్పారు. సూరా 49, ఆయత్ 18లో ఈ విధముగా చెప్పారు చూడండి. **(49-18) "భూమ్యాకాశాలలో యున్న రహస్య విషయములన్నీ అల్లాహ్‌కు బాగా తెలుసు. అంతేకాక మీరు చేసేదంతా ఆయన చూస్తూనేయున్నాడు."**

ఒక ఇంటిలో ఒక వస్తువునో, లేక మనిషినో, లేక ఒక జంతువునో, అదియునూకాక ఒక పక్షినో దాచిపెట్టి ఆ ఇంటిలోపలికి పోయి ఎవరూ చూడకుండా ఇంటికి తలుపులు మూసి, తలుపులకు తాళము వేసితే ఆ ఇంటిలో ఏమి దాచిపెట్టినది ఇతరులకు ఎవరికీ తెలియదు. ఇంటిలో ఏమి దాచిపెట్టినదీ రహస్యముగానేయుండును. ఇంటిలో ఏమున్నదీ తెలియాలంటే ఇంటి తాళము తీసి చూడవలెను. అలా చూచినప్పుడే లోపల ఏమి దాచిపెట్టబడినదీ తెలియును. ఒక ఇంటిలోని రహస్యము తెలియాలంటే, ఆ ఇంటి తాళమును తెరవాలంటే, తాళము చెవులు తప్పని సరిగా అవసరము. అలాగే ఒక మూటలో ఏదో పదార్థము పెట్టి మూటను ముడివేశాడనుకొనుము. అప్పుడు ఆ ముడిని విప్పిచూస్తే ఆ మూటలోని పదార్థము తెలియును. అట్లే కంప్యూటర్‌లో ఒక విషయమును నమోదు చేసి దానికి ఒక కోడ్ (గుర్తు) పెట్టామనుకోండి. కంప్యూటర్‌లోని విషయము ఇతరులు తెలియాలంటే ఆ విషయమును దాచిన కోడ్ అవసరము. అలాగే అగోచరమైన అనగా స్థూలముగా కనిపించని విషయాలు తెలియాలంటే దానికి సంబంధించిన జ్ఞానము తెలిసియుండాలి. అయితే ఇక్కడ రహస్యములయిన వాటి తాళము చెవులన్నీ దేవునివద్దనే ఉన్నాయి. కనుక దేవునికి తెలియని రహస్యమంటూ ఏదీ లేదు. రహస్యముల తాళము చెవులు అనగా మూటకున్న ముడిగానీ, కంప్యూటర్‌లోని కోడ్ (గుర్తుగానీ,)

బీగము (తాళము)కున్న తాళము చెవులుగానీ  అన్నీ దేవునివద్ద ఉన్నాయి. అందువలన ఆయనకు తెలియని రహస్యము ఏదీ ప్రపంచములో లేదు అని చెప్పవచ్చును.  సర్వమునూ సృష్ఠించిన దేవునికి సర్వమూ తెలియును. ఆయనవద్ద ఎవరూ దేనినీ దాచలేరు.  దేనినయితే దాచాలనుకొని మనిషి దాచుచున్నాడో, ఆ మనిషిలో యుండి చూస్తున్న  దేవునికి అది తెలిసిపోవు చున్నది.  ఒక మనిషి ఒక విషయమును తన మనస్సులోనే పెట్టుకొని ఇతరులవద్ద దాచినా  మనస్సుకు సాక్షిగాయున్న దేవునికి వాని మనస్సులో ఏమున్నది తెలుసు.  ఈ విధముగా దేవుడు సమస్తమును తెలిసినవాడు మరియు సమస్తమును చూచువాడని జ్ఞప్తిలో యుంచుకోవలెను.

ప్రతి మనిషీ శరీరముతోనే యున్నాడు, ప్రతి జీవీ శరీరమును ధరించియున్నది.  శరీరమును ధరించిన ఏ జీవరాశికయినా ఆ శరీరమును తయారుచేసినవాడే సృష్ఠికర్త మరియు దేవుడు అగును.  ప్రపంచములో నివాసముచేయు మనుషులు అనుకొన్నట్లు ఒక్కొక్క మతమునకు ఒక్కొక్క దేవుడు లేడు.  ప్రపంచములో ఎందరో మనుషులు ఎందరో దేవుళ్ళను నిర్మించుకొని వారిని మాత్రము  మా దేవుడని ఆరాధిస్తున్నారు.  ఇస్లామ్ మతములో సృష్ఠికర్త ఒక్కడే అంటున్నారు.  అలాగే క్రైస్తవమతములో కూడా సృష్ఠికర్త ఒక్కడేయని అంటున్నారు.  అయితే ఒకరు చెప్పు దేవున్ని ఇంకొకరు ఒప్పుకోవడములేదు.  క్రైస్తవులు మా యెహోవాయే నిజమైన దేవుడు అని అంటున్నారు.  ముస్లీమ్‌లు యెహోవాను ఒప్పుకోవడములేదు.  మా అల్లాయే నిజమైన దేవుడు అంటున్నారు.  నేడు ప్రపంచమంతా కొన్ని వర్గములుగా, కొన్ని మతములుగా చీలిపోయి ఆ మతములవారు, ఆ వర్గములవారు వేరువేరు దేవుళ్ళను  వారివారి దేవుడుగా చెప్పుకొంటున్నారు.  ప్రస్తుత హిందూమతములో ముస్లీమ్‌లు, క్రైస్తవులు వారివారి దేవుడు వేరువేరు అని

చెప్పినట్లు కూడా కాకుండా హిందూమతములో నేడు కులమునకు ఒక దేవుడు, గోత్రమునకు ఒక దేవుడుగా చెప్పుకొంటున్నారు. మిగతా రెండు మతములు ఒక్కొక్క మతమునకు ఒక్కొక్క దేవున్ని చెప్పుకోగా, హిందూ మతములో అసలయిన దేవుడు ఎవరో తెలియక వందలు, వేల దేవుళ్ళు తయారయినారు. అందువలన రెండు మతముల ముందర ఇది తక్కువగా కనిపించుచున్నది. ఒకప్పుడు పూర్వము ప్రపంచములో అన్ని మతములలో గొప్పదైన ఇందూమతము నేడు ఆధ్యాత్మికములో మిగతా రెండు మతముల కంటే వెనుకబడియున్నది. ఆధ్యాత్మికములో వెనుకబడుట వలన జన సంఖ్యలో కూడా వెనుకబడిపోయి మూడవ స్థానములోయున్నది. నేడు హిందూమతములో దేవుడు ఫలానావాడు అని ఖచ్చితముగా చెప్పలేక పోవుచున్నారు. దానికి తోడు మేము హిందువులము, హిందూధర్మ రక్షకులమను వారికి హిందూధర్మములేవో తెలియకుండా పోయినవి. దానితో హిందూమతము పూర్తి గాడితప్పిపోయినది. ముస్లీమ్‌లకు మూల గ్రంథము ఖుర్‌ఆన్ గ్రంథము కలదు. అలాగే క్రైస్తవులకు మూల గ్రంథము బైబిలు కలదు. వారు వారి గ్రంథములను ఉన్నత స్థానములో పెట్టుకొన్నారు. వారిలో ఏ మతస్థున్ని అడిగినా వారి గ్రంథము పేరు చెప్పుచున్నారు. హిందూ మతములో హిందువుల గ్రంథము భగవద్గీతయని తెలియకుండా పోయినది. కొందరు హిందువులు తమ గ్రంథము వేదములు అని చెప్పుచున్నారు. కొందరు రామాయణము అంటున్నారు. ఈ విధముగా హిందూమతములో తమ గ్రంథము ఫలానాయనిగానీ, తమ దేవుడు ఫలానాయనిగానీ, తెలియకుండా పోయినది. ఇంకా, నేను ఫలానా మతములో పుట్టాను అని తెలియని హిందువులు కూడా కలరు.

ప్రపంచమునకంతటికీ సృష్ఠికర్త ఒకడే అయినా ఆయన ఫలానా అని తెలియని ప్రజలు మా దేవుడువేరు, మీ దేవుడువేరు అని చెప్పు కోవడమును చూస్తే భవిష్యత్తు కాలములో దేవుడున్నాడను విషయమే మరచిపోయే ప్రమాదమున్నదని, భవిష్యత్తులో అటువంటి అజ్ఞాన పరిస్థితి రాకుండా దేవుడు ముందే తనను గురించి తాను చెప్పుకోవలసి వచ్చినది. కన్న కొడుకులు తండ్రి ఎవరో తెలియక ఒక్కొక్కరు ఒక్కొక్క పేరు చెప్పుచూ ఫలానా వాడు నా తండ్రియని ఒకరు చెప్పితే, మరొకరు నా తండ్రి వేరని అంటే, ఇంకొకడు నా తండ్రివేరని ముగ్గురూ ఒకే తండ్రి కొడుకులైయుండి వేరువేరు తండ్రుల పేర్లు చెప్పితే చూస్తున్న తండ్రి, తన కొడుకులకు తానే పరిచయము చేసుకోవలసి వచ్చినట్లు, అందరికీ దేవుడయినవాడు నేనే మీ దేవున్ని అని చెప్పుకోవలసి వచ్చినది. అలా చెప్పడములో మీకు తండ్రి ఒక్కడే, ఆ తండ్రిని నేనే అని తండ్రియే స్వయముగా కొడుకులకు చెప్పు కోవలసి వస్తే ఆ పరిస్థితి ఎలాగుంటుందో ఆలోచిస్తే దేవునికి ఎంత ఓపికయున్నదో అర్థమగుచున్నది. తమ దేవుడు ఎవరో అర్థముకాక మనుషులు తమను పుట్టించిన దేవున్ని వేరువేరుగా చెప్పుచున్నప్పుడు, నేనే మీ దేవున్నియని ఖుర్ఆన్ గ్రంథములో చెప్పాడు. దానిని గురించి సూరా 2, ఆయత్ 163లో ఈ విధముగా కలదు చూడండి. **(2-163) “మీ అందరి ఆరాధ్య దైవము ఒక్కడే. ఆయన తప్ప మరో ఆరాధ్యదైవము లేనే లేదు. ఆయన అపార కరుణామయుడు, పరమ కృపాశీలుడు.”** ఇక్కడ ప్రపంచములోని మనుషులందరికీ దేవుడు ఒక్కడే. ఆరాధ్యదైవము ఒక్కడేయనీ, దేవుడు ఎంతో కరుణామయుడు అనికూడా చెప్పారు. అంతేకాక ఖుర్ఆన్ గ్రంథములోనే మిగతా చోట్ల కూడా అందరికీ ఒక్కడే పూజ్యుడనీ చెప్పారు. ఈ విషయమును గురించి సూరా 2, ఆయత్

255లో ఇలా కలదు. **(2-255) "దేవ్యడు మాత్రమే నిజమైన ఆరాధ్య దైవము. ఆయన తప్ప మరో ఆరాధ్యుడు లేనే లేడు. ఆయన సజీవుడు. ఆయన అన్నిటికీ మూలాధారము. ఆయనకు కునుకుగానీ, నిద్రగానీ రాదు. భూమ్యాకాశములలో ఉన్న సమస్తము ఆయన ఆధీనములో యున్నది. ఆయన అనుమతి లేకుండా ఆయన సమక్షములో సిఫారసు చేయగలవాడు ఎవడూ లేడు. వారికి ముందూ, వెనుకాయున్న సమాచారము మొత్తము ఆయనకు తెలుసు. ఆయన కోరినది తప్ప, ఆయనకున్న జ్ఞానములోని ఏ విషయమూ వారి గ్రాహ్యాపరిధిలోనికి రాదు. ఆయన కుర్చీ వైశాల్యము భూమి ఆకాశములను చుట్టుముట్టియుంది. భూమ్యాకాశాలను రక్షించటానికి ఆయన ఎన్నడూ అలసిపోడు. ఆయన సర్వోన్నతుడు, గొప్పవాడు."** ఈ వాక్యములో చెప్పిన విషయమును ధృఢపరుస్తూ సూరా 3, ఆయత్ 18లో ఇలా చెప్పడము జరిగినది. **(3-18) "అల్లాహ్ (దేవుడు) తప్ప మరో ఆరాధ్యదైవము లేదని స్వయముగా దేవుడు, దేవుని దూతలు మరియు జ్ఞాన సంపన్నులయిన వారు సాక్ష్యమిస్తున్నారు. ఆయన సామత్యము, సమతూకముతో ఈ విశ్వాన్ని నిలిపియుంచాడు. సర్వాధిక్యుడు, వివేచనాశీలి అయిన దేవుడు తప్ప మరొకరెవరూ ఆరాధనకు అర్హులు కారు."** ఇంతవరకు మూడుచోట్ల దేవుడు ఒక్కడే ఆరాధ్యదైవమని చెప్పడము జరిగినది. అదే విషయమునే మరొక చోట ఒక భక్తుడు తన ఉద్దేశ్యమును తెలుపుచూ ఇట్లంటున్నాడు. సూరా 11, ఆయత్ 56లో ఇలా కలదు చూడండి. **(11-56) "నేను కేవలము అల్లాహ్‌నే (దేవున్నే) నమ్ముకున్నాను. ఆయన నాకూ ప్రభువే, మీ అందరికీ ప్రభువే. ప్రతి ప్రాణియొక్క జుట్టు ఆయన చేతిలోనే ఉన్నది. నిశ్చయముగా**

**నా ప్రభువు నన్ను సన్మార్గమున ఉంచాడు."** ఈ విధముగా ఖుర్‌ఆన్ గ్రంథములో అనేకచోట్ల దేవుడు ఒక్కడే పూజింపతగినవాడు. ఆయన స్థానములో ఇతరులను చెప్పకూడదని తెలిపారు.

జిబ్రయేల్ ముహమ్మద్ ప్రవక్తకు తనకు తెలిసిన జ్ఞానమును బోధించుచూ మానవులందరికీ దేవుడు ఒక్కడేయని తెల్పుటకు సూరా 16, ఆయత్ 2 లో ఈ విధముగా చెప్పాడు **(16-2) "నేను తప్ప వేరే ఆరాధ్య దైవము లేడు. కనుక మీరు నాకు భక్తిగాయుండండి అని ప్రజలను హెచ్చరించటానికి ఆయనే తన దూతలకు వహీని ఇచ్చి, తన ఆదేశానుసారము దాన్ని తన దాసులలో తాను కోరినవారిపై అవతరింపజేస్తాడు."** ఇంతవరకు ఐదుచోట్ల అందరికీ దేవుడు ఒక్కడేయనీ, అతనే పూజింపదగినవాడని చెప్పుచూ దేవునికున్న కొన్ని ప్రత్యేకతలను ఈ వాక్యములలో చెప్పడము జరిగినది. మొదట చెప్పిన 2-163 వ వాక్యములో ఆయన (దేవుడు) తప్ప వేరే ఆరాధ్యదైవము లేడని చెప్పి చివరిలో అపార కరుణామయుడు, అనంతకృపాశీలుడు అని అన్నారు. ఈ వాక్యములోని ఈ రెండు పదములతో కొందరు అజ్ఞానమార్గమున పోవుటకు అవకాశము కలదు. కావున అక్కడ ఎందుకు ఆ పదములను చెప్పారో అర్థము చేసుకోవలసియున్నది. ఈ పదములను గురించి మేము చెప్పునది ఏమనగా! దేవుడు మనలాంటి మనిషికాదు. ఆయనకు మనకున్నట్లు గుణములు ఉండవు. కరుణ, కృప అనునవి ఆయనకు ఉండవు. అయినా ఇక్కడ కరుణామయుడు, కృపాశీలుడు అని చెప్పారు. అలా చెప్పుటకు కారణమేమనగా! దేవుని జ్ఞానమును ఎవడు తెలుసుకొన్నా, వాడు ఎంతటి ఘోరమైన పాపముగలవాడైనా వాడు దేవుని జ్ఞానము తెలియుటచేత వాని పాపకర్మలన్నీ ఒకదాని తర్వాత ఒకటి జ్ఞానము వలన కాలిపోవును.

పాపము వలన ఎన్నో కష్టములు, బాధలు అనుభవించవలసియున్నా జ్ఞానము వలన కర్మలు లేకుండా పోవుట వలన, జ్ఞానము అగ్నివలె వాని పాపములను కాల్చివేయడము వలన వానిని ఆ బాధలనుండి, కష్టములనుండి దేవుడు కాపాడినట్లయినది. ఆ విధముగా దేవుడు కాపాడుటనుబట్టి దేవున్ని దయామయుడు అన్నారు గానీ వాస్తవానికి దేవునికి దయా, కరుణ అనునవి ఏవీ ఉండవు. దయ అనునది మనిషి గుణచక్రములోని ఒక గుణము. దేవుడు గుణములకు అతీతుడు. అందువలన ఆయనను గుణాతీతుడు అని అందురు. గుణాతీతునకు గుణములుండవు. కావున జ్ఞానము తెలిసిన వాని కర్మలు జ్ఞానమను అగ్నిలో కాలిపోవుచుండుట వలన, వానిని కాపాడినట్లయినది. ఇతరులను కాపాడువాడు దయగలవాడని చెప్పారు. వాస్తవానికి దేవునికి ఏ గుణమూ ఉండదు. దేవుని జ్ఞానము వలన మనిషి కాపాడబడినాడు. దేవుని లక్షణములలో జ్ఞానము ముఖ్యమైనది కావున మనుషులకు అర్థమగుటకు దేవుని జ్ఞానమును మంచిగుణముగా పోల్చి దయ అని చెప్పారు తప్ప వాస్తవానికి గుణముగా దానిని అర్థము చేసుకోకూడదు. దయ ఇతరులను కాపాడినట్లే జ్ఞానము కాపాడినది కావున జ్ఞానమును దయగా వర్ణించి చెప్పారు.

దేవుడు మనిషిని తయారు చేసి, బ్రతుకుటకు జీవనమును ఇచ్చి జీవనములో వచ్చిన పాపపుణ్యములనుండి బయటపడుటకు ఒకవైపు జ్ఞానమును కూడా ఇచ్చాడు. అటువంటివానికి విధేయులుగాయుండి, ఆయననే ఆరాధించాలి. అట్లుకాకుండా కొందరు దేవున్ని వదలి చిల్లర దేవుళ్ళను గొప్పగా పెట్టుకొని వారినే ఆరాధిస్తూ, అసలయిన దేవున్ని మరచిపోవడము జరుగుచున్నది. దేవుడు తప్ప మిగతా దేవుళ్ళందరూ మనిషివలె జీవముగలవారే. వారికి కూడా పాపపుణ్య కర్మలు గలవు.

అందరి జుట్టు దేవుని చేతిలో యుండినట్లు, దేవతల జుట్టు కూడా దేవుని చేతిలోనే కలదు. దేవుని చేతిలోయున్నదని ఎందుకు చెప్పుచున్నామనగా! ప్రపంచములోని దేవతలందరూ దేవుని పాలనకు లొంగి, దేవుని పాలనకు లోబడి బ్రతుకుచున్నారు. దేవుని పాలకులయిన భూతములు, మహా భూతములు దేవతలను కూడా శిక్షించగలరు. అందువలన దేవుని దూతలకే భయపడువారు దేవునికి సమాన ఆరాధ్యులుకారు. అందువలన దేవుడు ఒక్కడే అందరికీ ఆరాధ్యదైవము అని చెప్పుచున్నాము.

కొందరికి దేవుడు ఎవరో, ఆయన ఎంత గొప్పవాడో తెలియక తమకు తెలిసిన దేవతలను మ్రొక్కుచుందురు. వారికి దేవునికి, దేవతలకు ఉన్న వ్యత్యాసము తెలియదు. అందువలన అటువంటివారు దేవుని గొప్పతనమును తెలియుటకు 2-255 వాక్యములో **"దేవునికి నిద్రరాదు, భూమి ఆకాశములు ఆయన ఆధీనములోయున్నవని"** చెప్పారు. అంతేకాక ఆయన నివాసము భూమి ఆకాశములయందు వ్యాపించియున్నది. ఆయన ఆజ్ఞ లేకుండా ఎవనికి కూడా దేవుని జ్ఞానము తెలియదు. ఈ విషయమునే 16-2 లో చెప్పుచూ తన ఆదేశానుసారము దూతలు తనను నమ్మిన తన దాసులకు జ్ఞానమును అందివ్వగలరని చెప్పాడు. ఈ విధముగా చెప్పిన జ్ఞానమును అర్థము చేసుకొంటే ప్రతి మనిషి వెనుకా మనుషులకు తెలియకుండా దేవుని దూతలయిన ఎన్నో గ్రహములు, భూతములు పనిచేయుచూ, కొన్ని మనిషి కర్మప్రకారము పాపపుణ్యములను అనుభవింప జేయుచుండగా, మరికొందరు దూతలు దేవుని ఆజ్ఞ ప్రకారము మనిషికి దేవుని జ్ఞానమును అందించుచున్నారు. దేవుడు ఏమీ చేయనివాడై తన దూతల చేత చేయించేవాడుగాయున్నాడు. మనిషికి జ్ఞానమును అందించు వారు కూడా దూతలనబడు దేవుని పాలకులేయని తెలియవలెను.

మనిషి పాపపుణ్యములను అనుసరించి మనిషికి కష్టసుఖములను అనుభవింప జేయువారు కూడా దేవుని పాలకులే. దేవుని పాలనలో మనుషులేకాక, చిల్లర దేవుళ్ళందరూయున్నారు. కావున వారిని పాలించు వారు కూడా దేవుని పాలకులేయని తెలియవలెను. మనుషుల లెక్కలో పెద్దగా కనిపించు దేవతలందరూ దేవుని పాలకుల లెక్కలో మనుషులతో సమానముగానే యున్నారు. దేవుని పాలకులు మనుషులను పాలించినట్లే దేవతలనబడు వారిని కూడా పాలించుచుందురు. మనుషులకున్నట్లే దేవతలకు కూడా కర్మలుండుట వలన కర్మానుసారము పాలకులే దేవతలను కూడా శిక్షించుచుందురు. దేవతలందరూ దేవుని దూతలను, దేవుని పాలకులను చూచి భయపడుచుందురు. దేవతలలో కూడా జ్ఞానముకలవారు జ్ఞానము లేనివారు ఉండుట సహజమే. జ్ఞానులయిన దేవతలు దేవుడు ఒక్కడేనని తెలిసి సృష్టికర్తయైన పరమాత్మనే ఆరాధించుచున్నారు. ఈ విధముగా జ్ఞానులయిన మనుషులుగానీ, దేవతలుగానీ తమను తాము జీవాత్మలుగా తలచి అసలయిన పరమాత్మను ఒక్కనినే ఆరాధించుచున్నారు.

మనుషులలో జ్ఞానులు కలరు, అజ్ఞానులు కలరు. మనుషులను పాలించు దేవుని సేవకులందరూ దేవుని జ్ఞానమును తెలిసినవారైయుండి మనుషులలోని మరియు దేవతలలోని జ్ఞానులను, అజ్ఞానులను పాలించు చుందురు. అజ్ఞానులైనవారు చేయు అన్ని పనులనూ నిశితముగా పాలకులు గమనించుచున్నారు. ప్రతి మనిషి చేయు తప్పును ఒప్పును నమోదు చేసుకొంటున్నారు. అలాగే మనుషుల విషయములో ప్రవర్తించినట్లే దేవతల విషయములోనూ ప్రవర్తించుచూ వారు చేయుచున్న తప్పు ఒప్పులను కూడా వ్రాసిపెట్టుకొంటున్నారు. ఆ విషయము తెలియని మనుషులు తమ స్వంత తెలివిచేత దేవుని జ్ఞానమును అడ్డము పెట్టుకొని, దేవుని

జ్ఞానమును మతములుగా చీల్చుకొని, ఇది నా మతము, ఈయన మా దేవుడు అంటున్నారు. ప్రపంచమునకంతటికీయున్న దేవున్ని మా దేవుడు అని సంకుచితము చేసి మాట్లాడడము పూర్తి తప్పగును. మతము అను పేరుతో దేవున్ని మా దేవుడు, మీ దేవుడు అనడము తప్పయినా, తమది తప్పు అని ఎవరూ అనుకోవడములేదు. పైగా తమదే నిజమైన జ్ఞానమనీ, తమదే నిజమైన మతమనీ మనుషులు అనుకోవడము జరుగుచున్నది. అదే విధముగా అందరూ ఎవరి మతమును వారు గొప్పగా చెప్పుకొనుచూ, ఇతర మతములను తక్కువ చేసి మాట్లాడడము జరుగుచున్నది. అలా మాట్లాడడమేకాక ఇతర మతములవారిని తమ మతములోనికి రమ్మని ఆహ్వానించడము జరుగుచున్నది. అంతేకాక తమ మతములోనికి వస్తే మంచి జరుగుతుందనీ, లాభము వస్తుందనీ, స్వయముగా మేము సహాయము చేస్తామనీ ప్రలోభపెట్టడము జరుగుచున్నది. మరికొన్నిచోట్ల మా మతము లోనికి చేరకపోతే మాతో మీకు కష్టములు తప్పవని బెదిరించి కొందరు, వేధించి కొందరూ, ఉన్న మతమును విడిచి తమ మతములోనికి వచ్చునట్లు చేసుకొంటున్నారు. ఇదంతయూ బలవంతపు మతమార్పిడియైనా అలా కాదు, మా మతము మీద ఇష్టపడి అందరూ వచ్చారని అబద్ధమును చెప్పుచున్నారు. ఇది ఒక మతమునకు పరిమితి కాలేదు. అన్ని మతములలో ఇదే జాఢ్యము అంటుకొనియున్నది.

దేవుని ధర్మము మూడు మతములలో సమానముగాయున్నదని చెప్పుకొన్నాము. ఇందూ, ఇస్లామ్, క్రైస్తవము అను మూడు మతములలో దేవుని జ్ఞానముయుండగా, బైబిలు, ఖుర్ఆన్ గ్రంథములు రెండూ భగవద్గీతను ధృవీకరించుచున్నవి. భగవద్గీతలోని జ్ఞానమే మాయందు కలదని మిగతా రెండు గ్రంథములూ చెప్పుచుండగా, భగవద్గీతలోని జ్ఞానమే

వాటియందుకలదని తెలిసిపోవుచున్నది. అటువంటప్పుడు ఈ మతము లోనిదే ధర్మమనీ, దానిలోనికే రమ్మని చెప్పుటకు వీలేలేదు. అందువలన ధర్మము విషయములో బలవంతము చేయుట తగదని ఖుర్ఆన్ గ్రంథములో కూడా చెప్పారు. ఈ విషయమును గురించి సూరా 2, ఆయత్ 256లో ఈ విధముగా కలదు చూడండి. **(2-256) "ధర్మము విషయములో బలవంతము ఏమీ లేదు. సన్మార్గము అపమార్గమునుంచి వేరుపడి పవిత్రముగాయున్నది. కనుక ఎవడయితే అల్లాహ్ తప్ప (పరమాత్మ తప్ప) వేరితర ఆరాధ్యులను తిరస్కరించి అల్లాహ్‌ను మాత్రము విశ్వసిస్తారో వారు ధృడమైన కడియాన్ని పట్టుకొన్నారు. అది ఎప్పటికీ తెగదు. అల్లాహ్ సర్వమూ వినేవాడు, సర్వమూ తెలిసినవాడు."** ఇక్కడ ఈ ఆయత్‌లోని భావము చాలా గొప్పదిగా యున్నది. అయితే ఎంత గొప్పభావము ఇందులోయున్నదో అంత గొప్ప భావము ప్రకారము ఈ వాక్యము అర్థమయినదను నమ్మకములేదు. ధర్మము విషయములో బలవంతము లేదు అని ఈ వాక్యములో చెప్పినట్లు అర్థమయినా కొందరికి ఒక రకముగా, మరికొందరికి ఇంకొక రకముగా అర్థమయినది. కొందరేమో మతములోనికి రమ్మని మేము బలవంతము చేయడము లేదు కదా! అంటూనే తమ మతము వారిని తమ ధర్మములోనే ఉండవలెనని బలవంతము చేయుచున్నారు. అలా చేయుట వలన ధర్మము విషయములో బలవంతము చేసినట్లే కదా!యని మేము అడుగుచున్నాము. దీనిఅర్థము ఏమంటే మా మతములోనికి ఎవరయినా రావచ్చును కానీ మా మతమునుండి ఎవరూ పోకూడదని అంటున్నారు. ధర్మము విషయములో బలవంతము అంటే ఒకవైపే అలా ఉండవలెను, మరొకవైపు అలా ఉండకూడదు అని కొందరు అంటున్నారు. దేవుడు ధర్మము విషయములో బలవంతము ఎటువైపునుండి

కూడా చేయకూడదనే చెప్పాడు. సన్మార్గమునుండి అపమార్గము వేరుపడి యున్నదని అన్నాడు. ఇక్కడ అందరూ మాది సన్మార్గము, మాదే సన్మార్గము అంటున్నారు. మాది అపమార్గమని ఎవరూ అనరు. ఎవరిది సన్మార్గమైనా, ఎవరిది అపమార్గమయినా, ఎవడూ ధర్మమును గురించి రావచ్చుననిగానీ, పోకూడదని గానీ చెప్పకూడదు. ధర్మము విషయములో మనిషిని స్వతంత్రునిగా వదలి వేయవలెను. అప్పుడయితేనే ధర్మము విషయములో బలవంతము చేయనట్లగును. దేవుడు సర్వమూ వినేవాడు, సర్వమూ తెలిసినవాడు అని ఆయత్ చివరిలో వ్రాశారు. చివరిలో ఏదో ఒక సూచన ఉంది అంటే ఖుర్ఆన్‌లో ఆ వాక్యము గొప్పదని భావించవలెను.

ఇది ముఖ్యమైన వాక్యమగుట చేత మా భావమును మేము వ్రాశాము. ఇతరుల భావమును కూడా చూచుట ముఖ్యము. ఖుర్ఆన్ గ్రంథములో ఈ వాక్యమునకు కొందరు ముస్లీమ్ పెద్దలు వ్రాసిన వివరము ఇలా కలదు. "**అల్లాహ్ తప్ప వేరే ఆరాధ్యుడు లేడు, ముహమ్మద్ అల్లాహ్ ప్రవక్త అనే విషయాన్ని ఒప్పుకొనేదాకా జనులతో నేను పోరాడుతూనే ఉండాలని నాకు ఆదేశింపబడింది. (ఈ వాక్యము హదీసు గ్రంథములోనిది, ఖుర్ఆన్ గ్రంథములోనిది కాదు) అలాగే ధర్మభ్రష్టతకు పాల్పడినవారికి విధించబడే శిక్షకు కూడా ఈ ఆయత్ విరుద్ధము కాదు. ధర్మభ్రష్టుడయిన వ్యక్తికి మరణశిక్ష ఉందంటే అది బలవంతముతో ముడిపడిన విషయము కాదు. పైగా అది ఇస్లామీయ వ్యవస్థ సైద్ధాంతిక స్వరూపాన్ని కాపాడే చర్యలో భాగము. ఒక ముస్లీమ్ రాజ్యములో ఒక అవిశ్వాసికి తన అవిశ్వాసముపై నిలకడగా ఉండేందుకు అనుమతి ఇవ్వవచ్చునుగానీ, ఒక సారి ఇస్లామ్ లోనికి వచ్చిన మీదట, మళ్ళీ**

దాన్నుంచి తిరిగి పోవటానికి ఇస్లామ్ పై తిరుగుబాటు చేయడానికి అనుమతి ఇవ్వబడదు. కాబట్టి ఇస్లామ్‌లోనికి రాదలచినవారు బాగా ఆలోచించి, అన్నీ బేరీజు వేసుకొని మరీ రావాలి. ఈ విషయములో దృఢంగా, ఖచ్చితంగా వ్యవహరించడము చాలా అవసరము. ఎందుకంటే ఈ వ్యవహారములో కనుక మెతకవైఖరి అవలంబిస్తే సైద్ధాంతిక చట్రమే కుప్పకూలిపోతుంది. దానితో దాని అనుయాయుల్లో సైద్ధాంతిక వ్యాఘాతం, గందరగోళస్థితి ఏర్పడుతాయి. ఈ అయోమయావస్థ ఇస్లామీయ సమాజాన్ని తీవ్రముగా ప్రభావితము చేయవచ్చు.

ఏ విధముగా అయితే మనిషికి జీవించే హక్కు ఉందని చెప్పి దేశములో హత్యాకాండను, దొంగతనాన్ని, వ్యభిచారాన్ని, దోపిడీని అనుమతించడము జరుగదో, అదే విధముగా భావప్రకటనా స్వేచ్ఛపేరిట ఒక ఇస్లామీయ వ్యవస్థలో సైద్ధాంతిక తిరుగుబాటుకు కూడా అనుమతించడము జరుగదు. ఒక రాజ్యములో నరమేధాన్ని సృష్టించి, ప్రజా జీవితాలలో అరాచకాన్ని రేపే వారికి మరణదండన విధించడము ఎలా న్యాయమో ఒక సైద్ధాంతిక సమాజములో ధర్మభ్రష్టతకు పాల్పడి ప్రజల ధర్మపథాన్నే ప్రశ్నార్థకముగా నిలబెట్టిన వ్యక్తిని తుదముట్టించడము కూడా అలాగే న్యాయము. రాజ్యాన్ని అరాచకమునుండి కాపాడడము మొదటిదాని లక్ష్యమైతే రాజ్యములోని మతస్వభావ స్వరూపాలకు విఘాతము కలుగకుండా జాగ్రత్తపడడము రెండోదాని లక్ష్యము. ఈ రెండు ఉద్దేశ్యాలు అనివార్యమే" అని చెప్పారు. ఎవరు ఏమి చెప్పినా తప్పక వినవలసిందే, వినిన విషయము ఖుర్ఆన్‌లో దేవుడు చెప్పిన వాక్యమునకు సరిపోతే దానిని జ్ఞాపకము పెట్టుకోండి. ఒకవేళ సరిపోకపోతే దానిని

తమ జ్ఞాపకమునుండి తీసివేసుకోండి. అన్నిటికంటే ముఖ్యము దేవుని మాటేయని జ్ఞాపకముంచుకోవలెను. అందుకే వాక్యము చివరిలో "అల్లాహ్ (దేవుడు) సర్వమూ తెలిసినవాడు, సర్వమూ వినేవాడు" అని అన్నారు. ఒకవేళ దేవునిమాటను నీవు లెక్కించకపోతే అది నీ మనసులోని విషయమైనా దానిని దేవుడు తెలిసినవాడే. అలాగే దేవునిమాటకు వ్యతిరేఖముగా ఎవరితో చెప్పినా ఆ మాటను దేవుడు వినియే యుండును. కావుననే చివరిలో సర్వమూ వినేవాడు, సర్వమూ తెలిసినవాడు అని చెప్పారు.

దేవున్ని తప్ప ఇతరులను ఆరాధ్యదైవముగా చేసుకోనివారు కొందరుండగా, దేవుడు కాకుండా ఇతర దేవతలను ఆరాధించువారు చాలామందిగలరు. మనుషులలో ఎక్కువ శాతము దేవున్ని వదలి అన్య దేవతలను ఆశ్రయించినవారే ఉన్నారని చెప్పవచ్చును. చాలామందికి దేవుడు ఎవరో కూడా తెలియదు. వారికి తెలిసినదంతా దేవతలే. అదికూడా అందరూ దేవతలను ఆరాధించేది చూచి వారివలె మిగతావారు కూడా ఆరాధించను మొదలుపెట్టారు. పెద్దస్వామీజీలో లేక పెద్ద గురువులో అన్యదేవతారాధన చేయడమును చూచిన ప్రజలు అక్కడ ఆరాధింపబడే దేవతలే నిజమైన దేవుళ్ళనుకొని మ్రొక్కను మొదలుపెట్టారు. ఏమీ తెలియని ప్రజలు ఇతరులను చూచి వారు కూడా చేయడము మొదలుపెట్టుచున్నారు. ఇక్కడ తప్పంతా ఏమీ తెలియని ప్రజలది కాదు, అన్నీ తెలిసినవారిదే. స్వామీజీలయిన వారిని "మీరు చేసేదానినిబట్టి ఇతరులు కూడా అదే పనిని చేయుచున్నారు. మీరు గురువులుగా, బోధకులుగాయుండి దేవున్ని వదలి అన్యదేవతలను ఆరాధించడము వలన మిగతా ప్రజలందరూ చెడిపోవు చున్నారు" అని అడిగితే వారు "దేవతలున్నారు కాబట్టి వారిని మ్రొక్కుచున్నాము. ఇందులో మా తప్పేమీలేదు. తప్పంతా దేవునిదే.

అందరినీ సృష్ఠించినవాడు దేవుడే కదా! దేవుడు దేవతలను సృష్ఠించకపోతే మేము వారిని మ్రొక్కేవారమే కాదు కదా!" అని అంటున్నారు. ఎటు తిరిగీ తమ తప్పును దేవుని మీదికే త్రోసివేయుచున్నారు. వారికి మేము ఈ విధముగా చెప్పుచున్నాము. మానవుని కోర్కెను నెరవేర్చు నిమిత్తము దేవతలు అను వారిని దేవుడు సృష్ఠించవలసివచ్చినది. మనిషి తన జీవితములో అప్పుడప్పుడు దేవున్ని కోర్కెలు కోరుచుండును. మనుషులు కోరే కోర్కెలు ఎన్నో రకములుగలవు. అందులో "నేను పెద్దగాయుండగా ప్రజలు నన్ను దేవునివలె లెక్కించి పూజించవలెనను" కోర్కెకలవారు కూడా ఉందురు. అంతేగాక భూమిమీద లేని దేవతలను కూడా తమ ఊహతో కల్పించుకొని, ఒక రూపమును తయారు చేసుకొని మ్రొక్కేవారున్నారు.

మనిషి చివరి దశలో ప్రాణము పోవునప్పుడు ఏ ధ్యాసలో ఉండి చనిపోవునో, అదే ధ్యాసకల్గిన జన్మను ఇస్తాను అని దేవుడు భగవద్గీతలో చెప్పినట్లు, మనుషులు దేవతలను సృష్ఠించుకొని వారిని ఆరాధించి వారికి చివరిలో దేవతల ధ్యాస మనిషికి వచ్చునట్లు చేసి, ఆ ధ్యాసలోనే మనిషిని చనిపోవునట్లు చేసి, వానికి దేవతల జన్మనిచ్చి దేవతలుగా జీవించు అవకాశమును దేవుడు కల్గించుచున్నాడు. మనిషి కోరిన కోర్కెను నేరవేర్చు నిమిత్తము, దేవతలను పూజించినవాడు దేవతలను చేరునని చెప్పిన మాట ప్రకారము భూమిమీద మనుషులనేకాక కొంతమంది దేవతలను కూడా పుట్టించవలసిన పని ఏర్పడినది. ఈ విధముగా వచ్చిన అవసరమునుబట్టి దేవతలనువారిని పుట్టించడము జరిగినది. దేవునిచేత పుట్టించబడిన దేవతలందరూ జీవుళ్ళే. మనుషుల జన్మనుండి వచ్చినవారే. దేవతల జన్మలోనికి వచ్చిన జీవుళ్ళు తాము దేవతలుగా పుట్టించబడిన తర్వాత తమను జీవుళ్ళని మరచిపోయి తమను తాము దేవుళ్ళనీ, మనుషులకంటే

పెద్దవారమనీ అనుకోవడము జరుగుచున్నది. దీనినిబట్టి మనుషులే తాము చేసుకొన్న పుణ్యమునుబట్టి, తమ కోర్కెనుబట్టి, బ్రతికినప్పుడు చేసిన ఇష్ట దేవతారాధననుబట్టి, మనిషి చనిపోయిన తర్వాత దేవతాజన్మగా పుట్టవలసి వచ్చినది. ఒక జీవుడు వాని కర్మనుబట్టి మనిషిగా అయినా పుట్టవచ్చును లేక దేవతల జన్మలో అయినా పుట్టవచ్చును. దేవతలుగా పుట్టినా, మనిషిగా పుట్టినా వాడు సాధారణ జీవుడేగానీ వానిలో ప్రత్యేకత ఏమీ లేదు. దేవతలుగా పుట్టినవారు కూడా ఎన్నో అక్రమాలు చేస్తూ, వారు కూడా ఎంతో పాపమును సంపాదించుకొంటున్నారు. కొందరు దేవతలు మనుషుల కంటే ఎక్కువ పాపమును సంపాదించుకొనుచున్నారు. కొందరు దేవతలు ఎంతోమంచివారుగా యుండి పుణ్యమును కూడా సంపాదించుకొంటున్నారు. కొందరు దేవతలు ప్రపంచ విషయముల మీద ధ్యాసను తగ్గించి, దేవుని జ్ఞానమును సంపాదించుకొని ఉన్న కర్మను లేకుండా చేసుకొని అసలయిన దేవుని చెంతకు చేరాలనీ, మోక్షము పొందాలనీ ప్రయత్నించువారు కూడా కలరు.

అంతిమ దైవగ్రంథములో దేవతలను జిన్నులు అనియూ, జిన్నాతులనియూ పిలుచుచున్నారు. జిన్నులను, మనుషులను రెండు జాతులుగా జీవుళ్ళనే దేవుడు పుట్టించుచున్నాడు. ఈ విషయమును గురించి ఖుర్‌ఆన్ గ్రంథములో సూరా 51, ఆయత్ 56లో ఈ విధముగా చెప్పారు చూడండి. **(51-56) "మేము జిన్నాతులను, మనుషులను సృష్టించినది వారు నన్ను ఆరాధించటానికి మాత్రమే."** దేవుడు తనను ఆరాధించమని దేవతలకు (జిన్నులకు), మనుషులకు తెలియజేసినా, ఆ మాటను లెక్కించనివారు మనుషులు దేవతలను పూజించగా, దేవతలు తమను గొప్పగా ఊహించుకొని తమనే నిజమైన దేవునిగా ఊహించుకొని

అదే ఊహలోనేయున్నారు. ఏ దేవత ఎంతపెద్దగా ఊహించుకొనినా, ఆ దేవతను కూడా దేవుని పాలకులు వదలిపెట్టక అవసరమొచ్చినప్పుడు హింసింతురు. దేవుని పాలకులకు మనుషులుగానీ, దేవతలుగానీ ఇద్దరూ సమానమే. జిన్నుల (దేవతల) గురించి ఉదాహరణ చెప్పుకొంటే ఇలా కలదు. ఒక కొండమీద బహిరంగప్రదేశములో ఒక దేవుడు ప్రజలను ఆకర్షించి, వారిచేత అనేక పూజలను పొందుచూ ప్రసిద్ధిగాంచిన దేవునిగా యుండెను. ఆ జిల్లాలోనే తానే పెద్ద దేవున్ననీ, అందరికంటే ఎక్కువమంది ప్రజలు తనవద్దకు వస్తున్నారనీ, తనను తాను గొప్పగా ఊహించుకొని అసలయిన దేవున్ని పూర్తిగా మరచిపోయి ఆ దేవునితో నాకేమి పని అని అనుకొన్నాడు. ఆ దేవత దగ్గరకు వచ్చు ప్రక్క ఊరి దేవత "నీవు దేవున్ని పూర్తిగా మరచిపోయావు" అని జ్ఞాపకము చేసినా తాను ఏమాత్రము పట్టించుకోలేదు. తనవద్దకు ప్రజలు ఎక్కువ వచ్చేకొద్దీ ప్రక్క దేవతలను కూడా అగౌరవముగా చూడడము మొదలుపెట్టాడు. అప్పటినుండి మిగతా దేవతలు ఎవరూ అతనివద్దకు వచ్చి మాట్లాడుటకు ఇష్టపడేవారుకాదు. ఇదంతయూ గమనించిన ఒక భూతము ఆ దేవత పొగరు అణచివేయాలనుకొని, ఆ విషయమును గాలికి తెలియజేయగా గాలి ఒక్కమారు విజృంభించి ఆ దేవత ప్రక్కనేయున్న వృక్షమును క్రిందికి త్రోచినది. అప్పుడు ఆ వృక్షము ప్రక్కనేయున్న ప్రతిమ మీదపడి ప్రతిమకు కాలు, చేయి విరిగిపోయినవి.

ప్రతిమ శరీరములో దేవతయున్నప్పుడు ఆ సంఘటన జరిగినది. అందువలన ప్రతిమలోయున్న దేవత కాలు, చేయి కూడా విరిగిపోయాయి. అప్పుడు ఆ ప్రతిమలోయున్న దేవత కూడా కుంటిదైపోయినది కదా! అప్పటి నుండి విరిగిపోయిన దేవతను ఎవరూ పూజించలేదు. ఆ ప్రతిమను ప్రక్కకు వేసి క్రొత్తప్రతిమను తెచ్చిపెట్టారు. అప్పుడు ఆ దేవత స్థానములో

క్రొత్త దేవతయుండిపోగా పూజలన్నీ ఆ దేవతకే జరిగెడివి. పాతదేవతకు జిల్లాలో నేనే పెద్ద దేవున్ని అను గర్వము పూర్తి అణిగిపోయినది. కష్టాలలోనే ఎవరికయినా దేవుడు మతికి వస్తాడు అన్నట్లు అప్పుడు ఆ దేవతకు దేవుడు జ్ఞాపకము వచ్చాడు. అయితే ఏమి ప్రయోజనము? అప్పటికే దేవునికి ఎంతో దూరమైపోయాడు. ఈ విధముగా ఏ దేవతయైనా అతనూ జీవుడే అగుట వలన భూతముల, గ్రహముల పాలనలోనుండి తప్పించుకో లేడు. మనిషియైనా, జిన్నాతు (దేవత) అయినా దేవుడు సృష్టించగా వచ్చిన వారేనని మరువకూడదు.

ప్రతి దినము మనుషులు చనిపోతున్నారు. అలాగే ప్రతి దినము దేవతలు చనిపోతున్నారు. చనిపోయిన మనుషులుగానీ, దేవతలుగానీ ఏదో ఒక గొప్పస్థితిలో యుండే చనిపోయి ఉందురు. ఒకడు మంత్రి పదవిలోవుండి చనిపోయాడు అనుకొనుము. మరొకడు పెద్ద హోదాగలిగిన ఉద్యోగిగా చనిపోయాడనుకొనుము. అలాగే ఏ దేవత ఎంతగొప్ప స్థితిలో ఉండి చనిపోయినా అవన్నియూ వారు బ్రతికియున్నంతవరకే. శరీరము పోతూనే అన్ని హోదాలు వానిని వదలిపోతాయి. చనిపోయిన వెంటనే వాడు తిరిగి క్రొత్త జన్మను పొందవలసిందే. అయితే జనన సిద్ధాంతరీత్యా పుట్టువాడు ఎవడయినా తల్లిగర్భమునుండి పుట్టిన శరీరములో చేరవలసిందే. అలా చేరినప్పుడు శరీరమునుండి బయట ధ్యాసలోనికి రావడము జరుగును. అది శరీరములోనికి చేరిన వెంటనే నిద్రనుండి మెలకువలోనికి వచ్చినట్లు శరీరమునుండి బయటి ధ్యాసలోనికి, బయట మెలకువలోనికి రావడము జరుగుతుంది. అప్పుడు కన్నులున్నా అవి చూడలేని స్థితిలో ఉండుట వలన వారిచూపు వాలిపోయి దేనినీ గ్రహించలేని స్థితిలో ఉండును. భూమినుండి మిడుతలు బయటికి రావడము జరుగుచుండును. అలాగే

తల్లిగర్భమునుండి వచ్చిన క్రొత్త శరీరములో ప్రవేశించిన జీవుడు, మిడుతల దండు భూమినుండి వచ్చి దేనిదారిన అది పోయినట్లు క్రొత్త శరీరములో నుండి బయట ధ్యాసలోనికి వచ్చిన జీవుడు, వాని కర్మప్రకారము జీవించుటకు మొదలుపెట్టును. వెనుకటి జన్మలో మంత్రి అయినా ఈ జన్మలో అది ఏమీ పనికిరాదు. మిడుత బయటికివచ్చి ఎటో ఎగిరిపోయినట్లు క్రొత్తగా వచ్చినవాని జీవితము కూడా గమ్యము తెలియని దారిలాగా వుండును. వెనుకజన్మలో ఎంతపెద్ద దేవునిగాయున్న జీవుడయినా, క్రొత్తగా జీవితము ప్రారంభించవలసిందే. అందరికీ పెద్దయనుకొన్నవాడు, అందరికీ చిన్నగాయుంటూ జీవితము ప్రారంభించాలి. ఇదే విషయమునే ఖుర్ఆన్ గ్రంథములో చెప్పుచూ సూరా 54, ఆయత్ 7లో ఈ విధముగా వ్రాశారు. **(54-7) "వారు కళ్ళు వంచుకొని తమ గోరీలనుండి లేచి చెల్లా చెదురైన మిడుతల దండువలె వస్తారు."** ఇక్కడ గోరీలంటే స్మశానములోనికి పోవలసిన పనిలేదు. అక్కడ ఎవరూ లేచి రారు. ప్రతి దినము కొన్ని లక్షలమంది చనిపోతున్నారు. కొన్ని లక్షల మంది పుట్టుచున్నారు. ఒక దినము నాలుగు లక్షలమంది పుట్టారనుకోండి మిడుతలదండువలె పుట్టినట్లేకదా! మిడుతల దండులోని అన్ని మిడుతలు ఒకే భూమిలో ఒకేచోట ఒకే రంధ్రమునుండి పుట్టవు. అవి భూమిలోనుంచి వాటికి అనుకూలమున్న చోటంతా బయటికి వచ్చుచుండును. అలాగే మనిషి కూడా ఒక్కొక్కరు ఒక్కొక్క తల్లిగర్భము నుంచి ఒకే శరీరములోనే పుట్టుచున్నారు. మిడుతలదండు పుట్టిన వెంటనే అన్నివైపులా ప్రయాణమును సాగించును. అలాగే మనిషి పుట్టిన తర్వాత ఎవరి కర్మకొద్దీ వారు నడుచుకోవలసియుంటుంది. మనిషి అయితే ఒకేచోట ఉంటాడు. జింకగా పుట్టితే వెంటనే లేచి నడచిపోవలసియుంటుంది.

మిడతగా పుట్టినా వెంటనే ఎగిరిపోవలసియుంటుంది. ఈ విధముగా ఒక్కొక్కరి జీవితము ఒక్కొక్క విధముగా ప్రారంభమగును.

ఒక మనిషి ఒక ఇంటిలో చనిపోతే ఆ ఇంటిలో మరొక జీవున్ని తెచ్చి పుట్టించువాడు దేవుడే. నిన్ను మనిషిగా చంపి నీవు తెలియని క్రొత్త జంతువు రూపములో దేవుడు పుట్టించగలడు. గతజన్మలో ఎంత పెద్ద దేవతగాయున్న జీవుడుగానీ, అతడు ఆ స్థానమును వదలిపోయి, తాను ఎన్నడూ చూడని క్రొత్తరకమైన జంతువుగా అయినా పుట్టవలసిందే. ఆ విధముగా దేవుడే నిన్ను నడుపగలడు. ఉదాహరణకు తిరుత్తణీ సుబ్రమణ్యేశ్వర స్వామి అయినా సరే, తిరుపతి వెంకటేశ్వరుడైనా సరే ఆ ప్రతిమలో ఎంతకాలము బ్రతికినా, అక్కడున్న ఆయుష్షు ప్రకారము బ్రతుకవలసిందే. తిరుపతిలో 50 సంవత్సరముల క్రిందట ఉన్న వెంకటేశ్వర స్వామి ఇప్పుడు లేడు. ఆయుష్షు అయిపోయిన దానివలన దాదాపు 50 సంవత్సరముల క్రితమే ఆయన ఆ ప్రతిమ శరీరమును వదలిపోవలసి వచ్చినది. ఆయన పోయిన వెంటనే వేరొక జీవుడు అందులో ప్రవేశించడము జరిగినది. గతములో 50 సంవత్సరముల క్రిందటయున్న వెంకటేశ్వరస్వామి అనబడు జీవుడు కర్మప్రకారము ఆయన ఆ వెంకటేశ్వర ప్రతిమ శరీరములో బ్రతికాడు. ఎంతో వైభవమును అనుభవించాడు. తర్వాత వచ్చినాయన కర్మప్రకారము ఆ శరీరములో ఉండవలసియుండును. పూర్వమున్న వెంకటేశ్వరునికీ, నేడున్న వెంకటేశ్వరునికి గుణగణాలలో ఎంతో తేడాయున్నా అది మనుషులు గుర్తించలేకున్నారు. అంతా ఒకే వెంకటేశ్వరుడు అను భావమే అందరిలో యున్నది. వాస్తవముగా చూడగలిగితే ముందున్న పాత జీవునికి ఆశాగుణము ఎక్కువగాయుండేది. భక్తుల దగ్గరనుండి రావలసిన ముడుపు ఒక్క పైసా తక్కువయినా ఆనాడు ఒప్పుకొనేవాడు

కాదు, వారిని పీడించి తిరిగి తనడబ్బు వచ్చేంత వరకు వదిలేవాడు కాదు. అందువలన ఆ దినములలో ఒక్కపైసాకు కూడా వడ్డీవేసి ఇచ్చేవారు. అందువలన ఆ దినము ఆయన మనస్తత్వమును గ్రహించినవారు ఆయనను వడ్డికాసుల వాడు అని అనెడివారు. ఎంతో ఆశగల ఆ జీవుడు ప్రతిమ శరీరమును వదలి చనిపోగా, ఆ స్థానములోనికి మరొకరు వచ్చి చేరారు. ప్రస్తుతము ఇప్పుడున్న వెంకటేశ్వరుడు ఆశకు అతీతముగా ఉన్నాడు. ముందున్న వెంకటేశ్వరునికంటే ఇప్పుడున్న ఆయన ఎంతో ఉత్తముడని చెప్పవచ్చును. ఎంతో గొప్ప దేవునిగా పేరున్న తిరుమలేశ్వరున్ని కూడా మరణించునట్లు చేసి ఆయన స్థానములో మరొకరిని దేవుడే జీవింప జేశాడు. వెంకటేశ్వరుడు దేవుడు కాదా అంటే దేవుడే, అయినా ఈయన చచ్చిపుట్టే జీవుడుయని జ్ఞాపకముంచుకోవలెను. గొప్ప దేవుడని పేరుగాంచిన వాడిని కూడా మృతి చెందునట్లు చేసి, ఆయనను ఆయన ఎప్పుడూ చూడని స్థలములో, ఎప్పుడూ లేని స్థితిలో పుట్టించువాడు నిజమైన దేవుడు. నిజమైన దేవునికి పేరు ఉండదు. జీవునికి పేరుండును. జీవుడు మనిషిగా అయినా ఉండవచ్చును లేక దేవతగా, దేవునిగా అయినా ఉండవచ్చును. ఎలా ఉండినా చావు తప్పదు, పుట్టుక తప్పదు. దేవుని పాలకుల చేతిలో తిప్పలు పడక తప్పదు. అందరికీ ఆపదమ్రొక్కులవాడయినా, తన ఆపదను మాత్రము తప్పించుకోలేడు. వాస్తవానికి అందరి ఆపదలను తప్పించు క్షమాశీలి అసలయిన దేవుడు ఒక్కడేయని చెప్పవచ్చును. ఈ విషయమును ఖుర్ఆన్ గ్రంథములో ప్రస్తావించుతూ సూరా 56, ఆయత్ 61 లో ఈ విధముగా చెప్పారు. **(56-61) "మీ స్థానములో మీవంటి వారిని తీసుకవచ్చి మీరు ఎరుగని అవస్థలో మిమ్మల్ని లేపేశక్తి మాకుంది."** ఎంత పెద్ద స్థానములోయున్న వారినయినా మరణములో వారి స్థితిని మార్చువాడు దేవుడే. అలాగే జన్మతో వారిని అధోగతిపాలు చేయువాడు

కూడా దేవుడేయని తెలియాలి. ఒకవేళ పెద్ద హోదాలోయున్నప్పుడు కూడా తాను ఒక జీవున్నేనను జ్ఞప్తి కలిగి, అందరికీ అధికారియైన దేవుడు ఒకడున్నాడని తెలిసి బ్రతికినవాడు తర్వాత జన్మలో కూడా మంచి జన్మకు పోవునట్లు దేవుడే చేయును.

ఖుర్ఆన్ గ్రంథములో మొత్తము 114 సూరాలు ఉన్నాయి. 114 సూరాలలో మొత్తము ఆయత్‌లు 6236 గలవు. **వాటిలో 112వ సూరా నాకు అత్యంత సన్నిహితమైనది. అత్యంత ఇష్టమయినది.** ఆ సూరాలో కేవలము నాలుగు ఆయత్‌లు మాత్రమే గలవు. ఆ నాలుగు ఆయత్‌లు నా దృష్ఠిలో ప్రత్యేకమయినవి. అరబ్బీ భాషలో ఆ సూరా పేరు “అల్ ఇఖ్లాస్” తెలుగులో దాని అర్థము ‘ప్రత్యేకించుకోవడము’ అని ఆ భాషాపండితులే వ్రాశారు. ఏది ఏమయినా నా లెక్కలో కూడా ఈ 112వ సూరా ప్రత్యేకమయి నదే. ఇందులో దేవునికి సంబంధించిన ధర్మములు గలవు. మనందరికీ అర్థమయ్యే భాషలో చెప్పాలంటే దేవుని సమాచారమంతా ఈ నాలుగు ఆయత్ (వాక్యము)లలో కలదు. దేవుని ముఖ్య ధర్మము అని ఒక ధర్మమును మేము అప్పుడప్పుడు చెప్పుచూ దానిని అతిక్రమించకుండా వ్రాతగానీ, బోధగానీ ఉండునట్లు చూచుకొనెడి వారము. అది నేను భగవద్గీతలో నేర్చుకొన్న లేక తెలుసుకొన్న ఏకైక ధర్మము. **“రూప,నామ,క్రియలు లేనివాడు దేవుడు”** అన్నదే దేవుని ఏకైక ధర్మముగా చెప్పుచుందుము. ఈ ధర్మమును అనుసంధానము చేసి అంతిమ దైవగ్రంథము ఖుర్ఆన్‌లో నాలుగు వాక్యములను చెప్పడమైనది. ఆ నాలుగు వాక్యములు సూరా 112, ఆయత్ 1,2,3,4లలో ఇలా కలవు చూడండి. **(1) ఆయన ఒక్కడే దేవుడు. (2) దేవుడు ఏ అక్కరా లేనివాడు. (3) దేవునికి సంతానము లేదు. ఆయన ఎవరి సంతానము కాదు. (4) దేవునికి సమానము ఏదీలేదు.**

ఈ నాలుగు వాక్యములు దేవుని ధర్మమునకు లోబడి దేవుని సమాచారమును తెల్పినవి. అందులో మొదటిది ఆయన ఒక్కడే దేవుడు అని కలదు. ఇందులో నిగూఢముగాగానీ, నిదర్శనముగాగానీ ఏమీ చెప్పలేదు. ఉన్నది ఉన్నట్లు చెప్పడము జరిగినది. ప్రపంచమునకంతటికీ అధిపతి ఒక్కడే. ఆయనను మించినవాడుగానీ, ఆయనకు సమానమైనవాడు గానీ, ఆయనకు దాదాపు దగ్గర పోలికలున్న వాడుగానీ ఎవడూ లేడు. విశ్వమునకంతటికీ ఒకడే దేవుడు. ఆయననే ఈశ్వరుడనీ, పురుషోత్తము డనీ, పరమాత్మయనీ అంటున్నాము. ఒంటరిగానున్న దేవుడు తాను దేవుడనని తెలియుటకు ఇతరులను సృష్ఠించాడు. ఆ సృష్ఠిని సృష్ఠించుటకు కూడా ముందే సృష్ఠిని నిర్మించు ప్రకృతిని తననుండే తయారు చేసుకొని, తాను ఏమీ చేయక, ప్రకృతిచేత సర్వమునూ సృష్ఠింపజేశాడు. దేవుడు దేనినీ సృష్ఠించలేదు. దేవుడు అనుకొన్న దానిని ప్రకృతియే సృష్ఠించినది. ప్రకృతియే సృష్ఠిని తయారు చేసిన తర్వాత ప్రకృతియే దేవున్ని గురించి తాను సృష్ఠించిన సమస్త జీవరాశులందరికీ తెలియజేసినది. ప్రకృతిచేత పుట్టింపబడినవారు మనుషులు, జంతువులు, వృక్షములు, తీగలు, క్రిమి కీటకములు. మనుషుల జాతిలోనే కనిపించని జిన్నులు (దేవతలు) ను సృష్ఠించినది. వారిని అందరిని కాచుకొని ఎక్కడా అన్యాయము జరుగకుండా పాలించుటకు ప్రకృతియే భూతములను, గ్రహములను తయారు చేసినది. పాలనకు సంబంధించిన వారంతా దేవున్ని, దేవుని జ్ఞానము తెలిసిన భక్తులుకాగా, మనుష జాతిలోని మనుషులు, జిన్నులుగానీ, వృక్షజాతిలోని ఏ వృక్షముగానీ, పక్షిజాతిలోని ఏ పక్షిగానీ, క్రిమికీటక జాతిలోని ఏ కీటకము గానీ, సముద్ర జలములోని ఏ చేపగానీ అన్నీ ప్రకృతి చేత పుట్టింపబడి ప్రకృతి చేతిలో కట్టివేయబడియున్నవి. ఏదీ స్వతంత్రముగా లేదు. జైల్లో

పడిన ఖైదీ దేశానికి ప్రెసిడెంట్ అని చెప్పుకోగలడా, అలాగే ప్రకృతిలో చిన్నవాడు ఎవడయినా నేను దేవున్ని అని అనగలడా? ఎప్పటికీ అనలేడు. అందువలన దేవుడు ఒక్కడేగానీ, ఆయన దరిదాపులకు పోవువాడు ఎవడూ లేడు. ఆయన విషయమును తెలిసినవారు కూడా లేరు. ఆయనను చూచినవారు అంతకూలేరు. ఇక ఆయనతో సమానులు ఎవరు ఉంటారు? మేము సమానులమని ఎవరు అంటారు?

ఇక రెండవ వాక్యము **'ఆయన ఏ అక్కరా లేనివాడు.'** దేవునికి ఏ అవసరమూ లేదు. అన్నీ ఆయనవే అయినప్పుడు ఆయనకు దేని అవసరమూ లేదు. ఆయన ఏమీ చేయనివాడుగాయున్నాడు, కావున ఆయనకు అవసరము వచ్చునది ఏదీలేదు. దేవుడు కదలక, ఏమి చేయక ఉండుట వలన ఏ అవసరము ఆయనకు లేదనియే చెప్పవచ్చును. ఆయనకు ఫలానాది అవసరమని చెప్పువాడు ఎవడూ లేడు. ఆయన ఏమీ చేయనప్పుడు ఆయనకు దేనితో అవసరముంటుంది? అందువలన ఆయన ఏ అక్కరా లేనివాడని చెప్పాము. ఇక మూడవ వాక్యములో ఆయనకు సంతానము లేదు అనియూ ఆయన ఎవరి సంతానము కాదు అని చెప్పారు. ఆ మాట ముమ్మాటికీ వాస్తవమే. ఎందుకనగా దేవుడు ఎవరినీ పుట్టించలేదు. అన్నిటినీ పుట్టించి నది ప్రకృతియే. అందువలన ఆయన ఎవరికీ తండ్రికాడు అని చెప్పవచ్చును. అయితే ఇక్కడ కొందరు ఒక ప్రశ్నను అడుగవచ్చును. అదేమనగా! "అందరినీ చేసినది ప్రకృతియన్నారు కదా! మొదట ఆ ప్రకృతిని దేవుడు పుట్టించాడు కదా! అప్పుడు దేవుడు ప్రకృతిని సృష్ఠించిన వాడయి నందున ప్రకృతికి తండ్రియనీ ప్రకృతి ఆయన సంతామని చెప్పవచ్చును కదా!"యని అడుగవచ్చును. దానికి మా జవాబు ఈ విధముగా గలదు. దేవుడు ప్రకృతిని సృష్ఠించలేదు. తనలోయున్న కొంత భాగమును బయటికి

తీసి ప్రకృతియని పేరుపెట్టడము జరిగినది. అలా వచ్చిన మొదటి భాగము స్త్రీతత్త్వముగల ప్రకృతిగా తయారయి అన్నిటినీ పుట్టించినది. దేవుడు దేనినీ పుట్టించలేదు. అందువలన ఆయనకు సంతానము లేదుయని చెప్పవచ్చును.

అయితే ఇదే మూడవ వాక్యములో మరియొక ప్రశ్నను అడుగ వచ్చును. ప్రకృతి ద్వారానే అన్ని జీవరాశులు తయారయినాయి అని చెప్పుచున్నారు కదా! భగవద్గీతలో గుణత్రయ విభాగయోగమున నేను నా ప్రకృతికి బీజదాతను. అందువలన నా బీజము వలననే సమస్త ప్రాణులు పుట్టుచున్నవి. ఏ ప్రాణి ఎక్కడ పుట్టినా, దానికి తండ్రి నేను, తల్లి ప్రకృతి యని చెప్పారు కదా! ఈ మాట ప్రకారము దేవునికి సంతానము ఉన్నట్లే కదా! స్వయముగా భగవద్గీతలో నేను తండ్రిని అని చెప్పాడు కదా! దీనికి మీరేంటారు? అని ప్రశ్నించవచ్చును. దానికి మా జవాబు ఈ విధముగా కలదు. భగవద్గీతలో ఆ మాట ఉన్నది వాస్తవమే. అయితే ఆ మాటను ఎవరు చెప్పారు? అని మీరు యోచించారా? జీవాత్మ, ఆత్మ, పరమాత్మ యను ముగ్గురు పురుషులలో పుట్టే ప్రాణులకు ఎవరు బీజదాతయని ఆలోచించకుండా నేరుగా దేవుడేయని చెప్పితే ఎలా? మేము **"త్రైత సిద్ధాంత భగవద్గీత"**ను వ్రాసినప్పుడు ఏ శ్లోకము ఎవరికి సంబంధించినదనీ, ఆ శ్లోకమును ప్రకృతికి చెప్పిందా? ఆత్మకు చెప్పిందా? జీవాత్మకు చెప్పిందా? లేక పరమాత్మకు చెప్పిందాయని గమనించమని చెప్పాము. దేవుడు ఏ పనిని చేయనివాడు అని చెప్పాము. ఖుర్ఆన్ గ్రంథములో కూడా దేవుడు సాక్షిగాయున్నాడు అని చెప్పారు. అయితే అన్ని పనులు చేయువాడు ఆత్మేనని చాలామార్లు చెప్పాము. గ్రంథములలో కూడా అదేయున్నది. సర్వ జీవరాశులకు బీజదాతగా ఆత్మయున్నదిగానీ, పరమాత్మలేదు. అయితే జరిగే పనులన్నిటినీ దేవుడే చేశాడనీ, చెప్పేమాటలన్నిటినీ దేవుడే చెప్పాడనీ

చెప్పుచుందుము. ఆ విధముగా చెప్పడము గౌరవార్థమేగానీ, యదార్థము కాదని ముందే చెప్పాము. వాస్తవానికి దేవుడు ఏమీ చేయనివాడు. అందువలన ఆయనకు సంతతి లేదు.

దేవుడు సృష్ఠికంటే ముందునుంచియున్నాడు. ఆయనకంటే ముందు ఎవరూ లేరు. అందువలన ఆయన ఎవరి సంతతీ కాదని గట్టిగా చెప్పు చున్నాము. అందరికంటే ముందునుంచియున్నవాడు, అందరికంటే పెద్దవాడు అయినప్పుడు ఆయనతో సమానముగా ఎవరుంటారు? ఆయనకు సమానులు ఎవరూ లేరనియే చెప్పాలి. దేవుడు అనంతుడు. ఆయనకు మొదలు ఎక్కడుందో, చివర ఎక్కడుందో ఎవరికీ తెలియదు. ఆయన అణువణువున వ్యాపించియున్నవాడు. ఆయన స్వరూపమును ఎవరూ చూడలేదు. ఆయన మాటను ఎవరూ వినలేదు. అటువంటప్పుడు ఆయనకు సమానులు ఎవరుండగలరు? అందువలన ఎవరూ లేరనియే చెప్పాలి. ఈ విధముగా **112వ సూరాలో నాలుగు ఆయత్‌ల సారాంశము గలదు. ఈ నాలుగు ఆయత్‌లు దేవుడు రూప, నామ, క్రియారహితుడు అను ధర్మమునకు ప్రతి రూపముగాయున్నవి.** అందువలన ఈ నాలుగు ఆయత్‌ల 112వ సూరా నాకిష్టమైనదని చెప్పాము.

ఈ ప్రశ్నలను అడిగినట్లే చాలామంది ముస్లీమ్‌లు, కొందరు హిందువులు ఒక ముఖ్యమైన ప్రశ్న అడిగారు అదేమనగా! ముహమ్మద్ ప్రవక్తగారి పేరు చెప్పినప్పుడుగానీ, వ్రాసినప్పుడుగానీ ఆయన పేరు ప్రక్కన బ్రాకెట్‌లో (సం) అని వ్రాసియుందురు కదా! మీరు మాత్రము ప్రవక్తగారి పేరు ఎక్కడ వ్రాసినా (సం) అను మాటను వ్రాయలేదు. అలా వ్రాయకపోతే ప్రవక్తగారిని కించపరచినట్లగును కదా! అలా వ్రాయకపోతే ముస్లీమ్‌లు

బాధపడుతారు కదా! అటువంటప్పుడు ఆ మాటను మీరు ఎందుకు వ్రాయలేదు? అని ప్రశించవచ్చును. దానికి మా జవాబు ఈ విధముగా కలదు. (సం) అనుమాట సంక్షిప్తముగా (పొట్టిగా) వ్రాసినది మాత్రమే. వాస్తవముగా దాని పూర్తి పదము "సల్లల్లాహు అలైహి వ సల్లం" అనుమాటను మాటిమాటికి పొడవుగా వ్రాయుటకు ఇబ్బందిగాయుండును కనుక పొట్టి అక్షరముగా (సం) అని ప్రవక్త పేరు ప్రక్కన వ్రాయడము జరుగుచుండుట వాస్తవమే. ఆ పదమును ప్రవక్తగారి మీద అభిమానము, గౌరవముతోనే వ్రాయుచుందురు. అలా వ్రాయకపోతే ఏదో లోపము జరిగినట్లు, ప్రవక్తగారికి గౌరవము ఇవ్వనట్లు కొందరు భావించుచుందురు. ఇదంతయూ కొందరు చేస్తూయుంటే దానిని చూచి చేసేవారే తప్ప, పూర్తి అర్థము తెలిసి చేసేవారు తక్కువయని చెప్పవచ్చును.

"సల్లల్లాహు అలైహి వ సల్లం" అనుమాటకు అరబ్బీ భాషలో "ఆయనపై అల్లాహ్ శాంతి కారుణ్యాలను కురిపించుగాక"యని అర్థము. అర్థము తెలియనప్పుడు ఆ మాటను వ్రాయలేదే అను బాధపడువారు అర్థము తెలిసిన తర్వాత ఆ మాటను వ్రాసినందుకు బాధపడక తప్పదు. ఎందుకనగా! మా లెక్కలో ప్రవక్తగారు ఎంతో గొప్పవారు. అందుకు నిదర్శనము భూమిమీదయున్న మనుషులందరిలో తన జ్ఞానమును తెలుపుటకు దేవుడు ప్రవక్తగారిని ఎన్నుకున్నాడు. దేవుడు ఎన్నుకొన్న మనిషి ఎంతో గొప్పవాడైయుండునని ఎవరయినా ఒప్పుకోక తప్పదు. అటువంటప్పుడు జ్ఞానము తెలియని మనుషులంతా ఆయనకంటే తక్కువవారనియేగా అర్థము. ఆయన గొప్పతనములో మనము ఎంతో చిన్నవారము. గొప్పవారు చిన్నవారిని దీవించుట న్యాయమగును. అట్లుకాక చిన్నవారు పెద్దవారిని దీవించుట అన్యాయమగును. దేవుడు మనుషులను

దీవించవచ్చునుగానీ, మనుషులు దేవున్ని దీవించుతాము అంటే అది పూర్తి తప్పగును. మీ నాన్న నిన్ను దీవించవచ్చునుగానీ, మీ నాన్నను నీవు దీవించితే మీ నాన్నను నీవు అగౌరవపరచినట్లేయగును. మీ నాన్న గొప్పతనమునకు విలువను ఇవ్వనట్లేయగును. అందువలన పెద్దలు చిన్నలను దీవించవచ్చునుగానీ, చిన్నలు పెద్దలను దీవించకూడదు.

పెద్దలు చిన్నలను దీవించితే అది వారి గొప్పతనముచేత అది దీవెన అవుతుంది. అలాకాకుండా గొప్పతనమున్న వానిని గొప్పతనము లేనివాడు దీవించితే అది పెద్దలను అగౌరవపరచినట్లేయగును. ప్రవక్తగారు మనుషులతో పోల్చుకొంటే ఎంతో గొప్పవారు. అంత గొప్పవానిని గొప్ప వానిగానే గౌరవించాలి. జిల్లాకలెక్టర్ ఒక రైతుకు పన్నును మాఫీ చేయవచ్చునుగానీ, రైతు కలెక్టర్‌గారికి పన్నురాయితీ చేస్తానంటే ఎలా ఉంటుంది. కలెక్టర్‌నే మాటలతో అవమానపరచినట్లగును. అందువలన జ్ఞానములో గొప్పవాడు, దేవునిచేత ప్రవక్తగా ఎన్నుకోబడినవాడు అయిన ప్రవక్త దీవెనలు మనమీద ఉండునట్లు చేసుకోవాలిగానీ, మనము ఆయనను దీవించి అగౌరవపరచకూడదు. ఏమీ తెలియనివాడు ఎట్లు చెప్పినా ఫరవాలేదు. "సల్లల్లాహు అలైహి వ సల్లం" అనుమాటకు అర్థము తెలిసి ఆ మాటను ప్రవక్త ఎడల చెప్పుటకు మాకు మనస్సు ఒప్పలేదు. అట్లు చెప్పితే నేను నేరము చేసినవానిగా పరిగణించబడుతానేమోయనీ, అటువంటి నేరమునకు పాల్పడకూడదనీ తలచి, మేము ప్రవక్తగారి పేరు ప్రక్కన నీకు శాంతి కలుగుగాకయని చెప్పలేదు. మనకే శాంతిలేదు, మనము ఆయనకు శాంతినిచ్చువారమా? అలా అనడము తప్పగునని మేము ఆ మాటను చెప్పలేదు. చెప్పేవారిని నేను వద్దని కూడా చెప్పను. అది మీ ఇష్టాయిష్టము మీద ఆధారపడియుంటుంది.

ఖుర్ఆన్ గ్రంథములో సూరా 5, ఆయత్ 32లో ఈ విధముగా చెప్పారు. **(5-32) "ఎవడయినా ఒకరి హత్యకు ప్రతీకారంగా కాకుండా, భూమిలో కల్లోలాన్ని రేకెత్తించినందుకు కాకుండా, అకారణముగా ఎవరినయినా చంపినట్లయితే అతడు సమస్త మానవులనూ చంపినవాడవుతాడు. అలాగే ఎవడయినా ఒకరి ప్రాణాన్ని రక్షిస్తే అతడు సమస్త మానవుల ప్రాణములను రక్షించిన వాడవుతాడు. వారివద్దకు మా ప్రవక్తలు ఎందరో స్పష్టమైన నిదర్శనాలను తీసుకవచ్చారు. కానీ ఆ తరువాత కూడా వారిలో చాలామంది అవనిలో దుర్మార్గము దౌర్జన్యాలకు పాల్పడే వారున్నారు."** దేవుని మాటను లెక్కచేయక కొందరూ, దేవుని మాట అర్థముకాక కొందరూ, జీహాద్ అంటే తమ మతములోనికి రానివారినీ, అల్లాహ్‌ను దేవుడనీ, ముహమ్మద్‌ని ప్రవక్తయనీ ఒప్పుకోనివారిని చంపవలెననీ, దేవుడు చంపమని చెప్పాడని అనుకొని తాము దేవుని పని చేసినట్లు పొంగిపోతూ ఇతరులను చంపుచున్నారు. వారు ఆ విధముగా దేవుడు తమకు ఆదేశమిచ్చాడని అనుకొనినా మనుషులను చంపడము వలన వచ్చు పాపము రాకమానదు. అలా వచ్చిన పాపమును తప్పక వారే మోయవలసి వస్తుంది. అలా వచ్చిన పాపమును కర్మ అంటాము. కర్మలో పాపమేకాక పుణ్యము కూడా ఉంటుంది.

ఒక కార్యము చేస్తే కనిపించే ఫలితము, కనిపించని ఫలితము అని రెండు ఫలితములు వస్తాయి. కనిపించే ఫలితము ధనము, ధాన్యము లేక బంగారు ఏదయినా కావచ్చును. ఇక కనిపించని ఫలితము మాత్రము పాపముగానీ, పుణ్యముగానీయుండును. ఏ పనిని మనిషి చేసినా, ఆ పనిలో వచ్చు ఫలితము శరీరములో తలయందుగల కర్మచక్రములో నమోదు

చేయబడుచున్నది. నమోదు కాబడిన స్థలము కర్మచక్రమే అయినా, అది ఏమిటి? ఎట్లున్నదని ఎవరికీ తెలియదు. తెలియని కర్మచక్రమును **"కర్మపత్రము"** అని చెప్పవచ్చును. ఇంకా కర్మ గ్రంథములో వ్రాయబడు చున్నదని కూడా చెప్పవచ్చును. మనిషి చేసిన పాపమునుగానీ, పుణ్యమును గానీ కర్మపత్రములో ఎవరు నమోదు చేయుచున్నారు? లేక కర్మచక్రములోనికి ఎవరు చేర్చుచున్నారు? అని అడిగిన దానికి జవాబు ఈ విధముగా కలదు. శరీరములో జీవాత్మతో పాటు ఆత్మయనునది బ్రహ్మనాడినుండి నరముల ద్వారా శరీరమంతా వ్యాపించియున్నది. శరీరములో ఎక్కడ ఏమి జరిగినా ఆత్మకు తెలియకుండా జరుగదు. అంతేకాక మనిషి చేయు పనులన్నీ శరీరములోని ఆత్మయే చేయుచున్నది. జీవాత్మ ఏమీ చేయడము లేదు. శరీరములో అన్ని కార్యములను చేయు ఆత్మయే మనిషి చేసిన పాప పుణ్యములను కర్మచక్రములోనికి చేర్చుచున్నది. కర్మ నిలువయుండు కర్మచక్రమునే కర్మపత్రము అని అనవచ్చును. జీహాద్‌యను కార్యము దైవమార్గములో అహింసాపద్ధతిలో చేయునదైతే ఫరవాలేదుగానీ, అది ప్రపంచ మార్గములో హింసాత్మకముగా చేయునదైతే తప్పక పాపము వచ్చును. వచ్చిన పాపము కర్మపత్రములో అనగా కర్మచక్రములో నమోదు చేయబడును. పాపపుణ్యమిశ్రమములయిన కర్మను గురించి ఖుర్‌ఆన్ గ్రంథములో అనేకచోట్ల చెప్పడమైనది. ఎక్కడ ఏమి చెప్పారో ఇప్పుడు చూస్తాము.

ఖుర్‌ఆన్‌లో సూరా 54, ఆయత్ 52, 53లలో ఇలా కలదు చూడండి. **(54-52,53) "వీళ్ళు చేసినదంతా కర్మపత్రాలలో నమోదయి వుంది." (53) అలాగే ప్రతి చిన్న పెద్ద విషయమూ వ్రాయబడివుంది."** అంతేకాక సూరా 2, ఆయత్ 134లో ఇలా కలదు. **(2-134) "అది**

**గతించిన ఒక సమూహము. వారు చేసుకొన్నది వారికి చెందుతుంది. మీరు చేసేది మీకు చెందుతుంది. వారి కర్మల గురించి మీరు ప్రశ్నించబడరు."** ఇంతేకాక సూరా 17, ఆయత్ 13లో ఇలా చెప్పారు. **(17-13) "మేము ప్రతి మనిషి యొక్క మంచి చెడులను అతని మెడలోనే వ్రేలాడదీశాము. ప్రళయ దినాన మేము అతని కర్మల పత్రాన్ని బయట పెడతాము. దాన్ని అతను తెరచిన పుస్తకములో చూచుకుంటాడు."** ఇంకా సూరా 18, ఆయత్ 49లో ఇలా కలదు. **(18-49) "కర్మల పత్రాలు వారి ముందు ఉంచబడుతాయి. నేరస్థులు ఆ పత్రాల్లో వ్రాయబడి వున్న దాన్ని చూసి భీతిల్లుచూ "అయ్యో మా దౌర్భాగ్యము ఇదేమి కర్మపత్రము? ఇది ఏ చిన్న విషయాన్నీ, ఏ పెద్ద విషయాన్నీ వదలకుండా నమోదు చేసిందే! అని వాపోవటము నీవు చూస్తావు. తాము చేసినదంతా తాము ప్రత్యక్షముగా చూచుకుంటారు. నీ ప్రభువు ఎవరికీ అన్యాయము చేయడు."** కర్మపత్రమును గురించి మరియొక చోట సూరా 41, ఆయత్ 46లో ఇలా కలదు చూడండి. **(41-46) "ఎవరయినా సత్కార్యము చేస్తే తనమేలుకోసమే చేసుకొంటాడు. మరెవరయినా దుష్కార్యానికి ఒడిగడితే దాని దుష్ఫలితము అతని మీదే పడుతుంది. నీ ప్రభువు మాత్రము తన దాసులకు అన్యాయము చేసేవాడు కాడు."**

ఖుర్ఆన్ గ్రంథములో కర్మను గురించి, కర్మప్రతమును గురించి వ్రాసిన విషయములను చూచిన తర్వాత ఎవరు చేసుకొన్న కర్మనుండి వారు తప్పించుకోలేరని అర్థమగుచున్నది. అంతేకాక ఒకరు చేసిన కర్మకు మరొకరు బాధ్యులుకాదనీ, ఎవరి కర్మ వారినే అంటుకొనుననీ తెలియు చున్నది. కర్మ అనునది పాపపుణ్యములని రెండు రకములుగాయున్నది.

పాపపుణ్యములు కర్మపత్రము అనబడు కర్మచక్రములో విడివిడిగా చేరు చున్నవి. కర్మచక్రము పన్నెండు భాగములుగాయుండగా అందులో మూడు భాగములయందు పాపము చేరగా, మూడు భాగములయందు పుణ్యము చేరుచున్నది. మిగతా ఆరు భాగములలో పాపపుణ్యములు మిశ్రమముగా చేరుచున్నవి. ఈ విషయమును తర్వాత క్రిందగల పటములో చూడవచ్చును.

కర్మచక్రములో 1,5,9 స్థానములయందు పుణ్యమూ, 3,7,11 స్థాములయందు పాపమూ నిలువయుండగా, మిగతా భాగములలో పాప పుణ్యములు రెండూ నమోదగుచున్నవి. ఇదంతయూ ఒక పద్ధతిగా జరుగు నట్లు దేవుడు ఏర్పాటు చేసియుంచాడు.

మనిషి పుట్టకముందే వానికర్మ తలలోని కర్మచక్రములో నమోదు చేయబడియుంది అని చెప్పుచూ సూరా 57, ఆయత్ 22లో ఇలా వ్రాయబడి యున్నది. **(57-22) "ఏ ఆపద అయినా సరే అది భూమిలో వచ్చేదయినా, స్వయముగా మీ ప్రాణాలపైకి వచ్చేదయినా మేము దానిని పుట్టించకముందే అదొక ప్రత్యేక గ్రంథములో వ్రాయబడి యున్నది. అలా చేయుటకు అల్లాహ్‌కు చాలా తేలిక."** మనిషి పుట్టిన తర్వాత గతజన్మలలో చేసుకొన్న పాపమును అనుభవించవలసి యున్నది. దానిప్రకారము ప్రపంచము బయటవచ్చే ఆపదగానీ, కష్టముగానీ, శరీరములోపల ప్రాణాల పైకివచ్చే రోగములుగానీ, అవి రాకముందే ప్రత్యేకమయిన గ్రంథమువలె యున్న కర్మచక్రములో వ్రాయబడియున్నవని పైనగల ఆయత్‌లో చెప్పారు. స్వయముగా ప్రాణాలపైకివచ్చేవి అనగా శరీరములో ఆరోగ్యమును పాడు చేయు రోగములని అర్థము. భూమిలో వచ్చేవి అనగా బయట ప్రపంచములో సంభవించు అనేక కష్టములు, బాధలని అర్థము. బయటవచ్చే కష్టాలుగానీ, లోపలవచ్చే రోగాలుగానీ




**కర్మచక్రము (కర్మపత్రము)**

అనగా బయట యమకింకరుల ద్వారా వచ్చే కష్టాలుగానీ, లోపల యముని (ఆత్మ) ద్వారా వచ్చే కష్టములుగానీ అవి రాకముందే కర్మచక్రములో వ్రాయబడి ఉన్నాయని పై వాక్యములో చెప్పారు. కర్మచక్రములో సమస్త విషయములకు సంబంధించిన విధి విధానమంతయూ లిఖించబడి యుండుట వలన కర్మచక్రమును గ్రంథముగా పోల్చి పై వాక్యములో చెప్పారు. కర్మచక్రము అను గ్రంథము పన్నెండు అధ్యాయములుగా యున్నదనీ, అందులో 3,7,11 అధ్యాయములలో పాపములు మాత్రము వ్రాయబడి

యున్నవనీ, అట్లే 1,5,9 అధ్యాయములలో పుణ్యములు లిఖించబడియున్న వనీ చెప్పారు. గ్రంథముగా చెప్పుచున్న కర్మచక్రము నాల్గుచక్రములలో క్రిందినుండి రెండవదనీ, పైనుండి మూడవదనీ చెప్పుకొన్నాము. అంతేకాక కర్మచక్రము పన్నెండు భాగములుగాయున్నట్లు చిత్రపటములో కూడా చూచాము. చిత్రపటములో విభజింపబడియున్న పన్నెండు భాగములలో 1,5,9 అను మూడు భాగములయందు పుణ్యమూ, 3,7,11 అను మూడు భాగములందు పాపమూ వ్రాయబడియుండగా, మిగతా 2,4,6,8,10,12 అను ఆరు భాగములయందు పాపపుణ్యములు మిశ్రమముగా వ్రాయబడి యున్నాయి. అదే విషయమునే కర్మచక్రములో చూపించాము.

మనిషి చేయుచున్న ప్రతి చిన్న కార్యము యొక్క ఫలితముగానీ, పెద్ద కార్యము యొక్క ఫలితముగానీ అది పాపముగానీ, పుణ్యముగానీ ప్రతీదీ నమోదు చేయబడియుండుట వలన 54వ సూరాలో 52, 53వ ఆయత్‌లలో అదే విషయమునే చెప్పారు. మనిషి చేసుకొన్న ప్రతి పనియొక్క ఫలితము తర్వాత జన్మలో జీవించు జీవితములో కష్టసుఖముల రూపములో అనుభవించవలసియున్నది. ఒక జన్మలో చేసుకొన్న కర్మ మరుజన్మకు కారణమగుచున్నది. రెండవ జన్మలో కష్టసుఖములను అనుభవించుచూ చేసుకొన్న కర్మ తర్వాత మూడవ జన్మకు కారణమగుచున్నది. ఈ విధముగా ఒక మనిషి జ్ఞానము తెలిసి కర్మనిర్మూలన చేసుకోనంతవరకూ జన్మల బంధములో చిక్కుకొనియుండును. ప్రతి జన్మలోనూ మనిషి కష్టసుఖములను అనుభవించుచున్నాడు. ప్రతి జన్మలో అనుభవించు సుఖములను స్వర్గ సుఖములుగా లేక స్వర్గముగా చెప్పవచ్చును. అలాగే ప్రతి జన్మలో అనుభవించు కష్టములను నరక బాధలుగా లేక నరకముగా చెప్పవచ్చును. ప్రతి జన్మలోనూ స్వర్గనరకములుగా మారుచున్న ఎవని కర్మను వాని

తలలోనే పెట్టి పంపడము వలన సూరా 17-13వ ఆయత్‌లో **'ప్రతి మనిషియొక్క మంచి చెడులను అతని మెడలోనే వ్రేలాడదీశాము'** అని కలదు. అంతేకాక ఎవడు మంచి పని చేసినా అది పుణ్యముగా మారి వానికి స్వర్గమును ఇచ్చుచున్నది. అలాగే ఎవడు చెడుపని చేసినా అది పాపముగా మారి తర్వాత జన్మలో వానికి నరకమును ఇచ్చుచున్నది. అందువలన ఎవడు మంచి పని చేస్తే అది వాని మంచికే ఉపయోగపడును. అలాగే ఎవడు చెడు పని చేస్తే అది వానికి చెడునే చేయును. అందువలన ఈ విషయమును సూరా 41-46వ ఆయత్‌లో చెప్పారు.

ఎవడు చేసుకొన్న పాపముగానీ, లేక పుణ్యముగానీ వాని కర్మ చక్రములో చేరునట్లు శరీరములోని ఆత్మయే చేయుచున్నది. శరీరములో జీవుడు నివసించుచుండగా, శరీరమునకు అధిపతిగా ఆత్మగలదు. శరీరములో జరుగు ప్రతి పనినీ ఆత్మే చేయుచున్నది. ఆత్మకు తెలియకుండా ఏ పనీ శరీరములో జరుగడము లేదు. అన్ని పనులూ అనగా చిన్నదానిని, పెద్దదానిని అన్నిటినీ ఆత్మయే చేయుచున్నది. పాపపు చెడుపనినిగానీ, పుణ్యపు మంచిపనినిగానీ ఆత్మే చేయుచున్నది. అందరికీ తెలియని రహస్యము ఏమనగా! జీవాత్మ శరీరములో పాపపుణ్యములను అనుభవించు చున్నదిగానీ, మంచి చెడుపనులను చేయలేదు. అయినా ప్రతి పనినీ జీవుడు నేను చేశాను అను భావముతోయుండుట వలన ఆ పనులలోని ఫలితములయిన పాపపుణ్యములను వాని తలలోనే వాని లెక్కలోనే ఆత్మ నమోదు చేయుచున్నది. శరీరము ఆత్మదే అయినా జీవాత్మ అందులో ఒక్కచోట నివాసముంటూ తాను చేయని పనులన్నిటినీ తానే చేసినట్లు అనుకోవడము వలన కార్యములోని కర్మ జీవునికే చెందుచున్నది. ఈ విషయము ఆత్మల వివరము తెలిసిన ఆధ్యాత్మికవేత్తలకు మాత్రమే తెలియును.

మనిషి చేసుకొన్న పాపము తర్వాత జన్మలో శిక్షరూపములో అనేక కష్టములుగా మనిషి అనుభవమునకు వచ్చినప్పుడు మనిషి ఆ బాధలను అనుభవించలేక దేవుడా! నన్ను రక్షించమని మ్రొక్కినా దేవుడు అతని పాపమును కొంత తగ్గించడముగానీ, అనుభవించే దానిలో కొంత విడుపు నివ్వడముగానీ జరుగదు. చేసుకొన్నది అంతా వాడే అనుభవించవలసి యున్నది. ఈ విషయమునే ఖుర్‌ఆన్ గ్రంథములో సూరా 2, ఆయత్ 162లో ఇలా వ్రాశారు. **(2-162) "అందులో వారు ఎల్లకాలము ఉంటారు. వారి శిక్షను తగ్గించడముగానీ, వారికి కొంత విడుపు నివ్వడముగానీ జరుగదు."** చాలామంది మనుషులు పాపము అను భయములేని వారై, ఇష్టమొచ్చినట్లు మాట్లాడడము, ఇష్టమొచ్చినట్లు చేయడము ఉన్నది. అలా మాట్లాడడము వలనగానీ, చేయడము వలనగానీ, అతనికి పాపము వచ్చుచున్నది. అలా వచ్చినప్పుడు ఎంత పాపము వచ్చినదని మనుషులకు తెలియదుగానీ, దానిని అనుభవించునప్పుడు, అనుభవించుటకు చేత కానప్పుడు, అనుభవించు ఓపికలేక బాధాకరమైన ఆ శిక్షను అనుభవించ లేననీ, దానినుండి తనను రక్షించమనీ మనిషి దేవున్ని ప్రార్థించును. అయితే దేవుడు అతని పాపమును తగ్గించడముగానీ, క్షమించడముగానీ చేయడు. అట్లే వాడు అనుభవించే అనుభవమును ఏమాత్రము తగ్గించడు. దేవుడు క్షమాశీలుడు, దయామయుడు అని ఒకచోట చెప్పినా, అటువంటి క్షమాపణ గానీ, అటువంటి దయగానీ దేవునినుండి రాదు.

ఆధ్యాత్మికమంతయూ శాస్త్రబద్ధమైయున్నది. ముందే నిర్ణయించ బడిన పద్ధతి ప్రకారమే అన్నీ జరుగుచుండును. దేవుడు క్షమించుట నిజమే

అయినా అది జరిగే విధానము ప్రకారమే జరగాలి. అడ్డదిడ్డముగా ఏదీ జరుగదు. ప్రతి పనీ ఒక లెక్కప్రకారమే జరుగును. అందువలన ఆధ్యాత్మిక మంతయూ ఒక విధమైన గణితముతో కూడుకొనియుండును. అటువంటి లెక్కాచారముతో కూడుకొన్న సూత్రములను ధర్మములు అంటాము. దేవుని జ్ఞానమంతయూ ధర్మములతో కూడుకొనియుండును. ధర్మము అనగా శాస్త్రబద్ధమైన సూత్రమని తెలియవలెను. ధర్మము ప్రకారము చేసుకొన్న పాపము అనుభవించక తప్పదు. అనుభవించకుండా తప్పించుకోవాలంటే దేవుడు దానిని క్షమించవలెను. అయితే దేవుడు ఒక సూత్రము ప్రకారము ఉన్నాడు. ఆ సూత్రమునే దేవునికి ముఖ్యమైన ధర్మముగా చెప్పుచున్నాము. దేవుడు తన ధర్మము ప్రకారము రూప, నామ, క్రియలు లేనివాడు. రూప, నామ,క్రియలు లేనివాడు దేవుడు అయినప్పుడు క్రియలేనివాడు అను సూత్రము ప్రకారము పనిచేయనివాడు అని అర్థమగుచున్నది. దాని ప్రకారము దేవుడు పనిచేయనివాడైతే మనిషి పాపమును క్షమించు పనిని చేయలేడు. వాస్తవానికి ఎవరి పాపమునుగానీ, ఎవరి పుణ్యమునుగానీ దేవుడు తొలగించడు. అట్లన్నప్పుడు క్షమాశీలుడు అని పేరెందుకు వచ్చినది? అని ఎవరయినా అడుగవచ్చును. దానికి మా జవాబు ఇలా కలదు. దేవుని జ్ఞానమును ఎవడు తెలుసుకొని ఆచరించునో, అప్పుడు వాని కర్మ వాడు అనుభవించకుండా జ్ఞానములో కాలిపోవును. దేవుని జ్ఞానము వలన కర్మపోవుచుండుట వలన దేవుడు వాని కర్మను క్షమించి నట్లయినది. అందువలన దేవునికి క్షమాశీలుడు అని పేరు వచ్చినదని చెప్పవచ్చును.

ఒకని కర్మచక్రములో వ్రాయబడిన కర్మను వాడు అనుభవించ వలసిందే. అయితే దేవుని జ్ఞానమును తెలుసుకొని ఆచరించడము వలన

దేవుని జ్ఞానములోయుండు దహనశక్తి వాని కర్మను లేకుండా కాల్చివేయు చున్నది. ఇదే విషయమునే భగవద్గీతయందు జ్ఞానయోగమున 36, 37 శ్లోకములయందు ఇలా వ్రాశారు చూడండి.

36వ శ్లో॥ అపిచేదసి పాపేభ్యః సర్వేభ్యః పాపకృత్తమః ।
సర్వం జ్ఞానప్లవేనైవ వృజినం సంతరిష్యసి ॥

37వ శ్లో॥ యథైధాంసి సమిద్ధోగ్నిః భస్మసాత్కురుతేర్జున! ।
జ్ఞానాగ్ని సర్వకర్మాణి భస్మసాత్కురుతే తథా ॥

**36వ భావము :-** "ఎంతోమంది పాపాత్ములలో నీవు ఎంతపెద్ద పాపాత్ముడ వైనాగానీ, కలుషిత నీటిని ఓడచే దాటినట్లు, పాపములనుండి జ్ఞానమను శక్తిచే బయటపడగలవు." అదెలాయనగా!

**37వ భావము :-** "అగ్నిలో ఎన్ని కట్టెలు వేసినా అవి అన్నియూ కాలిబూడిద యైనట్లు, జ్ఞానమను అగ్నిలో సర్వకర్మలు భస్మమై నశించిపోవును" ఇక్కడ దేవుని జ్ఞానము వలననే కర్మలు లేకుండా పోవునని తెలుపడమైనది. దేవుని జ్ఞానము వలన పాపములు లేకుండా పోవుట వలన, జ్ఞానము దేవుడు రెండూ ఒక్కటేయైనందువలన, దేవుడు జ్ఞానస్వరూపుడైనందున, పాపమును దేవుడే క్షమించినట్లు లెక్కించి దేవున్ని క్షమాశీలుడు, దయామయుడు అన్నారు. మనిషికున్న జ్ఞానమునుబట్టి దేవుడు క్షమాశీలుడు, దయామయుడు అగునుగానీ వాస్తవముగా దేవుడు పనిని చేయని క్రియారహితుడయినందున దేవుడు స్వయముగా క్షమించువాడు కాదు. మనిషి జ్ఞానవంతుడు కాకపోతే, దేవుడు కఠినముగా శిక్షించేవాడని చెప్పవచ్చును. ఇక్కడ కూడా దేవుడు పని చేయడు. అయినా దేవుని దూతలు పనిని చేసి శిక్షించుట వలన దేవున్ని శిక్షించేవాడు అని అన్నారు.

దేవుడు నామ, రూప, క్రియారహితుడు. దేవుని ప్రథమ ధర్మము ఇదే. దేవునికి పేరులేదు, రూపములేదు, పనియూలేదు. ఈ సూత్రమునకు భంగము కలుగకుండా చూచుకోవలసిన బాధ్యత ఆధ్యాత్మికవేత్తలదే. దేవుడు పని చేయకున్ననూ అనేక సందర్భములలో దేవుడు చేశాడు, దేవుడు చెప్పాడు అని చెప్పుచుందుము. అలా చెప్పుటకు కారణము కలదని ముందే చెప్పాను. దేవుడు పనిచేయని మాట వాస్తవమే అయినా, దేవుని గౌరవార్థము అలా చెప్పవలసివచ్చినదని ముందే చెప్పాను. దేవుని జ్ఞానము వలన పాపము క్షమించబడినా, దానిని దేవుడు క్షమించినట్లేనని చెప్పుచూ, దేవుడు క్షమాశీలుడు అనుటలో తప్పులేదు. అలా దేవుని గౌరవార్థము చెప్పువారు చెప్పినా ఫరవాలేదుగానీ వారు దేవుడు రూప, నామ, క్రియారహితుడు అన్నమాటను మరువకూడదు. అట్లే ఇక్కడ దేవుడు తప్ప పాపములను క్షమించువాడు ఎవడూ లేడని చెప్పుచున్నారు. దేవుడు పనిచేయడు అను విషయమును జ్ఞప్తిలో పెట్టుకొని ఆయన వెనుక జరుగు పనులను ఆయనే చేసినట్లు చెప్పినా తప్పులేదు. ఇక్కడ సూరా 3, ఆయత్ 135లో ఇలా వ్రాసియున్నారు చూడండి. **(3-135) "తమ ద్వారా ఏదైనా నీతి బాహ్యమైన పని జరిగిపోతే, లేదా తమ ఆత్మలకు వారు ఏదైనా అన్యాయం చేసుకొంటే, వెంటనే దేవున్ని తలచుకొని తమ పాపాల క్షమాపణకై వేడుకొంటారు. నిజానికి దేవుడు తప్ప పాపాలను క్షమించేవాడు ఎవడున్నాడు?"** మరియొకచోట సూరా 6, ఆయత్ 16లో ఇలా కలదు. **(6-16) " ఆ రోజు ఎవరిపై నుంచి శిక్ష తొలగించబడు తుందో ఆ వ్యక్తిని దేవుడు అపారముగా కరుణించినట్లే, అదే స్పష్టమైన విజయము."** 3-135వ వాక్యము చివరిలో నిజానికి దేవుడు తప్ప పాపాలను క్షమించేవాడు ఎవడున్నాడు? అని అన్నారు. ఆ మాటను

అలా చెప్పవలసిందే. దేవుడు ఏ పనీ చేయనివాడై ఎవనినీ క్షమించని వాడైనా, దేవున్ని గౌరవించువానిగా జిబ్రయేల్ కూడా అదే విధముగా చెప్పాడు. 6-16లో కొంత విశేషతకలదు. అదేమనగా! ఎవరిపై శిక్ష తొలగించ బడుతుందో అనియున్నది. దేవుడు కాకుండా జ్ఞానముచేత శిక్ష తొలగించబడి యుంటే అని అక్కడ అర్థము. అటువంటివాడు దేవుని కరుణకు పాత్రుడుయైనట్లేయని కలదు. అలా దేవునివద్ద కరుణకు పాత్రుడయిన వానిదే నిజమైన విజయము అన్నారు. దేవుడు ఏమీ చేయడు అన్నిటికీ సాక్షిగాయున్నాడు. ఆయనకు రూపమే లేదు. అయినా ఆయనను కరుణించేవాడు అన్నారు. అట్లే పుట్టించేవాడు అన్నారు. ఇంకా చంపేవాడు అన్నారు. అయితే ఏ పనినీ ఆయన చేయలేదు, అన్ని పనులనూ దేవుని సేవకులయిన దేవుని పాలకులే చేయుచున్నారు.

ఇక్కడ ఉదాహరణకు ఒక విషయమును చెప్పుకొందాము. దేవుడు పుట్టించిన మనుషులు అనేక కులములుగా, అనేక వంశములుగా తమను తాము చెప్పుకొంటున్నారు. ఒకడు బ్రాహ్మణ కులములో పుట్టినవాడు, మాదిగ కులములో పుట్టినవానిని కులము తక్కువవాడనీ, అంటరానివాడనీ హేళనగా మాట్లాడుచుండెను. దానిని గమనించిన దేవుడు బ్రాహ్మణుడు మరణించినపుడు తర్వాత జన్మ మాదిగ కులములో పుట్టునట్లు చేశాడు. అప్పుడు మాదిగ కులములో పుట్టిన బ్రాహ్మణుడు మరణములో తన జ్ఞప్తిని కోల్పోవుట వలన తాను గత జన్మలో బ్రాహ్మణున్ని అని మరచిపోయి రెండవ జన్మలో తనను మాదిగ కులస్థునిగా చెప్పుకొన్నాడు. అలాగే మాదిగ వానిని జన్మ అయిపోయిన వెంటనే రెండవజన్మ బ్రాహ్మణుల కులములో పుట్టునట్లు చేయుట వలన అతడు నేను బ్రాహ్మణున్నియని రెండవ జన్మలో చెప్పుకోవడము జరిగినది. దేవుడు అనుకొంటే ఈ విధముగా వంశములను,

కులములను మార్చి పుట్టించగలడు. ఇదే విషయమును సూరా 6, ఆయత్ 133లో ఇలా చెప్పాడు. **(6-133) "ఇంకా నీ ప్రభువు ఏ అక్కరా లేనివాడు, కనికరించేవాడు. ఆయన గనుక తలుచుకుంటే మీ అందరినీ తుదముట్టించి మిమ్మల్ని వేరొక వంశమునుండి పుట్టించినట్లే, మీ స్థానములో తాను కోరిన వారిని వసింపజేస్తాడు."** ఈ వాక్యములో ఇప్పుడు మీరున్న వంశములో కాకుండా మిమ్మల్ని వేరేవంశములో పుట్టిస్తాడని, అట్లే ఇప్పుడు మీరున్న వంశములో వేరేవారిని పుట్టిస్తాడని చెప్పారు కదా! ఈ వాక్యము మనుషులకు జన్మలున్నాయని నిరూపించుచున్నది. అంతేకాక ఒక వంశములోని వానిని మరొక వంశములోనూ, మరొక వంశములోని వానిని, ఇంకొక వంశములోనూ దేవుడు పుట్టిస్తాడని చెప్పారు. వాస్తవానికి మనుషులను చంపడము తిరిగి పుట్టించడము ప్రకృతిలోని దేవుని పాలకులే చేయుచున్నారు. దేవుడు మాత్రము ఏమీ చేయలేదు. అయినా ఆ కార్యములన్నిటినీ దేవుడే చేయునట్లు చెప్పుచున్నారు. వారు దేవుని విషయము తెలియక అలా చెప్పలేదు. దేవుని ధర్మములు పూర్తిగా తెలిసినవారే దేవుని గౌరవమునకు భంగము కలుగకుండునట్లు ఆ విధముగా చెప్పారు. అన్నిటికీ యజమాని అయిన వానినే అన్ని పనులలో ముందు చెప్పుకొన్నట్లు, దేవుడు చేయని పనులను దేవుడే చేసినట్లు చెప్పడములో తప్పులేదు, అది గౌరవార్థము చెప్పినదేయని తెలియవలెను. ఖుర్ఆన్ గ్రంథమును చెప్పినవాడు జిబ్రయేల్‌కాగా వినినవాడు ముహమ్మద్ ప్రవక్త. ప్రవక్తకంటే ముందే జిబ్రయేల్ దేవుని జ్ఞానమును తెలియగలిగి తర్వాత అదే జ్ఞానమును ప్రవక్తకు చెప్పాడు. జిబ్రయేల్‌కు దేవుని ధర్మము బాగా తెలుసు. దేవునికి రూప, నామ, క్రియలు లేవనీ అదే దేవుని ముఖ్యమైన ధర్మమనీ, ఆ ధర్మమును అతిక్రమించి

దేవున్ని పోల్చుకోకూడదనీ జిబ్రయేల్‌కు బాగా తెలుసు. అయితే దేవుని గౌరవార్థము దేవున్ని కర్తగా చేసి తప్పక చెప్పవలసి వచ్చినది.

మనిషి అనగా మనస్సుతో కూడినవాడు అని అర్థము. అలాగే జనులు అనగా జన్మలు కల్గినవారు అని అర్థము. అట్లే జన్మ అనగా జీవముతో కూడినది అని అర్థము. జీవితము అనగా చావువచ్చు వరకు జీవించబడునది అని అర్థము. ఈ విధముగా మనిషి కొన్ని నిర్వచనముల మధ్య బ్రతుకుచున్నాడు. ఒక జీవుడు శరీరమును ధరించి కొంతకాలము జీవించి తర్వాత మరణమును పొందుచున్నాడు. ఒక మనిషిని చూస్తే వాడు వేరు, వాని శరీరము వేరని తెలియుచున్నది. శరీరము పంచ భూతములైన ప్రకృతితో తయారయినది. కావున శరీరము ప్రకృతికి సంబంధించినదని చెప్పవచ్చును. జీవుడు ప్రకృతికి సంబంధించినవాడు కాడు. సృష్ఠి మొత్తము రెండు భాగములుగా ఉన్నది. ఒకటి ప్రకృతి రెండు పరమాత్మ. ఈ రెండు మినహా ప్రపంచములో ఏదీలేదు. జీవము గల జీవరాసులన్నీ ప్రకృతి పరమాత్మయను రెండు భాగములతో కూడియుండగా, ప్రాణములేనిది ఏదయినా ప్రకృతితో కూడుకొనియున్నదని చెప్పవచ్చును. ప్రకృతి ఐదు భాగములుగాయుండగా, పరమాత్మ మూడు భాగములుగాయున్నాడు. ప్రకృతి వరుసగా 1) ఆకాశము 2) గాలి 3) అగ్ని 4) నీరు 5) భూమి అని ఐదు భాగములుగాయున్నది. అలాగే పరమాత్మ వరుసగా 1) పరమాత్మ 2) ఆత్మ 3) జీవాత్మ అని మూడు భాగములుగాయున్నది. మనము మూడు ఆత్మల విషయములో జీవాత్మవైపు నుండి చెప్పుచుందుము. అందువలన జీవాత్మ, ఆత్మ, పరమాత్మయని పరమాత్మను మూడవ వానిగా జీవాత్మను మొదటివానిగా చెప్పడము జరుగు చున్నది. ఏది ఎట్లు చెప్పినా, దేవుడు మూడు విధముల విభజింపబడినా,

చివరికి పరమాత్మనే దేవునిగా అనుచున్నాము. జీవాత్మ, ఆత్మ రెండూ దేవుని అంశలే అయినా అవి రెండూ దేవుడు కావు. దేవుడు పరమాత్మగా ప్రత్యేకముగాయున్నాడు.

జీవుడు ఎక్కడయుంటే అక్కడ ఆత్మ, పరమాత్మలు ఉండును. జీవుడు లేక జీవాత్మ అయిన మనము ఆత్మతో మరియు పరమాత్మతో కలిసి ప్రకృతి సంబంధ శరీరమును ధరించుచున్నాము. ప్రకృతి స్త్రీ సంబంధమైనది, అలాగే పరమాత్మ పురుషుడు. పరమాత్మనుండి విభజింపబడిన జీవాత్మ, ఆత్మలు కూడా పురుషులే. ప్రకృతి స్త్రీ అయినప్పుడు ప్రకృతి భాగములైన ఆకాశము, గాలి, అగ్ని, నీరు, భూమి ఈ ఐదు స్త్రీతత్త్వముతో కూడుకొన్నవే నని తెలియాలి. సజీవమైన మనిషిలో శరీరము ప్రకృతి సంబంధమైనది కాగా, జీవుడు పురుష సంబంధమైనవాడు. స్త్రీతత్త్వ శరీరములో పురుష తత్త్వ జీవుడు చేరి కొంతకాలముండి శరీరమును వదలి బయటికి వచ్చు చున్నాడు. జీవుడు శరీరములో చేరినప్పుడు **జననము** అంటున్నాము. శరీరమును వదలినప్పుడు **మరణము** అంటున్నాము. ఈ విధానము ప్రతి మనిషికీ జరుగునదే కావున ఎవరు కూడా దీనిని కాదనలేరు. ఒక జీవుడు శరీరమును ధరించిన తర్వాత ఆ శరీరమును తప్పక వదలవలసి యున్నది. దానిని మరణము అంటామని తెలుసు కొన్నాము. అలా మరణించిన వాడు తప్పక తిరిగి జన్మించవలసి యున్నది. జన్మించిన వాడు తిరిగి ఎప్పుడో ఒకప్పుడు మరణించవలసి యున్నది. అందువలన **భగవద్గీతలో సాంఖ్యయోగమను అధ్యాయమున 27వ శ్లోకములో** "జాతస్య హి ధృవో మృత్యుః ధృవం జన్మ మృతస్యచ." అని కలదు. దీనిఅర్థము **"పుట్టినవాడు చావక తప్పదు, చచ్చినవాడు పుట్టక తప్పదు"** అని కలదు. మనిషి జీవితమునకు చావుపుట్టుకలు అనివార్య కార్యములని

ప్రథమ దైవ గ్రంథమైన భగవద్గీతలో చెప్పగా మిగతా రెండు గ్రంథములు అదే మాటను ధృవీకరించుచున్నవి.

ఒకమారు మనిషి చనిపోతే ఆ జన్మలోని జ్ఞాపకములన్నీ ఆ శరీరముతోనే పోవును. తర్వాత రెండవ జన్మను తీసుకొన్నవానికి తాను వెనుకటి జన్మలో ఎక్కడున్నది తెలియదు. అందువలన ఎవనికయినా ప్రస్తుతమున్న జన్మ తప్ప గతములో జీవించిన జన్మలు తెలియవు. శరీరములో జ్ఞాపకశక్తి కల్గినది మనస్సు. మనస్సు మననము చేయునది, అనగా జ్ఞాపకము చేయునదని అర్థము. మనస్సు శరీరములో ఒక భాగమే అయినందున అది స్త్రీతత్త్వమే. మరణములో పురుషుడైన జీవాత్మ స్త్రీ తత్త్వములయిన శరీరమునంతటిని వదలి పోవుచుండుట వలన జ్ఞాపకశక్తి గల మనస్సు కూడా పోవుచున్నది. తర్వాత రెండవ జన్మలో పాత జ్ఞాపకములు గల పాతమనస్సు లేకపోవుట చేత వెనుకటి జన్మల విషయములు మనిషి పూర్తిగా మరచిపోయి తనకు ఏమీ తెలియనట్లు ఉంటున్నాడు. ఇతరులు ఎవరయినా జ్ఞానము తెలిసినవారు పోయిన జన్మలో నీవు చేసుకొన్న పాపపుణ్యములను ఈ జన్మలో అనుభవిస్తున్నావు అని అంటే వెనుకటి జన్మల జ్ఞాపకము లేని మనిషి ఆ మాటను విచిత్రముగా వింటున్నాడు. అతను వెనుకటి జన్మను నమ్మలేకపోవు చున్నాడు. ప్రస్తుతమున్న జన్మమాత్రమే నిజమని దానికంటే ముందుగానీ, దానికంటే వెనుక గానీ జన్మలు లేవని అనుకొంటున్నాడు. అందువలన జన్మల గురించి జ్ఞానులయినవారు చెప్పితే నేను చనిపోయిన తర్వాత తిరిగి పుట్టుతానా! అని ఆశ్చర్యముగా అడుగుచున్నాడు. ఇదే విషయమునే ఖుర్ఆన్ గ్రంథములో సూరా 19, ఆయత్ 66, 67లలో ఇలా కలదు. **(19-66,67)**

**"ఏమిటి నేను చచ్చిన తర్వాత మళ్ళీ బ్రతికించి బయటికి**

**తీయబడతానా? అని మనిషి అంటున్నాడు." (67) "అంతకు ముందు అతనికంటూ ఒక అస్థిత్వము లేనప్పుడు మేము అతనిని సృష్టించామన్న సంగతి ఆ మనిషి మరచిపోయాడు."** ఆధ్యాత్మికము తెలిసినవారు మనిషియొక్క జన్మలను గురించి చెప్పితే మనిషి నమ్మలేక చెప్పేవాడు కూడా మనిషే కదా! నాకు తెలియని విషయము వానికెలా తెలుసు? అని అనుకొంటాడు. అంతేకాక చెప్పేవాడు అసత్యమును చెప్పుచున్నాడనీ, ఈ జీవితము తప్ప మరొక జన్మలేదని అనుకొంటాడు. చెప్పే వ్యక్తిని అసత్యవాదిగా లెక్కించుతాడు. ఇదే విషయమునే ఖుర్ఆన్ గ్రంథములో సూరా 23లో, 34,35,36,37,38 వాక్యములలో ఇలా కలదు చూడండి.

**(23-34,35,36,37,38) "మీరు గనుక మీలాంటి మనిషిని అనుసరించారంటే తప్పక నష్టపోతారు. (35) ఏమిటి, మీరు చచ్చిపోయి ఎముకలుగా, మట్టిగా మారిపోయిన తర్వాత కూడా మీరు మళ్ళీ లేపబడుతారని ఇతను వాగ్దానము చేస్తున్నాడా? (36) అసంభవము మీకు చేయబడే ఈ వాగ్దానము అసత్యము. (37) జీవితము అంటే అసలు ప్రాపంచిక జీవితమే. మనము ఇక్కడే బ్రతికి ఇక్కడే చస్తాము. మళ్ళీ రెండవమారు సజీవులుగా వచ్చేది ఉండదు. (38) ఇతనూ మనిషే అయినా కూడా దేవునికి అబద్ధములు అంటగట్టుచున్నాడు. మేము ఇతన్ని నమ్మేది లేదు."** అని అంటారు. ఇక్కడ ఈ వాక్యములలో రెండవ జీవితము ఉంది అని ఒక మనిషి చెప్పినట్లు చెప్పారు. దేవుడు చెప్పిన జ్ఞానము మనుషులకు చేరిన తర్వాత మనిషే బోధకుడుగా ఇతరులకు జ్ఞానమును చెప్పును. మనిషి చెప్పినంత మాత్రమున జ్ఞానమును తక్కువగా చూడకూడదు. మనిషి చెప్పినా, మనిషిచేత చెప్పబడే జ్ఞానము దేవుని జ్ఞానమే అయినందున, దానికి ప్రతి

ఒక్కరూ విలువ ఇవ్వవలసిందే. పైన చెప్పిన వాక్యములను పరిశీలించితే, అందులో దేవుడు అనేకమార్లు చెప్పినట్లే, మనిషి చనిపోతే రెండవ జీవితము ఉన్నదని చెప్పారు. ఆ మాటను తప్పుగా అర్థము చేసుకొన్నవారు, ఇది మనిషి చెప్పేమాట నమ్మవద్దండని అన్నారు. ఇక్కడ 35వ వాక్యములో మనిషి చనిపోయి ఎముకలుగా, మట్టిగా మారిన తర్వాత కూడా మళ్ళీ లేపబడుతామా? అన్న ప్రశ్నగలదు. దానికి మేము ఈ విధముగా జవాబును చెప్పుచున్నాము.

మనిషి చనిపోతే శరీరమువేరు, జీవుడువేరుగా విడిపోవును. జన్మించినప్పటినుండి జీవాత్మ, ఆత్మ శరీరములో ఉండడమును జీవితము అంటున్నాము. ఎప్పుడయితే శరీరములోయున్న జీవాత్మ, ఆత్మలు శరీరమును వదలి బయటికిపోవుచున్నవో, అప్పుడు మరణము వచ్చింది అంటాము. శరీరములో సత్తుగాయున్న ఆత్మ మరియు దానితోపాటు శరీరములోయున్న జీవాత్మ రెండూ బయటికి పోవడమును చావడము అంటాము. శరీరములోని సత్తు అనగా ఆత్మ బయటికిపోతే పూర్వము సత్తుపోయింది అనెడివారు. ఒక ఆవులోని ఆత్మ బయటకిపోతే అప్పుడు ఆవు సత్తుపోయింది అనెడివారు. కొంతకాలమునకు కాలక్రమేపీ మాట మారిపోయి ఆవు సత్తుపోయింది అని చెప్పడములో ఆవు చచ్చిపోయింది అని అనెడివారు. అదే విధముగానే మనిషి చచ్చిపోయాడు అని కూడా అనడము జరుగుచున్నది. చచ్చిపోయిందను మాటలో సత్తు పోయిందను సత్యము దాగియున్నది. సత్తు అనగా ఆత్మయనీ శరీరమునకు సత్తువను ఇచ్చునదనీ అర్థము. శరీరమునకు సత్తువగాయున్న ఆత్మను అనుసరించి జీవాత్మయుండును. ఆత్మ ఎక్కడ ఉండునో, జీవాత్మ అక్కడే ఉండును. ఆత్మ శరీరములోయుంటే ఆత్మయున్న శరీరములోనే జీవాత్మయుండును.

ఆత్మ, జీవాత్మ రెండూ జోడు ఆత్మలు. ఒకదానిని వదలి మరొకటి ఉండవు. జీవుడు ప్రపంచములోయున్నంత వరకూ ఆత్మను తోడు చేసుకొనే యుండును. జీవాత్మను వదలి ఆత్మగానీ, ఆత్మను వదలి జీవాత్మగానీ మనుగడ సాగించవు.

ప్రకృతిని పరమాత్మ తయారు చేశాడు. ప్రకృతిని పరమాత్మ (దేవుడు) ఎప్పుడు తయారుచేశాడో ఎవరికీ తెలియదు. ఎప్పుడు తయారయినది తెలిసినా, తెలియకపోయినా ప్రకృతి, పరమాత్మను వదలి ఎక్కడా లేదు. ఒక విధముగా అర్థము చేసుకొంటే ప్రకృతి భార్య, పరమాత్మ భర్తయని అనుకొనుము. పరమాత్మను వదలి ఒక్కక్షణము కూడా ప్రక్కన ఉండుటకు ప్రకృతి ఇష్టపడదు. ఆత్మ, జీవాత్మలు రెండూ ఒక శరీరములో కొంతకాలముండి శరీరము పాతదయినప్పుడు, తాము నివసించుటకు యోగ్యముగాలేనప్పుడు, ఆ శరీరమును వదలి మరొక శరీరమును ఆశ్రయించడము జరుగుచున్నది. పాత శరీరమును వదలినప్పుడు దానిని మరణము అంటున్నాము. అలాగే క్రొత్త శరీరమును ధరించినప్పుడు జననము అంటున్నాము. ఒక శరీరమును వదలినప్పుడు అది మరణమైతే తిరిగి అతడు ఎంతకాలమునకు క్రొత్త శరీరమును ధరించుచున్నాడను ప్రశ్న రాగలదు. దానికి జవాబును చెప్పుకొంటే ఈ విధముగా కలదు. ఒక మనిషి చనిపోయిన తర్వాత రెండవ శరీరములోనికిచేరి రెండవ జన్మ ఎత్తుటకు ఒక్క క్షణము కాలము కూడా పట్టదు అని చెప్పవచ్చును. మరణించిన శరీరము భారతదేశములోయున్నా, జననములో జీవుడు చేరవలసిన శరీరము అమెరికాలోయున్నా, జీవుడు మరియు ఆత్మ అక్కడికి చేరుటకు ఒక సెకనులో పదవవంతు కూడా పట్టదు. ఈ మాట గ్రుడ్డిగా చెప్పునది కాదు. సంపూర్ణముగా తెలిసి చెప్పుచున్నమాటయని తెలియవలెను.

సాధారణముగా ఒక మనిషి శ్వాసించునప్పుడు పైకి క్రిందికి ముక్కు రంధ్రములలో శ్వాస కదలుట అందరికీ తెలిసిన విషయమే. ముక్కు రంధ్రములనుండి బయటికి పోయిన శ్వాస తిరిగి పైకి చేరుటకు, అనగా తిరిగి ముక్కురంధ్రములలోనికి ప్రవేశించుటకు, ఎంత ఆలస్యమగుచున్నదో చనిపోయిన వాడు తిరిగి క్రొత్త శరీరమును చేరుటకు అంతే ఆలస్యమగునని చెప్పవచ్చును. చనిపోయిన శరీరములో బయటికి పోయిన శ్వాస పుట్టే శరీరములోనికి వెంటనే చేరిపోయి ముందు బ్రతికిన శరీరములో ఆడినట్లే ఆడుచున్నది. ముందు బ్రతికిన శరీరములో శ్వాస ఎంతవేగముతో పైకి క్రిందికి వస్తున్నదో, అలాగే చనిపోయిన శరీరములో క్రిందికి పోయిన శ్వాస పైకి అంతేవేగముతో ప్రవేశించుచున్నది. శరీరము మారడములో ఏమాత్రము ఆలస్యము జరుగడము లేదు. ఒక దేశములోని వాడు మరొక దేశములో పుట్టవలెనన్నా లేక ఒక గోళములోయున్నవాడు కొన్ని కోట్లమైళ్ళ దూరములోయున్న గోళము మీద పుట్టవలెనన్నా అందరికీ ఒకే సూత్రము. ఏమాత్రము ఆలస్యము ఉండదు.

జీవాత్మ, ఆత్మలు రెండూ ఒక శరీరమును వదలినప్పుడు, ఆ శరీరము మొదట ప్రకృతితో తయారయినదగుట వలన అది ప్రకృతిలోనే కలిసిపోవును. చనిపోయిన శరీరమును భూమిలో పూడ్చిపెట్టినప్పుడు అది కుళ్ళిపోయి మట్టిగా మారిపోవును. ఒక మనిషి చనిపోతే అతడు అనగా ఆ జీవుడు క్రొత్త శరీరమును అదే క్షణము పొంది జన్మించుచున్నాడు. చనిపోయినవాడు తిరిగిపుట్టుటకు ఒక సెకనుకాలము కూడా పట్టదు. అయితే ఆ జీవుడు వదలిన శరీరము పూర్తి కుళ్ళిపోవుటకు కనీసము ఆరు నెలలయినా పట్టును. ఎముకలు పూర్తిగా లేకుండా పోవుటకు కనీసము ఆరు సంవత్సరములైనా పట్టును. మృతదేహము కుళ్ళిపోవడము తప్ప,

తిరిగి గట్టిపడడముగానీ, తిరిగి క్రొత్తగా తయారవడముగానీ జరుగదు. అలా అవుతుంది అంటే ఆ మాట సైన్సుకే విరుద్ధము. ఆ మాటను భౌతికశాస్త్రము ఒప్పుకోదు. అంతేకాక దేవుడు కూడా ఆ మాటను ఏమాత్రము ఒప్పుకోడు. దేవుడు తన శాస్త్రములో పాతశరీరమే తిరిగి వస్తుందని ఎక్కడా చెప్పలేదు. పాత శరీరములాంటి శరీరమే వస్తుందని చెప్పాడు తప్ప పాతశరీరమే వస్తుందని చెప్పలేదు. కుళ్ళిపోయిన శరీరము మట్టిగా మారిపోవడము తప్ప వేరే గత్యంతరములేదు. నేడు ముస్లీమ్ సమాజములో సమాధులలో పూడ్చబడిన శరీరము అంతిమదినమున సజీవముగా లేపబడుననీ, అంతవరకు జీవుడు కూడా ఆ శరీరమువద్దనే గుంతలోనే ఉండుననీ అనుకోవడము జరుగుచున్నది. జీవుడు శరీరములో యున్నంత వరకే ఆ శరీరముతో సంబంధపడియున్నాడు. ఒక్కమారు శరీరమును వదలితే జీవునకు ఆ శరీరముతో ఎటువంటి సంబంధమూ యుండదు.

దేహము అంటే దేహి నివసించునదని అర్థము. దేహి అనగా ఆత్మ అని అర్థము. ఆత్మ ఒక్కటి ఎప్పుడూ ఉండదు. అది జీవాత్మ, ఆత్మయను జోడు ఆత్మలుగాయుండును. ఆత్మ శరీరమును ధరించుచున్నది. అదే జననము. జన్మించిన ఆత్మ, జీవాత్మలు రెండూ శరీరములో నివసిస్తున్నవి. వాటిలో ఏ మార్పుయుండదు. అయితే పుట్టిన శరీరములో మాత్రము మార్పు ఉండును. పుట్టినవాడు ఏ మతస్థుడయినా వాని శరీరములో బాల్యము, యవ్వనము, కౌమారము, వృద్ధాప్యము అను మార్పులు రావడము అందరము చూస్తూనేయున్నాము. ఈ విధముగా బాల్య,యవ్వన,కౌమార, వృద్ధాప్య దశలు శరీరమునకు రావడమేకాక ఆ శరీరము చివరకు చేతకానిదై చనిపోవడము కూడా జరుగుచున్నది. అలా

జరుగడము అనివార్య కార్యములని చెప్పవచ్చును. ఆ దశలను ఎవరూ ఆపలేరు. అయితే శరీరములోయున్న జీవునికి ఏ దశలుగానీ, ఏ మార్పులు గానీ ఉండవు. ఈ విషయమును గురించి ప్రథమ దైవగ్రంథమయిన భగవద్గీతలో సాంఖ్యయోగమున 13వ శ్లోకములో ఈ విధముగా చెప్పారు.

శ్లో॥ దేహినోఽస్మిన్ యథాదేహే కౌమారం, యౌవనం జరా।
తథా దేహాంతరప్రాప్తిః ధీరస్తత్ర న ముహ్యతి ॥

భావము :- **"దేహి ధరించిన దేహమునకు బాల్యము, యౌవనము, కౌమారము, వృద్ధాప్యము ఎట్లు కలుగుచున్నవో అట్లే మరణము కూడా కలుగుచున్నది. జ్ఞానముగలవాడు అట్టి దేహమును గూర్చి మోహమున పడడు"** అని చెప్పియున్నారు. దేహము విషయమేకాక జీవుని విషయమును గురించి కూడా భగవద్గీతయందే సాంఖ్యయోగములోనే 16వ శ్లోకమున ఈ విధముగా చెప్పుచున్నారు చూడండి.

శ్లో॥ నాసతో విద్యతే భావో నాభావో విద్యతే సతః ।
ఉభయోరపి దృష్టోంతః త్వనయోస్తత్వదర్శిభిః ॥

భావము :- **"సత్తు అయిన ఆత్మతో కలిసియున్న జీవునకు నాశనములేదు. అలాగే అసత్తగు దేహమునకు ఉనికి ఏమాత్రము లేదు. దేహియైన జీవాత్మకు నాశనములేదని దేహమునకు శాశ్వతము అను మాటే లేదు అను నిశ్చయ స్థితులను తత్త్వవిధులైన వారికి బాగా తెలుసు."** ఇక్కడ తత్త్వవిధులు అనగా ఆత్మల విషయమును తెలిసిన ఆధ్యాత్మికవేత్తలని అర్థము. దైవజ్ఞానము తెలిసినవాడు ఎవడయినా శరీరమునకు అడ్రసు (చిరునామా) యుండదని తెలిసియుండును. అందువలన మృతదేహము కుళ్ళి నాశనమై పోవడము

తప్ప మరొకమారు జీవుడు నివసించుటకు యోగ్యముగా ఉండదు. అట్లుండుననిగానీ చెడిపోయిన శరీరము లేక కుళ్ళి పోయిన శరీరము తిరిగి లేపబడును అనిగానీ, ఎవరయినా అంటే అది ఎంత వయస్సులో లేచును? అని ప్రశ్నించండి. దానికి ఏ గ్రంథములోనూ జవాబు లేదు. దేవుడు మూడు గ్రంథముల రూపములో తన జ్ఞానమును అందించాడు. అయినా మనిషి దానిని అర్థము చేసుకోలేకున్నాడు. భూమిమీద ముస్లీమ్‌లు దేవుని మీద ఎక్కువ విశ్వాసము కల్గియున్నా, ఏకేశ్వరోపాసన అను తౌహీద్‌ను పాటించుచున్నా, దేవుడిచ్చిన ఖుర్ఆన్ గ్రంథములోని జ్ఞానమును అర్థము చేసుకోలేకున్నారు. ముందు ఒకరు చెప్పినమాటనే భయముతో రెండవ వాడు కూడా కాదనలేకపోవుచున్నాడుగానీ భక్తితో ఆలోచించడములేదు. దేవుడు తనయందు భక్తికల్గియుండమన్నాడుగానీ భయము కల్గియుండమని చెప్పలేదు. భయము ఉంటే మాయ లేక సైతాన్ లేక సాతాన్ అనునది నిన్ను భయపెట్టి అజ్ఞానమార్గమున పంపగలదు. అందువలన భయముకంటే భక్తి ముఖ్యమని మేము చెప్పుచున్నాము. భయమును గురించి ప్రథమ దైవగ్రంథమైన భగవద్గీతలో ఇలా చెప్పారు చూడండి.

భగవద్గీతలో కర్మయోగమున 35వ శ్లోకమందు ఈ విధముగా చెప్పుచున్నారు చూడండి.

శ్లో ॥ శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్ స్వనుష్ఠితాత్ ।
స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః ॥

భావము :- **"పరధర్మమును ఆచరించుటకంటే విగుణమైనదైనా స్వధర్మమే శ్రేయస్కరమైనది. పరధర్మములోవుండే భయముకంటే, స్వధర్మములో మరణించుటయినా మంచిదే."** ఈ వాక్యములో పరధర్మము, స్వధర్మము

అని రెండు రకముల పదములుకలవు. ఇక్కడ స్వధర్మము అనగా ఆత్మ ధర్మమనీ, పరధర్మము అనగా ప్రకృతి ధర్మమనీ అర్థము చేసుకోవాలి. అంతేకాక దానిప్రకారము స్వధర్మము అనగా దేవుడు చెప్పిన ధర్మమనీ, పరధర్మమనగా మనుషులు చెప్పిన ధర్మమనీ కూడా అర్థము కలదు. ఇంకా చెప్పితే 'స్వ' అనగా తనదియనీ, స్వధర్మమనగా తన ఆత్మధర్మమనీ, 'పర' అనగా ఇతరమైనదనీ, పరధర్మము అనగా తనకంటే వేరుగాయున్న ప్రకృతి ధర్మమనీ చెప్పవచ్చును. అయితే స్వధర్మము గుణములేనిదైనా, ఆచరించుటకు సాధ్యముకానిదైనా, పరధర్మము ఆచరించుటకు యోగ్యముగా యున్నా పరధర్మముకంటే స్వధర్మమే మేలు. ఎందుకనగా పరధర్మములో భయమున్నా, స్వధర్మములో మరణమున్నా, అందరి దృష్టిలో మరణము కంటే భయమే మేలు అనియున్నా, జ్ఞానము తెలిసినవారి దృష్టిలో భయము కంటే మరణమే మేలని తెలియుచున్నది. భగవద్గీతలో చెప్పిన ఈ సమాచారమునుబట్టి, దేవుని యెడల భయము కల్గించు జ్ఞానమును వదలి భక్తి కల్గించు జ్ఞానమునే ఆశ్రయించమని, భయమును కల్గించు జ్ఞానము ప్రకృతి సంబంధమైనదనీ, దేవుడు చెప్పినది కాదనీ, దేవుడు చెప్పిన జ్ఞానములో భక్తిమాత్రము ఉండుననీ తెలియుచున్నది. ఖుర్ఆన్ గ్రంథములో దేవుడు తన యెడల భక్తిని బోధించాడుగానీ, భయమును బోధించలేదు. అయితే మధ్యలోని మనుషులు మతమును కాపాడుకొనుటకు భయమును కల్గించి భక్తిని ప్రక్కనపెట్టారు. **మొదట భయము తర్వాత భక్తి అంటున్నారు. దేవుడు తన గ్రంథములలో ముందు భక్తి తర్వాత భయము అంటున్నాడు.**

అన్ని మతములలో మేధావులున్నారు. అయితే వారి మేధాశక్తిని ఉపయోగించి దేవుడు చెప్పిన జ్ఞానమును అర్థము చేసుకోవడములేదు. ప్రక్క మనుషులు చెప్పిన దానిని గ్రుడ్డిగా నమ్ముచున్నారు. కర్ణుడు చెవిలో

పుట్టాడు అంటే నమ్ముచున్నారు. ద్రోణుడు గిన్నెలో పుట్టాడు అంటే నమ్ముచున్నారు. చరిత్రలో ఆంజనేయుడు అను బలశాలికి అసూయతో సొట్టమూతి, వంకర తోక పెట్టితే నమ్ముచున్నారు. ఇదంతయూ సామాన్య శాస్త్రముగానీ, అసామాన్యశాస్త్రముగానీ (సైన్సుగానీ, సూపర్ సైన్సుగానీ) ఒప్పుకోదు అని ఎవరూ అనడములేదు. ఎవరు ఏది చెప్పినా గ్రుడ్డిగా తలూపుచున్నారు. ఒకమారు చనిపోయిన శరీరము తిరిగి లేపబడుతుంది అంటే ముస్లీమ్ సమాజములో ఎందరో మేధావులున్నా ఆ మాటను గ్రుడ్డిగా ఒప్పుకొంటున్నారు. కొందరిలో ఆ మాట అసత్యమని అనిపించినా, వారి సమాజమునకు భయపడి ఒప్పుకొంటున్నారు. ఈ మాటను దేవుడు చెప్పాడా లేదాయని ఏమాత్రము చూడడము లేదు. తర్వాత అలా గ్రుడ్డిగా అనుకొంటే ఖుర్ఆన్‌లో దేవుని వాక్యమునకు వ్యతిరేఖముగా అనుకొన్నట్లు కదాయని కూడా తలచడములేదు. మేము చెప్పునదేమనగా! దేవుడు సృష్ట్యాదినుండి యున్నాడు. మతము మధ్యలో వచ్చినది. మధ్యలో వచ్చిన మతముకంటే ఆదినుండీ వుండి సృష్ఠినంతటినీ తయారు చేసిన దేవుని వాక్యమే ముఖ్యము అని మనిషి అనుకోవడములేదు. నేడు అన్ని మతములవారూ వారి వారి మతముల రంగును దేవుని జ్ఞానమునకు కూడా పూయుచున్నారు.

మొదట పుట్టిన హిందూ సమాజములో దేవుడు తన జ్ఞానమును ప్రథమ దైవగ్రంథముగా భగవద్గీత రూపములో ఇచ్చాడు. అయితే హిందువులు భగవద్గీతను ఆధారము చేసుకొనక మనుషులు చెప్పిన వేదములను, పురాణములను ఆశ్రయించారు. అలాగే క్రైస్తవ సమాజములో ఏసు చెప్పిన జ్ఞానము నాలుగు సువార్తల రూపములోయుండగా, ముందు 37, వెనుక 25 పుస్తకములను తయారు చేసుకొని వాటిని బైబిలుగా చెప్పుకొంటున్నారు. అలాగే ఇస్లామ్ సమాజములో దేవుడు చెప్పిన అంతిమ

దైవగ్రంథమని పేరుగాంచిన ఖుర్ఆన్ గ్రంథము ఉండగా, దానికి తోడు మరికొన్ని గ్రంథములను తయారు చేసుకొని ఖుర్ఆన్‌కంటే వాటికే ఎక్కువ ప్రాధాన్యత ఇచ్చుచున్నారు. దేవుడు చెప్పిన జ్ఞానమును కూడా వాటిలో కలుపుకొని, ప్రక్క వాటితో సరిపోవు భావములనే దేవుని వాక్యములకు చెప్పుకొంటున్నారు. దేవుని జ్ఞానములో అత్యంత ముఖ్యమైన చావుపుట్టుకల అధ్యాయమునే మార్చి, మనుషులు చెప్పుకొన్న భావములోనికి పోయి, తమది అసత్యమని ఏమాత్రము అనుకోకుండా సత్యమని వాదించుచున్నారు. అలా వాదించు వారు ఇతరుల దృష్ఠిలో గొప్పగా కనిపించినా, దేవుని దృష్ఠిలో చాలా తక్కువగా కనిపించుదురని చెప్పుచున్నాము.

జనన మరణ విషయములో ఖుర్ఆన్‌లో చెప్పిన మరొక వాక్యమును తీసుకొని చూస్తాము. సూరా 50, ఆయత్ 3లో ఇలా కలదు. **(50-3) "మేము మరణించి మట్టిగా మారిన తర్వాత (మళ్ళీ బ్రతికించబడుతామా) ఈ విధముగా మరలా సజీవులై రావడము చాలా అసంభవమైన విషయము (బుద్ధికి అందని విషయము)"** అని కలదు. ఈ వాక్యము అర్థమగుటకు చిన్న ఉదాహరణ చెప్పుకొందాము. ఇక్కడ ఉదాహరణలేనిది అర్థముకాదు. ఎందుకనగా వాక్యము చివరిలో చాలా అసంభవమైన విషయమనీ, బుద్ధికి అందని విషయమనీ చెప్పారు కదా! అందువలన ఉదాహరణతో చెప్పుకొంటే బాగుండును. మరణములలో కాలమరణము, అకాల మరణము, తాత్కాలిక మరణము, ఆఖరీ మరణము అను నాలుగు రకముల మరణములు గలవు. అందులో అకాలమరణము పొందినవాడు స్థూలశరీరము వదలి, సూక్ష్మశరీరముతో కాలమరణము వచ్చువరకు, జన్మకు పోకుండా అదే జన్మలోనే ఉండవలయును. పది భాగముల స్థూలశరీరము లేకపోవుట వలన జీవుడు మిగతా సూక్ష్మ

శరీరముతోనేయుండును. కర్మేంద్రియములయిన కాళ్ళు, చేతులు, నోరు, గుదము, గుహ్యము అను ఐదు అవయవములు మరియు జ్ఞానేంద్రియము లయిన కన్నులు, ముక్కు, చెవులు, నాలుక, చర్మము అను ఐదు అవయవములు కలిసి పైన కనిపించు స్థూలదేహముగాయున్నది. అకాల మరణములో స్థూలశరీరము చనిపోయి సూక్ష్మశరీరము అలాగేయుండుట వలన జీవుడు మిగతా పదునాలుగు (14) శరీర భాగములతో కలిసియుండును. మొత్తము జీవునితో సహా 25 భాగములుగాయున్న సజీవ శరీరము అకాలమరణము పొందినప్పుడు పది స్థూలభాగములు పోయి, పదిహేను సూక్ష్మభాగములుగా జీవుడు బ్రతుక వలసివచ్చును. అకాలమరణము చెందినవాడు పూర్తి కాల మరణము వచ్చువరకు అదే జన్మలోనే ఇతరులకు కనిపించక సూక్ష్మముగా బ్రతుకవలసి యుండును. అలా బ్రతుకువానిని దయ్యము అని అంటారు. ఈ విషయమంతా తెలియనివారు దయ్యములు లేవు అంటారు. అయినా స్థూల, సూక్ష్మ శరీరముల విషయమూ కాల, అకాల మరణముల విషయమూ తెలిసినవాడు దయ్యములు ఉన్నాయని ఒప్పుకోక తప్పదు.

ఒక మనిషికి ఆయుష్షు 70 సంవత్సరములనుకొనుము. అతడు 40 సంవత్సరములకే అకాలమరణము పొందినాడనుకొనుము. అప్పుడు అతడు సూక్ష్మశరీరముతో ఎవరికీ కనపడని దయ్యముగా మిగతా 30 సంవత్సరములు బ్రతుకవలసియుండును. అలా 30 సంవత్సరములు బ్రతికిన తర్వాత కాలమరణము పొంది తర్వాత జన్మకు పోవలసియుండును. కాలమరణము వచ్చేంతవరకూ ఎవరూ రెండవ జన్మకు పోలేరు. అకాల మరణము పొంది సమాజములో ఎందరో దయ్యములుగా కాలము గడుపు వారు గలరు. అటువంటివారు ఇతరుల శరీరము మీదికి వచ్చి మాట్లాడడము

అక్కడక్కడ జరుగుచుండును. 70 సంవత్సరములు ఆయుష్షు యున్న వ్యక్తి 40 సంవత్సరములకే అకాల మరణము పొందాడు అనుకొన్నాము కదా! అతడు 30 సంవత్సరములు సూక్ష్మముగా (దయ్యముగా) బ్రతికి చివరిలో చనిపోయాడు అనుకొనుము. అప్పుడు వాడు పొందినది కాలమరణము అయినందున అతడు సూక్ష్మశరీరమును కూడా వదలి క్రొత్త శిశుశరీరములో ప్రవేశించి, క్రొత్త జన్మ ఎత్తవలసి వచ్చినది. దీనిప్రకారము అతడు చనిపోయిన తర్వాత 30 సంవత్సరములకు క్రొత్తగా జన్మించినట్లు తెలియు చున్నది. ఇదే విధముగా జరిగిన ఒక యదార్థ సంఘటనను వివరించుకొని చూస్తాము.

ప్రఖ్యాత అమెరికన్ పారా సైకాలజిస్ట్ స్టీవెన్‌సన్ సహచరుడు అయిన ప్రొఫెసర్ హెచ్.ఎన్. బెనర్జీ భారతదేశములో తొలి పారా సైకాలజిస్ట్ అని చాలామందికి తెలియదు. అటువంటి హెచ్.ఎన్. బెనర్జీ స్వయముగా పరిశోధించి పూర్వజన్మ జ్ఞాపకములు వచ్చిన ఒక బాలిక వృత్తాంతమును ప్రపంచమునకు తెలియజేశాడు. మధ్యప్రదేశ్ రాష్ట్రములోని ఛత్రాపూర్ పట్టణములో ఒక సాంప్రదాయ మరియు సంపన్న బ్రాహ్మణ కుటుంబము నందు స్వర్ణలత మిశ్రా అనే పేరుగల అమ్మాయి 1948లో జన్మించింది. ఆమెకు మూడు సంవత్సరముల వయస్సున్నపుడు ఆమె తండ్రి ఆమెను తీసుకొని అక్కడికి 160 కిలోమీటర్ల దూరములోనున్న వారి స్వంత ఊరైన కాట్నె అను పట్టణమునకు వెళ్ళడము జరిగింది. అప్పుడు స్వర్ణలత మిశ్రా కాట్నే పట్టణ శివారు ప్రాంతమునుండి ఒకవైపు వెళ్ళే రహదారిని తన తండ్రికి చూపి, ఆ రోడ్డు వెంట వెళ్ళితే "జురుకుటియా" అనే గ్రామము వస్తుందని చెప్పింది. ఎన్నడూ ఇల్లుదాటి ఎరుగని తన కుమార్తె, అందులోనూ మూడు సంవత్సరముల వయస్సు కూడా పూర్తికాని పసిపిల్ల తన ఊరికి

160 కిలోమీటర్ల దూరములోనున్న ఇంకో ఊరికి వెళ్ళే మార్గమును ఎలా తెలుసుకొన్నదని ఆశ్చర్యపోయాడు.

తండ్రి ఏదో మాట్లాడాలని నోరు తెరిచేలోగా స్వర్ణలత తన తండ్రితో తాను గతజన్మలో జురుకుటియా గ్రామములో జీవించేదాన్ననీ, తన పేరు బియాపాఠక్ అనీ, తనకు భర్త ఇద్దరు పిల్లలు ఉన్నారనీ, తన భర్తపేరు చింతామణి పాండే అనీ, తనకు గొంతులో వచ్చిన తీవ్రమైన నొప్పికి జబల్ పూర్ పట్టణములోని ఎస్.సి.భారత్ అనే డాక్టరు వైద్యము చేశాడనీ, కానీ తనకు రోగము ఎక్కువై 1939లో మరణించాననీ వచ్చీరాని మాటలతో చెప్పింది. ఆమె చెప్పిన మాటలను చాలా ఆసక్తిగా విన్న ఆమె తండ్రి ఆమె చెప్పిన మాటలలోని నిజానిజాలను తెలుసుకోవాలని జురుకుటియాకు వెళ్ళాడు. స్వర్ణలత చెప్పినట్లుగానే ఆమె గతజన్మ భర్త అయిన చింతామణి పాండేను కలిసి తన కుమార్తె స్వర్ణలత మిశ్రాకు వచ్చిన పూర్వజన్మ జ్ఞాపకాలను ఆయనకు తెలియజేశాడు. అప్పుడు చింతామణి పాండే తన భార్య బియాపాఠక్ 1939లోనే చనిపోయిందని స్వర్ణలత తండ్రికి తెలియజేశాడు. అయితే పాండే, 12 సంవత్సరముల క్రిందట చనిపోయిన తన భార్య మరలా స్వర్ణలతగా జన్మించిందంటే నమ్మలేకపోయాడు. తర్వాత ఈ విషయము మధ్యప్రదేశ్ అంతటా ప్రాకిపోయింది. చివరకు ప్రఖ్యాత భారతీయ సైకాలజిస్ట్ హెచ్.యన్.బెనర్జీ దాకా వెళ్ళింది. స్వర్ణలత యొక్క పూర్వజన్మ వృత్తాంతములోని నిజానిజాలను తెలుసుకోవాలనుకొన్న హెచ్.యన్.బెనర్జీ మొదట స్వర్ణలతను కలిసి, ఆమె గత జన్మలోని పూర్వజన్మ కుటుంబీకుల వివరాలనూ, ఆమె గతజన్మలో జీవించిన ఇల్లు ఎలా ఉంటుంది మొదలగు విషయములనూ తెలుసుకొని, తర్వాత జురుకుటియా గ్రామానికి వెళ్ళి స్వర్ణలత చెప్పిన వివరాలతో పోల్చి చూచుకొని, స్వర్ణలత

చెప్పినవన్నీ నిజమేననీ, గత జన్మలోని బియాపాఠక్ ఇప్పుడు స్వర్ణలతగా పుట్టినదనీ నిర్ణయానికి వచ్చాడు. కొంతకాలము గడచిపోగా స్వర్ణలతకు పది సంవత్సరముల వయస్సు వచ్చినది. ఆ వయస్సులో గత జన్మ జ్ఞాపకముల వలన స్వర్ణలతకు మనశ్శాంతి లేకుండా పోయినది. ఆ సమయములోనే డాక్టర్ స్టీవెన్‌సన్ ఇండియాకు రావడము జరిగింది.

స్టీవెన్‌సన్ తన మిత్రుడైన బెనర్జీ ద్వారా స్వర్ణలత పునర్జన్మను గురించి తెలుసుకొని ఎంతో ఉత్తేజితుడయ్యాడు. ఆ విషయము మీద ఆసక్తి కల్గిన స్టీవెన్, స్వర్ణలత గతజన్మ భర్త అయిన చింతామణి పాండేను వెంటబెట్టుకొని స్వర్ణలత ఉంటున్న ఛాత్రాపూర్‌కు వచ్చి స్వర్ణలతను కలుసుకొన్నాడు. స్వర్ణలత తన గతజన్మ భర్తను చూడగానే గుర్తుపట్టి సిగ్గుతో తలవంచుకొన్నది. అప్పుడు స్టీవెన్‌సన్ పాండేను స్వర్ణలతకు పరిచయము చేశాడు. స్వర్ణలత ఎన్నో గుర్తులను చెప్పినప్పటికీ, పాండే ఆమెను గతములోని తన భార్యగా అంగీకరించలేదు. దానితో ఆమె అతనిని ఒక విషయమును అడిగినది. ఆమె పాండేతో "నేను నా బీరువాలో బట్టల అడుగున పెట్టిన 1200 రూపాయలను ఫలానా రోజున మీరు దొంగిలించలేదా!" అని అడిగింది. దానితో పాండే ఖంగుతిన్నాడు. కేవలము తమ దంపతులకు ఇద్దరికి మాత్రమే తెలిసిన రహస్యము పది సంవత్సరముల పాపకు ఎలా తెలిసిందని ఆశ్చర్యపోయాడు. దానితో చిన్నపిల్లగానున్న స్వర్ణలత గతములోని తన భార్యయేనని చింతామణి పాండే ఒప్పుకొన్నాడు. దానితో స్వర్ణలతది పునర్జన్మ అని డాక్టర్ స్టీవెన్‌సన్‌కు రుజువైంది. ఈ విధముగా స్వర్ణలత పునర్జన్మ వృత్తాంతము 1950 నుండి 1960 మధ్యకాలములో ప్రపంచ వ్యాప్తముగా ఎంతో సంచలనమును సృష్టించింది.

మధ్యప్రదేశ్ రాష్ట్రములో పుట్టిన స్వర్ణలత చావుకూ పుట్టుకకూ మధ్య కాలము తొమ్మిది సంవత్సరములు గడిచింది. బియాపాఠక్‌గా 1939లో చనిపోయిన ఆమె 1948లో స్వర్ణలతగా జన్మించింది. ఒకచోట లేకుండా పోయి మరియొక చోటికి వచ్చిన ఆమె, తొమ్మిది సంవత్సరముల మధ్య కాలములో ఎక్కడున్నది? అని ప్రశ్నరాక తప్పదు. బియాపాఠక్ చనిపోయి స్వర్ణలతగా పుట్టుటకు పట్టిన కాలమే అందరికీ చావు పుట్టుకల మధ్య ఉన్నదా, అని చూస్తే అలాగ కూడా లేదు. బయటపడిన పునర్జన్మలను పరిశీలిస్తే ఒకరికి రెండు సంవత్సరములు, మరియొకరికి మూడు సంవత్సరములు కాగా ఒక్కొక్కరికి ఒక్కొక్క కాలవ్యవధి ఉండడమును మనము గమనించవచ్చును.

ఈ సంఘటనలో స్వర్ణలతమిశ్రా అను ఆమె 1939 లో చనిపోయి 1948 లో జన్మించినది. అప్పటికి చనిపోయి తిరిగి పుట్టుటకు మధ్యలో తొమ్మిది (9) సంవత్సరములు గడచినది. ఇక్కడ మనము చెప్పుకొను విషయమేమనగా! 1939లో చనిపోయిన ఆమెశరీరమును చనిపోయిన దినమే పూడ్చిపెట్టియుందురు కదా! ఆ శరీరము ఆరు నెలలకు కండలన్నీ కుళ్ళి పోయి మట్టిగా మారిపోగా మిగిలిన ఎముకలు కూడా తర్వాత ఆరు సంవత్సరములకు పూర్తి మట్టియైపోయివుండును. తొమ్మిది (9) సంవత్సరముల తర్వాత పుట్టిన ఆమెను చూచి ఆమె శరీరము కుళ్ళిపోయిన తర్వాత ఆమె ఎట్లు వచ్చిందని ఎవరూ ప్రశ్నించరు కదా! ఆమె వచ్చినది పాతశరీరముతో కాదు కదా! ఆమె వచ్చినది క్రొత్త శరీరముతో కావున ఎవరుగానీ పాతశరీరము ప్రస్తావనకు తెచ్చుటకే అవకాశముండదు. స్వర్ణలత శరీరముతో తిరిగి లేపబడును అనుమాట సత్యమయినదిగానీ, స్వర్ణలత అదే పాతశరీరముతో తిరిగి లేపబడును అనుమాట పూర్తి అసత్యమయినది.

నేడు ముస్లీమ్ సమాజములో ఎందరో అకాల మృత్యువును పొందు చున్నారు. అటువంటివారు కొంతకాలము సూక్ష్మశరీరముతో గడిపి తర్వాత రెండవజన్మను తీసుకొంటున్నారు. చనిపోయి తిరిగి పుట్టుటకు మధ్య కాలములో వాడు సూక్ష్మశరీరముతో యున్నాడు అనుటకు అతడు దయ్యముగాయున్నాడు అను ఆధారమున్నది. తర్వాత పుట్టినవాడు పాత శరీరముతో కాకుండా క్రొత్త శరీరముతో పుట్టడము జరుగుచున్నది. ఇవన్నియూ ప్రత్యక్షముగా మనముందరే జరుగుచున్నా వాటిని గుర్తించక, దేవుడు చెప్పిన మాటను కూడా వక్రీకరించుకొని, అపార్థము చేసుకొని దేవుడు చెప్పిన దానిని అర్థము చేసుకోలేక పోవడము వలన, దేవుడు ఆ విషయము మనుషులకు అర్థముకావలెనని, ఎన్నో సంఘటనలను ప్రత్యక్షముగా చూపుచున్నా, అర్థము చేసుకోకపోతే మనిషిది పూర్తి అజ్ఞానమగును.

కొందరు ముస్లీమ్‌లు మీ హిందువులలో దయ్యాలు వుంటాయి. మా మతములో అటువంటి మరణములు లేవు, అటువంటి దయ్యాలు లేవు. మీరు చెప్పునవన్నీ అభూతకల్పనలని అనవచ్చును. ఇటువంటి సమస్య వచ్చునేమోనని ముందే దేవుడు గ్రహించి, ముస్లీమ్ దేశములోనే ముస్లీమ్‌గా నున్నవాడే అకాలమృత్యువు పొంది తిరిగి జన్మించినట్లు చేశాడు. ఆ విషయమును ముస్లీమ్‌లు నమ్మవచ్చును కదా! ఈ సంఘటనతో అంత్య కాలమనునది, ప్రళయ కాలమనునది మనము అర్థము చేసుకొన్నట్లు కాదనీ, దేవుడు చెప్పినది వేరనీ తెలియగలదు. లెబనాన్ దేశములో ముస్లీమ్ కుటుంబములలో జరిగిన సంఘటనలను ఇక్కడ వివరించుకొని చూస్తాము 1930వ సంవత్సరము జూన్ లేక జూలై నెల కాలములో లెబనాన్ దేశములో “హాసన్” అనే పేరుగల స్త్రీ జన్మించింది. పునర్జన్మలు లేవు అని చెప్పుచున్న

ఇస్లామ్‌మతములో హోసన్ జన్మించడము విశేషము. ఆమెకు 20 సంవత్సరముల యుక్తవయస్సులో "ఫరూక్" అను వ్యక్తితో వివాహము జరిగింది. ఫరూక్, హోసన్ జంటకు ఇద్దరు ఆడపిల్లలు పుట్టారు. హోసన్‌కు "నభీ" అనే సోదరుడు కూడా ఉండేవాడు. అతడు లెబనాన్ దేశములో లెబనాన్ సమాజములో చాలా పేరు పొందినవాడు. అయితే నభీ యుక్తవయస్సులో విమాన ప్రమాదములో మరణించాడు. హోసన్ తన రెండవ కూతురుకు జన్మనిచ్చినపుడు అనారోగ్యముపాలై గుండె సమస్య వచ్చింది. దానివలన ఇక మీదట పిల్లలను కనకూడదని డాక్టర్లు సలహా ఇచ్చారు. అయితే హోసన్ ఆ సలహాను ఏమాత్రము పట్టించుకోకుండా 1962లో మూడవ మగబిడ్డకు జన్మనిచ్చింది. 1963లో తన తమ్ముడు నభీ చనిపోవడముతో ఆమె ఆరోగ్యము మరీ క్షీణించను మొదలు పెట్టింది. అప్పుడు ఆమె తాను చనిపోవడము ఖాయమని అనుకున్నది. కొంత కాలమునకు 36 సంవత్సరముల వయస్సున్న హోసన్ వర్జీనియాలో ఉండే "రిచ్‌మడ్" అనే డాక్టర్‌వద్దకు గుండె ఆపరేషన్ కొరకు వెళ్ళింది. ఆపరేషన్‌కు ముందు తన పెద్దకూతురు లైలాకు ఫోన్ చేయబోయింది, కానీ చేయలేక పోయింది. ఆపరేషన్ తర్వాత ఒకరోజు మాత్రము బ్రతికి చాలా క్లిష్టపరిస్థితులలో హోసన్ మరణించింది.

హోసన్ మరణించిన పది రోజులకు సుజన్నేగానెమ్ అను బిడ్డ ఒక కుటుంబములో పుట్టింది. సుజన్నేగానెమ్ 16 నెలల వయస్సుగల చిన్న బిడ్డగా ఉండి మాటలు వచ్చీరాని సమయములో ఫోన్ తీసుకొని హలో లైలా అని పదేపదే అంటూ ఉండేది. ఆ కుటుంబము వారికిగానీ, సుజన్నే తల్లికిగానీ లైలా ఎవరో? అంతచిన్న పాప అలా ఎందుకు ఫోన్‌లో పిలుస్తున్నదో అర్థము కాలేదు. తర్వాత ఆరునెలలు గడచిన సుజన్నేకు

రెండు సంవత్సరములు వయస్సు పూర్తి అయింది. అప్పుడు మాటలు కూడా బాగా వచ్చాయి. అప్పుడు ఆమె తల్లి, లైలా ఎవరు? అని అడిగింది. దానికి సుజన్నేగానెమ్ నాకు ఇద్దరు కూతుర్లున్నారని, వారిలో ఒక కూతురు పేరు లైలా అని చెప్పింది. అంతేకాక తన పేరు సుజన్నే కాదనీ, తనపేరు హాసన్ అని, తన భర్త పేరు ఫరూక్ అనీ, తన తల్లిదండ్రుల పేర్లు, తమ్ముళ్ళ పేర్లు, మిగత కుటుంబ సభ్యుల పేర్లు మొత్తము 13 పేర్లు వరుసగా చెప్పింది. ఇంకా తన ఊరు యొక్క వివరాలు అడిగితే ఇప్పుడు నా తల చిన్నది ఇంకా కొంత కాలమునకు అన్ని విషయములు చెప్పుతానని చెప్పింది.

ఈ విధముగా సుజన్నే చెప్పిన మాటలను విని ఆమె కుటుంబములోని వారు సుజన్నే ముందు జన్మలో హాసన్‌గా ఎక్కడ పుట్టిందో తెలుసుకోవాలను కొన్నారు. ఆ వార్తను పత్రికల ద్వారా బయటికి తెలియజేశారు. అప్పుడు హాసన్ కుటుంబములోని వారూ, హాసన్ భర్త ఫరూక్ సుజన్నేను చూడటానికి వచ్చారు. మొదట ఫరూక్ కుటుంబము చిన్నపాపగానున్న సుజన్నే చెప్పు మాటలను నమ్మలేకపోయారు. హాసన్ బంధువులను సరిగ్గా వారి పేర్లతో సుజన్నే పిలువడముతో ఫరూక్ కుటుంబము ఆ పిల్లను నమ్మడము మొదలు పెట్టింది. హాసన్ తన నగలనూ, ఇతర ఆభరణములనూ వర్జీనియాలోని తన తమ్ముడు హెర్‌కులేకు ఇచ్చింది. ఇది సర్జరీకి ముందు జరిగిన సంగతి. ఆ నగలను హెర్‌కులేకు ఇస్తూ, వాటిని తన కూతుర్లకు అందజేయ వలసిందిగా చెప్పింది. ఈ విషయము హాసన్‌కు వారి కుటుంబీకులకు తప్ప ఇంకెవ్వరికీ తెలియదు. ఇవన్నీ విన్న తర్వాత సుజన్నే గతజన్మలో హాసన్‌గా ఉండేదని ధృవీకరించబడింది.

చదవడానికిగానీ, వ్రాయడానికిగానీ రాకముందే సుజన్నే పేపరు మీద ఏవో నంబర్లు వ్రాసేది. తర్వాత ఆ నంబర్లు ఫరూక్ ఇంటి

ఫోన్‌నంబరని తెలిసింది. సుజన్నేకు ఐదు సంవత్సరముల వయస్సున్నపుడే రోజుకు మూడు సార్లు ఫరూక్‌కు ఫోన్ చేసేది. ఫరూక్‌ని కలిసినపుడు సుజన్నే అతని ఒడిలో కూర్చొని నిద్రించేది. పోలీస్ ఉద్యోగము చేసే ఫరూక్, మరణించిన తన భార్య హాసన్ సుజన్నేగా జన్మించిందని అంగీకరించాడు. సుజన్నేకు ఏవైనా ఫోటోలు చూపిస్తే వాటిలోని వ్యక్తుల్ని గుర్తించడమే కాకుండా, హాసన్‌కు ఆ ఫోటోలోని వారితో సంబంధాన్ని సుజన్నే వివరించేది. కొన్ని హాసన్‌కు తప్ప ఎవరికీ తెలియని వివరాలను సుజన్నే వివరించేది. దీనివలన పోయిన జన్మలోని హాసన్ ఈ జన్మలో సుజన్నేగా పుట్టినదని పూర్తి నిరూపణకు వచ్చినది. ఈ విషయముతో పునర్జన్మ ఉన్నదనీ నిరూపించబడినది. 50 సంవత్సరముల క్రితము జరిగిన ఈ సంఘటనను ఎవరూ కాదనలేరు మరియు ఖండించనూ లేరు.

జీవుడు శరీరమును వదలి పోవడము మరణము అయితే, అదే జీవుడు మరొక శరీరమును ధరించడము జన్మ అవుతుంది. దానినే లోతుగా విచారిస్తే పునర్జన్మ అవుతుంది. ఒక మనిషి పాతవస్త్రమును వదలి క్రొత్త వస్త్రమును ధరిస్తే దానిని వస్త్రమార్పిడి అనవచ్చును. అలాగే ఒక జీవుడు పాత శరీరమును వదలి క్రొత్త శరీరమును ధరిస్తే దానిని శరీరమార్పిడి అనవచ్చును. శరీర మార్పిడిలో జీవునికి పునర్జన్మ ఏర్పడుచున్నది. మనిషి పునర్జన్మను పొందినప్పటికీ, వెనుకటి జన్మ జ్ఞాపకములు అతనికి లేక పోవడము వలన, దానిని జన్మ అనుకోవడము జరుగుచున్నది. కానీ అది తనకు పునర్జన్మ అని ఎవరికీ తెలియకుండా పోవుచున్నది. అట్లు తెలియక పోవడము వలన జరుగుచున్న సత్యము సమాధియై పోగలదు. అందువలన జీవునికి జన్మలలో జరుగు సత్యమును తెలుపు నిమిత్తము, జీవునితో పాటు శరీరములోనున్న ఆత్మ అప్పుడప్పుడు ఎక్కడో ఒకచోట, వెనుకటి జన్మ

జ్ఞాపకమును అందించుచున్నది. వెనుకటి జన్మ జ్ఞాపకముతో పునర్జన్మ నిరూపణకు వస్తున్నది. మనిషి జీవితములోని ఆధ్యాత్మిక విషయములను దేవుడు తన ప్రవక్తల ద్వారా చెప్పించాడు. అలా చెప్పించిన వాటిలో జన్మ, పునర్జన్మ విషయములు ముఖ్యముగా చెప్పబడినవి. దేవుడు భూమిమీద మనిషి కొరకు కొన్ని వేల సంవత్సరములకొకమారు వచ్చి తన జ్ఞానమును మళ్ళీమళ్ళీ చెప్పడము జరిగినది. మనిషి జ్ఞానమును మరచి పోకుండుటకు దేవుడు ఎన్నిమార్లు తన జ్ఞానమును మనుషులకు చెప్పితే, అన్నిమార్లు మనిషి దేవుని జ్ఞానమును అర్థము చేసుకోలేక, ఒక్కొక్కమారు చెప్పిన దానిని ఒక్కొక్క మతముగా, చెప్పిన వానిని మత ప్రవక్తగా లెక్కించుకోవడము జరిగినది. అందువలన దేవుడు చెప్పినది ఒకే జ్ఞానమైనా అది చెప్పిన జాగావేరు, చెప్పిన కాలమూ వేరు, చెప్పిన మనిషీ వేరు. కావున దేవుడు చెప్పినది ఒకే జ్ఞానమని తెలియక మా మతములో చెప్పినది వేరు, మీ మతములో చెప్పినది వేరని అనుకోవడము జరిగినది. దేవుడు సత్యవంతుడు, సత్యమునే తెలియజేస్తాడు. మనిషి దేవుడు చెప్పిన సత్యమును అవగాహన చేసుకోలేక, ఒక్కొక్కమారు ఒక్కొక్క రకముగా చెప్పినట్లు అర్థము చేసుకొని, దేవుని సత్యమునే తనకు తెలియకుండానే అసత్యముగా చేయుచున్నాడు. అలా దేవుడు చెప్పిన మాటను నేను అసత్యము చేసి మాట్లాడుచున్నానని తెలియకపోవడమేకాక, తనకు తెలిసినదే సత్యమని, నూటికి నూరుపాళ్ళు నమ్మకముతో ఉన్నాడు. అలాంటి విశ్వాసముతోనే కొందరు పునర్జన్మలు ఉన్నాయని అంటే, కొందరు పునర్జన్మలులేవు అంటున్నారు. ఈ విధముగా ఉన్నాయని కొన్ని మతములవారూ, లేవని కొన్ని మతముల వారూ అనుచున్నపుడు, సామాన్య మనిషి దేనిని సత్యమని నమ్మాలో, దేనిని నమ్మకూడదో తేల్చుకోలేకపోవును. అటువంటి చిక్కు సమస్య ఏర్పడకుండా,

ఏది సత్యమో అందరూ తెలియుటకూ, అన్ని మతముల వారూ సత్యమును తెలుసుకొనుటకు దేవుడు తన జ్ఞానమును అనుభవరీత్యా అర్థమగునట్లు చేయును. అటువంటి ప్రక్రియలోని భాగమే పైన చెప్పిన హాసన్ పునర్జన్మ సంఘటన.

దేవుడు తాను చెప్పినది సత్యమనీ, ఒకవేళ ఎవరైనా ఆయన మాటను తప్పుగా అర్థము చేసుకొనివుంటే మించిపోయినది ఏమీలేదనీ, అటువంటి వారు జరిగిన యదార్థమును బట్టి తాము పొరపడిన విషయమును సరిగా అర్థము చేసుకోవచ్చుననీ, అప్పటికీ వారికి అర్థము కాకపోతే వారివద్ద ఉన్నది మత జ్ఞానమేననీ, దేవునిజ్ఞానము కాదనీ చెప్పవచ్చును. దేవుడు సర్వమును సృష్ఠించిన తర్వాత తన ధర్మములను మనిషికి తెలిపాడు. అందులో తిరిగి మనిషి తనవద్దకు (దేవునివద్దకు) రానంతవరకు భూమిమీద చస్తూ, పుట్టుచూ సుఖదుఃఖములను అనుభవిస్తూ ఉండవలసిందేననీ, తనవద్దకు వచ్చిన వానికి మాత్రమే జనన మరణముల నుండి ముక్తి లభించుననీ, దానినే మోక్షము అంటామని చెప్పాడు. అదే విషయమునే అన్ని మతములలోనూ చెప్పాడు. అయితే ఇస్లామ్ మతములో చిన్న అవగాహనా లోపము వలన జిబ్రయేల్ చెప్పిన సత్యమును కొందరు అర్థము చేసుకోలేక పోయారు. దేవుని జ్ఞానము గొప్పది, సూక్ష్మమైనది కావున ఎవరైనా పొరపడుటకు అవకాశము గలదు. ప్రవక్త బ్రతికివున్నపుడే మహమ్మద్ ప్రవక్తగారి పదకొండు మంది భార్యలలో చిన్న భార్యకు పునర్జన్మల విషయము అర్థముకాక తిరిగి ప్రవక్తను అడిగి తెలుసుకొన్నది. ఈనాడు ప్రవక్తలేడు కనుక అటువంటి అవకాశము మనకు లేదు. కావున జరిగిన యదార్థమును బట్టి మన పొరపాటును సరిదిద్దుకోవచ్చును. మహమ్మద్ ప్రవక్తగారు తన సతీమణులవద్ద దేవుని ధర్మములను తెలుపుచూ,

చనిపోయిన మనిషిని ప్రళయ దినాన దేవుడు సమాధినుండి తిరిగి లేపుననీ, అప్పుడు మనిషి ఇవే ఎముకలు, ఇదే చర్మముతో, ఇదే శరీరముతో తిరిగి సమాధినుండి వచ్చుననీ, అలా వచ్చిన వాని శరీరము మీద నూలు పోగుకూడా ఉండదని తెలిపాడు. అప్పుడు ప్రవక్తగారి చిన్న భార్య ఆయిషా బేగమ్ ఇలా అడిగింది. "మేము స్త్రీలము కదా! దేవుడు మమ్ములను గుడ్డలు లేకుండా నగ్నముగా లేపితే మాకు మర్యాద పోతుంది కదా! మాకు మానము పోతుంది అవమానము ఏర్పడుతుంది కదా!" అని అడిగింది. అప్పుడు ప్రవక్త ఇలా చెప్పాడు. "దేవుడు మనిషిని తిరిగి సమాధినుండి లేపినపుడు స్త్రీలకుగానీ, పురుషులకు గానీ ఎటువంటి గుణములుగానీ, ఎటువంటి ప్రపంచ ధ్యాసగానీ ఉండవు" అన్నాడు. ప్రళయ కాలములో చనిపోయిన వారందరూ సమాధులనుండి లేపబడుతారని పవిత్ర గ్రంథమైన ఖురాన్‌లో కూడా అనేక చోట్ల ప్రవక్త చెప్పియున్నాడు. ఈ విషయములో ప్రవక్తకు దగ్గరగానున్న ఆయన భార్యయే పొరపాటు పడినపుడు ప్రవక్త ఆమెకు ఇంకా కొంత వివరముగా చెప్పాడు. ఆ వివరముతో మనిషికి పునర్జన్మలున్నాయని ఎవరికైనా అర్థము కాగలదు. కానీ కొందరికి ప్రవక్త మాటలు పునర్జన్మలు లేవనియేనని అర్థమగుటకు కారణములు గలవు. అవి ఏవనగా! సమాధి అంటే ఏమిటో కొందరికి అర్థము కాలేదు. దేవుడు చనిపోయిన మనిషిని తిరిగి లేపినపుడు ఆ మనిషికి ఎంత వయస్సు? అని అడిగితే సమాధానము లేదు. మనిషి ఎంతకాలము సమాధిలో ఉంటాడు అని ప్రశ్నిస్తే జవాబులేదు. నీవు అనుకొను సమాధి నీదా లేక నీ శరీరముదా? అని అడిగితే దానికి సరిగా ఏమి చెప్పాలో చాలామందికి తెలియదు. నీటిలో మునిగి పోయిన వానికి సమాధి ఉన్నదా? అగ్నిలో కాలిపోయిన వానికి సమాధి ఎక్కుడున్నది అని అడిగితే సరియైన

సమాధానముండదు. ఇన్ని ప్రశ్నలకు సరియైన జవాబు దొరికినపుడు, దేవుడు చెప్పిన జ్ఞానము మనకు అర్థమైనట్లు, లేకపోతే అర్థము కానట్లేనని తెలుసుకోవలెను.

సృష్ఠికర్త అయిన దేవుడు తన పవిత్రగ్రంథమైన ఖురాన్‌లోనూ, పరిశుద్ధ బైబిలులోనూ, ఉత్తమమైన భగవద్గీతలోనూ జనన మరణ విషయములో ఒకే ధర్మమును బోధించాడు. గీతలో చెప్పిన మాటకుగానీ, బైబిల్‌లో చెప్పిన మాటకుగానీ, ఖురాన్‌లో చెప్పిన మాటకుగానీ ఎక్కడా తేడా లేదు. కానీ మనము అర్థము చేసుకోవడములో ఎంతో తేడా వచ్చినది. అందువలన మీరు బాగా ఆలోచించుకోమని దేవుడు హెచ్చరిక చేసి చెప్పాడు. అటువంటి మాటను ఖురాన్‌లో ఒకచోట చూడగలము. అజ్ జుమర్ (బృందములు) అను 39వ సురాలో 42వ ఆయత్‌లో ఇలా కలదు. **(39-42) "అల్లాయే ఆత్మలను (ప్రాణులను) మరణ కాలమున వశపరుచుకొనే వాడు. మరణించిన వాని ఆత్మలకు దేనికైతే మరణము నిర్ణయింపబడుతుందో దానిని తనవద్దే ఆపుకొని, మిగతా వారి ఆత్మలను నిర్ణీత సమయము వరకు తిరిగి పంపుతాడు. ఇందులో ఆలోచించేవారికి గొప్ప సూచనలున్నాయి."** ఈ ఆయత్ ఎవరికైనా ఎంతో ఆలోచింప చేస్తుంది. మిగతా ప్రాణులను తిరిగి పంపుతాను అన్నపుడు ఎక్కడినుండి ఎక్కడికి పంపుతాడని ప్రశ్నవేసుకొని చూడవలసిన అవసరమున్నది. అంతేకాక స్వయానా దేవుడే ఇందులో ఆలోచించేవారికి గొప్ప సూచనలున్నాయని చెప్పినపుడు మనిషి ఎంతో ఆలోచించవలసిన అవసరమున్నదనీ, మనము ఏదో పొరపాటు పడుచున్నామనీ, దానికే దేవుడు అలా చెప్పాడని అర్థము చేసుకోవచ్చును.

దీనికి అనుసంధానముగా పవిత్ర ఖురాన్‌లో సృష్ఠికర్త అయిన దేవుడు మరొక మాటను కూడా చెప్పాడు. 53వ సురా అన్‌నజ్మ్ (నక్షత్రము) 44,45,46,47 ఆయత్‌లలో (44) నిశ్చయముగా ఆయనే మరణింపజేసే వాడు మరియు జీవితాన్ని ప్రసాదించేవాడు. (45) నిశ్చయముగా ఆడ, మగ జంటలను సృష్ఠించినవాడు ఆయనే, (46) ప్రవహింపజేసిన వీర్యబిందువు నుండి (47) మరొక జీవితమును ప్రసాదించడము ఆయనకే (దేవునికే) చెల్లును. ఈ విధముగా ఖురాన్‌లో మరికొన్ని వాక్యములు కనిపించగలవు. వాటిని సరిగా అర్థము చేసుకొన్నపుడు పైన చెప్పుకొన్న హాసన్ 36 సంవత్సరములకు మరణించి తిరిగి పదిరోజులకే సుజన్నేగా జన్మించిన సత్యము అర్థము కాగలదు. హాసన్ మరణించి తిరిగి పుట్టినది సత్యమైనపుడు పునర్జన్మలు లేవు అను వారి మాటలు అసత్యమగును. అటువంటి అసత్యములను ప్రవక్తలకు అంటగట్టి, వారి గొప్పతనమునకు ఆటంకము కలిగించకూడదు. ప్రవక్తల మాటలను తప్పుగా అర్థము చేసుకోవడము వలన, దేవుని మాటలనే అసత్యము చేసినట్లగును. దేవుని మాటలను అసత్యముగా చూపడము వలన, ఎవరికైనా భయంకరమైన పాపము సంభవించగలదు. అందువలన దేవుని జ్ఞానమును ఏ మతస్థులైనా సరిగా అర్థము చేసుకోవాలని కోరుచున్నాను. ఖురాన్‌ను పరిశోధించిన కొందరు పెద్దలు ఖురాన్‌లో ఇంకా కొన్ని వాక్యములు పునర్జన్మల గురించి ఉన్నాయని వ్రాశారు. వాటిని క్రింద పొందుపరుస్తున్నాము చూడండి.

**1) మరి ఎప్పుడైతే శరీరము నశిస్తుందో, అపుడు ఆత్మ (జీవాత్మ) ఆ యొక్క పాత కవచాన్ని వదలివేసి, అందుండి విడుదలై క్రొత్త శరీరాన్ని ధరిస్తుంది. మానవ దేహము ఒక వ్యక్తికి ఒక రుతువులాగ కొంతకాలము ఉంటుంది. ఆత్మకు ఆ సమయము పూర్తికాగానే దాన్ని విడిచి ఇంకో శరీరాన్ని తీసుకొంటుంది.**

2) దైవత్వము ఆత్మలను (జీవులను) ఉద్భవింపజేస్తుంది. ఇక్కడికి తిరిగి తిరిగి పంపిస్తూ ఉంటుంది. ఎప్పుడైతే ఆ ఆత్మ దైవత్వాన్ని తిరిగి చేరు కుంటుందో అపుడా ఆత్మ తిరిగి జన్మించనవసరములేదు.

3) సృష్టికర్తయిన దేవుడు నిన్ను తయారు చేసినా, నీవు చనిపోయి నపుడు తిరిగి జన్మింపజేసినా, అలాగే నీవు జన్మించిన తర్వాత నిన్ను మరణింపజేసినా, ఇలా తనని నీవు చేరే దాకా ఈ జనన మరణ చట్రములో నిన్ను ప్రవేశపెట్టినా ఆ దైవత్వాన్ని, దేవున్ని విస్మరిస్తావు.

4) నిన్ను సృష్టించి నీకొక ఉనికిని తయారు చేసినది, నీవు చనిపోతే నిన్ను జన్మింపజేస్తున్నది, నీవు జన్మించిన తర్వాత నిన్ను మరణింపజేస్తున్నది ఆ దేవుడు ఒక్కడే.

5) రాతినుండి గింజను బద్దలుకొట్టుకొని మొలకెత్తించేది, చనిపోయిన వారిని తిరిగి జన్మింపజేసేది, జీవిస్తున్న వారిని తిరిగి మరణింపజేసేది ఆ దైవత్వమే.

6) ఇప్పుడు మీకు సత్యాన్ని బోధిస్తున్నాను, ఏ ఆత్మలకైతే ఒకదానిపట్ల (దైవముపట్ల) తీవ్ర ఆసక్తి, ఇష్టము ఉంటే ఆ ఆత్మలు ఎన్ని శరీరములు ధరించినా, ఎన్ని పేర్లు పొందినా సరే అవి దేవునికి దగ్గరవుతాయి.

ఈ వాక్యములు దైవత్వము యొక్క గొప్పతనమును తెలియు జేయడమేకాక, మనిషికి జన్మలున్నవని కూడా తెలియజేయు చున్నవి. మనిషి తాను చేసుకొన్న పాపపుణ్యములను అనుభవించుటకే పుట్టు చున్నాడనునది సత్యము. దానినే కర్మసిద్ధాంతము అంటాము. ఆ కర్మ సిద్ధాంతమును తెలియజేయు వాక్యములు కూడా పవిత్ర ఖురాన్

గ్రంథములో ప్రవక్తగారు అక్కడక్కడ తెలియజేశాడు. వాటిలో కొన్ని ఈ విధముగా ఉన్నవి.

1) దైవత్వము లేక దేవుడు ఏ ఆత్మనూ (ఏ జీవిని) తనశక్తికి మించి చేయమని నిర్దేశించడు. ఆ ఆత్మ ఏమి సంపాదించుకుందో దానినే పొందుతుంది. మరి దానికి ఏది లభించునన్నది దాని బాధ్యతే.

2) ప్రతి ఆత్మ తాను చేసిన మంచిని తిరిగి పొందుతుంది. అలాగే తాను చేసిన చెడునూ తిరిగి పొందుతుంది.

3) మనము మన కర్మల లెక్కలు చూచుకొన్నపుడు మనమే మనల్ని తీర్మానించుకొంటాము. ఏ ఆత్మగానీ, దేనికిగానీ దోషికాదు. అయితే ఆవగింజంత అయినా సరే ఆ కర్మను అది పాపమైనా, పుణ్యమైనా మనము తిరిగి పొందుతాము. మన ఆత్మ క్షేత్రము ఆ లెక్క విషయములో చాలా పక్కాగా ఉంటుంది.

4) "మనము ఇతరులకు ఏమి చేశాము, ఇతరులు మనకేమి చేశారు" అను అన్ని విషయములు చాలా లెక్కగా మనదగ్గరుంటాయి

5) విశ్వ మానవుల గురించి ఖురాన్‌లో అత్యద్భుతమైన వాక్యాలున్నాయి. కానీ మతముల యొక్క సంకుచిత అవగాహనతో ఈ సత్యాన్ని మనము మరచి పోయాము. ప్రపంచములోని ఏ మతస్థులైనా సరే, ఎవ్వరైతే దైవాన్ని విశ్వసిస్తారో వారికి చివరి రోజున భయములేదు మరి వారు దుఃఖింపరు. చూచారా! ఈ వాక్యము ఎంత గొప్పగా ఉందో?

కర్మ సిద్ధాంత వాక్యములనుబట్టి ఖురాన్ చాలా గొప్పది. ప్రపంచము లోని సమస్త మానవాళికి వర్తించు సూత్రములను చెప్పినదని అర్థమగు

చున్నది. ఖురాన్ చెప్పిన కర్మ సిద్ధాంతము ప్రకారము మనిషి చేసుకొన్న కర్మకు మనిషే బాధ్యుడు. మనిషి చేసుకొన్న దానిని అనుభవింపజేయుటకు మనిషిని దేవుడు తిరిగి పుట్టించవలసి వచ్చినది. ఏ కర్మలేని వాడు తిరిగి పుట్టనవసరములేదు. అటువంటి వారు దేవుని సన్నిధానములోనే ఉండి పోవును. దేవుడు మొదట కర్మలేని మనిషిని పుట్టించి తానే అతనిని జీవింపజేయగా, మనిషి తనను పుట్టించిన దేవున్ని మరిచిపోయి, తానే బ్రతుకుచున్నానని అనుకొని లేని కర్మను సంపాదించుకొని మరల మరల పుట్టింపబడుచున్నాడు. మేము ఇంతగా పునర్జన్మలున్నాయని చెప్పినా నమ్మనివారు ఉండవచ్చును. అందుకని ముస్లీమ్ కుటుంబములో చనిపోయి తిరిగి ముస్లీమ్ కుటుంబములోనే పుట్టిన ఒక వ్యక్తి యొక్క వాస్తవ సంఘటనను చూద్దాము. ఇంతకుముందు చెప్పినది ఒక ముస్లీమ్ స్త్రీ అయిన హాసన్ యొక్క పునర్జన్మ. ఇపుడు ఒక ముస్లీమ్ అయిన పురుషుని జన్మను గురించి చెప్పుచున్నాము. ఇది కూడా లెబనాన్ దేశములో జరిగినదే.

1943లో లెబనాన్ దేశమందు "ఫర్‌మట్‌ట" అనే నగరములో రషీద్ ఖాదీజ్ అను వ్యక్తి జన్మించాడు. అతను ఆటోమొబైల్ మెకానిక్‌గా జీవించే వాడు. అతనికి 25 సంవత్సరముల వయస్సులో ఒకనాడు ఇబ్రహీమ్ అనే స్నేహితుడు రషీద్‌ను కారులో షికారుకు తీసుకెళ్ళాడు. ఇబ్రహీమ్ సముద్రప్రాంతములో కారును వేగముగా నడుపుచుండగా, మిలటరీ బీచ్ అనే స్థలములో కారు అదుపుతప్పి ప్రమాదానికి గురియైనది. అప్పుడు రషీద్ కారులోనుండి బయటకు పడిపోయాడు. అలా పడినపుడు తలకు బలమైన గాయము కాగా రషీద్ అక్కడికక్కడే మరణించాడు. రషీద్ మరణించిన తర్వాత ఒక సంవత్సరమునకు "డానియల్‌జర్దీ" అనునతడు జన్మించాడు. డానియల్ జర్దీకి మాటలు వచ్చినపుడు పలికిన తొలిమాట

ఇబ్రహీమ్. ప్రమాదము జరిగిన దినమున కారునడిపిన తన స్నేహితుని పేరు ఇబ్రహీమ్. డానియల్ జర్దీ అలా అనడము ఎవరికీ అర్థము కాలేదు. ఇబ్రహీమ్ అని ఎందుకు అన్నాడో తెలియలేదు. తర్వాత రెండేళ్ళ వయస్సులో డానియల్ జర్దీ, తనతల్లి "లతీషా" తో నేను ఇంటికెళ్ళాలి అని అన్నాడు. తర్వాత ఆరు నెలలకు, అనగా రెండున్నర సంవత్సరమునకు ఇది నా ఇల్లు కాదు, నువ్వు నా తల్లీకాదు. నాకు నాన్న లేడు, నా తండ్రి మరణించాడు అని కొన్ని మాటలు మాట్లాడాడు. అప్పటి తన తండ్రి అయిన యూసఫ్‌ని నాన్న అని పిలువకుండా యూసఫ్ అని పేరుతో పిలిచేవాడు. అంతేగాక తన తండ్రి "నయీమ్" అని చెప్పేవాడు. నయీమ్ అనేది రషీద్ తండ్రి యొక్క పేరు.

డానియల్ జర్దీకి రెండున్నర సంవత్సరముల వయస్సులోనే అతని కుటుంబమంతా పిక్నిక్‌కు వెళ్ళగా వారితోపాటు జర్దీ కూడా పోయాడు. అప్పుడు వారి బంధువులలో ఒకరు పర్‌మట్‌టా అను పేరును తప్పుగా ఉచ్చరించగా, జర్దీ సరిచేసి చెప్పాడు. అప్పుడు జర్దీ తండ్రి అయిన యూసఫ్ ఈ పేరు నీకెలా తెలుసు అని అడుగగా! ఈ నగరము పేరు నాకు బాగా తెలుసు, ఇది నేను నివసించిన నగరమే అని చెప్పాడు. డానియల్ జర్దీ చెప్పిన మాటలు అతని కుటుంబము వారికి ఏమీ అర్థము కాలేదు. తర్వాత కొంత కాలమునకు డానియల్ జర్దీ, తన తల్లీ కారులో ప్రయాణిస్తుండగా, వారి కారు మిలటరీ బీచ్ దగ్గరికి వచ్చేటప్పటికి ఆ ప్రదేశాన్ని చూచిన డానియల్ కళ్ళు మూసుకొని, చేతులతో ముఖాన్ని దాచుకొని ఏడ్వను మొదలు పెట్టాడు. తర్వాత "నేను మరణించింది ఇక్కడే" అని గట్టిగా అరిచాడు. అంతేకాక గతజన్మలో తాను కారు మెకానిక్‌ననీ, తన స్నేహితుడు ఇబ్రహీమ్ కారు నడుపుతుండగా కారు అదుపు తప్పిందనీ, అపుడు బయటపడిన తాను తలకు గాయమై మరణించానని చెప్పాడు.

స్కూల్లో డానియల్ జర్దీ నర్సరీ చదువుచున్న రోజుల్లో తనపేరు డానియల్ జర్దీ కాదనీ, రషీద్ ఖాదీజ్ అని చెప్పాడు. అదే స్కూల్లోనే మరొక సందర్భములో యుక్తవయస్సులోనున్న అందమైన లేడీటీచర్‌ను చిన్నగా గిల్లి నువ్వు చాలా అందంగా ఉన్నావని చెప్పాడట. ఆ విధముగా మాటలలోనూ, చేతలలోనూ కొన్ని సందర్భములలో విచిత్రముగా కనిపిస్తున్న డానియల్, చెప్పేది ఎంతమటుకు నిజమోనని తెలుసుకొనుటకు అతని తండ్రి యూసఫ్, పర్‌మట్‌టాకు వెళ్ళి డానియల్ వర్ణించిన విధముగా కారు మెకానిక్‌ను గురించి, మిలటరీ బీచ్‌వద్ద ఆక్సిడెంట్‌ను గురించి విచారించగా డానియల్ చెప్పినదంతా నిజమని తెలిసింది. ఈ విషయమును తెలుసు కొనిన రషీద్ ఖాదీజ్ యొక్క బంధువులూ, మిత్రులూ డానియల్‌ను చూచే దానికి బయలుదేరి పోయారు. అలా పోయిన వారిని చూచిన డానియల్ రషీద్ చెల్లెలు నజ్లాను వెంటనే గుర్తించి ఆమెను పేరుతోనే పిలిచాడు. మొదట తన బంధువులనందరినీ చూడగానే డానియల్ తన తల్లి లతీషాతో వారందరికీ అరటి పళ్ళు తెచ్చి ఇమ్మని చెప్పాడు. గత జన్మలో రషీద్‌కు అరటి పళ్ళంటే చాలా ఇష్టము. రషీద్ మరణము తర్వాత రషీద్ గుర్తుకు రాకుండ ఉండడానికి రషీద్ తల్లి అతని చెల్లి ఇద్దరు అరటి పళ్ళు తినడము మానేశారు. తర్వాత డానియల్ పర్‌మట్‌టకు వెళ్ళగానే తన స్నేహితుడైన ఇబ్రహీమ్‌ను మరియొక స్నేహితుడైన బజాజ్‌ను గుర్తించి మాట్లాడాడు.

రషీద్ కుటుంబము వారంతా రషీద్ తిరిగి డానియల్ జర్దీగా పుట్టాడని అంగీకరించారు. రషీద్ కుటుంబము డానియల్ ఫోటోను తమ ఇంటిలో ఉంచుకొన్నారు. రషీద్ తన రెండవ జన్మలో కూడా కారు నడపాలంటే భయపడేవాడు. ఈ విధముగా కారు నడపాలంటే వచ్చు భయముగానీ,

వెనుకటి జన్మ జ్ఞాపకముగానీ డానియల్ తెచ్చుకొంటే వచ్చినవి కావు. డానియల్‌కు ఏమాత్రము సంబంధము లేకుండా అతని శరీరములోనున్న ఆత్మ చేసిన మూడవ పనిగా మనము గుర్తించవచ్చును. మనిషి చనిపోతే మళ్ళీ జన్మిస్తాడని మనుషులకు తెలియజేయుటకు ఆత్మ చేసిన పనిగా మనము చెప్పుకోవచ్చును. ప్రతి మనిషిలో జీవాత్మకు తోడుగా ఆత్మ నివసిస్తూ ఎక్కడో ఒకచోట ఈ విధమైన జ్ఞాపకమును తెప్పించిన సంఘటనలే పునర్జన్మ వృత్తాంతములు. పునర్జన్మలు లేవు అను వారి వాదన అబద్ధమనీ, ఉన్నాయనడము శాస్త్రబద్ధమనీ ఆత్మ తెలిపిన ఇటువంటి సంఘటనల వలన తెలియుచున్నది. ముస్లీమ్ దేశములో ముస్లీమ్ కుటుంబములో చనిపోయి తిరిగి అక్కడే ముస్లీమ్ కుటుంబములో పుట్టిన యదార్థసంఘటన చూచిన తర్వాత మనిషి చనిపోయి గోరీలలోనే పడుకొని ప్రళయము వరకు ఉండునని అనుకోవడము పెద్ద పొరపాటు. ఇక్కడ ఖుర్‌ఆన్ గ్రంథములో ప్రళయము అనుమాట వ్రాసినది నిజమే. అలాగే అంతిమ రోజు అని వ్రాసినది నిజమే. అంతమాత్రమున ప్రళయము ఎప్పుడో వస్తుందని అనుకోవడము పొరపాటగును. శరీరము ఎప్పుడు చనిపోతే ఆ శరీరమునకు అదే ప్రళయమగును. అట్లే ఆ శరీరములోని జీవునికి చనిపోయిన దినమే అంతిమదినమగును. ఈ విధముగా అర్థము చేసుకోక ప్రపంచము నాశనమయిపోవు దినము ప్రళయము అని అనుకొంటే అటువంటి ప్రళయము వచ్చుటకు అవకాశమే లేదు. బయట ప్రపంచము ఎప్పటికీ నాశనము కాదు. ప్రళయము అనునది ఒక ప్రకృతితో తయారయిన శరీరమునకేగానీ బయటి ప్రపంచమునకు కాదు. అట్లే అంతిమ దినము జీవునకేగానీ ప్రపంచమునకు కాదు. చనిపోయిన వెంటనే జీవునికి జన్మ కలుగుచున్నది. కావున అంతిమ దినమున చనిపోయినవాడు లేపబడు తాడని ఖుర్‌ఆన్ గ్రంథములో చెప్పారని అర్థము చేసుకోవలెను.

ఖుర్ఆన్ గ్రంథములో తప్పుగా అర్థము చేసుకొను వాక్యములు ఎన్నో గలవు. ఆ వాక్యములను అర్థము చేసుకోవాలంటే ఎంతో విచక్షణా బుద్ధి, శాస్త్రీయదృక్పథము అవసరము. ఆ రెండూ లేనివారు వాక్యములను తప్పుగా అర్థముచేసుకొను అవకాశము గలదు. ఖుర్ఆన్ అంతిమ దైవగ్రంథమగుట వలన అందులోని కొన్ని వాక్యములు శాస్త్రవేత్తలకు కూడా అర్థముగాని సైన్సుతో నిండియుండును. శాస్త్రవేత్తలు వంద సంవత్సరములు పరిశోధన చేసి కనుగొను విషయములు ఖుర్ఆన్‌లో ముందే చెప్పబడియున్నవి. అటువంటి వాటిలో సూరా 6, ఆయత్ 95 వాక్యము ఒకటి కలదు. ఈ వాక్యములోని అసలయిన సమాచారమును బయటికి తీసి చెప్పుటకు భౌతిక శాస్త్రవేత్తలకు వేయి సంవత్సరముల కాలము పట్టవచ్చును. ఈ వాక్యము చూచేదానికి చిన్నగాయుండినా అర్థము అగమ్యగోచరముగాయుండును. చాలామంది ముస్లీమ్‌లు ఈ వాక్యమునకు పూర్తిగా తప్పు అర్థమును చెప్పుకోవడము జరిగినది. ఇటువంటి వాక్యములు ఖుర్ఆన్ గ్రంథములో తలమాణిక్యములాంటివి. ఇటువంటి తలమాణిక్యములాంటి వాక్యములు అంతిమ దైవగ్రంథములో ఎన్నోగలవు. అటువంటి గొప్ప వాక్యములన్నిటికీ సాధ్యమున్నంతవరకూ మేము వివరమును అందించాలని ప్రయత్నిస్తున్నాము. దానికొరకే ఈ గ్రంథమును వ్రాయను మొదలుపెట్టాము. దేవుడు మా ద్వారా గొప్పవాక్యములన్నిటికీ వివరమును అందిస్తాడని తలుస్తున్నాము. సూరా 6, 95వ వాక్యము ఏమిటో ఇప్పుడు చూస్తాము.

**(6-95) "నిస్సందేహముగా విత్తనాన్ని, టెంకను చీల్చేవాడు దేవుడే. ఆయన జీవమున్న దానిని జీవము లేనిదానిలో నుంచి తీస్తాడు. జీవము లేనిదానిని జీవమున్న దానిలోనుంచి తీసేవాడు ఆయనే (దేవుడే). ఆయనే నిజమైన దేవుడు. మరి అలాంటప్పుడు మీరు**

**సత్యమునుండి ఎటు మరలి పోతున్నారు."** ఇదే విషయమునే ఖుర్ఆన్ గ్రంథములోనే మరొక చోట కూడా ఇలా చెప్పడము జరిగినది. సూరా 3, ఆయత్ 27లో ఇలా చెప్పారు చూడండి. **(3-27) "నువ్వే రాత్రిని పగలులోనికి ప్రవేశింప జేస్తావ్వు. పగలుని రాత్రిలోనికి తీసుకెళతావ్వు. నువ్వే నిర్జీవమైన వాటినుంచి జీవమున్న వాటిని తీస్తున్నావ్వు. మరి నువ్వే జీవమున్న వాటినుంచి నిర్జీవమైన వాటిని వెలికితీస్తున్నావ్వు. ఇంకా నీవ్వు కోరిన వారికి లెక్కలేనంత ఉపాధిని ఇస్తున్నావ్వు."** ఇదే విషయమునే సూరా 30, ఆయత్ 19లో ఇలా చెప్పడము జరిగినది చూడండి. **(30-19) "ఆయనే సజీవిని నిర్జీవినుంచి, నిర్జీవిని సజీవినుంచి వెలికి తీస్తాడు. ఆయనే భూమి మృతి చెందిన తర్వాత దానికి ప్రాణముపోస్తాడు. మీరు కూడా అలాగే తీయబడుతారు."** ఈ మూడు వాక్యములలో చెప్పిన సారాంశము ఒక్కటిగానే యున్నదిగానీ, దీని వివరము మాత్రము చాలా గొప్ప రహస్యముగాయున్నది. ఖుర్ఆన్ గ్రంథము తనకంటే ముందు వచ్చిన తౌరాతు గ్రంథమును ధృవీకరించుటకే వచ్చినదని సూరా 5, ఆయత్ 44లో చెప్పారు చూడండి. **(5-44) "మేము తౌరాతు గ్రంథమును (భగవద్గీతా గ్రంథమును) అవతరింపజేశాము. అందులో మార్గదర్శకము, జ్యోతి ఉన్నవి. తౌరాతు ఆధారముగానే ముస్లీమ్‌లయిన ప్రవక్తలు, రబ్బానీలు, ధర్మవేత్తలు, యూదులు తమ సమస్యలను పరిష్కరించేవారు"** అని కలదు. అందువలన ఇప్పుడు అర్థముకాని ఈ వాక్యము వివరమును తెలియుటకు తౌరాతు గ్రంథమునే ఆధారము చేసుకొని చూస్తాము. అట్లుచూడగా భగవద్గీతలో సాంఖ్య యోగమున 22వ శ్లోకములో ఈ వాక్యములకు ఆధారము దొరుకుచున్నది.

ఇక్కడ చెప్పబోవు జనన వివరము భగవద్గీతలో సాంఖ్యయోగమున "వాసాంసి జీర్ణాణి యథా విహాయ నవాని గృహ్ణాతి నరోప రాణి, తథా శరీరాణి విహాయ జీర్ణాన్యన్యాని సంయాతి నవాని దేహీ" అను శ్లోకమును ఆధారము చేసుకొని చెప్పినది. భగవంతుడు చెప్పిన విషయములో అసత్యముండదని తెలిసినవారు ఆయన మాటను అనుసరించి చెప్పిన జనన వివరమును అర్థము చేసుకోగలరనుకుంటాను. కేవలము విమర్శనా దృష్టితోనేకాక, అవగాహనా దృష్టితో చూచువారికి భగవంతుని శ్లోకమునకు పూర్తి వివరము కూడా తెలియగలదు.

**వివరము :-** భగవంతుడు ఈ శ్లోకమున చెప్పిన భావము నూటికి నూరు పాళ్ళు చాలామందికి అర్థముకాలేదని మేము తెలుపుచున్నాము. ఎందుకనగా ఈ శ్లోక భావమునకు వ్యతిరేఖ వివరము తమకు తెలియకుండానే వారియందు నిలిచిపోయినది. భగవంతుడు ఈ శ్లోకమున ఉదాహరణగా పాతవస్త్రము, క్రొత్తవస్త్రమని చెప్పి పాతదేహము, క్రొత్తదేహమని కూడా వివరించాడు. కానీ ఇక్కడ క్రొత్తదేహమంటే ఏమిటో తెలియక చాలామంది పై శోక్ల భావమునే హత్య చేశారని చెప్పవచ్చును. విచక్షణ, వివరణా చూపులేని వారందరూ గీతలో క్రొత్త దేహమన్నప్పుడు తలూపారు. మరికొన్ని పుస్తకములలో గర్భమందే పూర్తి తయారుకాని, అసంపూర్ణ శరీరములో జీవుడు ఆరునెలలకే ప్రవేశించునన్నప్పుడు కూడా తలూపారు. అట్లే పాత గృహము వదలి క్రొత్త గృహములో ప్రవేశించుచున్నాడన్నపుడూ తలూపారు. ఆ క్రొత్తగృహమునకు పై కప్పుబడకనే తలుపులుంచకనే సగము కూడా తయారుకాని దానిలోనికి ప్రవేశించుచున్నాడన్నప్పుడు కూడా తలూపారు. క్రొత్త ఇల్లంటే పూర్తి తయారైనది కదా!యని, క్రొత్త శరీరమంటే పూర్తి రూపురేఖలు దిద్దుకొన్నది కదా!యని, యోచించలేక పోయారు. ఎవరెట్లను

కొనినా భగవంతుడు చెప్పుమాట ఏమంటే! పాతశరీరమును వదలిన ఆత్మ, పూర్తి తయారైన క్రొత్తదనిపించుకొనిన శరీరములో చేరుచున్నదని తెల్పుచున్నాడు. జీవాత్మ ఎచటగలదో ఆత్మకూడా దానితో కూడియున్నది. కావున జీవాత్మ జన్మించితే దానితోపాటు ఆత్మకూడా మరుజన్మమున ప్రవేశిస్తున్నది. జీవాత్మ ఎలా శరీరములు మారుచున్నదో తెలిస్తే, ఆత్మ కూడా క్రొత్తదేహమునెలా చేరుచున్నది తెలియును. కావున దానికి కావలసిన పూర్తి సవివరము ఆధ్యాత్మికరీత్యా, విజ్ఞానరీత్యా (సైన్సురీత్యా) మరియు సిద్ధాంతరీత్యా క్రింద వ్రాయుచున్నాము చూడండి.

స్త్రీ పురుష సంయోగములో పురుషుని వీర్యము స్త్రీయోని మార్గమున ప్రవేశించి గర్భకోశమును చేరి, అందు శరీరముగా తయారగుటకు ప్రారంభ మగుచున్నది. పురుషుని వీర్యము స్త్రీ గర్భములో పూర్తి శరీరముగా తయారగుటకు దాదాపు తొమ్మిది నెలల కాలము పట్టుచుండును. స్త్రీ గర్భములో 'మావి' అను తిత్తియందు పూర్తిగా తయారైన శిశుశరీరము జీవము లేనిది. చాలామందికి తెలియని విషయము కూడా ఇదియే. ఆరవ నెలయందు శిశుశరీరమునకు ప్రాణము వచ్చునని చాలామంది పొరబడుచున్నారు. **తల్లిగర్భములోనున్న శిశువునకు ప్రాణము రావడము అబద్ధము. గర్భమున పూర్వజన్మ జ్ఞప్తి కలిగి వాపోవుట పూర్తి అబద్ధము.** ఇక్కడ కొందరికొక పెద్ద సంశయమేర్పడవచ్చును. అది ఏమనగా! శిశు శరీరములోనికి ప్రాణము రాకపోయినచో, గర్భములోని శిశువు కదులుచుండునటుల తెలియుచున్నది కదా! అది ఎట్లు జరుగును? ఒకవేళ ఆరవనెలయందు ప్రాణము రాకపోయినట్లయితే, శిశువు గర్భములో కదలకుండును కదా! ఆరవ నెలనుండియే కదలిక జరుగుచున్నది. కావున శిశుశరీరమునకు ప్రాణము గర్భములోనే వచ్చినట్లు మేము నమ్ముచున్నామని

అడుగవచ్చును. దానికి మా సమాధానము తెలిపెదము. దూరమునుండి చూచి చింతచెట్టులాగాయున్న జమ్మిచెట్టును చింతచెట్టనుకొన్నట్లు, గర్భములో శిశువు కదలికకు కారణము తెలియని మనము గర్భములోనే శిశువుకు ప్రాణమొస్తుందనడములో విశేషమేమున్నది. దగ్గరకుపోయి చూచిన కదా! చింతచెట్టులాగాయున్న జమ్మిచెట్టు, చింతచెట్టుకాదని తెలిసేది. నిజముగా గర్భములో జరుగుచున్న మార్పులను గమనించిన కదా! మనకున్న సంశయము తీరునది. కావున గర్భములో శిశుశరీరము పొందు మార్పులను గురించి తెలుసుకొందాము.

స్త్రీ గర్భము ధరించిన మొదటి నెలనుండి దాదాపు ఆరునెలల వరకు శిశుశరీరము తయారై ఆకృతిని చేరుకొనును. ఆరునెలల వరకు శిశుశరీరము తయారగునట్లు తల్లిశరీరములోని నాడులే చేయుచున్నవి. తల్లి శరీరములోని బ్రహ్మనాడి నుండి బయలుదేరిన కొన్ని నరములు గర్భ కోశమును ఆక్రమించి, శిశుశరీరముతో బొడ్డు ద్వారా సంబంధము కలిగి, ఆ శరీరమును పెరుగునట్లు చేయుచున్నవి. తల్లి శరీరములో భాగములుగా జీర్ణాశయము, గుండె, కాలేయము మొదలగు అవయవములున్నట్లే, గర్భమును కూడ ఒక భాగముగా లెక్కించుకోవలయును. జీర్ణాశయము, గుండె మొదలగు అవయవములను నాడులు ఆక్రమించి ఏ విధముగా కదలించుచున్నవో, ఆ విధముగానే ఆరునెలల తరువాత గర్భములోని శిశువును కూడా అప్పుడప్పుడు నాడులు కదలించుచుండును. కుమ్మరివాడు కుండను ఒక ఆకృతి వచ్చువరకు ఒకే స్థితిలో తయారుచేసి, ఒక ఆకృతి ఏర్పడిన తరువాత కుండను త్రిప్పిత్రిప్పి కొట్టి పూర్తి కుండగా ఎట్లు తయారు చేయునో, అట్లే ఆత్మ బ్రహ్మనాడి ద్వారా ఆరునెలల వరకు శిశుశరీరమును ఒక ఆకృతి వచ్చునట్లు చేసి, ఆ తరువాత ఆ శరీరమును తలక్రిందులుగను,

అడ్డముగను మరియు ఇతర స్థితులుగా మావియందు అప్పుడప్పుడు త్రిప్పుచూ, పూర్తి ఆకృతి వచ్చి జీవుడు చేరుటకు తగినరీతిగా శరీరమును తయారుచేయును. నాడులు కదిలించు కదలికనుబట్టి కొందరు గర్భములో ఆరవనెలయందే శిశుశరీరమునకు ప్రాణము వచ్చినదని భ్రమించుచున్నారు.

తల్లిగర్భములో నాడులు శిశుశరీరముతో సంబంధము కల్గియుండి, తొమ్మిదినెలల పర్యంతము జీవునికి నివాసయోగ్యముగా శరీరమును తయారగునట్లు చేసి, పూర్తిశరీరము తయారైన వెంటనే ఒక్కక్షణము కూడా గర్భములో శిశువు శరీరమును ఉంచక, గర్భకోశమును ముకుళింప జేసి, యోని ద్వారము వికసింపజేసి, శిశుశరీరమును బయటికి త్రోసి వేయుచున్నవి. శిశుశరీరము బయటపడుదాకా తల్లిగర్భములోని నాడులు శిశుశరీర సంబంధము కల్గియుండును. ఎప్పుడైతే గర్భమునుండి శిశు శరీరము బయటకువచ్చునో, అప్పుడే గర్భములోని నాడుల సంబంధములు నిలిచిపోవుచున్నవి. గర్భమునుండి బయటపడు శిశుశరీరము శవమువలె బయటపడును. శిశుశరీరము బయటపడు వరకు ప్రాణముండదు. కావున దానిని శవములాగానే చెప్పుకోవలయును. ఇప్పుడు కొందరు ***"గర్భములోని శిశువుకు ప్రాణము లేకపోతే అది కుళ్ళి తల్లి ప్రాణమునకే హాని కల్గించును కదా! ఆరునెలల తరువాత ఎప్పుడైతే గర్భములో పిండము కదలక నిలిచిపోవునో అప్పుడే తల్లికి అపాయము సంభవించుచున్నది కదా! పిండము కదలిక ఎప్పుడైతే నిలిచిపోయి తల్లికి బాధ కల్గుచున్నదో, అప్పుడు వైద్యశాలకు తీసుకుపోతే అక్కడ వైద్యుడు ఈమెకు పిండము లోపలనే చనిపోయినదని చెప్పి, ఆలస్యము చేసినచో ప్రమాదమని ఆపరేషన్ (శస్త్ర చికిత్స) చేసి పిండమును బయటికి తీసివేయడము కూడా జరుగుచున్నది కదా! ఏమీ తెలియని మొరటువారు కూడా పిండము కదలికతో శిశువుకు ప్రాణము***

***వచ్చినదని పిండము యొక్క కదలిక నిలిచి పోయిన వెంటనే శిశువుకు ప్రాణము పోయినదని తెలుసుకొనుచున్నారే! మీ మాట ఎట్లు నమ్మదగును? అంతేకాక పిండములో ప్రాణము లేకపోయిన వెంటనే తల్లికి ప్రమాదము జరుగుట కూడా తెలిసిన విషయమే. ఈ విధముగా ప్రత్యక్షముగా తెలియుచుండుట వలన గర్భములోనే శిశువుకు ప్రాణమొస్తుందని మేము నమ్ముచున్నాము"*** అని అడుగవచ్చును. దానికి మా సమాధానము ఏమనగా!

గర్భములో ఆరవ నెలయందు కదలిక వచ్చుమాట నిజమే. ఆ కదలిక నిలిచిపోయిన వెంటనే తల్లికి ప్రమాదము సంభవించు మాట కూడా నిజమే. కానీ అంతమాత్రమున శిశువుకు ప్రాణమొచ్చినదనీ, పోయినదనీ అనుకోవడము చాలా పొరపాటు. ఆరవనెలలో ప్రాణము వచ్చినదనిన, అంతవరకు ప్రాణములేదనియే కదా! అర్థము, ప్రాణములేని సమయములో తల్లికి ప్రమాదము సంభవించవచ్చును కదా! నిజము తెలియక అందరూ అక్కడే పొరపాటుపడుచున్నారు. వాస్తవ విషయము ఏమనగా! మన శరీరములో కొన్ని అవయవములున్ననూ మనకు ఏ హాని కలుగకుండునట్లు గర్భస్థ శిశువు తల్లిశరీరములో ఒక భాగముగా ఉండి, తల్లికి ఏ హాని కలిగించకుండా ఉండును. తల్లి శరీరములోని నాడులే శిశుశరీరమును కూడా ఆక్రమించి ఆ శరీరమును పెంచుచున్నవి. అందువలన శిశు శరీరము తల్లి శరీరములో ఒక భాగముగా ఉన్నదని చెప్పవచ్చును. ఆరవ నెలనుండి నరముల వలన పిండము కదిలినను తల్లికి ఏ విధమైన బాధయుండదు. ఈ విధముగా ఉండి తొమ్మిదవ నెలయందు శిశుశరీరము పూర్తిగా తయారైన వెంటనే నరముల ఒత్తిడి వలన తల్లి ప్రసవించుచున్నది. ఈ విధముగాకాక ఎవరికైన శరీరములో ఆరోగ్యలోపము వలన ఆరవ నెలకంటే ముందు బ్రహ్మనాడి నుండి బయలుదేరిన నరముల సంబంధము

గర్భకోశముతో తెగిపోయిన ఆ గర్భము తల్లి శరీరములో వేరు పదార్థమై అక్కడ నిలువకుండా స్రవించిపోవును. దీనినే **"గర్భస్రావము"** అని అందురు. ఇది చాలామంది స్త్రీలకు ఆరునెలల లోపల జరుగుచుండును. ఆరునెలల లోపల శిశు శరీరము ఒక స్థాయికి వచ్చియుండదు. కాబట్టి రక్తముగానో, రక్తపుముద్దగానో బయటికి పోవును. రక్తముగాను, మెత్తని రక్తపుముద్దగాను ఉండుట వలన బయటికి పోవుటకు అనుకూలముగా ఉండును. ఒకటి రెండునెలల గర్భస్రావము ఎక్కువ బాధను కలిగించదు. నెలలు ఎక్కువ అయినకొద్దీ గర్భస్రావములో బాధ ఎక్కువగును.

ఆరవనెల తరువాత పిండము ఒక ఆకృతి ధరించి స్రవించుటకు వీలుకాక ఉండును. తల్లి అనారోగ్యము వలన ఆరవనెల తరువాత గర్భ కోశములో నాడులు గర్భముతో సంబంధము లేకుండా పోయిన ఎడల, ఆ గర్భము స్రవించుటకు వీలులేనందువలన, ఆ గర్భస్థ శిశుశరీరమునకు తల్లి శరీరముతో సంబంధములేక వేరుపదార్థముగా అక్కడనే నిలిచిపోవును. నరములఒత్తిడి గర్భకోశము మీద లేనందువలన శిశుశరీరము ఇతర పదార్థముగా గర్భకోశములోనే నిలిచిపోయి కుళ్ళుటకు మొదలుపెట్టును. శిశుశరీరము ఉబ్బుకొలది దానిని ఆనుకొని ఉండు అవయవములకు ఒత్తిడి ఏర్పడును. ఆ స్థితిలో ఉబ్బుకచున్న శిశుశరీర ఒత్తిడికి మిగిలిన సున్నితమైన అవయవములు ఒకదానికొకటి ఒత్తిడి కలుగజేసుకుంటూపోయి చివరకు గుండెకు ఒత్తిడి కల్గించును. గుండెకు కొద్దిమాత్రము ఒత్తిడి తగిలిన వెంటనే నిలిచిపోవు ప్రమాదము కలదు. అదృష్టవశాత్తూ వెంటనే వైద్యుల దగ్గరకు పోయి చెడిపోవుచున్న శిశుశరీరమును బయటకు తీసివేసినట్లయితే తల్లి బ్రతుకుటకు వీలుకల్గును. ఈ విషయమిట్లుండగా మనము వేరువేరు విధములుగా పోల్చుకొని గర్భములోనే ప్రాణమువచ్చినది, పోయినది అనుకొనుట జరుగుచున్నది.

తల్లి ఆరోగ్యము సరిగా ఉండి పూర్తిగా తయారైన శిశుశరీరము తొమ్మిది నెలలకు గర్భకోశములోని నరముల ఒత్తిడి వలన బయటపడు చున్నది. ఒక తానులోని వస్త్రము దర్జీవాని వలన కుట్టబడి ఒకవ్యక్తి ధరించుటకెట్లు యోగ్యమైయున్నదో, అట్లే గర్భకోశము నుండి బయటపడు శరీరము కూడా జీవుడు నివాసము చేయుటకు అనుకూలముగా నరముల చైతన్యము చేత తయారు చేయబడి బయటికి వచ్చుచున్నది. ఆ విధముగా బయటికి వచ్చిన శరీరమునందు జీవుడు ప్రవేశించుచున్నాడు. చనిపోయిన వెంటనే జీవుడు ఏమాత్రము ఆలస్యములేక బయటికొచ్చిన క్రొత్త శరీరమును ధరించుచున్నాడు. దీనినే గీతాశాస్త్రములో **"పాతవస్త్రమును విడిచి క్రొత్త వస్త్రమును ధరించునట్లు, జీవుడు నాశనమైన పాతశరీరమును వదలి క్రొత్త శరీరమును ధరించుచున్నాడు"** అని పరమాత్మ అన్నాడు. జీవుడు క్రొత్త శరీరమును ధరించుట వాని కర్మానుసారముగా ఉండును. జీవుడు చేసుకొన్న పాపపుణ్యములను అనుసరించియే క్రొత్త శరీరము కూడా లభ్యమగును. ఒక తల్లిగర్భము నుండి బయటపడిన శిశుశరీరమును ధరించుటకు తగిన జీవుడు వేరొక శరీరమునుండి వచ్చి ప్రసవింపబడిన శిశుశరీరములో ప్రవేశించు చుండును. తల్లిగర్భమునుండి బయటపడు శరీరముయొక్క తల బయటికి వచ్చినంత మాత్రముననే ఆ శరీరములో జీవుడు ప్రవేశించుటకు అవకాశము కలిగియుండును. అందువలన కొద్దిమాత్రము బయటికి వచ్చిన శరీరముకూడా ప్రాణము కలిగి అరుచుటకు మొదలుపెట్టును. కొన్నిచోట్ల ఒక నిమిషము మొదలుకొని గంట, రెండుగంటల వరకు శిశుశరీరములోనికి ప్రాణమురాకుండుట సంభవించు చున్నది. దానికి కారణము ఆ శరీరములో ప్రవేశించు జీవుడు పాత శరీరమును వదలడములో ఆలస్యమై ఉండవచ్చును. అనగా ఆ శరీరములో

ప్రవేశించు జీవుడు వేరొకచోట మరణించుట ఆలస్యమైనదన్నమాట. అందువలన ఇక్కడ కూడా శిశుశరీరము బయటికి వచ్చిన తరువాత ఆలస్యముగానే జీవుని ప్రవేశము జరుగుచున్నది. కొన్నిచోట్ల శిశుశరీరము బయటికి వచ్చిన తరువాత ప్రాణము వచ్చుటకు కొన్ని గంటల కాలము జరిగిన సందర్భములు కూడా కలవు.

ప్రసవింపబడిన శరీరములోనికి జీవుడు ఆలస్యముగా ఎందుకు చేరుచున్నాడని తెలియని గ్రామీణప్రాంత మంత్రసానులు, మావియందు ప్రాణమున్నదని మావిమీద నీళ్ళుపోసి తట్టుచుందురు. తెలియనితనముతో ఇక్కడ మంత్రసానులు మావిని నీటితో తట్టుచుండగా, జీవుడు వేరొక చోటునుండి వచ్చి శరీరములోనికి ప్రవేశించుచున్నాడు. జీవుడు ప్రవేశించి నపుడే శ్వాస శరీరములోనికి ప్రవేశించుచున్నది. అందువలన మొదటి శ్వాసతో జన్మ కలుగుచున్నదని చెప్పవచ్చును. శిశుశరీరములో జీవుడు ప్రవేశించగానే అరుచుటకు మొదలుపెట్టును. అప్పుడు మంత్రసానులు మావిలోని ప్రాణము శిశువులోనికి వచ్చినదని బొడ్డు కోయుదురు. ప్రాణము రాకముందు బొడ్డును కోసిన, మావిలోని ప్రాణము శరీరములోనికి రాలేదని వారి నమ్మిక. అందువలన ప్రాణము రాకముందు బొడ్డు కోయరు. ప్రాణము రాకముందు బొడ్డు కోసిన ఎడల, ఆ శిశుశరీరములోనికి ప్రాణము రాకపోవు మాట నిజమే. మావినుండి ప్రాణము వస్తుందనడము మాత్రము అబద్ధము.

బొడ్డు కోసిన తరువాత ప్రాణము రాకుండాపోవుటకు కారణ మేమనిన, క్రొత్తగా మొలకెత్తు చింత మొలకకు, విత్తనపు బేడలు ఏ విధముగా ఆహారబలము ఇస్తున్నవో, ఆ విధముగానే క్రొత్తగా బయటపడిన శరీరమునకు, జీవుడు ప్రవేశించువరకు మావి ఆధారమై శిశుశరీరములోని

రక్తము గడ్డకట్టకుండునట్లు చేయుచున్నది. ఆ విధముగా కొంతసేపు మాత్రము చేయగలదు. జీవుడు ప్రవేశించిన వెంటనే శ్వాస, రక్తప్రసరణము జరుగుచున్నవి. కావున మావితో అవసరములేదు. అందువలన బొడ్డు త్రాడును కోసివేసి, మావిని వేరు చేయుచున్నాము. జీవుడు శరీరములో ప్రవేశించకముందే బొడ్డును కోసిన, రక్తము చల్లారి శరీరములో గడ్డకట్టుకు పోయి జీవుడు ప్రవేశించుటకు శ్వాసజరుగుటకు అయోగ్యమగును. అందువలన ముందే బొడ్డుకోయు పద్ధతి మంచిది కాదు. ఒకవేళ తెలియని వారు ముందే బొడ్డుకోసిన ఆ శరీరములోని రక్తము చల్లారక ముందే ఒక నిమిషము లోపల జీవుడు వచ్చి చేరినా చేరవచ్చును. ఆ నిమిషములోనే వచ్చి చేరలేకపోతే ఆ శరీరములో రక్తము గడ్డకట్టి పనికిరానిదై పోవును. అందువలన తెలిసినవారుకానీ, తెలియనివారుకానీ, ప్రాణము రాకముందే బొడ్డుకోయరాదు. బొడ్డు ముందు కోయని కారణమున మావినుండే ప్రాణమొస్తున్నదని చాలామందికి నమ్మికయున్నది. ఆ నమ్మికయున్న మంత్రసానుల మాటవిని **"ఏమమ్మా! మీరు ఆరవనెలలో శిశువుకు ప్రాణమొచ్చినదని అంటుంటారే, అట్లయిన తల్లి ప్రసవించినపుడు శిశుశరీరములో ప్రాణ మొచ్చినది శిశువుకా? లేక మావికా? శిశువుకు ప్రాణమొచ్చియుంటే అది శిశువులో ఉండక మావిలోనికి ఎందుకు పోయినది? తిరిగి శరీరములోనికి ఎందుకు వస్తున్నది?"** అని అడిగితే వారు ఏమాత్రము సమాధానము చెప్పలేరు.

మనజన్మను గురించి మనమే తెలుసుకోలేని అజ్ఞాన అంధకారములో ఉండి చీకటిలోనున్న వస్తువును గురించి ఊహించి చెప్పినట్లు, తెలియని పుట్టుకను గురించి కొందరు ఆరవనెలయందు జీవుడు తల్లి గర్భములో ప్రవేశించి పూర్వ జన్మలను తలచుకొని బాధపడుననుట

ఎట్లున్నదో మీరే ఆలోచించండి. పూర్వ కాలములో పుట్టిన తరువాతనే ప్రాణమొస్తుందని విశ్వసించేవారు. ధర్మములన్నీ అధర్మములుగా మారిపోవునని పరమాత్మ చెప్పినట్లు, ఇప్పుడు ప్రాణము పుట్టకపూర్వమే ఉన్నదని అంటున్నారు. పూర్వము, పుట్టిన శరీరములోనికి ప్రాణమొచ్చినపుడు జీవునకు జన్మ కలిగినట్లు లెక్కించుకొని, ఆ లెక్క ద్వారా జాతకచక్రము గీచి చూచెడివారు. ఇప్పటికీ ఆ పద్ధతి ఉన్నది. జ్యోతిష్యశాస్త్ర ప్రకారము కూడా శరీరములో మొదట శ్వాస ఎప్పుడు ప్రవేశించుచున్నదో, అప్పుడే జన్మ అని గ్రహించెడివారు. ఈ కాల జ్యోతిష్యములో ప్రసవము జరిగిన సమయమునే జన్మగా లెక్కించుకొనుచున్నారు. నిజమైనజన్మ శ్వాస శరీరములో ప్రవేశించినపుడే అవుచున్నది. కాబట్టి లెక్కప్రకారము జ్యోతిష్యము చక్కగా తెలిసెడిది. ఇప్పుడు ప్రసవసమయమునే జన్మగా లెక్కించుకొనుచున్నారు. కావున భవిష్యత్తు చక్కగా తెలియకున్నది. ఆరవ నెలయందు జీవుడు క్రొత్త శరీరమును చేరియుండిన జ్యోతిష్యులు దానినే జన్మగా లెక్కించుకోవలయును కదా! అట్లుకాక ప్రసవించిన తరువాత లెక్కించుకొనుచున్నారంటే ధర్మము పూర్తి నాశనముకాక ఇంకనూ కొద్దిగ మిగిలి ఉన్నదని అర్థమగుచున్నది.

నేటి శరీర శాస్త్రజ్ఞులకు మరియు వైద్యులకు (డాక్టర్స్‌కు) ఈ విషయములో చాలా అనుమానములు ఉండవచ్చును. ఎందుకనగా! వారు చదివిన చదువులో పురుషుని శరీరములో తయారైన వీర్యమునందు వీర్య కణములకే ప్రాణమున్నట్లు తెలియబరుచబడియున్నది. అందువలన ఒక వైద్యుడు మా బోధ విన్న ఒక వ్యక్తితో కలిసి “ఆయన చెప్పునది పూర్తి శాస్త్ర

విరుద్ధము. శరీర శాస్త్రజ్ఞులుగాను, వైద్యులుగాను ఉన్న మాకంటే ఆయనకు ఎక్కువగా తెలిసియుండునా? ప్రసవించిన తరువాత శరీరానికి ప్రాణము రావడము పూర్తిగా అసత్యము. ఆరవనెలలో ప్రాణమొస్తుందని మిగతా వేదాంతులు చెప్పుమాట కూడ అసత్యమే. పురుష వీర్యములోనే వీర్య కణములు జీవము కలిగియున్నవి. జీవముగల వీర్యకణము స్త్రీ శరీరములో రజోకణముతో కలిసి శరీరముగా మార్పుచెంది, తొమ్మిది నెలల తరువాత జీవముతోనే తల్లిగర్భమునుండి బయటికి వస్తున్నది. జీవము లేకుండా వస్తున్నదనుమాట చాలాపొరపాటు. వీర్యములో వీర్యకణమునకు జీవమున్నట్లు మేము ఎన్నో నిదర్శనములు చూపగలము. ప్రాణముగల జంతుశరీరములో నుండి వీర్యమునుతీసి, కొంతకాలము బయట తగిన వాతావరణములో ఉంచి, అవసరమేర్పడినప్పుడు ఆ వీర్యమును స్త్రీ జంతువు యొక్క యోనిలో వదలి దానికి గర్భమేర్పరుచుచున్నాము" అని పలుకుచున్నారు. వీర్యమునకు ప్రాణమున్నదని ఆ వ్యక్తి పూర్తిగా నమ్ముటకు మిక్కిలి చల్లని వాతావరణములో అనగా $0^0$ నుండి $4^0$ సెల్సియస్ ఉష్ణోగ్రత ఉన్న ఒక ఫ్లాస్కునుండి టెస్టుట్యూబు మాదిరి ఉండిన ఒక గాజు గదిలో భద్రపరచి ఉన్న పశు వీర్యమును తీసి వెంటనే గాజు పలకమీద ఉంచి, మైక్రోస్కోపు (సూక్ష్మదర్శిని) నందు చూపినపుడు, ఒక చుక్క వీర్యములో తల తోక కలిగిన వీర్యకణములు అసంఖ్యాకములుగా ఉండి, అవి చలనము కలిగి తోకను కదలించుచూ ముందుకు ఈదుచున్నట్లు కనిపించుట వలన, ఆ వ్యక్తి చాలా ఆశ్చర్యపోయి వీర్యములోని వీర్యకణములకే ప్రాణమున్నదని పూర్తి విశ్వసించుచున్నాడు. వీర్యములోని వీర్యకణము యొక్క చిత్రమును తర్వాత పేజీపటములో చూడవచ్చును.




వీర్యములో వీర్యకణములు కదులుచుండుట చూచిన ఆ వ్యక్తి వీర్యమునకే జీవముండగా, ప్రసవింపబడిన తరువాత జీవమొస్తుందనడము అబద్ధమైయుండవచ్చునని భావించి, ఆయన మమ్ములను కలిసి "స్వామిగారు! జీవుడు జన్మపొందు విషయమై మీరు చెప్పిన బోధ విన్న నేను, ఒక పరిశోధనలో వీర్యమునకు ప్రాణమున్నట్లు చూచాను. వీర్యములో వీర్యకణములకు ముందే జీవముండగ ప్రసవింపబడిన తర్వాత జీవమొస్తుందన్న మీ మాట మాకు సంశయముగా ఉన్నది. ఒకవేళ ప్రసవానంతరము జీవమొచ్చునట్లు భావించిన వీర్యకణము కదలుట కళ్ళారా చూచాము కదా! అను సంశయమొకవైపు ఏర్పడుచున్నది. అందువలన మీరు చెప్పిన బోధ నిజమా? లేక వైద్యులు చెప్పి చూపించినది నిజమా? ఏది నిజము, ఏది అబద్ధము అను సందిగ్ధావస్థలో ఉన్నాను. దీని విషయమై మీరేమందురు?" అని ఆయన మమ్ములను ప్రశ్నించాడు.

ఇంతకుముందు ఆధ్యాత్మిక గ్రంథములలో ఆరునెలలకు జీవము వస్తుంది అన్న విషయము నిజముకాదనీ, ప్రసవింపబడిన తరువాత జీవమొస్తుందని మా సిద్ధాంతమును తెలియజేశాము. ఇప్పుడు వైద్యులు వీర్యమునకే జీవమున్నట్లు వారి ఉద్దేశ్యమును తెలియబరుచుచున్నారు. కావున వారి సంశయము తీరునట్లు క్రింద విజ్ఞానరూపముగా తెలుపుచున్నాము శ్రద్ధగా గ్రహించుము.

జీవుడు కనిపించువాడు కాదు. జ్ఞాననేత్రమునకు మాత్రము జీవుడు కనిపించగలడు. జ్ఞాననేత్రములేని వైద్యులు కదులుచున్న వీర్యకణములో జీవము ఉన్నట్లు భావించుకొనుచున్నారే కానీ జీవమును చూడలేదు. కదులుచున్నంత మాత్రముననే జీవమున్నట్లు ఎందుకు భావించుకో వలయును? కణమునకు కదలిక ఉండుట వలన జీవమున్నట్లు ఊహించితే, బస్సులు రైళ్ళు కదులుచున్నవి కదా! వాటికి జీవమున్నదా? మనుష్యులు లేకుండానే అంతరిక్షములో ప్రయాణించు రాకెట్లకు జీవమున్నదా? లేదు. కదులుచున్న యంత్రములకు జీవమెట్లు లేదో, ఆ విధముగానే కదులుచున్న వీర్యకణమునకు జీవములేదని చెప్పుచున్నాము. జీవము లేకుండిన వీర్య కణము ఎందుకు కదులుచున్నదని కొందరిలో సంశయమేర్పడవచ్చును. ఆ సంశయము తీరుటకు వీర్యములోని వీర్యకణము పురుష శరీరములో ఏ విధముగా తయారగుచున్నదో సంపూర్ణముగా తెలుసుకోవలసియున్నది. అందువలన నేటి శరీర శాస్త్రజ్ఞులకు మరియు వైద్యులకు తెలియని జనన సిద్ధాంతమును ఈకాల శరీరశాస్త్రమును అనుసరించియే తెలుపుచున్నాము.

పురుష శరీరములో అంగమునకు ప్రక్కలయున్న బీజములలో (వృషణములలో) వీర్యము తయారగును. బీజములు జంతువులకు పెద్దవిగా యుండును. మానవులకు చిన్నవిగా ఉండును. జంతువులకు, మానవులకు అనగా పిండము నుండి ఉద్భవించు అన్ని జీవులకూ వీర్యము తయారగును. మానవుని బీజములలో 200లకు పైగా లాబ్యూలులు అను సూక్ష్మ భాగములు ఉండును. ప్రతి లాబ్యూలు అను సూక్ష్మభాగములోనూ మడతలుగా ఒక కట్ట మాదిరియున్న నాళములున్నవి. వీటినే వీర్యోత్పత్తి నాళములని అనుచున్నాము. ఈ మడతలుగల నాళములలోనే వీర్యాణువులు ఉత్పత్తి అగుచున్నవి. వీర్యోత్పత్తి నాళములన్నీ ఒకటిగా చేరి **'ఎపిడైడిమిస్'** అను

ఒక పెద్ద గొట్టముగా ఉదరభాగములోనికి ప్రవేశించి అక్కడ ఒక తిత్తిగా విస్తరించి ఉండును. వీర్యము ఈ తిత్తిలో నిలువ ఉండును. అందువలన దీనిని వీర్యాశయమని అనుచున్నాము. రెండు బీజములనుండి వచ్చు నాళములు రెండు వీర్యాశయములుగా విస్తరింపబడి ఉండి, వీర్యాశయముల నుండి నాళములు బయలుదేరి ప్రోస్టేటు అను గ్రంథిలోనికి పోయి, అచటి నుండి మూత్రనాళములోనికి తెరుచుకొని ఉన్నవి. మానవుని బీజ నిర్మాణమును క్రిందగలపటములో చూడవచ్చును.

బీజములలో తయారైన వీర్యకణములు ఎపిడైడిమిస్ చేరి, అక్కడి నుండి వీర్యనాళము ద్వారా వీర్యాశయములోనికి పోయి, కొంతకాలము నిలువయుండి స్కలన కాలములో ప్రోస్టేటుగ్రంథి ద్వారా వచ్చినప్పుడు, అది స్రవించిన పాలవంటి పలుచని ద్రవముతో కలిసి మూత్రనాళములోనికి




1) ఎపిడైడిమిస్‌నాళము, 2) వీర్యాశయము, 3) ప్రోస్టేటు గ్రంథి, 4) లింగము, 5) బీజము, 6) లాబ్యులులు.

వచ్చి, అక్కడ **కౌపర్** అను చిన్న గ్రంథులు తయారు చేసిన ద్రవమును మరియు మూత్రనాళములో **మ్యూకస్** అను పొర స్యంధించిన **మ్యూకస్** అను జిగురు పదార్థమును కలుపుకొని వీర్యము తెల్లని జిగురు పదార్థముగా బయటికి వస్తున్నది. దీనినే వీర్యము అంటాము. ఇంగ్లీషులో స్పెర్మ్ (Sperm) అంటారు.

వీర్యములో గల వీర్యకణములు తల (శిరస్సు), కంఠము (మెడ), తోక (వాలము) అను మూడు భాగములుగా ఉండును. బీజవీర్యనాళములో తయారైన వీర్యకణము చలనరహితమైనది. బీజవీర్యనాళములో తయారైన వీర్యకణము పూర్తి పరిమాణము పొందియుండదు. ఎపిడైడిమిస్‌లోను, వీర్యనాళములోను మరియు వీర్యాశయములోను వీర్యకణము యొక్క పూర్తి ఆకారము తయారగును. వీర్యకణము పూర్తి పరిమాణము పొందిన తరువాతనే చలనము కలిగియుండును. పూర్తి ఆకారము తయారు కానంత వరకు చలనము ఉండదని ముఖ్యముగా గ్రహించవలయును. పూర్తిగా తయారైన వీర్యకణము ద్రవపదార్థములో ఒక నిమిషానికి నాలుగు మిల్లీ మీటర్ల వేగముతో ఈదుతూ ఉండును. వీర్యకణము యొక్క తోక పాముతోక కదిలినట్లు కదులుచుండుట వలన వీర్యకణము ముందుకు కదిలిపోవు చుండును. వీర్యకణములు ఆమ్లగుణద్రవప్రదార్థములో చలించలేవు. క్షారాగుణ ద్రవపదార్థములో చలించగలవు. పురుషశరీరములో వీర్య కణములు కొన్ని వారాలపాటు చలనశక్తి కలిగి ఉంటాయి. స్కలితమైన తరువాత కొన్ని గంటల కాలము మాత్రమే స్త్రీ దేహ శీతోష్ణస్థితిలో చలించగలవు.

ఇప్పుడు వీర్యకణము చలించుటకు కారణమేమిటను విషయము పరిశీలించినట్లయితే వీర్యాశయము లోపల గ్లూకోజ్ అధికముగాయున్న

ద్రవము స్యంధింపబడుతుంది. వాలము కలిగిన వీర్యకణమునకు గ్లూకోజ్ తగిలిన వెంటనే వాలము చలించును. వీర్యాశయములోని ద్రవములో గ్లూకోజ్ స్యంధనము మామూలుగా ఉండును. కావున వీర్యకణము ఎన్ని రోజులైనా పురుష శరీరములో చలనము కలిగియే ఉండును. **ద్రవములో గ్లూకోజ్ లేనిఎడల వీర్యకణము చలించలేదు.** సున్నపురాయికి నీరు తగిలిన వెంటనే ఏ విధముగా చలనము పుట్టుచున్నదో, నిమ్మరసమునకు సోడా తగిలిన వెంటనే ఏ విధముగా చలనము వచ్చునో, పాదరసమునకు వేడి తగిలిన ఏ విధముగా చలించుచున్నదో ఆ విధముగానే వీర్యకణ వాలమునకు గ్లూకోజ్ తగిలిన వెంటనే వాలములో కదలిక ఏర్పడును. గ్లూకోజ్‌కు వీర్యకణ వాలమునకు సరిపడదు. కావున వీర్యకణ వాలమునకు ఎప్పుడు గ్లూకోజ్ తగులునో అపుడు రసాయనికక్రియ ఏర్పడును. ఆ క్రియయే వీర్యకణవాలచలనము. వీర్యకణవాలము కదలుట వలన వీర్య కణమంతయు కదులును. అంతమాత్రమున వీర్యకణమునకు జీవమొచ్చిందనడము పొరపాటు. శాస్త్రజ్ఞులందరూ ఇక్కడే పొరపడుచున్నారు. **ఎప్పుడైతే గ్లూకోజ్ లేకుండాపోవునో అపుడు వీర్యకణచలనము నిలిచి పోవునను విషయము ముఖ్యముగా గ్రహించవలెను.**

**శాస్త్రజ్ఞుల అంచనా ప్రకారము వీర్యకణము జీవము కలదియే అయితే దాని చలనము ముందుకు మాత్రమేయుండక వెనుకకు, ప్రక్కలకు కూడా ఉండవలయును. దానికి జీవము లేనిదానివలన ప్రక్కలకు, వెనుకకు చలించలేదను విషయము ముఖ్యముగా గమనించవలయును.** గ్లూకోజ్‌కు వాలమునకు సరిపడని కారణమున, వాలము చలించుట వలన, వీర్యకణము ముందుకే పోవుచుండునని గ్రహించుము. వీర్యకణవాలచలనమనెడి రసాయనికక్రియ వలన గ్లూకోజ్ ఖర్చయిపోవుచుండును. గ్లూకోజ్ ఖర్చయి

వీర్యద్రవములో లేకుండా పోయినపుడు, వీర్యాశయము గ్లూకోజ్‌ను స్యంధించుచునేయుండును. అందువలన వీర్యకణ చలనమునకు లోపల ఏ ఆటంకము లేదని చెప్పవచ్చును.

సంయోగసమయములో వీర్యము స్త్రీయొక్క యోనిలో విడువ బడును. వీర్యములోని వీర్యకణము స్త్రీ గర్భములోని రజోకణముతో కలిసినపుడే స్త్రీ గర్భము ధరించుటకు వీలున్నది. వీర్యకణము గర్భాశయము లో ఉన్న రజోకణముతో కలియుటకు చాలా దూరము పోవలసి యుండును. వీర్యకణవాలచలనము వీర్యకణమును ముందుకే తీసుకొనిపోవును. వీర్యకణము కొంతదూరము ప్రయాణించిన తరువాతే రజోకణముతో కలియుటకు వీలుకలదు. వీర్యకణచలనము రజోకణముతో కలియుటకే నిర్మింపబడినది, లేకపోతే చలనముతో అవసరమే లేదు. స్త్రీయోనియందు స్కలనము జరిగిన వీర్యములో గ్లూకోజ్ ఉన్నంతవరకు వీర్యకణములు చలించి ముందుకు పోవును. గ్లూకోజ్ అయిపోయిన వెంటనే నిలిచిపోవును. వీర్యకణము కదులుచు ఎంత ముందుకు పోగలదు అన్న విషయము వీర్య ద్రవములో ఉన్న గ్లూకోజ్‌నుబట్టి నిర్ణయించవచ్చును. స్కలన కాలములో ప్రోస్టేటు గ్రంథి తన స్యంధనములో ఎక్కువ గ్లూకోజ్‌ను స్యంధించగలదు. అందువలన వీర్యకణము యోనిలో చలనము కలిగి ముందుకు పోగలదని చెప్పవచ్చును.

ఆమ్లగుణద్రవములో గ్లూకోజ్ ఉండినప్పటికీ రసాయనికక్రియ జరుగక వీర్యము చలనములేనిదవును. క్షారగుణద్రవములో మాత్రమే గ్లూకోజ్ సంయోగము వలన చలనము కలిగి ముందుకు పోగలదు. స్త్రీ యోనిలో ద్రవములు ఆమ్లగుణముకలవిగా ఉన్నాయి. అందువలన యోనిలో వీర్యకణములు చలనరహితమైపోయి ముందుకు సాగలేని స్థితి ఏర్పడు

చున్నది. స్త్రీయోనిలో పడిన వీర్యము ఆమ్లద్రవ ప్రభావము వలన నిర్వీర్యమై పోకుండా ప్రోస్టేటుగ్రంథి క్షారగుణముగల తెల్లని ద్రవమును స్కలన కాలములో స్యంధించును. స్కలితమైన వీర్యములో క్షారగుణ ద్రవము ఉండుటవలన వీర్యము స్త్రీయోనిలోని ఆమ్లద్రవములో నిలిచిపోకుండా రెండు మూడు గంటల కాలము వరకు చలించగలుగును. వీర్యము తెల్లగా ఉండుటకు ప్రోస్టేటుగ్రంథి కారణమేనని తెలియుము.

స్త్రీ పురుషులు సంయోగము చేసిన ప్రతిసారి వీర్యకణము స్త్రీ రజోకణముతో చేరలేదు. ప్రతి సంయోగములోను వీర్యకణ చలనమునకు కావలసిన గ్లూకోజ్ అయిపోవడమో లేక యోనియందు ఆమ్లగుణ ద్రవ ప్రభావము ఎక్కువ కావడమో ఉండును. ఒకవేళ వీర్యములో గ్లూకోజ్ సంపూర్ణముగావుండి క్షారగుణ ద్రవము కూడా ఎక్కువయుండిన వీర్యకణము పూర్తి ముందుకు పోయినప్పటికీ గర్భకోశములో ఆ సమయానికి రజోకణము లేకపోయినట్లయితే ఆ సంయోగము నిష్ప్రయోజనమగును. ఎప్పుడో ఒకప్పుడు అన్ని అనుకూలములు ఏర్పడితే వీర్యకణము రజోకణముతో కలుస్తుంది. ఏ ఒక్క అనుకూలము లేకపోయినా ఆ సంయోగము ఫలించదు. అందువలన మానవుల అన్ని సంయోగములు ఫలించవని చెప్పవచ్చును. దీనికారణముననే కొందరికి సంతానము ఆలస్యముగా జరుగుచుండును. పిండజములైన జంతువులు ఒక పర్యాయము సంయోగించినా అది సఫలమై సంతతి జరుగును. దీనికి కారణము జంతువీర్యములో క్షారగుణ ద్రవము ఎక్కువగా ఉండుటయు మరియు వీర్యములో గ్లూకోజ్ కూడా అధికముగా ఉండునని తెలుసుకొనుము. స్త్రీ జంతువులో రజోకణము తయారైనపుడే ఆ జంతు శరీరములో మార్పులు కనిపించి పురుష జంతువును ఆకర్షించును. ఆ మార్పును చూచినపుడే పురుష జంతువులలో కామగుణము పుట్టును.

స్త్రీ జంతువులలో కూడా రజోకణము తయారు అయినపుడే కామవాంఛ కలుగును. అపుడే పురుష జంతువుకోసము ప్రాకులాడును. ఆ స్థితినే ఎద (మనసైనదని) అయినదని మనము అంటూవుంటాము. రజోకణము తయారైనపుడే సంయోగము జరుగుచున్నది. మరియు ఆ వీర్యములో కణములు ముందుకు పోవు అనుకూలతలు ఉన్నాయి. అందువలన జంతు సంయోగము ఒక్క పర్యాయము జరిగిన వెంటనే అది సఫలమగును. మనుష్య సంయోగములో వీర్యమునకు ఎన్నో ఆటంకములు ఉన్నవి. కావున మానవుల సంయోగము ఎన్నిమార్లు జరిగినా అది సఫలము కాకపోవచ్చును.

వీర్యకణము శరీర ఉష్ణోగ్రతలో గ్లూకోజ్ కలయికతో రసాయనిక క్రియ వలన చలించగలదు. వీర్యకణ గ్లూకోజ్ రసాయనికక్రియకు ఉష్ణోగ్రత అవసరమని ఇక్కడ తెలియుచున్నది. శరీర ఉష్ణోగ్రతకంటే కొద్దిపాటు ఎక్కువ ఉష్ణమైనా ఫరవాలేదు. మరీ ఎక్కువ ఉష్ణోగ్రతలో రసాయనికక్రియ జరుగదు మరియు వీర్యకణము చెడిపోవును. అదే విధముగా శరీర ఉష్ణోగ్రతకంటే కొద్దిగా ఉష్ణోగ్రత తగ్గినా వీర్యకణ గ్లూకోజ్ రసాయనిక క్రియ జరుగును. కానీ పూర్తి శీతలము ఏర్పడినచో రసాయనిక క్రియ జరుగదు. ఎక్కువ శీతలములో వీర్యకణము చెడిపోదు. ఇప్పటి ఉ ష్ణోగ్రత కొలత ప్రమాణములో $0^0$ సెల్సియస్ శీతలములో ఉంచిన వీర్యము చెడిపోదు. ఆ శీతలములో వీర్యమునందు రసాయనికక్రియ జరుగక నిలిచిపోవును. కానీ వీర్యకణములు చెడిపోవు. రసాయనికక్రియ జరుగనందున వీర్యములోని గ్లూకోజ్ ఖర్చుకాక అట్లేయుండును. అందువలన ఈ కాలములో వీర్యమును బయట $0^0$ సెల్సియస్ శీతల ప్రదేశములో నిలువయుంచుచున్నారు. నిలువ ఉంచిన వీర్యమునకు తిరిగి వేడి తగిలిన వెంటనే రసాయనికక్రియ జరిగి చలించుటకు మొదలు పెట్టును.

కావున వీర్యమును అవసరమొచ్చినప్పుడు సంతాన కార్యమునకు వాడుకొనుచున్నారు. ఈ కార్యము పశువుల ఎడల ఎక్కువగా చేయుచున్నారు.

ఈ కాల శాస్త్రజ్ఞులకు జ్ఞాననేత్రముగానీ, సూక్ష్మదృష్టిగానీ ఉండవు. కావున వారి భావనలన్నియూ స్థూల పరిశోధనలమీద ఆధారపడి యుండును. వీర్యకణము కదులుచున్నదంటే దానికి ప్రాణము ఉన్నట్లేనని వారి అంచనాయుండును. వారికి జీవుని విషయము తెలియదు. జీవుడు ఒకచోట నివశించుటకు వానితోపాటు ఎన్ని భాగములు (శక్తియుత భాగములు) ఉండవలయునను విషయము వారికి తెలియదు. జీవుడు ఒక వీర్యకణములోనేకాక, ఏ శరీరములో నివసించినా అక్కడ పంచ భూతములు ఉండవలయును. ఆకాశము, గాలి, అగ్ని, నీరు, భూమితో తయారైన మనస్సు, బుద్ధి, చిత్తము, అహము అను మొదలగు ఇరువది నాలుగు భాగములు ఉండు చోటనే జీవుడు నివాసము చేయగలడు. అట్లుకాక 24 భాగములు లేనిచోట జీవుడు ఉండడని తెలియవలెను. జీవుడు మరణములో పాతశరీరమును వదలి, జన్మలో క్రొత్త శరీరమును ధరించునని పరమాత్మ గీతయందు తెలిపియున్నాడు. మరియు క్రొత్త శరీరములో బాల్యము, యవ్వనము, కౌమారము, వృద్ధాప్యము అను దశలు ఉండునని తెలిపినాడు. కానీ వీర్యకణముగా గర్భములో వృద్ధి చెందునట్లుగా తెలిపియుండలేదు. జీవుడు ధరించు శరీరము స్థూలము, సూక్ష్మము అని రెండు భాగములుగా ఉండును. ఈ రెండు భాగములలో స్థూలభాగము లేకపోయినప్పటికీ, సూక్ష్మభాగముండినా దానియందు జీవుడు నివాసము చేయగలడు. కానీ సూక్ష్మము లేకపోయిన జీవుడు నివాసము చేయలేడు. జీవుడు నివాసము చేయు విధానము సాంఖ్యయోగము తెలిసిన యోగులకు మాత్రమే తెలియును. ఈనాటి డాక్టర్లకు, శాస్త్రజ్ఞులకు తెలియదు. జీవమును

జ్ఞాననేత్రమున్న యోగులు మాత్రము చూడగలరు. డాక్టర్లు, శాస్త్రజ్ఞులు తమ స్థూలనేత్రములతో చూడలేరు.

వీర్యకణము తోక, తల కలదిగా తెలిపియున్నాము. తోక చలనము కలిగి తలగాయున్న దానిని ముందుకు తోసుకొనిపోవును. వాలము వీర్యకణ తల భాగమును ముందుకు తీసుకుపోవు వాహనముగానే ఉన్నది. వీర్య కణములోని తలయే సంతానమునకు కారణమని తెలియుచున్నది. ఇంతకు ముందు వీర్యకణ వాలము గురించియే తెలుసుకొన్నాము. ఇప్పుడు దాని తలను గురించి తెలుసుకొందాము. వీర్యకణ తల లోపలి భాగమున ఒక గుండ్రని భాగమున్నది. అది బంతివలె ఉండును. ఆ గుండ్రని కణము ఒక విధమైన ప్రకాశము కలిగి ఉండును.

**పరిశోధించి గుండ్రని భాగములోని ప్రకాశమును చూడవచ్చును. ఈ గుండ్రని భాగము స్త్రీ గర్భములో రజోకణముతో కలిసి శరీరముగా మారుటకు అనుకూలముగా నిర్మాణమైయుండును. ఇదియే పురుష వీర్యము లోని బీజమని చెప్పవచ్చును.**

స్త్రీ గర్భకోశములో ఓవరీ (Ovary) అన్న భాగము నుండి రజోకణము తయారగును. రజోకణము ఓవరీలో నెలకొక్కటి తయారగు చుండును. రజోకణమునే ఇంగ్లీషులో ఓవమ్ (Ovum) అని కూడా అందురు. ఈ రజోకణము ప్రోటోప్లాజమ్ అను పదార్థముతో తయారై యుండును. బాదముగింజ ఆకృతి గల ఓవరీలు స్త్రీ గర్భకోశములో గర్భాశయానికి రెండువైపులా రెండు వుండును. ఓవరీలో తయారైన రజోకణము గర్భాశయానికి దగ్గరగాయున్న నాళములోనికి పోయి నిలిచి యుండును. పురుష వీర్యములోని వీర్యకణము సంయోగము చెందిన

తరువాత యోనిలో ముందుకు చలించుచూపోయి, వికసించుకొన్న పుష్పపు ఆకృతి కలిగిన భాగములో ప్రవేశించి, అందుగల నాళము ద్వారా గర్భ కోశమునకు పోయి, గర్భాశయ మొదటి భాగములో ఉన్న నాళమందలి రజోకణముతో కలియుచున్నది. రజోకణము వీర్యకణము కలియడమునే గర్భధారణయని అందురు. రజోకణముతో కలిసిన వీర్యకణము తిరిగి గర్భాశయములోనికే వచ్చి, అందులోగల జిగురు పదార్థముతో తయారైన పొరలలో చొచ్చుకొని పోయి స్థానమేర్పర్చుకొని శిశువుగా వృద్ధిపొందును.

స్త్రీ రజోకణముతో వీర్యకణము కలిసినపుడు వీర్యకణ తల భాగములోని గుండ్రని కణము అనేక కణములుగా విభజన చెంది (Mitosis) ఆ కణములన్నియు కలిసి ఒక శరీరముగా తయారగుటకు మొదలు పెట్టును. వీర్యకణము అనేకముగా విభజింపబడుట కూడా రసాయనిక ప్రక్రియయేనని తెలుసుకొనుము. వీర్యకణము స్త్రీ శరీర జనిత ప్రోటోప్లాజ రజోకణముతో కలిసినపుడే ఈ రసాయనిక క్రియ జరుగును. వీర్యకణ తలలోని గుండ్రని భాగము మరియు స్త్రీ రజోకణము రసాయనిక క్రియకు అనుకూల పదార్థములతో తయారైనవని తెలుసుకొనుము. ఈ రెండు పదార్థములు జీవరహితములేనని జ్ఞప్తికుంచుకొనుము. ఈ రెండు పదార్థముల యొక్క కలయిక వలన ఏర్పడిన రసాయనిక క్రియలో వీర్యకణము అనేక కణములుగా చీలిపోవుచూ, ఆ కణములన్నియూ ఒక గుంపుగా చేరుచూ, శిశుశరీరము తయారగును. గర్భోత్పత్తి అయిన మూడవ నెలనుండి గర్భాశయములో వీర్యకణ అభివృద్ధి జరుగుచున్న పొరను అంటి రక్తపుష్కలమైన ఒక సంచివంటి పొర నిర్మితమగును. దీనిలో ఉండే రక్త నాళములకు తల్లిలో ఉండే రక్తనాళ శాఖలు కలిసివుంటాయి. ఈ రక్త నాళముల నుండి బయలుదేరే నాడులు బొడ్డుత్రాడుగా ఏర్పడి శిశునాభిని

అంటివుండును. శిశుశరీరములో జరిగే కార్యకలాపములకు కావలసిన ఆక్సిజన్, ఆహార పదార్థములు, విటమినులు బొడ్డు ద్వారానే సరఫరా అగును. గర్భధారణ జరిగిన తరువాత 280 రోజులకు శిశు శరీరము పూర్తిగా తయారగును.

గర్భధారణ జరిగిన తరువాత ఓవరీనందు ఒక భాగములో గర్భ రక్షక రసము తయారై రక్తములో కలిసిపోవును. ఆ రసములో 'ప్రొజెస్టిరాన్' అను హార్మోను ఉన్నది. ఈ హార్మోను గర్భకోశము మీద పనిచేయు నాడులకు బలము కలిగించి గర్భస్రావము కలుగకుండా కాపాడును. ప్రొజెస్టిరాన్ బాగుగా తయారగుటకు తల్లి తన శరీర ఆరోగ్యమును జాగ్రత్తగా చూచు కోవలయును. ప్రొజెస్టిరాన్ సక్రమముగా తయారుకాని తల్లిశరీరము, గర్భము పెంచుటలో అనారోగ్యమైనదిగా ఉండును. ప్రొజెస్టిరాన్ తయారు కాని శరీరములో గర్భస్రావము జరుగుచుండునని తెలుసుకోవలయును. అటువంటివారు గర్భస్రావము జరుగకుండా ప్రొజెస్టిరాన్ హార్మోనును ఇంజక్షన్ రూపములో తీసుకోవచ్చును.

తల్లి శరీరములో బ్రహ్మనాడి నుండి బయలుదేరిన కొన్ని నాడులు గర్భకోశమును ఆశ్రయించియుండును. ఆ నాడులు వీర్యకణము శరీరముగా మార్పుచెందుటలో ఏ ఆకృతిగా తయారుకావలసినది నిర్ణయించును. ఆ నాడులే శరీరమును ఏ విధముగా పెంచవలయునో ఆ విధముగా పెంచి ప్రసవింపజేయును. బ్రహ్మనాడినుండి బయలుదేరిన నాడులే శిశు శరీరమును గర్భాశయములో కదలునట్లు చేయుచున్నవి. ఆ నాడులలో చైతన్యము తక్కువగా ప్రసరింపబడి గర్భాశయము తక్కువగా కదులు చుండినా, శిశుశరీరము క్రమపద్ధతిగా పెరుగదు. తల్లి అనారోగ్య కారణమున గర్భములో శిశు కదలికలు తక్కువయుండినా, ఆ శిశువు

క్రమపద్ధతిగా పెరుగక నడుము నుండి పైకి ఎక్కువగా పెరిగి కాళ్ళు తక్కువగా పెరిగియుండును. కొందరికి నడుము నుండి కాళ్ళు ఎక్కువ పెరిగి నడుము పై శరీరము తక్కువ పరిమాణము పెరిగియుండును. కొందరికి తలలావుగా ఉండును, నడుము పెద్దదిగాను, చిన్నదిగాను, చేతులు కురచగాను, పొడవు గాను ఇట్లు అనేక విధముల మార్పులు కనిపించిన శిశుశరీరము సక్రమముగా పెరగలేదని తెలియుము. అవయవములు క్రమబద్ధముగా పెరుగుటకు బ్రహ్మనాడి చైతన్యము అవసరము. బ్రహ్మనాడి చైతన్యము లేకపోతే శిశుశరీరము పెరుగదు, కదలదు మరియు ఆకృతి ఏర్పడదు.

ఇప్పటి శరీర శాస్త్రజ్ఞులు పురుష వీర్యకణమును, స్త్రీ రజోకణమును పరిశోధనాశాలలో కలిపి వాటికి కావలసిన వాతావరణమును, అభివృద్ధికి కావలసిన పోషక పదార్థములను, రక్తమును సరఫరా చేయగా వీర్యకణము రజోకణముతో కలిసి రసాయనికక్రియ వలన విభజనజరిగి మాంస కణములు ముద్దగా కొంత పెరిగి నిలిచిపోవును. శరీరము పూర్తిగా పెరుగలేదు, తయారైన శరీరము ఒక మాంసపు ముద్దగా ఉండిపోయినది. ఏ ఆకృతి ఏర్పడలేదు. ఆ పరిశోధన వలన తల్లి శరీరములోనే శిశువు ఆకృతిగా పెరుగునని, అట్లుకాకపోయినచో శరీరముకు ఆకృతిరాదని తెలియు చున్నది. బ్రహ్మనాడి స్పర్శలేనిదే శరీరము తయారుకాదని తెలియని శాస్త్రజ్ఞులు పరిశోధన జరిపి అందు విఫలమై మాకంటే మించిన దేవుడు ఒకడున్నాడని చివరకు అంగీకరించుచున్నారు. ఒకవేళ వారి పరిశోధనలలో శిశువు ఒక ఆకృతిగా తయారై అందు జీవమే ప్రవేశించియుంటే, మాకంటే వేరే దేవుడు లేడని అనేవారేమో?

ఇంత విన్న తరువాత కూడా కొందరికొక సంశయము పుట్టి *"హిరణ్యకశ్యపుని కుమారుడైన ప్రహ్లాదుడు, తల్లిగర్భములోనే నారాయణ*

***మంత్రమును నారదుని ద్వారా విన్నాడు కదా! తల్లిగర్భములో ప్రహ్లాదునికి జీవములేని ఎడల నారాయణ మంత్రమును ఎట్లు వినెను"*** అని అడుగ వచ్చును. దానికి మా సమాధానమేమనగా! ఒకవేళ వారి మాటప్రకారమే ప్రహ్లాదునికి గర్భములోనే జీవమున్నదని అనుకొనినా బయటి మాటలు గర్భము లోపలికి ఎట్లు వినిపించును? అట్లు వినిపించుననుకొనినా ఇప్పుడు కూడా గర్భములోనున్న శిశువులకు బయటివారు బోధించిన బోధ తెలియవలయును కదా! అట్లు లోపల విన్నామనువారుకానీ, వినినవారు కానీ ఎవ్వరూలేరే! పరికించి చూచిన అనుభవానికిరాని కవులు పల్కిన మాటలని ప్రహ్లాదుని విషయములో తెలియుచున్నది. బ్రహ్మవిద్య ఒక్క యోగులకు మాత్రమే తెలియును. భాషా పండితులు, కవులు బ్రహ్మవిద్యను గురించి ఏమాత్రము చెప్పలేరు. అందువలన జ్ఞానదృష్ఠిలేని కవులు వ్రాసిన మాటలు పూర్తి అసత్యము.

***ప్రహ్లాదుని విషయము పురాణములలోనిది, పురాణములు కేవలము కల్పితము. విష్ణువును గురించి వ్రాయుటకు పూనిన కవులు, వారి ఇష్టానుసారము అల్లిన కథయే ప్రహ్లాద విషయము.*** ఇటువంటి కొన్ని కథలు చూచి, అంతపెద్దవారు వ్రాసిన విషయములలో నిజముకాక అసత్యముండునా! అనీ, మిగతా కవులందరూ ఆ విధముగానే వ్రాయుటకు మొదలుపెట్టి శాస్త్రమునకు పూర్తి హాని చేసినారు. నేనింతవరకు చెప్పినప్పటికీ నా మాట వినక ధర్మమేది? అధర్మమేది? అని గ్రహించక అధర్మవాదనే చేయువారు పరమాత్మ గీతయందు తెలియజేసిన విషయమునకు వ్యతిరేకులు.

మేము తెలియజేయు బోధ జీవునకు, ఆత్మకు సంబంధించిన విషయము, కావున జీవముగల సమస్త జీవరాసులకు వర్తించును. జన్మ

అనునది ఒక్క మానవునికేకాక అన్ని జీవరాసులకున్నది. అందువలన క్రిమి, కీటక, పశు, పక్షి, మృగాదులకు కూడా మా బోధ వర్తించును. ఈ మా మాటలువిన్న కొందరికి ఒక సంశయమేర్పడి "కోడి గ్రుడ్డునకు గర్భములో జీవమురాక బయటికి వచ్చిన తరువాత వస్తుందనుకొనుటకు అది చలనరహితమైనదిగా ఉన్నది. చలనములేని కోడిగ్రుడ్డుకు ప్రాణము లేదనుకొనుటకు గ్రుడ్డులోనే పిల్ల ప్రాణము కలిగి బయటకు వచ్చుట చూచుచూనే ఉన్నాము. గ్రుడ్డునుండి పుట్టు జీవులకు మీరు చెప్పిన బోధ ఎట్లు వర్తించును? గ్రుడ్డులో జీవమున్నట్లా లేక గర్భము నుండి బయటకు వచ్చిన గ్రుడ్డునందు జీవుడు చేరినట్లా" అని అడుగవచ్చును. ఈ అనుమానమును తెలుసుకొనిన అండజముల విషయమంతయూ అర్థమగును. అందువలన కోడిగ్రుడ్డు విషయము తెలుసుకొందాము.

గ్రుడ్డు నుండి పుట్టు ప్రాణులకు, పిండములనుండి పుట్టు ప్రాణులకు జన్మ విషయములో కొద్దిగా మార్పుగలదు. జన్మ విషయములో అండజ, పిండజములకు బేధముండినా, సిద్ధాంతము మాత్రము అన్నిటికీ ఒకటిగానే ఉండును. అండజములకు పిండజములకు, భూజములకు (చెట్లు) మొదలగు వాటికి మొదటి శ్వాసతోనే జన్మ కలుగుచున్నదను సిద్ధాంతము వర్తించును. కోడి జన్మను వివరించుకొనిన కోడికి యుక్తవయస్సు వచ్చిన వెంటనే శరీరములో కొన్ని పదార్థములు తయారై గుండ్రని ఆకృతి ధరించుచు దిన దినము పెరిగి అండాకృతికి చేరుకొనును. కోడి శరీరములో అండమునకు అవసరమైన పదార్థములు తయారవుతున్న సమయములో కోడిపెట్ట పుంజులతో సంబంధము ఏర్పరచుకొనును. పుంజుతో సంపర్కము జరిగినప్పుడు ఆ సంపర్క ఫలితముగా ఒక పదార్థము పెట్టకోడి శరీరములో అండము కోసము తయారవుతున్న పదార్థములతో కలుసుకొనును. ఈ

విధముగా కోడి శరీరములో తయారైన పదార్థములు కొన్ని అండముగా మారి బయటికి వచ్చును. కోడి ప్రతిదినము ఒక అండమును తయారు చేయును. బయటికి వచ్చిన అండమును పరిశీలించిన అందులో తెల్లసొన, పచ్చసొన అను పదార్థములు కనిపించును. ఈ పదార్థములలో ఏమాత్రము ప్రాణములేదు. అందువలన గ్రుడ్డుకు ప్రాణము లేదని చెప్పవచ్చును. పిండము బయటికి వచ్చిన వెంటనే ప్రాణమొచ్చినట్లు అండము బయటికి వచ్చిన వెంటనే ప్రాణము అందులో ప్రవేశించదు. ఇదియే అండజములకు, పిండజములకు గల భేదము. అండములోని పదార్థములు నిర్జీవములైనవై, ఆ పదార్థములు తగిన వాతావరణములో మార్పుచెందునవై ఉండును. కోడి గ్రుడ్డు $40^0$ డిగ్రీ సెంటిగ్రేడు ఉష్ణోగ్రతలో మార్పు చెందునదై ఉండును. మిగతా వేరువేరు జాతి గ్రుడ్లకు వేరువేరు ఉష్ణోగ్రత అవసరమై ఉండును. తగు ఉష్ణోగ్రతకు పదార్థములలో రసాయనిక మార్పు జరుగు నట్లు అండములు నిర్మింపబడియుండును. అండములో కోడిపిల్ల శరీరము తయారగుటకు అవసరమైన పోషకపదార్థములు, విటమినులు మరియు ఇతర పదార్థములతో నిర్మింపబడి ఉండును. చేతిబాంబులో రసాయనిక పదార్థములు నింపబడియున్నట్లు, కోడిగ్రుడ్డులో కూడా రసాయనిక పదార్థములు నింపబడియున్నవి. చేతిబాంబుకు ఎప్పుడు ఒత్తిడికలుగునో అప్పుడది ప్రేలునట్లు, గ్రుడ్డుకు కూడా ఎప్పుడు తగిన వేడి తగులునో అప్పుడు పిల్లగా మారుటకు మొదలిడును.

తల్లికోడి గ్రుడ్ల మీద పొదిగినపుడు కోడి శరీరములోని వేడి గ్రుడ్లకు తగులుట వలన గ్రుడ్డునందు పదార్థములు మార్పు చెందుచూ పిల్లగా తయారగును. గ్రుడ్డులో పచ్చసొన భాగములో మధ్యన ఒక గుండ్రని పదార్థముండును అది వేడి తగిలిన వెంటనే మార్పు చెందుటకు

మొదలిడును. మధ్యభాగములోని పదార్థమునే మనము పురుష బీజముగా లెక్కించుకోవలయును. పచ్చసొన, తెల్లసొన వినియోగము వలన ఈ పదార్థము పెరుగుచున్నది. కావున తెల్ల, పచ్చసొనలను స్త్రీ కణములుగా లెక్కించుకొనుచున్నాము. తగిన వేడి తగిలినప్పుడే గ్రుడ్డులో ఇమిడియున్న పురుషకణము స్త్రీకణ పదార్థములు కలిసిపోయి, పురుషకణము వృద్ధి చెందుచూపోయి, కొద్దిరోజులకు పూర్తి పిల్లగా తయారగును. మానవులకు పురుషకణము గర్భాశయములోనే స్త్రీ కణముతో కలియును. కోడిగ్రుడ్డుకు వేడిమి తగిలినవెంటనే గ్రుడ్డునందు బీజకణము మార్పు చెందుటకు మొదలిడును. గ్రుడ్డులో పూర్తి పిల్లశరీరము తయారగుటకు 21 దినముల కాలము పట్టును. పిల్లగా మార్పు చెందుకాలము అన్ని జాతి గ్రుడ్లకు ఒకే మాదిరియుండదు. ఒక్కొక్క జాతికి ఒక్కొక్క కాలపరిమితియుండును. $40^0$ సెంటిగ్రేడు ఉష్ణముకంటే ఎక్కువ వేడిలో గ్రుడ్డులోని పదార్థము చెడిపోవును. అందువలన ఎండాకాలము కోడిగ్రుడ్లు పిల్లలుగా మారుట తక్కువగా ఉండును. గ్రుడ్లు కోడి క్రిందనేకాక వాటికి తగిన వాతావరణములో ఎక్కడైనా పిల్లలుగా మారగలవు. ఈ కాలములో గ్రుడ్లను పిల్లలుగా తయారు చేయు యంత్రములు కలవు. ఆ యంత్రములలో గ్రుడ్డుకు కావలసిన వేడిని అందజేయుదురు. కావున గ్రుడ్డు పిల్లగా మార్పు చెందుచున్నది వీటినే (Incubators) అందురు. కొన్నిచోట్ల కుండలోవుంచిన గ్రుడ్డు కూడా పిల్లగా మార్పుచెందిన సంఘటనలు ఉన్నాయి. పుంజుకోడితో సంబంధము లేని పెట్టకోళ్ళు కూడా గ్రుడ్లు పెట్టును. ఆ విధముగా పెట్టబడిన గ్రుడ్లు పొదగ వేసినప్పటికీ పిల్లలుగా తయారుకావు. కారణమేమనిన ఆ గ్రుడ్డునందు పురుష బీజములేదు. గ్రుడ్డులో తెల్లసొన, పచ్చసొన, మిగతా అన్ని స్త్రీ పదార్థములుండును. కానీ పచ్చసొన మధ్య భాగములో పురుష

కణముండదు. పురుషకోడి సంపర్కము చెందిన కోడిగ్రుడ్డు మాత్రమే పురుష బీజము కలదిగావుండును. ఒక్కొక్క గ్రుడ్డుకు ఒక్కొక్క సంపర్కము ఉండవలెను. ఒక సంపర్కమే అన్ని గ్రుడ్లలో బీజముకాదు. అందువలన గ్రుడ్లు పెట్టుకోడి ఒక విధముగా ఈల వేయుచూ పుంజుకోడిని ఆకర్షించుచూ ప్రతి దినము త్రొక్కుళ్ళు (సంపర్కము) పడుచుండును.

మానవులకు గర్భకోశములో మావియందు శిశువు తయారైనట్లు అండజములకు గ్రుడ్డునందు పిల్ల తయారగును. మావియందు తయారైన శిశువుకు ప్రాణములేనట్లు, గ్రుడ్డునందు తయారైన పిల్లకు ప్రాణముండదు. ఇక్కడ ముఖ్యముగా గమనించవలసిన విషయమేమనగా! మావినుండి ప్రసవింపబడిన శిశువుకు బయట ప్రాణము వస్తున్నది. కానీ అండములో తయారైన పిల్ల శరీరమునకు గ్రుడ్డునుండి బయటికి రాకమునుపే గ్రుడ్డునందే ప్రాణమొస్తున్నది. పిండజములకు మొదటి శ్వాసతోనే ప్రాణమొస్తున్నది. అండజములకు కూడా మొదటి శ్వాసతోనే ప్రాణమొస్తున్నది. నిర్జీవమైన పిల్ల గ్రుడ్డుయొక్క పెంకును చీల్చుకొని రాలేదు. పెంకును పగులగొట్టు కొనుటకు అవసరమైన శక్తి ప్రాణముండినప్పుడే లభ్యమగును. అందువలన పెంకును పగులకొట్టుకొని బయటకు వచ్చు నిమిత్తము, పిల్లకు లోపలనే ప్రాణమొచ్చు ఏర్పాటు దేవుడు చేసియుంచాడు. జీవుడు నివాసము చేయుటకు యోగ్యముగా శరీరము ఎప్పుడు తయారైనదో, అప్పుడు ఆ శరీరమునందు వేరొక జీవుడు మొదటి శ్వాసతో ప్రవేశించునను సిద్ధాంతము అందరికీ తెలిసినదే. ఆ ప్రకారము గ్రుడ్డులో తయారైన పిల్లశరీరములోనికి జీవుడు మొదటి శ్వాసతో ప్రవేశించుచున్నాడు. ఇక్కడ కొందరికి ఒక సంశయమేర్పడవచ్చును. శ్వాస జరుగుటకు గాలి అవసరముకదా! బయటి గాలి లోపలికి రాకనే కోడిపిల్ల ఎట్లు శ్వాసించగలదని అడుగవచ్చును.

దానికి సమాధానమేమనగా! తల్లికోడి శరీరములో గ్రుడ్డు తయారైనప్పుడే గ్రుడ్డునందు పిల్లగా మారుటకు అవసరమైన పదార్థములన్నియూ నింపబడి, ఆ పదార్థములన్నియూ ఒక పొరలో బంధింపబడియుండును. ఆ పొరకూ పెంకుకూ మధ్య ఒక ప్రక్కన కొద్దిగా ఖాళీ స్థలముండును. దానియందు గాలి నింపబడియుండును. గ్రుడ్డులో గాలి ఎక్కడున్నది క్రింది పటములో చూడవచ్చును.

అండమునందు పూర్తిగా తయారైన పిల్లయందే జీవుడు ప్రవేశించును. పిల్ల తయారైన చివరి సమయములో పలుచని పొర చినిగి పోయి గ్రుడ్డు అంతయూ పిల్ల శరీరము ఆక్రమించియుండును. పొర చినిగిన తరువాత గాలి గ్రుడ్డంతయూ వ్యాపించియుండును. గ్రుడ్డులో గాలియుండుట వలన జీవుడు పిల్ల శరీరములోనికి మొదటి శ్వాసతో ప్రవేశించుచున్నాడని తెలుసుకొనుము. పిల్ల శరీరములోనికి ప్రవేశించిన




1) గాలి గది, 2) పలుచని పొర, 3) పెంకు, 4) తెల్ల సొన, 5) పురుష కణము, 6) పచ్చ సొన.

జీవుడు గ్రుడ్డు లోపలయుండిన గాలిని శ్వాసించుచుండును. అట్లు కొన్ని నిమిషములు శ్వాస జరిగిన తర్వాత ఆ గాలిలోని (ఆక్సిజన్) ప్రాణవాయువు అయిపోవును. అప్పుడు శ్వాస జరుగుచుండినప్పటికీ ఆ శ్వాసలో ప్రాణ వాయువు లభించనందువలన పిల్ల ఉక్కిరిబిక్కిరగును. తన్నుకొనుటకు ప్రారంభించును. దిక్కుతెలియక పెంకును ముక్కుతో పొడుచును. పిల్ల తన్నుకొనునపుడు ముక్కుతో పొడచినపుడు పెంకు చిన్న రంధ్రముపడి తరువాత పగిలిపోవును. అప్పుడు బయట గాలిలో పిల్ల బ్రతుకు సాగించును. ఇదే విధముగా అండజములన్నిటికీ జన్మ కలుగుచున్నదని తెలుసుకొనుము. స్త్రీలకు గర్భము వ్యర్థమై పోయినట్లే గ్రుడ్లు కూడా వ్యర్థమైపోగలవు. గ్రుడ్డు తయారు కావడములో పదార్థములు ఎక్కువ తక్కువ ఉండు దోషములవల్ల కానీ, గ్రుడ్డు బయటకు వచ్చిన తరువాత వేడి లభ్యముకావడములో ఎక్కువ తక్కువల దోషము వలనగానీ, గ్రుడ్డు ముగ్రుగ్రుడ్డుగా వ్యర్థమైపోవుట జరుగుచుండును. ఇంతవరకూ అండజముల యొక్క జన్మను గురించి తెలుసుకొన్నాము. అండజముల విషయములో అండమునకు ప్రాణములేని విషయము తెలిసిపోయినది. ఇపుడు భూమినుండి పుట్టు జీవులకు జన్మ ఎట్లు కలుగుచున్నది తెలుసుకొందాము.

భూమినుండి పుట్టు వృక్షలతాదులన్నింటినీ భూజములని అందురు. కోడిగ్రుడ్డు నుండి పిల్ల పుట్టినట్లు, విత్తనమునుండి భూజములు పుట్టును. తల్లికోడి శరీరములో తయారైన గ్రుడ్డుకు ప్రాణములేనట్లు, చెట్లనుండి తయారైన విత్తనమునకు కూడా ప్రాణములేదు. విత్తనమునకు ప్రాణము లేదనుమాట కొందరికి చాలా విచిత్రముగాయుండును. ప్రజలలో విత్తనమునకు ప్రాణమున్నదను నమ్మిక పూర్తిగా జీర్ణించిపోయినది. అందువలన మా మాట విన్నంతనే చాలా ఆశ్చర్యము కలుగవచ్చును.

కొందరు మా మాట అబద్ధమని పుస్తకము చదువక మూసివేయుదురేమో! ఎవరు నమ్మినా నమ్మకపోయినా విత్తనములకు ప్రాణములేదనుమాట సత్యము.

కోడి శరీరములో గ్రుడ్డు తయారగునట్లు, వృక్షములోనే విత్తనములు తయారగును. వృక్షములకు పెరుగు కాయలలో విత్తనములు తయారగును. ప్రతి జాతి విత్తనము రెండు భాగములుగా విభజింపబడియుండును. విత్తనము మొలకెత్తుటకు కావలసిన కొన్ని పదార్థములు కాయలయందే తయారై విత్తనమందు నింపబడి ఉండును. విత్తనము యొక్క రెండు బేడలయందు మొలకలకు కావలసిన ఆహారపదార్థములు, మరికొన్ని రసాయనిక పదార్థములు తయారైయుండును. గ్రుడ్డుకు పెంకు ఏ విధముగా ఉన్నదో, ఆ విధముగా విత్తనముకు ఒక పొర కప్పబడి ఉండును. ఈ పొరయందు ఒకచోట చిన్న ముడి కలిగియుండును. ఆ ముడి విత్తనము లోపలనున్న బేడలను పొరను కలిసియుండును. విత్తనపు బేడలు పై పొర కలియు ముడియందు **'మొన'** అను ఒక చిన్న భాగముండును. ఈ మొన విత్తనములో ముఖ్యమైనది ఈ మొనయందే పురుషకణము ఇమిడి ఉండును. విత్తనములో మొన మినహాయున్న బేడలను స్త్రీకణములుగా లెక్కించు కోవలయును. స్త్రీ పురుష కణములను కాపాడుచూ ప్రతిజాతి విత్తనమునకు ఒక పొరయుండును. దీనిని బీజరక్షక పొరయని అందురు. పొట్టులేని విత్తనములు రక్షణలేనివై కణములు చెడిపోవును. అందువలన పొట్టు పోయిన విత్తనములు మొలకెత్తవు. విత్తనమునకు ఒకచోట ముడి ఉన్నదని తెలుసుకొన్నాము కదా! ఆ ముడివద్ద పై పొర చిన్న రంధ్రము కలిగి యుండును. ఈ విధముగా ఉన్న విత్తనము పూర్తి తయారైనదని

చెప్పవచ్చును. బేడ ముదరనటువంటిది, పొర తయారుకానటువంటిది, పొరకు రంధ్రము లేనిది పూర్తి తయారుకాని విత్తనమని తెలుసుకొనుము. అటువంటి విత్తనము జన్మకు అయోగ్యమైనది. పూర్తిగా తయారైన విత్తనము నీరు తగిలిన వెంటనే మార్పు చెందునట్లుయుండును. భూమియందు పడిన విత్తనమునకు తేమ తగిలిన వెంటనే అది మొక్కగా మొలుచుటకు ప్రారంభమగును. విత్తనమున గల ముడివద్దనున్న రంధ్రము ద్వారా నీరు విత్తనము లోపలి భాగమందున్న మొనకు తగులును. నీరు తగిలిన వెంటనే మొనయందు మార్పువచ్చును విత్తనపు బేడలయందు కూడా మార్పు వచ్చును. బేడలు మెత్తగా తయారగును. విత్తనపు మొన రెండు బేడలను ఆధారము చేసుకొని పెరుగుట ప్రారంభించును. అపుడు విత్తనపు పై పొర మెత్తబడి చినిగిపోవును. మొననుండి పెరుగుటకు బయలుదేరిన ఒక భాగము భూమిలోనికి పోవును. రెండవ భాగము భూమిపైకి పెరుగును. గ్రుడ్డునందు పిల్లకు ప్రాణములేనప్పటికీ ఏ విధముగా పెరుగుచున్నదో, అదే విధముగనే విత్తనమునందు ప్రాణములేనప్పటికీ మొనయందలి పురుష కణము పెరుగుచున్నది. ఇది అంతయూ విత్తనమునందలి రసాయనిక చర్యయని తెలియవలెను. అట్లు పెరుగు సమయములో విత్తనమునందలి పదార్థములు మొలకకు వినియోగింపబడును. పురుషకణము విత్తనములోని పదార్థములను వినియోగించుకొని మొక్కగా మార్పు చెందుచుండును. భూమిపైకి పెరిగిన భాగములో చిన్నచిన్న ఆకులు తయారగును. భూమిలోపలికి పోయిన వేరు భాగములో చిన్నచిన్న వేర్లు తయారగును. ఈ విధముగా తయారైన మొక్కకు కూడా ప్రాణములేదు. అంతవరకూ విత్తనమందలి పోషక పదార్థములతోనే మార్పు చెందిన రసాయనికక్రియ అని తెలియవలెను.

మొక్కకు ఆకులు వచ్చి వికసించుకొనుదాకా దానియందు ప్రాణము లేదని చెప్పవచ్చును. మొదటి శ్వాసతోనే జీవుడు ప్రవేశించునను సిద్ధాంతము ప్రకారము చెట్టుకు మొదటి శ్వాస జరుగు వరకు ప్రాణమురాదు. మొలకెత్తిన మొక్క ఆకులయందు పత్రరంధ్రములు తయారైనపుడు జీవుడు ప్రవేశించుటకు యోగ్యత కలిగిన మొక్కగాయుండును. మొక్క ఆకులు, కాండము పూర్తి తయారైన తరువాత, ఆకులయందు పత్రరంధ్రములు ఏర్పడిన తరువాత, మొదటి శ్వాసతో జీవుడు మొక్కయందు ప్రవేశించును. ఆకుల క్రిందగల పత్రరంధ్రముల ద్వారా మొక్క శ్వాసించునని తెలుసుకొనుము. పత్రరంధ్రములలో ఎప్పుడు శ్వాస ప్రవేశించుచున్నదో అపుడు జీవుడు చెట్టునందు ప్రవేశించునట్లు లెక్కింపబడుచున్నది. అండజములకు, పిండజములకు ప్రాణమొచ్చిన తర్వాత వాటికి ప్రాణమొచ్చినట్లు మనము సులభముగా గుర్తించగలము. కానీ మొలకకు ప్రాణమొచ్చిననూ శ్వాస ఎప్పుడు ప్రవేశించినది ఎవరూ కనుగొనలేరు. మొలకెత్తిన విత్తనములకు ప్రాణమొచ్చిన వెంటనే గాలినుండి ఆకుల ద్వారా శ్వాసించుచూ, భూమినుండి వేర్ల ద్వారా పోషక పదార్థములను తీసుకొనుచూ, ఆకుల పై భాగమున సూర్యరశ్మి చేత పిండిపదార్థమును తయారు చేసుకొనుచూ, ఆహారమును సంపాదించుకొనుచూ, జీవిత కార్యమును సాగించును.

స్త్రీలకు గర్భస్రావము జరిగినట్లు, గ్రుడ్డు ముర్రుగ్రుడ్డుగా చెడిపోయినట్లు విత్తనములు కూడా చెడిపోగలవు. ఎక్కువ వేడి తగులుట వలన, విత్తనమందలి తేమ ఆరిపోవుట వలన పదార్థములు చెడిపోయి విత్తనము మొలకెత్తలేకపోవును. పొట్టు తీసివేసిన విత్తనములు, పుచ్చిన విత్తనములు, చిరకాలము గడచిన విత్తనములు మొలకెత్తలేవు. విత్తనములో పదార్థములు అనుకూలముగా లేనందువలన పురుష భాగమైన మొన మొలకెత్తలేదు.

భూమిమీదగల సమస్త విత్తనములకు జన్మ పైన చెప్పిన విధముగా మొదటి శ్వాసతోనే కలుగుచున్నట్లు తెలుసుకొనుము. సముద్రములోని జీవరాసులు నీటిని మొదటి శ్వాసగా పీల్చును. ఈ విధముగా జీవరాసులు అన్నియూ క్రొత్త శరీరము ధరిస్తున్నవి. జీవాత్మతో పాటు ఆత్మ ఉన్నది కావున ఆత్మ కూడా జీవాత్మతోపాటు క్రొత్త శరీరమును చేరుచున్నదని తెలియాలి. క్రొత్త శరీరమేదో, ఆత్మ దానినెపుడు చేరుచున్నదో తెలిసినది కదా!

**గమనిక :-** "వాసాంసి జీర్ణాని" అను భగవద్గీత శ్లోకమునకు మేము చెప్పిన వివరము సరిక్రొత్తది. కావున దీని విషయమై బాగా యోచించి అర్థము చేసుకోగలరని కోరుచున్నాము. అయినప్పటికీ ఇందులో ఎన్నో అనుమానములు ఉత్పన్నమై ఇది సత్యమా? అను ప్రశ్న బయలుదేరును. అటువంటి అనుమానములు పోవుటకు కొన్ని వాస్తవ సంఘటనలను తెలుపు చున్నాము. దాదాపు ఇరవై ఐదు సంవత్సరముల క్రితము ఈనాడు దినపత్రికలో "టూకీగా" అను శీర్షిక క్రింద **"గడుగ్గాయి"** అను పేరుతో ప్రచురితమైనది. అది ఏమనగా! ఇంగ్లాండునందు పెద్ద ఆస్పత్రిలో ఒక స్త్రీకి ప్రసవము జరుగగా, పుట్టిన ఆడశిశువుకు గంటసేపైనప్పటికీ కదలిక రాకపోవడముతో, అక్కడున్న డాక్టర్లు పరీక్షించి ఆ శిశువు గర్భమునందే చనిపోయినదని చెప్పారు. తర్వాత ఆ శిశువుకు అవ్వగారైన వృద్ధురాలు వచ్చి శిశువును గురించి అడిగింది. అపుడామెకు శిశువు తల్లి ప్రక్కనున్న వారు శిశువు గర్భమునందే చనిపోయినదనీ, దానిని శవాల గదిలో ఉంచారని చెప్పారు. ఆ వృద్ధురాలు చనిపోయిన శిశువు ముఖమునైనా చూచి వస్తానని శవాలగదిలో తొట్టిలో పెట్టి గుడ్డకప్పిన శిశువు దగ్గరకు పోయి ముఖము మీద గుడ్డతీసి చూడగా, శిశువు బ్రతికివున్నట్లు అమెకు

తెలిసి ఎత్తుకు వచ్చి, అరుస్తున్న ఆ శిశువును అందరికీ చూపి తల్లిదగ్గరకు చేర్చింది. ఆ విషయము తెలిసిన డాక్టర్లు వచ్చి శిశువును పరీక్షించి చూచి తెల్లముఖము వేశారు. తరువాత వారి సంరక్షణలోనే నెలరోజులు ఆ శిశువును పెట్టుకొని తరువాత డిశ్చార్జి చేసి పంపారు.

ఇంతవరకూ చూచిన జనన సిద్ధాంతము ప్రకారము సజీవమైన తల్లి గర్భమునుండి నిర్జీవమైన శిశువు ఎలా పుట్టుచున్నదో తెలియుచున్నది. అలాగే విత్తనమునుండి చెట్టు ఎలా మొలకెత్తుచున్నదో మరియు నిర్జీవమైన గ్రుడ్డునుండి సజీవమైన పక్షి ఎలా పుట్టుచున్నదో తెలిసిపోయినది. దీనితో ఖుర్ఆన్ వాక్యమునకు పూర్తి వివరము తెలిసిపోయినది. ఇది భగవద్గీతలో 5000 సంవత్సరముల పూర్వమే చెప్పియున్నా ఇంతవరకూ ఎవరికీ తెలియదు. అందువలన సరిక్రొత్తగాయున్న ఈ విషయమును అందరూ జాగ్రత్తగా గ్రహించాలి.

సజీవమునుండి నిర్జీవమైనదీ, నిర్జీవమునుండి సజీవమైనదీ వస్తుంది అనుమాట ఖుర్ఆన్‌లోనిది. అయితే ఇదే విషయమును భగవద్గీతలో ముందే కొన్ని వేల సంవత్సరముల పూర్వమే చెప్పారు. భగవద్గీతలో చెప్పిన విషయము ఎవరికీ అర్థముకాక స్తబ్ధతగా నిలిచిపోయి ఉండుట వలన, ఇది నిజమైన జ్ఞానము, ఇది వాస్తవమైన విషయము అని భగవద్గీతలోని వాక్యమును ఎత్తి చూపుటకు ఖుర్ఆన్‌లో సూరా 6, ఆయత్ 95లోని పై వాక్యమును చెప్పారు. భగవద్గీతలోని సాంఖ్యయోగమునగల 22వ శ్లోకములోని ***"వాసాంసి జీర్ణాని"*** అను శ్లోకమును, 6–95 వాక్యము బయటికి తీసి చూపినట్లయినది. అంతవరకు అర్థముకాని వివరమును ధృవీకరించి చూపినట్లయినది. ఒకడు మంచివాడని తెలియుటకు రెండవవాడు వానిని

గురించి అతను మంచివాడేయని ధృవీకరించి చెప్పితే మొదటివాడు మంచివాడని సాక్ష్యము దొరికినట్లగును. అదే విధముగా ముందు వచ్చిన గ్రంథము భగవద్గీతను ఖుర్ఆన్ గ్రంథము భగవద్గీత వాస్తవమైన జ్ఞానము అని ధృవీకరించి చెప్పుచున్నది. అలా చెప్పుటకు భగవద్గీతకు సంబంధించిన ఎన్నో విషయములను ఖుర్ఆన్ గ్రంథము తనలో నింపుకొని చూపుచున్నది. అటువంటి ఎన్నో వాక్యములలో 6-95 వాక్యము కూడా ఒకటి. ముందు వచ్చిన ప్రథమ దైవగ్రంథమయిన భగవద్గీతను అంతిమ దైవగ్రంథమయిన ఖుర్ఆన్ ధృవీకరించుచున్నదను విషయమును ఖుర్ఆన్ గ్రంథములోనే కొన్నిచోట్ల చెప్పడము జరిగినది. అందులో సూరా 2, ఆయత్ 41లో ఇలా కలదు చూడండి. **(2-41) "మీవద్దయున్న గ్రంథాలకు ధృవీకరణగా నేను అవతరింపజేసిన ఈ ఖుర్ఆన్ గ్రంథాన్ని విశ్వసించండి. దీనిపట్ల అందరికంటే ముందు మీరే తిరస్కారులు కాకండి"** అని కలదు. ఇదే విషయమునే ఖుర్ఆన్ గ్రంథమునందే మరొక చోట కూడా చెప్పారు. సూరా 2, ఆయత్ 89లో ఇలా కలదు చూడండి. **(2-89) "వారివద్ద ముందునుంచే యున్న దైవగ్రంథాన్ని (భగవద్గీతను) ధృవీకరించే గ్రంథము (ఖుర్ఆన్) అల్లాహ్ (దేవుని) వద్దనుంచి వచ్చినది. మరి చూడబోతే దీని రాకకు మునుపు తమకు అవిశ్వాసులపై విజయము చేకూరాలని వారు స్వయముగా అభిలషించేవారు. ఇప్పుడు సత్యగ్రంథము వచ్చినా వారు తిరస్కరించారు. అటువంటి తిరస్కారులపై దేవుని శాపము పడుతుంది."** ఇలా చెప్పిందేకాక మరొకచోట సూరా 10, ఆయత్ 37లో ఈ విధముగా కలదు చూడండి. **(10-37) "ఈ ఖుర్ఆన్ దేవుడు పంపిన వాణి ద్వారా కాకుండా ఇతరుల కల్పనతో వ్రాయబడిన గ్రంథము కాదు. పైగా ఇది తనకంటే**

**ముందు అవతరించిన గ్రంథాలను ధృవీకరించే గ్రంథము. ఇంకా ముందు గ్రంథములోని ముఖ్య విషయములను విపులీకరించేది. ఇది సర్వలోకాల ప్రభువు వద్దనుంచి వచ్చిందను విషయములో సందేహానికి ఆస్కారమే లేదు."** ఈ విధముగాయున్న మూడు ఆయత్‌లను చూచిన తర్వాత ముందు వచ్చిన భగవద్గీతను ఖుర్ఆన్ గ్రంథము ధృవీకరించుటకు వచ్చినదని నూటికి నూరుపాళ్ళు చెప్పవచ్చును. మీదివేరు, మాదివేరని మతద్వేషములు పెంచుకొను మనుషులున్న ఈ కాలములో, అలాగే మా గ్రంథములు తప్ప ఇతరుల గ్రంథములను చదవము అను మనుషులున్న ఈ కాలములో, మా దేవుడుగొప్ప మీ దేవుడు చిన్న అని మాట్లాడువారున్న ఈ కాలములో, ఖుర్ఆన్ గ్రంథము ముందువచ్చిన తౌరాత్ (భగవద్గీత) గ్రంథమును, ఇది సత్యమైన గ్రంథమని చెప్పుటకు వచ్చిన గ్రంథమని తెలియజేయు వాక్యములను (ఆయత్‌లను) పొందుపరచి ముందే దేవుడు చెప్పియున్నాడంటే, ఆయన ఎంతో ముందుచూపు కలవాడని అర్థమగు చున్నది. దేవుడు స్వయముగా అందరినీ ఒకటి చేయుటకు, అందరి జ్ఞానము ఒక్కటే యని చెప్పుటకు, అందరి దేవుడూ ఒక్కడేయని తెలియజేయుటకు ఈ మూడు ఆయత్‌లను ఖుర్ఆన్ గ్రంథములో పొందుపరచాడని తెలియు చున్నది. ఇంతగొప్ప వాక్యములను వినిన తర్వాత కూడా మూర్ఖముగా ప్రవర్తించుచూ మీ జ్ఞానముకంటే మా జ్ఞానము వేరని చెప్పువారికి దేవుని శాపము పడుతుందని (2-89) వాక్యములో గలదు. అంతేకాక ఖుర్ఆన్ గ్రంథమును నమ్మనివారిని హెచ్చరించుచూ ఇది దేవుడు పంపిన వాణి ద్వారా వచ్చిన జ్ఞానమని మనుషులు చెప్పిన జ్ఞానముకాదని (10-37) ఆయత్‌లో చెప్పడమైనది. అంతేగాక తనకంటే ముందువచ్చిన రెండు గ్రంథములను ధృవీకరించే గ్రంథమని కూడా చెప్పారు. ఖుర్ఆన్‌కంటే

ముందు వచ్చిన రెండు గ్రంథములు ఒకటి భగవద్గీతయనీ, రెండు బైబిలు యనీ తెలియవలెను. **“భగవద్గీతను ఖుర్‌ఆన్ గ్రంథములో తౌరాతుయనీ, బైబిలును ఇంజీలు”**యనీ పేరు పెట్టి చెప్పారు.

ఏసుకు ఇచ్చిన గ్రంథము ఇంజీలు అని కలదు. ఇంజీలు అనగా బైబిలు గ్రంథమని అర్థము చేసుకోవలెను. ఇంజీలు గ్రంథము తౌరాత్ గ్రంథమును ధృవీకరించుచున్నదని చెప్పడము జరిగినది. తౌరాత్ గ్రంథము పేరు క్రొత్తగా కనిపించుచున్నప్పటికీ అది బైబిలు గ్రంథము కంటే ముందు పుట్టిన భగవద్గీతయని తెలియుచున్నది. ఐదవ (5వ) సూరా 43, 44వ వాక్యములలో కూడా తౌరాత్ అను పేరు వచ్చినది. అందువలన ఆ రెండు వాక్యములను చూస్తాము.

**(5-43) “దైవాదేశాలు పొందుపరచబడియున్న తౌరాత్ గ్రంథము తమవద్ద యున్నప్పటికీ వారు నిన్ను ఎట్లు న్యాయనిర్ణేతగా చేసుకొంటున్నారు? యదార్థమేమిటంటే వారసలుకు విశ్వాసులే కాదు.”**

**(5-44) “మేము తౌరాతు గ్రంథాన్ని అవతరింప జేశాము. అందులో మార్గదర్శకత్వము, జ్యోతి ఉండేవి.”**

పై రెండు ఆయత్‌లలో తౌరాత్ గ్రంథమును గొప్పగా చెప్పడమైనది. తౌరాతు గ్రంథములో దైవాదేశాలు, మార్గదర్శకత్వము, జ్యోతి కలవని మహా జ్ఞాని అయిన జిబ్రయేల్ చెప్పాడు. జ్యోతి అంటే జ్ఞానజ్యోతి, జ్ఞానాగ్ని అని అర్థము. అలాగే మార్గదర్శకత్వము అంటే జ్ఞానమార్గ దర్శనము అని అర్థము. దైవాదేశములు గల గ్రంథము తౌరాతు గ్రంథమని చెప్పబడినది. తౌరాత్ అనగా అరబ్బీ భాషలో ఏ అర్థమున్నదోగానీ ఆ శబ్దమునుబట్టి

తెలుగుభాషలో అర్థము చెప్పుకొందాము. 'తౌ' అనగా మూడు అని 'రాత్' అనగా రాత్రియని అర్థము. కలిపి చెప్పితే మూడు రాత్రులు అని అర్థము రాగలదు. మూడు రాత్రులు అని చెప్పుమాటలో ఆధ్యాత్మికము (దైవజ్ఞానము) ఏమున్నదని కొందరనుకోవచ్చును. దానికి జవాబుగా నేను చెప్పునదేమనగా!

'రాతు' లేక 'రాత్' అనగా రాత్రి అని చెప్పవచ్చును. రాత్రి చీకటిమయము. చీకటిలో ఏమీ కనిపించదు. రాత్రిపూట ఏమీ కనిపించదు కాబట్టి చూచుటకు జ్యోతి లేక లైటు అవసరము. జ్యోతి వలన వెలుగు వచ్చును. వచ్చే వెలుగు వలన ఎదుటనున్న దృశ్యమును చూడవచ్చును. జ్యోతి లేకపోతే రాత్రి పూట ఏమీ కనిపించదను అర్థము నిచ్చుచూ, మూడు రాత్రులని (తౌరాత్) అని చెప్పడము జరిగినది. దానివివరము ఏమనగా! ప్రతి మనిషికీ ప్రపంచము కనిపించుచున్నది. దైవము కనిపించడము లేదు. దైవము ఒక్కమారుగా తెలియదు. జ్ఞానమును తెలిసిన వ్యక్తికి దేవుడు మూడు అంచెలుగా తెలియబడును. ఎందుకనగా! దేవుడు మూడు భాగములుగా విభజింపబడియున్నాడు. అందువలన ఒక్కమారుగా దేవున్ని ఎవరూ తెలియలేరు. దేవుడు ఆత్మ స్వరూపుడు కావున, దేవుడు జీవాత్మ, ఆత్మ, పరమాత్మ అను మూడు ఆత్మలుగా విభజింపబడియున్నాడు. మూడు ఆత్మలుగాయున్న దేవున్ని తెలియుటకు మొదట జీవున్ని తర్వాత ఆత్మను తెలియాలి. జీవాత్మను, ఆత్మను తెలిసిన తర్వాత ఆ రెండు ఆత్మలను అనుసంధానము చేయాలి. దానినే యోగము అంటాము. రెండు ఆత్మలు ఏకమైన తర్వాత కొంత కాలమునకు పరమాత్మ తెలియబడును. ఈ మూడు ఆత్మలను తెలియడమే నిజమైన జ్ఞానము, నిజమైన మోక్షము అంటాము. మూడు ఆత్మలను తెలియకుండా ఉండడమే అజ్ఞానము, అంధకారము అంటాము. అజ్ఞాన అంధకారములో ఏమీ తెలియదు కావున,

మూడు రకములుగా యున్న దేవున్ని మూడు కనిపించని రాత్రులుగా పేరు పెట్టి చెప్పారు. తౌరాత్ అనగా మూడు ఆత్మల అగోచరము అని అర్థము. ప్రతి మనిషీ అగమ్యగోచరుడుగాయుంటూ, అజ్ఞాన అంధకారములో దేవున్ని తెలియలేకయున్నాడు. మూడు తెలియని ఆత్మలను తౌరాత్ అని చెప్పుచూ, మూడు తెలియని ఆత్మలు భగవద్గీతలో ఉన్నాయి కావున, భగవద్గీతను తౌరాత్ గ్రంథమని చెప్పారు. తౌరాత్ గ్రంథమును శ్రద్ధగా, భక్తిగా చదివితే అందులో జ్యోతి కనిపించి చీకటిపోయి మూడు ఆత్మలను తెలియజేయ గలదు. జ్యోతి ఉన్నప్పుడు మూడు ఆత్మలు తెలియగలవనీ, మూడు ఆత్మల గుర్తింపుకు తౌరాత్ గ్రంథమనీ భగవద్గీతకు పేరు పెట్టడము జరిగినది.

ద్వితీయ దైవ గ్రంథమును మనము నేడు బైబిలు అని చెప్పుచున్నా, **భగవద్గీతకు దేవుడు 'తౌరాతు' గ్రంథమని పేరు పెట్టినట్లు, బైబిలు గ్రంథమునకు 'ఇంజీలు' అని పేరు పెట్టాడు.** దేవునిభాషలో దాని అర్థమేమో నాకు తెలియదు గానీ, దైవజ్ఞానమునకు దగ్గరగా యున్న భాష అయిన తెలుగు భాషలో దైవజ్ఞానమునకు సంబంధించిన అర్థమేకలదు. జ్ఞానమునకు చిహ్నము, జ్ఞానమునకు అధిపతి అయిన చంద్రున్ని ఇందువు అని చెప్పవచ్చును. చంద్రకిరణములను ఇందుజాలు అని అనవచ్చును. ఇందువు నుండి పుట్టునవి కావున 'జా' అను శబ్దమును చేర్చి ఇందుజాలు అని చెప్పడము జరుగుచున్నది. ఇందుజాలు అను పదమునకు దగ్గరగా యున్న శబ్దము ఇంజీలు అను శబ్ధము. ఇందూ అనకుండా చివరిలో 'దూ' ను తీసివేసి 'ఇం' అని చెప్పినా చంద్రుడనియే అర్థము వచ్చును. అంతేకాక 'జా' అను శబ్ధము 'జీ' అని పలికినా జీవించడము, పుట్టడము అని 'జా' కున్న అర్థమే వచ్చును. అందువలన 'ఇందుజా' అను పదమును 'ఇంజా' అనియూ, 'ఇంజీ' అనియు అర్థము చెడకుండా చెప్పవచ్చును.

అందువలన 'ఇంజీలు' అంటే 'చంద్రకిరణములు' అని స్థూల అర్థము రాగా, **దేవుని జ్ఞానవాక్యములని సూక్ష్మమైన అర్థమువచ్చును.** దేవుని జ్ఞాన వాక్యములతో కూడుకొన్న గ్రంథమును ఇంజీలు అని అనవచ్చును. అందువలన ద్వితీయ దైవ గ్రంథమయిన బైబిలును ఇంజీలు గ్రంథమని జ్ఞాని అయిన జిబ్రయేల్ గ్రహము చెప్పడమైనది. భగవద్గీత తౌరాతు గ్రంథమని పిలువబడగా, బైబిలు ఇంజీలు గ్రంథమని పిలువబడినది.

భగవద్గీత తౌరాత్ గ్రంథమనీ, బైబిలు ఇంజీలు గ్రంథమనీ తెలిసి పోగా ఖుర్ఆన్ ఆ రెండు గ్రంథములనూ ధృవీకరించుచున్నదని కూడా తెలిసిపోయినది. ఇదంతటినీ చూచిన తర్వాత మతము అను సమస్య ఉండదు. నా మతము, నీ మతము, నా జ్ఞానము, నీ జ్ఞానము అను మాటే యుండదు. అలా అనుకొనువాడు తెలివితక్కువవాడగును. దేవుని వాక్యములకు వ్యతిరేఖముగా మాట్లాడినవాడగును. కొందరు ముస్లీమ్‌లు ఖుర్ఆన్ మా గ్రంథము అని అనవచ్చును. అట్లనుట తప్పనీ అట్లనగూడ దనీ దేవుడు అందించిన ఖుర్ఆన్ గ్రంథము దైవగ్రంథమనీ, అది సమస్త మానవులకూ చెప్పిన సందేశమనీ, అందువలన ఖుర్ఆన్ గ్రంథము కేవలము ముస్లీమ్‌ల గ్రంథముకాదనీ, ఖుర్ఆన్ గ్రంథములో సూరా 81, ఆయత్ 27 లో ఇలా చెప్పడము జరిగినది. **(81-27) "ఇది సమస్త లోకవాసుల కొరకు హితోపదేశము."** ఈ మాటనుబట్టి ఖుర్ఆన్ సమస్త మానవులకూ చెప్పిన జ్ఞానమని తెలియుచున్నది. ఖుర్ఆన్ సమస్త మానవులకూ చెప్పిన జ్ఞానమైనప్పుడు దానికంటే ముందువచ్చిన భగవద్గీత, బైబిలు రెండు గ్రంథములు కూడా ప్రజలందరి కొరకు చెప్పిన గ్రంథములేయని తెలియు చున్నది. అందువలన ఏ మతస్థుడుగానీ వాడు ఏ గ్రంథమునయినా అనుసరించవచ్చును. అయితే ఫలానా గ్రంథము మాది, ఫలానా గ్రంథము

మీదియని చెప్పకూడదు. మూడు గ్రంథములు ఒకదానితో ఒకటి జ్ఞానములో అవినాభావ సంబంధము కల్గియున్నాయి. అందువలన మూడు గ్రంథములు ప్రజలందరి కొరకు చెప్పినవేనని తెలియవలెను. ఖుర్‌ఆన్ గ్రంథము మిగతా రెండు గ్రంథములను సమర్థించుచూ వాటిని ధృవ పరచుచున్నందున ఖుర్‌ఆన్‌కు వర్తించు సూత్రమే మిగతా రెండు గ్రంథములకూ వర్తించును. ఖుర్‌ఆన్ గ్రంథమును గురించి మరియొక చోట సూరా 14, ఆయత్ 52లో ఇలా చెప్పడము జరిగినది. **(14-52) "ఈ ఖుర్‌ఆన్ సమస్త మానవుల కొరకు ఒక సందేశము. తద్వారా వారిని హెచ్చరించ టానికీ, దేవుడు ఒక్కడే ఆరాధ్యదైవమని వారు గ్రహించటానికీ ఇంకా విజ్ఞులు గ్రహించటానికీ ఇది పంపబడినది."**

ఖుర్‌ఆన్ సమస్త మానవులకు చెప్పిన జ్ఞానమని తెలిసినప్పుడు అదే విధానములో చెప్పిన రెండు గ్రంథములు కూడా ఏకత్వమును తెలుపు చున్నాయి. ముందుపుట్టిన ప్రథమ దైవగ్రంథములో ఏ సూత్రములున్నవో అవే సూత్రములే భగవద్గీతను సమర్థించు బైబిలు, ఖుర్‌ఆన్ గ్రంథములు కల్గియున్నవి. ఒక గ్రంథములో ఒక సిద్ధాంతమువుంటే మిగతా రెండు గ్రంథములలో అదే సిద్ధాంతముండును. ముఖ్యముగా మూడు గ్రంథములు ఒకే సిద్ధాంతముతో ముడివేయబడియున్నాయి. అయితే మూడు గ్రంథములూ ఒకే సూత్రముచే నిర్మింపబడినవని ఎవరికీ తెలియనట్లు వాక్యములలో సూత్రములు కనిపించడములేదు. మొదట గ్రంథరూపముగా 5000 సంవత్సరముల పూర్వము ద్వాపరయుగము చివరిలో భగవద్గీత తయారయి నది. దేవుడు చెప్పిన జ్ఞానముతో వచ్చినది గనుక ఆ గ్రంథమును ప్రథమ దైవగ్రంథము అని అన్నాము. భూమిమీద దేవుడు చెప్పిన జ్ఞానమూ ఉన్నది, మనుషులు చెప్పిన జ్ఞానమూ ఉన్నది. దేవుడు చెప్పిన జ్ఞానము

మాత్రము మూడు మతములలో మాత్రము వ్యాపించియున్నది. అందువలన ఆ మూడు మతములలోని జ్ఞానమును గురించే మాట్లాడుకొందాము. దేవుడు చెప్పిన జ్ఞానము ప్రథమ దైవగ్రంథముగా భగవద్గీత కాగా దానిని హిందువులు అనుసరించుచున్నారు. ప్రథమ దైవగ్రంథము తర్వాత 3000 సంవత్సరములకు ద్వితీయ దైవగ్రంథము రావడము జరిగినది. అనగా ఇప్పటికి 2000 సంవత్సరముల పూర్వము బైబిలు ద్వితీయ దైవగ్రంథముగా వచ్చినదని తెలిసినది. ఇకపోతే ద్వితీయ దైవగ్రంథము బైబిలు వచ్చిన తర్వాత 600 సంవత్సరములకు, అనగా ఇప్పటికి 1400 సంవత్సరముల పూర్వము అంతిమ దైవగ్రంథముగా ఖుర్ఆన్ గ్రంథము రావడము జరిగినది. ఈ మూడు గ్రంథములకు ముగ్గురు ప్రవక్తలుయున్నా వారిలో ఇద్దరు గురువులు, ఒకరు బోధకుడుగాయున్నారు.

మూడు గ్రంథములకు మూలకర్త దేవుడే అయినా తాను స్వయముగా చెప్పకుండా ఇద్దరు తన ప్రతినిధులచేత భగవద్గీత, బైబిలును చెప్పించాడు. ఒక ఖగోళగ్రహము చేత మరియొక గ్రంథమును చెప్పించాడు. అందువలన దేవుని ప్రతినిధులయిన వారిని గురువులు అని అన్నాము. మిగతా గ్రహమును బోధకుడు అని అన్నాము. ముగ్గురు చెప్పినది ఒకే దేవుని జ్ఞానమే, అయినా మనుషులు నమ్మలేనట్లు ఉండుట వలన చాలామందికి మూడు గ్రంథముల జ్ఞానమును మూడు రకములుగా, మూడు మతములుగా, ముగ్గురు దేవుళ్ళను గురించి చెప్పినట్లుగా కనిపించుచున్నది. అలా కనిపించడము వలన చాలామంది పొరపడి మూడు గ్రంథములలోని జ్ఞానమును మతజ్ఞానము అనుకొంటున్నారుగానీ, దైవజ్ఞానము అని అనుకోవడములేదు. అలా అనుకోవడము వలన ముగ్గురు మతస్థులు ఒకచోట ఇమడలేకపోవుచున్నారు. మాది ఒకే జ్ఞానమని చెప్పలేక

పోవుచున్నారు. దానితో మూడు గ్రంథములు వేరువేరుగా కనిపిస్తున్నవి. అలాగే మూడు గ్రంథములు ఒకే సూత్రము మీద ఆధారపడియున్నవని తెలియక, మనిషి మతములలో చిక్కుకొని, ప్రతిమతమునకూ ఒక సూత్రమును ఏర్పరచుకొన్నాడు.

భగవద్గీతలో చెప్పిన జ్ఞానమే ఖుర్ఆన్ గ్రంథములోయున్నది. ఖుర్ఆన్‌లో చెప్పిన జ్ఞానమే భగవద్గీతలోయున్నది. ఇవి రెండూ దైవ గ్రంథములే, కావున రెండిటియందూ ఒకే జ్ఞానముకలదని చెప్పవచ్చును. అయితే "ఇస్లామ్ సమాజములో విగ్రహారాధన లేదు కదా! హిందూ సమాజములో విగ్రహారాధన వుంది కదా!యని, అటువంటప్పుడు రెండు మతములూ ఒకే జ్ఞానమును ఎలా చెప్పినట్లగునని" కొందరు ప్రశ్నించ వచ్చును. అలాగే ముస్లీమ్ మతములో విగ్రహారాధన చేసిన వారిని కాఫీర్‌లని అంటారు. ఇస్లామ్‌మతములో విగ్రహారాధన నిషేధము. అయితే హిందూ మతములోని భగవద్గీతలో రాజవిద్యా రాజ్యగుహ్య యోగమున **"ఎవడు ఏ దేవతను మ్రొక్కినా వాడు నన్ను మ్రొక్కినట్లేయని"** చెప్పారు. ఈ ప్రకారము చూస్తే ఒక గ్రంథములో విగ్రహారాధన చేయకూడదని మరియొక గ్రంథములో విగ్రహారాధన చేయవచ్చుననీ చెప్పినపుడు రెండు గ్రంథములూ ఒకే జ్ఞానమును బోధించినట్లు కాదు కదా!"యని అడుగవచ్చును. ఈ ప్రశ్నకు జవాబును చెప్పు బాధ్యత మాకుంది కావున మేము ఇట్లు చెప్పుచున్నాము. ఖుర్ఆన్ గ్రంథములో దేవున్ని తప్ప ఇతర దేవతలను దేవునితో సమానముగా మ్రొక్కకూడదని, అట్లు చేయుట మంచిది కాదని, పూర్తి విగ్రహారాధనను ఖండించి చెప్పినమాట వాస్తవమే. అయితే భగవద్గీతలో కూడా అదే అభిప్రాయమును విజ్ఞానయోగమందు భగవంతుడు చెప్పాడు. విజ్ఞాన యోగములో చెప్పినట్లే, ఖుర్ఆన్ గ్రంథములో సూరా 6, ఆయత్ 110,

111లలో కూడా చెప్పాడు. రెండు గ్రంథములలో చెప్పిన ఒకే విషయము ఎలాగున్నదో ఇక్కడ చూస్తాము. ముందు భగవద్గీతలో విజ్ఞాన యోగము అను అధ్యాయమున 20, 21, 22, 23 శ్లోకములలో ఏమి చెప్పారో గమనిద్దాము.

శ్లో॥ 20. కామైస్తైస్తై ర్హృత జ్ఞానాః ప్రపద్యంతేన్య దేవతాః ।
తం తం నియమమాస్థాయ ప్రకృత్యా నియతా స్వయా॥

శ్లో॥ 21. యో యో యాం యాం తనుం భక్తః శ్రద్ధయార్చితుమిచ్ఛతి ।
తస్య తస్యాచలాం శ్రద్ధాం తామేవ విదధామ్యహమ్ ॥

శ్లో॥ 22. స తయా శ్రద్ధయా యుక్తః తస్యారాధనమీహతే ।
లభతే చ తతః కామాన్ మయైవ విహితాన్ హితాన్ ॥

శ్లో॥ 23. అంతవత్తు ఫలం తేషాం తద్భవత్యల్ప మేధసామ్।
దేవాన్ దేవయజో యాంతి మద్భక్తా యాంతి మామపి॥

భావములు :- **"అనేకమయిన ప్రపంచ కోర్కెలు గలవారు జ్ఞానము లేనివారై తమ తమ స్వభావములకు అనుగుణముగా వారివారి నియమములనుబట్టి అన్యదేవతలను ఆరాధించుచుందురు."**

**"ఎవడెవడు ఎట్టి శ్రద్ధతో, ఎట్టి మూర్తిని (విగ్రహమును) పూజించునో, అటువంటివానికి వానిశ్రద్ధ ప్రకారము అదే దేవతనే వదలకుండా పూజించునట్లు నేను చేయుదును."**

**"వాడు శ్రద్ధతో ఆ దేవతనే ఉపాసించగా, వాడు కోరుకొన్న కోర్కెలు నెరవేరునట్లుగా నేనే చేయుచున్నాను. దానితో వాని కోర్కెలు నా వలననే నెరవేరుచున్నవి."**

**"అల్పబుద్ధుడైనవాడు పొందు ఫలితములు అంతంత మాత్రమే ఉండును. అవి శాశ్వతమైనవి కావు. ఈ విధముగా ఆచరించు దేవతా భక్తులు దేవతలలోనికే చేరిపోవుదురు. నా భక్తులు మాత్రము నన్ను చేరగలరు."**

ప్రకృతి సంబంధ పాపములలో పడి ప్రపంచ సంబంధ ఆశలతో నిండిపోయినవారై అజ్ఞానులగుచూ, అన్యదేవతా ఆరాధనలు వారివారి నియమముల ప్రకారము చేయువారికి దేవుడు అంటే ఏమిటో? దేవుని జ్ఞానమంటే ఏమిటో? తెలియక వారు పూజించు దేవతలనే గొప్పగా తలచుచుండుట వలన, అట్టివారిని దేవుడు అజ్ఞానులగునట్లు వారు పూజించు దేవతలమీదనే వారి మనస్సును లగ్నమగునట్లుచేసి, వారు ఆ దేవతలనే వదలక ఆరాధించునట్లు చేయును. అంతేకాక వారు దేవతలను కోరిన కోర్కెలను కూడా దేవుడే నెరవేరునట్లు చేసి, వారి భక్తిని వారి మదినుండి ప్రక్కకు పోకుండా చేయును. ఆయా దేవతలను పూజించుటవలన తమ కోర్కెలు నెరవేరాయని తలచిన దేవతాభక్తులు (విగ్రహారాధకులు) ఆ దేవతల మహాత్యములను తలచుకొని ఇంకా వారివైపే పోవుదురు. అటువంటివారు దేవునివైపు రారు. తమను సృష్ఠించిన దేవున్ని వదలి తమవలె సృష్ఠింపబడిన దేవతలను నమ్ముకొన్నవారు దేవునికి అయిష్టులు దేవునికి ఇష్టులైనవారే దేవుని జ్ఞానమును తెలియగలరు. దేవునికి అయిష్టులయిన వారికి దేవుని జ్ఞానము తెలియు అవకాశమును దేవుడు ఇవ్వడు. తన జ్ఞానమును తెలియకుండునట్లు అటువంటివారికి దేవతల మీదనే ఆసక్తిని దేవుడే కల్గించి దేవునికి దూరముగా పోవునట్లు చేయుచున్నాడు. ఈ విషయము తెలియని మనుషులు దేవతా భక్తులై దేవతలవద్దకే చేరుదురు గానీ, దేవున్ని ఆశ్రయించరు.

ఇప్పుడు సూరా 6, ఆయత్ 110, 111లలో ఏమి చెప్పారో గమనిద్దాము. **(6-110) "తొలిసారి ఏ విధముగానైతే వీళ్ళు దీనిని విశ్వసించ లేదో, అదే విధముగా మేము కూడా వీరి హృదయాలను, వీరి చూపులను త్రిప్పివేస్తాము. వారిని వారి తలబిరుసుతనముతోనే దేవుని మార్గమును విడచి దూరముగా తిరిగేలా చేస్తాము." (111) "మేము వాళ్ళదగ్గరికి దూతలను పంపినా, మృతులు వారితో మాట్లాడి ఇది మంచిమార్గము, ఇది చెడుమార్గము, ఇది దేవుని మార్గము, ఇది మాయ మార్గము అని చెప్పినా, సమస్త వస్తువులనూ, సమస్త జ్ఞానమునూ వారి ఎదుటే తెచ్చిపెట్టినా వారు విశ్వసించేది మాయ జ్ఞానమునే. వారు దేవుని జ్ఞానమును విశ్వసించరు."** అక్కడ భగవద్గీతలో తనను (దేవున్ని) విశ్వసించని ప్రజలను దేవుడు దూరము చేయుటకు వారిని విగ్రహారాధన వైపు మళ్ళించి, దానిలోనే లాభము వచ్చునట్లు చేసి, తనదారి నుండి మనిషిని దూరముగా పోవునట్లు చేశాడు. అటువంటి వారివద్దకు ఎవరు దేవుని జ్ఞానమును తీసుకుపోయినా వారు దానిని లెక్కచేయరు. అదే విధముగా ఖుర్ఆన్ గ్రంథములో కూడా ఇక్కడ దేవుడే తనను మొదటే విశ్వసించనివానిని దూరముగా పంపుటకు వారి చూపునూ, వాని బుద్ధినీ త్రిప్పివేసి దేవుని జ్ఞానమును, చచ్చిపోయిన తమ పెద్దలు వచ్చి చెప్పినా వినని స్థితిలో ఉండునట్లు చేయుచున్నాడు. హిందువులలో విగ్రహారాధన మీద బుద్ధి పుట్టించి ప్రక్కమార్గములోనికి పంపినట్లు, ఇస్లామ్‌మతములో మరియొక విధానమును సృష్టించి జ్ఞానమునకు దూరమగునట్లు చేయుచున్నాడు. దేవున్ని తెలియుటకు విగ్రహారాధన లేదు కావున, దేవునికి దూరము చేయుటకే విగ్రహారాధన ఉన్నది కావున, హిందూ (ఇందూ) మతములో కూడా విగ్రహారాధనను

సమర్థించలేదనే తెలియుచున్నది. అంతేకాక భగవద్గీతలో రాజవిద్యా రాజగుహ్య యోగమను అధ్యాయమున 23వ శ్లోకమందు ఇలా చెప్పారు చూడండి.

శ్లో॥ యేప్యన్యదేవతా భక్తా యజంతే శ్రద్ధయాన్వితాః ।
తేపి మామేవ కౌంతేయ! యజంత్యవిధి పూర్వకమ్ ॥

భావము :–**"ఎవడయితే శ్రద్ధతో అన్యదేవతారాధన చేయుచున్నాడో, వాడు కూడా నన్నే ఆరాధించుచున్నాడు. అయినా వాడు దారితప్పినవాడై యున్నాడు."** ఇక్కడ విగ్రహారాధన చేయువాడు నన్ను ఆరాధించినట్లేయని దేవుడు చెప్పడము కొందరికి కొంత వింతగా అగుపించినా, దానిలో మనము తెలియవలసినది ఎంతోయున్నది. అదేమనగా! ఒక మనిషిని దేవుని జ్ఞానమువైపు రాకుండా విగ్రహారాధకునిగా మార్చినది దేవుడే కదా! అట్టివాడు దేవుని ఇచ్ఛప్రకారమే విగ్రహారాధకుడుగా యున్నాడు. అయితే దేవుడు సర్వవ్యాపి, సర్వదర్శి అనగా దేవుడు అంతటా వ్యాపించినవాడు, అన్నిటినీ చూచువాడు. అంతేకాక ఒక వస్తువులో కూడా లోపలా, బయటా వ్యాపించి యున్నవాడు దేవుడు. దేవుడు అణువణువునా వ్యాపించి ఇందుగలడు, అందులేడు అనుటకు వీలులేకుండా ఉన్నాడు. అందువలన ఒక వ్యక్తి ఒక విగ్రహమును పూజించునప్పుడు ఆ ప్రతిమలో కూడా (ఆ విగ్రములో కూడా) అసలయిన దేవుడు వ్యాపించియున్నాడు. అప్పుడు ఆ వ్యక్తి చేయు పూజ ఆ ప్రతిమలో వ్యాపించిన అసలయిన దేవునికే చెందుచున్నది. అందువలన మనిషి పైకి కనిపించునట్లు విగ్రహారాధన చేసినా, లోపల ఎవరికీ కనిపించకుండా ఆ పూజ నిజమైన దేవునికే చెందుచున్నది. దేవుడు సర్వవ్యాపి అయినందున, ఆయన అంతటా యున్నందున వాడు దేవున్నే పూజించినట్లయినది. అయినా వాని భావము దేవుని మీద కాకుండా

ఇతర దేవుళ్ళమీద ఉండుట వలన వాడు దైవమార్గము తప్పినవాడనియే చెప్పాలి. వాని పూజ దేవున్ని చేరినా, వాడు మాత్రము దేవున్ని చేరలేదు.

ఈ విధముగా దేవుడు భగవద్గీతలోనూ, ఖుర్ఆన్‌లోనూ ఒకే భావమును తెలియజేశాడుగానీ వేరువేరు విధములుగా చెప్పలేదు. దేవుడు చెప్పిన విషయములను మనిషి అర్థము చేసుకోవడములో ఏదయినా పొరపాటు జరుగవచ్చునుగానీ, దేవుడు చెప్పిన జ్ఞానములో పొరపాటు యంటూ ఉండదు. గ్రంథములు వేరువేరుగాయుండుట వలన, గ్రంథములలో వ్రాతలు వేరువేరుగా ఉండుట వలన మనిషి వాటిని వేరువేరుగా చూస్తున్నాడు. అందువలన మనిషికి వేరువేరు భావములో అర్థమయి వుండవచ్చునుగానీ, రెండు గ్రంథములలో వ్రాసిన వ్రాత వేరయినా, అందులో ఉన్న భావము ఒకటేనని మనిషి తెలియక పొరపడుచున్నాడు. పైన విగ్రహారాధన గురించి భగవద్గీతలోయున్నా, విగ్రహారాధనయను పేరు ఖుర్ఆన్‌లో లేకున్నా, రెండిటియందు దేవుని ఉద్దేశ్యము తనను నమ్మని వానిని తన జ్ఞానమునుండి దూరముగా పంపడమేయని తెలియుచున్నది. రెండిటియందూ మూలముగాయున్న ఉద్దేశ్యము తెలియక పోతే రెండు గ్రంథములలో వేరువేరుగా చెప్పినట్లు కనిపించుచున్నది. ఒకదానిలో విగ్రహారాధనను ప్రోత్సహించినట్లు, ఒకదానిలో విగ్రహారాధనను ఖండించినట్లు తెలియును. ఇప్పుడు మనము ఒక విషయమును చెప్పు కొందాము. భగవద్గీతలోనూ, ఖుర్ఆన్ గ్రంథములోనూ ఒకే ఉద్దేశ్యముతో వ్రాయబడిన పై సమాచారము కొందరికి వేరుగానే కనిపించి, భగవద్గీతలో విగ్రహారాధన ఉన్నట్లుగానే వారు మాట్లాడారనుకొనుము. అలా కాదని మేము ఎంత చెప్పినా వారు వినలేదనుకొనుము. కొందరికి ఏ విధముగా చెప్పినా వారు వినకుండా భగవద్గీత విగ్రహారాధనను సమర్థించు

గ్రంథముగానే అర్థము చేసుకొన్నారనుకొనుము. అప్పుడు వారిని దేవుడే తప్పుదారి పట్టించాడనీ, పై వాక్యములలో చెప్పినట్లు వారు తనకు ఇష్టము లేనివారనీ అర్థమగుచున్నది. తనకు ఇష్టము లేనివారిని తప్పుదారి అయిన అజ్ఞాన మార్గములో పంపుతాను అని ఖుర్ఆన్ గ్రంథములో చెప్పినట్లు చేశాడని, అందువలననే ఖుర్ఆన్ గ్రంథము స్వయముగా భగవద్గీతను తనకు మాతృగ్రంథమనీ, అందులోని జ్ఞానము సత్యమైనదనీ ధృవీకరించు చున్నా మనిషి మాత్రము నమ్మడము లేదని అర్థమగుచున్నది. అట్టివారికి దేవుని శాపమున్నదని తెలియుచున్నది.

ఇంతవరకూ చెప్పిన ఈ విషయమును గురించి భగవద్గీతలో చెప్పిన శ్లోకములలో "**అన్యదేవతా భక్తాయజన్తే**" అని రాజవిద్యా రాజగుహ్యా యోగమున ఉన్న శ్లోకములో చెప్పగా, "**ప్రపద్యంతేన్య దేవతాః**" అని విజ్ఞాన యోగములో చెప్పాడు. రెండుచోట్లా అన్యదేవతలను ఆరాధిస్తే అనియుంది. ఖుర్ఆన్ విషయములోనికి వస్తే అన్యదేవతలు అని చెప్పకుండా **"వారి చూపును, వారి హృదయాలను అనగా బుద్ధిని త్రిప్పివేస్తాము. దేవుని మార్గమును విడచి దూరముగా తిరిగేలా చేస్తాము"** అన్నారు. ఇక్కడ కొందరు తమ ఉద్దేశ్యమును వెలిబుచ్చుచూ ఈ విధముగా అడుగుచున్నారు. హిందూమతములో భగవద్గీతలో చెప్పినట్లు అన్యదేవతలను పూజించు చుండగా, ఇస్లామ్‌మతములో ఖుర్ఆన్ చెప్పినట్లు వారి దృష్ఠిమారి ప్రక్క మార్గములోనికి పోయారేమోగానీ, హిందువులవలె విగ్రహారాధన చేయలేదు కదా! అని అడుగవచ్చును. దానికి మా జవాబు ఇలా కలదు చూడండి. "మా మతములోనున్న వాడు మా ఊరిలోనే అడుక్కున్నాడు, వారి మతములోని వాడు వేరేఊర్లకు పోయి అడుక్కున్నాడు. వారి మాదిరి మావాడు అన్ని ఊర్లూ తిరిగి అడుక్కోలేదు కదా!" అని ఒకడన్నాడట.

ఇక్కడ ముఖ్యకార్యము అడుక్కొని తినేదే కావున ఇద్దరూ అదే పని చేసినప్పుడు ఊరు ఏదయితే ఏమి? ఇద్దరూ సమానమే కదా! జరిగిన కార్యములో ముఖ్యవిషయమును ప్రక్కనపెట్టి, ముఖ్యముగాని దానిని తీసుకోవడము అవివేకమగును. ఇక్కడ మతాల విషయములోనికి వచ్చిచూస్తే దేవుని మార్గమును వదలిపోవడము ఇక్కడ ముఖ్య విషయముగా ఉన్నదిగానీ, వారు ఎవరు ఎవర్ని ఆరాధించారు అనునది ముఖ్యము కాదు. వాడు చెడిపోయాడా బాగుపడినాడాయని చూస్తే రెండు మతములవారూ దేవునికి దూరముగా పోయి చెడిపోయారనియే చెప్పాలిగానీ వారు ఎలా చెడిపోయారో అది ముఖ్యము గాదు. బ్రాహ్మణులు మాంసాహారమునకు దూరముగా ఉండవలెననునది ముఖ్యముగానీ వీడు గొర్రెమాంసము తిన్నాడు, వాడు కోడిమాంసము తిన్నాడు, కోడిమాంసము తిన్నవానికంటే గొర్రెమాంసము తిన్నవాడే ఉత్తముడని చెప్పుటకు ఎట్లు వీలులేదో అట్లే దేవునికి దూరమయి నారన్నదే ముఖ్యముగానీ, విగ్రహారాధకులకంటే విగ్రహారాధన చేయకుండా దేవున్ని దూషించినవారే మేలు అని చెప్పినట్లగును. అందువలన దేవునికి దూరముగా పోయారా లేదా! అన్నది ముఖ్యముగానీ ఎలా పోయారు! అన్నది ముఖ్యము కాదు.

హిందువుల విషయానికి వస్తే విగ్రహారాధనతో దేవునికి దూరముగా పోయినవారు చాలామంది కలరు. అయితే ప్రస్తుత కాలములో విగ్రహారాధనలు చేయువారిలో కూడా శైవులు, వైష్ణవులు అని రెండు తెగలు మాత్రమున్నవి. వారిలో కూడా పదిహేను లేక పదహారు మంది దేవతలను ఆరాధించువారు మాత్రము కలరు. హిందువులలో దేవతా భక్తి కూడా వ్యాపారమువలె సాగుచున్నది. ఎవరు ఎక్కువ కోర్కెలు నెరవేర్చితే వారినే ఆరాధించువారు ఎక్కువగాయుందురు. ప్రస్తుత కాలములో తిరుపతి

వెంకటేశ్వరుని ముందర దేవుళ్ళందరూ లేకుండా పోయారనియే చెప్పవచ్చును. ఎలా లెక్కించినా విగ్రహారాధకులు కూడా శైవులు, వైష్ణవులను రెండు తెగలలోనివారు మాత్రమే గలరు. ముస్లీమ్‌ల విషయానికివస్తే దేవునిదారి వదలి ప్రక్కదారి పట్టిన వారు 72 తెగలుగాయున్నారు. 73వ తెగవారిని మాత్రము దేవునిమార్గములో నడుచువారిగా లెక్కించ వచ్చును. 72 తెగలుగాయున్న ముస్లీమ్‌లు, ముస్లీమ్ సామ్రాజ్యములో ఎక్కడున్నారో నాకు తెలియదుగానీ, వారి తెగల పేర్లు ఆ తెగల ఉద్దేశ్యములు మాత్రము ముస్లీమ్‌లు వ్రాసిన గ్రంథముల ద్వారా తెలుసు. వాటిని ఇక్కడ మీకు తెలియజేయుచున్నాము. క్రింద ముస్లీమ్‌ల తెగపేరు దానికి ఎదురుగా తెగయొక్క ఉద్దేశ్యము లేక వాదనను చూడవచ్చును.

01) **జమాదియా** :- అబుల్ జమాద్ అనుచరులు. మహాప్రవక్త "అలీని" అతని గుణాలనుబట్టి ఇమామ్‌గా నియమించారు గానీ, అతని పేరునుబట్టి కాదు.

02) **సులేమానియా లేక జరిరియా** :- సులేమాన్ ఇబ్నె జదుల్ జైదీ అనుచరులు. ఇమామ్‌పదవి ఇద్దరు ఉత్తమ ముస్లీమ్‌ల చేత సమావేశములో నిర్ణయించబడుతుంది.

03) **బుత్రియా లేక హురారియా** :- ఉస్మాన్ ఖిలాఫత్‌ను విభేదించరు ఆయనను విమర్శించరు, పొగడరు.

04) **యాకూభియా** :- అబూబిక్ర్, ఉమర్‌ల ఖిలాఫత్‌ను అంగీకరిస్తారు. అయితే వీరి పాలనను తిరస్కరించేవారిని తిరస్కరించరు. ముస్లీమ్‌లుగాయుండి పెద్ద పాపాలు చేసేవారు నరకాగ్నిలో పడతారని చెప్తుతారు.

**05) హన్ఫియా :-** ముహమ్మద్ ఇబ్నె హనీఫా ఇమామత్ అనుచరులు, అల్లాకు ఒక ఆరంభము ఉండి, ఉంటుంది.

**06) కరిభియా :-** ఇమామ్ ముహమ్మద్ ఇబ్నె హనీఫా చనిపోలేదు. అదృశ్య రూపములో ఉన్నాడు. అతనే రాబోయే మెహదీ.

**07) కమిలియా :-** అబూకామిల్ అనుచరులు, సహచరులు వారసులై ఉండాలి. అలీని విమర్శిస్తారు. పునరుత్థాన దినానికి ముందే మృతులు లేచి వస్తారు. సైతాన్ మట్టికి బదులు అగ్నిని కోరుకోవడము మంచిపనే.

**08) ముహమ్మదియా లేక ముగారియా :-** ముహమ్మద్ ఇబ్నె అబ్దుల్లా ఇబ్నె హాసన్ అనుచరులు. ముహమ్మద్ ఇబ్నె అబ్దుల్లా చనిపోలేదు. అదృశ్యముగాయున్నారు. ఆయనే రాబోయే మెహదీ.

**09) బాకరియా :-** ముహమ్మద్ ఇబ్నె అలీ బాఖర్ అదృశ్య ఇమామ్. రాబోయే మెహదీ.

**10) నదిసియా :-** పరులకంటే తమను గొప్పవారిగా ఎంచుకునే వారు కాఫిర్లు, అవిశ్వాసులు.

**11) షాయియా :-** అల్లాహ్ తప్ప వేరొక దేవుడు లేడని పఠించినవాడు. ఏం చేసినా శిక్షించబడడు.

**12) అమ్మాలియా :-** విశ్వాసం అంటే ఆచరణే.

**13) ఇస్మాయిలియా :-** ఇస్మాయిల్ ఇబ్నె జాఫర్ వంశస్తులకే ఇమామత్ ఉండాలి.

**14) ముసాలియా/మమ్‌తురా** :- మూసా ఇబ్నె జాఫర్ అదృశ్య ఇమామ్ రాబోయే మెహదీ.

**15) ముబారికియా** :- ముహమ్మద్ ఇస్మాయిల్ ఇబ్నె జాఫర్ వంశస్థులకే ఇమామత్ ఉండాలి.

**16) కతియా/ఇత్న్ అషారియా (పన్నెండు వాదులు)** :- అలీ ఇబ్న్ అబీ తాలిబ్ వంశస్థుల్లో 12వ ఇమామే మెహదీ.

**17) హషామియా/తరకిబియా** :- అల్లాహ్ దేహం ఉంది. ప్రవక్త అల్లాహ్ కు అవిధేయుడు అయ్యాడు.

**18) జరారియా** :- తనకంటూ జీవాన్నీ, కొన్ని గుణగణాలనూ ఏర్పాటు చేసుకునే దాకా అల్లా జీవించి లేడు. ఆయనకు ఏ గుణాలూ లేవు.

**19) యౌనాసియా** :- అల్లాహ్ తన సింహాసనాన్ని మోసే వాళ్ళకంటే బలాఢ్యుడే.

**20) షైతానియా/షిరకియా** :- అల్లాహ్ సేవకుల చర్యలు పదార్థాలు. అల్లాహ్ సేవకుడు పదార్థాన్ని పుట్టించగలడు.

**21) అబ్రకియా** :- కలలు, దర్శనాలు వట్టివే. భవిష్యవాణిని ప్రకటించే అన్ని పద్ధతులూ అంతరించాయి.

**22) నజాదత్** :- సారాయి త్రాగిన వాడిని శిక్షించకూడదు. ఈ తెగవాళ్ళ లోని పాపులు నరకాగ్నిలో శుద్ధి చేయబడరు. వేరొక చోట శిక్ష పొందే స్వర్గంలో ప్రవేశిస్తారు.

**23) సుఫ్రియా** :- వాస్తవానికి పాపులంటే బహుదేవతారాధకులే.

**24) అజారిదా :-** యుక్తవయసు వచ్చాకే పిల్లల్ని ఇస్లామ్‌లోకి పిలవాలి. యజమాని చనిపోయిన తరువాత మాత్రమే యుద్ధంలో దోచుకోబడిన సంపద ధర్మబద్ధం అవుతుంది.

**25) కాజిమియా :-** అల్లా అన్ని మతాలవారినీ ప్రేమిస్తాడు ఒకడు తన జీవితంలో అత్యధిక భాగం అవిశ్వాసిగా ఉన్నా సరే.

**26) షువైబియా/హుజ్జతియా :-** అల్లాహ్ అనుకున్నదే జరుగుతుంది. ఒక పని జరుగలేదంటే అల్లాహ్ అనుకోలేదన్న మాట.

**27) కలాఫియా :-** ఇమామ్ నాయకత్వం లేకుండా యుద్ధం చేయకూడదు.

**28) మాలూమియా/ముజ్ హూలియా :-** అల్లాహ్ పేర్లన్నిటితో ఆయన్ని గుర్తించని వారికి ఆయన గురించి ఏమీ తెలియదు. వారు అవిశ్వాసులు.

**29) సల్తియా :-** పెద్దల్ని మాత్రమే మార్చాలి. తండ్రి విశ్వాసి అయినా యుక్తవయస్సు వచ్చేవరకు అతని పిల్లలు అవిశ్వాసులే.

**30) హంజియా :-** బహుదేవతారాధకుల పిల్లలు నరకానికి వెళతారు.

**31) తాలిబియా :-** పిల్లలు మేము సత్యాన్నుండి తొలగిపోతున్నాము అని చెప్పేవరకు, వారు ఏ వయస్సులో ఉన్నా, వారికి తల్లితండ్రులే సంరక్షకులు.

**32) మాబాదియా :-** బానిసలకు దానాలివ్వటం, పుచ్చుకోవటం ఒప్పుకాదు.

**33) అక్నాసియా :-** ప్రత్యర్థి స్వయంగా తెలిస్తే తప్ప, అదీ ఆత్మరక్షణ కోసం తప్ప యుద్ధం చేయకూడదు.

**34) షైబానియా/ముష్బియా** :- అల్లాహ్ తన సృష్టితాలనే పోలి ఉంటాడు.

**35) రషీదియా** :- ఊటలు, కాలువలు, నదుల ద్వారా నీటి సరఫరా ఉన్న భూములకు జకాత్‌లో సగం కట్టాలి. వర్షం ద్వారా మాత్రమే నీరు పొందే భూములకు పూర్తి జకాత్ చెల్లించాలి.

**36) ముక్రరమియా/తిహ్మియా** :- అజ్ఞానమే అవిశ్వాసం. అల్లాహ్ స్నేహం గానీ, విరోధంగానీ మనిషి చనిపోయే క్షణంలో ఉన్న నమ్మకం మీదే ఆధారపడి ఉంటుంది.

**37) ఇబాదియా/అషాలియా** :- అల్లాహ్‌ను సంతోషపరచాలనే తలంపు లేకుండానే మంచి పనులు చెయ్యాలి.

**38) హఫ్సియా** :- అల్లాహ్‌ను తెలుసుకుంటేనే బహుదేవతారాధన నుండి మనిషి బయటపడతాడు.

**39) హారితియా** :- పనులకు ముందు సామర్థ్యం ఉంటుంది.

**40) అషాబ్ తాహ్** :- తానొక ప్రవక్తనని ఋజువుపరుచుకోటానికి ఎటువంటి గుర్తు లేకుండా కూడా అల్లాహ్ ఒక ప్రవక్తను పంపిస్తాడు.

**41) షబిబియా/సలీహియా** :- గజాలా అనే స్త్రీ ఇమామత్‌ను నమ్ముతారు.

**42) వసీలియా** :- పెద్ద పాపాలు చేసినవారు నరకాగ్నిలో మాడుతారు. కానీ విశ్వాసులుగానే ఉంటారు.

**43) అమియా** :- ఒంటెల యుద్ధంలో ఇరుపక్షాల సాక్ష్యాన్ని తిరస్కరించాలి.

**44) హుదాలియా/షానియా** :- అల్లాహ్ సర్వశక్తుడు కానిరోజున స్వర్గం, నరకం రెండూ అంతరిస్తాయి. విధివ్రాత కూడా ఆగిపోతుంది.

**45) నజ్జామియా :-** ఖుర్‌ఆన్‌గ్రంథానికి అద్భుతాలు చేసే శక్తి లేదు. ముహమ్మద్ ప్రవక్త చంద్రున్ని చీల్చడంలాంటి అద్భుతాలను నమ్మకూడదు.

**46) ముఅమ్మియా :-** అల్లాహ్ జనన మరణాలను సృష్టించలేదు. అది జీవదేహంలో ప్రకృతి సిద్ధమైన చర్య.

**47) బషీరియా :-** అల్లాహ్ ఒక మనిషి పాపాలను క్షమించి అతని మనసు మార్చవచ్చు. అతను మళ్ళీ అవిధేయుడైతే శిక్షించవచ్చు.

**48) హిషామియా :-** ముస్లీం సమాజం ఒక వ్యక్తిని ఇమామ్‌గా ఎన్నుకొంటే, కొంతమంది తిరగబడి ఆ ఇమామ్‌ను చంపేస్తే, అటువంటి తిరుగుబాటు కాలంలో ఎవర్నీ ఇమామ్‌గా ఎంపిక చేయకూడదు.

**49) ముర్దారియా :-** సుల్తాన్‌కు అంటిపెట్టుకుని ఉండటంవల్ల అవిశ్వాసులౌతారు.

**50) జాఫ్రియా :-** ముడి ద్రాక్షరాసం త్రాగటం శిక్షార్హం కాదు. నరకశిక్ష మానసికమైనది.

**51) ఇస్కఫియా :-** అల్లాహ్ పిల్లల్ని, పిచ్చివాళ్ళనీ అదుపులో ఉంచగలడు గానీ, పరిపూర్ణ జ్ఞానంగల వారిని కాదు.

**52) తమామియా :-** అల్లాహ్ తనను తాను తెలుపుకున్న వాడికే తెలుస్తాడు. మిగతా వాళ్ళంతా జంతువుల్లాగా బాధ్యులుకారు.

**53) జాహిజియా :-** అల్లా ఒక వస్తువును సృష్టించగలడు కానీ నశింప చేయలేడు.

**54) షాహమియా/సిఫాతియా :-** అన్నీ ఇద్దరిచేత ముందుగానే నిర్ణయించబడ్డాయి. ఒకరు సృష్టికర్త, మరొకరు స్వీకర్త.

**55) కయాతియా/ముక్లాకియా :-** ఉనికిలో లేనిదంతా అది కనబడక ముందున్న రూపమే. మనిషి పుట్టకముందు ఉనికిలో లేని దేహం అతనికి ఉన్నట్లే, ప్రతి లక్షణం దృశ్యరూపంలోకి వచ్చే పర్యంతం దానికి అదృశ్య ఉనికి ఉంటుంది.

**56) కాబియా :-** అల్లాహ్ తననుగానీ, ఇతరుల్నిగానీ చూడడు.

**57) జబ్బాయా :-** తన భక్తుల కోరిక తీర్చేటప్పుడు అల్లా వారికి విధేయుడౌతాడు.

**58) బాషామియా :-** ఒక చెడ్డపని చెయ్యాలనుకున్నవాడు దాన్ని చెయ్యకపోయినా, ఆ తలంపునుబట్టి శిక్షించబడతాడు.

**59) ఇబ్రియా :-** ముహమ్మదు ఒక జ్ఞాని. ప్రవక్తకాదు.

**60) ముహ కామియా :-** సృష్టితాల మీద దేవునికి అదుపు లేదు.

**61) కబరియ్యా :-** సమాధిలో శిక్షలుండవు.

**62) హుజ్జతియా :-** చేష్టల ఫలితముగా శిక్షరాదు. ఎందుకంటే అన్ని చేష్టలూ అల్లా నిర్ణయాలే గనుక వాటికెవరూ బాధ్యులు కారు.

**63) ఫిక్రియా :-** అల్లాను ధ్యానించటం ఆరాధించటంకంటే ఉత్తమం.

**64) అలివియా/అజారియా :-** హ్రజత్ అలీ, ముహమ్మదు గారితో కలిసి ప్రవక్త పదవి పంచుకున్నారు.

**65) తనాసికియా :-** ఆత్మ పునర్జన్మ ఎత్తుతుంది.

**66) రజీయా :-** హజ్రత్ అలీ ఇబ్నె అబీ తాలిబ్ మళ్ళీ ఈ లోకానికి వస్తారు.

**67) అహదియా :-** విశ్వాసంలో ఫరజ్ (తప్పనిసరి) పనులు చాలు. సున్నత్ (ఐచ్ఛికం) అక్కరలేదు.

**68) రదీదియా :-** ఈ లోకం శాశ్వతంగా ఉంటుంది.

**69) సత్ బిరియా :-** పశ్చాత్తాపం అంగీకరించబడదు.

**70) లఫ్ జియా :-** ఖురాన్ దేవుని వాక్యం కాదు. దాని అర్థం, సారాంశం మాత్రమే దేవుని వాక్యం. ఖురాన్‌లోని మాటలు కేవలం వ్యాఖ్యాత మాటలే.

**71) అషారియా :-** ఊహించటం తప్పు. అది అవిశ్వాసానికి సూచన.

**72) బదాయియా :-** అమీర్ ఏం చెప్పినా చెయ్యాల్సిందే.

ఈ విధముగా ముస్లీమ్‌లు 72 తెగలు ఉపవిశ్వాసులు అయితే అసలయిన విశ్వాసులు ఒక తెగ మాత్రము కలదు. దీనితో మొత్తము 73 తెగలుగా ముస్లీమ్‌లు చీలిపోయారు. 73వ తెగమాత్రము పూర్తి విశ్వాసులయితే మిగతావారు ఉపవిశ్వాసులేగానీ విశ్వాసులు కాదు కదా! అలా అయితే హిందువులలో విగ్రహారాధన చేయువారు కూడా ఉప విశ్వాసులనవచ్చును. ఏ విధముగా చెప్పుకొన్నా విశ్వాసులువేరు, ఉప విశ్వాసులువేరు అయినప్పుడు, విశ్వాసులే నా మార్గములోయున్నారని దేవుడు చెప్పినప్పుడు, మిగతా ఉపవిశ్వాసులనందరినీ ప్రక్కదారిలో పోవువారిగానే లెక్కించవచ్చును. అందువలన హిందువులలో కొందరు తాము భక్తులమే అన్నట్లు విగ్రహారాధన చేయువారిని దేవుడు తన దారిలో

లేకుండా చేసినట్లే, ఇస్లామ్ సమాజములో కూడా ఒక్క విశ్వాసులను తప్ప మిగతావారిని తన దారినుండి తప్పించి ప్రక్కదారిలో పోవునట్లు చేశాడు. హిందువులలో విగ్రహారాధన చేయువారుగానీ, ముస్లీమ్‌లలో విగ్రహారాధన చేయనివారు గానీ, ఒకే కోవకు చెందినవారై దైవమార్గములో లేకుండా ప్రక్కమార్గములో పోవుచున్నారు. చేపలు పట్టడము ముఖ్యముగానీ, వలలు ఏవయినా ఒక్కటే! అలాగే దేవుని మార్గమునకు దూరముగా పోవడమే ఇక్కడ ముఖ్యమైన సమస్యగానీ, వారు విగ్రహారాధకులు అయినా, కాకపోయినా ఒక్కటే. దేవుడు అవిశ్వాసులయిన వారిని అనగా హిందువులు గానీ, ముస్లీమ్‌లుగానీ తనకు దూరము చేయుటకు వారివైపే వుండి వారి బుద్ధిని మార్చి, ఎవరు చెప్పినా విననట్లు చేసి, తన దారినుండి ప్రక్కదారి లోనికి పంపుచున్నాడు. అలా పంపిన వారికి దేవదూతలు వచ్చి చెప్పినా, వారిమాట వినరని చెప్పాడు. అంతేకాక మృతులు వారితో మాట్లాడినా, వారు వారి మార్గమును వదలి దైవమార్గములోనికి రారని చెప్పాడు. ఇక్కడ మృతులు అనగా ఎవరని ఆరాతీస్తే చనిపోయినవారనీ, అదియూ పరిచయమున్న వారు చెప్పితేనే వినేదానికి అవకాశముంటుంది, ఒకరికొకరు గుర్తు పట్టడానికి కూడా అవకాశముంటుంది. అందువలన చనిపోయిన వారిలో అవిశ్వాసికి సంబంధించిన అతని దగ్గరి బంధువులు గానీ, తల్లి తండ్రులుగానీ, తాతా అవ్వలుగానీ, అన్నా అక్కలుగానీ, చిన్నాన్నా పెదనాన్నలుగానీ ఎవరయినా చనిపోయి రెండవ జన్మకు పోనివారు, అకాల మృత్యువుతో చనిపోయిన మృతులు వచ్చి ఇతరుల శరీరములో ప్రవేశించి మాట్లాడుచూ తమవాడు ప్రయాణించు మార్గము అజ్ఞాన మార్గమని దేవుని మార్గము కాదని, దానిని వదలి దైవమార్గములో ప్రయాణించమని చెప్పినా, అజ్ఞానులయినవారు వారి మాటలను కూడా గౌరవించక తమమార్గమును వదలకుండా అదియే సరియైనదని తిరిగి చెప్పుదురు.

కొందరు ముస్లీమ్‌లు చనిపోయినవారు భూమిలో పూడ్చబడి ప్రళయ కాలములో వచ్చు అంత్యదినమువరకూ అక్కడే ఉందురని చెప్పుచుందురు. వారిమాట ప్రకారము ప్రళయకాలము రాకనే, అంత్య దినము రాకనే దేవుడు వారిని గోరీలనుండి లేపకనే, వాక్యములో చెప్పినట్లు వారు బయటికి ఎలా వచ్చి అవిశ్వాసులతో మాట్లాడతారని మేము అడుగుచున్నాము. అలా వచ్చి మాట్లాడినారంటే భూసమాధులలో పడుకొనియున్నారనుమాట అసత్యమగును. లేదు! **వారు సమాధులలోనే ఉన్నారు అంటే దేవుడు ఖుర్‌ఆన్ గ్రంథములో "మృతులు వచ్చి మాట్లాడినా" అను సూరా 6లో, 111వ ఆయత్ అసత్యమగును.** అయితే ఖురాన్ గ్రంథములో "మృతులు వచ్చి మాట్లాడుదురు" అని చెప్పిన వాక్యము సత్యమనీ, చనిపోయినవారు ఎవరూ భూసమాధులలో లేరనీ చెప్పుచున్నాము. మృతులు భూసమాధులలో అనగా గోరీలలో ప్రళయ కాలములో వచ్చు అంత్యకాలము వరకు పడుకొనియుంటారనుమాట పూర్తి అసత్యమైనదని చెప్పుచున్నాము. దేవుడు ఖుర్‌ఆన్ గ్రంథములో కొన్ని ఆయత్‌లలో ప్రళయము వచ్చినప్పుడు మనిషికి అంత్యదినమున తీర్పు చెప్పబడును అని ఉండుట వాస్తవమే అయినా, అంత్య దినము అంటే ఏమిటి? ప్రళయమంటే ఏమిటి? సమాధి అంటే ఏమిటి? తిరిగి లేపడము అంటే ఏమిటి? అను ప్రశ్నలకు జవాబును వెదకకుండానే ఆ వాక్యమునకు తప్పు భావములను అర్థము చేసుకోవడము వలన మనిషి జవాబు చెప్పలేని స్థితిలో ఉండిపోయాడు. అందువలన ఖుర్‌ఆన్ గ్రంథము అందరికీ అర్థము కాకుండాపోయినది. ఇక్కడ మా ప్రశ్నలతో కొంత అర్థము చేసుకొనుటకు ప్రయత్నిస్తారని అనుకొంటున్నాము.

ఖుర్‌ఆన్ గ్రంథములోగానీ, మాతృగ్రంథమయిన భగవద్గీతలోగానీ, మనుషులు అర్థము చేసుకోలేక, అపార్థము చేసుకొని అజ్ఞానములో పడుటకు

అవకాశమున్న ఎన్నో వాక్యములు గలవు. ప్రథమ దైవగ్రంథములోనూ, అంతిమ దైవగ్రంథములోనూ గూడార్థముతో కూడుకొన్న ముతషాబిహాత్ వాక్యములు అనగా సూక్ష్మమైన భావముగల వాక్యములు ఎక్కువగా యున్నాయి. వాటిని సూక్ష్మముగానే అర్థము చేసుకోవాలి. అలా అర్థము చేసుకోకుండా స్థూలముగా అర్థము చేసుకొంటే అసలు విషయము తెలియకుండా పోతుంది. దేవుని పాలనలోయుండే సేవకులను ఖుర్ఆన్ గ్రంథములో దేవదూతలు అని అనడము జరిగినది. దేవుని సమాచారమును చెప్పుటకు దేవుడు పంపిన వారిని కూడా దేవదూతలని చెప్పడము జరిగినది. కొందరు జిబ్రయేల్‌ను కూడా దూతయని అనడము జరుగుచున్నది. అరబ్బీ భాషలోనున్న ఖుర్ఆన్ మూలములో జిబ్రయేల్‌ను దూతయని ఎక్కడా చెప్పలేదని కొందరు అరబ్బీ భాష తెలిసిన ముస్లీమ్ పండితులే చెప్పుచున్నారు. చాలాచోట్ల గ్రంథములో జిబ్రయేల్‌ను ఆత్మయనియే చెప్పారు. కొన్ని వాక్యములలో దేవదూతలను చెప్పినా, వారిలో జిబ్రయేల్‌ను కలుపలేదు. ఆయనను (జిబ్రయేల్‌ను) అత్మయని చెప్పబడడమైనది. అయినా ఈ సూక్ష్మమును గ్రహించక జిబ్రయేల్‌ను దూతయని అనువారు చాలామంది కలరు. ఒకప్పుడు అందరూ అంటూయుంటే మేము కూడా జిబ్రయేల్‌ను దూతయని అనెడివారము. తర్వాత ఖుర్ఆన్ జ్ఞానము కొంత అర్థమైన తర్వాత జిబ్రయేల్‌ను దూత అని అనకూడదని తెలిసినది. జిబ్రయేల్‌ను దూత అని ఎలా అనకూడదో ముహమ్మద్ ప్రవక్తను గురువు అని అనకూడదు. ముహమ్మద్‌ను ప్రవక్త అనియే చెప్పాలి. ముహమ్మద్ గారిని ప్రవక్త అని అనకపోతే తప్పగును. ప్రవక్తను ప్రవక్తే అనాలి. దూతను దూతయనే అనాలి. జిబ్రయేల్‌ను ఆత్మయని అనవచ్చునుగానీ, దూతయని అనకూడదు. వాస్తవానికి జిబ్రయేల్ ఖగోళములో సృష్ట్యాదిలో పుట్టిన సూర్యగ్రహమువలెనున్న గ్రహము.

జిబ్రయేల్ విషయములో ఖుర్‌ఆన్ గ్రంథమందు సూరా 2, ఆయత్ 97,98లలో ఇలా కలదు చూడండి. **(2-97,98) "ఓ ప్రవక్తా! వారికి చెప్పు. "జిబ్రయేల్‌కు శత్రువైన ప్రతివాడూ అల్లాహ్‌తోనే శత్రుత్వాన్ని కొని తెచ్చుకొన్నాడన్న యదార్థాన్ని గ్రహించాలి. ఎందుకంటే అల్లాహ్ సూచనలపైనే ఆయన నీ హృదయముపై ఈ సందేశాన్ని అవతరింపజేశాడు. ఈ ఖుర్‌ఆన్ తనకు పూర్వము వచ్చిన గ్రంథాలను ధృవీకరిస్తుంది. విశ్వసించేవారికి మార్గదర్శకతను చేస్తూ వారికి శుభవార్తను ఇస్తుంది." (98) ఎవరు దేవునికి, ఆయన దూతలకు, ఆయన ప్రవక్తలకు, జిబ్రయేల్‌కు మరియు మీకాయీల్ కు శత్రువులుగా ఉంటారో అటువంటి అవిశ్వాసులకు అల్లాహ్ శత్రువుగా ఉంటాడు."** ఇక్కడ రెండు ఆయత్‌లలోనూ జిబ్రయేల్ సమాచారము వచ్చినా ఆయనను దూతయని చెప్పలేదు. 98వ ఆయత్‌లో దేవునికి ఆయన దూతలకు, ఆయన ప్రవక్తలకు అని చెప్పినప్పుడు ఆయన దూతలకు అని చెప్పినా జిబ్రయేల్‌ను దూతలలో కలుపకుండా తర్వాత జిబ్రయేల్‌కు అని చెప్పడము చూస్తే జిబ్రయేల్‌ను దూతలలోనికి కలుపలేదని తెలియుచున్నది. ఖుర్‌ఆన్ గ్రంథములో మరియొక చోట సూరా 26, ఆయత్ 193లో ఇలా చెప్పారు చూడండి. **(26-193) "ఈ ఖుర్‌ఆన్‌ను "రూహుల్ అమీన్" (నమ్మదగిన ఆత్మ) అవతరింపజేశాడు అని ఉన్నది."** ఇక్కడ ఈ ఆయత్‌లో కూడా జిబ్రయేల్‌ను దూతయని చెప్పలేదు. ఆయనను నమ్మదగిన ఆత్మయని అరబ్బీభాషలో 'రూహుల్ అమీన్' అని పేరుపెట్టి చెప్పారు. మరియొకచోట జిబ్రయేల్ విషయమును చెప్పుచూ సూరా 70, ఆయత్ 4 లో ఇలా అన్నారు చూడండి. **(70-4) "యాభైవేల సంవత్సరములతో సమాన పరిమాణముగల రోజున దైవదూతలు మరియు జిబ్రయేల్ దేవుని**

**వైపుకు అధిరోహిస్తారు."** ఈ వాక్యములో కూడా దేవదూతలు మరియు జిబ్రయేల్ అని దేవదూతలతో కలుపకుండా జిబ్రయేల్‌ను ప్రత్యేకముగా చెప్పారు. ఖుర్‌ఆన్ గ్రంథములోనే ఇంకొకచోట సూరా 78, ఆయత్ 38లో జిబ్రయేల్‌ను గురించి కలదు చూడండి. **(78-38) "ఏ రోజు ఆత్మ (జిబ్రయేల్) మరియు దేవదూతలు వరసలు తీరి నిలబడి ఉంటారో ఆ రోజు కరుణామయుని అనుమతి పొందినవాడు తప్ప ఎవరూ మాట్లాడలేరు. మాట్లాడినవాడు సరియైన మాటనే మాట్లాడు తాడు."** బాగా గమనించితే జిబ్రయేల్‌ను ఇక్కడ కూడా దేవదూతలతో కలుపకుండా చెప్పారు. జిబ్రయేల్ మరియు దేవదూతలు అని అన్నారు. జిబ్రయేల్ దేవదూత అయివుంటే వాక్యములో దూతలలోనికి కలుపకుండా ఎందుకు చెప్పుతారో మీరే ఆలోచించండి. మరియొకచోట సూరా 97, ఆయత్ 4 లో ఇలా కలదు. **(97-4) "ఆ రాత్రియందు దైవదూతలు మరియు ఆత్మ (జిబ్రయేల్) తమ ప్రభువు ఉత్తరువులపై సమస్త విషయాల నిర్వాహణ నిమిత్తము ఆకాశమునుండి భూమికి దిగి వస్తారు."** ఇక్కడ కూడా దేవ దూతలను జిబ్రయేల్‌ను వేరువేరుగా చెప్పారు. జిబ్రయేల్‌ను ఆత్మ అని చెప్పడము జరిగినది. మరియొకచోట **26-193 లో "రూహుల్ అమీన్"** అని చెప్పారు. ఆ మాటకు నమ్మదగిన ఆత్మయని అర్థము. ఈ విధముగా ఖుర్‌ఆన్ గ్రంథములో జిబ్రయేల్‌ను దూతలనుండి వేరుచేసి ప్రత్యేకించి ఆత్మ అనియూ, నమ్మదగిన ఆత్మయనియూ చెప్పారు. మేము మొదటినుండి జిబ్రయేల్ సూర్యునిలాంటివాడనీ సూర్యుడు సృష్ట్యాదిలో భూమిమీద మనువుకు జ్ఞానము చెప్పినట్లే జిబ్రయేల్ కూడా భూమిమీదికి వచ్చి ముహమ్మద్ ప్రవక్తగారికి జ్ఞానమును చెప్పాడనీ చెప్పాము. అయితే మా మాటను ఎవరూ నమ్మలేదు. దేవుని సేవ చేయువారిని ఎవరినయినా

దూతయని అనవచ్చును. అంతేగానీ ఆయన ప్రత్యేకించి దూతకాడు. జిబ్రయేల్ కూడా దేవుని సేవకుడేగానీ ఆయన దేవునివద్దనుండి వచ్చిన దూతకాడు. ఒకవేళ జిబ్రయేల్‌ను దూత అంటే నష్టమేమియని ఎవరయినా ప్రశ్నించవచ్చును. దానికి జవాబు ఏమనగా!

జిబ్రయేల్‌ను దూత అని అంటే మాకు నష్టము వచ్చేది ఏమీ లేదు. అలా అంటే దేవుని వాక్యమునకు వ్యతిరిక్తమగును. సూరా 42, ఆయత్ 51లో చెప్పిన వాక్యములోని భావమునకు లోపము ఏర్పడును. అందువలన మేము జిబ్రయేల్‌ను సూర్యగ్రహములాంటి గ్రహము అని చెప్పుచూ వచ్చాము. దేవుని పాలనలో ఎందరో భూతములు, మహా భూతములు, గ్రహములు, ఉపగ్రహములు అనువారు గలరు. అందులో గ్రహములకు సంబంధించిన వారిలో భూమిమీద జ్ఞానమును మనువుకు సృష్ట్యాదిలోనే చెప్పిన సూర్యుడు ఉన్నాడు. కలియుగములో ముహమ్మద్ ప్రవక్తకు జ్ఞానము చెప్పిన జిబ్రయేల్ కూడా ఉన్నాడు. గ్రహము అంటే గొప్పశక్తివంతమైన జ్ఞాని అని అర్థమున్నదిగానీ ఏదో తక్కువగా చెప్పినట్లు కాదు. అందువలననే ఖుర్‌ఆన్ గ్రంథములో జిబ్రయేల్‌ను దూతలలోనికి కలుపకుండా ఆత్మయని ప్రత్యేకముగా చెప్పారు. ఒకవేళ ఆత్మయనకుండా దూతయని చెప్పియుంటే 42వ సూరా, 51వ ఆయత్‌నకు అర్థము అగమ్యగోచరమయ్యేది. అంతేకాక దేవుని జ్ఞానము సిద్ధాంతము మీద, శాస్త్రపద్ధతి మీద ఆధారపడియున్నది. జ్ఞానమునకున్న శాస్త్రపద్ధతి చెడిపోకుండా వుండవలెనంటే జిబ్రయేల్‌ను గ్రహమని చెప్పడమే మంచిది. గ్రహమును ఒక్కొక్క సందర్భములో ఆత్మ అనినా తప్పులేదు కావున ఖుర్‌ఆన్ గ్రంథములో జిబ్రయేల్‌ను ఆత్మయని చెప్పారు.

సృష్ట్యాదిలో వాణి ద్వారా లేక వహీ ద్వారా వచ్చిన దేవుని సందేశమును (దేవుని జ్ఞానమును) సూర్యుడు వినడము జరిగినది. దేవుడు మొదట సూర్యునికే ఆకాశ శబ్ధము ద్వారా జ్ఞానమును చెప్పడము జరిగినది. ఆకాశములోయున్న సూర్యుడు దేవుని జ్ఞానమును ఖగోళములోని గ్రహము లకు, భూతములకు తెలియజేయడమేకాక భూమిమీదయున్న మనుషులకు కూడా తెలియజేశాడు. ఇది సృష్ఠి మొదటిలో జరిగిన తతంగము. తర్వాత భూమిమీద జ్ఞానము లేకుండా పోయినదని, అధర్మములు చెలరేగి పోయాయని తిరిగి దేవుని జ్ఞానమును మరొక విధముగా దేవుడు మనుషులకు తెలియజేశాడు. ద్వాపరయుగము చివరిలో రెండవ విధానము ప్రకారము తెలియజేశాడు. తర్వాత కలియుగములో అదే రెండవ విధానము ప్రకారము తన జ్ఞానమును మనుషులకు తెలియునట్లు దేవుడు చేశాడు. తర్వాత కొంత కాలమునకు మూడవ విధానము ప్రకారము కూడా జ్ఞానము తెలియబడినది. దేవుడు మూడు ఆత్మలుగాయున్నాడు కావున ఆయన మూడు విధములుగా తన జ్ఞానమును ప్రజలకు తెలియజేయడమైనది. మూడు విధముల అంటే ఎలాగని కొందరడుగవచ్చును. దానికి మేము చెప్పునది ఏమనగా! ఒక పద్ధతి ప్రకారము జ్ఞానము తెలియజేసిన తర్వాత మరియొక పద్ధతి ప్రకారము తెలియజేస్తే అది మరొక పద్ధతియగును. దేవుడు మూడు పద్ధతులుగా తన జ్ఞానమును తెలియజేశాడు. అయితే రెండుమార్లు ఒకే పద్ధతి ప్రకారము జ్ఞానమును తెలియజేశాడు. రెండుమార్లు ఒకే పద్ధతి ప్రకారము చెప్పినా, అది ఒక విధానమే అగుట వలన, ఒక పద్ధతి క్రిందికే జమకట్టవలసి వచ్చినది. ఈ విషయమంతయూ సవివరముగా తెలుసుకుంటే ఈ విధముగా కలదు.

సృష్ట్యాదిలో దేవుడు ఒక విధానమును ఉపయోగించి మొదట జ్ఞానమును తెలియజేశాడు. దేవుడు సృష్ఠించిన ప్రపంచములో ఆకాశము ఒక భూతమగును. ఆకాశము సాధారణ భూతమే కాకుండా మహా భూతముగాయున్నది. దేవుని సృష్ఠిలో ప్రపంచములో అసంఖ్యాకములైన జీవరాశులే కాకుండా జీవరాశులను పాలించుటకు, వాటి విధి నిర్వహణ చేయుటకు అవసరమైన తన పాలకులను తయారు చేశాడు. అలా తయారు చేయబడిన వారిలో భూతములు, మహాభూతములు, ఉపభూతములు ఉండడమేకాక, గ్రహములు, ఉపగ్రహములు కూడా కలవు. భూతములలో మహాభూతములు ఐదుమాత్రముండగా భూతములు, ఉపభూతములు కొన్ని కోట్లలో గలవు. అలాగే గ్రహములు, ఉపగ్రహములు కూడా కొన్ని కోట్ల సంఖ్యలో గలవు. దేవుడు తన సృష్ఠిలో జీవరాశులను పుట్టించడమే కాక ఆదిలోనే తన జ్ఞానమును ఒక విధానము ప్రకారము బోధించాడు. దేవుడు ఐదు మహాభూతములలో ఒక ఆకాశము ద్వారా శబ్ధమును సృష్ఠించి మొదట ఆకాశములో పైనగల సూర్యగ్రహమునకు తన జ్ఞానమును తెలియజేశాడు. వాణి ద్వారా జ్ఞానము చెప్పడమును ఒక విధానముగా లెక్కించ వచ్చును. ఆకాశ శబ్ధముద్వారా జ్ఞానమును దేవుడు చెప్పించడము ఇంతవరకూ ఒకమారే జరిగినది. రెండవమారు ఎక్కడా జరుగలేదు. దేవుడు సృష్ట్యాదిలో ఆకాశము ద్వారా సూర్యునకు జ్ఞానము చెప్పగా, సూర్యుడు తన సూక్ష్మ శరీరముతో భూమిమీదికి వచ్చి, ఒక శరీరమును ఆవహించి మాట్లాడుచూ, తాను వినిన జ్ఞానమును భూమిమీద మనువు అను వ్యక్తికి తెలియజేశాడు. తర్వాత మనువు సూర్యవంశపు రాజయిన ఇక్ష్వాకుడు అను రాజుకు తెలియజేశాడు. ఇక్ష్వాకుడు ఇతర రాజులకూ, మిగతా ప్రజలకూ తెలియజేయగా, ఒకరికొకరు చెప్పుకొనుచూ భూమిమీదికి వచ్చిన జ్ఞానము

ఆనాడు అందరికీ తెలిసిపోయినది. అలా ప్రపంచ వ్యాప్తముగా తెలిసిన జ్ఞానము కాలక్రమమున తెలియకుండా పోయినది. దేవుడు చెప్పిన ధర్మముల స్థానములో అధర్మములు వచ్చి చేరిపోయి, అదే జ్ఞానమని ప్రజలు నమ్మడము జరిగినది. దేవుడు తెలియజేసిన జ్ఞానమునకు సంబంధములేని అధర్మములు యజ్ఞ, దాన, వేద, తపస్సుల రూపములో ప్రపంచములో మొదట భారతదేశములోనే పుట్టినవి. సూర్యుడు జ్ఞానమును మొదట మనువుకు భారతదేశములోనే తెలియజెప్పగా, ప్రపంచములో మొదట జ్ఞానులదేశముగా భారతదేశము తయారయి ఇందూదేశముగా పేరుగాంచి నది.

మొదట అధర్మములు కూడా ఇందూ దేశములోనే తయారయినవి. భారతదేశము పూర్వయుగములలో స్వచ్ఛమయిన ఇందూదేశముగా పేరు గాంచియుండగా, కలియుగము ఆరంభములోనే ద్వాపరయుగ అంత్యము రాకనే అధర్మములు తయారయిపోయి భారతదేశమంతా వ్యాపించి పోయాయి. మొదట జ్ఞానము పుట్టిన దేశము భారతదేశమే. అలాగే మొదట అజ్ఞానము అధర్మములు పుట్టిన దేశముకూడా భారతదేశమే. ద్వాపర యుగము చివరిలో కలియుగము మొదటిలో దేవుడు తన జ్ఞానమును రెండవ విధానము ప్రకారము ప్రజలకు తెలియజేశాడు. ఇదే భారతదేశములోనే రెండవమారు, రెండవ విధానము చేత దేవుడు జ్ఞానమును తెలియజేయడము జరిగినది. రెండవ విధానమనగా! దేవుడు తన ప్రతినిధిని పంపి తన జ్ఞానమును చెప్పించడమును రెండవ విధానమని అంటున్నాము. సూరా 15, ఆయత్ 29,30లలో చెప్పినట్లు దేవుడు ఒక మనిషిని తయారుచేసి, తన ఆత్మనే అతనిలో నింపి, తన ప్రతినిధిగా భూమిమీదికి పంపును అనగా! తన సమాచారమును పూర్తిగా తెలిసిన తన ఆత్మనే మనిషిరూపములో

భూమి మీదికి పంపగా, అతను సాధారణ మనిషి కాదుయని తెలిసిన దేవదూతలందరూ, దేవునిలో భాగమైవచ్చు అతనికి సాష్టాంగ నమస్కారములు చేయుదురు. దేవుని అంశతో నిండిన లేక దేవుని ఆత్మతో నిండిన మనిషిని భగవంతుడు అని కూడా అనవచ్చును. భగవంతుడు అనగా తల్లి గర్భమునుండి పుట్టినవాడు అని అర్థము. భగము అనగా గర్భము అని అర్థము. గర్భమునుండి పుట్టిన మనిషి దేవుని సమాచారమును అందించు దూతగా వచ్చినా, అతను మనిషిగాయుండుట వలన ఆయనను ఎవరూ గ్రహించలేరు.

ఎవరికీ తెలియని విధముగా దేవునివద్దనుండి వచ్చిన మనిషి ద్వాపరయుగము చివరిలో కృష్ణుడు అను పేరుతో భగవద్గీతను బోధించాడు. ద్వాపరయుగము చివరిలో మొట్టమొదట దేవుని జ్ఞానము భగవద్గీత యను పేరుతో వ్యాసుడు వ్రాసిపెట్టాడు. అలా మొదట వ్యాసుడు సంస్కృత భాషలో హిందీ లిపితో (దేవనాగరి లిపితో) వ్రాసినదే మొట్టమొదటి గ్రంథము. దేవుని జ్ఞానము మొదట గ్రంథరూపముగా మారి ఇప్పటికి దాదాపు 5152 సంవత్సరములయినది. అలా ప్రప్రథముగా వచ్చిన దైవజ్ఞాన గ్రంథమునకు ప్రథమ దైవగ్రంథమని పేరు వచ్చినది. ప్రథమ దైవగ్రంథము పేరు భగవద్గీతయని గర్వముగా చెప్పుకోవచ్చును. అలా మొదట గ్రంథ రూపములో వచ్చిన జ్ఞానమే ప్రపంచములోని అందరికీ ఆధార జ్ఞానమైనది. ప్రథమ దైవగ్రంథమును అనుసరించే తర్వాత వచ్చిన బైబిలు (ఇంజీలు) మరియు ఖుర్ఆన్ గ్రంథములు తయారయినవి. అందువలన ఆ రెండు గ్రంథములకు ప్రథమ దైవగ్రంథము మాతృగ్రంథమయినది. ఖుర్ఆన్‌కు మాతృగ్రంథము న్నదని సూరా 43, ఆయత్ 4 లోనూ, మరియు సూరా 13, ఆయత్ 39 లోనూ చెప్పడమైనది. దేవుడు తన ప్రతినిధి ద్వారా

జ్ఞానమును చెప్పించడము రెండవ విధానమైనది. దేవుని సమాచారమును తెచ్చినవాడిని, దేవుని ప్రతినిధియైన భగవంతున్ని, దేవుని దూతయని కూడా అన్నారు. **దేవుడు తన దూత ద్వారా జ్ఞానమును చెప్పించడము** రెండవ విధానముకాగా, **దేవుడు తన భూతము ద్వారా జ్ఞానమును చెప్పించడము** మొదటి విధానమైనది. ద్వాపరయుగ అంత్యములో కృష్ణుడు చెప్పడముతో రెండు విధానముల ద్వారా దేవుని జ్ఞానము భూమిమీద తెలిసినట్లయినది. తర్వాత కలియుగములోనే పదునాలుగు వందల (1400) సంవత్సరముల క్రిందట జిబ్రయేల్ ముహమ్మద్ ప్రవక్తగారికి జ్ఞానమును చెప్పడము జరిగినది. అప్పుడది మూడవ విధానమైనది.

దేవుడు తన జ్ఞానమును ఒక భూతముద్వారా చెప్పించడము ఒక విధానముకాగా, తన ప్రతినిధి ద్వారా చెప్పించడము రెండవ విధానము అయినది. జిబ్రయేల్ ఒక గ్రహమైనప్పటికీ సూక్ష్మశరీరముతో భూమిమీదికి వచ్చి సూక్ష్మశరీరముతోనే మాట్లాడడమును తెరచాటునుండి మాట్లాడడము అంటారు. మాట్లాడువాడు అక్కడేయున్నా, కనిపించక మాట మాత్రము వినిపించితే దానిని తెరచాటునుండి మాట్లాడినట్లు లెక్కించవచ్చును. ఈ విధముగా జిబ్రయేల్ హీరా కొండగుహలలో ముహమ్మద్ ప్రవక్తగారికి దైవజ్ఞానమును బోధించడము మూడవ విధానమని చెప్పబడినది. ఇంతవరకూ దేవుడు మూడు విధానములతో తన జ్ఞానమును భూమిమీద బోధించాడు. ఇదే విషయమునే సూరా 42 ఆయత్ 51లో ఇలా చెప్పారు చూడండి. **(42-51) "దేవుడు ఏ మానవునితోనూ ప్రత్యక్షముగా మాట్లాడడు. దేవునితో మాట్లాడడము మనిషికి సాధ్యమయ్యేపనికాదు. దేవుడు తన జ్ఞానమును వాణి ద్వారా (వహీ ద్వారా) లేక తెరవెనుక నుంచో మనిషికి చేరవేస్తాడు. లేదా తాను కోరినది తన ఆజ్ఞతో**

**సూచించటానికి తన ప్రతినిధిని పంపుతాడు. ఆయన మహోన్నతుడు, ఎంతో వివేకవంతుడు."** ఈ వాక్యములో మనము ఇంతవరకూ చెప్పుకొన్న మూడు విధానములు గలవు. దేవుడు ఎవరితోనూ ప్రత్యక్షముగా మాట్లాడడని వాక్యము మొదటిలోనే చెప్పారు. దేవుడు ఎవరితోనూ ఎందుకు మాట్లాడడంటే దానికి ఒక కారణము కలదు. అదేమనగా! దేవునికి ఒక ముఖ్యమైన ధర్మము కలదు. దానిప్రకారమే దేవుడుంటాడు. దేవుడు రూప, నామ, క్రియలు లేనివాడనీ, అదే దేవుని ముఖ్య ధర్మమనీ చెప్పవచ్చును. దేవునికి రూపము లేదు కావున దేవుడు ఎవరికీ కనిపించువాడు కాడు. తర్వాత క్రియలేని వాడు అయినందున ఆయన స్వయముగా ఏ పనినీ చేయడు. అందువలన దేవుడు తన జ్ఞానమును మూడు విధముల లేక మూడు పద్ధతుల ప్రకారము మనిషికి చెప్పించాడుగానీ తాను స్వయముగా ఎవరికీ చెప్పలేదు.

దేవుడు తన జ్ఞానమును మూడు విధముల చెప్పించాడు. అందులో సృష్ట్యాదిలో ఆకాశవాణి ద్వారా చెప్పినది ఒక విధానము. మూడవది చెప్పేవాడు ఎదురుగాయున్నా కనిపించకయుండి చెప్పడము మూడవ విధానము. మొదటి విధానము ఆకాశవాణి సూర్యునికి జ్ఞానము చెప్పడముతో నెరవేరినది. మూడవ విధానము కలియుగములో జిబ్రయేల్ గ్రహము ముహమ్మద్ ప్రవక్తకు కనిపించకుండా జ్ఞానము చెప్పడముతో నెరవేరినది. దేవుడు తన ఆత్మతో నిండిన తన ప్రతినిధిని పంపి అతని ద్వారా ముఖాముఖిగా జ్ఞానమును చెప్పించడమును రెండవ విధానమని చెప్పవచ్చును. ఇది ద్వాపరయుగము చివరిలో కృష్ణుని ద్వారా జ్ఞానమును చెప్పించడము వలన రెండవ విధానము నెరవేరినదని చెప్పవచ్చును. ప్రత్యక్షముగా మాట్లాడి జ్ఞానము చెప్పువాడు మనిషిగాయున్నా అతను సాధారణ మనిషికాడు. అతను దేవునికి ప్రతిరూపుగా వచ్చినవాడు.

అంతేకాక దేవుని ఆత్మతో నిండివచ్చినవాడు గనుక అతనిని భగవంతుడు అని చెప్పవచ్చును. అతనినే 15వ సూరాలో, 29వ ఆయత్‌లో చెప్పడమైనది. అలా వచ్చిన వానికి సాష్టాంగ నమస్కారము చేయమనీ, దేవదూతలందరూ అతనికి సాష్టాంగ నమస్కారము చేయుచున్నారనీ చెప్పాడు. దేవునిలో భాగమైనవాడు అనగా భగవంతుడు భూమిమీద అరుదుగా ఉద్భవిస్తాడు. అలా అవతరించి వచ్చినవాడు మనిషే అయినా, తల్లిగర్భమునుండి పుట్టినా అతడు 42వ సూరా, 51వ ఆయత్‌లో చివరిలో చెప్పినట్లు ఆయన మహోన్నతుడు, ఎంతో వివేకవంతుడు అయివుంటాడు. అలా వచ్చిన భగవంతుడు పైకి సర్వసాధారణముగా కనిపించినా ఆయన జ్ఞానములో మహోన్నతుడు. దైవజ్ఞానములో అతనిని మించినవాడు ఎవడూయుండడు. మనిషికి తెలియని జ్ఞాన రహస్యములన్నియూ ఆయనకే తెలియును. ఒక విధముగా దేవుని యొక్క ఆత్మే ఆయనలో ఉండుట వలన అతనిని దేవునితో సమానముగా భావించుకోవచ్చును. దేవునికి తెలిసిన రహస్యములన్నియూ భగవంతునికి తెలిసియుండును. అందువలన కనిపించు భగవంతుడు సాధారణ మనిషియైనా జ్ఞానములో మహోన్నతుడు. అంతేగాక ప్రపంచ విషయములలో చాలా వివేకవంతుడుగాయుండును. అయినా ప్రపంచ విషయములలో పెద్దగా తెలిసినవాడుకాడు, ప్రపంచ జ్ఞానము తక్కువ అని ఎవరయినా అనుకొనినా అది వారి భ్రమేగానీ, ఆయన ప్రపంచ విషయము లలో కూడా ఎంతో వివేకవంతుడు. ఇటు దైవజ్ఞానములోనూ, అటు ప్రపంచ జ్ఞానములోనూ ఎంతో జ్ఞానము కల్గియుండుట వలన, ప్రపంచములో దేవుని ప్రతినిధిగాయుంటూ జ్ఞానమును తెలియజేసినా, ఆయనను ఎవరూ ఈయన ఫలానాయని గుర్తుపట్టలేరు. ఆయన రెండు వైపులా జ్ఞానము కలవాడు గనుక, తాను ఎవరయినదీ తెలియకుండా ప్రపంచములో నివసించి చివరకు దేవుని జ్ఞానమును చెప్పిపోవును.

దేవుడు తన జ్ఞానమును మూడు విధముల భూమిమీద ప్రజలకు తెలియజేసినా, నేను ఇలా తెలియజేసినాను అని సూరా 42, 51వ ఆయత్‌లో చెప్పినా, ఆ వాక్యమును చదివినవారు మూడుచోట్ల మూడు విధముల చెప్పిన జ్ఞానమువేరేయని, జ్ఞానములో భేదాభిప్రాయములను పెట్టుకొన్నారు. మీరు దేవుడు అనినా ఫరవాలేదు, మేము అల్లాహ్ అంటాము. మా దేవుడు అల్లాహ్‌నే అని మేము చెప్పుచున్నాము అని కొందరు ముస్లీమ్‌లు అంటున్నారు. దేవున్ని దేవుడని పిలువడము తప్పు, మేము అల్లాహ్ అనే అంటాము అనువారు కూడా కలరు. దీనికంతటికీ కారణము అజ్ఞానమే అని తెలియుచున్నది. అజ్ఞానము పోయి అందరికీ దేవుని జ్ఞానము అర్థము కావాలంటే జీవుడంటే ఎవరు? అని ప్రశ్నించుకొని జీవునికి సంబంధించిన జ్ఞానమునూ, ఆత్మకు సంబంధించిన జ్ఞానమునూ తెలియవలసిన అవసరము ఉన్నది. జీవుడంటే ఏమిటో? ఎవరో? ఇప్పుడు వివరించుకొని చూస్తాము.

శరీరములో జీవుడువుంటే సజీవ శరీరము అంటాము. జీవుడు శరీరమును వదలితే నిర్జీవ శరీరము అంటాము. జీవుడు శరీరములో ఉన్నాడా లేదా అనుటకు మనిషి శరీరములో శ్వాస ఆడుచున్నదా లేదా అని చూస్తాము. శ్వాస ఆడుచున్న శరీరమును సజీవ శరీరము అని అంటాము. శ్వాస ఉంటే శరీరములో జీవుడున్నాడనీ, శ్వాసలేకపోతే శరీరములో జీవుడు లేడని అందరికీ తెలుసు. శ్వాసకు జీవునకు ఏమి సంబంధమున్నదని చూస్తే జీవునకు శ్వాసకు ఏమాత్రము సంబంధములేదు. అందువలన కొన్ని సందర్భములలో కొందరికి శ్వాస ఆడకున్నా వారు బ్రతికేయున్న సంఘటనలు కలవు. ఇప్పుడు ఇక్కడ జీవుడు అనేవాడు ఎవడో కొంత వివరించుకొందాము. జీవించువాడు జీవుడు అని కొందరు అనగా విన్నాము. జీవుడు ఎక్కడ జీవించుచున్నాడు? అని ఎవరిని అడిగినా

శరీరములోయని వెంటనే జవాబు చెప్పగలరు. అయితే ఆ మాట వాస్తవము కాదు. జీవుడు లేక జీవాత్మ అను వానికి శరీరముతోగానీ, శ్వాసతోగానీ ఎటువంటి సంబంధములేదు. శరీరముతో పూర్తి సంబంధమున్నవాడు, శరీరమంతా వ్యాపించుకొన్నవాడు ఆత్మ అనువాడు కలడు. శరీరమునకు అధిపతి జీవాత్మకాదు ఆత్మయే. **జీవుడు శరీరములోని గుణచక్రములో ఒకచోట రవ్వంత స్థలములో ఉండగా, ఆత్మ శరీరమంతా వ్యాపించి యున్నది.** జీవాత్మ, ఆత్మ అనునవి రెండూ జోడు ఆత్మలని చెప్పుకొన్నాము. శరీరములో ఆత్మ ఎంతో ముఖ్యమైనదయినా అది ఎవరికీ తెలియకుండా అణిగియున్నది. శరీరము లోపల, బయట జరుగు పనులను ఆత్మే చేయుచున్నా జీవాత్మే చేయుచున్నాడని అందరూ అనుకొంటున్నారు. ఆత్మ అన్ని పనులు చేయుచున్నా అది చేసినట్లు తెలియకపోయినది. చేయని జీవాత్మ చేయుచున్నట్లు అందరూ అనుకోవడము జరుగుచున్నది. జీవాత్మ చేయుచున్నదని అనుకోవడమే మనిషిలో పెద్ద అజ్ఞానమైనది.

జీవాత్మ అనగా నేను అనుకొను మనమే. ఎవరి శరీరములో వారు జీవునిగాయున్నారు. ఆత్మ అనునది శరీరములో నివసిస్తుండుట వలన జీవాత్మ ఆత్మను ఆధారము చేసుకొని శరీరములోయున్నది. జీవాత్మకు శరీరములో స్వయముగా నివసించు శక్తిలేదు. ఆత్మయుంటేనే జీవాత్మ శరీరములో ఉండగలదు. ఆత్మలేకపోతే జీవుడు ఉండడు. జీవాత్మ ఆత్మతోడు లేకుండా ఎక్కడగానీ ఉండదు. ఎక్కడున్నా ఆత్మ, జీవాత్మ రెండూ ఉండవలసిందే. శరీరములో ఆత్మయుంటే శరీరము సజీవముగా ఉంటుంది. ఆత్మ లేకపోతే జీవుడు ఉండడు కావున శరీరము నిర్జీవముగా ఉండవలసిందే. శరీరములో ఆత్మే ముఖ్యమైనప్పుడు, ఆత్మను గురించి చెప్పక జీవాత్మను గురించి చెప్పడమేమిటి? అని కొందరు ప్రశ్నించవచ్చును.

దానికి మా జవాబు ఏమనగా! శరీరములో జీవుడు ఏమాత్రము ముఖ్యముకాదు. ఆత్మ అన్ని విధములా ముఖ్యమైనదే, అయినా అజ్ఞానము చేత మనిషి జీవాత్మయైన తననుతాను గొప్పగా చెప్పుకొంటున్నాడు. తన వెనుకాల తనను నడిపించు ఆత్మకలదని ఏమాత్రము అనుకోవడము లేదు. శరీరములో ఆత్మ అన్ని పనులూ చేయుచూ జీవునికి వాని కర్మ ప్రకారము సుఖదుఃఖములను అందించుచున్నది. అయినా ఆత్మ వలన సుఖ దుఃఖములు అందుచున్నవని జీవుడు అనుకోవడములేదు. తన తెలివి వలన సుఖములను అనుభవించుచున్నాను అని అనుకొంటున్నాడు. ఆత్మ శరీరములో అంతటా వ్యాపించియుండి జీవుడు చేయని పనులను తానే చేసినాను అనుకొన్నప్పుడు, వాని భావము ప్రకారము వచ్చు పాప పుణ్యములను కర్మచక్రములో నమోదు చేయుచున్నాడు. ఆత్మ, జీవుని పాపపుణ్యములను నమోదు చేయడమేకాక, వాడు గతజన్మలో చేసుకొన్న పాపపుణ్యముల ప్రకారము శరీరములో కార్యములను చేయించి, ఆ పనుల వలన జీవున్ని సుఖదుఃఖములను అనుభవించునట్లు చేయుచున్నాడు. శరీరములో జీవునికి ఆత్మ కాపలాదారునిగాయుండి ప్రతిక్షణము వానిని కర్మప్రకారము నడిపించుచున్నది మరియు కర్మలను అనుభవింపజేయు చున్నది. అంతేకాక జీవుడు నిద్రావస్థలోయున్నప్పుడు కూడా శరీరములో గుండె, ఊపిరితిత్తులను కదలించి పని చేయించుచున్నది. శరీరములో జరుగు పనులన్నిటినీ చేయుచున్నది. జీవునికి నిద్రావస్థయున్నదిగానీ, ఆత్మకు నిద్రలేదు.

ఆత్మ శరీరములో సుఖదుఃఖములను జీవునికి అందించుచూ, అతను చేయు పాపపుణ్యములను నమెదు చేసుకొనుచూ, ఎల్లప్పుడూ శరీరములో చైతన్యమై జీవున్ని శరీరములో నివసింపజేయుచున్నది.

శరీరమునకు అధిపతిగాయుంటూ, శరీరమునకు జీవునికి పెద్దగా ఆత్మ యున్నది. అయితే ఆత్మ ఒకటున్నదని కూడా చాలామందికి తెలియదు. ఈ విషయమును గురించి ఖుర్ఆన్ గ్రంథములో సూరా 86, ఆయత్ 4 లో ఇలా చెప్పుచున్నారు. **(86-4) "తనను కనిపెట్టుకొనియుండే దూత లేకుండా ఏ ప్రాణీ లేదు."** ఇంతవరకూ మనము చెప్పుకొన్నట్లు ఆత్మ జీవున్ని కాచుకొని శరీరములోయున్నదని ఆత్మలేకుండా జీవుడూ, జీవుడు లేకుండా ఆత్మయుండదని చెప్పుకొన్నాము కదా! దానిప్రకారము పై వాక్యమును చెప్పారు. ఇక్కడ దూతయనగా ఆత్మయని అర్థము చేసుకోవలెను. ఆత్మ లేకుండా ఒంటరిగా ఏ జీవరాశీ లేదు. కావున కనిపెట్టుకొనియుండే ఆత్మలేకుండా ఏ జీవరాశీ లేదనీ పై వాక్యములో చెప్పారు. జీవాత్మ, ఆత్మ అను జోడు ఆత్మలు ఎక్కడినుండి వచ్చాయి? ఎందుకు జోడుగా నివసిస్తున్నాయి. ఒకదానిని విడచి మరొకటి ఎందుకు లేకుండాయున్నవి? అను ప్రశ్నలను మనము ప్రశ్నించుకొని చూచిన ఆత్మ, జీవాత్మల గురించి ఎన్నో వివరములు తెలియగలవు. ఆ వివరములను ఇప్పుడు చూస్తాము.

జీవాత్మ, ఆత్మలు రెండూ ఒకచోటునుండి, ఒకే పదార్థమునుండి పుట్టుకొచ్చినవే. అందువలన ఒకదానితో ఒకటి అవినాభావ సంబంధము కల్గియున్నవి. ఈ రెండు ఆత్మలకు మూలపదార్థము పరమాత్మ. పరమాత్మ అనునది పేరుకాదు. ఆత్మకంటే వేరుగా, ఆత్మకంటే పరముగాయున్నందున దానిని పరమాత్మ అంటున్నాము. పరమాత్మను దేవుడు అని కూడా అనవచ్చును. దేవునికి పేరులేదు, ఆకారములేదు, పనియూలేదు. అందువలన ఈయనే దేవుడని ఎవరూ నిర్ధారించి చెప్పలేరు. దేవుడు తెలియకున్నా దేవున్ని తెలియుటకు అవసరమైన జ్ఞానము సంపూర్ణముగా

దేవుడే తెలియజేశాడు. దేవుని జ్ఞానము ప్రకారము దేవుడు లేక పరమాత్మ ప్రపంచమును సృష్ఠించి పాలించుటకు, జగత్తును నడిపించుటకు తనను తాను మొదట రెండు భాగములుగా విభజించుకొని అందులో ఒక భాగమును ప్రకృతిగా నియమించాడు. మిగిలిన భాగమును పురుష భాగముగా నియమించి, ప్రకృతి భాగమును స్త్రీ భాగముగా నియమించాడు. అందువలన ప్రకృతిని స్త్రీతత్త్వము అని అంటాము. పరమాత్మను పురుషుడు అని అంటాము. పరమాత్మ సృష్ఠి పూర్వము ఏ విధముగా ఉన్నాడో ఆ విధముగానేయుంటూ, తననుండి రెండు ఆత్మలను బయటికి పంపి, ఆ రెండు ఆత్మలలో ఒకదానిని క్షర ఆత్మ అనియూ, మరొకదానిని అక్షర ఆత్మ అనియూ చెప్పడము జరిగినది. దేవుడు దేవునిగానే యుంటూ తననుండి పురుష ఆత్మలను రెండిటిని తయారు చేసి క్షరుడు, అక్షరుడు అని చెప్పాడు కదా! క్షరుడనేవాడు జీవాత్మగాయున్నాడు, అక్షరుడనేవాడు ఆత్మగా యున్నాడు. క్షరము అనగా నాశనము. అక్షరము అనగా నాశనము కానిదియని అర్థము. దానిప్రకారము క్షరుడు అనగా నాశనమయ్యేవాడు అనీ, అక్షరుడు అనగా నాశనముకానివాడు అనీ అర్థము. నాశనమయ్యే వాడు జీవాత్మ, నాశనము కానివాడు ఆత్మగాయున్నాడు. ఈ రెండు ఆత్మల కంటే గొప్పది ప్రపంచమంతటా వ్యాపించియున్నది పరమాత్మగా చెప్పబడు మూడవ ఆత్మ. అదియే దేవునిగాయున్నది. దేవుడు తెలియజేసిన జ్ఞానము వలననే దేవుడే ప్రకృతిగా ఉన్నాడని, దేవుడే జీవునిగా, ఆత్మగాయుంటూ చివరికి తన స్థానములో తాను వుంటూ పరమాత్మగా ముల్లోకములన్నీ వ్యాపించియున్నాడని చెప్పుచున్నాము. ఇదే విషయమునే తన ప్రథమ దైవగ్రంథమయిన భగవద్గీతలో పురుషోత్తమ ప్రాప్తియోగమున 16, 17 శ్లోకములలో ఇలా చెప్పారు చూడండి.

16వ.శ్లోకము :-ద్వావిమౌ పురుషౌ లోకే క్షరశ్చాక్షర ఏవచ ।
క్షరః సర్వాణి భూతాని కూటస్థోక్షర ఉచ్యతే ॥

17వ.శ్లోకము :-ఉత్తమః పురుషస్త్వన్యః పరమాత్మే త్యుదాహృతః ।
యో లోకత్రయ మా విశ్య బిభర్త్యవ్యయ ఈశ్వరః ॥

**భావము :- (16) "లోకములోని పురుషులలో క్షరుడు అక్షరుడు అను రెండు రకముల పురుషులు గలరు. క్షరుడు సర్వశరీరములలో జీవునిగా యున్నాడు. అక్షరుడు క్షరునితో కలిసియున్నాడు." (17) "ఇద్దరు పురుషులకంటే ఉత్తముడయిన పురుషుడు వేరొకడు గలడు. అతనే పరమాత్మయని పిలువబడుచున్నాడు. అతడే ముల్లోకములందు వ్యాపించి నాశనములేనివాడై సర్వప్రపంచమునకు అధిపతిగా దేవునిగాయున్నాడు."** అని చెప్పారు. దేవుడు లేక పరమాత్మ ఎప్పటిలాగే తన ధర్మములోయుంటూ తన నుండి వచ్చిన జీవాత్మ, ఆత్మలను శరీరములో ఉండునట్లు చేశాడు. ఒక శరీరములో జీవుడు (క్షరుడు) తలయందుగల గుణచక్రములో ఉండగా, జీవునికి తోడుగా, జోడుగాయున్న ఆత్మ ఆ శరీరమంతయూ వ్యాపించి, అన్ని పనులు చేయుచూ జీవున్ని జీవింపజేయుచున్నది. ఆత్మ శరీరములో మాత్రమున్నది. శరీరము బయట ఆత్మ లేదు. పరమాత్మ అయిన మూడవ ఆత్మ శరీరములోపల, శరీరము బయటా అణువణువునా వ్యాపించియున్నది. పరమాత్మ అయిన దేవుడు, లేక దేవుడు అయిన పరమాత్మ శరీరము బయటగానీ, శరీరము లోపలగానీ ఏమీ చేయక ఊరక అన్నిటికీ సాక్షిగాయున్నాడు. సాక్షి అనగా అక్షిగలవాడు సాక్షి అనబడును. అక్షి అనగా కన్ను అని అర్థము. దీనిప్రకారము సాక్షి అంటే అన్నిటినీ చూచువాడని అర్థము. ఒక సజీవ శరీరమును తీసుకొని చూస్తే అందులో దేవుని భాగములన్నియు ఉన్నవి.

వివరించుకొని చూస్తే శరీరము ప్రకృతి స్వరూపముకాగా, ప్రకృతి కూడా మొదట దేవునినుండి పుట్టినదే. ప్రకృతి స్వరూపమైన (స్త్రీతత్త్వమైన) శరీరములో పురుషతత్త్వముగల మూడు ఆత్మలు గలవు. ఒకడు క్షరుడు అనగా జీవుడు శరీరమును ధరించి అందులో ఒకచోట మాత్రము ఉండగా, అక్షరుడు జీవున్ని నడిపించుచూ శరీరమంతా వ్యాపించి జీవునితో పాటు శరీరములోనేయున్నాడు. శరీరమంతా వ్యాపించిన ఆత్మ (అక్షరుడు) జీవున్ని కర్మప్రకారము అనుభవింపజేయుటకు శరీరమును నడిపించు చున్నది లేక త్రోలుచున్నదని చెప్పవచ్చును. ప్రతి శరీరములోనూ జీవాత్మ ఆత్మలు రెండూయుండగా, ఒకటి త్రోలబడేవాడుగా జీవాత్మ, త్రోలేవాడుగా ఆత్మయున్నారు. రెండు ఆత్మలు ఒకటి నడుపబడేది మరియొకటి నడిపేది శరీరములోయుండగా, అంతటా వ్యాపించిన పరమాత్మ శరీరములో కూడా యుంటూ జరిగేవన్నీ చూస్తూ సాక్షిగాయున్నాడు. పరమాత్మ చూచేవాడు మాత్రమేగానీ దేనియందూ జోక్యము చేసుకోడు. ఆయన (దేవుడు) ఎప్పటికీ పనిచేయనివాడే. అందువలన శరీరములో స్తబ్ధతగాయుంటూ దేనితోనూ సంబంధము లేకుండా కేవలము సాక్షిగా మాత్రమున్నాడు. ఇదే విషయమునే అంతిమ దైవగ్రంథము ఖుర్‌ఆన్‌నందు సూరా 50, ఆయత్ 21యందు మూడు ఆత్మల గురించి ఇలా చెప్పడము జరిగినది చూడండి. **(50-21) "ప్రతి వ్యక్తీ తనవెంట తనను తీసుకవచ్చే వాడొకడు, సాక్షమిచ్చేవాడు ఒకడు ఉన్న స్థితిలో హాజరవుతాడు."** మరియొక ఖుర్‌ఆన్ గ్రంథమందు ఇలా వ్రాశారు. **(50-21) "ప్రతి ప్రాణీ ఒకతోలేవాడితో, మరొక సాక్షమిచ్చేవాడితో సహా వస్తుంది"** అని కలదు. ఇక్కడ త్రోలబడేవాడు జీవాత్మ, త్రోలేవాడు ఆత్మ, సాక్షిగాయున్నవాడు పరమాత్మయని అర్థము చేసుకోవాలి.

ప్రతి శరీరములో ఉండే ఆత్మల వివరమును భగవద్గీతలో చెప్పినట్లే ఖుర్‌ఆన్ గ్రంథములో కూడా చెప్పారు. అక్కడ భగవద్గీతను, ఇక్కడ ఖుర్‌ఆన్‌ను చెప్పింది ఒకే దేవుడయినందున రెండు గ్రంథములలో ఒకే విధానము, ఒకే జ్ఞానమును చెప్పాడు. వీటిని చదివేవారి చూపులోగానీ, భావములోగానీ ఏమయినా తేడాయుండవచ్చునేమోగానీ, దేవుడు చెప్పిన దానిలో ఏమీ తేడాలేదు. రెండు గ్రంథములలోనూ ఒకే దేవుని జ్ఞానమున్నది. అయినా ఆ రెండు గ్రంథములు ఒక్కొక్కటి ఒక్కొక్క మతములోయున్నందున వాటికి మతము రంగుపూసుకొంటే మేము ఏమీ చెప్పలేము. మతము అను మాటను ప్రక్కన పెట్టిచూస్తే రెండు గ్రంథములలో చెప్పిన ఆత్మల విషయములో ఏమాత్రము తేడాలేదని తెలియుచున్నది. ఏ మతములో యున్నా మనిషికున్న శరీరము ప్రకృతితో తయారయినదే. ఒక మతస్థుని శరీరమునకు ఎన్ని అవయవములున్నవో, మిగతా మతములోయున్నవానికి కూడా అవేయున్నవి. శరీరములో తేడాలేదు, శరీరములోయున్న ఆత్మలలో తేడా లేనప్పుడు, భగవద్గీతలో చెప్పిన జ్ఞానము నాకే చెప్పినదని ముస్లీమ్‌లు ఎందుకు అనుకోకూడదు? అలాగే ఖుర్‌ఆన్‌లో చెప్పిన జ్ఞానము హిందువులు నాకే చెప్పారని ఎందుకు అనుకోకూడదు? ఎంతో గొప్ప జ్ఞానమును దేవుడు అందించినా, అది తెలియక అజ్ఞానములో మనిషి కూరుకుపోవుచున్నాడంటే అది మనిషి చేసుకొన్న పొరపాటేనని చెప్పవచ్చును. అజ్ఞానము నేడు ఒక మతమునకే పరిమితి కాలేదు. అది అన్ని మతములలో వ్యాపించియున్నది. మేము అన్ని మతములకు ఎంతోగొప్ప జ్ఞానమును అందించుచున్నా, మమ్ములను కూడా పరమత ప్రచారము చేయుచున్నారని బాధించు హిందువులున్నారంటే, అన్నిటికంటే ముందు హిందూమతము అజ్ఞానములో కూరుకుపోయినది.

మా గ్రంథము చదువునంతవరకు మతమును ప్రక్కనపెట్టి చూస్తే దేవుడు ప్రతి మతమునకు ప్రతి గ్రంథములోనూ ఎంతో జ్ఞానమును ఇచ్చాడు. అయితే మతస్థులు ఒకరినొకరు అసూయతో చూచుకోవడమేకాక దేవుని జ్ఞానమును బోధించు గ్రంథములను కూడా అసూయతో చూస్తున్నారు. అట్లయినా వారి గ్రంథములలో ఉన్నట్లయినా నడువగలుగుచున్నారాయని చూస్తే అట్లు కూడా నడువడము లేదు. ఇంకా చెప్పితే వారి గ్రంథములే వారికి అర్థము కాలేదని చెప్పవచ్చును. గ్రంథములలోని విషయము అర్థము కాకపోతే వానికి జ్ఞానమే లభించదు. వాక్యము అర్థమయితే అందులోని జ్ఞానము తెలియగలదు. ప్రస్తుతకాలములో భగవద్గీతలోని జ్ఞానము హిందువులకు అర్థము కాలేదు. అందువలన హిందువులు వేదములు, ఉపనిషత్తులు, పురాణముల మీదికి వారి దృష్టి పోయినది. అలాగే ముస్లీమ్‌లకు ఖుర్‌ఆన్ గ్రంథమును దేవుడు ఇచ్చినా, వారు కూడా హదీసు గ్రంథముల మీదికి పోయారు. దీనికి ముఖ్యకారణము వారివారి గ్రంథములలోని విషయములు వారికి అవగాహనకు రాలేదని తెలియు చున్నది. కొన్నిచోట్ల వ్రాసిన విధానమునుబట్టి వాక్యములో ఒక భావముంటే మరియొక భావముతో అర్థము చేసుకొంటున్నారు. భగవద్గీతలోకంటే ఖుర్‌ఆన్ గ్రంథములో స్థూలముగా అర్థమగునట్లు సమాచారమున్నా, అది పూర్తి సూక్ష్మ జ్ఞానముతో కూడుకొనియుండును. ఒకచోట యుద్ధము చేయుటకు ఉత్సాహముగా ఉండవలెను, శత్రువులను మట్టుపెట్టవలెను అని ఖుర్‌ఆన్‌లో చెప్పాడనుకొనుము. అప్పుడు దానిని చదివిన ముస్లీమ్ అక్కడ చెప్పినది మనుషులతో చేసే యుద్ధమనీ, మనుషులను చంపే యుద్ధమనీ అనుకోవడము జరుగుచున్నది. అయితే అక్కడ శరీరములో శత్రువులవలెనున్న చెడు గుణములపై పోరాటము చేసి, ఆ గుణములను

లేకుండా చేయమని చెప్పు భావముండగా, దానిని బయటియుద్ధముగా లెక్కించుకొంటే దేవుడు చెప్పిన జ్ఞానము కాస్త అజ్ఞానముగా మారిపోగలదు. అందువలన ఎక్కువగా సూక్ష్మభావములనే అర్థము చేసుకోవలసియుండగా, కొందరు ముస్లీమ్‌లు సూక్ష్మముగా చూడకూడదు, స్థూలముగానే చూడవలెనని చెప్పుకొని దేవుని జ్ఞానమునకు పూర్తి దూరముగా పోవుటకు దారిని ఏర్పరచుకొన్నారు.

సందర్భము వచ్చింది కాబట్టి చెప్పుచున్నాము. సూక్ష్మముగా అర్థము చేసుకోవలసిన జ్ఞాన విషయములను దేవుడు స్థూలముగా కనిపించునట్లు ఖుర్‌ఆన్ గ్రంథములో చెప్పాడు. దీనిని చదివినవారందరూ స్థూలముగా బయటి అర్థముతోనే గ్రహించు అవకాశమున్నది. అలా గ్రహించుటవలన ఆ వాక్యములవద్ద మనము జ్ఞానమును పూర్తి నష్టపోయినవారమగుదుము. మేము ఎంతగా హెచ్చరించిననూ కొన్ని వాక్యములవద్ద చాలామంది తప్పు దారి పట్టు అవకాశమున్నది. ఈ విషయము బాగా అర్థమగుటకు ఇప్పుడు ఖుర్‌ఆన్ గ్రంథములోయున్న కొన్ని ఆయత్‌లను చూస్తే అవి ఎటువంటివో, ఎలా తప్పుదారిపట్టుటకు అవకాశమున్నదో తెలియగలదు. సూరా 48, ఆయత్ 15,16,17లలో ఇలా కలదు చూడండి. **(48-15,16,17) "మీరు యుద్ధప్రాప్తిని తీసుకోవటానికి వెళుతున్నప్పుడు, వెనుక ఉండిపోయిన జనులు గబగబా వచ్చి మమ్ములను కూడా మీ వెంటరావడానికి అనుమతించండి అని అంటారు. వారు దేవుని మాటనే మార్చివేసి చూస్తున్నారు. ఓ ప్రవక్తా వారికి చెప్పేయి! "మీరు ఎట్టి పరిస్థితిలోనూ మావెంట రాలేరు. ఈ విధముగా దేవుడు ముందే చెప్పాడు." అప్పుడు వారు "అదికాదులేండి మీరు మాపై అసూయ చెందుచున్నారు." అని అంటారు. అసలు విషయమేమిటంటే వారు విషయాన్ని**

**చాలాకొద్దిగానే గ్రహిస్తారు. (16) "ఓ ప్రవక్తా! పల్లెటూరి ప్రజలలో వెనుక ఉండిపోయిన వారితో ఇలా అను "త్వరలోనే మీరు తీవ్రంగా పోరాడేందుకు ఒక జాతితో తలపడేందుకు పిలుపు వస్తుంది. మీరు వారితో యుద్ధము చేయవలసి వస్తుంది. లేదా వారంతటవారే ఆత్మసమర్పణ చేసుకొంటారు. ఆ సమయములో మీరు గనుక విధేయత చూపితే దేవుడు మీకు ఉత్తమమైన ఫలితమును ప్రసాదిస్తాడు. ఒకవేళ మీరు లోగడ విముఖత చూపినట్లే విముఖులైతే మిమ్మల్ని బాధాకరమైన శిక్షకు గురిచేస్తాడు." (17) "గ్రుడ్డి వారిపై ఎలాంటి నిందారోపణ లేదు. కుంటి వారిపై కూడా ఎలాంటి నిందారోపణలేదు. వ్యాధిగ్రస్తునిపై కూడా ఎలాంటి నిందారోపణ లేదు. ఎవడు దేవునికి ఆయన జ్ఞానమునకు విధేయుడై మసలుకుంటాడో దేవుడు అతన్ని సెలయేరులు ప్రవహించే స్వర్గవనాలలో ప్రవేశింప చేస్తాడు. మరివెన్ను చూపి తిరిగిపోయిన వారికి వ్యథా భరితమైన శిక్షను విధిస్తాడు."** ఈ మూడు ఆయత్‌లను చూచిన తర్వాత ఈ వాక్యములన్నీ యుద్ధమునకు సంబంధించిన వాక్యములుగానే కనిపించు చున్నవి. 16వ వాక్యములో త్వరలో యుద్ధానికి పిలుపు వస్తుంది. ఒక జాతివారితో పోరాడేందుకు దేవుడు నియమిస్తాడు అను వాక్యములను కొందరు ముస్లీమ్‌లు బయటి మనుషులతో చేయు యుద్ధముగా లెక్కించు కొన్నారు. దేవునికి వ్యతిరేఖముగాయున్న జాతితో పోరాడాలని అను కొన్నారు. ఆ యుద్ధమునకు విముఖత చూపితే దేవుని శిక్షకు గురియగుదురను మాటను ముస్లీమ్‌ల యువకులకు చెప్పి వారిని చావుకయినా సిద్ధమేనన్నట్లు తయారు చేయుచున్నారు. దేవునిమాటకు విధేయత చూపితే స్వర్గము వస్తుందని దేవునికొరకు ఎటువంటి

త్యాగమునయినా చేయవలెనని ఈ వాక్యముల ఆసరాతో కొందరు చెప్పుచుండగా, ఎందరో అక్కడ దేవుడు ఏమి చెప్పాడని ఆలోచించకుండా, చెప్పిన వారిమాటలను విని చెడిపోయి మార్గము తప్పిపోయినవారు ఎందరో కలరు.

దేవుడు ఫలానావాడు జీవుడు ఫలానావాడు ఆత్మయని జీవుడు ఏమీ చేయనివాడనీ, ఆత్మయే జీవునిచేత అన్నిటినీ అనుభవింపజేయు చున్నదనీ, అట్లు జీవుడు అనుభవించుటకు కావలసిన పనులన్నిటినీ ఆత్మే చేయుచున్నదనీ తెలుసుకొన్నాము. ఇదే విషయమునే ఖుర్‌ఆన్ గ్రంథములో **50వ సూరా, 21వ ఆయత్‌లో "త్రోలేవాడు ఆత్మయనీ, త్రోలబడేవాడు జీవాత్మయనీ, చూచేవాడు పరమాత్మయనీ"** చిన్నముక్కలోనే చెప్పారు. దేవుని శాస్త్రమయిన బ్రహ్మవిద్యా శాస్త్రము ప్రకారము. దేవుని విద్య అయిన ఆధ్యాత్మిక విద్య ప్రకారము జీవుడు శరీరములో ఏ కార్యములు చేయకుండా కర్మను మాత్రము అనుభవించుచున్నాడు. మిగతా జరుగవలసిన పనులనన్నిటినీ ఆత్మయే చేయుచున్నది. అయితే ప్రపంచపు పనులవరకు ఈ విధముగానే జరుగుచున్నది. అట్లు జరుగుచున్నప్పటికీ ఆ విషయము తెలియని మనుషులు శరీరములోని జీవుడే అన్ని పనులూ చేయుచున్నట్లు అనుకోవడము జరుగుచున్నది. చేయని జీవుడు చేయుచున్నాడు అనుకోవడమే అజ్ఞానము. దేవుని విషయములలో కూడా జీవుడు ఏమీ చేయలేకున్నా, చేయునదంతా ఆత్మే చేయుచున్నా, జీవుడు కొన్ని భావములను తాను చేయునట్లు తెచ్చుకోవలసియున్నది. జీవుడు కొన్ని మంచి భావములను పొందుటచేత, జీవుని ఇష్టము ప్రకారము ఆత్మే పనిచేసి జీవుడు అనుకొన్న దానిని సాధించిపెట్టుచున్నది. జీవుడు తాను గుణములను జయించవలెనని అనుకొని అదే ఉద్దేశ్యము మీద శ్రద్ధగలిగియుంటే, జీవుడు

గుణములను జయించలేకపోయినా, ఆత్మయే గుణములను అణచివేసి గుణములులేని గుణరహిత స్థితిని కలుగజేయును.

ప్రపంచ విషయములలో జీవుడు పనులు చేయకున్నా, ఆ పనులన్నిటినీ ఆత్మే చేయుచున్నా, జీవుడు ఆ పనులమీద శ్రద్ధగలిగి తానే చేయుచున్నట్లు పూర్తిగా అనుకోవడము వలన ఆత్మ చేసిన పనికూడా జీవుడు చేసినట్లు లెక్కించబడుచున్నది. ఇక్కడ భావమునుబట్టి అన్నీ పరిగణించబడుచున్నవి. స్థూలముగా జీవుడు చేయకున్నా, సూక్ష్మముగా జీవుడు చేసినట్లే వాని భావమునుబట్టి లెక్కించబడుచున్నది. వాస్తవానికి జీవుడు స్వయముగా ఏ పనినీ చేయలేడు. ఎందుకనగా వాడు (జీవుడు) మొదటికే గ్రుడ్డివాడు వానికి కళ్ళులేవు, చూపులేదు. కళ్ళు, కళ్ళకున్న చూపు శరీరములోని ప్రత్యేకమయిన భాగములు. జీవునికి కళ్ళు లేనట్లే చెవులు కూడా లేవు. బయటి కన్నులు చూచిన విషయమును మనస్సు లోపలికి తీసుకొనిపోయి బుద్ధికి అందించగా బుద్ధి జీవునకు తెలియజేయు చున్నది. అలా కన్నులు, కన్నులకున్న చూపు, అట్లే మనస్సు, చివరిలో బుద్ధి సహకరించితే జీవునకు బయటి విషయము తెలియుచున్నది. ఈ విధానము ముస్లీమ్‌లకుగానీ, హిందువులకుగానీ ఒకే విధముగా శరీరములో జరుగుచున్నది. అట్లే చెవులు విని చెప్పితే ఆ విషయమును మనస్సు స్వీకరించి శరీరములోపల తలయందుగల బుద్ధికి తెలియజేస్తే అప్పుడు జీవుడు బయటి విషయమును వినినట్లగుచున్నది. అదే విధముగా ఐదు జ్ఞానేంద్రియ విషయములు జీవునికి తెలియుచున్నవి. బయట జ్ఞానేంద్రియములు లేకపోయినా, మధ్యలో మనస్సులేకపోయినా, బుద్ధి గ్రహించకపోయినా, జీవునకు ఏ విషయమూ తెలియకుండాపోగలదు. అందువలన జీవుడు నిజముగా స్వతహాగా గ్రుడ్డివాడనీ, చెవిటివాడనీ

చెప్పవచ్చును. గ్రుడ్డి, చెవిటి, అవిటివాడయిన జీవుడు నేను అన్నీ ఉన్న వాడినని అనుకొంటున్నాడు. ఆత్మ అన్ని పనులనూ చేసిపెట్టగా, తానే అన్ని పనులనూ చేయుచున్నానని జీవుడు అనుకొంటున్నాడు.

ఆధ్యాత్మిక విద్యను తెలిసినవాడు తన భావములో తాను గుణములను జయించి, గుణముల ద్వారా వచ్చు కర్మను నిరోధించాలని అనుకొని, అదే విధముగా పూర్తి శ్రద్ధ కలిగియున్నప్పుడు, వాని భావములో యున్నట్లే ఆత్మ చేసి, కర్మను జీవునకు అంటకుండా చేయుచున్నది. అలా కర్మలను జయించిన వానిని చూచి కొందరు అజ్ఞానములో యున్నవారు మేము కూడా కర్మలను జయించునట్లు మీ వెంట మమ్ములను కూడా తీసుకుపొమ్మని అడుగుదురు. అప్పుడు జ్ఞానులయిన వారు అజ్ఞానులను మీరు మా వెంట రాలేరు అని చెప్పుదురు. ఎందుకనగా అజ్ఞానములో యున్నవారు దేవుని మాటనే మార్చివేసి జ్ఞానమును అజ్ఞానముగా లెక్కించు కొంటున్నారు. అసలు విషయము ఏమంటే దేవుని జ్ఞానము గొప్పగాయున్నా వారు కొద్దిగానే గ్రహిస్తారు. ఆ గ్రహించిన దానిని కూడా మార్చివేసి మరొక భావములోనికి తీసుకవెళుతారు. అదే విషయమునే పై వాక్యము 48-15లో చెప్పుచూ ఇలా అన్నారు. వారు దేవుని మాటనే మార్చివేసి చూస్తున్నారు అని చెప్పడమేకాక ఇంకొక విషయమును కూడా చెప్పారు. వారు విషయాన్ని చాలాకొద్దిగా గ్రహిస్తారు అని అన్నారు. జ్ఞానులను చూచి మేము మీ మాదిరి కావలెనని వారిని అడిగితే ఉన్న పద్ధతి ప్రకారము జ్ఞానమును గ్రహించనివారు, దేవుడు చెప్పిన జ్ఞానమును, భావమును మార్చివేసి చూచువారు ఎప్పుడూ దేవుని జ్ఞానములోనికి రాలేరు వారికి కర్మలు పోవు. అందువలన ఎట్టి పరిస్థితిలోనూ మీరు మా వెంటరాలేరని, ఆ విధముగా దేవుడే చెప్పాడని వాక్యములో గలదు. అలా అడిగిన

అజ్ఞానులను జ్ఞానులయినవారు మీరు కర్మలను జయించాలంటే మీరు ఒక జాతితో పోరాడవలసియుంటుందని చెప్పారు. దాని వివరమును చూస్తే కర్మనాశనము అను యుద్ధఫలితము రావాలంటే ముందు యుద్ధము చేయాలి కదా! అందువలన మీరు తీవ్రంగా పోరాడేందుకు పిలుపువస్తుంది అన్నారు. కర్మపోవాలి అంటే గుణయుద్ధము తప్పదని దాని భావము. గుణములలో మంచి చెడు అను రెండు జాతులుకలవు. వాటిలో ముందు చెడు గుణములను జయించాలి. కనుక ఒక జాతితో పోరాడేందుకు సిద్ధముగా ఉండాలని వాక్యములో చెప్పారు. ప్రపంచ జ్ఞానము తక్కువయున్న వారిని పల్లెటూరివారందురు. ఇక్కడ జ్ఞానములేనివారని చెప్పుటకు బదులు పల్లెటూరి ప్రజలలో వెనుక ఉండిపోయినవారు అని చెప్పారు. శరీరములోనే గుణముల కర్మలు అంటుకోకుండా పోరాడవలసి వచ్చినప్పుడు కొందరి శరీరములో మాయతో (గుణముల సమ్మేళనముతో) ఎక్కువగా పోరాడ వలసియున్నది. కొందరిలో మాయ తనకు తానుగా అడ్డము లేకుండా వైతొలగిపోవును. అందువలన వారంతటవారే ఆత్మసమర్పణ చేసుకొంటారు అని చెప్పారు. గుణములతో (మాయతో) పోరాడవలసి వచ్చినప్పుడు దేవుని ఎడల వినమ్రత కలిగియుండి తప్పనిసరిగా అంతరంగ యుద్ధములో గెలవాలి అనుకొనువానికి దేవుడు ఉత్తమ ఫలితమును ఇచ్చి మాయను జయించునట్లు చేయును. అట్లుకాకుండా అంతరంగ యుద్ధము చేయుటకు విముఖత చూపితే వానికి కర్మను అనుభవించు శిక్ష తప్పదు. ఇదంతయూ బ్రహ్మయోగమునకు సంబంధించిన యుద్ధము అని తెలియవలెను.

17వ వాక్యము ప్రకారము చూస్తే జీవుడు స్వతహాగా గ్రుడ్డివాడు, చెవిటివాడు, కుంటివాడని ముందే చెప్పుకొన్నాము. సాంఖ్యసూత్రము

ప్రకారము శరీరములోని అవయవములన్నిటినీ విడివిడిగా చేసి చూస్తే జీవుడు లోపల మారుమూలయున్న అంధుడు అని తెలియుచున్నది. అప్పుడు నేను చూడలేదు, నేను వినలేదు, నేను ఏమీ చేయలేదు అని తన అవిటి తనమును జ్ఞాపకముంచుకొని మాట్లాడువాడు కర్మయోగియై ఏమియూ చేయనట్లే అగును. నేను చేశాను అను అహము లేనిదానివలన అటువంటి వానికి కర్మనుండి మినహాయింపు ఉండును. అందువలన పై వాక్యములో గ్రుడ్డి, కుంటివానికి, చెవిటివానికి ఏమీ చేయలేని వ్యాధిగ్రస్థునిగా యున్నవానికి నిందారోపణ లేదు అని వాక్యములో చెప్పారు. అటువంటి కర్మవిధానము ఆచరించువానికిగానీ, బ్రహ్మయోగము ఆచరించువానికిగానీ యుద్ధఫలితము కర్మలేనిదైపోయి మోక్షము లభించును. అనగా దేవుని యందు ఐక్యమైపోవుట జరుగును.

ముస్లీమ్ మతము అరబ్ దేశములలో మొదట పుట్టినది. అందువలన ఆ దేశమునకు తగినట్లు కొన్ని వాక్యములను ఖుర్ఆన్ గ్రంథములో వ్రాయడము జరిగినది. అరబ్ దేశములు ఎడారిప్రాంతమై నీళ్ళులేని ప్రాంతాలుగా యున్నవి. అట్టివారికి సెలయేర్లు పారడము అంటే చాలా సంతోషముతో కూడుకొన్న విషయము. అలాగే ఎడారి ప్రాంతము లలో ఉద్యానవనములు ఉండవు. అటువంటివారికి ఉద్యానవనములు, సెలయేర్లు అంటే అదే స్వర్గధామముగా యుండును. కర్మనాశనమయి మోక్షము పొందినవాడు ఏ బాధా అనుభవించని స్థితిలో ఉండును కనుక, అటువంటి బాధలేని మోక్షమును వర్ణించుటకు స్వర్గసుఖములను, ఉద్యాన వనములను, సెలయేర్లను చెప్పడమైనది. నిజముగా మోక్షము పొందిన వానికి ప్రపంచములో లేని ఆనందముతో కూడియుండును. 48వ సూరా, 15,16 వాక్యములలో బ్రహ్మయోగమునకు సంబంధించిన పోరాటమును

గురించి చెప్పారు. మాయతో యుద్ధము చేసినవానికి యుద్ధ ఫలితమైన మోక్షము లభించునని సూచన చేశారు. అలాగే 17వ వాక్యములో పూర్తి కర్మయోగమును గురించి చెప్పారు. రెండు యోగముల ద్వారా మోక్షము వచ్చునని చెప్పుటకు సెలయేర్లు, ఉద్యానవనముల వర్ణన చేసి చెప్పారు. అరబ్ దేశములలో సెలయేర్లు, ఉద్యానవనములు దొరికితే వారికి మోక్షము దొరికినంత సంతోషమగుటవలన ఆ విధముగా వర్ణించి చెప్పారు. ఖుర్ఆన్ గ్రంథములో కర్మయోగము, బ్రహ్మయోగము ఉండునా? అని కొందరు అడుగవచ్చును. భగవద్గీతలో కర్మయోగము, బ్రహ్మయోగము రెండూ ఉన్నాయి. భగవద్గీతలో ఉన్నాయి కాబట్టి, ఖుర్ఆన్ గ్రంథములో కూడా ఉన్నాయని చెప్పవచ్చును. ఎందుకనగా! తనకంటే ముందువచ్చిన భగవద్గీత గ్రంథమును ఖుర్ఆన్ ధృవీకరించుచున్నది. అందువలన భగవద్గీతలో జ్ఞానము సత్యమైనదని చెప్పు నిమిత్తము, అందులోని రెండు యోగములను ధృవీకరించు నిమిత్తము ఖుర్ఆన్ గ్రంథములో 48వ సూరా, 15,16 వాక్యములను చెప్పారు. కర్మ నిర్మూలనమైన తర్వాత మోక్షము లభించునని ధృవీకరించి చెప్పుటకు 17వ వాక్యము చివరిలో సెలయేర్లు ఉద్యానవనము లను గురించి చెప్పారు. 48వ సూరాలోని ఈ వాక్యములు పైకి ఒక అర్థమును కనిపింపజేయుచూ లోపల మరియొక భావమును కల్గియుండుట వలన ఈ వాక్యములను సూక్ష్మవాక్యములని (ముతషాబిహాత్ వాక్యములని) చెప్పవచ్చును. నేటికాలములో వాక్యములోని భావమును లోతుగా ఆలోచించి తెలుసుకోకపోవడమువలన ఈ వాక్యములలో దాగియున్న వివరము తెలియకుండా పోయినది. అందువలన 15వ వాక్యములో కూడా విషయాన్ని కొద్దిగా గ్రహించువారు అని సూక్ష్మ విషయములను తెలియనివారిని గురించి

చెప్పడము జరిగినది. స్థూల, సూక్ష్మ విషయ జ్ఞానము లేనివారు 15,16,17 వాక్యములలో దాగియున్న వివరమును తెలియలేరు.

ఖుర్ఆన్ గ్రంథములో ఉన్న విషయములేమిటో దానిని చదివిన ముస్లీమ్‌లకే సరిగా తెలియదు. చదివినవారికి ఎందుకు తెలియదు? అని అంటే దానిలో ఉన్న విషయములు వేమనయోగి పద్యములలో దాగియున్న నిగూఢములాంటివి. ఇంకా చెప్పాలంటే **బ్రహ్మముగారి తత్త్వాలలో దాగియున్న అర్థములాంటివి. "ఇనుమును చేసిన మైనపుకడ్డీ" అని వేమన యోగి తన పద్యములో ఒక చిన్న వాక్యము చెప్పితే అది ఇప్పటికీ ఆధ్యాత్మికములో కొమ్ములు తిరిగినవారికి కూడా అర్థము కాలేదు. అలాగే "కాళ్ళు చేతులు లేనివాడు కడవ ముంత చేతపట్టి" అని బ్రహ్మముగారు చెప్పిన తత్త్వము, తత్త్వవేత్తలకు నేటికీ అర్థముకాలేదు.** అదే విధముగా ఖుర్ఆన్‌లో 48వ సూరా, 15,16,17 ఆయత్‌లలోనున్న వాక్యమునకుగానీ, సూరా 6, ఆయత్ 95లోనున్న విషయమునకుగానీ అర్థము నేటికీ ముస్లీమ్‌లకు అర్థముకాక ఏదో ఒకటి చెప్పి సరిచేసుకొంటున్నారు. కొందరు ముస్లీమ్‌లకు ఆ వాక్యముల మీద అనుమానముండినా తమ పెద్దలను ప్రశ్నించకూడదను భయముతో అర్థముకాకపోయినా అర్థమయినట్లు తలూపుచూ నోరు మెదపకయున్నారు. ఇంకా కొందరయితే ఖుర్ఆన్‌లోని విషయములన్నిటినీ జిబ్రయేల్ చెప్పాడని తెలియక ముహమ్మద్ ప్రవక్తగారే చెప్పారని అనుకొంటున్నారు. ఇట్లు అనేక విషయములు చాలామంది ముస్లీమ్‌లకు తెలియవు. నేడు ముస్లీమ్ ప్రపంచములో మస్జిద్‌కు పోయి ప్రార్థన చేస్తే ముస్లీమ్‌గా ఉన్నట్లేనని తమ గ్రంథములోని జ్ఞానము జోలికే పోవడములేదు. ఖుర్ఆన్ గ్రంథములోని జ్ఞానముతో సంబంధము లేకుండా కేవలము నమాజ్‌తోనే సంబంధపడి బ్రతికే ముస్లీమ్‌లు నేడు చాలామంది

యున్నారు. చాలామంది ముస్లీమ్‌లకు వారి ప్రవక్త తప్ప గ్రంథమును చెప్పిన జిబ్రయేల్ తెలియడు. అలాగే అల్లాహ్ తప్ప ఖుర్ఆన్ గ్రంథములోని జ్ఞానము తెలియదు.

కొందరికయితే వారు ముస్లీమ్‌లన్న విషయము తెలుసు, వారు వేరే దేవున్ని మ్రొక్కకూడదనేది మాత్రము తెలుసు. బక్రీదు పండుగ సమయములోనూ, రంజాన్ పండుగ సమయములోనూ సామూహిక ప్రార్థనలో పాల్గొంటారు. రంజాన్ పండుగ సమయములో రంజాన్ నెల రోజులు ఉపవాసములో పాల్గొంటారు. దానితో వారు తమను సంపూర్ణ ముస్లీమ్‌లుగా భావించుకొనియుంటారు. ఖుర్ఆన్ గ్రంథములోని జ్ఞానమును గురించి ముస్లీమ్ పెద్దలు తప్ప సామాన్య ముస్లీమ్‌లు పట్టించుకోవడము లేదు. దానికి ముఖ్యకారణము ఖుర్ఆన్‌ను అరబ్బీ భాషలోనే చదవాలను నియమము చేత చాలామంది ముస్లీమ్‌లు అరబ్బీభాష రాక ఖుర్ఆన్‌కు దూరముగా యున్నారు. కొందరు అరబ్బీ భాష లిపిని నేర్చుకొని చదివినా ఆ భాష అర్థము తెలియకపోవడము వలన చదివేదానికి పనికివస్తావుంది గానీ, అర్థము చేసుకోవడానికి పనికిరావడములేదు. ఖుర్ఆన్‌లో చాలా నిగూఢమైన ముతషాబిహాత్ వాక్యములు సూక్ష్మార్థముతో కూడుకొన్న వాక్యములు ఉండుటవలన వాటిని చదివి అర్థముకాక అడిగితే తమకు ఇబ్బంది కలుగునని, చాలామందిని ఖుర్ఆన్‌కు దూరముగా పెట్టి హదీసులకు దగ్గర చేశారు. ఎవరయినా ఖుర్ఆన్ చదివినా దానిని అరబ్బీ భాషలో చదువుటవలన ఏమీ తెలియని పరిస్థితులలో ఉండిపోవుచున్నారు. అటువంటివారు ఖుర్ఆన్ గ్రంథముకంటే దానికి ప్రవక్త అయిన ముహమ్మద్ ప్రవక్తగారిని గొప్పగా పెట్టుకోవడము జరిగినది. నేడు ముస్లీమ్‌లు ఎంతో గొప్పగా పెట్టుకొన్న ప్రవక్తను గురించి ఖుర్ఆన్ గ్రంథములో ఏమి చెప్పారో

తెలుసుకొందాము. అలా తెలుసుకోవడము వలన ప్రవక్తగారిమీద గట్టి నమ్మకము ఏర్పడునని మా ఉద్దేశ్యము. దానివలన ప్రవక్తగారిమీద నమ్మకముతో పాటు ఖుర్ఆన్ గ్రంథము మీద కూడా అవగాహన ఏర్పడునని తలచుచున్నాము. ఇప్పుడు ప్రవక్తగారిని గురించి చెప్పిన ఖుర్ఆన్‌లోని వాక్యములను చూస్తాము. సూరా 13, ఆయత్ 7లో ఇలా కలదు చూడండి. **(13-7) "ఓ ప్రవక్తా! నీ మాటను నమ్మడానికి నిరాకరించిన జనులు "ఈ వ్యక్తిపై అతని ప్రభువు పంపిన ఏదయినా సూచన (మహిమ) ఎందుకు అవతరించలేదు" అని అంటారు. నీవు వాస్తవానికి వారిని హెచ్చరించే వాడివి మాత్రమే. ప్రతిజాతికీ ఒక మార్గదర్శకుడంటూ ఒకడున్నాడు."** ఇక్కడ ఈ మాటప్రకారము ప్రవక్త మార్గదర్శకుడని తెలియబడినది. కొందరు ప్రవక్త మీద విశ్వాసము లేనివారు ఇతనిలో ఏ మహత్యమూ లేదే!యని అంటారు. ప్రవక్తలో మహత్యము లేనిమాట నిజమే. ఆయన మనుషులను మంచి మార్గమున పొమ్మని హెచ్చరించువాడని దేవుడు తెలిపాడు. ప్రవక్త దేవదూతయైవుంటే లేక దేవుడయివుంటేనో ఆయనకు మహత్యముండేది. ఆయన దేవదూతకాడు, దేవుడు కాడు. ఆయన ప్రజలను హెచ్చరించేవాడు మాత్రమే. అందువలన ఆయనలో మహత్యము లేదు. ఈ విషయమును గురించి సూరా 3, ఆయత్ 79,80లలో ఇలా అన్నారు చూడండి. **(3-79,80) "దూతలను, ప్రవక్తలను దేవునిగా చేసుకొమ్మని అతడు మీకు ఎప్పుడూ చెప్పలేదు. దేవుడు ఒక మనిషికి గ్రంథాన్ని, నిర్ణాయక శక్తినీ, ప్రవక్త పదవినీ ప్రసాదించగా అతనేమో అల్లాహ్‌ను (దేవున్ని) వదలి మీరు నాకు దాసులుకండి అని ప్రజలకు చెప్పడము అతనికి తగినపని కాదు. ఆయనయితే ఇదే చెప్పుతాడు. "నిజమైన రబ్బానీలు కండి (భక్తులు కండి) మీరు**

**పఠించే లేక బోధించే గ్రంథమునకు అనుగుణముగా దైవదూతలను లేక ప్రవక్తలను తమ ప్రభువుగా చేసుకోండని ఎంతమాత్రము చెప్పడు. మీరు ముస్లీమ్‌లయినప్పుడు ఒక ప్రవక్త మిమ్మల్ని తిరస్కారాన్ని ఆదేశించడము సాధ్యమేనా?"** ఇంతేకాక ప్రవక్త గారిని గురించి మరియొక చోట కూడా చెప్పడమైనది. ఆయన దేవుని సందేశాన్ని మనుషులకు చేర్చువాడనీ, ఆయన ఎవరికీ తండ్రికాడనీ చెప్పారు. సూరా 33, ఆయత్ 40లో ఇలా చెప్పారు చూడండి. **(33-40) "ఓ ప్రజలారా! ముహమ్మద్ ప్రవక్త మీ మగవారిలో ఎవరికీ తండ్రికాడు. ఆయన దేవుని యొక్క సందేశమును తెచ్చి ఇచ్చేవాడు. అంతేకాక ప్రవక్తల పరంపరను పరిసమాప్తము చేసే చివరివాడు. దేవుడు ప్రతీదీ తెలిసినవాడు."**

ఈ వాక్యము కూడా చాలా నిగూఢమైన వాక్యమేనని తెలియు చున్నది. ప్రవక్త ఏ పురుషునికీ తండ్రికాడు అని వాక్యములో కలదు. అయితే ప్రవక్తగారికి నలుగురు కొడుకులు పుట్టారని చరిత్ర చెపుతున్నది. పెద్ద భార్య అయిన ఖాధిజీ గారికి 1) ఖాసిమ్ 2) తాహెర్ 3) తయ్యబ్ అను ముగ్గురు కొడుకులు పుట్టారు. తర్వాత మరొక భార్య అయిన మారియా ఖాబ్తియాగారి ద్వారా ఇబ్రహీమ్ అనే అబ్బాయి పుట్టాడు. అయితే వీళ్ళంతా బాల్యములోనే మరణించారు. వారిలో ఎవరూ యుక్తవయస్సు వరకు బ్రతకలేదు. అయితే ఆయన సంతతిలో అబ్బాయిలు ఎవరూ మిగలలేదు గానీ ఆయన చనిపోయినప్పుడు కూడా ఆయన కూతుళ్ళున్నారు. ఆయన మొదటి భార్య ఖాధిజాగారికి ఏడుమంది సంతానము, వారిలో నలుగురు ఆడపిల్లలు, ముగ్గురు మగపిల్లలుకాగా మగపిల్లలందరూ చిన్న వయస్సులోనే

చనిపోయారు. కుమార్తెలు ఆయన ఉన్నంతవరకు సజీవముగానే యున్నారు. ప్రవక్తగారికి జైద్‌బిన్ హరిసా అను దత్తకుమారుడు కలడు. జైద్‌బిన్ హరిసా కుమారుడు అయినా ప్రవక్తగారికి దత్తపుత్రుడయినందున అప్పటి ఆచారము ప్రకారము జైద్‌బిన్ ముహమ్మద్ అని అతనిని పిలిచే వారు. వాస్తవానికి జైద్‌బిన్, ప్రవక్త కన్నకొడుకు కాదు. ఈ విషయమంతా తెలిసిన తర్వాత నలుగురు కన్నకొడుకులకు, ఒక దత్తపుత్రునికి తండ్రి ప్రవక్త కదా! వాక్యములో ఏ పురుషునికీ తండ్రికాడు అని వ్రాశారే! అని ఎవరయినా అడుగవచ్చును. దానికి మా సమాధానము ఇలాగున్నది. ద్వితీయ దైవగ్రంథము బైబిలుయందు మత్తయి సువార్తలో 23వ అధ్యాయమున 9వ వచనమునందు **"భూమిమీద ఎవనినైనను తండ్రియని పేరుపెట్టి పిలువవద్దు. ఒక్కడే మీ తండ్రి, ఆయన పరలోకమందున్నాడు"** అని చెప్పియున్నారు కదా! బైబిలు గ్రంథములో ఆ మాట మనుషులకు చెప్పారు. అదేమాటనే ఇక్కడ కొంతమార్చి చెప్పుచూ ఫలానా వ్యక్తిని తండ్రియని అనవద్దు అని చెప్పారు. అక్కడ ఎవరినో అన్నప్పుడు ఆ మాట ప్రవక్తకు కూడా వర్తించుతుంది. ఒకవేళ పొరపాటుగా ప్రవక్తను తండ్రియంటే బైబిలులో చెప్పిన భావము చెడిపోవును. అందువలన ఇక్కడ ప్రవక్తను కూడా తండ్రియని అనకుండా **'ప్రవక్త ఎవరికీ తండ్రికాడు'** అని అర్థమొచ్చునట్లు చెప్పారు. అయితే ఇక్కడ ప్రవక్తను తండ్రి అని చెప్పవద్దండి అని చెప్పియుంటే బైబిలులో చెప్పినట్లు చెప్పారులేయని అనుకొనేవారము. ఇక్కడ అట్లు చెప్పకుండా ఆయన మగవారికి తండ్రికాడు అని చెప్పడములో అర్థమేమి? అని ఎవరయినా ప్రశ్నించుటకు అవకాశము గలదు. అలా చెప్పడములో పెద్ద సందిగ్ధము ఏర్పడినది. దాని వివరమును చూస్తే ఇలా గలదు.

స్థూలముగా ప్రవక్తగారికి పదకొండుమంది భార్యలున్నారు. వారిలో ఇద్దరికి సంతానము కల్గినది. వారిలో నలుగురు మగవారు, నలుగురు ఆడవారు గలరు. ఈ విధముగా చూస్తే ఆయన ఆడవారికీ తండ్రే, మగవారికీ తండ్రే. కొందరు ముస్లీమ్‌లు బ్రతికియున్న ఆడపిల్లలకే తండ్రి యనీ, కొడుకులు చనిపోయారని, ఆయనకు కొడుకులు లేనందున మగవారికి తండ్రికాడు అని స్థూలముగా చెప్పారు. ఆయన చివరి వరకు దత్తపుత్రుడున్నాడు కదా!యని ఎవరయినా అంటే, ఆయన కన్నకొడుకు కాడు కదా!యని అంటున్నారు. పై చూపులు చూస్తే స్థూలముగా ఆయన మగవారికి తండ్రియగును. కొడుకులు చనిపోయినా, బ్రతికియున్నా పుట్టినది ఆయనకే గావున వారికి తండ్రియని చెప్పవచ్చును. పై వివరము చెప్పిన వారు ఆయనను తండ్రియని పిలువడానికి కొడుకులు ఎవరూ లేరు అని సరిచేసి చెప్పారు. అయితే ఇందులో నిగూఢమైన భావమున్నదని తెలియ లేకపోయారు. నిగూఢ భావము ప్రకారము చూస్తే ఇలా చెప్పవచ్చును.

ప్రవక్త దేవదూతగానీ, దేవుడుగానీ కాడు అని 3వ సూరా, 80వ వాక్యములో చెప్పియున్నాము. అదేమాట ప్రకారము ఇక్కడ కూడా ప్రవక్త ఏ మగవారికీ తండ్రికాడు అని అన్నారు. ఇక్కడ మగవారు అనడము విశేషముగాయున్నది. ఒక మనిషిని తీసుకొని చూస్తే అతనిని శరీరము+ జీవుడు అని రెండుగా విభజించి చూడవచ్చును. శరీరము ప్రకృతితో తయారగుచున్నది. ప్రకృతి అనగా స్త్రీతత్త్వము లేక స్త్రీలింగము అని చెప్పవచ్చును. శరీరములో జీవున్ని మాత్రము పురుషతత్త్వము లేక పులింగముగా చెప్పవచ్చును. జీవులను శరీరములో చేర్చి పుట్టించువాడు దేవుడే. అందువలన సర్వజీవులకు తండ్రి పరమాత్మయని భగవద్గీతలో గుణత్రయ విభాగయోగమున నాల్గవ శ్లోకమందు చెప్పారు చూడండి.

శ్లో॥ సర్వయోనిషు కౌంతేయ! మూర్తయ సంభవంతి యాః ।
తాసాంబ్రహ్మమహద్యోని అహం బీజప్రదః పితా ॥

భావము :- **"సర్వయోనులందు పుట్టుచున్న సర్వ జీవరాశులకు తల్లి మూల ప్రకృతికాగా, బీజదాతనైన నేను వాటికి తండ్రినగుచున్నాను."** ఈ వివరమును బట్టి చూస్తే సర్వజీవులకు తండ్రి సాక్షాత్తూ దేవుడే అయినప్పుడు ప్రవక్తను తండ్రియని చెప్పడము తప్పగును. పురుషులు అని అన్నందున, పురుషులు జీవులు అయినందున, ఏ జీవునికీ తండ్రి కాడు అని చెప్పుచూ ఏ పురుషునికీ తండ్రికాడు అని చెప్పారు. అనగా ఏ జీవునికీ ప్రవక్త తండ్రికాడు అని అర్థము. సమస్త జీవులు పురుషతత్త్వమునకు సంబంధించినవే అయినందున ప్రవక్త ఏ పురుషునికీ తండ్రికాడు అని చెప్పారు. అయితే కూతుళ్ళకు తండ్రి కదా! కూతుళ్ళు కూడా పురుషలింగమయిన జీవుల్లే కదా!యని ఎవరయినా అడుగవచ్చును. దానికి మా జవాబు ఏమనగా! స్త్రీలుగా పుట్టిన జీవుళ్ళకుగానీ, పురుషులుగా పుట్టిన జీవుళ్ళకు గానీ ఏ మనిషీ తండ్రికాడు, దేవుడే తండ్రియని మేము ఎన్నోమార్లు మా గ్రంథములలో చెప్పాము. భగవద్గీతలో నేనే తండ్రియని దేవుడే చెప్పాడు కదా! భగవద్గీతను ఖుర్‌ఆన్ గ్రంథము ధృవీకరించుచున్నదనుటకు ఆస్కారముగా ఈ వాక్యము భగవద్గీతయందు గుణత్రయ విభాగయోగము లోని నాల్గవ శ్లోకమును సమర్థించుచున్నది. భగవద్గీతలో ఎవరు ఎక్కడ పుట్టినా, ఏ తల్లిగర్భమునుండి పుట్టినా వానికి తండ్రి నేనే అనుమాటను బట్టి ప్రవక్త ఎవరికీ తండ్రికాదని చెప్పవచ్చును. ప్రవక్తే కాదు ఎవరూ ఎవరికీ తండ్రికాదు. అందరికీ తండ్రి దేవుడు ఒక్కడేయని తెలియాలి.

33వ సూరా 40వ ఆయత్‌లో ముహమ్మద్ ఏ పురుషునికీ తండ్రి కాడు అని ఉండడమే కాకుండా మరియొకమాట కూడా వ్రాశారు. "ఆయన

దేవుని సందేశమును తెచ్చినవాడు మాత్రమే. అంతేకాక ప్రవక్తల పరంపరను సమాప్తి చేసే చివరివాడు. ప్రతీదీ దేవునికి తెలుసు." వాస్తవానికి ముహమ్మద్ ప్రవక్తగారు దేవుని జ్ఞానమును ప్రజలకు తెచ్చి ఇచ్చిన వార్తాహరుడులాంటి వాడు. జిబ్రయేల్ చెప్పిన జ్ఞానమును విని దానిని ప్రజలకు చెప్పేవాడు. అట్లు 23 సంవత్సరములు జిబ్రయేల్ గ్రహమునకూ, ప్రజలకూ మధ్యలో వార్తాహరుడిలాగా పనిచేసి ప్రజలకు జ్ఞానమును అందించాడు. అంతేకాక ఈ వాక్యములో విశేషమేమంటే ప్రవక్తల పరంపరను సమాప్తము చేసే ఆఖరీ ప్రవక్తయని కలదు. ఆ మాటను వినిన ఎవరయినా ఒక ప్రశ్నను అడుగవచ్చును. అదేమనగా! ముహమ్మద్ ప్రవక్త స్వయానా జ్ఞానికాకపోయినా ఆయన జిబ్రయేల్ చెప్పిన జ్ఞానమును ప్రజలకు చెప్పడము వలన ఆయన బోధకుడు అయ్యాడు. బోధకుడు అయిన ఎవడయినా ప్రవక్త కాగలడు. అయితే ఆయన చనిపోయిన తర్వాత ఎంత పెద్ద జ్ఞాని వచ్చినా అతను ప్రవక్త అగుటకు అవకాశములేదు. ఎందుకనగా! ముహమ్మద్‌గారు ఆఖరీ ప్రవక్త అయినందున ఆయన తర్వాత ప్రవక్తలు వచ్చుటకు వీలులేదని కొందరంటున్నారు. అది వాస్తవమేనా? అని ప్రశ్నించవచ్చును. దానికి మా జవాబు ఇలా కలదు. ప్రవక్త అనగా ముఖ్యమైన విషయమును చెప్పు వాడని అర్థము. **ప్ర** అనగా ముఖ్యమైన అని అర్థముకాగా, **వక్త** అని అనగా చెప్పువాడు, మాట్లాడువాడు, బోధించువాడని అర్థము. ముహమ్మద్ ప్రవక్త చనిపోయిన తర్వాత కూడా జ్ఞానమును బోధించువారు రావచ్చును. జ్ఞానమును బోధించువారు నేడు కూడా భూమిమీద ఎందరో కలరు. అర్థము ప్రకారము వారందరినీ ప్రవక్తలని అనవచ్చును. అయితే ముహమ్మద్ ప్రవక్తగారికి ఆఖరీ ప్రవక్తయని చెప్పడము జరిగినది. అలాంటి పేరు మిగతావారికి రాదు. ఎందుకనగా! ఆఖరీ ప్రవక్త ఎప్పుడయినా ఒక్కడే

ఉంటాడు కావున ఆయనకు ఒక్కనికే ఆఖరీప్రవక్తయను పేరు దక్కినది. తర్వాత వచ్చినవారికి ఆ పేరు లేదు.

చివరి ప్రవక్తయని ఆయనను ఒక్కనినే ఎందుకన్నారు? అని అడిగితే దానికి జవాబు ఇలా కలదు. ఆఖరీ ప్రవక్త అను మాటను గురించి ముస్లీమ్ పెద్దలు వారి హదీసులలో చాలా వ్రాసుకొన్నారు. వాటిని మేము చెప్పడము లేదు. ఇది ఖుర్ఆన్‌లోని విషయము. ఖుర్ఆన్‌లోని విషయము దైవసందేశము. దేవునివద్ద నుండి వచ్చిన జ్ఞానము ఖుర్ఆన్‌లో ఉన్నది. హదీసులు ముస్లీమ్ పెద్దలు వ్రాసుకొన్నవి. ముస్లీమ్ పెద్దలు మనుషులే కదా! మనుషులు చెప్పిన వాక్యములను దేవుడు చెప్పిన ఖుర్ఆన్‌తో మేము జోడించడము లేదు. ఎందుకనగా దైవగ్రంథముతో దేనినీ, ఏ గ్రంథమునూ సమానముగా పోల్చకూడదు. అలా పోల్చితే దైవగ్రంథ గౌరవమునకు భంగము కల్గించినట్లగును. ఖుర్ఆన్‌లోని విషయములకు సమానముగా ప్రథమ దైవగ్రంథములోని విషయములనుగానీ, ద్వితీయ దైవగ్రంథములోని విషయములుగానీ చెప్పుకోవచ్చును. అంతేతప్ప మనుషులు వ్రాసిన ఏ విషయమునుగానీ ఖుర్ఆన్‌తో పోల్చి చెప్పకూడదు. అది దైవగ్రంథమయిన దానివలన దాని గౌరవార్థము మనుషులు చెప్పిన విషయములను దానికి జోడించి చెప్పరాదు. ఆ నియమము ప్రకారము హదీసులలోని విషయము లను మేము ఎక్కడా తీసుకోవడము లేదు.

ఖుర్ఆన్ గ్రంథములోనే 42వ సూరా, 51వ ఆయత్‌లో దేవుడు చెప్పిన జ్ఞానము ప్రకారము దేవుడు భూమిమీద మనుషులకు మూడు విధముల జ్ఞానమును తెలియజేయగా చివరికది మూడు గ్రంథములుగా రూపుదిద్దుకొన్నది. ఇదంతయూ దేవునికి తెలిసే జరిగినది. **దేవుని అనుమతి లేనిది ఏదీ జరుగదు.** అలా తయారయిన మూడు గ్రంథములలో మొదటిది

ప్రథమ దైవగ్రంథముగాయున్నది. రెండవది ద్వితీయ దైవగ్రంథముగా యున్నది. మూడవది అంతిమ దైవగ్రంథముగాయున్నది. ఆ మూడు గ్రంథముల పేర్లే తౌరాతు, ఇంజీలు, ఖుర్ఆన్. అనేక నిదర్శనాల తర్వాత తౌరాతు గ్రంథము భగవద్గీతయని తెలిసినది. ఇంజీలు అనగా బైబిలు గ్రంథమని తెలియబడుచున్నది. ప్రథమ దైవగ్రంథముగా భగవద్గీతను, ద్వితీయ దైవగ్రంథముగా బైబిలు గ్రంథమును, తృతీయ దైవగ్రంథముగా ఖుర్ఆన్ గ్రంథమును చెప్పవచ్చును. అయితే ఇక్కడ కొందరు భగవద్గీతను ప్రథమ దైవగ్రంథముగా ఒప్పుకోకపోవచ్చును. దానికి ఆధారమేమి? అని అడుగవచ్చును. దానికి మా సమాధానము ఏమనగా! అంతిమ దైవగ్రంథము అని అందరికీ తెలుసు. ఆ మాట ఖుర్ఆన్‌లోనే కలదు. దీనినిబట్టి ద్వితీయ దైవగ్రంథమునూ, అలాగే ప్రథమ దైవగ్రంథమునూ కనిపెట్టవచ్చును. ఇంతవరకు ఫలానా గ్రంథము ప్రథమ దైవగ్రంథమనిగానీ, ఫలానాది ద్వితీయ దైవగ్రంథమనిగానీ ఎవరూ చెప్పడముగానీ, వ్రాయడముగానీ జరుగలేదు. అయితే మొట్టమొదటగా మేమే ఫలానా గ్రంథము మొదటి దైవగ్రంథమనీ, ఫలానా గ్రంథము రెండవ దైవగ్రంథమనీ చెప్పాము. ఆ విషయము నాకు సంపూర్ణముగా తెలుసు కనుక చెప్పాను.

ఖుర్ఆన్ గ్రంథములో అనేకచోట్ల ముందు వచ్చిన గ్రంథములను ధృవీకరించుటకే ఈ ఖుర్ఆన్ గ్రంథమును అవతరింపజేశాను అని దేవుడు అదే గ్రంథమందు చెప్పడము జరిగినది. అంతేకాక ఖుర్ఆన్‌లోని వాక్యములు అనేకచోట్ల భగవద్గీతలోని వాక్యములకు సమానముగా చెప్పుచూ, భగవద్గీతను ధృవీకరించుట వలన ఖుర్ఆన్‌కంటే ముందు వచ్చిన మొదటి దైవగ్రంథము భగవద్గీతయని తెలిసిపోయినది. అంతేకాక తౌరాతు గ్రంథము, ఇంజీలు గ్రంథములు రెండూ ఖుర్ఆన్‌కంటే

ముందువచ్చిన గ్రంథములని తెలిసిపోయినది. ఇంజీలు అంటే బైబిలు గ్రంథమని ఖుర్ఆన్ గ్రంథములోనే చెప్పబడినది. ఇకపోతే తౌరాత్ గ్రంథమును గురించి ఎవరికీ తెలియదు. తౌరాత్ గ్రంథము ఎప్పుడుండేదో, ఏ భాషలో ఉండేదో మాకు తెలియదని కొందరు వ్రాశారు. ఎవరు ఏమి చెప్పినా! తౌరాతు గ్రంథము ఖుర్ఆన్ ధృవీకరణనుబట్టి భగవద్గీతయని తెలిసిపోవుచున్నది. ప్రథమ దైవగ్రంథమును చెప్పినవాడు 42వ సూరా, 51వ ఆయత్‌కు లోబడేయున్నాడు. రెండవ దైవగ్రంథమును మనము చెప్పకనే ఖుర్ఆన్ గ్రంథమే ఇంజీలు అని తెలియజేయుచున్నది. ఇంజీలు అంటే బైబిలు అనీ, దానిని చెప్పినవాడు ఏసు దాని ప్రవక్తయనీ తెలియుచున్నది. ఖుర్ఆన్‌కంటే ముందు వచ్చిన భగవద్గీత మరియు సువార్తబైబిలు రెండూ (42-51) వాక్యమునకు లోబడియున్నాయి. దేవుడు నా ప్రతినిధి అయిన దూతను పంపి, జ్ఞానము తెలియజేస్తాను అన్నమాట ప్రకారము భగవద్గీతను చెప్పిన మనిషి, సువార్త బైబిలును చెప్పిన మనిషి ఇద్దరూ దేవుడు పంపిన దూతలని అర్థమగుచున్నది. ఇకపోతే జిబ్రయేల్ ద్వారా తెరవెనుకనుండి జ్ఞానము చెప్పించడము జరిగినది. సృష్ట్యాదిలోనే ఆకాశవాణి ద్వారా సూర్యునికి జ్ఞానము చెప్పానని భగవద్గీతలోనే చెప్పడము వలన, వహీ ద్వారా తెలియజేస్తానని చెప్పిన మాట కూడా నెరవేరినది. ఖుర్ఆన్‌లో (42-51)లో ప్రకటించినట్లే మూడు విధముల బోధలు అయిపోయినవి. అట్లే మూడు గ్రంథములు కూడా వచ్చినవి.

ఖుర్ఆన్ అంతిమ దైవగ్రంథమని అదే గ్రంథమందు చెప్పడము వలన, దానికంటే ముందువచ్చిన రెండు గ్రంథములు సులభముగా తెలిసి పోయినవి. చివరి గ్రంథము ఖుర్ఆన్ అన్నట్లే దాని ప్రవక్త చివరి ప్రవక్తయని గ్రంథములో (33-40)లో చెప్పడమైనది. ఇక్కడ వివరమేమంటే ఈ

మూడు గ్రంథములు మినహా నాల్గవ గ్రంథము వచ్చుటకు వీలులేదు. అప్పుడు మూడవ గ్రంథమే చివరిదయినందువలన దాని ప్రవక్త తప్పక చివరి ప్రవక్తయగునని చెప్పవచ్చును. తర్వాత ప్రవక్తలు రాకూడదనిగానీ, రారనిగానీ చెప్పలేదు కదా! వచ్చినా వారు సాధారణ ప్రవక్తలుగా, సాధారణ బోధకులుగా ఉండిపోవలసిందేగానీ, వారికి ఎటువంటి గుర్తింపూ ఉండదు. అయితే దేవునివద్దనుండి వచ్చు ప్రతినిధులయిన దేవదూత రావచ్చును. ఆయన ముందు చెప్పిన జ్ఞానమునే గాడితప్పకుండా చెప్పిపోవచ్చును. ధర్మములు అధర్మములుగా మారినప్పుడు అవతరించి ధర్మములను పునరుద్ధరించుతానని భగవద్గీతలో చెప్పినట్లు దేవుని ప్రతినిధిగా భగవంతుడు రావచ్చును. వచ్చి ముందు చెప్పిన జ్ఞానమునే చెప్పిపోవును. అంతేగానీ, ఇక ఖుర్‌ఆన్‌కంటే అంతిమ దైవగ్రంథమూ ఉండదు. అలాగే అంతిమ ప్రవక్తయుండడు. మొదటిది, మధ్యది, చివరిది మూడు గ్రంథములు వచ్చాయి కనుక ఇక అవి రావు. భవిష్యత్తులో మూడు గ్రంథములు కలిసిన గ్రంథము రావచ్చును, మూడు గ్రంథముల జ్ఞానమును కలిపి చెప్పు భగవంతుడు (దేవుని ప్రతినిధి) రావచ్చును. దేవునికి అన్నీ తెలుసు అని (32-40) వాక్యము చివరిలోయున్నది. అందువలన ఆయనకు తెలిసే భగవంతుడు మనిషివలె రావచ్చును. మూడు జ్ఞానములు కలిపి చెప్పవచ్చును.

ఇంతవరకు ప్రవక్తలకు సంబంధించిన విషయములను సంపూర్ణముగా తెలుసుకొన్నాము. అయితే ఇంకా తెలియవలసినది కొంత మిగిలియున్నదని జిబ్రయేల్ 72వ సూరాలో, ఆయత్ 26, 27లలో ఇలా చెప్పుచున్నారు. **(72-26,27) "ఆయన (దేవుడు) అగోచర జ్ఞానము కలవాడు. తన అగోచర విషయములను ఆయన ఎవరికీ తెలుపడు."**

**(27) "తాను ఇష్టపడిన ప్రవక్తకు తప్ప ఇతరులకు తెలుపడు. అయితే ఆ ప్రవక్తకు ముందూ వెనుకా పహారాదారులను నియమిస్తాడు."** ఇక్కడ చెప్పిన వాక్యములలో దేవుడు అగోచర జ్ఞానము కలవాడు అనివుంది. అగోచరము అంటే కంటికి కనిపించని జ్ఞానము అని అర్థము. మనుషులు కంటికి కనిపించు జ్ఞానమునే సరిగా అర్థము చేసుకోలేకున్నారు. ఇక కంటికి కనిపించని అగోచర జ్ఞానము అంటే ఏమిటో కూడా తెలియని స్థితిలో మనిషియున్నాడు. ఇక్కడ (72-26వ) వాక్యములో తన అగోచర విషయములను ఆయన ఎవరికీ తెలుపడు అని ఉన్నది. ఎవరికీ తెలుపనప్పుడు తనకు తప్ప ఇతరులకు తెలియుటకు అవకాశమే లేదని చెప్పవచ్చును. అయితే రెండవ వాక్యములో తాను ఇష్టపడిన ప్రవక్తకు తప్ప ఇతరులకెవరికీ తెలుపను అన్నాడు. అయితే ఇక్కడ దేవుడు చెప్పిన తాను ఇష్టపడిన ప్రవక్త ఎవరు? అని ఆలోచిస్తే ఈ విధముగా తెలియుచున్నది. ప్రవక్త అంటే సాధారణ వ్యక్తి జ్ఞానమును చెప్పినా అతనిని ప్రవక్తయని అనవచ్చును. 'వక్త' అంటే చెప్పువాడు, 'ప్ర' అంటే ముఖ్యమైన అని అర్థము ఉండుటవలన ముఖ్యమైన మాటలను చెప్పువానిని ప్రవక్తయని అనవచ్చును. ఆ పద్ధతి ప్రకారము భగవంతుడు వచ్చి జ్ఞానమును చెప్పినా అతనిని ప్రవక్త అని చెప్పవచ్చును. అట్లే సాధారణ మనిషిని కూడా అతను ముఖ్యమైన జ్ఞానమును చెప్పితే ప్రవక్తయని అనవచ్చును. ఆ లెక్కప్రకారము బోధకులను అందరినీ ప్రవక్తయని చెప్పవచ్చును.

దేవుడు తన అగోచర జ్ఞానమును ఎవరికీ తెలుపడు అని ముందు వాక్యములో చెప్పాడు, కావున అది దేవునికి తప్ప ఎవరికీ తెలియదనియే చెప్పవచ్చును. అయితే తనకు ఇష్టమైన ప్రవక్తకు తప్ప ఇతరులకు చెప్పడు అని రెండవ వచనములోయున్నది. ఇష్టమైన వాడు ఎవడు అంటే, దేవుడు

తనవద్దనుండి పంపు తన ప్రతినిధే ఆయనకు ఇష్టమైనవాడు అని చెప్పవచ్చును. తన ప్రతినిధికి చెప్పితే ఇతరులకు ఎవరికీ చెప్పనట్లేయగును. ఇందు మరొక రహస్యముకలదు. అదేమనగా! దేవునివద్దనుండి వచ్చు ప్రతినిధి దేవుడు తప్ప ఎవరూ కాదని ఇంతకుముందు చెప్పుకొన్నాము. దేవుడు తన ప్రతినిధిని పంపునప్పుడు అతనిలో దేవుడు తన ఆత్మనే నింపి పంపుతానని (15-29,30) వాక్యములలో చెప్పడము జరిగినది. అలా దేవుని ప్రతినిధిగా వచ్చువారు దేవుని ఆత్మేయగుట వలన, అతనిని దేవుడు అని అనకుండా భగవంతుడు అని అంటున్నాము. దేవునిలోని భాగమే భగవంతుడు అని తెలియవలెను. మరొకమాట చెప్పితే దేవుడు అని చెప్పబడని దేవుడు అని అర్థము. దేవుడు తన ధర్మము ప్రకారము రూప, నామ, క్రియలు లేనివాడు దేవుడగును. అందువలన రూప, నామ, క్రియలు గల వ్యక్తిగా దేవుడు వచ్చినప్పుడు, ఆయనను అప్పుడు దేవుడు అని అనకుండా భగవంతుడు అని మారు పేరు చెప్పవచ్చును. భగవంతుడు ఎవరయినదీ ఆయన సేవకులయిన అగోచరముగాయున్న పాలకులకు తెలుసు. కనుక దేవుడు భగవంతునిగా భూమిమీదకి వస్తే ఇతరులకు కనిపించకుండా దేవుని పాలకులలోని గ్రహములు, భూతములు భగవంతుని ముందర వెనుక విధేయులై పహారాదారులై యుంటారు. ఆ విషయము అగోచరము కావున మనుషులకు ఎవరికీ కనిపించదు. భూమిమీద భగవంతుడు ఉద్భవించినప్పుడు ఆ విషయము మనుషులకు తెలియదుగానీ, గ్రహములకు, భూతములకు దేవుని పాలకులందరికీ తెలిసిపోవును. అగోచర విషయములన్నీ పాలకులకు తెలుసు కావున, అగోచరమైన దేవుడు భగవంతునిగా వచ్చినప్పుడు ఆ విషయము వారికి తెలియును. అందువలన **(89-22) వాక్యములో "దేవుడు అవతరించినప్పుడు దేవదూతలు**

**బారులుతీరి వరుసగా నిలబడియుందురని" చెప్పారు.** 72-27 వాక్యములో తను ఇష్టపడిన ప్రవక్తకు అనియుండుట వలన చాలామంది ఈ వాక్యము ముహమ్మద్ ప్రవక్తకు సంబంధించినదనీ అనుకొన్నారు. అయితే ఈ వాక్యమును చూచిన తర్వాత ఇది ప్రవక్తగారికి చెందినదికాదనీ, సాక్షాత్తూ దేవుని అవతారమైన భగవంతునికి సంబంధించిన వాక్యమని తెలిసి పోయినది. ఖుర్ఆన్ గ్రంథములో భగవంతున్ని గురించి వ్రాసిన వాక్యములు మూడు, నాలుగు చోట్ల 15వ సూరాలో, 29,30 వాక్యముల లోనూ, 89వ సూరాలో, 21,22 వాక్యములలోనూ, 72వ సూరాలో, 26,27 వాక్యముల లోనూ ఉన్నప్పటికీ ముస్లీమ్ సమాజము, 'దేవుడు అవతరిస్తాడు' అని అంటే ఒప్పుకొనే స్థితిలో లేరు. నూటికి నూరుపాళ్ళు దేవుడు ఎప్పుడూ పైన ఆకాశములోనే ఉంటాడు అని వారి నమ్మకము. అయితే మేము చెప్పునది ఏమనగా! నమ్మకము వేరు, సత్యము వేరు. దేవుడు చెప్పిన తర్వాత కూడా ఆయన మాటను అర్థము చేసుకోలేకపోతే అది అజ్ఞానమగును. దేవుని మాటను కూడా ఎదిరించిన దానితో సమానమగును. అట్లుకాకుండా సత్యమునే తెలియవలెననీ, దేవుడు చెప్పిన సత్యము ముందర మనుషుల నమ్మకములు పనిచేయవనీ తెలుపుచున్నాము. మనుషుల మాటలను నమ్మి దేవుని వాక్యములను ప్రక్కన పెట్టకూడదని తెలుపుచున్నాము.

జ్ఞానమును ఎవరు బోధించినా వారిని పదములోయున్న అర్థము ప్రకారము ప్రవక్త అని అనుచున్నాము. ప్రవక్తలలో సామాన్య మనిషినుండి అనేక స్థాయిలలోనున్న జ్ఞానులుండవచ్చును. చివరికి దేవుడు దిగివచ్చినా ప్రవక్తయను పేరు ఆయనకు కూడా వర్తించును. ప్రవక్త అను మూడు అక్షరములకు అర్థమును చెప్పుకొంటే దానిప్రకారము చిన్న జ్ఞానమును

చెప్పినా, పెద్ద జ్ఞానమును చెప్పినా చెప్పినవానిని ప్రవక్త అనియే అనవచ్చును. ప్రవక్త అని పేరు చెప్పునప్పుడంతా ఒకే స్థాయిలో ప్రవక్తలను అర్థము చేసుకోకూడదు. ఖుర్‌ఆన్ గ్రంథములో సూరా 21, ఆయత్ 7,8లలో కూడా ప్రవక్తయని పేరుపెట్టి చెప్పినా అది భగవంతున్ని గురించి చెప్పిన వాక్యములుగా అర్థమగుచున్నవి. **(21-7,8) "ఓ ముహమ్మద్ ప్రవక్తా! నీకు పూర్వము మేము ప్రవక్తలుగా పంపినవారంతా పురుషులే. వారివద్దకు మేము మా సందేశాన్ని పంపేవాళ్ళము. ఈ సంగతి నీకు తెలియకపోతే తెలిసిన జ్ఞానులను అడిగి తెలుసుకోండి. (8) "మేము వారి శరీరాన్ని వారు అన్నము తినకుండా ఉండగలిగేలా నిర్మించలేదు. వారు ఎల్లకాలము ఉండేవారు కూడా కాదు."** మీరు బాగా గమనించగలిగితే ఈ వాక్యములే ప్రత్యేకముగాయున్నట్లు తెలియగలవు. వారి శరీరాలను అన్నము తినకుండా ఉండగలిగేలా నిర్మించలేదు అని అంటే ఆ మాట చెప్పవలసిన అవసరము ఎందుకు వచ్చినదో ఆలోచిస్తే కొంతవరకు అందులో విశేషమున్నదని తెలియగలదు. దేవుడే మనిషిగా పుట్టాడు అని చెప్పియుంటే అతడు అన్నము తినకుండా ఉంటాడా!యని కొందరు చూడవచ్చును. అందువలన ముందే వారి శరీరములను అన్నము తినకుండా ఉండగలిగేలా నిర్మించలేదు అని చెప్పారు. అట్లు నిర్మించితే తిననివాడు దేవుడని అందరికీ తెలిసిపోవును. అట్లు తెలియకుండా ఉండుటకు దేవుడు వచ్చినా అతను అన్నము తినేటట్లే శరీరమును తయారు చేశాడు. వచ్చిన మనిషి దేవుడని తెలియాలంటే జ్ఞానము అవసరమునుబట్టి తెలియును. అందువలన నీకు తెలియకపోతే జ్ఞానులను అడిగి తెలుసుకోమని ఏడవ వాక్యము చివరిలో చెప్పారు.

సాధారణ మనిషి ప్రవక్తగా పుట్టితే అతనిని గురించి చూడవలసిన అవసరమే లేదు. మనిషి అయినవాడు ఎట్లయినా అన్నము తినే బ్రతుకుతాడు కావున వానిని అన్నము తింటాడా లేదా యని చూడవలసిన పనేలేదు. పుట్టినవాడు సాధారణ మనిషికాదేమో! అన్నపుడే అనుమానముతో అన్నీ చూడవలసి వచ్చును. అదే విధముగానే 21వ సూరా, 7వ వాక్యములో చెప్పిన మాటను బట్టి వచ్చిన మనిషిమీద అనుమానము తప్పక రాగలదు. అందువలన నీకు తెలియకపోతే జ్ఞానులను అడుగు అని చెప్పారు. 7వ వాక్యములో మేము ప్రవక్తలుగా పంపినవారంతా పురుషులే అని చెప్పారు. అలా చెప్పుట వలన ప్రత్యేకించి పురుషులే అని చెప్పడములో విశేషమేమి కలదని ఆలోచింతురు. అట్లు ఆలోచించినప్పుడు అసలు విషయము తెలిస్తే ఫరవాలేదు. ఒకవేళ ఏమీ తెలియకపోతే తెలిసిన జ్ఞానులను అడిగి తెలుసుకొమ్మని వాక్యములో చెప్పాడు. ఒకవేళ మనకు ఈ విషయము తెలియకపోతే మనము జ్ఞానము తెలిసినవారిని అడుగవలసిందే. ఒకవేళ అడిగామనుకోండి ఇప్పుడు జ్ఞానులయినవారు ఏమి చెప్పుదురో చూస్తాము. అడుగవలసినది జ్ఞానులను అని జ్ఞప్తికుంచుకొని జ్ఞానులనే అడగాలి. జ్ఞానుల వలెనున్న అజ్ఞానులను అడుగరాదు.

ఇక్కడ నేరుగా సమాధానము చెప్పుకొనుటకు ముందు ఒక విషయమును విపులముగా తెలుసుకొందాము. భూమిమీద మూడు జాతుల మనుషులున్నారు. ఒకటి పురుషజాతి, రెండు స్త్రీజాతి, మూడు నపుంసక జాతి. ఈ మూడు రకముల వ్యక్తులను దేవుడు తెలిసే పుట్టించాడు. మనుషులలో పురుషులంటే ఎవరో, స్త్రీలంటే ఎవరో అందరికీ తెలుసు. ఇకపోతే నపుంసకులంటే ఎవరో చిన్నపిల్లలకు తెలియకున్నా పెద్దవారికి బాగా తెలుసు. స్త్రీ, పురుషుడు, నపుంసకుడు అనునది స్థూలముకాగా,

సూక్ష్మము ప్రకారము ఆధ్యాత్మిక జ్ఞానము ప్రకారము స్త్రీ అనగా ప్రకృతియనీ, పురుషుడు అనగా పరమాత్మ లేక దేవుడుయనీ, నపుంసక అనగా ప్రకృతిలో కలిసిన ఆత్మయనీ అర్థమగుచున్నది. స్థూలము ప్రకారము స్త్రీ పురుషులు వేరువేరుగాయున్నా స్త్రీ పురుషలక్షణాలు కలిసియున్నవానిని లేక పురుషుని యందు స్త్రీ లక్షణాలున్న వానిని నపుంసకుడు అని అంటారు. పురుషుడుగా పుట్టినవానిలో స్త్రీ భావములు కలిగిన వానిని నపుంసకుడు అని అంటారు. ఇంకా వివరముగా చెప్పితే శరీరము పురుష శరీరముండి శరీరములోని భావములన్నీ స్త్రీ లక్షణాలతో కూడుకొన్నవిగాయుంటే అటువంటివానిని నపుంసకుడు అని అంటారు. 'న' అంటే లేదు 'పుంసము' అంటే మగతనము. మగతనము లేనివాడు అని అంటాము. అటువంటివారు బయట ప్రపంచములో చాలామంది కలరు. శరీరము పురుషునిది. అందులోని లక్షణములు కోర్కెలు అన్నీ స్త్రీలవి. అటువంటివారే నపుంసకులు.

ఆధ్యాత్మిక విషయములోనికి వస్తే శరీరము ప్రకృతి, అందులోని ఆత్మ, జీవాత్మ పురుషులని అందరికీ తెలుసు. ఇప్పుడు జీవాత్మ విషయమును ముఖ్యముగా తీసుకొని చూస్తే జీవుడు గుణముల మధ్యలో ఉండుట వలన, ప్రకృతి జనితములయిన గుణములతో కలియుట వలన, జీవాత్మ జ్ఞానము లేనిదై గుణభావములలో పూర్తిగా లగ్నమైపోతే, అటువంటి జీవాత్మ ప్రకృతి గుణములలో పూర్తి లగ్నమైపోయి తాను ఒక ఆత్మనను విషయమునే మరచిపోవును. అలా తాను ఒక ఆత్మనని తెలియక ప్రకృతి దృష్టిలో నిండిపోయిన జీవాత్మను నపుంసక ఆత్మయని అనవచ్చును. జీవుడు ఒక ఆత్మే అయినా వాడు ప్రకృతి భావములతో కూడియుండుట వలన ఆడ లక్షణములతో కూడియున్న మగవానివలె ఉండుట వలన అట్టి జీవాత్మను నపుంసక ఆత్మ అంటున్నాము. ఇప్పుడు ప్రపంచములో పుట్టుచున్న

ప్రజలనందరినీ చూచినట్లయితే అందరి శరీరములలోయున్న జీవాత్మలు పూర్తిగా గుణముల ఆవరణములో, గుణముల మధ్యలో చిక్కుకొని ఆత్మ భావములను వదలి గుణ భావములనే కల్గియున్నారు. గుణములన్నిటినీ కలిపి మాయ అనవచ్చును. మాయలో చిక్కిన జీవాత్మ ఆడగానీ, మగగానీ వాడు లోపల నపుంసక ఆత్మగానేయున్నాడని తెలియవలెను. మాయలో చిక్కుకోకుండా జ్ఞానమును తెలిసి నేను ఒక ఆత్మనని తెలిసిన వానిని (జీవాత్మను) పురుషునిగానే లెక్కించవచ్చును. ఏమాత్రము జ్ఞానము తెలియక గుణములయందున్న వానిని నపుంసక జీవాత్మయనబడును. శరీరములో పుట్టిన ప్రతి జీవుడూ గుణ భాగములలోనే నివసిస్తూ మధ్యలోయున్న ఆత్మ భాగమును చేరని వానిని (జీవున్ని) నపుంసకుడని చెప్పవచ్చును.

శరీరములో గుణచక్రమందు నాలుగు భాగములలో మూడు గుణ భాగములుకాగా, ఒకటి ఆత్మ భాగముగాయున్నది. జ్ఞానము తెలియని జీవుళ్ళు అందరూ మూడు గుణ భాగములలో ఉండగా, సంపూర్ణ జ్ఞానమును తెలిసినవారు గుణములను జయించి, మాయను ఛేదించి గుణ భాగములను దాటి ఆత్మ భాగములో ప్రవేశించుచుండును. భగవద్గీతలో గుణములను జయించడము అరుదైన పనిగా, అసాధ్యమైన పనిగా చెప్పారు. **"మమ మాయా దురత్యయా"** అని నా మాయను దాటుట దుస్సాధ్యము అని అన్నారు. ఎవడయితే అసలయిన జ్ఞానమును తెలిసి, అసలయిన దేవున్ని ఆరాధించుచున్నాడో వాడు మాత్రము గుణములను జయించి మాయను దాటగలడని చెప్పారు. ఈ విషయమునే భగవద్గీత విజ్ఞానయోగమున 14వ శ్లోకమున ఈ విధముగా చెప్పారు.

శ్లో॥ దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా ।
మామేవ యే ప్రపద్యంతే మాయామేతాం తరంతి తే ॥

భావము : **–"గుణములతో తయారయిన నా మాయను దాటుట దుస్సాధ్యమైన పని. ఎవడయితే నన్ను భక్తి శ్రద్ధలతో ఆరాధించుచున్నాడో వాడుమాత్రము మాయను దాటి పోగలడు."** మాయను దాటి ఎక్కడికి పోగలడు అంటే గుణచక్రములోని మూడు గుణ భాగములను దాటి మధ్యలో గల ఆత్మ భాగములోనికి పోగలడు. ఎవడయితే అసలయిన దేవున్ని ఆరాధించునో అని చెప్పారు కదా! అలా అసలయిన దేవున్ని ఆరాధించాలంటే దానికి తగిన జ్ఞానముండాలి. జ్ఞానము లేకపోతే, అసలయిన దేవుడు తెలియడు. అసలయిన దేవున్ని తెలియుటకు ఆధ్యాత్మిక జ్ఞానము అవసరము. నేడు బయటి ప్రపంచములో గొప్ప జ్ఞానులము అని పేరుగాంచిన వారు కూడా లోపల గుణములను జయించలేక మూడు గుణములలో ఎక్కడో ఒకచోట చిక్కుకొనియున్నారు. అందువలన పెద్ద జ్ఞానులనిపించుకొన్న వారు కూడా మధ్యలోని ఆత్మ భాగమును చేరలేక యున్నారు. మధ్యలోని ఆత్మ భాగమును చేరలేనివారు గుణముల మధ్యలో ఉండుట వలన వారియందు గుణ భావములు మెండుగాయుండి ఆత్మ భావములు లేకుండా పోవుట వలన అతడు పుట్టుకతో జీవాత్మయేయైనా నపుంసక జీవాత్మగా మిగిలిపోయాడు. గుణములలో చిక్కుకొన్న వారందరినీ పద్ధతి ప్రకారము అలాగే చెప్పాలి. బయట ప్రపంచములో మగవానికి ఆడ లక్షణములుండుట వలన వానిని నపుంసకుడు అని ఎట్లు అంటున్నామో, అలాగే జీవుడు ఆత్మే అయినా జీవాత్మయని పేరున్నా గుణములలో చిక్కుకొని వాటి భావములో మునిగి యుండుటవలన వానిని నపుంసక ఆత్మయని అనవలసివచ్చినది.

పై వాక్యము **(21-7)లో "నీకంటే ముందు నేను పంపిన ప్రవక్త లందరూ పురుషులే"** అని దేవుడు చెప్పడములో నేను పంపిన అను పదమును తీసుకొని చూస్తే దేవుడు తన ప్రతినిధియైన వారిని పంపినప్పుడు

అని అర్థము. దేవుడు పంపినవాడు దేవునిలోని భాగమే అయివుండుట వలన అతడు పైకి మనిషిగా కనిపించినా అతని శరీరములోనున్న ఆత్మ జీవాత్మగా నటించుచున్నది. ఆత్మయే జీవాత్మగా, పరమాత్మగా రెండువైపులా యుండి ఆత్మగా శరీరమును నడుపుచున్నది. దేవుడు పంపిన ప్రతినిధియైన వానిని ఒక విధముగా ప్రవక్తయని చెప్పినా అతడు మనుషులలోని జీవాత్మవలె గుణములలో చిక్కుకోకుండా, గుణములను ఉపయోగించుకొని కార్యములను చేయుచూ ఎల్లప్పుడూ మధ్యలోగల ఆత్మస్థానములోయుండుట వలన అతనిని పురుషుడనియే చెప్పాలి. జీవాత్మయైతే నపుంసక ఆత్మ కావచ్చును గానీ, భగవంతుని శరీరములో ఆత్మే జీవునిగాయుండి గుణములలో లేకుండుట వలన అటువంటి వానిని పురుషుడని చెప్పుచూ నేను పంపిన ప్రవక్తలందరూ పురుషులే అన్నాడు. దేవుడు పంపనివారు ఎంత పెద్ద ప్రవక్తలు, జ్ఞానులు, స్వాములు అని పేరుగాంచినా వారు గుణములలో చిక్కి నపుంసక ఆత్మలుగాయున్నారని చెప్పవచ్చును. దేవుడు తన ఆత్మను నింపి పంపుట వలన, నేను ఆత్మనను జ్ఞప్తితో జీవునిగా ఆత్మ నటించుట వలన వారిని పురుషులనియే చెప్పాలి. అందువలన నేను పంపిన ప్రవక్తలందరూ పురుషులే అని చెప్పారు. ఆత్మ శరీరమును ధరించి జీవాత్మగా నటించుట వలన అతడు భగవంతుడు అని పైన ఎవరూ గుర్తుపట్టలేరు. గుర్తుపట్టనట్లే నటించును. అటువంటప్పుడు పైన తనలో ఏ మార్పు లేకుండా సర్వసాధారణ మనిషివలె కనిపించునట్లేయుందురు. అందువలన అందరూ అన్నమును తిన్నట్లే దేవుని చేత పంపబడిన భగవంతుడు కూడా అన్నమే తిని బ్రతుకును. అలాగే అందరూ బాధలు, సుఖములు అనుభవించినట్లే అనుభవించుట వలన భగవంతున్ని ఎవరూ గుర్తుపట్టలేరు. మనుషులందరూ బ్రతికినట్లే తానూ బ్రతికి, అందరూ

చనిపోయినట్లే తాను కూడా చనిపోవుట వలన, అతను దేవుడు పంపిన ప్రవక్తయనిగానీ, భగవంతుడనిగానీ ఎవరూ గుర్తుపట్టలేరు.

ఖుర్‌ఆన్ గ్రంథమును చెప్పినది జిబ్రయేల్, విన్నది ముహమ్మద్ ప్రవక్తగారు. ప్రజలకు తెలియజేసినది ముహమ్మద్ ప్రవక్తగారు. దీనినంతా నడిపించినది దేవుడు. అందువలన దైవగ్రంథమని ఖుర్‌ఆన్ గ్రంథమును చెప్పుచున్నాము. ఖుర్‌ఆన్ గ్రంథములో ఎన్నో నిగూఢమైన అర్థములతో కూడుకొన్న వాక్యములున్నవని చెప్పుకొన్నాము. దీనికంటే ముందు పుట్టిన రెండు గ్రంథములలో లేనంత నిగూఢమైన విషయములు ఈ గ్రంథములో గలవు. ఈ గ్రంథము ఎన్నో జ్ఞాన విషయములను తెలియజేసి, ఖుర్‌ఆన్ గ్రంథములో ఇన్ని విషయములు దాగియున్నవా! అని అందరినీ ఆశ్చర్య పరచుచున్నది. అట్టి ఈ ఖుర్‌ఆన్ గ్రంథమును గురించి అదే గ్రంథములో జిబ్రయేల్ ఇట్లు చెప్పాడు. **సూరా 56, ఆయత్‌లు 77,78,79,80,81 లలో "(77) నిశ్చయంగా ఈ ఖుర్‌ఆన్ చాలా గొప్ప గౌరవప్రదమయినది. (78) అదొక సురక్షిత గ్రంథములో నమోదైయున్నది. (79) పరిశుద్ధులు మాత్రమే దాన్ని ముట్టుకోగలరు. (80) ఇది సర్వలోకాల ప్రభువు తరపున అవతరించినది. (81) ఇటువంటి గొప్ప విషయాన్ని మీరు తేలికగా తీసుకొంటున్నారా?"** ఇక్కడ చెప్పిన వాక్యములలో ఖుర్‌ఆన్ గ్రంథము దైవగ్రంథమయినందున అది గౌరవప్రదమయినదని అందరూ ఒప్పుకొని తీరవలసిందే. అంతేకాక దీనిని ముందే సురక్షితమైన గ్రంథములో వ్రాసియున్నారు అని 78వ వాక్యమున కలదు. అయితే ముస్లీమ్‌ల అభిప్రాయము మేరకు ప్రవక్తగారు మొదట వ్రాయించిన గ్రంథమును అనగా వ్రాతప్రతిని భద్రముగా దాచియుంచారని చెప్పుచుండుట వలన ఇది సురక్షితమైన గ్రంథములో నమోదయివుందని

చెప్పారు. ఇదే విషయమునే మాతృగ్రంథము అని చేతివ్రాతతో వ్రాసిన గ్రంథమునే అంటారని కొందరు చెప్పుచున్నారు. ఇంతకుముందు (43-4) (13-39) వాక్యములలో వ్రాసిన దానిప్రకారము వ్రాతప్రతిలో మొదట ఖుర్ఆన్ వ్రాసినది నిజమే అయినా దానిని మాతృగ్రంథము అనకూడదు అని చెప్పాము. వ్రాతప్రతిగా వ్రాసిన గ్రంథమునకు ఈ ఖుర్ఆన్ గ్రంథము ప్రతిరూప గ్రంథమగునుగానీ మాతృగ్రంథముకాదు. ఖుర్ఆన్‌లోని మూలము ఏ గ్రంథములోయున్నదో, ఖుర్ఆన్ గ్రంథముయొక్క జ్ఞానము ఏ గ్రంథములో ఇమిడియున్నదో దానిని మాతృగ్రంథమని అనవచ్చును. అంతేగానీ మొదట వ్రాసిన దానిని మాతృగ్రంథము అని అనకూడదు. మొదట వ్రాసిన గ్రంథమునకు ఏమాత్రము తేడా లేకుండా ఈ గ్రంథమును వ్రాసియుంచడము వలన, ముందు వ్రాసిన గ్రంథములో ఎట్లున్నదో ఒక పొల్లుకూడా మార్చకుండా వ్రాయడము వలన, ఖుర్ఆన్ గ్రంథము ఎన్నిమార్లు తయారయినా మొదటి దానికి ప్రతిరూప గ్రంథమగునని చెప్పవలెనుగానీ, మాతృగ్రంథము అని చెప్పకూడదు. మాతృగ్రంథము అంటే మక్కికి మక్కి వ్రాయబడియుండదు. మొదటి గ్రంథములోని సారాంశమును మరొక గ్రంథములో వ్రాస్తే రెండవదానికి మొదటిది మాతృగ్రంథమగును.

ఖుర్ఆన్ గ్రంథములోని విషయముల సారాంశము ప్రథమ దైవ గ్రంథమయిన భగవద్గీతలో ఉన్నది. కావున భగవద్గీతను ఖుర్ఆన్ గ్రంథమునకు మాతృగ్రంథమని చెప్పవచ్చును. అంతేగానీ కొందరి ఉద్దేశ్యము ప్రకారముగానీ, అందరి ఉద్దేశ్యము ప్రకారముగానీ సూత్రమునకు వ్యతిరేఖముగా దేనినీ చెప్పకూడదు. ఎవరయినా చెప్పినా ఒప్పుకోకూడదు. ప్రతి దానికీ ఒక లెక్క వుండును. అట్లే శాస్త్రబద్ధతయుండును. లెక్కగానీ, సూత్రముగానీ, శాస్త్రబద్ధతగానీ లేకుండా ఎవరూ దేనినీ చెప్పకూడదు.

సూత్రము ప్రకారము మక్కికి మక్కి, పొల్లుకు పొల్లు తప్పకుండా వ్రాసిన దానిని మొదటి దానికి ప్రతిరూప గ్రంథము అంటాము. అందువలన మొదట అరబ్బీ భాషలో వ్రాసిన గ్రంథమును అట్లే భద్రముగాయుంచి దానివలె ఎన్నో అరబ్ ఖుర్‌ఆన్ గ్రంథములను ప్రతిరూపముగా తయారు చేశారు. ఎట్లు తయారుచేసినా ఖుర్‌ఆన్ గ్రంథము యొక్క సారాంశము భగవద్గీతలోయుండుట వలన భగవద్గీతనే మాతృగ్రంథమని చెప్పవచ్చును. 79వ వాక్యములో పరిశుద్ధులు మాత్రమే దానిని ముట్టుకోగలరు. ఈ వాక్యమును సులభముగా చదివి తేలికగా వింటారు. అందులోని గూఢార్థమును ఎవరూ చూడడములేదు.

నేడు ఖుర్‌ఆన్ గ్రంథమును అందరూ చూడగలుగుచున్నారు. అరబ్బీ భాషలోయున్న గ్రంథములనే ముస్లీమ్‌లు చదువుచున్నారు. దానిని చదివే వారిలో, దానిని ముట్టుకొనువారిలో మంచివారు ఉన్నారు, చెడ్డవారు ఉన్నారు. నేడు ఖుర్‌ఆన్ గ్రంథమును చదువుచున్న వారందరూ పవిత్రులేనా అంటే ఎవరికివారు పవిత్రులేగానీ, దేవుని లెక్కలో చాలా అపవిత్రులు కూడా యున్నారు. గంటసేపు గ్రంథమును చదివి తర్వాత నిమిషమే ప్రక్కవానిని ఎట్లు మోసము చేయాలి? అని ఆలోచించువారు కలరు. అటువంటివారు పవిత్రులా? ఖుర్‌ఆన్ గ్రంథమును బోధించువారు అక్రమ మైన పనులు చేయలేదా? చేస్తూనేయున్నారు. వారంతా పరిశుద్ధులా? అని చూస్తే ఖుర్‌ఆన్‌ను తాకినవారిలో ఎందరో అపవిత్రులు, అపరిశు ద్ధులు కలరు. అయితే 79వ వాక్యములో పరిశుద్ధులు మాత్రమే దానిని ముట్టుకోగలరు అని వ్రాశారు కదా! ఆ మాట అసత్యమగునాయని కొందరు అడుగవచ్చును. దానికి మా జవాబు ఇలా కలదు చూడండి. ఖుర్‌ఆన్ గ్రంథమును భౌతికముగా తాకినా, ముట్టుకొనినా, తలమీద పెట్టుకొనినా

ఎవరూ పవిత్రులుకారు. వాక్యములో చెప్పినది భౌతికముగా ముట్టు కోవడమును గురించి చెప్పలేదు. అభౌతికముగా దానిలోని అర్థమును గ్రహించుకొన్నప్పుడు, దానిని ముట్టుకొన్నట్లగును. సూక్ష్మముగా ఖుర్ఆన్‌లోని భావములను బాగా అర్థము చేసుకొన్నప్పుడు, అర్థము చేసుకొన్నవాడు పరిశుద్ధునిగా లెక్కించబడును. ఆ గ్రంథమును సూక్ష్మముగా ముట్టు కొన్నట్లగును. ఇక్కడ స్థూలముగా అర్థము చేసుకోకూడదు. సూక్ష్మముగా అర్థము చేసుకొన్నప్పుడు 79వ వాక్యములోని మాట సరిపోవును. దానిని పరిశుద్ధులు మాత్రమే ముట్టుకోగలరు అంటే దానిలోని భావమును తెలిసిన వారు మాత్రమే పరిశుద్ధులని, దానిని ముట్టుకొన్నవారని అర్థము చేసుకోవాలి. ఖుర్ఆన్ గ్రంథములో దైవజ్ఞానము కలదు కావున ఆ గ్రంథమును దేవుని తరపునుండి వచ్చినదని చెప్పారు. ఖుర్ఆన్ గ్రంథము లోని విషయములన్నిటినీ స్థూల భావములో, బయట అర్థములతో చెప్పుకోవడము వలన ఈ గ్రంథము ఎవరికీ అర్థముకావడములేదు. స్థూలముగా అర్థమయినా అది అర్థముకానట్లే, సూక్ష్మముగా అర్థము చేసుకొంటేనే ఖుర్ఆన్ గ్రంథముయొక్క సారాంశము తెలియును. అందువలన 81వ వాక్యములో ఇటువంటి గొప్ప విషయమును మీరు తేలికగా తీసుకొంటున్నారని వాక్యములో అన్నారు.

ఇంతవరకూ ఖుర్ఆన్ గ్రంథము యొక్క విశిష్ఠతను చెప్పుకొన్నాము. ఖుర్ఆన్ గ్రంథములోని వాక్యములలో ఎక్కువగా సూక్ష్మ భావములుగల ఆయత్‌లు ఉన్నాయి. స్థూల భావములుగల ఆయత్‌లు తక్కువగా ఉన్నాయి అని తెలుసుకొన్నాము. ఇప్పుడు సూరా 6, ఆయత్ 95ను గురించి మాట్లాడుకొందాము. ఈ వాక్యమును గురించి ముందే వివరించి చెప్పుకొన్నాము. ఇందులో అండజ, పిండజ, ఉద్భిజముల పుట్టుకను

గురించి ఉన్నట్లు తెలుసుకొన్నాము. మూడు విధముల జీవరాశుల పుట్టుకలు ఎందుకున్నాయి? అంటే దానికి ఒక లెక్క కలదు. ఆ లెక్క ప్రకారము ముఖ్యమైనవన్నీ త్రైతములో (మూడుగా) ఉండవలెనని దేవుని ఉద్దేశ్యము. అందువలన దేవుడు తనను తాను జీవాత్మ, ఆత్మ, పరమాత్మయను మూడు భాగములుగా విభజించుకొన్నాడు. తనను తాను మూడు భాగములుగా విభజించుకొన్నవాడు అదే మూడు భాగములుగా తన జ్ఞానమును విభజించి, మూడు పద్ధతుల ద్వారా భూమిమీద బోధించాడు. అలాగే మూడు రకముల మరణములను ఇచ్చాడు. అదే విధముగా మూడు రకముల జన్మలను ఇచ్చాడు. మరణములు మూడు అయినప్పుడు పుట్టుకలు కూడా మూడు రకములుండవలెననునది దేవుని ఉద్దేశ్యము. దేవుడు మూడు ఆత్మలుగా విభజించిన తర్వాత ఆత్మలను కనుగొనుటకు మూడు విధముల జ్ఞానమును భూమిమీద చెప్పాడు. ఈ విధముగా త్రైతమునకు గుర్తుగా ఆత్మలనూ, ఆత్మబోధలనూ, చావులనూ, పుట్టుకలనూ మూడు విధములుగానే తయారు చేశాడు. అంతేకాక జీవాత్మ ఆత్మ రెండు జోడుఆత్మలుగా యున్నాయి కావున, వాటి గుర్తుకు అనగా ద్వైతమునకు గుర్తుగా ఒక వాక్యమును చెప్పాడు. దానిని ఇప్పుడు వివరించుకొని చెప్పుకొందాము. మూడు పుట్టుకలు కల్గిన మనిషి లేక జీవుడు రెండు జాగాలలో నివసిస్తున్నాడు. ఈ విషయమును గురించి చెప్పుచూ ఖుర్ఆన్ గ్రంథములో సూరా 6, ఆయత్ 98లో రెండు స్థలములను గురించి చెప్పడము జరిగినది. **(6-98) "దేవుడు మిమ్మల్ని ఒకే ప్రాణితో పుట్టించాడు. ఆపైన ప్రతి ఒక్కరికీ ఒక నివాస స్థలమునూ, ఒక అప్పగింత స్థలమునూ ఏర్పాటు చేశాడు. ఈ సూచనలను మేము అవగాహనాశక్తి గలవారి కొరకు విశదీకరించాము."** ఈ వాక్యములో మిమ్మల్ని ఒకే ప్రాణినుండి

పుట్టించాడు అని వ్రాశారు. ఈ మాటను మనము తేలికగా తీసుకోవడము లేదు. దేవుని మాటగానీ, దేవుని జ్ఞానముగానీ అన్నియూ శాస్త్రబద్ధముగా ఉండును. సూత్రబద్ధము కాని ఏ మాటా ఉండదు. అట్లే శాస్త్రబద్ధము కాని ఏ జ్ఞానమూ ఉండదు. అయితే ఇక్కడ ఈ వాక్యములో మీరందరూ ఒకే ప్రాణినుండి పుట్టారని చెప్పడము జరిగినది. ఈ విషయాన్ని తీసుకొని ఇతరులను నీవు ఒకరి నుండి పుట్టావా? అని అడిగితే దానికి ఎవరయినా అదెలా సాధ్యము? తల్లితండ్రులు ఇద్దరూ ఉన్నప్పుడే సాధ్యమవుతుంది. మేము తల్లి తండ్రులకు ఇద్దరికీ పుట్టాముగానీ ఒక్కరికే మేము పుట్టలేదు. అట్లే ఎవరూ పుట్టలేరని చెప్పుచున్నారు. ఒకరికే పుట్టారు అను మాటను తెలివి ఉన్నవాడుగానీ, తెలివి లేనివాడుగానీ ఒప్పుకోవడము లేదు. వాస్తవానికి ఒకరినుండి పుట్టారనడము తప్పని మనము కూడా చెప్పక తప్పదు. అయితే ఈ మాటను దేవుడు ఎందుకు చెప్పాడు? దేవునికి అన్ని విషయములూ తెలుసు కదా! అటువంటి వాడు మీరు ఒకే ప్రాణినుండి పుట్టారని ఎందుకు చెప్పాడని ప్రశ్న రాకతప్పదు. ఇప్పుడు ఈ ప్రశ్న వచ్చినా దేవుడు అసత్యము చెప్పువాడుకాదు. ఇందులో ఏదో దాగియున్న రహస్యముందని అర్థమగుచున్నది. ఈ వాక్యములో దాగియున్న రహస్యమేమిటో ఇప్పుడు వివరించుకొందాము.

ఒక మనిషి పుట్టుటకు వాని తల్లితండ్రులే కారణమని అందరికీ తెలుసు. అయితే వాస్తవముగా తల్లితండ్రులే కారణమా? అని ప్రశ్నించుకొని చూస్తే స్థూలముగా తల్లితండ్రులు కనిపించినా వారి ఇద్దరికీ సంబంధము లేకుండా మరొక జీవుడు పుట్టుచున్నాడని చెప్పవచ్చును. భగవద్గీతలో ఏ జీవరాశి పుట్టుకకూ మనుషులయిన తల్లితండ్రులే కారణమని చెప్పలేదు. **"తల్లి ప్రకృతి, తండ్రి పరమాత్మనయిన నేను"** అని గుణత్రయ విభాగ

యోగములో చెప్పినట్లు ముందే చెప్పుకొన్నాము. భగవద్గీతను ఖుర్‌ఆన్ గ్రంథము ధృవీకరించుచుండుట వలన భగవద్గీతను అతిక్రమించి చెప్పకుండా దానిలో చెప్పినట్లే మీరందరూ ఒకరినుండే పుట్టారు అని చెప్పింది. అలాగయినా భగవద్గీతలో చెప్పినట్లు దేవునికి మనిషి పుట్టాడా! అంటే దేవుడు ఏ పనీ చేయనివాడు అని దేవుని ధర్మము గలదు. దేవుని ధర్మము ప్రకారము దేవుడు పని చేయనివాడే అయినప్పుడు దేవుడు మనలను ఎలా పుట్టించాడు? అని ప్రశ్న రాగలదు. అప్పుడు ఆ ప్రశ్నకు జవాబును వెతికితే ఇలా కలదు. దేవుడు ఎప్పటికీ పనిని చేయనివాడే అయినా, దేవుని పాత్ర పోషించునది శరీరములో ఒకటే గలదు. అదే ఆత్మ. ఆత్మ ప్రపంచములో అన్ని పనులూ చేయుచున్నది. జీవాత్మ చేయవలసిన పనులను అన్నిటినీ ఆత్మే చేయుచున్నది. అంతేగాక పరమాత్మ చేయవలసిన పనులను కూడా ఆత్మే చేయుచున్నది. శరీరములో రెండు పాత్రలను పోషించుచూ, శరీరమునకంతటికీ అధిపతిగాయుండి శరీరములో జరుగు ప్రతిపనికీ తానే కారణము, కార్యము అగుచున్నది. శరీరముతో మనిషి పుట్టుచున్నప్పుడు ఆ మనిషి పుట్టుకకు కారణము ఆత్మ ఒక్కటేనని చెప్పవచ్చును. స్త్రీ శరీరములో ఆత్మయే ఉన్నది, అలాగే పురుష శరీరములో కూడా ఆత్మేయున్నది. రెండు శరీరములలోయున్న ఆత్మయే మనిషి పుట్టుటకు కారణమగుచున్నది. ఇక్కడ దేవుడు చేయవలసిన పనిని ఆత్మ ఒక్కటే చేయుచుండుట వలన 'మిమ్మల్ని దేవుడు ఒకే ప్రాణినుండి పుట్టించాడు' అని ఖుర్‌ఆన్ గ్రంథములో చెప్పారు.

తల్లి శరీరములో ఆత్మ వలన స్త్రీగర్భము పెరుగుచున్నదని చెప్పవచ్చును. అలాగే తండ్రి శరీరములో ఆత్మవలన బీజదానము జరిగినదని చెప్పవచ్చును. అయితే రెండు శరీరములలో రెండు ఆత్మలు పని

చేశాయి కదా! అని ఎవరయినా ప్రశ్నించవచ్చును. దానికి మా జవాబు ఇలా కలదు. తల్లితండ్రుల శరీరములోనే కాదు సమస్త జీవరాశుల శరీరములో ఉన్న ఆత్మ ఒక్కటేనని తెలియవలెను. ఒక్కొక్క శరీరములో ఒక్కొక్క జీవాత్మయుండవచ్చునుగానీ, ఒక్కొక్క ఆత్మ ఉండదు. అన్ని శరీరములలో ఒకే ఆత్మయున్నదని అందరూ తెలియవలెను. తల్లి తండ్రి శరీరములలో ఒకే ఆత్మ పనిచేయడము వలన జీవరాశులన్నీ పుట్టించ బడుచున్నవి. అందువలన పై వాక్యములో ఒకే ప్రాణినుండి మీరందరూ పుట్టారని చెప్పారు. **(6-98) వాక్యము చివరిలో 'ఈ సూచనలను అవగాహనాశక్తిగల వారికొరకు విశధీకరించాము'** అని చెప్పడమైనది. అంటే అవగాహనాశక్తిని కొందరికి ఇచ్చి వారితో చెప్పిస్తానని దేవుడు చెప్పాడని అర్థము చేసుకోవాలి.

ఇంతవరకూ చెప్పుకొన్న సమాచారమునుబట్టి మనలను ఒకరినుండి ఎలా పుట్టించాడో తెలిసిపోయినది. ఇంకా అర్థము కావలసినది 'అందరికీ ఏర్పాటు చేసిన ఒక నివాసస్థలము, ఒక అప్పగింత స్థలము.' సర్వ జీవరాశు లకు అండజ, పిండజ, ఉద్భిజ అను మూడు రకముల పుట్టుకలున్నా అవి అన్నియూ ఆత్మవలననే జరుగుచున్నవి. అయితే రెండు జాగాలు కలవని దేవుడు ఈ వాక్యములో చెప్పాడు. ఆ రెండు స్థలములను గురించి దేవుడు ఏమి తెలుపుచున్నాడో ఇప్పుడు చూస్తాము. ఒక జీవుడు జనన మరణముల మధ్య తిరుగుచూ ఏదో ఒక జన్మను ఎత్తడము జరుగుచున్నది. జనన, మరణములు రెండూ కర్మ అనుభవములు కావు. అందులో అనుభవించేది ఏదీ లేదు. మనిషి బ్రతికియున్నంత వరకూ అనుభవిస్తున్నాడు. జననము జరిగేటప్పుడు మరియు మరణించేటప్పుడు కర్మ అనుభవము ఉండదు. ఈ విషయము బాగా అర్థము కావాలంటే మా రచనలలోని **"జనన మరణ**

**సిద్ధాంతము"** అను గ్రంథమును చదవాలి. మనిషి పుట్టిన తర్వాత ఒక శరీరములో జీవితము గడుపును. తర్వాత ఆ శరీరమును మరణము, జననములో మార్చుకొని క్రొత్త శరీరమును ధరించడము జరుగుచున్నది. ఈ విధముగా జీవుడు వాని కర్మను అనుసరించి శరీరములను మారుచుండును. జీవుడు ఏ శరీరములోయున్నా వాని నివాసస్థలము తలలోని గుణచక్రములోయున్నది. మనిషి శరీరము పైకి కనిపించుచున్నా లోపల జీవుడు (జీవాత్మ), గుణచక్రములోనే ఉండును.

మనిషి శరీరములో తలయందు నాలుగు చక్రముల చట్రమున్నది. అందులో పై నుండి బ్రహ్మ, కాల, కర్మ, గుణచక్రములని వాటి పేర్లు గలవు. క్రింద గుణచక్రములో జీవుడు నివసిస్తూయుండును. గుణచక్రము మూడు భాగములుగా ఉండును. బయటినుండి లోపలికి చూస్తే బయటి భాగమును తామస గుణభాగము అంటారు. రెండవ భాగమును రాజస గుణభాగము అంటారు. మూడవ దానిని సాత్త్విక గుణభాగము అని అంటారు. ఈ మూడు భాగములలోనే జీవుడుండును. ఈ మూడు గుణభాగముల మధ్యలో ఒక ఆత్మ భాగము కలదు. అందులోనికి ఆధ్యాత్మిక జ్ఞానముకలవారు మాత్రము అప్పుడప్పుడు పోవుచుందురు. సాధారణ మనిషి శరీరములో జీవుడు జ్ఞానములేనివాడయిన దానివలన గుణ భాగములలోనే ఉండును. ఏ విధముగా చూచినా శరీరములోని జీవుడు గుణచక్రములోనే నివసిస్తున్నాడు. జీవునికి శరీరములోయున్న నివాస స్థలమును ఒక నివాస స్థలముగా చెప్పవచ్చును. అలా శరీరములో జీవుడు ఎంతకాలమున్నా, ఎన్ని జన్మలున్నా అది నివాస స్థలమే అయివుండును. నివాస స్థలములో ఎంతకాలమున్నా ఏనాడో ఒకనాడు జన్మరాహిత్యమును పొంది వాడు జన్మించకుండా దేవుని యందు చేరిపోవును. కొన్ని వందల

జన్మల తర్వాత అయినా, కొన్ని వేల జన్మల తర్వాత అయినా చివరకు జీవుడు మోక్షమును పొంది జన్మ రాహిత్యము చేసుకోవలసిందే. అప్పుడు జీవుడు అంతవరకు తనకు నివాస స్థలముగాయున్న గుణచక్రమును వదలి, పరమాత్మయందు చేరిపోవును. అదియే జీవునికి శాశ్వతమైన జాగా. జీవుడు గుణచక్రములో ఎంత కాలమున్నా అది అశాశ్వతమైనదేనని తెలియాలి.

జీవుడు మొదట సృష్ట్యాదిలో దేవునినుండి పుట్టించబడినాడు. అప్పటినుండి శరీరములోని గుణచక్రములో నివాసమేర్పరచబడినది. తర్వాత మొదట ఎక్కడినుండి వచ్చాడో అక్కడికే పోవలసియున్నది. దేవునినుండి వచ్చినవాడు తిరిగి అక్కడికే పోవడమును అప్పగింత స్థలము అంటున్నారు. ఒక వస్తువును ఒకరివద్దనుండి తెచ్చుకొని తిరిగి మొదటివానికి అప్ప జెప్పినట్లు, దేవునినుండి ప్రకృతి జీవున్ని తన ఆధీనములోనికి తెచ్చుకొని, కొన్ని జన్మలవరకు తనవద్దనేయుంచుకొని, తిరిగి దేవుని ఆధీనములోనికి చేర్చడమును జీవున్ని తిరిగి దేవునికి అప్పగించినట్లగుచున్నది. అందువలన మోక్షమును పొందడమును అప్పగింత స్థలము అని అన్నారు. ప్రతి జీవునికీ ఒక నివాస స్థలము గుణచక్రములో ఉండగా, అప్పగింత స్థలము దేవుని యందుకలదు. ఈ విషయము నిగూఢమైనందున 'ఇది అవగాహనశక్తి యున్నవారు విశధీకరించుకోవచ్చును' అని వాక్యము చివరిలో చెప్పారు. అలా వాక్యము చివరిలో చెప్పడము వలన ఇది నిగూఢమైన విషయమని ముందే తెలిసిపోవుచున్నది. ఈ వాక్యములో 'మనిషికి శాశ్వతమైన అప్పగింత స్థలము' అనగా మోక్షము ఒకటున్నదని తెలిసినది.

ఇంతవరకు (6-98) వాక్యములో రెండు జాగాలను గురించి తెలుసుకొన్నాము. అందులో ఒకటి అశాశ్వతమైనది, రెండవది శాశ్వతమైన

దని తెలిసినది. మొదటి స్థలములో ఎంతకాలమున్నా శరీరములలో ఉండవలసిందే. అదే రెండవ జాగాలో చేరితే అది శాశ్వతమైనదేకాక అది అంతటా వ్యాపించియున్నది. మొదటి స్థలములోయున్నప్పుడు ఒక శరీరములో మాత్రమున్న జీవుడు, రెండవజాగాలో చేరితే ఆ జాగా చాలా విశాలమైనది, ప్రపంచవ్యాప్తముగాయున్నదని తెలియగలిగి అతను కూడా ప్రపంచవ్యాప్తముగా వ్యాపించియున్నాడు. శరీరములో ఉన్నప్పటికీ, తర్వాత మోక్షమను రెండవ జాగాలో చేరినప్పటికీ ఎంతో తేడా కనిపించుచున్నది. మోక్షమును గురించి అనగా రెండవ జాగాను గురించి చెప్పటానికి ఎవరికీ చేతకాదు. అందులో చేరి అనుభవించేవానికి మాత్రము అది ఎట్లుండునో తెలియగలదు. మనము ఇప్పుడు మొదటి స్థలములోయున్నాము. రెండవ నివాసము ఎట్లున్నదో మొదటి నివాసములోయున్న వానికి తెలియదు. అది ఇట్లుంటుందని ఊహించి చెప్పుటకు వీలుకాదు. మోక్షమును గురించి లేక జీవాత్మ అప్పగించబడు స్థలమును గురించి ఖుర్‌ఆన్ గ్రంథము ఏమి చెప్పుచున్నదో ఇక్కడ చూస్తాము. సూరా 3, ఆయత్ 14లో ఇలా చెప్పడమైనది. **(3-14) "స్త్రీలు, సంతానము మరియు జమచేసి పెట్టబడిన వెండి, బంగారు రాశులు, మేలుజాతి గుర్రాలు, పశువులు, పొలాలు మొదలయిన మనోహరమైన వస్తువులు, ఆకర్షణీయముగానున్న అన్ని వస్తువులు అన్నియూ ఇహలోక జీవభోగమేగానీ పరలోకప్రాప్తి కాదు. అసలైన పరలోక గమ్యస్థానము దేవునివద్దనేయుంది."** దానినే (6-98)వ వాక్యములో చెప్పిన రెండవ నివాసస్థలము లేక అప్పగింత స్థలము అంటున్నాము.

**"దివ్య ఖుర్‌ఆన్ సందేశము"** అను గ్రంథములోని తెలుగు అనువాద వాక్యమును వ్రాశాము. ఇప్పుడు **"అంతిమ దైవగ్రంథము**

**ఖుర్ఆన్"** అను గ్రంథములోని తెలుగు అనువాద వాక్యమును ఇక్కడ వ్రాయుచున్నాము చూడండి. **(3-14) "స్త్రీలు, కుమారులు, ప్రోగు చేయబడిన వెండి, బంగారు రాశులు, మేలుజాతి గుర్రాలు, పశువులు, పంటపొలాల వంటి వ్యామోహాలపై ప్రేమ, జనులకు మనోజ్ఞముగా చేయబడినది. ఇది అంతయూ ప్రాపంచిక జీవన సామాగ్రి. మరలి పోవలసిన అత్యుత్తమమైన నివాసము దేవునివద్దనే యున్నది."** ఖుర్ఆన్ గ్రంథములోని జ్ఞానమంతయూ భగవద్గీతలోయున్నదే. భగవద్గీతలో స్వర్గమును గురించి తక్కువ చెప్పి, మోక్షమును గురించి ఎక్కువ చెప్పారు. అయితే ఖుర్ఆన్‌లో స్వర్గమును గురించి ఎక్కువ చెప్పి, మోక్షమును గురించి తక్కువ చెప్పారు. ఎక్కడయినా మోక్షమును గురించిన ఆయత్‌యున్నా అక్కడ దానిని స్వర్గముగానే వర్ణించి చెప్పియున్నారు. చాలామంది ముస్లీమ్‌లకు స్వర్గమునకు, మోక్షమునకు తేడా ఏమీ తెలియలేదు. అందువలన అందరికీ మోక్షమును గురించి అర్థమగుటకు ప్రత్యేకించి (3-14) వాక్యమును చెప్పియున్నారు. ఈ వాక్యములో ప్రపంచ సుఖములన్నీ ఒక ఎత్తుకాగా, మోక్షము వాటికంటే పెద్దదని అత్యుత్తమమైన నివాసము అని వాక్యము చివరిలో చెప్పారు. మానవ జీవితములో చాలా దగ్గరగాయున్నవారిలో మొదటిది భార్య, రెండవవారు కుమారులు. తర్వాత బంగారు, వెండి. ఆ తర్వాత ప్రియమైన జంతువులు. ఆ తర్వాత వస్తు సామాగ్రి అవన్నిటినీ ప్రాపంచిక జీవన సామాగ్రిగా లెక్కించారు. జీవితములో ఎంత దగ్గరగా యున్నవారైనా, ఎంత ప్రీతికర వస్తువులయినా అవన్నీ అశాశ్వతములే. ఏనాడో ఒకరోజు వాటిని వదలి పోవలసిందే. ఎప్పటికీ శాశ్వతమైనది దేవుడు, దేవుని రాజ్యమైన పరమపదమును, దేవునిలోనికి ఐక్యమై యుండడమును మోక్షము అంటున్నాము. స్వర్గ

సుఖములయినా కొంతసేపు లేక కొంతకాలము ఉండి తర్వాత పోవునవే. అయితే మోక్షము అట్లుకాకుండా శాశ్వతమైనది, జన్మలులేనిది, సుఖ దుఃఖములులేనిది, ఆనందముతో కూడుకొనియుండునదని చెప్పవచ్చును. ఇటువంటి మోక్షమును గురించి ఖుర్‌ఆన్ గ్రంథములో మరియొకచోట సూరా 6, ఆయత్ 127లో ఇలా చెప్పారు చూడండి. **(6-127) "వారి కొరకు వారి ప్రభువువద్ద శాంతి నిలయము ఉంది. వారి మంచి పనుల సంస్కార బలముచేత శాంతి లభించగా వారికి దేవుడు రక్షకుడుగా ఉంటాడు."** మోక్షమును పొందినవాడు జన్మించక దేవునియందు చేరిపోవును. దేవుని యందు చేరిపోతే దేవుడు శాంతి స్వరూపుడయినందున, దేవునిలో చేరిన జీవునికి కూడా శాంతి లభించును. శాంతి అనగా విశ్రాంతి అని అర్థము. విశ్రాంతి శరీరమునకా, జీవునికా అని ఆలోచిస్తే శరీరమునకు విశ్రాంతి అయితే అది ప్రపంచ సంబంధ విశ్రాంతియగును. జీవునకు లభించు విశ్రాంతియంటే అది మోక్షములోనే లభించును. ప్రపంచములో ఎక్కడలేని శాంతి మోక్షములో దేవునివద్ద లభించునంటే అది ఎంత పెద్ద స్థితియో ఊహించుకోవచ్చును. అట్టి మోక్షమును గురించి ఇంకా ఖుర్‌ఆన్ గ్రంథములో సూరా 13, ఆయత్ 24లో ఈ విధముగా చెప్పుచున్నారు. **(13-24) "మీరు చూపిన సహనానికి మీ పై శాంతికురియుగాక. మీకు లభించిన అంతిమ గృహము ఎంతోమంచిది అని వారు అంటారు."** జీవుడు శరీరములలో జన్మలెత్తుచూ ఎంతకాలము బ్రతికినా, ఎన్ని జన్మలు ఎత్తినా చివరకు జన్మలను వదలి మోక్షమును చెందవలసిందే. చివరికి చేరవలసినది మోక్షములోనికే కావున దానిని అంతిమ గృహము అని అన్నారు. ఆరవ సూరా, 98వ వాక్యములో రెండవ నివాసస్థలము అని చెప్పినట్లు ఇక్కడ

అంతిమ గృహము అన్నారు. చివరిలో లభించు దానిని అంతిమ గృహము అని కూడా అనవచ్చును. దానినే అప్పగింత స్థలము అనికూడా అన్నారు. ఒక మనిషి ఎంతో సహనముతో జ్ఞానమార్గములో ప్రయాణించినప్పుడు చివరికి మోక్షము లభించును. దేవునిమార్గములో పోవాలని ప్రయత్నించు వానిని మాయ అడుగడుగున ఆటంకములు కలుగజేసి మనిషిలోని సహనమును పరీక్షించును. మాయను జయించగలిగితే మాయయే దేవుని వద్దకు చేర్చును. అప్పుడు మోక్షము లభించును. అదియే అంతిమ గృహమని చెప్పబడుచున్నది. మోక్షమును గురించి ఇంతవరకూ చెప్పినది కాక ఖుర్ఆన్ గ్రంథములోనే మరియొక చోట ఈ విధముగా చెప్పుచున్నారు చూడండి. **(30-7) "వారికి ప్రాపంచిక జీవితము యొక్క విషయాలు మాత్రమే తెలుసు. పరలోకము గురించి వారికి బొత్తిగా ఏమాత్రము తెలియదు."** ఇక్కడ మేము మోక్షమును గురించి గొప్పగా చెప్పుచూయుంటే కొంతమందికి చాలా క్రొత్తగా, వింతగా కనిపించుచుండును. ఎక్కడ లేని మాటలను, ఖుర్ఆన్‌లో చెప్పని మాటలను చెప్పుచున్నారేయని అనుకొందురు. స్వర్గమును గురించి వినియుందురుగానీ, మోక్షమును గురించి వారు వినియుండరు. అటువంటి వారికి మోక్షమును గురించి ఏమాత్రము తెలియదు. వారికి ప్రపంచములో కనిపించు పరిస్థితి మాత్రము తెలుసు అంతేగానీ, ఎప్పటికయినా చివరికి దేవునివద్దకు ప్రతి ఒక్కరూ చేరవలసిందేనను విషయము వారికి తెలియదు. ఈ విషయమును గురించి (30-8) వాక్యములో ఇలా చెప్పారు చూడండి.

**(30-8) "ఏమిటి వారు తమ పుట్టుక గురించి లోతుగా ఆలోచించడము లేదా! దేవుడు భూమి, ఆకాశములను వాటి మధ్యలోయున్న సమస్తమును అత్యుత్తమ రీతిలో నిర్ణీత కాలమువరకు**

**మాత్రమే సృష్టించాడు. గడువు అయిపోయిన తర్వాత తమ ప్రభువును కలుసుకోవలసియుందను విషయాన్ని మరిచిపోయారు."** మరియొక చోట సూరా 40, ఆయత్ 41లో ఈ విధముగా చెప్పారు చూడండి. **(40-41) "ఓ నాజాతి ప్రజలారా! ఇది ఎంత విచిత్రమైన విషయము. నేనేమో మిమ్మల్ని ముక్తివైపు (మోక్షము వైపుకు) పిలుస్తున్నాను. మరి మీరేమో నన్ను ప్రపంచము వైపుకు (నరకాగ్ని వైపుకు) పిలుస్తున్నారు."** అని చెప్పడమేకాక మరియొక చోట సూరా 42, ఆయత్ 20లో ఈ విధముగా చెప్పారు. **(42-20) "ఎవరయితే పరలోక పంటను ఆశిస్తారో, మేము వారికి పంటను సంమృద్ధిగా కలుగునట్లు చేస్తాము. మరి ఎవరయితే ఇహలోక పంటను ఆశిస్తారో వారికి మేము అదే కలుగజేస్తాము. అలాంటి వ్యక్తులకు పరలోకములో ఎటువంటి భాగము ఉండదు."** మనిషి దేనిని ఆశిస్తాడో, దేనిని కోరుకుంటాడో దానినే దేవుడు కలుగజేస్తాడు. దేవుడు మోక్షమును అడిగితే ఇవ్వాలనుకొన్నాడు. అయితే మనిషి ప్రపంచ విషయములనే కోరుకొంటున్నాడు. ప్రపంచమువైపే ప్రయాణిస్తునాడు.

## ఇంకా మోక్షమును గురించి మేము చెప్పనది ఏమనగా!

ప్రతి మానవుడు మోక్షము అనగానేమి? అని తెలుసుకోవలయును. మోక్షమును గురించి తెలుసుకోలేకపోయిన మానవుడు ఆత్మను తెలుసు కొనుటకు ఏమాత్రము ప్రయత్నించడు. ఎవరైనా చెప్పినప్పటికీ దానితో మనకేమి ప్రయోజనమున్నది? అని అంటాడు. **మోక్షము** యొక్క విలువ తెలుసుకోలేని మానవుని జీవితము వాసనలేని పువ్వుతో సమానము. మోక్షము యొక్క అర్థము తెలుసుకోలేని మానవుడు "పుట్టలోని చెదలు

పుట్టదా గిట్టదా" అన్నట్లు ఉన్ననూ ఊడిననూ ఒక్కటే, **మోక్షమును** గురించి తెలుసుకోలేనివారి భక్తి, గమ్యము తెలియని ప్రయాణములాగా ఉండును. కొందరికి మోక్షము గురించి తెల్పి, మోక్షము చేరిన జన్మించనవసరము లేదనినా, దానివిలువ తెలియని అజ్ఞానులు "అక్కడకుపోయి ఊరకనే యుంటే ప్రొద్దు ఎలాగ గడుచును? చచ్చి పుట్టుతూ ఉంటే కదా ప్రొద్దు పోయేది" అని అంటున్నారు. మరియు "ఊరకనే ఉంటే ఏమి బాగుంటుంది, భూలోకములో పుట్టి అన్ని సుఖములు పొందితే కదా బాగుండేది" అని కూడా అంటున్నారు, ఇంకనూ "మీకు తిక్కపట్టి **మోక్షము మోక్షము** అంటున్నారు, అది మాకు అవసరము లేదు" అని జ్ఞానులనే మందలిస్తూ అంటున్నారు. **మోక్షము** అంటే ఏమిటి? అన్న విషయము తెలియనివారికి పరమాత్మను గురించి చెప్పితే, గాలి లేని గదిలో వేసి తలుపు మూసినట్లగును. కావున వారు వినకపోవడమేకాక, అక్కడ నుంచి ఎప్పుడు బయటపడుదుమా! అని ఆలోచించి తప్పుకుందురు. **మోక్షమును** గురించి తెలుసుకోలేనివారు ఎవరూ పరమాత్మను గురించి తెలుసుకొనుటకు ఇష్టపడరు. అంతేకాక పరమాత్మ విషయములయందు ఇష్టముగావుండు వారిని చూచి అసహ్యించు కొందురు. కావున ప్రతి మానవుడూ మొదట మోక్షమును గురించి తెలుసుకోవలయును. మోక్షమును గురించి కొంత వివరించుకొని చూచినట్లయితే, అది అజ్ఞానులు అనుకొన్నట్లు ఒక లోకముకాదు. **మోక్షము** ఎక్కడోయున్నదని కొందరనుకొనుచుందురు. అది ఎక్కడోలేదు అంతటా ఉన్నది. మోక్షము పొందిన జీవుడు కాలముగానే మారిపోవుచున్నాడు. కాలమే తానైన తర్వాత ప్రొద్దుపోదు అను సమస్య ఎలాగ ఉండును? **మోక్షమును** పొందిన జీవుడు అణువణువునా నిండుకొనిపోయి, ప్రపంచములోయున్న కష్టములను పొందక, అన్నింటికీ సాక్షిగా ఉంటున్నాడు,

కావున అక్కడకు పోయి ఏమి చేయవలెనను సమస్య ఏమాత్రమూ ఉండదు. మోక్షమును పొందిన జీవుడు ప్రకృతి లోపలా బయటా ప్రపంచమంతటా ఉన్నాడు, కావున ప్రకృతి ఏమియూ చేయలేదు. మామూలు మానవులు ప్రకృతికి లోపలనే ఉండుటవలన, వారిని ప్రకృతి నాశనము చేయగలదు. **మోక్షము** పొందిన జీవుడు అగ్ని కూడ తానే అయివున్న దానివలన, అగ్నికి కాలును అను సమస్య ఏమాత్రమూ ఉండదు. **మోక్షము** పొందని జీవుడు అగ్ని తాను కాని దానివలన అగ్నికి కాలును. **మోక్షము** పొందిన జీవుడు గుణములకు అతీతుడు, అవి వానిని ఏమీ చేయజాలవు. మామూలు మానవుడు గుణములతో కూడుకొని ఉండును. గుణములు మానవున్ని ముప్పూతిప్పలు పెట్టుచున్నవి. **మోక్షము** పొందిన జీవుడు కంటికి కనపడక ఫలానాచోట ఉన్నాడని గుర్తించుటకు వీలులేక ఉన్నాడు. మామూలు మానవున్ని గుర్తించవచ్చును. **మోక్షము** పొందిన జీవుడు ప్రళయములో ప్రపంచమంతా నాశనమైపోయినను తాను నాశనముకాక ఉండును. **మోక్షము** పొందిన జీవుడు ప్రపంచములో అన్ని శరీరముల లోపలా బయటా ఉండును. **మోక్షము** పొందని మానవులు శరీరము లోపలనే ఉందురు. మోక్షము పొందిన జీవుడు అన్ని స్థలములనూ చూచుచుండును. దానిని పొందనివాడు అట్లు చూడలేడు. **మోక్షము** పొందిన జీవుడు ఒక స్థలమునుండి వేరొక స్థలముకు పోనవసరములేక అంతటా ఉండును. దానిని పొందనివాడు వ్యయప్రయాసలతో ఒకచోట నుండి మరొక చోటికి పోవలసి ఉండును. **మోక్షము** పొందిన జీవుడు అగ్గికి కాలడు. నీటికి తడువడు, గాలికి కొట్టుకుపోడు, కావున వాడు భయపడడు. దానిని పొందని జీవుడు అగ్నికి, గాలికి, నీటికి నిత్యము భయపడవలసి ఉండును. **మోక్షము** పొందిన జీవికి ఆహారము అవసరము

లేదు. దానిని పొందని వానికి ఆహారము నిత్యము అవసరము. **మోక్షము** పొందినవాడు శాశ్వతముగ చెప్పరాని సుఖమును పొందుచూ తృప్తిగా ఉండును. దానిని పొందనివాడు క్షణకాల సుఖములను అనుభవించుచూ ఎల్లప్పుడు అసంతృప్తి గానే ఉండును. **మోక్షము** పొందినవాడు ఏమాత్రము బాధపడవలసి ఉండదు. దానిని పొందనివాడు అనేక బాధలు అనుభవించ వలసి ఉండును. **మోక్షము** పొందినవాని కంటే ఎవ్వరూ పెద్దగా ఉండరు. దానిని పొందని మానవునికి దేవుడనువాడు ఒకడు పెద్దగా ఉన్నాడు. **మోక్షము** పొందినవాడు ఎల్లప్పుడు ఒకే రకముగా ఉంటున్నాడు, పొందనివాడు అనేక జన్మలయందు బాల్యము, యవ్వనము, కౌమారము, వృద్ధాప్యము అను స్థితులను పొందుచున్నాడు. ఈ విధముగా చెప్పుచూ పోయిన అనేకముగా **మోక్షము** యొక్క విలువ ఉన్నది. దానిని గురించి పూర్తి చెప్పుటకు ఎవ్వరికీ చేతకాదు. ఇది అంతయూ తెలుసుకున్న మనము ఇపుడుండు స్థితి మంచిదా? లేక మోక్షస్థితి మంచిదా? అని మీరే ఆలోచించుకోవలసియున్నది.

**మోక్షము** యొక్క విలువ తెలియనివారు దానితో ఏమి పని అంటున్నారు. **మోక్షము** ముందర ఇపుడు మనము అనుభవించు స్థితి పర్వతము ముందర చిన్న రాయితో సమానమని వారికి తెలియదు. **మోక్షము** యొక్క విలువ తెలియనివారు పరమాత్మను గురించి తెలుసుకొనుటకు ప్రయత్నించరు. కావున మొదట ప్రతి ఒక్కరూ **మోక్షము**ను గురించి తెలుసుకోవలయును. **మోక్షము**ను గురించి తెలుసుకున్న తర్వాత దానిని పొందుటకు మార్గము అన్వేషించవలయును. **మోక్షము** పొందుటకు గురువు అవసరము. గురువు లభించిన తర్వాత వారిద్వారా **మోక్షము**ను పొందుటకు వీలున్నది.

మోక్షసామ్రాజ్యము పొందుటకు ద్వారము ఒక గురువే. కావున గురువును ఆశ్రయించి ఆయన ద్వారా జ్ఞానము, యోగము పొంది జన్మరహితమైన **మోక్షము** సంపాదించుకోండి, 60 లేక 70 సంవత్సరముల కాలము బ్రతుకు ఈ జన్మయందు 20 లేక 30 సంవత్సరములు ప్రపంచ చదువులు చదివి, పెద్దపెద్ద డిగ్రీలు సంపాదించుకొని, పెద్దవారము అనిపించుకొనినా ఆ విలువ అంతయూ చచ్చునంత వరకే ఉండును. డాక్టర్లుగా, ఇంజనీర్లుగా పట్టాపొందినా, దాని ప్రయోజనము కొంతకాలమే ఉండును. ఎంత డబ్బు సంపాదించినా దానివద్ద మనముండునది కొంత కాలమే, ప్రపంచములో ఒక్కొక్క జన్మ కొంత కొంతకాలమే ఉండును. కావున ఈ జన్మ కూడ కొంతకాలమే ఉండును. చీకటిలో త్రాడును పామని భ్రమించినట్లు, అజ్ఞానములో శాశ్వతముకాని దానిని శాశ్వతము అనుకొని మనము ఎంతో పొరపాటు పడుచున్నాము. ఆ పొరపాటును తెలుసుకొని శాశ్వతము కాని ఈ జీవితమును నిర్లక్ష్యము చేసి శాశ్వతమైన **మోక్షము** కోసము ప్రయత్నము చేయవలయును. మానవులమైన మనకు ఎంతో తెలివి ఉన్నది. దానిని ఉపయోగించి ఇంతకు ముందు **మోక్షము** కోసము ప్రయత్నించినవారిని గురించి ఆలోచించిన, మనకంటే ఎక్కువ తెలివియున్న వారే దానికి ప్రయత్నము చేసినట్లు తెలియును. **మోక్షము** అనుచు మోసము చేయు దొంగభక్తులు ప్రపంచములో ఉండవచ్చును. వారినిచూచి మోక్షము అనునది చెడ్డది, దానిని ప్రయత్నించువారు అందరూ చెడ్డవారు అనుకోక, **మోక్షము** యొక్క సారాంశము గురించి ఒకమారు మీ దృష్టితో పారచూడండి. **మోక్షమును** గురించి తెలుసుకోలేని జీవితము నిరర్థకము అని కూడా తెలుసుకోండి, **మోక్షమును** గురించి తెలుసుకున్న జన్మ సార్థకమైనట్లేనని తెలుసుకోండి.

మోక్షమును గురించి ఖుర్‌ఆన్ గ్రంథములో మరొకచోట సూరా 53, ఆయత్ 25లో ఇలా కలదు చూడండి. **(53-25) “వాస్తవానికి మానవునకు అంతిమము పరలోకము (మోక్షము). అలాగే ప్రథమము ఇహ లోకము. ఇహలోకము, పరలోకము రెండూ దేవుని ఆధీనము లోనే ఉన్నాయి.”** ఈ వాక్యములో చెప్పినట్లు ఇటు ఇహలోకముగానీ, అటు పరలోకముగానీ రెండూ దేవుని ఆధీనములో ఉన్నాయి. అయితే మొదటిది ఇహలోకము, చివరిది పరలోకము. మొదటిదయిన ఇహలోకములో ఇప్పుడున్న మనుషులు ఎప్పటికయినా పరలోకములోనికి పోవలసిందే. చివరికి అందరూ అక్కడికి మోక్షమునకు పోవలసిందే. ఎంతవరకు ఇక్కడున్నా వృథాప్రయాసే మిగులును. అందువలన కాలము వృథా కాకుండా ఇప్పటినుంచే మోక్షము కొరకు ప్రయత్నించడము మంచిది. మోక్షమును గురించి ఎవరికివారు ప్రయత్నము చేయవలసిందేగానీ దాని విషయములో ఎవరి సిఫారసూ పనికిరాదు. ఆ విషయమై ఖుర్‌ఆన్ గ్రంథములో సూరా 53, ఆయత్ 26లో ఇట్లన్నారు. **(53-26) “ఆకాశములో ఎందరో దేవదూతలున్నారు. కానీ వారి సిఫారసు ఏమాత్రము పనికిరాదు. దేవుడు ఎవరిపట్ల ప్రసన్నుడౌతాడో వానికే మోక్షము లభిస్తుంది. దేవుని ఇష్టముతోనే ఎవరికయినా మోక్షము రావాలి.”** దేవునికి ఎవడు ఇష్టుడవు తాడో వాడే మోక్షమును పొందగలడు. దేవునికి ఇష్టుడుకావాలంటే దేవుని జ్ఞానమును తెలిసియుండాలి. ఎవడు దైవజ్ఞానియగునో వాడే దేవునికి ఇష్టుడగును. అందువలన దేవునికి ఇష్టుడుగా మారుటకు దైవజ్ఞానమును తప్పక తెలియాలి. అందువలన ఇప్పటినుండి దేవుని జ్ఞానమును తెలియుటకు ప్రయత్నిద్దాము.

దేవుడు ఇహలోకమునకు, పరలోకమునకు అధిపతియైనట్లే సర్వ ప్రపంచమునకూ అధిపతిగాయున్నాడు. ఆయన ఆధీనములో లేనివి ఏవీ లేవు. **ఆయన ఆధ్యాత్మిక ప్రపంచమునకు మరియు భౌతిక ప్రపంచమునకు రెండిటికీ అధిపతియే.** దేవుడు ఇంతటి వాడు, అంతటివాడు అని చెప్పుటకు వీలుపడదు. ఆయన ఎంతటివాడో ఎవరికీ తెలియదు. ప్రపంచములో ఎవరూ ఇంతవరకు ఆయనను చూడలేదు. ఆయన పుట్టుక లేనివాడు, అలాగే చావులేనివాడు, శాశ్వతముగా ఉండువాడు. దేవుడు అపరిమితుడు సర్వజీవరాశులకు సృష్టికర్త, పోషకకర్త, ప్రళయకర్త. అటువంటి దేవున్ని గురించి ఖుర్ఆన్ గ్రంథములో సూరా 55లో, ఆయత్ 17లో ఇలా కలదు. **(55-17) "రెండు తూర్పులకు ప్రభువు దేవుడే. అలాగే రెండు పడమరలకు కూడా దేవుడు ఆయనే."** మరియొక చోట సూరా 73, ఆయత్ 9లో దేవున్ని గురించి ఇలా వ్రాశారు చూడండి. **(73-9) "ఆయనే తూర్పు పడమరలకు ప్రభువు (అధిపతి) ఆయన తప్ప మరొక ఆరాధ్యదైవము లేదు. కావున నీవు ఆయననే కార్యకర్తగా చేసుకో."** ఇక్కడ రెండు వాక్యములు ప్రత్యేకతను సంతరించుకొని ఉన్నాయి. మొదటివాక్యములో రెండు పడమరలు, రెండు తూర్పులు అని చెప్పారు. ఈ వాక్యమును చూచిన ఎవరయినా ఎక్కడయినా రెండు తూర్పులు, రెండు పడమరలు ఉండునా!యని ప్రశ్నించవచ్చును. ఇది ప్రశ్నేయని మనము ఒప్పుకొనినా చెప్పినది మహాజ్ఞాని అయిన జిబ్రయేల్. ఆయన అంతలేనిది చెప్పునా! అని ఒక ప్రక్క అనిపించినా, ఎక్కడయినా రెండు తూర్పులుండునా యని అనుమానమున్నది. అయితే ఈ అనుమానము తీరుటకు ఈ వాక్యమును వివరించుకొని చెప్పుకొందాము. వాక్యములో చెప్పినట్లు రెండు తూర్పులు ఉండడము నిజమే. రెండు తూర్పులున్నాయన్నప్పుడు రెండు

పడమరలు కూడా ఉండును కదా! తప్పక ఉండును. రెండు పడమరలు, రెండు తూర్పులు ఎలా ఉన్నాయని ఎవరయినా ప్రశ్నించితే ఇలా చూపి చెప్పండి.




**భూగోళము**

పైన చూపినది భూమండలము అనుకొనుము. ఇండియాలో తెల్లవారినప్పుడు అమెరికాలో చీకటిపడుచున్నది కదా! అట్లే ఇక్కడ పగలయితే అక్కడ రాత్రియగుచున్నది. ఇక్కడ రాత్రి అయితే అక్కడ పగలగుచున్నది. అలాగే ఇక్కడ మనకు తూర్పు అయినది అక్కడ వారికి పడమరయగు చున్నది. అట్లే ఇక్కడ మనకు పడమర అయినది అక్కడ వారికి తూర్పు అగుచున్నది. ఆ లెక్కప్రకారము ఒకే భూగోళములో ఎదురెదురు దేశాలకు, ఎదురెదురు తూర్పుపడమరలు ఏర్పడుట చేత మనకు తూర్పు వారికి పడమర, మనకు పడమర వారికి తూర్పు. ఈ విధముగా రెండు తూర్పులు, రెండు పడమరలు కలుగుచున్నవి. 24 గంటలలో వారికి ఒక తూర్పు

మనకు ఒక తూర్పు ప్రకారము రెండు తూర్పులు ఏర్పడుట వలన దానిని అనుసరించి రెండు పడమరలు కూడా కలుగుచున్నవి. ఇది బయట ప్రపంచమునకు భౌతికముగాయున్న లెక్క. ఇప్పుడు ఆధ్యాత్మిక భావము ప్రకారము ఒక మనిషి మరణించినప్పుడే, అదే క్షణమే జననము కలుగుచున్నది. అదే మనిషి తిరిగి మరణించవలసి వచ్చినప్పుడు కూడా అప్పుడు మరణము వెంటనే జననము ఉండుట వలన రెండవ వాక్యములో తూర్పు పడమరలకు అధిపతి దేవుడేయని చెప్పారు. తూర్పు అనగా ఉదయించుట లేక జన్మించుటయని అర్థము. అలాగే పడమరయనగా అస్తమించుట లేక మరణించుటయని అర్థము. ఈ లెక్క ప్రకారము జనన మరణములను రెండిటినీ తూర్పు పడమరలని చెప్పారు. దేవుడు మనిషి చావుపుట్టుకలకు అధిపతియైనందున ఇక్కడ తూర్పు పడమరలకు దేవుడే అధిపతియని ఆధ్యాత్మిక భావముతో చెప్పారు. సృష్టికర్త, ప్రళయకర్త దేవుడు అయినందున తూర్పు, పడమరల అధిపతిగా దేవున్నే చెప్పవలసియున్నది.

శరీరములో తూర్పు పడమరగాయున్న చావుపుట్టుకలకు అధిపతియైన దేవుడు, శరీరము బయట భూమండలమునకు రెండు తూర్పులుగా, రెండు పడమరలుగాయున్నాడని తెలిసిపోయినది. చావు పుట్టుకలకు అధిపతిగాయున్న దేవుడు శరీరమునకూ, శరీరములోపల సమస్తమునకూ అధిపతిగాయున్నాడు. ఖుర్‌ఆన్ గ్రంథములో నేరుగా ఏదీ చెప్పలేదు. ప్రతి విషయమునూ ప్రత్యక్షముగా చెప్పకుండా పరోక్షముగా చెప్పారు. అలా చెప్పడము వలన చదివినవారందరూ గ్రహించలేరు. విచక్షణాబుద్ధియున్న వారికి, జ్ఞానము మీద శ్రద్ధయున్నవారికి మాత్రమే ఇందులో వ్రాసిన విషయము తెలియగలదు. దేవుడు ప్రత్యక్షముగా ఏదీ చెప్పడు. అన్నీ పరోక్షముగానే చెప్పునని కొన్ని విషయములలో

అర్థమగుచున్నది. పై వాక్యములలో 55-17లో రెండు తూర్పులు, రెండు పడమరలు అని చెప్పినవాడు, 73-9వ వాక్యములో ఒక తూర్పు, ఒక పడమరనే చెప్పాడు. ఒకచోట రెండు తూర్పులు అని చెప్పినవాడు మరియొక చోట ఒక తూర్పునే చెప్పాడే! అని అంటే అవును! దేవుడు అలాగే చెప్పును. ఆసక్తియున్న వానికే తన జ్ఞానము అర్థముకావలెననీ, ఆసక్తిలేనివానికి తన జ్ఞానము అర్థము కాకూడదనే అలా చెప్పాడు. ఒక వాక్యము అర్థము కాకుండా ఉంటే దానిని తెలియాలని ఆసక్తిని పెంచుకొనువానికి దేవుడే ఏదో ఒక విధముగా తెలియునట్లు చేయును. అందువలన దేవుడు చెప్పిన జ్ఞానమును తెలియాలను శ్రద్ధ ఎక్కువగాయున్న వానికి ఎంత నిగూఢమైన వాక్యమైనా సులభముగా తెలియునట్లు దేవుడు చేయును.

73-9వ వాక్యములో చివరియందు 'నీవు ఆయననే కార్యకర్తగా చేసుకో' అనియున్నది. మనిషికీ దేవునికీ ఎంతో తేడా కలదు. దేవుడు ఎంతో పెద్దవాడు, మనిషి ఎంతో చిన్నవాడు. చిన్నవాడు పెద్దవానిని గుమస్తాగా చేసుకొమ్మని చెప్పినట్లు నీవు సర్వమునకూ అధిపతియైన దేవున్నే కార్యకర్తగా చేసుకోగలవా? అని ప్రశ్నరాగలదు. వాక్యములో అలానే ఉన్నది కావున ఎందుకు అలా వ్రాశారు? అని కొంత యోచించవలసిన అవసరమున్నది. ఏదయినా శ్రద్ధయున్నవానికి కొంత తెలియగలదు అన్నట్లు శ్రద్ధతో తెలుసుకోవాలని యోచించిన వానికి, ఏమని తెలియుచున్నదో మనము విచారించి తెలుసుకొందాము. శరీరములో జీవుడు నివసిస్తూ యున్నాడు. శరీరములోయున్న జీవుడు ఒక్కచోట మాత్రముయుండి తన వరకు వచ్చిన దానిని మాత్రము అనుభవిస్తున్నాడు. జీవుడు ఏమీ చేయలేని వాడు. అంతేకాక అతను ఏమి కావాలనుకొన్నా అతను దానిని సాధించుకోలేడు. ఒక విధముగా ఏ కార్యమూ చేయలేని కుంటివాడు.

జీవుడు శరీరములో గ్రుడ్డిగా జీవిస్తున్నాడు తప్ప వానికంటూ ప్రత్యేకించి ఏ జ్ఞానేంద్రియములూ లేవు. జీవుడు గుణముల ప్రభావములో నివసిస్తూ బయట జరిగిన కార్యములోని సుఖమునో దుఃఖమునో అనుభవించు చున్నాడు. బయట కార్యములను చేయువాడు జీవుడు కాడు కదా! జీవుడు బయట జరిగే కార్యమునకు కర్త కూడా కాడు. బయట శరీరములో జరుగు పనికి అనగా కార్యమునకు కర్తగాయున్నవాడు మరొకడు గలడు. అందువలన గ్రుడ్డిగాయున్న జీవునికి చెప్పు హితము ఏమనగా! జరిగే పనులకు నీవు కర్తవుకావు, కర్త మరొకడున్నాడు. ఆయనే దేవుడు. ఆ దేవున్నే నీవు జరిగే కార్యమునకు కర్తగా ఒప్పుకొమ్మని చెప్పుచూ వాక్యములో అందరి దైవము ఆయనే కావున ఆయననే నీవు కార్యకర్తగా చేసుకొమ్మని చెప్పారు. అర్థము చేసుకోగలవానికి ఈ వాక్యములో జ్ఞానమున్నదని అర్థము కాగలదు. ఈ విధముగా ఎన్నో విషయములను బుద్ధితో యోచించి గ్రహించవలసిన అవసరమున్నది.

ఖుర్‌ఆన్ గ్రంథములో అన్ని ఆయత్‌లకు మేము అర్థమును వ్రాయ దలచుకోలేదు. ఖుర్‌ఆన్ మహా గ్రంథము. దానిముందర మేము ఎంతో స్వల్పులము అని ఒప్పుకోక తప్పదు. అయితే నేను నా చేతనయినంత స్వల్పముగా కొన్ని ఆయత్‌లకే అర్థమును చెప్పదలచుకొన్నాను. ఖుర్‌ఆన్‌లో 6236 ఆయత్‌లు (వాక్యములు) ఉన్నాయి. అందులో వేలు కాకుండా రెండు వందలు కూడా కాకుండా కనీసము వంద ఆయత్‌లకు అయినా భావములను వ్రాసి నా వరకూ దేవునిసేవ చేయాలనుకొన్నాను. ఎవరికీ తెలియని వాక్యములకు భావములను వ్రాయడము నాకు చేతనయ్యే పని కాదని నాకు బాగా తెలుసు. అయితే ఆ కార్యము చేయువాడిని నేను కాదు, నాకు కార్యకర్తయైనవాడే ఆ పనిని నా వెనుకయుండి చేయగలడని

ఈ పనికి పూనుకొన్నాను. అందువలన ఈ కార్యములో వచ్చు కీర్తిగానీ, అపకీర్తిగానీ నాకు ఏమాత్రము సంబంధములేదు. అన్నీ కార్యమునకు కర్తగాయున్న వానికే చెందునని చెప్పుచున్నాను. అదే పద్ధతిలోనే ఇప్పుడు ఖుర్‌ఆన్‌లో ముఖ్యముగాయున్న ఆయత్‌లలో ఒక ఆయత్‌ను తీసుకొని చూస్తాము. ఈ వాక్యమును గురించి ముస్లీమ్ పెద్దలలోనే ఏకాభిప్రాయము లేదు. ఆ వాక్యములో విషయమేమున్నదో చూడాలంటే సూరా 15, ఆయత్ 87 చూడవలసిందే. దానిని చూస్తే అందులో ఈ విధముగా వ్రాసియున్నది. **(15-87) "మేము నీకు ఏడు ఆయత్‌లను ఇచ్చియున్నాము. అవి పదేపదే పునరావృతం అవుతుంటాయి. ఇంకా మహోన్నతమైన ఖుర్‌ఆన్ ను నీకు ప్రసాదించాము"** అని కలదు.

ఈ వాక్యములో 'ఏడు ఆయత్‌లను నీకు ఇచ్చాము' అని ఉన్నది. ఇంతపెద్ద ఖుర్‌ఆన్ గ్రంథములో ఆ ఏడు ఆయత్‌లు ఏవి? అను ప్రశ్న రాగలదు. ఆ ప్రశ్నకు జవాబుగా కొందరు ముస్లీమ్ పెద్దలు ఈ విధముగా చెప్పుచున్నారు. ***"ఈ విషయమును గురించి అసలు మూలములో అనగా అరబ్బీ భాషలో మొదట వ్రాసిన గ్రంథములో "సబ్‌వు మసానీ" అని వచ్చింది. సబ్‌వు అంటే ఏడు అనియూ, మసానీ అంటే పునరావృతమయ్యేవి అనియూ అర్థము. అయితే ఈ "పునరావృతమయ్యే ఏడు" (సబ్‌వు మసానీ) అంటే ఏమిటి? అన్న విషయము పై ఖుర్‌ఆన్ వ్యాఖ్యాతల మధ్య భిన్నాభిప్రాయములున్నాయి. మొత్తానికి "సబ్‌వు మసానీ" అంటే "సూరే ఫాతిహా" అన్న విషయమే అన్నిటికంటే సరియైనది, సమంజస మైనదీను. సూరే ఫాతిహాలో ఏడు ఆయత్‌లు ఉన్నాయి. అవి ప్రతి నమాజులోనూ మాటిమాటికి పఠించబడుతూ ఉంటాయి. హదీసు ద్వారా ఈ విషయానికి సమర్థన లభించుచున్నది.***

*అయితే కొందరు పండితుల ఉద్దేశ్యములో రెండువందల ఆయత్‌లున్న ఏడు పెద్ద సూరాలని కూడా కలదు. 1) అల్ బఖర 2) అలీ ఇమ్రాన్ 3) అన్ నిసా, 4) అల్ మాయిదా 5) అల్ అన్ ఆమ్ 6) అల్ అరాఫ్ 7) అన్ సాల్ సూరాలని కొందరు అభిప్రాయపడుతున్నారు. అయితే అధిక పండితులు ఫాతిహా సూరానే అభిప్రాయపడుచున్నారు. ఇమామ్ బుఖారిగారు రెండు మార్పు లేఖనాలను కూడా ఉటంకించారు. వాటి ప్రకారము ప్రవక్తగారు కూడా ఫాతిహా సూరానే సమర్థించినట్లు తెలియుచున్నది.*

ఈ వాక్యములో చెప్పిన ఏడు ఆయతులేవో ముస్లీమ్ పండితులకే అర్థముకాక వేరువేరు అభిప్రాయములను చెప్పారు. ఫలానా ఆయతులే మేము చెప్పుచున్న ఆయత్‌లని వాక్యములో నిర్ధారించి చెప్పలేదు. నిర్ధారించి చెప్పకపోవడము వలన ఖచ్చితముగా ఇవే ఏడు ఆయతులని చెప్పలేక పోవుచున్నారు. ఒకవేళ ఎవరయినా ఫలానా వాక్యములే ఏడు వాక్యములని చెప్పినా నిర్ధారించి చెప్పుటకు సరియైన ఆధారములులేవు. అందువలన ఆయత్‌లో చెప్పిన ఏడు వాక్యములను గురించి సంశయముతో కూడుకొన్న పనిగానేయున్నది. ఇంతవరకు వారి అభిప్రాయములను మనము చూచాము. మన అభిప్రాయమేమో ఎట్లున్నదో ఇప్పుడు చూస్తాము. ఖుర్ఆన్ గ్రంథములో 114 సూరాలు కలవు. అందులో ఏడు ఆయత్‌లు ఉన్న సూరాలు రెండు మాత్రమే గలవు. అవి ఒకటి మొదటి సూరా "అల్ ఫాతిహా", 107వ సూరా "అల్ మావూన్" లో మాత్రమే 7 ఆయత్‌లు గలవు. నెంబరు 1, నెంబరు 107 సూరాలలో ఏడు (7) ఆయత్‌లే ఉండుట వలన ఈ రెండిటిలో ఏదో ఒకటి ఉండవచ్చును అని మన హృదిలో వచ్చిన ఊహ, మన ఊహ బుద్ధికి చేరినప్పుడు బుద్ధి ఈ విధముగా

ఆలోచించు చున్నది. వాక్యములో 'మీకు నేను ఏడు ఆయత్‌లు ఇచ్చాను' అని దేవుడు చెప్పాడు. తర్వాత చివరిలో "ఇంకా మహోన్నతమైన ఖుర్‌ఆన్‌ను కూడా ఇచ్చాను" అని అన్నాడు. ఇక్కడ బుద్ధి ఆలోచననుబట్టి 'ఖుర్‌ఆన్ గ్రంథమును ప్రత్యేకముగా ఇచ్చాను' అని చెప్పాడు. ఆ మాటనే "మహోన్నతమైన ఖుర్‌ఆన్ గ్రంథమును ఇచ్చాను" అని అన్నాడు. ఖుర్‌ఆన్ అంటే అందరికీ తెలుసు కదా! అందులో 114 సూరాలు ఉన్నాయి. చివరి వాక్యములో గొప్పదైన ఖుర్‌ఆన్ గ్రంథమును ఇచ్చాను అన్నప్పుడు 114 సూరాలు ఉండే గ్రంథమే కదా! నీకిచ్చినది. రెండవమారు ఇచ్చిన ఖుర్‌ఆన్‌లో అన్ని సూరాలున్నాయి. రెండవమారు ఇచ్చిన 114 సూరాల ఖుర్‌ఆన్ గ్రంథమును వదలి మొదట ఇచ్చిన ఏడు ఆయత్‌లు ఏవో చూడాలిగానీ, ఆయత్‌లు అంటూనే ఖుర్‌ఆన్ గ్రంథములోనికి రావడము, అందులోని సూరాల పేర్లు చెప్పుకోవడము మంచిదా? అని మనలోని బుద్ధి అడుగుచున్నది.

మనలోని బుద్ధి మనలనే వెక్కిరించుచున్నది. ఖుర్‌ఆన్ గ్రంథమును నీకు ఇవ్వకమునుపే దేవుడు మనిషికి ఏడు ఆయత్‌లు ఇచ్చాడు. తర్వాత ఇంకా మహోన్నతమైన ఖుర్‌ఆన్ కూడా ఇచ్చాను అన్నాడు. మొదట ఇచ్చిన ఏడు ఆయత్‌లు అవి వేరు. తర్వాత ఇచ్చిన ఖుర్‌ఆన్ గ్రంథము వేరు అని ఎంత బుద్ధిహీనునికయినా అర్థమయిపోతూయున్నది. అట్లుకాకుండా ఆయత్‌లను పేరు వింటూనే, గాలికి కొట్టుకొని వచ్చినట్లు వెనుకా ముందు చూడకుండా, బుద్ధితో కొద్దిగా కూడా ఆలోచించకుండా, ఈ మాట ఖుర్‌ఆన్‌కు ఏమి సంబంధము అనుకోకుండా, ఖుర్‌ఆన్ గ్రంథములోనికి పోయి, ఎవరికి ఇష్టమొచ్చినవి వారు ఏరుకొని, ఆ ఏడు ఇవేనని కొందరు, అవికాదు మేము చెప్పిన ఏడేనని కొందరూ అనడము సరియైన పనియేనా?

అని అడుగుచున్నాము. వాస్తవానికి వాక్యములో ముందు చెప్పిన ఆ ఏడు ఆయత్‌లకు ఖుర్‌ఆన్‌లో ఉండే ఆయత్‌లకు ఏమాత్రము సంబంధము లేదు. ఖుర్‌ఆన్‌కంటే ముందు ఏడు ఆయత్‌లను దేవుడు ఇచ్చాడు. మొదట ఏడు ఆయత్‌లు వచ్చిన తర్వాత చాలాకాలమునకు ఖుర్‌ఆన్ గ్రంథము వచ్చినది. ఇక్కడ కొందరు ఒక ప్రశ్నను అడుగవచ్చును. అదేమనగా! ఏమయ్యా! ఖుర్‌ఆన్ గ్రంథము పుట్టి ఇప్పటికి దాదాపు 1400 సంవత్సరములు అయినది. నీవు ఈ కాలములో 64 సంవత్సరముల క్రిందట పుట్టావు. ఏడు ఆయత్‌లు ఖుర్‌ఆన్‌కంటే ముందు పుట్టాయి అంటున్నారు. ఇంతవరకు ఎవరూ చెప్పని విషయమును మీరు చెప్పుచున్నారు. ఖుర్‌ఆన్‌కంటే వెనుక పుట్టిన మీరు, ఖుర్‌ఆన్‌కంటే ముందు పుట్టిన ఏడు ఆయత్‌లను గురించి ఎలా చెప్పుచున్నారు? ఏ ఆధారముతో చెప్పుచున్నారు? మీ మాటను ఎలా నమ్మాలి? అని ప్రశ్నించవచ్చును. దానికి మా జవాబు ఈ విధముగాయున్నది. నా మాటను నమ్మమని ఇంతవరకూ నేను ఎవరికీ చెప్పలేదు. నా బుద్ధికి దేవుడు అందించిన ఆలోచనను నేను చెప్పానుగానీ, ఎవరినీ తప్పనిసరిగా నామాట నమ్మమని చెప్పడములేదు. నా మాట సత్యమైతే నమ్మండి అని మాత్రము చెప్పుచున్నాను.

మీరు అడిగిన మూడు ప్రశ్నలలో మీ మాటను ఎలా నమ్మాలి? అను ప్రశ్నకు జవాబును చెప్పాము. ఇక ఎలా చెప్పుచున్నారనుటకు సమాధానముగా నా బుద్ధికి దేవుడు అందించిన విషయమునే మేము ప్రశ్నగా లేవనెత్తి అడిగాము. తర్వాత ఏ ఆధారముతో చెప్పుచున్నారని అడిగిన ప్రశ్నకు జవాబుగా మేము ఇట్లు చెప్పుచున్నాము. మేము ప్రశ్నించుటకు ఆధారము అదే వాక్యములోనే కలదు. వాక్యము ప్రారంభములో

మీకు మేము ఏడు ఆయత్‌లను ఇచ్చాము అని చెప్పి తర్వాత వెంటనే అవి పదేపదే పునరావృతము అవుతూ ఉంటాయి అని అన్నారు. ఆ తర్వాత ఖుర్‌ఆన్ విషయము వచ్చింది. మొదటగానీ, మధ్యలోగానీ ఖుర్‌ఆన్ విషయము లేదుకదా! మధ్యలో ఏడు ఆయత్‌లు పదేపదే పునరావృతం అవుతూ ఉంటాయి అని చెప్పారు. పునరావృతము కావడము అనగా తిరిగి రావడము అని అర్థము. 'పదేపదే పునరావృతము' అని అనడమునకు 'తిరిగి, తిరిగి రావడము' అని అర్థము. దేవుడు చెప్పిన మాటలో ఏడు ఆయత్‌లు ఏమిటో అవి ఎలా తిరిగి తిరిగి వస్తున్నవో ఎవరికీ అర్థము కావడములేదు. ఖుర్‌ఆన్ గ్రంథములో ఏ ఒక్క ఆయత్‌గానీ, లేక ఏ ఏడు ఆయత్‌లుగానీ పదేపదే పునరావృతం కావడము లేదు. వాటంతట అవే మరీమరీ తిరిగి తిరిగి రావడము ఎక్కడా జరుగలేదు. వాక్యమును బాగా గమనించితే అవి పదేపదే పునరావృతము అవుతుంటాయి. ఈ వాక్యమును బాగా గమనించితే ఎవరి ప్రమేయమూ లేకుండా ఏడు ఆయత్‌లు ఒకదాని తర్వాత మరొకటి ఎడతెరపి లేకుండా వస్తూనే ఉంటాయి అని అర్థమగుచున్నది. ఖుర్‌ఆన్ గ్రంథములో 6236 ఆయత్‌లలో ఏ ఒక్క ఆయత్‌గానీ పునరావృతము అగు అవసరమే లేదు. అది లేకుండా పోతే తిరిగి పునరావృతము (తిరిగి పుట్టడము) జరుగును. ఖుర్‌ఆన్‌లోని ఆయత్‌లు అన్నీ ఎలాగున్నవి అలాగే ఉన్నవి. వాటినుండి ఒక పొల్లు కూడా పోలేదు.

మొత్తము మీద ఇక్కడ చాలామంది పొరపడినారనియే అర్థమగుచున్నది. అయినా కొందరు తమ తప్పును సమర్థించుకొనుటకు పునరావృతము అవడము అంటే మాటిమాటికీ చదవడము అని కూడా చెప్పుచున్నారు. ప్రతి దినము మొదటి సూరాలోని ఏడు ఆయత్‌లను ముస్లీమ్‌లందరూ చదవడము జరుగుచున్నది. అందరూ అనడములో

ఖురాన్‌ను చదువువారు, నమాజు చేయువారు చదవడము జరుగుచున్నది. మొదటి సూరా అయిన "అల్ ఫాతిహా" సూరాను తప్పక చదువవలెనను నియమమును ముస్లీమ్‌లు పాటించుచుండడము వలన మాటిమాటికీ పునరావృతముగా పఠించుచున్న ఆయత్‌లని అల్ ఫాతిహా సూరాలోని ఏడు ఆయత్‌లను చూపించుచున్నారు. ఈ విషయానికి వస్తే మేము వారి మాటను ఒప్పుకుంటాము గానీ పూర్తి ఒప్పుకోకముందు ప్రశ్నించి అనుమానమును తీర్చుకోవాలనుకొన్నాము. ఈ విషయము మనకు బాగా అర్థమగుటకు ఒక విషయమును ఉదాహరణగా తీసుకొని చూస్తాము.

గురువు శిష్యుడు మాటలాడుకోవడము జరుగుచున్నదనుకొనుము. శిష్యుడు గురువుతో చెప్పునదంతా బాధ అంటాము. అలాగే గురువు శిష్యునితో చెప్పునదంతా బోధ అంటాము. శిష్యుడు గురువుగారితో తన బాధనంతా చెప్పుకోగా దానికి విరుగుడుగా బాధలనుండి బయటపడుటకు తగిన బోధను గురువు శిష్యునితో చెప్పుచుండును. శిష్యుడు తన కర్మలను పోగొట్టుకొనుటకు గురువువద్ద చేరి తన కర్మను గురించి చెప్పుకోగా, దానికి పరిహారముగా గురువు ఆత్మజ్ఞానమును తెలియజేయుచున్నాడు. అందువలన "శిష్యునిది బాధ, గురువుది బోధ"యని నానుడిగా అనడము జరుగుచున్నది. గురువు శిష్యుడువలె, ఒక వైద్యుడు ఒక రోగిని గురించి చెప్పుకొంటే రోగి తన వైపునుండి చెప్పునది రోగముకాగా, వైద్యుడు తనవైపు నుండి చెప్పునది చికిత్స. అదే విధముగా భక్తుని వైపునుండి చెప్పు దానిని ప్రార్థన అంటాము. దేవునివైపునుండి చెప్పుదానిని జ్ఞానము అంటాము. శిష్యునిది బాధ, రోగిది రోగము, భక్తునిది ప్రార్థనయని చెప్పవచ్చునుగానీ, ఎవరయనా శిష్యునిది బోధయని చెప్పినా, రోగిది వైద్యము అని చెప్పినా, భక్తునిది జ్ఞానము అని చెప్పితే అంతా తప్పగును. అలాగే గురువుది బోధ

అనకుండా బాధ అనినా, వైద్యునిది వైద్యము అనకుండా రోగము అనినా, దేవునిది జ్ఞానము అని చెప్పక ప్రార్థన అని చెప్పినా పూర్తి తప్పగును. అదే విధముగా ఖుర్ఆన్ గ్రంథములో మొదటి సూరా అల్ ఫాతిహాలోని ఏడు ఆయత్‌లు భక్తుని వైపునుండి చేయు ప్రార్థనగానీ దేవుని (అల్లాహ్) వైపునుండి చెప్పు జ్ఞానముకాదు. ఖుర్ఆన్ దేవునివైపు నుండి చెప్పబడిన జ్ఞానముగల గ్రంథము. భక్తునివైపునుండి చెప్పబడినది ఏమాత్రము కాదు.

జిబ్రయేల్ మహాజ్ఞాని అటువంటివాడు తనకు తెలిసిన దేవుని జ్ఞానమును ముహమ్మద్ ప్రవక్తగారికి అందించాడు. దేవుని జ్ఞానమును తెలియజేయుటకు ఆకాశమునుండి భూమిమీదికి దిగివచ్చాడు. అలా దిగి వచ్చినవాడు దేవుని జ్ఞానమును ప్రవక్తగారికి చెప్పడము జరిగినది. అంతేగానీ ఏనాడూ ఆయన దేవున్ని ప్రార్థన చేయుటకు భూమిమీదికి రాలేదు. ఇప్పుడు అసలు విషయానికి వస్తాము. ఖుర్ఆన్ గ్రంథములో నేడు మొదటి సూరాగాయున్న 'అల్ ఫాతిహా'లోని ఏడు ఆయత్‌లను మహాజ్ఞాని అయిన జిబ్రయేల్ చెప్పాడా? అని ఎవరయినా ప్రశ్నించవచ్చును. తెలివైన ముస్లీమ్‌లకే ఈ ప్రశ్న వచ్చియుండవచ్చును. పైకి అడిగితే తప్పగునేమో! అను భయముతో ప్రశ్నను లోపలే అణచివేసుకొనియుండ వచ్చును. అనుమానము అట్లేయుంటే అది పెనుభూతమయి మార్గము త్రప్పిపోవుటకు అవకాశమేర్పడగలదు. అందువలన అనుమానము లేని జ్ఞానము, ప్రశ్నఉద్భవించని జ్ఞానమే నిజమైన జ్ఞానమని చెప్పవచ్చును. అందువలన ఈ ప్రశ్నకు మనము జవాబును తెలుసుకొంటే ఇలా కలదు. జిబ్రయేల్ 23 సంవత్సరములు దైవజ్ఞానమును చెప్పగా దానిని వినిన వారందరూ కలిసి ఖుర్ఆన్ గ్రంథముగా వ్రాయాలనుకొన్నారు. అప్పుడు జిబ్రయేల్ చెప్పిన జ్ఞానమును గ్రంథరూపముగా చేయుటకు కొందరు

పూనుకొని మొదట దేవున్ని ప్రార్థించి తర్వాత గ్రంథముగా వ్రాయడము జరిగినది. దేవుని జ్ఞానమును ఖుర్ఆన్ గ్రంథముగా వ్రాయడము చాలా గొప్ప మహత్తర కార్యమని వారికి తెలుసు. 23 సంవత్సరములు ముహమ్మద్ ప్రవక్తగారి నుండి తెలుసుకొన్న జ్ఞానమును వినినవారు వ్రాశారు. వారు ముందే తాము వ్రాయవలసిన జ్ఞానము చాలా గొప్పదని తెలిసి వ్రాయుటకు పూనుకొన్నప్పుడు మొదట దేవునిమీద భక్తితో ప్రార్థన చేసి వ్రాయడము మొదలుపెట్టారు. ఆ దినము వారుచేసిన ప్రార్థన ఏడు వాక్యములుగా యున్నది. ఏడు వాక్యములతో దేవున్ని ఆనాటి భక్తులు ప్రార్థించి గ్రంథమును వ్రాశారు. ఆ ప్రార్థనే మొదట వ్రాయబడినది. అదియే నేడు మొదటి సూరాగా కనపడు అల్ ఫాతిహా. ఈ సూరాలో భక్తి తప్ప ఏమీ లేదు. తర్వాతయున్న 113 సూరాలలో దేవుని జ్ఞానము చెప్పబడినది. మొదటి సూరా భక్తుల వైపునుండి పుట్టిన ప్రార్థన. తర్వాత అన్ని సూరాలు దేవుని వైపునుండి పుట్టిన జ్ఞానమని తెలియవలెను.

గతములో జరిగిన చరిత్ర తెలియనివారు భక్తుల ప్రార్థనను, దేవుని జ్ఞానమును రెండిటినీ కలుపుకొని అంతటినీ ఖుర్ఆన్ గ్రంథము అని అంటున్నారు. ఎక్కడినుండి జిబ్రయేల్ చెప్పిన జ్ఞానము మొదలయినదో, అక్కడినుండే ఖుర్ఆన్ గ్రంథమని గ్రహించవలెను. భగవద్గీతలో మొత్తము 18 అధ్యాయములున్నవి. అందులో మొదటిది అర్జునుడు తన బాధను చెప్పుకొన్న అధ్యాయము. తర్వాత రెండవ అధ్యాయము సాంఖ్యయోగములో 11వ శ్లోకమునుండి భగవంతుడు (శ్రీకృష్ణుడు) చెప్పిన జ్ఞానము మొదలయి నది. అందువలన మేము వ్రాసిన **"త్రైత సిద్ధాంత భగవద్గీత"**లో భగవద్గీతను 17 అధ్యాయములుగానే ప్రకటించాము. అర్జునుడు చెప్పినది విషాదము. అందువలన మొదటి అధ్యాయమును అర్జున విషాదయోగము అంటాము.

విషాదము అనగా దుఃఖము లేక ఏడ్చుడము. దుఃఖమున్న అధ్యాయము జ్ఞానము కాదు. జ్ఞానమును కృష్ణుడు చెప్పాడు. అందువలన రెండవ అధ్యాయమునుండి చెప్పబడిన దానినే భగవద్గీత అని అనవచ్చును. మేము అట్లే అంటున్నాము. ఇప్పుడు భక్తులు చేసిన ప్రార్థనను ఖుర్‌ఆన్‌లో కలుపకుండా, ప్రవక్త చెప్పిన దానిని మాత్రమే ఖుర్‌ఆన్ అంటే సరిపోవును.

15వ సూరా, 87వ ఆయత్‌లోని వాక్యము **"అంతిమ దైవగ్రంథము ఖుర్‌ఆన్"** అను తెలుగు అనువాద గ్రంథమునుండి వ్రాశాము. అదే వాక్యమునే **"దివ్య ఖురాన్"** అను తెలుగు అనువాద గ్రంథములో ఎట్లున్నదో దానిని వ్రాస్తున్నాము. **(15-87) "మేము మీకు ఏడు ఆయతులను ఇచ్చాము. అవి మాటిమాటికీ పఠింపదగినవి. ఇంకా మీకు మహత్తరమైన ఖుర్‌ఆన్ గ్రంథమును ప్రసాదించాము."** ఇదే వాక్యమునే **"ఖుర్‌ఆన్ అవగాహనము"** అను గ్రంథములో ఉన్న దానిని కూడా వ్రాయుచున్నాము. **(15-87) "మేము నీకు ఏడు ఆయత్‌లను ఇచ్చియున్నాము. అవి మాటిమాటికీ పునరుక్తము చేయదగినటు వంటివి. ఇంకా నీకు మహోజ్జ్వలమైన ఖుర్‌ఆన్‌ను ఇచ్చాము."** ఇదే వాక్యమునే **"ఖుర్‌ఆన్ భావామృతము"** అను తెలుగు అనువాద గ్రంథములోయున్నదానిని వ్రాస్తున్నాము చూడండి. **(15-87) "మేము నీకు మాటిమాటికీ ఉచ్ఛరింపదగిన ఏడు సూక్తులను ప్రసాదించాము. మేము నీకు మహోన్నతమైన ఖుర్‌ఆన్ గ్రంథమును అను గ్రహించాము."** అరబ్బీ భాషలోని ఖుర్‌ఆన్‌లో ఉన్నదానిని ఇంతమంది తెలుగు అనువాదకులు ఎవరు ఏ విధముగా వ్రాసినది చూచారు కదా! నాలుగురకముల గ్రంథములను చూస్తే నలుగురు కొద్దిగా ఇంచుమించు తేడాతో వారి భావములను అనువదించారు. అన్నిటియందూ దేవుడు ఏడు ఆయతులను

ఇచ్చినట్లు చెప్పారు. అట్లే ఖుర్‌ఆన్ గ్రంథమును కూడా ఇచ్చాడు అని చెప్పారు. అయితే మధ్యలోని వాక్యమును కొంత తేడాతో వ్రాసుకొన్నారు. ఏడు ఆయతులను 'మాటిమాటికీ పునరుక్తము చేయదగినవి' అని ఒకరు, 'మాటిమాటికీ పఠింపదగినవని' మరొకరు. 'మాటిమాటికీ ఉచ్ఛరించదగిన వని' ఇంకొకరు వ్రాశారు. "అంతిమ దైవగ్రంథము ఖుర్‌ఆన్"లో 'అవి పదేపదే పునరావృతము అవుతుంటాయి' అని వ్రాశారు. మేము చెప్పిన భావము చివరిలో చెప్పిన వాక్యమునకు సరిపోవును. మిగతా మూడు గ్రంథములకు కొంత తేడాతోయున్నది. ఆ మూడు గ్రంథములలో మనమే ఆ ఏడు ఆయతులను మాటిమాటికీ పఠించవలెను లేక ఉచ్ఛరించ వలెను అని వ్రాశారు. వారిమాట ప్రకారమైనా ముందుపుట్టిన లేక ముందు దేవుడు చెప్పిన ఏడు ఆయతులు ఏవని చెప్పగలరు? అలా చెప్పుటకు వీలులేదు. ఒకవేళ అవి ఖుర్‌ఆన్ గ్రంథములోని మొదటి సూరా 'అల్ ఫాతిహా' లోని ఏడు ఆయత్‌లని చెప్పినా, అవి మనుషులు చెప్పినవిగా యున్నవిగానీ, దేవుడు చెప్పినవికావు. దేవుడు మనుషులకు చెప్పినది జ్ఞానమైయుంటుంది గానీ, ప్రార్థన అయివుండదు. ఈ విధముగా ఎటు చూచినా ప్రశ్న వచ్చుటకు అవకాశమున్నది. అలాంటప్పుడు "అంతిమ దైవగ్రంథము ఖుర్‌ఆన్" అను గ్రంథములో వ్రాయబడిన వాక్యమే కొంత మంచిగాయున్నదనీ, దానివలన ప్రశ్నలు ఉద్భవించుటకు వీలులేదని కనిపించుచున్నది. ఈ ఆయత్‌ను మొదటనే మేము వ్రాసియున్నాము. అయినా అదే వాక్యమునే మరొకమారు ఇక్కడ వ్రాయుచున్నాము చూడండి. ఈ ఆయత్ మూడు వాక్యములుగా మూడు భాగములుగా ఉన్నది గమనించండి. **(15-87) "మేము నీకు ఏడు ఆయతులను ఇచ్చి యున్నాము. అవి పదేపదే పునరావృతము అవుతుంటాయి. ఇంకా మహోన్నతమైన ఖుర్‌ఆన్‌ను నీకు ప్రసాదించాము."** అని కలదు.

ఈ వాక్యము ప్రకారము మేము చెప్పు భావములన్నియూ తప్పు అయినప్పుడు వాటి వలన ప్రశ్నలు పుట్టుకొస్తున్నప్పుడు మా భావమును, మేము చెప్పిన విధానమును మేము ప్రక్కన పెట్టుతాము దీనిని గురించి మీరేమి చెప్పుతారని అందరూ నన్ను ప్రశ్నించవచ్చును. దానికి నా బుద్ధికి వచ్చిన ప్రశ్నలను అడిగాను తప్ప నేను చెప్పుస్థోమతలో లేనని చెప్పుచున్నాను. అయితే ఇక్కడ దేవుడు ఒక్క అవకాశమును మనకు ఇచ్చాడు. నాకు ఏమీ తెలియదు అని నిర్ణయము చేసుకొన్నప్పుడు, నాకు అన్ని విధములా తెలియుశక్తి లేదని మనిషి తన స్థితిని తాను తెలుసుకొన్నప్పుడు, మనిషికి జ్ఞానము మీద శ్రద్ధ కలిగినప్పుడు, వారికి సంశయరహితమైన జ్ఞానమును తెలియజేస్తానని దేవుడు తెలియచెప్పాడు. ఆ సూత్రమును ఆధారము చేసుకొని దేవునిమీదనే భారమువేసి ఆయనే అన్నీ తెలిసినవాడు, అన్నిటినీ తెలుపువాడు అని విశ్వాసముంచితే నేడో, రేపో, ఎల్లుండో లేక సంవత్సరమునకో ఎప్పుడో ఒకప్పుడు సులభముగా తెలియజేసిపోవును. గుట్టుచప్పుడు కాకుండా ఎంతటి జ్ఞానమునయినా దేవుడు తెలియజేయ గలడు. ఒక ప్రశ్నకు సమాధానము దొరికినా అది దేవుడు చెప్పినట్లే యుండును. దానితో మనిషి దానిని తానే చెప్పినట్లు, తానే కనుగొనినట్లు భావించుకొనును. అహంభావమును పొందును. ఇప్పుడు అట్లు అహంభావమును పొందకుండా దేవుడు తెలియజేసిన విషయమునే తెలుసుకొందాము.

దేవుడు అందించిన భావము ప్రకారము ఏడు ఆయత్‌లను, దేవుడు ఖుర్‌ఆన్‌కంటే ముందు అందించిన మాట వాస్తవమే. అయితే ఈ ఏడు ఆయతులు సృష్ట్యాదిలో మనిషికి సంక్రమింపజేసినవని తెలియుచున్నది. ఏడు ఆయతులను మనకి దేవుడు ఇచ్చి భూమిమీదకు పంపాడు. సృష్ట్యాది

లోనే ప్రతి మనిషికీ ఏడు ఆయతులు ఇచ్చి పంపడము జరిగినది. ఏడు ఆయతులను తీసుకొని మనిషి పుట్టాడు. ప్రతి మనిషికీ ఏడు ఆయతులను ఇచ్చి పంపుట వలన ఆయత్‌లు లేకుండా భూమిమీద ఏ మనిషీ పుట్టలేదు. ఇది సృష్ట్యాదిలోనే జరిగిన తంతు. అప్పటికీ ఇప్పటికీ మనిషి ఎక్కడ పుట్టినా ఏడు ఆయతులతోనే పుట్టుచున్నాడు. సృష్ట్యాదినుండి దేవుడు చెప్పినమాట నెరవేరుచూనే వస్తున్నది. ఆనాటి నుండి నేటివరకూ ప్రతి మనిషీ ఏడు ఆయతులను తనవెంట తీసుకొని వచ్చి పుట్టుచున్నాడు. అయినా ఆ ఏడు ఆయతులు ఏవో మనిషి మరచిపోయాడు. దేవుడు మొదట చెప్పినట్లే నీకు ఏడు ఆయతులిచ్చాను అని అన్నట్లే నేటికినీ పుట్టుచున్న ప్రతి వ్యక్తికీ ఏడు ఆయతులను ఇచ్చాడు. ఏడు ఆయతులు ఒకే భావమును, ఒకే శబ్ధమును, ఒకే అర్థమును కల్గియున్నాయి. ఏడు ఆయతులు వాటికి అవే మాటిమాటికీ పునరావృతము అగుచున్నమాట వాస్తవమే. అవి పదేపదే పఠించబడుచుండుట వాస్తవమే. అయితే వాటి మీద మనిషి ధ్యాస లేకుండా పోయి మనిషి ధ్యాసయంతా ప్రపంచములోనే లగ్నమైపోయినది. ఏడు ఆయతులు దేవుడు ఇచ్చినవి అయినందున అవి ఏడూ మాటిమాటికీ అహర్నిశలు అల్లాహ్ నామమునే ఉచ్ఛరించుచున్నవి. ఏడు ఆయతులు స్వయంశక్తితో కూడుకొని మాటిమాటికీ పునరావృతం అగు శక్తి కలిగియున్నవి. అవి మాటిమాటికీ పునరావృతములో దేవుని పేరునే చెప్పుచున్నవి. ఆశ్చర్యముగా ఉంది కదా!

సృష్ట్యాదిలోనే దేవుడు ఏడు ఆయతులను ఇచ్చాడని జిబ్రయేల్ ప్రవక్తగారికి చెప్పాడు అంటే అదేమాట సూర్యుడు కూడా భూమిమీద చెప్పియుండునని తెలియుచున్నది. సృష్ట్యాదిలో సూర్యుడు వినిన జ్ఞానమునే తర్వాత జిబ్రయేల్ కూడా తెలియగలిగాడు. అదే జ్ఞానమునే ప్రవక్తగారికి

చెప్పాడు. అందువలన సూర్యుడు చెప్పిన జ్ఞానము జిబ్రయేల్ చెప్పిన జ్ఞానము రెండూ ఒకటేయని, అదే జ్ఞానము భగవద్గీతలో కూడా ఉండునని అర్థమగుచున్నది. భగవద్గీతలో వ్రాసిన దానినిబట్టి, ఇక్కడ ఏడు ఆయత్‌లకు అర్థము చెప్పుకోవచ్చునని తెలియుచున్నది. భగవద్గీతలోనున్న జ్ఞానమే ఇదివరకు చాలాచోట్ల ఖుర్ఆన్‌లో కనిపించినది. పైగా భగవద్గీతలోనున్న జ్ఞానమును ఖుర్ఆన్ ధృవీకరించుచున్నది. అందువలన ఏడు ఆయతుల జ్ఞానము తప్పకుండా భగవద్గీతలో ఉండునని తలచి భగవద్గీతను చూచినప్పుడు అందులో విభూతియోగము అను అధ్యాయమున 6వ శ్లోకమున ఈ ఏడు ఆయతుల విషయము ఉన్నట్లు అర్థమయినది. అయితే ఏడు ఆయత్‌ల విషయములో ఏ విధముగా ముస్లీమ్‌లందరూ పొరపాటుపడి తప్పు భావములోనికి పోయారో, అలాగే హిందువులు కూడా పూర్తి తప్పు భావములోనికి పోయినట్లు తెలిసినది. భగవద్గీతలో ఏమి చెప్పారో, అక్కడ హిందువులు ఎలా పొరపడినారో గ్రహించితే ముస్లీమ్‌లు కూడా అలాగే పొరపడినారని తెలియగలదు. అంతేగాక ఏడు ఆయతుల అసలు అర్థమును కూడా మనము తెలియవచ్చును. అందువలన ఇప్పుడు భగవద్గీతలోని విభూతియోగమునందుగల 6వ శ్లోకమును చూస్తాము, అట్లే దాని వివరమును తెలుసుకొందాము.

శ్లో॥ మహర్షయ స్సప్త పూర్వే చత్వారో మనవ స్తథా ।
మద్భావా మానసా జాతా యేషాం లోక ఇమాః ప్రజాః ॥

**భావము :-** మొదట ప్రపంచములో సప్త మహర్షులు, చతుర్ మనువులు నా సంకల్పము చేత తయారైనాయి. తర్వాత వాటివలన సమస్త జీవరాసులను సృష్టించాను.

**వివరము :-** మొట్టమొదట సృష్టి ఎలా జరిగినది భగవంతుడు ఈ శ్లోకములో సూచనప్రాయముగా తెలియజేశాడు. సైన్యములో సిగ్నల్ సెక్షన్ అను విభాగము ఒకటి కలదు. అందులో కొన్ని సిగ్నల్స్‌కు (గుర్తులకు) కొన్ని అర్థములు నిర్ణయింపబడి ఉండును. ఆ విభాగములో శిక్షణ పొందిన వారికే ఆ సిగ్నల్స్‌కు అర్థము తెలియును. వైర్‌లెస్ ఆపరేటర్లు తాము మాట్లాడే విషయము శత్రువులకు అర్థము కాకుండా మాట్లాడుటకు ఒక పెద్ద విషయమునకు చిన్నకోడ్‌ను (గుర్తును) పెట్టుకొని మాట్లాడుచుందురు. ఆ విధముగానే ఈ శ్లోకములో పెద్ద విషయమును తెలియజేయు చిన్నకోడ్ కనిపిస్తూయున్నది. అందువలన సూచనప్రాయముగా తెలియజేశాడన్నాము. ఇందులోని గుప్తమైన విషయము తెలియక సప్తఋషులు, నలుగురు సనకసనందాలు, నలుగురు మనువులు మొత్తము 15 మంది సృష్ట్యాదిలో పుట్టారని కొందరు వ్రాశారు. మరికొందరేమో ఏడుమంది ఋషులను, నలుగురు మనువులను మొత్తము 11 మందిని దేవుడు సృష్టించాడని వ్రాశారు. అట్లు తయారైన వారివలననే మిగతా మనుషులు, జీవరాశులు పుట్టాయని వ్రాశారు. ఈ విషయమును చూచిన హేతువాదులు మొదట స్త్రీలే లేకుండా పురుషలకే మిగతా సంతతియంతా ఎట్లు పుట్టిందని ప్రశ్నిస్తున్నారు. ఇటువంటి కొన్ని అర్థముకాని విషయములను పట్టుకొని భగవద్గీత భూటకమనీ, మనుషులు కల్పించుకొన్న గ్రంథమనీ హేళనగా మాట్లాడుచున్నారు. అటువంటి హేతువాదులను దృష్ఠిలో పెట్టుకొని వారికి నా జ్ఞానము యొక్క గట్టు కూడా దొరకకుండా చేస్తానని గీతలోనే దేవుడు చెప్పాడు. అటువంటివారు దేవుని జ్ఞానమునకు దూరముగా పోవునట్లు, వారికి అర్థము కాకుండునట్లు, ఇప్పటివరకున్న గీతలలో కొంతవరకే వివరమును రచయితల చేత దేవుడే వ్రాయించాడనుకొందాము.

ఇప్పుడు ఇక్కడ మేము వ్రాయు విషయమును కూడా ఎందరో విమర్శించువారుంటారు. ఏ ఆధారముతో చెప్పారని ప్రశ్నించువారుండ వచ్చును. ముందే చెప్పానుగా కోడ్ తెలియకపోతే విషయము అర్థముకాదని. అందువలన ఈ విషయము కొందరికి మాత్రము అవగాహనకు రాగలదు. ఇక్కడ బుద్ధిని ఉపయోగించి అవగాహన కొరకు ప్రయత్నించండి. ఆదిలో సృష్ఠికి పూర్వము క్రింద భూమిగానీ, పైన ఆకాశముగానీ, మధ్యలో గాలి, అగ్ని, నీరుగానీ ఏవీలేని కాలమది. ప్రపంచమను పంచభూతములుగానీ, జగతి అను జీవరాసులుగానీ లేనపుడు కూడా కాలమనునది ఉన్నది. ఆ కాలమునకు గంటలుగానీ, ఘడియలుగానీ లేవు. ఏమాత్రము ఎవరికీ వ్యక్తముకాని ఆ సమయములో అవ్యక్తమైన, అగమ్యమైన, అగోచరమైన ఒకే ఒక పరమాత్మ మాత్రము మిగిలి ఉండెడిది. అటువంటి పరమాత్మ నుండి పరమాత్మ ఇష్టముతోనే దాదాపు పరమాత్మంత బలము కల్గిన ప్రకృతి అనబడునది పరమాత్మ చేతనే సృష్ఠింపబడినది. ఏమీలేని, ఏదికాని శూణ్యమునుండి మొట్టమొదట తయారైనది ప్రకృతి. ప్రకృతి పుట్టిన తర్వాత ఐదు భాగములుగా విడిపోయినది. ఆ ఐదు భాగములే ఆకాశము, గాలి, అగ్ని, నీరు, భూమి అనబడునవి. ఈ ఐదింటినీ ప్రపంచము అనుచున్నాము. ఈ విధముగా మొదట జీవరాసులులేని ప్రపంచము ఏర్పడినది. మొదటనే పరమాత్మ పురుషునిగా ఉంటూ, తనచేత తయారు చేయబడిన ప్రకృతిని స్త్రీతత్త్వము కల్గిన దానిగా పరమాత్మే (దేవుడే) ఉంచాడు. ఆడతనముగల ప్రకృతిని ఐదు భాగములుగా మార్చినవాడు పరమాత్మయే. పంచము వలన ఏర్పడిన దానిని ప్రపంచమనడము జరిగినది. ఏ జీవరాసి లేని ఆ ప్రపంచములో మొట్టమొదట పరమాత్మనుండి కొంత భాగము విడిపోయి వచ్చినది, అదియే ఆత్మ అని పిలువబడుచున్నది. మొదట ప్రకృతి ఒక్కటిగా

తయారై ఐదుగా విడిపోయినట్లు, మొదట పరమాత్మనుండి వచ్చిన ఆత్మ ఏడు భాగములుగా విడిపోయినది. ఆత్మను సుఖదుఃఖములకు అతీతమైన ఆనందమనుచున్నాము. అందువలన బ్రహ్మానంద అనియూ, మహర్ష అనియూ ఆత్మకు పేరు కలదు. మొదట ఆత్మ పరమాత్మనుండి పుట్టుకొచ్చిన తర్వాత ఏడు భాగములుగా పరమాత్మ చేతనే విభజింపబడినది. విభజింపబడిన ఆత్మ యొక్క ఏడు భాగములను మహర్షయ సప్త అని అన్నారు. **మహర్షయ సప్త అనగా ఆత్మ యొక్క ఏడు భాగములని అర్థము. ఈ విధముగా మొదట పరమాత్మచేత ఏర్పడినవే సప్త మహర్షులు, ఇంతవరకు ఎవరికీ అర్థముకాని విషయము ఇదియే.** సప్త మహర్షులు అయిన ఆత్మ భాగములు సప్తమహర్షులను మనుషులుగా మనకు అర్థమైనది. మనకెట్లు అర్థమైనా మొదట తయారైనది సప్తమహర్షులు కాదు, సప్తమహర్షలని తెలియవలెను.

పరమాత్మ మొదట తనకు సమానముగా ఉండునట్లు ప్రకృతిని తయారు చేశాడని తెలుసుకొన్నాము. ప్రకృతి ఐదు భాగములుగా తయారై ప్రపంచము ఏర్పడిన తర్వాత ఆత్మ అనునది ఏర్పడినది. పరమాత్మకు తోడుగా ప్రకృతి ఉండగా, ఆత్మకు తోడుగా మరొక ప్రకృతి ఏర్పడినది. పరమాత్మ యొక్క అంశ ఆత్మకాగా, ప్రకృతి యొక్క అంశ మరొక ప్రకృతిగా విభజింపబడినది. పరమాత్మకు తోడుగా ఏర్పడిన మొదటి ప్రకృతికి మార్పు చెందని ప్రకృతి అని పేరుగలదు. దానినే అచరప్రకృతి అంటున్నాము. ఆత్మకు తోడుగా ఏర్పడిన రెండవ ప్రకృతికి మార్పుచెందే ప్రకృతి అని పేరుగలదు. దానినే చరప్రకృతి అంటున్నాము. ఈ విధముగా పరమాత్మ, ఆత్మ అను రెండు ఆత్మలుకాగ, అచర ప్రకృతి, చరప్రకృతి అని రెండు ప్రకృతులు తయారైనవి.

పరమాత్మనుండి తయారై వచ్చిన ఆత్మ సప్త మహర్షలుగా, అనగా ఏడు ఆత్మ భాగములుగా విభజింపబడినదని చెప్పుకొన్నాము కదా! పరమాత్మ సప్త మహర్షలను తయారు చేసిన తర్వాత చరప్రకృతిని ఆధారము చేసుకొని మొదట మనస్సును తర్వాత, అహమును, చిత్తమును, బుద్ధిని వరుసగ తయారుచేశాడు. ఈ నాలుగింటిలో మొదట తయారైన మనస్సు మినహా అహము, చిత్తము, బుద్ధి మూడు కొంత ఆత్మభాగమును చుట్టుకొని బంతిలాగా ఏర్పడినవి. మూడు పొరల మధ్యన కొంత ఆత్మ భాగము చిక్కుకొనగా అదియే జీవాత్మ అయినది. బుద్ధి, చిత్తము, అహము మధ్యన నిలిచిపోయిన ఆత్మ యొక్క అంశను జీవాత్మ అంటున్నాము. ఈ విధముగా జీవాత్మ తయారైన వెంటనే ప్రకృతి రెండవ భాగము వలన శరీరమంతా ఏర్పడినది. ఇట్లు ఏర్పడిన శరీరమంతా మనస్సు వ్యాపించినది. ఈ విధముగా ఒక మనిషి యొక్క నమూనా మొదట తయారైనది. ఆత్మయొక్క ఏడు భాగములను దేవుడు **"మహర్షయ సప్త"** అనగా మహర్షులు ఏడుగురను తప్పు భావము మనుషులకు వచ్చినట్లు **"చత్వారో మనవ"** అనగానే నలుగురు మనువులు అని అర్థము చేసుకొన్నారు. ఇది పూర్తి తప్పు భావము. మొదట సప్త మహర్షులను గానీ, నలుగురు మనువులను గానీ దేవుడు తయారు చేయలేదు. ప్రపంచముతో పాటు ఏడు ఆత్మ భాగములను, వాటికి ఆధారముగా నాలుగు ప్రకృతి భాగములను తయారుచేశాడు. వీటినే మహర్షులుగా, మనువులుగా మనము తప్పు అర్థము చేసుకోవడము వలన సృష్ఠి విధానము అర్థము కాకుండాపోయి రహస్యముగా మిగిలిపోయినది. అదియే సృష్ఠి రహస్యము.

భగవద్గీతలో చెప్పిన విషయమంతా చూచారు కదా! ఇక్కడ ఖుర్ఆన్ గ్రంథములో ఏడు ఆయతుల విషయములో ఎట్లు పొరపడినారో అదే

విధముగా గీతలోని విభూతి యోగమునందు గల ఆరవ (6వ) శ్లోకమువద్ద హిందువులు పొరపడి పోయారు. శ్లోకములోని సప్తర్ష అను పదమునకు ఏడుగురు వ్యక్తులుగా పోల్చుకొని జవాబులేని ప్రశ్నలో చిక్కుకొన్నారు. అదే విధముగానే ఆయత్‌లు అంటూనే అప్పటికి లేని ఖుర్‌ఆన్ గ్రంథములోనికి పోయి ఏడు వాక్యములుగా లెక్కించుకొన్నారు. భగవద్గీతలోని పై శ్లోకములో చెప్పిన నిగూఢ వివరమును బట్టి చూస్తే ఖుర్‌ఆన్ (15-87) వాక్యములో చెప్పిన విషయము తెలిసిపోవు చున్నది. దానిని గురించి మనము చెప్పుకొంటే "ఆయత్" అంటే దేవుని శక్తితో కూడుకొన్న ఆత్మ భాగమని తెలియుచున్నది. భగవద్గీతలో సప్త మహర్ష అని చెప్పినవే ఇక్కడ ఏడు ఆయతులని చెప్పారు. సప్త మహర్ష అనగా ఏడు ఆత్మభాగములు అని చెప్పుకొన్నాము కదా! అట్లే ఏడు ఆయతులను కూడా ఏడు ఆత్మ భాగములుగా అర్థము చేసుకోవాలి. ప్రతి మనిషి శరీరములో ఏడు ఆత్మ భాగములుగా, ఏడు నాడీకేంద్రములు కలవు. ఏడు నాడీకేంద్రములలోనూ ఆత్మశక్తి ఏడు భాగములుగా నిండుకొని యున్నది. సృష్ట్యాదిలో మనుషులకు ఏడు నాడీకేంద్రములలో ఆత్మశక్తిని నింపి మనిషిని దేవుడు పుట్టించాడు. నేడు కూడా అట్లే మనిషిని పుట్టించడము జరుగుచున్నది.

శరీరములోని బ్రహ్మనాడి అను పెద్దనాడి మనిషి వీపులో తలలో నుంచి క్రింద గుదస్థానము వరకు వ్యాపించియున్నది. ఆ నాడి మెదడునుంచి క్రిందివరకు ఏడు భాగములుగా విభజింపబడియున్నది. ఒక్కొక్క భాగమునకు ఒక కేంద్రము ఈ నాడిలో కలవు. అట్టి ఏడు నాడీ కేంద్రములుగాయున్న ఈ నాడిలో నాడీకేంద్రములయందు ఆత్మశక్తి ఏడు భాగములుగా నిలువ యుండి శరీరమును పుట్టినప్పటినుండి చనిపోవువరకు జీవింపజేయుచున్నది. మనిషి బ్రతకాలంటే శ్వాస ఆడాలి. శ్వాస ఆడితే

శరీరములో రక్తప్రసరణ జరుగుతుంది. శ్వాస ద్వారానే మనిషి బ్రతుకుటకు కావలసిన ప్రాణవాయువు శరీరమునకు లభిస్తుంది. శ్వాస ద్వారా ఊపిరితిత్తులలోని రక్తమునకు ప్రాణవాయువు అందుట వలన మనిషి బ్రతుకుచున్నాడు. శ్వాస ఆడాలంటే ఊపిరితిత్తులు కదలాలి. ఊపిరి తిత్తులు కదలాలంటే వాటిని నాడీకేంద్రములలో గల ఆత్మయే కదిలించాలి. అలాగే ప్రతి దినము ఆత్మశక్తి ఊపిరితిత్తులను కదిలించి, శ్వాస ఆడించి మనిషిని బ్రతుకునట్లు చేయుచున్నది. ఏడు నాడీకేంద్రములలోని ఏడు శక్తులు ఊపిరితిత్తులను 24 గంటలు కదలించుచున్నది. అలా కదలించుటకు బ్రహ్మనాడి నుండి ఊపిరితిత్తులకు నాడుల అనుసంధాన మున్నది. బ్రహ్మనాడిలోని ఏడు కేంద్రముల నుండి నాడులు ఊపిరి తిత్తులతో సంబంధపడియుండుట వలన ఏడు కేంద్రములలోని శక్తి వరుసక్రమముగా పనిచేయుచూ ఊపిరితిత్తులను కదిలించి శ్వాస ఆడునట్లు చేయుచున్నది. దీనిని పూర్తి వివరముగా తెలియగలిగితే ఇలా కలదు. ఏడు భాగములుగా చీలిపోయిన ఆత్మశక్తి ఏడు నాడీకేంద్రములలోనూ ఉంటూ ఒక దినమునకు 21,600 శ్వాసలను ఆడించుచున్నది. ఆత్మయొక్క కార్యాచరణ అంతా పూర్తి ఈ విధముగా కలదు చూడండి.

ప్రతి మానవుని శరీరమందు బ్రహ్మనాడి ఉన్నది. దానినే వెన్నుపాము అని అందురు. బ్రహ్మనాడి మెదడు నుండి ప్రారంభమై వీపున వున్న వెన్నెముక ద్వారా గుదస్థానము వరకు వ్యాపించి ఉన్నది. మెదడు నుండి క్రిందివరకు వ్యాపించియున్న బ్రహ్మనాడియందు ముఖ్యమైన నరాశయకేంద్రములు ఏడు ఉన్నవి. ఈ నరాశయ కేంద్రములనే సప్త స్థానములనియూ, సప్తచక్రములనియూ, సప్తకమలములనియూ యోగులు అంటున్నారు. ఈ నరాశయ కేంద్రములే మానవున్ని చలించునట్లు అన్ని

పనులు చేయునట్లు చేయుచున్నవి. మరియు శరీరము లోపలయున్న అవయవములను, బయటనున్న అవయవములను పని చేయునట్లు చేయుచున్నవి. ఈ నరాశయ కేంద్రములనుండి బయల్పడిన నరములే ఊపిరితిత్తులను ముడుచుకొనునట్లు వికసించుకొనునట్లు చేయుచున్నవి. ఊపిరితిత్తులు ముడుచుకొన్నప్పుడు శ్వాస బయటికి పోవుచున్నది దానినే నిశ్వాసము అని అందురు. ఊపిరితిత్తులు తెరచుకున్నపుడు శ్వాస లోపలికి ప్రవేశించుచున్నది దానినే ఉశ్ఛ్వాసము అని అనుచున్నారు. బ్రహ్మనాడి యందుగల నరాశయ కేంద్రములే తమనుండి బయలుదేరి వచ్చిన నరములతో ఊపిరితిత్తులను ఆడించుచూ, జీవునికి ఉశ్ఛ్వాస నిశ్వాసలు జరుగునట్లు చేయుచున్నవి. జీవునికి శ్వాస లోపలికిపోయి బయటికి వచ్చిన ఒక్క శ్వాస గడచినట్లగుచున్నది. శ్వాసనే హంస అనికూడా అందురు. ఇట్లు దినమునకు 21,600 శ్వాసలు జీవునికి గడుచుచుండును. ఈ 21,600 శ్వాసలు గడుచునట్లు బ్రహ్మనాడియందుగల కేంద్రములే చేయుచున్నవి. ఆ కేంద్రములు శ్వాసను ఎట్లు నడుపుచున్నవనగా! బ్రహ్మనాడియందు ఏడు కేంద్రములు కలవు కదా! అందు అన్నిటికంటే క్రిందయున్న కేంద్రమును ఆధారకమలము అని అనుచున్నారు. ఈ కేంద్రము గుదస్థానమునకు సమానముగా ఉన్న వెన్నెముకలోని బ్రహ్మనాడిలో ఉన్నది. కావున ఆధారకమలము (ఆధారచక్రము) గుదస్థానము వద్ద ఉన్నదని పెద్దలు అనుచున్నారు. ఈ ఆధారచక్రమనబడు నరాశయకేంద్రమునుండి బయల్పడిన కొన్ని నరములు ప్రక్కన ఉన్న సూర్య చంద్రనాడులతో కలిసి ఊపిరితిత్తులకు పోయి ఉండును. సూర్యచంద్ర నాడులనునవి బ్రహ్మనాడికి రెండు ప్రక్కలా రెండు ఉన్నవి. బ్రహ్మనాడికి కుడిప్రక్కయున్న నాడీని సూర్యనాడీ అనియూ, ఎడమప్రక్కన ఉన్న నాడీని చంద్రనాడీ అనియూ,

పెద్దలు చెప్పుచుందురు. వీటినే ఇడ, పింగళ నాడులు అనికూడా అనుచున్నారు. వీటినే డాక్టర్లు సింపతెటిక్ దండలు (Sympathetic Chains) అని కూడా అనుచున్నారు. చివరగాయున్న ఆధారనరాశయ కేంద్రము తన నరముల ద్వారా ఊపిరితిత్తులను సూర్యోదయము మొదలుకొని 600 శ్వాసలు గడుచువరకు నడుపును. 600 శ్వాసలు గడిచిన వెంటనే తన పనిని విరమించుకొనును. ఆ తర్వాత రెండవ నరాశయ కేంద్రమున్నది కదా! ఆ రెండవ దాని పేరు **స్వాధిష్ఠాన పద్మము (స్వాధిష్ఠానచక్రము)** అని అంటున్నారు. ఈ కేంద్రము స్త్రీలకు యోనిస్థానమునకు సరిగ, పురుషులకు లింగస్థానమునకు సమానముగా యున్న వెన్నెముకలోని బ్రహ్మనాడియందు కలదు. కావున స్వాధిష్ఠానచక్రము లింగస్థానమువద్ద ఉన్నది అనుచున్నారు. ఈ స్వాధిష్ఠానచక్రమనబడు నరాశయ కేంద్రము నుండి బయల్పడిన కొన్నినరములు ప్రక్కనున్న సూర్యచంద్రనాడులతో కలిసి ఊపిరితిత్తులకు పోయి ఉండును. రెండవ కేంద్రమైన ఈ స్వాధిష్ఠాన కేంద్రము తన నరముల ద్వారా ఊపిరితిత్తులను మొదటి కేంద్రము పని చాలించుకొన్నది మొదలు 6000 శ్వాసలు గడుచునంత వరకు నడుపుచుండును. 6000 శ్వాసలు అయిపోయిన వెంటనే తన పనిని విరమించుకొనును. ఆ తర్వాత మూడవ నరాశయ కేంద్రము ఉన్నది కదా! ఆ కేంద్రము పేరు **మణిపూరక పద్మము (మణిపూరక చక్రము)** అని అనుచున్నారు. ఈ కేంద్రము నాభి (బొడ్డు)కు సమానముగా ఉన్న వెన్నెముకలోని బ్రహ్మనాడియందు ఉన్నది. కావున మణిపూరక చక్రము నాభి స్థానము వద్ద ఉన్నది అని అనుచున్నారు. ఈ మణిపూరక పద్మమనబడు నరాశయ కేంద్రమునుండి ప్రారంభమైన నరములు కొన్ని ప్రక్కనున్న సూర్య చంద్రనాడులతో కలిసి ఊపిరితిత్తులకు పోయివుండును.

మణిపూరక నరకేంద్రము తన నరముల ద్వారా ఊపిరితిత్తులను రెండవ కేంద్రము తన పనిని చాలించుకొన్నది మొదలు 6000 శ్వాసలు అయిపోవు వరకు నడుపుచుండును. 6000 శ్వాసలు అయిపోయిన వెంటనే తన పనిని విరమించుకొనును. ఆ తర్వాత నాల్గవ నరాశయ కేంద్రమున్నది కదా! ఆ నాల్గవ నరాశయ కేంద్రము పేరు **అనాహత నరాశయ కేంద్రము లేక అనాహత పద్మము (అనాహత చక్రము)** అని అనుచున్నారు. ఈ కేంద్రము హృదయమునకు సరిగయుండు వెన్నెముకలోని బ్రహ్మనాడియందు ఉన్నదని అనుచున్నారు. నాల్గవ చక్రమయిన అనాహత కేంద్రమునుండి బయలు దేరిన కొన్ని నరములు ప్రక్కన ఉన్న సూర్యచంద్రనాడులతో కలిసి ఊపిరితిత్తులకు పోయివుండును. అనాహత నరకేంద్రము తన నరముల ద్వారా ఊపిరితిత్తులను మూడవ కేంద్రము తన పనిని చాలించుకొన్నది మొదలు 6000 శ్వాసలు అయిపోవు వరకు నడుపుచుండును. 6000 శ్వాసలు అయిపోయిన వెంటనే తన పనిని విరమించుకొనును. ఆ తర్వాత ఐదవ నరాశయకేంద్రమున్నది కదా! ఆ ఐదవ నరాశయకేంద్రము పేరు **విశుద్ధ పద్మము (విశుద్ధ చక్రము)** అని అనుచున్నారు. ఈ కేంద్రము కంఠస్థానమునకు సరిగ ఉన్న వెన్నెముకలోని బ్రహ్మనాడియందు ఉన్నది. విశుద్ధచక్రము నుండి బయలుదేరిన కొన్ని నరములు ప్రక్కనున్న సూర్య చంద్రనాడులతో కలిసి ఊపిరితిత్తులకు పోయివుండును. విశుద్ధ నరకేంద్రము తన నరములతో ఊపిరితిత్తులను నాల్గవకేంద్రము పనిని చాలించుకొన్నది మొదలు 1000 శ్వాసలు అయిపోవువరకు నడుపు చుండును. 1000 శ్వాసలు అయిపోయిన వెంటనే తన పనిని విరమించు కొనును. ఆ తర్వాత ఆరవ నరాశయకేంద్రమున్నది కదా! ఆ ఆరవ నరాశయకేంద్రము పేరు **ఆగ్నేయపద్మము (ఆగ్నేయచక్రము)** అని

అనుచున్నారు. ఈ కేంద్రము కనుబొమల మధ్యకు సరిగ (భ్రూమధ్య స్థానముకు సరిగ) తలలో ఉన్న బ్రహ్మనాడియందు ఉన్నది కనుక ఆగ్నేయచక్రము భ్రూమధ్య స్థానమువద్ద ఉన్నదని అనుచున్నారు. ఆరవ నరకేంద్రమైన ఆగ్నేయచక్రము నుండి బయలుదేరిన కొన్ని నరములు ప్రక్కనున్న సూర్యచంద్రనాడులతో కలిసి ఊపిరితిత్తులను చేరియుండును. ఆగ్నేయనరకేంద్రము తన నరముల ద్వారా ఊపిరితిత్తులను ఐదవచక్రము పని చాలించుచుకొన్నది మొదలు 1000 శ్వాసలు అయిపోవువరకు నడుపు చుండును. 1000 శ్వాసలు అయిపోయిన వెంటనే తనపనిని విరమించు కొనును. ఆ తర్వాత ఏడవ నరకేంద్రమున్నది కదా! ఆ ఏడవ నరకేంద్రము పేరు **సహస్రారపద్మము (సహస్రారచక్రము)** అనుచున్నారు. ఈ కేంద్రము శిరస్సు మధ్యభాగముననున్నది. ఈ కేంద్రము నుండి బయలుదేరిన కొన్ని నరములు ప్రక్కనున్న సూర్యచంద్రనాడులతో కలిసి ఊపిరితిత్తులను చేరియుండును. ఏడవ నరకేంద్రమైన సహస్రారపద్మము తన నరముల ద్వారా ఊపిరితిత్తులను ఆరవ కేంద్రము పనిని చాలించుకొన్నది మొదలు 1000 శ్వాసలు జరుగునంతవరకు నడుపుచుండును. 1000 శ్వాసలు అయిపోయిన వెంటనే తిరిగి మొదటి కేంద్రమైన ఆధారచక్రము ఊపిరి తిత్తులను నడుపుటకు ప్రారంభించును. దాని తర్వాత రెండవ కేంద్రము ఊపిరితిత్తులను నడుపుచుండును. ఏడవ కేంద్రమైన వెంటనే మొదటి కేంద్రము పని ప్రారంభించును. కనుక అన్ని వేళలయందు శ్వాస నడుస్తూనే ఉన్నది. అన్ని చక్రములు కలిసి మొత్తము 21,600 శ్వాసలను నడుపుచున్నవి. సూర్యోదయము మొదలుకొని అన్ని చక్రములు పని చేయుటకు తిరిగి సూర్యోదయము వచ్చుచున్నది. కావున ఒక్క దినమునకు 21,600 శ్వాసలు జరుగుచున్నవని తెలియుచున్నది.

ఇంతవరకూ తెలుసుకొన్న దానినిబట్టి శరీరములో శ్వాస ఎట్లు ఆడుచున్నదీ బాగా అర్థమయినది. శ్వాస ఆడుటకు నాడీకేంద్రములలోని ఏడు ఆత్మశక్తులు ఒకదాని తర్వాత ఒకటి వాటంతట అవి పని చేయడము వలన ఎల్లప్పుడూ ఎడతెరపిలేకుండా, ఆగకుండా శ్వాసలు జరుగుచున్నవి. అందువలననే ఖుర్ఆన్ వాక్యములో ఆ ఏడు ఆయతులు మాటిమాటికీ పునరావృతము అవుతుంటాయి అనడము సత్యమే కదా! ఏడు నాడీకేంద్రములలోనున్న ఆత్మశక్తియే ఏడు ఆయతులుగా చెప్పబడినది. ఆయత్ అనగా శక్తివంతమయినదని అర్థము కలదు. ఏడు ఆయత్‌లలోనూ, ఏడు భాగములుగా ఆత్మశక్తియుండి ఒకదాని తర్వాత ఒకటి పనిచేయుచూ ఊపిరితిత్తులను ఆడించుచుండుట వలన ఏడు ఆయతులు పదేపదే పునరావృతము అవుతుంటాయి అని చెప్పారు. ఏడు ఆయతులు పునరావృతము కాకపోతే మనిషి బ్రతుకలేడు. పునరావృతము అవుతుంటేనే మనిషి సజీవముగాయున్నాడు. ఏడు ఆయత్‌లలోనూ ఆత్మేయున్నది. వాటిని ఆత్మే మళ్ళీమళ్ళీ తిరిగి పని చేయునట్లు చేయుచున్నది. ఈ ఏడు ఆయతులు మనిషి ఉచ్ఛరించునవి కావు. ఆత్మచేత ఉచ్ఛరించబడుచున్నవని చెప్ప వచ్చును. ఏడు ఆయతులు ఉచ్ఛరించబడుచున్నవనుటకు ఒక ఆధారము కలదు. ఒక నాడీకేంద్రము పనిచేయునప్పుడు ఊపిరితిత్తులు కదలి శ్వాస ఆడుచున్నప్పుడు ఊపిరితిత్తుల ద్వారా బయటికి పోవుగాలి ఒక రంధ్రము ద్వారా పోయి చివరిలో ముక్కు వద్ద రెండు రంధ్రములుగా చీలిపోయి రెండు ద్వారముల ద్వారా బయటికి పోవుచున్నది. బయటి నుండి లోపలికి గాలి వచ్చునప్పుడు రెండు రంధ్రముల నుండి వచ్చు శ్వాస (గాలి) లోపల ఒక రంధ్రముగా మారి లోపలికి పోవుచున్నది. రెండు నుండి ఒకటిగా గాలి మారునప్పుడు ఒక శబ్దము, ఒకటినుండి రెండుగా గాలి చీలిపోవు

నప్పుడు మరియొక శబ్ధము ముక్కురంధ్రముల వద్ద ఏర్పడుచున్నది. గాలి లోపలికి పోవునప్పుడు రెండు రంధ్రములనుండి ఒక రంధ్రముగా మారుటవలన, ఒక రకమైన శబ్ధము పుట్టుట జరుగుచున్నది. అట్లే లోపలినుండి బయటికి వచ్చుగాలి ఒక రంధ్రము ద్వారా వచ్చి చివరిలో రెండుగా చీలిపోవుట వలన మరియొక శబ్ధము పుట్టుచున్నది. ఈ విధముగా గాలి ఒకమారు లోపలికి పోయి ముక్కు రంధ్రముల నుండి బయటికి వచ్చుటకు ఏర్పడు రెండు శబ్ధములు రెండు అక్షరముల శబ్ధముతో కూడు కొనియున్నవి. గాలి ముక్కులద్వారా ఒకమారు లోపలికి పోయి బయటికి వస్తే ఒక శ్వాస గడచినట్లగును. ఒక శ్వాస గడిచితే శ్వాసలో రెండు అక్షరముల శబ్ధము ఏర్పడుచున్నది. ప్రతి మనిషి శరీరములోనూ శ్వాస ఆడునప్పుడు వానికి తెలియకుండానే రెండు అక్షరములు ఉచ్ఛరించబడు చున్నవి.

విచిత్రమేమంటే శబ్ధము రెండు రకములుగాయున్నది వాస్తవమే అయినా, ఆ శబ్ధము ఏది?యని ఎవరూ ఖచ్చితముగా చెప్పలేరు. దేవుడు అదేపనిగా ఆ విధముగా శ్వాసలో ఫలానా శబ్ధము ఇమిడియున్నదని చెప్పలేనట్లు శబ్ధమును అమర్చాడు. అందువలన ఇది ఫలానా శబ్ధమే అని చెప్పలేకున్నా, మనిషి ఫలానా శబ్ధము వినిపించుచున్నదని అనుకుంటే అదే శబ్ధము వానికి వినిపించను మొదలుపెట్టును. మనిషి ఏ శబ్ధమును శ్వాసకు కలుపునో అదే శబ్ధమే వినిపించుట విశేషము. ఉదాహరణకు ఒక వ్యక్తి తన శరీరములో ఆడు శ్వాసకు రెండు అక్షరముల శబ్ధమును ఏది జోడించుకొనినా వాని భావము ప్రకారమే అదే శబ్ధము వినిపించునట్లు ఆత్మ చేయుచున్నది. ప్రపంచములో మనిషి ఏ మతస్థుడిగాయున్నా వాని శరీరములో శ్వాస ఆడుచున్నది. ఆ శ్వాసలో శబ్ధమున్నది. ఆ శబ్ధము

వాని భావమునకు తగిన శబ్ధముగా ఉండును. ఇప్పుడు ఒక ముస్లీమ్‌ను ఉదాహరణగా తీసుకొని చూస్తాము. అతని శరీరములో శ్వాస ఆడుచుండుట వలన శ్వాసలో శబ్ధమున్నది. అయితే అతను ముస్లీమ్ అగుటవలన అతను దేవున్ని అల్లా అని పిలుచుట వలన, అతను తన శ్వాసను చూచుకొని బాగా వింటే ఆ శబ్ధములో అల్లాయను రెండక్షరముల శబ్ధము ఇమిడి యున్నట్లు తెలియును. ముక్కురంధ్రములో శ్వాస లోపలికి పోవునప్పుడు “అ” అను శబ్ధము వినిపించుచున్నది. అలాగే శ్వాస బయటికి వచ్చునప్పుడు “ల్లా” అను శబ్ధము వినిపించుచున్నది. ఒకమారు శ్వాస లోపలికి పోయి బయటికి వచ్చుటలో **“అల్లా”** అను రెండు అక్షరముల శబ్ధము శ్వాసకు జోడగుచున్నది. ఈ విధముగా క్రైస్తవునికి అతని శ్వాసలో **“ఏసు”** అను రెండక్షరముల శబ్ధము ఇమిడియున్నది. అట్లే హిందువుకు అతని శ్వాసలో **“ఆత్మ”** అను రెండక్షరముల శబ్ధము ఇమిడియున్నది. మనిషి భావమును బట్టి అతనికి ఇష్టమైన శబ్ధము శ్వాసతో కూడిపోవుచున్నది.

ఒక వ్యక్తి పుట్టినప్పుడు మనిషిగా పుట్టుచున్నాడు. పెరిగినప్పుడు మతస్థునిగా పెరిగి నేను ఫలానా మతము వాడినని చెప్పుకొంటున్నాడు. తర్వాత చనిపోవునప్పుడు మనిషిగానే చనిపోవుచున్నాడు. పుట్టినప్పుడుగానీ, చనిపోయినప్పుడుగానీ ఎవనికీ మతము అనునది లేదు. మధ్య జీవితము మాత్రము మతములోయున్నది. మనిషి ఏ మతములోయున్నా చావు పుట్టుకలుగానీ, లోపల ఏడు ఆయతులనబడు ఏడు నాడీకేంద్రములుగానీ ఉండుట సహజమే. అందరినీ ఆత్మే నడుపుచున్నది. లోపల గల నిర్మాణము లోగానీ, ఆత్మ ఆధిపత్యములోగానీ ఎవరియందూ తేడాలేదు. అందువలన మనిషికి బయట దేవుడు జ్ఞానమును ఇచ్చాడు. అయితే మనిషి పుట్టినప్పుడే శరీరములోపలే ఏడు భాగములుగాయున్న ఆత్మను ఇచ్చాడు. దానినే సప్త

మహర్ష అని భగవద్గీతలో చెప్పారు. ఖుర్‌ఆన్ గ్రంథములో ఏడు ఆయత్‌లు అని చెప్పారు. మనిషి పుట్టి పెరిగిన తర్వాత దేవుని జ్ఞానమును తెలియును కావున పుట్టిన తర్వాత మనిషికి మహోన్నతమైన గ్రంథమును ఇచ్చాను అని చెప్పాడు. ముస్లీమ్‌లకయితే ఖుర్‌ఆన్ గ్రంథమనీ, క్రైస్తవులకయితే బైబిలుయనీ, హిందువులకయితే భగవద్గీతయనీ అర్థము చేసుకోవాలి. (15-87) వాక్యములో గొప్ప ఖుర్‌ఆన్ గ్రంథమును ఇచ్చాను అని చెప్పారు. ముస్లీమ్‌లకు కావున ఆ మాట చెప్పారని అర్థము చేసుకోవాలి. దేవుడు ఏ మతములోయున్నవానికి అతనికి సంబంధించిన గ్రంథమునే ఇచ్చాడు. మతము లేనివానికి మూడు గ్రంథములూ ఒక్కటే. ముక్కు రంధ్రములు అందరికీయున్నవి, శ్వాస అందరికీయున్నది. శరీరములో ఏడు ఆయతులు (ఏడు ఆత్మలు) అందరికీయున్నవి. శ్వాసలో రెండు అక్షరముల శబ్ధము అందరికీయున్నది. నీవు ముస్లీమ్ అయితే నీ శ్వాసకు ఉశ్ఛ్వాసలో "అ" అనీ, నిశ్ఛ్వాసలో "ల్లా" అని శబ్ధమును జోడించుకొని చూచుకో! ఎంతసేపు అలా శ్వాస మీద నీ మనోదృష్థిని ఉంచుకుంటావో అంతకాలము నీవు ఏడు ఆయతులను నిజముగా పఠించినట్లేయగును.

సృష్ట్యాదిలోనే మనిషితోపాటు ఏడు శక్తివంతమైన ఆయత్‌లు లేక దేవుని గుర్తులు మనిషికి ఇవ్వబడినవి. దాని తర్వాత జ్ఞానమును కూడా దేవుడు ఇచ్చాడు. ఏడు శక్తులు పనిచేయుచుండగా మనిషి బ్రతుకుచున్నాడు గానీ తర్వాత దేవుడిచ్చిన జ్ఞానమును మనిషి మరచిపోయాడు. దేవుడిచ్చిన ఏడు ఆత్మ కేంద్రములతో బ్రతుకు మనిషి, కేంద్రములలోనున్న ఆత్మను గురించి తెలుసుకొను జ్ఞానమును చూడకున్నాడు, చూచినా అర్థము చేసుకోలేకున్నాడు. ప్రతిదినమూ ఏడు కేంద్రములు, ఏడు ఆయత్‌లు పునరావృతమై పనిచేయుచున్నా, ప్రతి ఆయత్ ఒకనిలో అల్లాయనీ,

మరొకనిలో ఆత్మయనీ, ఇంకొకనిలో ఏసు అనీ రెండక్షరముల శబ్ధమును ముక్కులవద్ద చేయుచున్నా, మనిషి శరీరములోయున్న దేవున్ని తెలియక దేవుడు ఎక్కడో ఉన్నాడని కొందరూ, ఆకాశములోయున్నాడని కొందరూ, గుళ్ళూ గోపురములలో యున్నాడని కొందరూ భ్రమించి తిరుగుచున్నారు. మనుషులందరికీ సంబంధించిన దేవుడు, అన్ని మతములవారికీ దేవుడయినవాడు, సర్వప్రపంచమునకూ అధిపతియైన వాడు నీ శరీరము లోనేయున్నాడు, ఒకమారు చూచుకో!

మనిషి శరీరములో జీవుడుండగా వానికి జ్ఞానేంద్రియముల సమాచారమును మనస్సు చేరవేయుచున్నది. మనస్సు లోపలయున్న బుద్ధికి సమాచారమును చేరవేయగా బుద్ధి ప్రక్కనేయున్న జీవునికి తెలుపుచున్నది. ఈ విధముగా నిత్యము జరుగుచున్నది. శరీరమునకున్న ఐదు జ్ఞానేంద్రియములలో కన్ను, చెవి రెండూ అత్యంత ముఖ్యమైనవి. చెవి వినికిడి వలన, కంటి చూపువలన జీవునకు ప్రపంచముతో సంబంధము ఏర్పడుచున్నది. శరీరములో కన్నుకు, చెవికి శక్తినిచ్చి నడిపించునది ఆత్మయే. శరీరములోయున్న బ్రహ్మనాడిలోగల ఏడు నాడీకేంద్రములకు శరీర అవయవములతో సంబంధముండును. శరీరములో అన్ని భాగములనూ నడుపునది ఆత్మేయగుట వలన దానికి తెలియకుండా శరీరములో ఏమీ పని జరుగదు. జ్ఞానేంద్రియముల ద్వారా కర్మేంద్రియముల ద్వారా జరుగు పనులన్నియూ ముందుజన్మలో వచ్చిన కర్మపత్రము ప్రకారము పనులను ఆత్మే తన ఏడు కేంద్రముల ద్వారా ఇంద్రియములకు శక్తినిచ్చి చేయించుచున్నది. ప్రపంచపు పనులన్నిటినీ చేయుటకు శక్తినిచ్చువాడు ఆత్మ. చేయించువాడు కూడా ఆత్మయే. అందులో జీవుని యొక్క ప్రమేయము ఏమీ లేకుండా అన్ని పనులు జరిగిపోవుచుండును. జీవుడు

అనుకొన్నా, అనుకోకపోయినా జరిగే పనులు జరుగకమానవు. ముందు జన్మలో చేసుకొన్న కర్మప్రకారము అన్ని కార్యములూ జరుగుచుండును. జీవునికి వాటితో సంబంధము ఉండదు. వాటిని గురించి చింతించడము గానీ, ఇలా చేయాలనుకోవడముగానీ, అలా చేయాలనుకోవడముగానీ అనవసర విషయము. ఎందుకనగా! జీవుడు అనుకొన్నట్లు ఏమీ జరుగవు. అందువలన వాటిని గురించి ఆలోచించడము అనవసరమైన పనియగును.

మనిషికి అవసరమైన పనులు ప్రత్యేకముగాయున్నవి. మనిషికి అవసరమైన పనులు ఆత్మసంబంధమైనవే. మనిషి కర్మకు అతీతమైన జ్ఞాన విషయములను గురించి చింతించాలి, ఆలోచించాలి. ఆత్మకు సంబంధించిన విషయములలో చెవులను ఉపయోగించుకోవాలి. అలాగే ఆత్మకు సంబంధించిన విషయములలోనే కన్నులను ఉపయోగించుకోవాలి. అలా కాకుండా ఆత్మ విషయములో ఇంద్రియములను ఉపయోగించని వానికి, అనవసరమైన ప్రపంచ విషయములో శ్రద్ధ చూపువానికి, ఆత్మ విషయములో బుద్ధిని ఉపయోగించక ప్రపంచ విషయములలో బుద్ధిని ఉపయోగించువానికి, మరణించిన తర్వాత తిరిగి జన్మించునప్పుడు, కర్మపత్రము తయారయినప్పుడు వాని కన్నులు, వాని చెవులు, వాని బుద్ధి ఏయే పనుల మీద ఉపయోగపడినదీ ఆత్మకు తెలియుట వలన ఆత్మ విచారణ ప్రకారము కర్మపత్రము తయారు కాగలదు. కన్ను, చెవులు, బుద్ధి దేవుని విషయము మీద ఎక్కువగా పనిచేసియుంటే ఆత్మ విచారణలో వాటి కర్మ తగ్గిపోవును. ఈ విషయమును గురించి ఖుర్‌ఆన్ గ్రంథములో సూరా 17, ఆయత్ 36లో ఈ విధముగా చెప్పారు చూడండి. **(17-36) "నీవు తెలుసుకోవలసిన అవసరములేని విషయాల వెంటపడకు. ఎందుకంటే చెవి, కన్ను, హృదయము వీటన్నింటినీ ప్రశ్నించి విచారించడము జరుగుతుంది."**

నీకు అనవసర విషయములు కొన్ని, అవసరమయిన విషయములు కొన్ని గలవు. ఒకరికేగాదు ప్రపంచములో ప్రతి మనిషికీ అవసరమైన విషయాలు దేవునికి సంబంధించినవి కాగా, అనవసరమైన విషయాలు ప్రపంచ సంబంధమైనవి ఎన్నో గలవు. దేవుని జ్ఞానము కేవలము కొన్ని ధర్మములతో కూడుకొనియుండగా, ప్రపంచ విషయములు ఇన్నీ అన్నీ అనకుండా కోకొల్లలుగాయున్నవి. దేవుని ధర్మములను తెలియగలిగితే మనిషికి శాంతిగలిగి కర్మలనుండి బయటపడగలడు. ప్రపంచ విషయము లలో చిక్కుకొంటే వాటిచేత పీడింపబడినవాడై అశాంతిలో కూరుకుపోవును. అయినా మనిషి ప్రపంచ విషయములవైపే పోవుచున్నాడు. ప్రపంచ విషయములు ముందే ఇలా జరుగవలెనని నిర్ణయించబడియుండుట వలన, అవి మనిషి ప్రమేయముతో జరుగవు కావున ప్రపంచ విషయములన్నీ మనిషికి అనవసర విషయములగును. అదే దేవుని విషయములయితే కర్మనిర్ణయములో వుండవు. మనిషి దేవుని విషయములో ఏమి సాధించా లనుకొనినా దానిని సాధించగలడు. అందువలన దేవుని విషయము లన్నియూ మనిషికి అవసరమైనవే యగును. దేవుని విషయములో మనిషి ఫలానాది సాధిస్తానని చెప్పి సాధించవచ్చును. దేవునిమార్గములో మనిషి సాధించదగినవి మూడు గలవు. ఒకటి కర్మయోగము, రెండు బ్రహ్మ యోగము, మూడు భక్తియోగము. మూడు యోగములలో ఒక్క యోగమును సాధించిన దానివలన మనిషి మోక్షమును పొందగలడు. అదే ప్రపంచ విషయములలో మనిషి అనుకొన్నట్లు చిన్న పనిని కూడా సాధించలేడు. ఎందుకనగా! ప్రపంచ పనులన్నీ కర్మప్రకారము జరుగును. కావున కర్మాధీనములో ఉంటాయి. కర్మాధీనములోయున్న పనులను మనము చేస్తామనినా అవి నెరవేరుతాయను నమ్మకము లేదు. అందువలన

ఎక్కడయినా నేను ఈ పనిని చేస్తానని చెప్పకు, అలా చెప్పితే ఒకవేళ నీవు చేయలేకపోతే కర్మరీత్యా అది జరుగకపోతే ముందు చెప్పినందుకు మర్యాదపోవును, మాట తప్పినవాడవగుదువు. ఈ విషయమును గురించి ఖుర్‌ఆన్‌నందు సూరా18, ఆయత్ 23లో ఈ విధముగా చెప్పారు. **(18-23) "ఏ విషయములో కూడా నేను ఈ పనిని రేపు చేసివేస్తానని చెప్పకు (నీవు ఏమీ చేయలేవు)"** మనిషి ద్వారా జరిగే పనులన్నీ కర్మప్రకారము జరుగును. కర్మ దేవుని ఆధీనములో ఉంటుంది. నీ ఆధీనములో ఉండదు. అందువలన నీవు చెప్పితే నీవు చేయలేవు. ఒకవేళ జరుగవలసియుండి అది జరిగినా, అది నీ వలన జరిగినది కాదని తెలుసుకో! కర్మ విషయము తెలియని మనిషి కార్యములకు కర్తను తానేయని అనుకొంటాడు. అయినా కార్యములకు కర్త దేవుడే. కార్యము ఆయనే, కర్త ఆయనే కార్యకర్త ఆయనేనని తెలియుము.

మనిషి ఏమీ చేయలేడు, కర్మప్రకారమే ప్రతి పనీ జరుగుచున్నదనీ, దానిని చేయించువాడు ఆత్మయనీ, అన్నిటినీ చూచేవాడు దేవుడు (పరమాత్మ) యనీ, మేము ఎంతగా చెప్పినా విననివారు చాలామంది కలరు. వారు వినకపోగా చెప్పినవారినే హేళనగా మాట్లాడుదురు. అటువంటివారికి ఎంత పెద్ద రహస్యమయిన జ్ఞానమును చెప్పినా వారు పెడచెవిన పెట్టుదురు. అడవిలో జంతువునయినా వెంట త్రిప్పుకోవచ్చు. క్రూరమృగమునయినా చెప్పిన మాటను వినునట్లు చేసుకోవచ్చును. అయితే అజ్ఞానిని మార్చుటకు వీలుపడదు. ఎందుకు వానిని మార్చలేము అని ప్రశ్నించుకొని చూస్తే, వాడు జ్ఞానిగా మారుటకు దేవునికే ఇష్టముండదు. అందువలన మనము ఎంత ప్రయత్నించినా వాడు మారడు. ఈ విషయమును గురించి భగవద్గీతలో దైవాసుర సంపద్విభాగ యోగమున ఈ విధముగా చెప్పారు.

తమ శరీరములోనూ ఇతరుల శరీరములోనూ యున్న దేవున్ని సహితము అసూయతో ద్వేషించి, దూషించువారు, కౄరులయినవారు మంచిని ద్వేషించు వారును అయినందుకు అటువంటి మూఢులను అసుర యోనులయందు పుట్టించి దుఃఖములలో మునిగియున్నట్లు చేయుదునని దేవుడు చెప్పాడు. అంతేకాక అటువంటివారు అసురయోనులందు పుట్టుచూ, జన్మ జన్మకూ అజ్ఞానులగుచూ, దేవున్ని తెలియు జ్ఞానమును ఏమాత్రము తెలియక పోవడమేకాక, వారికి జ్ఞానము యొక్క గట్టు దొరకకుండా చేస్తానని దేవుడే చెప్పాడు.

వేమనయోగి **'పతియొప్పిన సతియొప్పును'** అను పద్యములో దేవుడు ఒప్పుకోనిదే దేవునివద్దకు ఎవడూ పోలేడు, దేవుని జ్ఞానమును ఎవడూ తెలియలేడు అని చెప్పాడు. పతియనగా దేవుడు, సతియనగా మాయ అని అర్థము. దేవుడు ఒప్పుకోనిదే ఆయన సతియైన మాయ ఒప్పుకోదు. మాయ ఒప్పుకోనిదే వానిని తన గుణములను దాటిపోకుండా గుణములలో చిక్కుకొని పోవునట్లు చేయును. అటువంటివాడు గుణములనుండి బయట పడకుండుటవలన, వానికి జ్ఞానమును ఎంత చెప్పినా ఏమాత్రము అర్థముకాదు. చెవులతో విన్నది అర్థముకాదు. కన్నులతో చూచినది ఏమాత్రము అర్థముకాదు. దేవుని జ్ఞాన విషయములో వాడు పనికిరాడు అని దేవుడు ముందే తీర్పు తీర్చియుండడము వలన వాని జ్ఞానేంద్రియము లకు ప్రపంచజ్ఞానము ఎక్కునుగానీ, పరమాత్మజ్ఞానము ఎక్కదు. దేవుని విషయములో వాని చెవులు చెవిటివై, కన్నులు గ్రుడ్డివైపోయి ఉండును. ఈ విషయమై ఖుర్ఆన్ గ్రంథములో సూరా 18, ఆయత్ 57లో ఇలా వ్రాశారు చూడండి. **(18-57) "దేవుడు తన జ్ఞానముతో హితబోధ చేసినప్పుడు దానికి విముఖులై పోవుదురు. అట్టివారలకు జ్ఞానము**

**ఎప్పటికీ అర్థము కాకుండా మేము వారి హృదయముల మీద తెరలు వేసియుంచాము. మరియు వారి చెవులకు చెవుడు, కన్నులకు గ్రుడ్డితనము కలిగించాము. కావున నీవు వారిని సన్మార్గమువైపునకు పిలిచినా, వారు ఎన్నటికీ సన్మార్గము వైపు రాలేరు."** మరియొకచోట సూరా 30, ఆయత్ 29లో ఇలా చెప్పారు. **(30-29) "దుర్మార్గులైనటు వంటివారు తెలివి లేకుండా తమ కోర్కెలను అనుసరిస్తారు. దేవుడు మార్గభ్రష్టత్వములో వదలిన మనిషికి మార్గదర్శకత్వము ఎవడు చేయగలడు?"** ఇలాంటి వారిని గురించి మరియొక చోట సూరా 47, ఆయత్ 23లో ఇలా వ్రాసియున్నారు. **(47-23) "అటువంటి అజ్ఞానులను దేవుడు తన జ్ఞానమునుండి బహిష్కరించాడు. వారిని చెవిటివారిగా మరియు గ్రుడ్డివారిగా చేశాడు."** ఈ మూడు వాక్యములలోనూ దేవునికి అయిష్టుడుగాయున్న వానిని దేవుని జ్ఞానము వద్ద చెవిటివారిగా, గ్రుడ్డివారిగా దేవుడేచేసి వానికి తన జ్ఞానమును అర్థము కాకుండా చేశాడు. మనిషికి చెవులుయున్నా వాడు దేవునికి ఇష్టుడు కాకపోతే, దేవుని విషయములవద్ద వాని చెవులు పని చేయనట్లే, చెప్పే జ్ఞానమును గ్రహించలేవు. అదే విధముగా జ్ఞానమువద్ద వాని కన్నులు పనిచేయవు. ఎటుతిరిగీ వానికి జ్ఞానము అర్థము కాదు. దేవుడు వానిని తన జ్ఞానమునుండి బహిష్కరణ చేసియున్నాడు. కావున వానిని ఎవడు ఎంత ప్రయత్నించినా మార్చలేడు. వానిని వాని కర్మకు వదలివేయవలసిందే.

దేవుని మీద విశ్వాసము లేనివాడు దేవున్ని సహితము లెక్క చేయకుండా దూషించును. దేవున్ని కూడా లెక్క చేయనివానికి, దేవుడు అంటే అసూయకల్గి, జ్ఞానమునకు విలువ ఇవ్వకుండా మాట్లాడును. అటువంటి వాడు ప్రళయమును లెక్కచేయడు, ప్రభవమును లెక్కచేయడు.

అటువంటి వానికి దేవుడు తన జ్ఞానమును దొరకకుండా చేస్తానని చెప్పాడు. వాడు జన్మ జన్మకూ అధోగతి చెందును. విశ్వాసులయిన వారికి దేవుడు తన జ్ఞానమును అందించి వానికి బాగా అర్థమగునట్లు చేసి జ్ఞానిని చేయగలడు. దేవుడు అనుకొంటే ఎవనినయినా జ్ఞానినీ చేయగలడు మరియు అజ్ఞానిని కూడా చేయగలడు.

దేవుని జ్ఞానమును తెలిసిన విశ్వాసి ఇతరులను చూచి మీకు ఈ దినమే ప్రళయదినము అని అంటాడు. అయితే ఆ మాటను వారు ఒప్పుకోరు. ఈ విషయమును గురించి సూరా 30, ఆయత్ 56లో ఇలా కలదు. **(30-56) "జ్ఞానము, విశ్వాసము ఒసంగబడిన వారు ఇలా సమాధానమిస్తారు. మీరు దైవగ్రంథములో లిఖించబడివున్నట్లు ప్రళయ దినము వరకు ఆగియున్నారు. నేటి ఈ దినము ప్రళయ దినమే. కానీ మీరు మాత్రము నమ్మేవారు కాదు."** ఇదే విషయమే మరియొక చోట ఖుర్ఆన్ గ్రంథములో ఈ విధముగా వ్రాసియున్నారు.

**(30-56) "జ్ఞానము మరియు విశ్వాసము అనుగ్రహింపబడిన వారు ఇలా అంటారు. వాస్తవానికి అల్లాహ్ మూలగ్రంథములో వ్రాసిన ప్రకారము మీరు పునరుత్థాన దినము వరకు ఇహలోకములో యున్నారు. ఇక నేడే ప్రళయ దినము కానీ మీరు నిశ్చయముగా దీనిని తెలుసుకోలేక పోయారు."** దేవునిమీద విశ్వాసమున్న వానికి జ్ఞానము తెలియు అవకాశము కలదు. అటువంటి వానికి శ్రద్ధయుండును కావున, వానికి దైవజ్ఞానము సంపూర్ణముగా తెలియును. దైవజ్ఞానము తెలిసిన వానికి చావుపుట్టుకలు రెండు రకములున్నవని తెలిసియుండును. పై వాక్యములో ప్రళయమును గురించి చెప్పి నేడే ప్రళయదినము అని

నీవు నమ్మగలవా? ఇది నీకు తెలియదు, నీవు నమ్మవు అనికూడా చెప్పడము జరిగినది. దీనిని గురించి వివరముగా తెలుసుకొంటే చావుపుట్టుకలు రెండు రకములని జ్ఞానులయిన వారికి తెలుసునని చెప్పుచున్నాము. అయితే అవి ఏవి? ఎలాగుంటాయి? అని ఆలోచిస్తే ఈ విధముగా తెలియుచున్నది. ఒక మరణములో శరీరము పోతుంది. అది అందరికీ తెలిసిన మరణమే. మరియొక మరణములో శరీరముపోదు. అది ఎవరికీ తెలియని మరణము. దానిని మరణమని జ్ఞాని చెప్పినా, అజ్ఞాని అయినవాడు దానిని మరణమని నమ్మడు. **శరీరము లేకుండా పోవడము అందరికీ తెలిసిన మరణము. శరీరము తెలియకుండా పోవడము రెండవ రక మరణము.** శరీరము తెలియకుండా పోవడమంటే ఏమిటి? అని అర్థముకాక అడుగవచ్చును. మనిషికున్న రెండు మరణములలో మనిషి పుట్టిన కొన్ని సంవత్సరములకు శరీరమును వదలి చనిపోవడమును మరణము అంటాము. అది అందరికీ తెలిసిన మరణమే దానిని ఎవరూ కాదనలేరు. మరియొకటి ప్రతిదినము జరుగు మరణము కలదు. దానిలో శరీరముపోదు గానీ, శరీరము తెలియకుండాపోవును. మొదటి రకమైన మరణములో శరీరము పోవును తర్వాత పుట్టుక క్రొత్త శరీరములో జరుగును. అయితే ఇక్కడ రెండవ రకమైన మరణములో శరీరము పోదు పుట్టుక అదే శరీరములోనే జరుగును.

వివరముగా చెప్పండి! మాకు ఏమీ అర్థము కాలేదని కొందరడుగ వచ్చును. కావున వివరముగా చెప్పుకొంటే ప్రతి దినము మనము నిద్ర పోవడమే రెండవ రకమైన మరణము. మరణములో ఏమీ తెలియకుండా పోవును. అన్నిటితో సంబంధము తెగిపోవును. నిద్రలో కూడా అదే జరుగుచున్నది. కావున దానిని కూడా మరణము అని చెప్పవచ్చును. ప్రళయము అనునది మరణములో సంభవించునని కొందరు చెప్పడము

జరుగుచున్నది. శరీరములోనే ప్రళయము సంభవించుచున్నదని మేము చెప్పుచున్నాము. ప్రళయము అంటే పుట్టినదంతా నాశనమై పోవడము అని అర్థము. ఇంకా సృష్టింపబడినదంతా లేకుండా పోవడమని అర్థము. ఒక విధముగా మరణములో శరీరము పోవుచున్నది. శరీరము పంచభూతములతో తయారయినది. పంచభూతములనగా ఆకాశము, గాలి, అగ్ని, నీరు, భూమి అను ఐదు. దీనినే ఐదు చేత పుట్టింపబడినదని కూడా అంటారు. పంచము చేత పుట్టినది కావున ప్రపంచమని కూడా శరీరమునకు పేరు కలదు. శరీరము నాశనమయి జీవుడు శరీరమును వదలినప్పుడు మరణమే అనినా ఆ మరణములో శరీరము ప్రళయము పొందుచున్నది. అప్పుడు శరీరమును జీవుడు వదలి మరియొక శరీరమును ఆశ్రయించుచున్నాడు. శరీరమున్నా శరీరము తెలియకుండా పోవడమును కూడా మరణమని చెప్పవచ్చును. సాధారణ మరణములో, అందరికీ తెలిసిన మరణములో పంచభూత నిర్మితమైన శరీరము ప్రళయము చెందుచున్నది. అదే విధముగా నిద్రలో కూడా శరీరము తెలియకుండా పోవుట వలన దానిని కూడా ప్రళయమే అనుచున్నారు. జీవునకు మరుపులో తెలియకుండాపోయి, ఎరుకలో తెలియడమును ప్రళయము అంటున్నాము. శరీరము పోయి క్రొత్త శరీరము వచ్చినప్పుడు అదే జరుగుచున్నది. నిద్రపోయి లేచినప్పుడు అదే జరుగుచున్నది. అందువలన పై వాక్యములో ప్రళయము వరకు మనిషి ఉన్నాడు అంటే నిద్రవరకు మనిషియున్నాడని అర్థము. అంతేకాక నేడే ప్రళయ దినము అంటే నీవు నమ్మగలవా! అని అడిగినట్లు కలదు. ప్రతి దినము ప్రళయము వస్తున్నది కదా! అలాగే నేడు కూడా ప్రళయము ఉన్నది అంటే జ్ఞానము తెలియనివాడు నమ్మడు. కావున మీరు మాత్రము నమ్మేవారుకారు అని చెప్పారు. ఈ విషయమును

గురించి మేము వ్రాసిన **"కలియుగము"** అను గ్రంథములో వ్రాసిన విషయమును చూస్తాము.

దేవుని పగలు, రాత్రి అని చెప్పబడినట్లే, జీవునికి కూడా పగలు రాత్రి ప్రత్యక్షముగా ఉన్నవి. దేవుని పగటి కాలములో ప్రపంచమున్నట్లే, జీవుని పగటి కాలములో ప్రపంచమున్నది. దేవుని రాత్రి కాలములో ప్రపంచములేదని చెప్పినట్లు జీవునికి కూడా రాత్రి సమయములో (నిద్రలో) ప్రపంచము లేదు. జీవునికి పగలు సమయమైన మెలకువలో జీవుడు ఉన్నాడు, అతనితో పాటు ప్రపంచమూ ఉన్నది. అయితే జీవుని రాత్రి సమయమైన నిద్రలో జీవునికి తెలిసి జీవుడూ లేడు, జీవుడు తెలుసుకొను ప్రపంచమూ లేదు. జీవుని రాత్రి సమయములో (నిద్రలో) జీవుడూ, ప్రపంచమూ, అన్నీ ఉండినా వానికి మాత్రము తెలియకుండా పోవుచున్నవి. ప్రపంచమూ, జీవుడూ, ఆత్మ అన్నీ ఉండినా జీవునికి తెలిసినట్లు జీవుడు గానీ, ప్రపంచముగానీ తెలియకుండా పోవుచున్నవి. అందువలన ఆ సమయమును ఆ జీవునికి ఉన్నవన్నీ లేకుండా పోయినవనీ, అన్నీ ప్రళయము చెంది పోయినవని చెప్పవచ్చును. ప్రళయము అనగా పుట్టినవన్నీ లేకుండా పోవడము అని అర్థమగుట వలన జీవుని రాత్రి సమయమును ప్రళయ మనియే చెప్పవచ్చును. ప్రళయము అంటే భూమి ముక్కలైపోతుందనీ, అగ్ని ప్రేలిపోతుందనీ, సముద్రము భూమిమీద పాయలుగా, అలలుగావచ్చి (సునామీలుగా వచ్చి) ప్రజలను చంపుతుందనీ, సుడిగాలి అన్నిటినీ నాశనము చేస్తుందనీ అనుకోకూడదు. ఆ విధముగా జరుగడము ప్రళయము కాదు. మనిషికి పగలు కాలములో (మనిషికి మెలకువ కాలములో) జీవునికి (మనిషికి) తెలియునట్లు జరుగు ప్రకృతి బీభత్సములు ప్రళయములు కావు. మనిషికి ప్రకృతి అంతయూ లేకుండా పోవడమూ, అట్లే తానుకూడా లేకుండా

పోవడము ప్రళయమగును. తనకు (జీవునికి) తెలియబడు ప్రకృతి అంతయూ లేకుండా పోవడమును ప్రళయము అంటాము. జీవునికి తెలియ కుండా పోయినదంతా తిరిగి తెలియడమును ప్రభవము అంటాము. అందరూ ప్రళయములుగా ఊహించుకొను ప్రకృతి బీభత్సములన్నియూ మనిషి జీవించి ఉన్న సమయములోనే జరుగుచున్నవి. ప్రకృతి ఉధృతము వలన కలిగెడి భూకంపములూ, సునామీలూ, అగ్ని ప్రేలి భూమిమీదున్న జీవరాసులను కాల్చడమూ, సుడిగాలుల బీభత్సము అన్నీ మనిషిని బాధించు టకేగానీ అవి లేకుండా పోవడానికి కాదు. **ప్రకృతి మనిషి యొక్క దృష్టిలో లేకుండా పోవుటను ప్రళయమనీ, ప్రకృతి మనిషి యొక్క దృష్టిలోనికి రావడమును ప్రభవమనీ చెప్పవచ్చును.** ఇక్కడ బాగా జ్ఞాపకము పెట్టు కోవలసిన విషయమేమనగా! మనిషి (జీవుడు) తనకు తాను తెలియకుండా పోయినపుడు, తనకు తెలిసినవన్నీ లేకుండా పోవడమును ప్రళయము అని అంటున్నాము. మనిషి తనకు తాను తెలియబడినపుడు, అంతవరకు తనకు తెలియకుండా పోయినవన్నీ తిరిగి తెలియబడడమును ప్రభవమనీ అంటున్నాము.

ఇక్కడ ప్రళయ విషయములో మనుషులందరూ చాలాపొరపాటు పడిపోయారు. అలాగే ప్రభవము అను విషయములో కూడా పొరబడి పోయారు. సత్యమును తెలుసుకొంటే అన్ని సమయములలోనూ పగలుగానీ, రాత్రిగానీ ఏదో ఒకటి జరుగుచున్నది. పగలు సమయములో మెలకువ, రాత్రి సమయములో నిద్ర అనునవి నిర్ణయింపబడి ఉన్నవి. మెలకువ నిద్ర రెండూ మనస్సునుబట్టియుండును. మనస్సు అణిగిపోతే అది మనిషికి రాత్రిగా, మనస్సు అణిగిపోకుండా పనిచేయునపుడు ఆ సమయమును పగలుగా లెక్కించి చెప్పవచ్చును. శరీరములోని మనస్సు బయటి ప్రపంచ

విషయములను గ్రహించగలిగినపుడు, బయటవున్న ప్రకృతిలోని పంచ భూతములు జీవునికి తెలియబడుచున్నవి. శరీరములోని జీవుడు తన మనస్సు వలన బయటవున్న పంచభూతములైన ఆకాశము, గాలి, అగ్ని, నీరు, భూమిని గ్రహించగలుగుచున్నాడు. శరీరము యొక్క బయటవున్న పంచభూతములు శరీరములోపలనున్న జీవుడు వేరువేరుగా ఉన్నాయి. శరీరము లోపలనున్న జీవునికి బయటనున్న ప్రపంచము పగలుకాలములో తెలియబడుచున్నది, రాత్రి కాలములో తెలియబడడము లేదని ఎవరైనా చెప్పవచ్చును. శరీరములోని జీవునికి పగలు కాలములో ప్రకృతి ఎలా ఉన్నదో, అలాగే రాత్రి కాలములో ప్రకృతి జీవునికి తెలియనప్పటికీ, ప్రకృతి మాత్రము పగలు కాలములో ఎట్లున్నదో రాత్రికాలములో కూడ అట్లే ఉన్నది. పగలు రాత్రి అనునవి శరీరములో జీవునికి మాత్రమేగానీ, బయట ప్రపంచమునకు కాదు. ప్రకృతికి రాత్రి పగలు అనునవి వర్తించవు. రాత్రి పగలు జీవునికి మాత్రము వర్తించును. పగలులోనున్న జ్ఞప్తి రాత్రిపూట శరీరములో లేనిదానివలన మనిషి తనను తాను మరచిపోవుచున్నాడు. నిద్రలో తనకు ఏమాత్రము ఎరుక (జ్ఞప్తి) లేనిదానివలన జీవునకు తాను ఉన్నట్లుగానీ, బయట ప్రపంచమున్నట్లుగానీ ఏమాత్రము తెలియదు. అప్పుడు మెలకువలో ఉన్నవన్నీ లేకుండా పోయినట్లే, కావున అలా ప్రపంచము జీవాత్మ దృష్టిలో లేకుండా పోవడమును ప్రళయము అంటాము. ఎప్పుడైతే ఉన్నవన్నీ తిరిగి తెలియబడుచున్నవో, ఆ సమయమును ప్రభవము అంటున్నాము. ప్రళయములోగానీ, ప్రభవములోగానీ ప్రపంచము ఎలా ఉన్నది అలాగే ఉన్నది. అంతేగానీ ప్రభవములోనున్న ప్రకృతి ప్రళయములో స్థూలముగా నాశనము చెందుననీ, నాశనమైపోయిన ప్రకృతి ప్రభవములో తిరిగి దేవునిచేత తయారు చేయబడునని అనుకోకూడదు.

జీవునికి మెలకువ సమయము పగలు, జీవునికి నిద్ర సమయము రాత్రిగా చెప్పుకొన్నప్పుడు, జీవుని పగలు సమయములో బయటి ప్రపంచ మంతా వ్యక్తముగా ఉన్నది. అలాగే రాత్రి సమయములో పగలు వ్యక్తముగా నున్న ప్రపంచమంతా అవ్యక్తముగా మారిపోవుచున్నది. వ్యక్తమును (తెలియ బడడమును) ప్రభవమనీ, అవ్యక్తమును (తెలియకుండా పోవడమును) ప్రళయమనీ అంటున్నాము. ప్రళయ సమయములో జీవునికి ప్రపంచము తెలియకుండాపోవడము తప్ప, స్థూలముగా ఎటువంటి నాశనము కాలేదు. మనము చూస్తున్నట్లే సముద్రములో సునామీలు, భూమిలో కంపనములు, గాలిలో సుడులు, అగ్నిలో ప్రేలుళ్ళు ఎన్ని సంభవించినా నీరుగానీ, భూమి గానీ, గాలిగానీ, అగ్నిగానీ, ఏదీ నాశనమైపోలేదు. **ప్రకృతి యొక్క పంచ భూతముల బీభత్సములు ఎన్ని జరిగినా వాటిచేత మనిషి బాధింపబడు చున్నాడుగానీ, అవి మాత్రము ఏ ఒక్కటీ నాశనముకాలేదని జ్ఞాపకముంచు కోవలెను.** ప్రకృతికి నాశనమనునది లేదు. అందువలన వేయి యుగములు గడచిన తర్వాత లేక కలియుగము 250 మార్లు గడచిన తర్వాత 250వ మారు చివరిగా వచ్చు కలియుగముతోనే ప్రళయము వస్తుందనీ అను కోవడము పొరపాటగును, అజ్ఞానమగును. ప్రకృతి స్థూలముగా నాశన మవడము అసంభవము. ప్రకృతి ప్రళయములో అవ్యక్తమూ, ప్రభవములో వ్యక్తము అగుట మాత్రము సంభవము. ఇదే విషయమును భగవద్గీతలో అక్షర పరబ్రహ్మయోగమున 17,18,19 శ్లోకములందు ఇలా చెప్పబడినది.

17) శ్లో॥ సహస్రయుగపర్యన్త మహర్య ద్బ్రహ్మణో విదుః।
రాత్రిం యుగ సహస్రాన్తాం తే௨హో రాత్రవిదో జనాః॥

18) శ్లో॥ అవ్యక్తా ద్వ్యక్తయ స్సర్వాః ప్రభవన్త్యహరాగమే,।
రాత్ర్యాగమే ప్రళీయన్తే తత్రైవా వ్యక్త సంజ్ఞకే ॥

19) శ్లో॥ భూతగ్రామస్స ఏవాయం భూత్వాభూత్వా ప్రళీయతే ।
రాత్ర్యాగమే వశః పార్థ! ప్రభవ త్యహరాగమే ॥

**17వ శ్లోక భావము :-** వేయియుగములు ఒక పగలుగా, అలాగే వేయి యుగములు ఒక రాత్రిగా పెద్ద అయిన దేవునికి లెక్కించబడుచున్నవని ఏ జనులైతే తెలియగలరో అట్టివారు తన రాత్రిని పగళ్ళు తెలియగలరు.

**18వ శ్లోక భావము :-** పగలు రాత్రిని గురించి తెలిసినవారికి పగలు కాలములో సమస్త ప్రపంచము వ్యక్తమగుచున్నట్లు తెలియుచున్నది. అట్లే రాత్రి కాలములో వ్యక్తమగుచున్న ప్రపంచమంతయూ అవ్యక్తమగుచున్నట్లు తెలియుచున్నది. ప్రపంచము యొక్క వ్యక్తావ్యక్తములు జీవుని యొక్క రాత్రి పగలునుబట్టి కలుగుచున్నవి.

**19వ శ్లోక భావము :-** సకల జీవరాసులు పగలు జీవించుచున్నవి, రాత్రి అయిన వెంటనే ప్రళయమును పొందుచున్నవి. తిరిగి పగలైన వెంటనే ప్రభవమును పొందుచున్నవి. ఈ విధముగా సకల జీవరాసులు ప్రళయ ప్రభవములను పొందుచున్నవి. ఇట్లు రాత్రి పగల్లు ప్రళయమునూ, ప్రభవమునూ కర్మ వశమున సకల జీవులు పొందుచున్నవి.

ఇంతవరకు ప్రళయమును గురించి తెలుసుకొన్నాము. మనిషి చనిపోయినప్పుడు వచ్చు ప్రళయములో శరీరము పోవుచున్నది. తర్వాత జీవుడు క్రొత్త శరీరమును పొందుచున్నాడు. అలా చనిపోయి తిరిగి పుట్టు దినమును అంతిమ దినము అని అంటాము. అంతిమ దినమున తిరిగి మనిషి పుట్టించబడుతాడు. ఆ దినము సమాధినుండి మనిషి లేపబడుతాడని చెప్పడము జరిగినది. సమాధి అంటే ఏమిటి? సమాధినుండి ప్రళయ కాలములో దేవుడు ఎలా మనిషిని లేపుతాడు? అను వివరమును మనము

తెలియవలసియున్నది. ఈ విషయమును గురించి ఖుర్ఆన్ గ్రంథములో సూరా 22, ఆయత్ 6,7 లలో ఇలా కలదు చూడండి. **(22-6) "అల్లాయే (దేవుడు) సత్యము గనుక మృతులను తిరిగి బ్రతికించేవాడు ఆయనే. అన్నిటిపై ఆయనే అధికారముకలవాడు. కనుక ఇదంతా జరుగు తోంది." (22-7) "ప్రళయము రావడము తథ్యము. అందులో సందేహానికి ఆస్కారమే లేదు. నిశ్చయముగా అల్లాహ్ సమాధులలో యున్నవారిని తిరిగి లేపుతాడు."** ప్రళయ దినమున మరణము వస్తుందని చెప్పుకొన్నాము. శరీరము నాశనమగుటయే ప్రళయము అని తెలుసు కొన్నాము. దానినే అంతిమ దినమని కూడా చెప్పుకొన్నాము. చనిపోయిన రోజు అంతిమ దినమయితే అదే పునరుత్థాన దినమగుచున్నది. ఆ దినమే మనిషి సమాధినుండి లేస్తున్నాడు. దేవుడు లేపుచున్నాడు. అదెలా జరుగుచున్నదో మేము గతములో వ్రాసిన "సమాధి" గ్రంథములోనున్న విషయమును చూస్తాము.

సృష్ట్యాదిలో పరమాత్మ తన ప్రకృతి చేత శరీరమును తయారు చేయించి, ఐదు ధాతువులతో కూడిన శరీరములో తన అంశ అయిన జీవాత్మను చేర్చి, సజీవ శరీరములను తయారు చేశాడు. అలా మొదట తయారు చేయబడిన జీవరాసులవి జన్మలని తెలుసుకొన్నాము. అప్పుడు ప్రారంభమైన జన్మ ఇప్పటి వరకూ ఉన్నది. తర్వాత కూడా ఉంటుంది. మనిషి సృష్ట్యాదిలో జన్మ తీసుకొన్నపుడు సమాధినుండి లేపబడలేదు. పునర్జన్మలలో మాత్రమే సమాధి అను శరీరమునుండి లేపబడుచున్నాడు. పునర్జన్మలో తల్లిగర్భమునుండి బయటపడిన శరీరములోనికి, గత జన్మలోని శరీరము నుండి బయటపడిన జీవుడు చేరినపుడు సమాధి అగుచున్నది. సృష్ట్యాదిలో తల్లిగర్భమునుండి శరీరము బయటపడడములేదు. జీవుడు

వేరుశరీరమునుండి రావడమూ లేదు. అందువలన సృష్ఠి మొదటిలో జన్మించినపుడు ఎవరికీ సమాధిలేదు. **సమాధి అనునది పునర్జన్మలు గల వారికి మాత్రమే ఉన్నదని తెలియవలెను.** పునర్జన్మలో మాత్రమే మనిషి (జీవుడు) సమాధినుండి లేపబడుతాడు అని మూల గ్రంథములలో ఉన్నమాట వాస్తవమవుతున్నది. మూల గ్రంథములలో దేవుడు సమాధినుండి లేపునని వ్రాయబడివున్నది. ఇక్కడ ఈ మాటలో మనిషికి కొంత సందిగ్ధత ఏర్పడ వచ్చును. అది ప్రశ్నరూపము కావచ్చును. దేవుడు రూప, నామ, క్రియలు లేనివాడని మీరే చెప్పారు కదా! అటువంటపుడు దేవుడు మనిషిని సమాధి నుండి లేపే పని చేయునా! అని ప్రశ్నించవచ్చును. దానికి జవాబు ఏమనగా! దేవుడు సృష్ఠి పూర్వము పనిచేసి మానవున్ని పుట్టించి వుండవచ్చును. కానీ సృష్ఠి తర్వాత ఆయనకు పనిలేదు, రూపములేదు, పేరూలేదు. అయితే ఆయన ఏర్పరచిన విధానమును అనుసరించి, ఆయన నియమించిన వారు, ఆయన పనిని చేయడము వలన, ఆ పనిని ఆయన చేసినట్లు చెప్పుచున్నారు. కానీ ఆయన నియమించిన భూతములు, మహాభూతములు, గ్రహములు, ఉపగ్రహములు అను ఎన్నో ఆయన పనిని నెరవేర్చుచున్నవి. దేవుడు ఏ పనినీ స్వయముగా చేయలేదు.

ఇపుడు మరొక సూరాలో మరొక వాక్యమును తీసుకొని చూస్తాము. దేవుడు మనిషిని ఎలా పుట్టించుచున్నాడో కొంత వివరముగా చూచుటకు ఖుర్ఆన్ గ్రంథములో సూరా 39, ఆయత్ 42లో వ్రాసిన దానిని చూస్తాము.

**(39-42) "అల్లాయే ఆత్మలను వాటి మరణ సమయములో స్వాధీనము చేసుకొంటాడు. మరణము రానివారి ఆత్మలను కూడా వాటి నిద్రావస్థలో ఆయన వశపరచుకొంటున్నాడు. మరి మరణ ఉత్తర్వు ఖరారైన వారి ఆత్మలను ఆపుకొంటున్నాడు. ఇతర ఆత్మలను ఒక**

**నిర్ణీత గడువు వరకు వదలి పెడుతున్నాడు. చింతన చేసే వారికోసము ఇందులో ఎన్నో సూచనలు ఉన్నాయి."** ఈ వాక్యము చివరిలో ఆలోచించే వారికి ఇందులో ఎన్నో సూచనలున్నాయి అని అన్నారు. ఈ విధముగా వాక్యము చివరిలో ఏమయినా చెప్పియుంటే అది నిగూఢమైన వాక్యమయి ఉంటుందని ముందే చెప్పుకొన్నాము. ఈ వాక్యములో కూడా ఇంతవరకు మనుషులకు తెలియని విషయము దాగియున్నదని అర్థమగుచున్నది. ఈ ఆయత్‌లో మొదట 'ఆత్మలను వాటి మరణ సమయములో అల్లాహ్‌యే స్వాధీనము చేసుకొంటాడు' అని యున్నది. ఈ వాక్యములో అల్లాహ్ మరణ సమయములో జీవాత్మలను స్వాధీనము చేసుకొంటాడు అని అర్థము చేసుకోవచ్చును. వాక్యములో 'ఆత్మలను' అని ఉంది. అయితే జీవాత్మ కూడా ఒక ఆత్మే కావున ఎప్పుడయినా ఆత్మయని జీవాత్మను అనవచ్చును. జీవాత్మ ఆత్మ రెండూ జోడు ఆత్మలని ముందే చెప్పుకొన్నాము. అంతేకాక అల్లాహ్ అనగా దేవుడు సాక్షిగాయుండువాడు మాత్రమేగానీ, చేయువాడు కాడు అని చెప్పుకొన్నాము. జీవాత్మ తోలబడేవాడు, ఆత్మ తోలేవాడు, పరమాత్మ అయిన దేవుడు చూస్తూ యుండేవాడు అని 50వ సూరా, 21వ ఆయత్‌లో చెప్పుకొన్నాము. దానిప్రకారము దేవుడు జీవుల మరణ సమయములో జీవాత్మలను స్వాధీనము చేసుకోడు. జీవుళ్ళను స్వాధీనము చేసుకొనువాడు ఆత్మయని తెలియవలెను. శరీరములో కార్యములను చేయునది ఆత్మ ఒక్కటే. అందువలన మరణ సమయములో శరీరములోని జీవున్ని ఆత్మ తన స్వాధీనములోనికి తీసుకొంటున్నది. జీవుడు ఎల్లప్పుడూ ఆత్మ చేతిలో బొమ్మవలెయుండును. ఆత్మ జీవాత్మను ఎటు తోలితే అటు పోవుచుండును. ఎలా ఆడిస్తే అలా ఆడుచుండును. మనిషి పుట్టినప్పటినుండి శరీరములోని జీవాత్మ ఆత్మ ఆధీనములోనేయుండి బ్రతుకుచున్నది. ఆత్మకు

తెలియకుండా జీవుడు ఎటు పోయేదానికి వీలులేదు. అయితే వాక్యము మొదటిలోనే దేవుడు ఆత్మలను వాటి మరణములో స్వాధీనము చేసుకొనును అని చెప్పియున్నారు కదా! దేవుడు ఏమీ చేయనప్పుడు దేవుడు (అల్లాహ్) స్వాధీనము చేసుకుంటాడని ఎందుకు వ్రాశారు? అని ఎవరయినా ప్రశ్నించవచ్చును. దానికి మా జవాబు ఇలా కలదు. ప్రశ్న అడుగు వారికి సులభమేగానీ, జవాబు చెప్పు వారికే కష్టము. అయినా మా మాట ఇలా కలదు.

దేవుడు పని చేయనివాడని ఇంతకుముందు చాలామార్లు చెప్పాము. కార్యములన్నియూ ఆత్మే చేయుచున్నా, అన్నిటికీ పెద్ద దేవుడు కావున దేవున్ని గౌరవించు నిమిత్తమే దేవుడు ఏమీ చేయకున్నా అన్నీ దేవుడే చేస్తున్నట్లు చెప్పుచున్నాము. ఆ పద్ధతి ప్రకారము వాక్యములో మరణములో ఆత్మలను దేవుడు స్వాధీనము చేసుకొన్నాడని చెప్పారుగానీ, వాస్తవముగా దేవుడు పని చేయడు. కావున ఆత్మ జీవాత్మలను మరణములో తన ఆధీనము నందుంచుకొంటున్నదని తెలియవలెను. ఈ వాక్యములో దేవుడు చేయు పనిని ఆత్మ చేయునట్లు గుర్తించుకోవలెను. ఒకవేళ మరణము రాని జీవాత్మలను వాటి నిద్రావస్థలో ఆత్మ తన ఆధీనమందుంచుకొంటున్నది. అయితే ఇక్కడ మరణము, నిద్ర రెండూ ఒకే రకముగాయుండునని తెలియవలెను. మరణములో మనిషికి జ్ఞాపకము లేకుండాపోయి మరణించు చున్నాడు. అలాగే నిద్ర సమయములో కూడా మనిషికి జ్ఞాపకము లేకుండా పోయి నిద్రను పొందుచున్నాడు. జీవితములో నిద్ర మనిషికి ఎలా వచ్చుచున్నదో అలాగే మరణము కూడా వస్తున్నది. శరీరములో మనస్సు అణిగిపోయినప్పుడే నిద్రగానీ, మరణముగానీ మనిషికి సంభవించుచున్నది. ఆత్మ శరీరములోని జీవాత్మలను ప్రతి దినము తన ఆధీనములోనికి తీసుకొని

కర్మప్రకారము మరణము ఖరారైన వారి జీవాత్మలను తనవద్దనే ఆపుకొని, ఇతర జీవాత్మలను అనగా నిద్రలోయున్న జీవాత్మలను మరణము వచ్చువరకు తనవద్ద ఆపుకోకుండా వదలిపెట్టుచున్నది. **'నిర్ణీత గడువు'** అని వాక్యములో యున్నది. **'నిర్ణీత గడువు'** అనగా నిర్ణయము చేయబడిన మరణము అని అర్థము. ఆత్మ శరీరములో అధిపతిగాయుంటూ, శరీరమంతా వ్యాపించి యుండి, శరీరములో ఉన్న కార్యములను చేయుచున్నది. జీవుడు ఎప్పుడు తన జ్ఞాపకమును కోల్పోవునో అప్పుడు తన వానిని తన ఆధీనములోనే యుంచుకొని మరణము వచ్చిన వానిని కాకుండా నిద్రవచ్చిన వానిని మరణము వరకు వదలిపెట్టుచునేయున్నది. అటువంటి జీవాత్మ ఉదయము తిరిగి జ్ఞాపకములోనికి వచ్చుచున్నది. మరణము రాని జీవాత్మలు ఎన్నిమార్లు నిద్రపోయినా, అన్నిమార్లు ఆత్మ ఆధీనములోయుండి తిరిగి ఉదయము జ్ఞాపకములోనికి వచ్చి మెలకువను పొందుచున్నది. అయితే మరణము వచ్చిన జీవుళ్ళను ఆత్మ వాని కర్మానుసారము వేరొక శరీరములోనికి తీసుకొని పోయి అక్కడ పుట్టునట్లు చేయుచున్నది. ప్రతి దినము నిద్రపోయిన వారిని, మరణము పొందినవారిని చూచి ఎవరు నిద్రపోయారో వారిని ఉదయము మెలకువను పొందునట్లు మరణము పొందిన వారిని మరుజన్మకు పోవునట్లు ఆత్మే చేయుచున్నది.

ఒక మనిషి శరీరములో జీవించుచున్నాడు అంటే, వాడు అనగా జీవాత్మ ఎల్లప్పుడూ ఆత్మ ఆధీనములోయున్నాడని తెలియవలెను. నిద్రలో గానీ మెలకువలోగానీ శరీరములోయున్న జీవాత్మ ఆత్మ ఆధీనములోనే యున్నది. ఆత్మ ఎట్లు ఆడిస్తే అట్లు ఆడుచున్నది. శరీరమునకు పెద్దగాయున్న ఆత్మ శరీరమును నడిపించుచూ, కార్యములను చేయించుచూ, జీవాత్మను సుఖ దుఃఖములను అనుభవించునట్లు చేయుచున్నది. పరమాత్మ జీవాత్మను

ఆడించే ఆత్మను సాక్షిగా చూస్తున్నది. అంతేతప్ప పరమాత్మ ఏ కార్యమునూ చేయదు. అయితే పరమాత్మే రెండు ఆత్మలకంటే పెద్ద అయినందున పరమాత్మ పనిని చేయకున్నా ఆత్మ చేయు పనులను దేవుడే చేశాడని పరమాత్మ గౌరవార్థము చెప్పుచుందురు. ఆత్మ ఒకే సూత్రముతో యున్నదగుట చేత ఒక్కొక్క జీవాత్మ ప్రక్కలో ఒక్కొక్క ఆత్మగాయుంటూ ఎన్ని జీవాత్మలున్నాయో అన్ని ఆత్మలవలె ఖండ ఖండములుగా కనిపించు చున్నది. అనేక ఖండములుగాయున్న ఆత్మ ఎన్ని శరీరములలోయున్నా, అన్ని ఆత్మలూ ఒక్కటేనని ఒకే ఆత్మ ఆ విధముగా అనేక చీలికలుగా కనిపించుచున్నదని తెలియవలెను.

మనిషి మరణము, నిద్ర రెండూ మరుపుతోనే మొదలయినా, రెండూ మెలకువతోనే ముగియును. ఒక మెలకువ నిద్రలేవడముకాగా, మరొక మెలకువ ఏకంగా జన్మ అగుచున్నది. మెలకువలు రెండు అయినా అందులో నిద్ర మెలకువలో శరీరముండుట వలన శరీరములోని మనస్సు కూడా యుండును. మనస్సు ఉండుట వలన నిద్రలేచిన వానికి నిన్న మొన్నటి జ్ఞాపకములు అట్లేయుండును. మరపు మరణమైనవానికి మెలకువ జన్మయగును. అప్పుడు శరీరము మారియుండుట వలన, క్రొత్త శరీరము వచ్చియుండుట వలన పాత మనస్సు లేకుండా పోయిన దానివలన, వెనుకటి జ్ఞాపకములన్నీ, నిన్న మొన్నటి సహా మొత్తము జ్ఞాపకములన్నీ లేకుండా పోవును. ప్రతి విషయమును మననము చేయునది మనస్సు. శరీరములో జ్ఞాపకముల పాత్రయంతయూ మనస్సుదే. మనస్సు మరణించిన శరీరముతో సహా పోయివుండును. కనుక క్రొత్త శరీరముతో క్రొత్త మనస్సు వచ్చియుండుట వలన పాత జ్ఞాపకములన్నియూ లేకుండాపోవుచున్నవి. పాత శరీరమునకు పాతమనస్సుకు మరణమే ఆఖరి దినము అగును.

క్రొత్త శరీరమునకు, క్రొత్త మనస్సుకు జననము మొదటి దినమగును. మనిషి ఎప్పుడు చనిపోతే అప్పుడే అతని ఆత్మ జీవున్ని జన్మకు తీసుకపోవుచున్నది. అందువలన మనిషికి అంతిమ దినమే ప్రథమ దినముగా తయారగుచున్నది. పాత శరీరమునకు పాత మనస్సుకు అంతిమ దినము మరణ దినమేయని తెలియవలెను.

మరణములో పంచభూతములతో తయారైన శరీరము నాశనమై పోవుటవలన జీవుడు నివాస యోగ్యముకాక దానిని వదలివేయుచున్నాడు. అలా వదలివేసిన శరీరము అతి తొందరగా శిథిలమైపోవును. మృత శరీరమును భూమిలో పూడ్చిపెట్టుట వలన పూర్తి మట్టిగా మారిపోవుచున్నది. మనిషికి పుట్టినప్పుడు వచ్చిన శరీరము కొన్ని సంవత్సరములు మనిషి జీవించినంత కాలముండి చివరకు మరణములో లేకుండా పోవుచున్నది. అంతిమ దినము జీవితములో కర్మను అనుసరించి ముందే నిర్ణయించబడి యుండును. దానిప్రకారమే గడువు తీరగానే మనిషికి మరణము సంభవించును. కర్మప్రకారము సంభవించిన మరణములోనే వెంటనే కర్మ నిర్ణయమై ఆ కర్మప్రకారమే మనిషి తిరిగి జన్మించు చున్నాడు. మొదటి జన్మయంతయూ గత కర్మప్రకారమే జరిగియుండును. గతజన్మలో చేసుకొన్న కర్మప్రకారము, లేక కర్మపత్రము ప్రకారము ప్రస్తుత జీవితము జరుగగా, ప్రస్తుత జీవితమలో చేసుకొన్న కర్మప్రకారము మరణములో కర్మపత్రము తయారుకాగా క్రొత్త జన్మ వచ్చుచున్నది. మరణ సమయమును అంతిమ దినము లేక అంతిమ సమయము అని అనవచ్చును. అంతిమ దినమున తయారయిన కర్మపత్రము ప్రకారము రెండవ జన్మలో శరీరమును ధరించడము, జీవించడము జరుగుచున్నది. మొదటి జన్మ కర్మప్రకారమే జరిగినది. రెండవ జన్మను కూడా కర్మప్రకారమే ఆత్మ నడుపుచున్నది.

ఇక్కడ కొందరు ముస్లీమ్‌లు ఒక ప్రశ్న అడుగవచ్చును. అదేమనగా! మా షరియత్ ప్రకారము మనిషి చనిపోతే రెండవ జన్మకు పోడనీ, భూసమాధిలోనే చనిపోయినవాడు ప్రళయము వరకు ఉండునని చెప్పారు. ప్రళయము సంభవించినప్పుడు ప్రపంచమునకు అంతిమ దినము అగుననీ, ఆ దినము సమాధులలోయున్న వారినందరినీ దేవుడు శరీరముతోనే లేపి, వాడు బ్రతికినపుడు చేసుకొన్న పాపపుణ్యములకు తగినట్లు తీర్పు తీర్చి, పాపము చేసుకొన్న వానిని నరకమునకు, పుణ్యము చేసుకొన్న వానిని స్వర్గమునకు పంపునని మా ముస్లీమ్‌ల షరియత్‌లో (ఇస్లామ్ చట్టములో) యున్నదనీ, ఆధ్యాత్మిక చట్టము ప్రకారము జన్మలు లేవనియుండగా మీరు క్రొత్తగా చెప్పుచున్నారే!యని అడుగవచ్చును.

వారు వారి పద్ధతి ప్రకారము ప్రశ్న అడుగుటలో తప్పులేదుగానీ, చెప్పవలసిన బాధ్యత మనకున్నది. అందువలన నేను ఏమి చెప్పు చున్నాననగా! భూ సమాధిలో పూడ్చిపెట్టినది శరీరమునుగానీ, జీవున్ని కాదు. మృత శరీరమున్నట్లే జీవుడు ముందే శరీరమును వదలిపోయి క్రొత్త శరీరమును ధరించియుండును. మనిషి మరణించిన వెంటనే ఒక సెకను ఆలస్యము లేకుండా రెండవ జన్మను పొందుచున్నాడు. అలా జన్మకుపోయినవాడు క్రొత్త శరీరములో కొన్ని గంటలు గడిపిన తర్వాత చనిపోయినచోట పాత శరీరమును భూమిలో పాతిపెట్టడము జరుగుచున్నది. అప్పుడు జీవునికి పాత శరీరమునకు సంబంధమే లేదు. భూమిలో పూడ్చబడిన పాత శరీరము కొన్ని రోజులలో శిథిలముకాగా, కొంతకాలము నకు ఎముకలు కూడా లేకుండా పోవుచున్నవి. అటువంటప్పుడు భూసమాధిలో చచ్చినవాడు ఉండునని చెప్పుటను విజ్ఞానము ఒప్పుకోదు. అంతేకాకుండా దేవుడు తన ఖుర్ఆన్ గ్రంథములో ఎక్కడకూడా అలా

చెప్పలేదు. దేవుడు చెప్పిన ఆధ్యాత్మిక చట్టము ప్రకారము కాకుండా మతము చెప్పిన షరియత్ ప్రకారము పోతే, అది దేవునికి వ్యతిరేఖముగా నడిచి నట్లగును. ప్రతి మనిషికి తిరిగి పుట్టడము ఉన్నది. ఆ తిరిగి పుట్టడము భూ సమాధినుండి లేపడము కాదనీ, అది వీర్యబిందువుతోనే తల్లిగర్భములోనే జరుగుననీ ఖుర్ఆన్ గ్రంథములో సూరా 53, ఆయత్ 44,45,46,47 లలో ఇలా కలదు చూడండి. **(53-44) "ఆయనే నిశ్చయముగా మరణింప జేయుచున్నాడు, తిరిగి ఆయనే జీవితమును ఇస్తున్నాడు." (45) "ఆయనే ఆడ మనిషిగా, మగ మనిషిగా పుట్టించుచున్నాడు." (46) "మరు జన్మ గర్భములో కార్చబడిన వీర్యబిందువుతోనే" (47) "రెండవసారి బ్రతికించే వాడు ఆయనే".** ఇదే విషయమునే మరొక గ్రంథము **"దివ్య ఖుర్ఆన్ సందేశము"** లో ఇట్లు వ్రాశారు చూడండి. **(53-46,47) "విసర్జింపబడిన వీర్యబిందువు నుండి నిశ్చయముగా దానికి (వానికి) మరొక జీవితాన్ని పునరుత్థానము ప్రసాదించడము ఆయనకే అల్లాహ్‌కే చెందినది."** అని చెప్పారు. దీనినిబట్టి రెండవ జన్మ లేక పునరుత్థానము వీర్యబిందువుతోనే జరుగుచున్నదని ఖుర్ఆన్‌లో దేవునివాక్కుయున్నది. దానిప్రకారము తల్లి గర్భమునుండి పుట్టిన శరీరము లోనే రెండవ జన్మ అని తెలియుచుండగా, భూసమాధిలో ప్రళయమువరకు ఉంటాడనడము దేవుని మాటకు (అల్లాహ్ మాటకు) ఎదురుగా, వ్యతిరేఖముగా చెప్పినట్లగును. దేవునిమాటకు వ్యతిరేఖముగా మాట్లాడితే దేవుడు శపించునని, ఇంకా శపించే స్థోమతయున్న దేవదూతలందరూ శపించుదు రని చెప్పడమేకాక 41వ సూరాలో, 40వ ఆయత్‌నందు ఇలా కలదు. **(41-40) "నిశ్చయముగా మా సూచనలకు వికృతార్థమును అంటగట్టేవారు, మాకు కనిపించకుండా ఉండలేరు. అయితే**

**పునరుత్థాన దినమున వాడు నరకాగ్నిలో పడవేయబడును. మీరు చేసేదంతా దేవుడు చూస్తున్నాడు."**

ఇదంతయూ గమనించిన తర్వాత ఏ మనిషి అంతిమ దైవగ్రంథము నకు వ్యతిరేఖముగా మాట్లాడుటకు సాహసించడు. అంతిమ దినము ఏదయితే ఉందో అదే ప్రథమ దినమని ఒప్పుకోక తప్పదు. అంతిమ దినము రోజు చేసుకొన్న కర్మప్రకారము కర్మపత్రము తయారయి వాని మెడలో కట్టి పంపబడును. అలా వచ్చిన కర్మప్రకారము రెండవ జన్మలోని జీవితము గడచును. కర్మనిర్ణయమై కర్మపత్రము తయారవునప్పుడు అక్కడ కర్మను లేకుండా చేసుకొనుటకు ఎవరి సిఫారసూ పని చేయదు. అక్కడ ఇతను ఈ పాపమును అనుభవించలేడు కొంత తగ్గించమని అడుగువారు ఎవరూ ఉండరు. ఎవరయినా అడిగినా అతను చేసుకొన్న కర్మనుండి ఏమాత్రము తగ్గించబడదు. ఇంకా అంతిమ దినమును గురించి ఖుర్ఆన్ గ్రంథములో సూరా 2, ఆయత్ 48లో ఇలా వ్రాయబడియున్నది చూడండి. **(2-48) "ఎవరూ ఎవరికీ ఎలాంటి ప్రయోజనము చేకూర్చలేని, ఎవరి సిఫారసు స్వీకరించబడని, ఎవరివద్ద పరిహారము తీసుకోబడని, ఎలాంటి సహాయము అందచేయబడని ఆ అంతిమ దినమునకు భయపడండి."** ఇదే విషయమునే మరియొక కోణములో చెప్పుచూ సూరా 3, ఆయత్ 10లో ఈ విధముగా వ్రాశారు. **(3-10) "అవిశ్వాసులను వారి అంతిమ దినమున వారి సిరిసంపదలుగానీ, వారి సంతానము గానీ, కర్మపత్రము నుండి, అల్లాహ్ శిక్షనుండి విడిపించడములో ఏమాత్రము ఉపయోగ పడవు. నరకానికి ఇంధనము అయ్యేవారు వీరే."** అంతేగాక మనుషులను ఎవరినీ వదలక అందరికీ అంతిమ దినమును దేవుడు కల్గించుతాడని, ఎట్టి పరిస్థితులలోనూ దేవుడు

చెప్పినమాట నెరవేరకపోదని అదే మూడవ సూరాలో, 9వ ఆయత్‌నందు ఇలా చెప్పారు చూడండి. **(3-9) "దేవ్వుడు నిశ్చయముగా జనులందరినీ ఏదో ఒకరోజు సమీకరిస్తాడు. ఆ రోజును గురించి ఎలాంటి అనుమానము లేదు. అల్లాహ్ తన వాగ్దానానికి విరుద్ధముగా వ్యవహరించడు."** అంతిమ దినమును గూర్చి మరియొక చోట ఇదే సూరాలో 114వ ఆయత్‌నందు ఈ విధముగా వ్రాసియున్నారు చూడండి. **(3-114) "అల్లాహ్‌ను అంతిమ దినమును కూడా వారు విశ్వసిస్తారు. మంచిని చేస్తారు, చెడును ఆపుతారు. సత్కార్యముల కోసము దేవునిసేవ కోసము ఒకరికొకరు పోటీ పడతారు. వీరు సజ్జనుల కోవకు చెందినవారు."** ఇక్కడ వ్రాసిన వాక్యము ప్రకారము అంతిమ దినము మంచివారికీ ఉంది, చెడ్డవారికీ ఉందని తెలియుచున్నది. అంతేకాక ప్రతి ప్రాణీ అంతిమ దినమును చవిచూడవలసిందేనని ఇక్కడ మరొకచోట మూడవ సూరాలోనే 185వ ఆయత్‌నందు ఈ విధముగా చెప్పబడినది. **(3-185) "ప్రతి ప్రాణీ మృత్యువును రుచి చూడవలసిందే. ప్రళయములో అంతిమ దినమున మీరు అందరూ కర్మల పూర్తి ఫలితమును పొందుతారు. అప్పుడు ఎవడు నరకాగ్నిలో పడకుండా, మోక్షములో ప్రవేశిస్తాడో అతడు నిశ్చయముగా సఫలీకృతుడయినట్లే, ప్రాపంచిక జీవితమైతే మాయా తతంగము తప్ప మరేమీ కాదు. అది మోసపూరిత జీవితమే."**

పై వాక్యములనుబట్టి అంతిమ దినము అందరికీ తప్పకయున్నదని తెలియుచున్నది. అంతిమ దినమునుండి ఎవడూ తప్పించుకొనుటకు వీలులేదు. మరణమున్న ప్రతి మనిషికీ అంతిమ దినమున్నట్లే. ఆ దినమున ఆ జీవితములో చేసుకొన్న కర్మయంతయూ పత్రములో వ్రాయబడి రెండవ

జన్మలో అనుభవించుటకు నిర్ణయము చేయబడుచున్నది. అప్పుడు అతడు చేసుకొన్న ఎంతటి భయంకర కర్మఅయినా తప్పక కర్మపత్రములో వ్రాయ బడుచున్నది. ఆ రోజు కర్మపత్రములో తమ కర్మలు నమోదు కాకుండా చేసుకొనుటకు ఏమాత్రము వీలుపడదు. ఆ దినము ఏ దేవత వచ్చి చెప్పినా ఒక్క తృణమాత్రము కర్మ కూడా తీసివేయబడదు. ఎవడు చేసుకొన్నది వాడు అనుభవించవలసిందే. ఒకవేళ అంతిమ దినమున వారి సంపదల చేత కర్మను లేకుండా చేసుకొనుటకు వీలుపడదు. అట్లే వారి సంపదగానీ, సంతానముగానీ కర్మనుండి విడిపించలేవు. ఆ దినము ఎవరి సిఫారసుగానీ, ఎలాంటి పరిహారమును చెల్లించడము వలనగానీ, ఏమీ ప్రయోజనము ఉండదు. మనిషి చేసుకొన్న కర్మను తప్పించుటకు ఎవరిచేత కాదు. ఎట్టి పరిస్థితులలోనూ ఒక్క నిమిషము అనుభవించు కర్మను కూడా ఎవరూ తప్పించలేరు. అటువంటి అంతిమ దినమున ఎటువంటి కర్మలు లేనివాడు, వాని జీవితములో జ్ఞానము చేత ఉన్న కర్మలను కాల్చివేసి నిష్ఫలము చేసిన వాడు కర్మపత్రమును పొందడు. అటువంటి వానికి కర్మలు లేనిదానివలన, వాడు అనుభవించవలసినది లేకుండుట వలన, వానికి కర్మపత్రము తయారు కాదు. అటువంటివాడు రెండవ జన్మకు పోడు. వాడు మోక్షమును పొందును. మోక్షమును పొందినవాడు దేవునియందు ఐక్యమైపోయి స్థిర స్థానమును దేవునిలోనే ఏర్పరచుకొనును. అట్టివాడు శరీరమును ధరించి పుట్టడు. అది అరుదైన మోక్షప్రాప్తి యనవచ్చును. ఒక మనిషి జ్ఞానిగా మారి దైవజ్ఞానము ప్రకారము నడుచుకొన్నప్పుడు వాడు గతములో చేసుకొన్న పాపములుగానీ, ప్రస్తుత జన్మలో చేసుకొన్న కర్మలుగానీ కాల్చివేయబడును. భగవద్గీతలో జ్ఞాన యోగమను అధ్యాయము 37వ శ్లోకములో ఇట్లన్నారు.

శ్లో॥ యథైధాంసి సమిద్ధోగ్ని ర్భస్మ సాత్కురుతేర్జున ।
జ్ఞానాగ్ని స్సర్వ కర్మాణి భస్మసాత్కురుతే తథా ॥

**భావము :- "ఏ విధముగా అగ్నిలో కట్టెలు కాలిపోవుచున్నవో, అదే విధముగా జ్ఞానమను అగ్నిలో సర్వకర్మలు కాలిపోవుచున్నవి."** భగవద్గీతలో జ్ఞాన యోగమున 37వ శ్లోకములో చెప్పినట్లు ఎవడు తనయందు జ్ఞానాగ్నిని దేవుని జ్ఞానముచేత తయారు చేసుకొనునో వాడు తన కర్మలను కాల్చు కొనును. అంతిమ దినమున ప్రళయ సమయమున ఇక్కడ మరొకమారు చెప్పుచున్నాను చూడండి. ప్రళయ సమయములో అంటే మరణ సమయములో అని అర్థము. అంతిమ దినము అంటే జీవితములో చివరి రోజు అని అర్థము. ఆ దినమున కర్మలేనివాడు కృతకృత్యుడు అని చెప్పారు. ఆ దినము అందరికీయున్నట్లు కర్మలుండవలయును కదా! అతనికి కూడా కర్మపత్రముండును కదా!యని ఎవరయినా అనుకొంటే వారు అనుకొన్నట్లు కర్మపత్రము వానికియుండదు. ఎందుకనగా! వాని కర్మయంతయూ జ్ఞానమను అగ్నిలో కాలిపోయివుండును. అటువంటి వానినే సాధించినవాడు అని వాక్యములో అన్నారు. ఇక్కడ ముస్లీమ్‌లు ఒక ప్రశ్నను అడుగవచ్చును. అదేమనగా! మీరు ఎక్కడో భగవద్గీత శ్లోకము చెప్పి కర్మను జ్ఞానముతో కాల్చుకోవాలి అని అన్నారు. మాకు కర్మ అంటే ఏమిటో తెలియదు జ్ఞానముతో కాల్చుకోవడము తెలియదు. మాకు దేవుడు దేవుని మార్గములో నడువుటకు నాలుగు విధానములు చెప్పాడు. ఒకటి నమాజ్, రెండు జకాత్, మూడు రోజా, నాలుగు హజ్. ఈ నాలుగును ప్రతి ముస్లీమ్ విధిగా చేయాలని చూస్తున్నాడు. మాకు దేవుడు చెప్పిన దానిని మేము చేయుచున్నాము. ప్రతి ముస్లీమ్‌ను చేయమని చెప్పుచున్నాము. అంతేతప్ప భగవద్గీతలో చెప్పిన యోగములు చేయడము మాకు తెలియదు. కర్మ కాలిపోతుందను విషయము కూడా మాకు తెలియదు. మేము ఒకే దేవున్ని నమ్ముకొన్నాము. నాలుగు విధానములతో ముందుకు పోవుచున్నాము. దీనికి మీరేమంటారు?

ఒక మనిషి మంచిపని చేస్తే ఎవరు వద్దంటారు. దేవున్ని గౌరవించడములో నాలుగు రకముల కార్యములు చేయుట మంచిదే. అయితే ఖుర్ఆన్ గ్రంథములో దేవుడు తన ఆరాధనలను గురించి ఏమి చెప్పితే అది చేయడము మంచిది. మీరు చెప్పినవి నాలుగు విధానములు కాగా అందులో నమాజ్, జకాత్‌లను గురించి ఎటువంటి ప్రశ్నరాదు. అయితే రోజా, హజ్‌ను గురించి కొన్ని ధర్మసంశయములు గలవు. వాటిని వివరించుకొంటే ఇలా గలవు. ప్రతి దినము ఒక వ్యక్తి కూలిపని చేసి బ్రతుకుచున్నాడనుకొనుము. ప్రతి దినము కూలి పనిచేయకపోతే అతను అతని కుటుంబము బ్రతికేదే కష్టమగును. అతను కూలిపని చేయాలి అంటే శరీరమునకు బలముకావాలి. శరీరమునకు బలము కావాలంటే తప్పనిసరిగా మధ్యాహ్నము అన్నము తినాలి. మధ్యాహ్నము అన్నము తింటే సాయంకాలము వరకు పని చేయగలడు. సాయంకాలము వరకు బరువులు మోసే కూలివాడు రంజాన్ నెలలో ఉపవాసముంటే అతను పని చేయలేడు, బ్రతుకుతెరువు సాగదు. వాని బ్రతుకుతెరువు సాగాలంటే వాడు ఉపవాసము ఉండకూడదు. అలాంటివాడు ఏమి చేయాలనునది ప్రశ్నయగును. ఇది రంజాన్ నెలలో ఉపవాస కార్యమును గురించి వచ్చు సందేహముకాగా, ఇటువంటిదే హజ్‌ను (మక్కా యాత్రను) గురించి కలదు. కొన్ని గంటలు కూడా పనిని ఆపుకోకుండా చేయువాడు, ఒక రోజు పనిని ఆపితే రెండవరోజు కుటుంబమంతా తిండిలేక బాధపడవలసి వచ్చునని భయపడి ఉపవాస వ్రతము కూడా చేయలేక బ్రతుకువాడు హజ్‌యాత్రను చేయగలడా? ఏమాత్రము చేయలేడు. అయితే ఆ మనిషి దేవుని మీద పూర్తి విశ్వాసముతో యున్నాడు. దేవుని మీద ఎంతో విశ్వాసమున్న అతడు తాను రోజాను ఆచరించలేకపోయినందుకు మరియు హజ్ యాత్రను

చేయనందుకు పూర్తి బాధపడుచున్నాడు. తాను స్థోమత లేక ఉపవాసములు చేయక పోయినా, అట్లే హజ్‌యాత్ర చేయకపోయినా దేవుని మీద విశ్వాసము పూర్తియున్నది. అటువంటి వాడు దేవునిమార్గములో సక్రమముగా ఉన్నాడా? లేడా? యని చూస్తే కొందరు మనుషులు నాలుగు దేవుని ఆరాధనా విధానములలో రెండు చేసి, రెండు చేయకపోయినందుకు అతనిని సంపూర్ణ విశ్వాసి అనుటకు వీలులేదని చెప్పవచ్చును అని అంటున్నారు. మనుషులు ఎట్లు అనుకొన్నా అది లెక్కింపబడని విషయము. అయితే దేవుడు ఏమంటున్నాడో అదే లెక్కింపబడు విషయము. అందువలన దేవుడు అతని విషయములో ఏమంటున్నాడని చూస్తే రోజా విషయము, హజ్ విషయము రెండింటిని గురించి నేను మీతో ఎప్పుడయినా చెప్పానా! అని అడగడమేకాక అది మీ ఇష్టానుసారము స్థోమతయుండేవారు చేయవచ్చును. స్థోమత లేనివారు చేయకపోవచ్చును. తప్పనిసరిగా చేయమని నేను చెప్పలేదు. నేను నమాజ్, జకాత్ తప్పనిసరిగా చేయమని చెప్పాను అంటున్నాడు.

ఈ విషయమునకు సంబంధించి సూరా 31, ఆయత్ 4లో ఈ విధముగా చెప్పియున్నారు. **(31-4) "సద్వర్తనులయిన వారు నమాజును నెలకొల్పుతారు, జకాత్ ఇస్తూ ఉంటారు. పరలోకముపై పూర్తి విశ్వాసము కలిగియుంటారు."** ఇటువంటిదే మరొక ఆయత్‌ను గమనిద్దాము. సూరా 4, ఆయత్ 77లో ఈ విధముగాయున్నది చూడండి. **(4-77) "మీ చేతులను ఆపుకొని నమాజును నెలకొల్పుతూ ఉండండి. జకాతును చెల్లిస్తూ ఉండండి అని ఆదేశింపబడిన వారిని నీవు చూడలేదా?"** పై రెండు వాక్యములలో నమాజును గురించి, జకాతును గురించి దేవుడు చెప్పిన సమాచారము గలదు. ఇంకా నమాజును, జకాతును గురించి మరియొక చోట సూరా 5, ఆయత్ 12లో ఇలా కలదు చూడండి.

**(5-12) "ఇంకా అల్లాహ్ వారితో ఇలా అన్నాడు. "నిశ్చయముగా నేను మీకు తోడుగాయున్నాను. మీరు గనుక నమాజు నెలకొల్పుతూ యుంటే, జకాత్ ఇస్తూయుంటే, నా ప్రవక్తలను గౌరవించి వారికి సహాయపడితే, దేవునికి ఉత్తమ రుణాన్ని ఇస్తూవుంటే, నేను మీ చెడులను మీనుండి దూరము చేస్తాను."** మరియొకచోట ఇదే విషయమునే చెప్పుచూ సూరా 5, ఆయత్ 55లో ఈ విధముగా చెప్పారు చూడండి. **(5-55) "ఓ ముస్లిమ్‌లారా! వాస్తవానికి అల్లాహ్ ఆయన ప్రవక్త, ఇంకా నమాజును నెలకొల్పే, జకాతును చెల్లించే, రుకూ చేసే విశ్వాసులు మాత్రమే మీ స్నేహితులుగా ఉండాలి."** మరియొక చోట నమాజు, జకాతును గురించి ఈ విధముగా అంటున్నారు. సూరా 9, ఆయత్ 5లో ఇలా చెప్పారు చూడండి. **(9-5) "ఒకవేళ వారు పాశ్చాత్తాపపడి నమాజును నెలకొల్పితే, జకాతును విధిగా చెల్లిస్తే వారి మార్గాన వారిని వదలిపెట్టండి. నిశ్చయముగా దేవుడు క్షమించేవాడు, కరుణించే వాడు."** మరియొకచోట సూరా 9, ఆయత్ 11లో ఇలా కలదు చూడండి. **(9-11) "ఇప్పటికయినా వారు పాశ్చాత్తాపము చెంది నమాజ్‌ను నెలకొల్పుతూ, జకాత్‌ను విధిగా చెల్లించడము మొదలిడితే వారు మీ ధార్మిక సోదరులే. తెలిసిన వారి కోసము మేము మా ఆయతులను ఈ విధముగా విడమరచి చెప్పుతున్నాము."** ఇదే విషయమునే ఇదే ఖుర్ఆన్ గ్రంథమందే, ఇదే సూరాలో 18వ ఆయత్‌లో ఇలా చెప్పారు చూడండి. **(9-18) "అల్లాహ్‌ను అంతిమ దినమును విశ్వసిస్తూ, నమాజును నెలకొల్పుచూ, జకాత్‌ను విధిగా చెల్లిస్తూ అల్లాహ్‌కు తప్ప వేరొకరికి భయపడనివారు మాత్రమే దేవుని మస్జిద్‌ల నిర్వాహణకు తగినవారు, సన్మార్గము పొందినవారు**

**వారేనని చెప్పవచ్చును."** నమాజ్ మరియు జకాత్ విషయమును గురించి ఖుర్ఆన్ గ్రంథములో మరియొక చోట సూరా 9, ఆయత్ 71లో ఈ విధముగా చెప్పుచున్నారు చూడండి. **(9-71) "విశ్వాసులైన పురుషులూ, విశ్వాసులైన స్త్రీలు వారంతా ఒకరికొకరు మిత్రులుగా, సహాయకులుగా, చేదోడు వాదోడుగా ఉంటారు. వారు మంచిని గురించి ఆజ్ఞాపిస్తారు, చెడును గురించి వారిస్తారు. నమాజును నెలకొల్పుతారు, జకాతును చెల్లిస్తారు. అల్లాహ్‌కూ ఆయన ప్రవక్తకూ విధేయులై ఉంటారు. దేవుడు తన కారుణ్యాన్ని కురిపించేది వీరిపైనే. నిస్సందేహముగా దేవుడు సర్వాధిక్యుడు. వివేచనాశీలి."**

ఇక్కడ ఎనిమిది ఆయత్‌లను వ్రాశాము. ఎనిమిది ఆయత్‌లలోనూ నమాజ్, జకాత్ రెండూయున్నవి. ఎచ్చట జీవాత్మ ఉండునో అక్కడ ఆత్మ యున్నట్లు, జీవాత్మ ఆత్మ రెండూ జోడు ఆత్మలని పేరుగాంచినట్లు, ఎక్కడ నమాజ్ ఉండునో అక్కడ జకాత్ ఉండితీరవలసిందే. నమాజ్ జకాత్ రెండూ జంట ఆరాధనలని తెలియవలయును. ఈ రెండూ లేకుండా దేవుని ఆరాధన ఉండదు. ఏ మతములో అయినా ఈ రెండూ తప్పకయుండును. అక్కడ వేరే పేర్లతోయుండును. కనుక వారివారి మతములలో నమాజ్ జకాత్ రెండూ లేవని ఎవరూ అనుకోకూడదు. ప్రతి మతములోనూ రెండూ ఉన్నాయి. ఇస్లామ్ (ముస్లీమ్) మతములో దేవుని ఆరాధనలు నాలుగు విధములుగా ఉన్నాయని అవి నమాజ్, జకాత్ రెండూకాక, రోజా, హజ్ అను మరి రెండు ఉన్నాయని ముస్లీమ్‌ల నమ్మకము. అందులో ప్రతి సంవత్సరము రంజాన్ మాసమున ప్రతి ముస్లీమ్ విధిగా పగలుపూట ఏమీ తినకుండా ఉపవాసము పాటించడము కలదు. అయితే ఇక్కడ మనము ఖుర్ఆన్ గ్రంథమునుండి ఎనిమిది వాక్యములను

చెప్పుకొనినా వాటిలో నమాజ్, జకాత్ రెండు తప్ప ఎక్కడా రోజా (ఉపవాసములను) గురించిగానీ హజ్ (మక్కా యాత్ర) గురించిగానీ లేదు. దేవుడు జిబ్రయేల్ ద్వారా ఖుర్‌ఆన్‌ను చెప్పించినపుడు రోజాను గురించిగానీ, హజ్‌ను గురించిగానీ ఎక్కడా చెప్పలేదు. దీనినిబట్టి దేవుడు చెప్పిన ఆరాధనా క్రమములు రెండు మాత్రమేయనీ, అవియే నమాజ్, జకాత్‌యని ఈ రెండు తప్ప మిగతా రెండు మనుషులు చెప్పినవని తెలియుచున్నది. మనిషిలో క్రమశిక్షణ వచ్చుటకు ముస్లీమ్ పెద్దలు మిగతా రెండు విధానములను కల్పించారు తప్ప అవి దేవుడు చెప్పినవి కావని తెలియుచున్నది. దేవుడు చెప్పినవి తప్పక ఆచరించవలెనుగానీ, మనుషులు చెప్పినవి చేతకానప్పుడు ఆచరించక పోయినా ఫరవాలేదు.

మనిషికి ముఖ్యమైనవి నమాజ్, జకాత్ అని తెలుసుకొన్నాము. అయితే ఖుర్‌ఆన్‌లోని ప్రతి విషయము భగవద్గీతలోనిదేయని ఖుర్‌ఆన్‌కు మాతృగ్రంథము భగవద్గీతయని ముందు మనము చెప్పుకొన్నాము. అట్లయినప్పుడు నమాజ్, జకాత్ భగవద్గీతలో లేవేయని కొందరు అడుగ వచ్చును. దానికి మా సమాధానము ఏమనగా! **నమాజ్ అంటే దేవుని ఆరాధనయనీ, జకాత్ అంటే దేవునిసేవయనీ** అర్థము చేసుకొంటే ఈ రెండూ భగవద్గీతలోయున్నాయని తెలియగలవు. భగవద్గీతలో భక్తియోగ మందు 8వ శ్లోకమును తర్వాత 10వ శ్లోకమును చూడండి.

8వ శ్లోకము : మయ్యేవ మన ఆధత్స్వమయి బుద్ధిం నివేశయ ।
నివసిష్యసి మయ్యేవ అత ఊర్ధ్వం నసంశయః ॥

10వ శ్లోకము : అభ్యాసే ప్యసమర్థోసి మత్కర్మ పరమోభవ ।
మదర్థమపి కర్మాణి కుర్వన్ సిద్ధి మవాప్స్యసి ॥

**(8) భావము :-** నాయందే మనస్సునుంచి ఎల్లప్పుడూ నన్నే తలంచు చుండుము. నాయందే బుద్ధినుంచుము. ఆ తర్వాత నన్నే పొంది నాయందే నిలుతువు. ఈ విషయములో అనుమానము లేదు. పరమాత్మ అంశ అయిన ఆత్మమీదనే మనోధ్యాసనుంచవలెను. ఆత్మయోచన తప్ప వేరు యోచన బుద్ధికి లేకుండా చేయవలెను. మనోబుద్ధులకు ఇంద్రియ ధ్యాసలు లేనిదానివలన తదుపరి పరమాత్మనే పొంది, పరమాత్మయందే నిలుతువు.

**(10) భావము :-** మనస్సు నిలుపు అభ్యాసమునకు అసమర్థునివైతే, నా పనులు చేయుము. నా సేవ చేయుట వలన మోక్షమును పొందవచ్చును. ఎంత సాధన చేసినప్పటికీ మనస్సు నిలువక ప్రాపంచిక విషయముల మీదికే పోవుచున్నట్లయితే, ఇక సాధన చేతకాదనిపించితే, ఆ సాధనని వదలి వేసి పరమాత్మ పనులయిన ధర్మప్రచార కార్యములు చేయుము. అట్లు చేయట దేవుని సేవ చేసినట్లగును. అలా దేవుని సేవ చేయుట వలన ముక్తి పొందవచ్చును. దేవుని మీద మనస్సునుంచడము నమాజ్ అగుచున్నది. దేవుని సేవ చేయడము జకాత్ అగుచున్నది. దేవుని ఆరాధన ఎక్కడయున్నదో అక్కడ దేవుని సేవయుండునని భగవద్గీతలో కూడా కలదు. ఆరాధన చేయుటకు చేతకాని సమయములో దేవుని సేవ చేయమని భగవద్గీతయందు భక్తియోగములో కలదు. అందువలన నమాజ్, జకాత్ రెండూ భగవద్గీతలోయున్నవని చెప్పవచ్చును.

భగవద్గీతలో చెప్పిన ఆరాధనలు మూడు గలవు. అందులో గీతయందు ఎక్కువగా చెప్పినవి రెండు మాత్రమే. ఆ రెండిటిలో ఒకటి కర్మయోగము, రెండు బ్రహ్మయోగము. ఈ మూడు యోగములలో కూడా దేవునియందు ఐక్యమైపోవుటకు ఆత్మ సహాయమును కోరుచున్నాము. దేవుడు అన్నిటికీ అతీతుడుగాయుంటూ కేవలము సాక్షిగానే యుండుట

వలన అన్ని కార్యములను ఆత్మే చేయుట వలన యోగము అను ఆరాధనలలో ఆత్మ సహాయమును అర్థించుచున్నాము. ఆత్మ దేవునికి జీవునికి మధ్యవర్తి లాగాయుండి జీవుడు దేవునియందు చేర్చుటకు ఉపయోగపడుచున్నది. మధ్యవర్తిగాయున్న ఆత్మను జీవాత్మ దేవునియందు చేర్చమని అర్థించడమును మూడు యోగములుగా చెప్పారు. పేరు వేరయినా గీతలో యోగమనినా, ఖుర్ఆన్‌లో నమాజ్ అనినా రెండిటి యొక్క ఉద్దేశ్యము ఒక్కటే. నేరుగా ఎవరూ దేవున్ని ప్రార్థన చేయలేరు. ఎవరి ప్రార్థనను అయినా మొదట ఆత్మ స్వీకరించి తర్వాత ఆత్మే దేవునివద్దకు చేర్చును. ఏ మనిషి ప్రార్థన చేసినా అది శరీరములోని ఆత్మకే చెందుచున్నది. శరీరములో జరుగు ప్రార్థనను స్వీకరించిన ఆత్మ అతని ఉద్దేశ్యమునుబట్టి దేవునియందు జీవున్ని చేర్చగలదు. అయితే దేవున్ని ప్రార్థించువారందరూ దేవునియందు ఐక్యము కావాలని, మోక్షము రావాలని ప్రార్థన చేయడము లేదు. ప్రపంచ కోర్కెలకు కూడా ప్రార్థన చేయుచున్నారు. ఎవరు ఏ విధమయిన సహాయమును కోరి ప్రార్థన చేయుచున్నారో ఆత్మ ఆ విధమైన సహాయమును చేయుచున్నది.

గ్రంథములను చదివి దైవజ్ఞానమును తెలిసినవారు మోక్షము కొరకు ప్రార్థన చేయుదురు. అజ్ఞానులయినవారు ఒకవేళ దేవున్ని ప్రార్థించినా వారు ప్రపంచ సుఖముల కొరకే ప్రార్థన చేయుదురు. ఎవరు ఏ ప్రార్థన చేసినది శరీరములోనున్న ఆత్మకు తెలియుట వలన ఆత్మ తన సహాయమును ఎలా అందించాలో నిర్ణయించుకొని అదే విధముగా తన సహాయమును జీవునకు అందించును. జీవునకు సహాయమును అందించు కార్యమును ఆత్మ చేయుచుండుట వలన ఆత్మను కొన్ని సందర్భములలో స్నేహితుడు అని అన్నారు. జీవునికి స్నేహితునిగాయున్న ఆత్మ స్నేహితుని పాత్రనేకాక శత్రువుపాత్రను కూడా పోషించుచున్నది. సమయమునుబట్టి, సందర్భమును

బట్టి శరీరములోని ఆత్మ జీవుని ఎడల ప్రవర్తించుచుండును. ఒక ముస్లీమ్ నమాజ్ చేయునప్పుడుగానీ, ఒక హిందువు యోగమును ఆచరించునప్పుడు గానీ, ఆత్మయే దానిని స్వీకరించి తగిన సహాయము చేయును. ఈ విషయమును గురించి ఖుర్ఆన్ గ్రంథములో సూరా2, ఆయత్ 45లో ఈ విధముగా వ్రాసియున్నారు చూడండి. **(2-45) "మీరు ఓర్పు ద్వారా, నమాజు ద్వారా సహాయము అర్థించండి. నిశ్చయముగా అది కష్టమైన పనే. కానీ అల్లాహ్ (దేవునికి) భయపడే వారికి ఇది సులభమైన పనే."** జ్ఞానమును కలిగి ప్రార్థన చేయువారికి వారి ప్రార్థన సులభమేగానీ, జ్ఞానము తెలియకపోతే ప్రార్థన చేయడము కష్టమేయగును. ప్రార్థన ఎలా చేయాలో తెలియదు, సహాయకుడినుంచి సహాయమును ఎలా అర్థించాలో తెలియదు. మరియొక ఆయత్‌లో ఇలా కలదు. **(2-153) " ఓ విశ్వాసులారా! సహనము మరియు నమాజు ద్వారా సహాయము అర్థించండి. దేవుడు సహనము పాటించే వారికి తోడుగా ఉంటాడు."** ప్రార్థన ద్వారా సహాయమును అడుగుట చేసినా అది సహాయకుడైన ఆత్మద్వారానే సహాయము అందాలి.

శరీరములో ఆత్మ ఎల్లప్పుడూ జీవునికి తోడైయుండుట వలన ఆత్మను సహచరుడు అనియూ లేక సహవాసి అనియూ అనడము జరుగుతా యున్నది. సహవాసి అని అనడమేకాక స్నేహితుడు అని కూడా ఆత్మను అనడము జరుగుతాయున్నది. జీవునికి తోడుగాయుండుట వలన సహవాసి అయినప్పుడు, జీవునికి దగ్గరగాయుండి శ్వాసను నడిపించి, అనేక కార్యములు చేసి జీవుడు శరీరములో బ్రతుకుటకు సహకరించుట వలన ఆత్మను స్నేహితుడు అనికూడా అనుచున్నాము. దగ్గరగాయుండువాడు అయినందున ఆత్మను స్నేహముగలవాడు అని అంటున్నాము. అట్లే

హితము చేయుట వలన స్నేహితుడు అని అంటున్నాము. స్నేహితుడు అనగా దగ్గరగాయుండి హితము చేయువాడని అర్థము. శరీరములో జీవునికి ఆత్మ పరమాత్మ ఇద్దరూ దగ్గరేయుండువారయినా పరమాత్మ ఏమీ చేయడు కావున ఆయనను సాక్షియని ఆత్మను స్నేహితుడు అని అంటున్నాము.

సర్వమునూ సృష్ఠించినవాడు దేవుడే. అయితే సర్వమునూ నడుపువానిగా దేవుడు ఆత్మను నియమించాడు. దేవునిలోని భాగమయిన జీవుడు భూమిమీద జీవితమును సాగించుటకు దేవునిలో మరొక భాగమయిన ఆత్మను నియమించి తాను ఏమీ చేయక ఊరకనే దేవుడు ఉంటూ అన్నిటినీ చూస్తున్నాడు. దేవుడు ఏమీ చేయడు. ఆత్మ ఏ కార్యమునూ వదలడు. అయితే జీవుడు నేను తప్ప చేసేవాడే లేడు అని అంటాడు. దేవుడు తాను చేయనని అంటే జీవుడు చేస్తున్నాను అని అంటున్నాడు. వాస్తవానికి చేసేవాడు ఆత్మ ఒక్కడే. చేసేది ఆత్మే అయినా, చూసేది పరమాత్మే అయినా చేయకున్నా చేసేది నేనేయని జీవుడు అంటున్నా సర్వులు పరమాత్మ ఆధీనములోనేయున్నారు. జీవులు అంటే మనుషులు ఒక్కరేకాదు, దేవతలుగాయున్నవారూ, దయ్యములుగాయున్నవారూ అందరూ జీవుళ్ళే. ఖుర్ఆన్‌లో జిన్నులు, జిన్నాతులు అను గ్రామదేవతలలాంటి వారు కూడా జీవులే. సమస్త జీవరాశులు దేవుని ఆధీనములోనే ఉన్నాయి. అందువలన జీవము గల సమస్త ప్రాణులు దైవాధీనములోని వారేనని చెప్పవచ్చును. ఇదే విషయమునే ఖుర్ఆన్ గ్రంథములో సూరా 10, ఆయత్ 66లో ఇలా వ్రాసియున్నారు. **(10-66) "ఆకాశములో భూమిలో ఉన్నవారందరూ అల్లా వారేనన్న సంగతి బాగా తెలుసుకోండి. అల్లాహ్‌ను వదలి ఇతరత్రా భాగస్వాములను పూజించేవారు దేన్ని అనుసరిస్తున్నట్లు? వారు నిరాధారమైన ఊహలను అనుసరిస్తున్నారు. వారు**

**అంచనాలపై ఆధారపడుచున్నారు."** ఆకాశములోనూ, భూమిలోను ఉన్నవారంతా అనగా భూమిమీద కొందరు దేవతలు, ఆకాశములో కొందరు దేవతలుగా యున్నవారు అని అర్థము. అంతేకాక ఆకాశములో రోగక్రిములుగాయున్న జీవులని కూడా అర్థము. అంతేకాక భూమిలోపల యున్న క్రిమి కీటకాదులని కూడా అర్థము. సమస్త జీవరాసులకు దేవుడే పెద్ద. ఆయనను మించినవారు ఎవరూ లేరు. అటువంటప్పుడు జీవులుగాయున్న వారిని ఏదో అంచనాతో దేవుళ్ళుగా దేవునిగా భావించి పూజించితే ఖరీదయిన రత్నమును చిన్నదని వదలి, తక్కువ విలువయున్న గుమ్మడికాయను పెద్దదని కోరుకున్నట్లు ఎంతో విలువైన కనిపించని దేవున్ని వదలి, విలువతక్కువ లేక విలువలేని కనిపించే దేవతలను దేవుడని భావించడము తప్పగును. గ్రహములకు, విగ్రహములను, భూతములకు, మహాభూతములను సృష్ఠించిన దేవున్ని వదలి కనీసము గడ్డిపోచను కూడా సృష్ఠించని గ్రహములను, భూతములను పూజించడము కలెక్టర్‌ను వదలి బంట్రోతుకు (బిళ్ళ జమీందారుకు) నమస్కరించినట్లుంటుది. అటువంటి పొరపాట్లు చేయవద్దని పై వాక్యములో చెప్పారు.

దేవుడు ఖుర్‌ఆన్ గ్రంథములో ఎన్నో సూక్ష్మ విషయములను చెప్పి అవి మానవులకు తెలియవని కూడా చెప్పాడు. దేవునికి మాత్రమే తెలుసునని కూడా చెప్పాడు. దేవునికి తెలిసినప్పుడు అవి మనిషికి దేవుడు తెలుపాలి. అలా తెలుపకపోతే ఆ విషయ భావములు మనిషికి చేరకుండా నిరర్థకమై పోవును. అందువలన ఎటు తిరిగీ మనిషికి సూక్ష్మ విషయములను దేవుడు తెలిపేతీరాలి. తెలుపకపోతే అవివున్నాయి అని చెప్పడము కూడా అనవసరమేయగును. మనిషికి తెలియని ఎన్నో సూక్ష్మ విషయములను ఖుర్‌ఆన్ గ్రంథములో చెప్పి అవసరమునుబట్టి ఆసక్తియున్నవారికి

అప్పుడప్పుడు తెలియజేస్తూ వచ్చాడు. ఆయన ఎలాగయినా తెలియజేయ గలడు. దేవుడు మనిషిలోని మేధస్సును సృష్టించినవాడు. ఆయన మేధస్సును ఆయనే సృష్టించుకొన్నాడు. ఆయన మేధస్సు (బుద్ధి కుశలత) ఎట్లుండునో ఎవరికీ తెలియదు. ఆయన తన మేధస్సునుపయోగించి ఎలా మానవులకు సూక్ష్మ విషయములను తెలుపునో ఎవరికీ అర్థముకాదు. మనకు అర్థమయినా, కాకపోయినా మనకు తెలియకుండానే తెలియని నిగూఢమైన విషయములను తెల్పుచున్నాడు. అయినా వాటిని ఏదో సాకు చూపి కొందరికి అవి అర్థము కాకుండా చేయుచున్నాడు. నిగూఢమైన విషయములను ఎవరు చెప్పినా వినవద్దండి! అవి దేవునికి మాత్రమే తెలుసు అని వారిచేత చెప్పించి వారినే వినకుండా చేయుచున్నాడు. దేవుడు చెప్పిన నిగూఢమైన విషయములు ఎప్పుడో ఒకప్పుడు, ఎక్కడో ఒకచోట తెలియునను ధ్యాసను వారికి లేకుండా చేసి, కొన్ని జ్ఞానవిషయములకు కొందరిని శాశ్వతముగా దూరమున్నట్లు చేశాడు. నిగూఢమైన విషయములు దేవునికి తప్ప ఇతరులకు తెలియవు అని దేవుడే చెప్పి, బుద్ధి శ్రద్ధయున్న వారు గ్రహించగలరు అని కూడా దేవుడు చెప్పాడని మరచిపోయారు.

దేవుడు ఆ విషయములను చెప్పకపోతే వాటిని ఖుర్ఆన్ గ్రంథములో చెప్పి ఏమి ప్రయోజనము? అని ఎంతమాత్రము ఆలోచించ లేకపోయారు. ఇప్పుడు మనము ఆలోచించితే ఏ విషయమునూ మనిషి స్వయముగా చెప్పలేడు. దేవుడు తన మూడు పద్ధతుల ద్వారా తన జ్ఞానమును పూర్తిగా మానవులకు తెలియజేయును అని నమ్ముచున్నారు. దేవుడు ఎవరితోనూ ప్రత్యక్షముగా మాట్లాడకున్నా పరోక్షముగా మనిషికి తన జ్ఞానమును తెలియజేయగలడు. అట్లు గతములో ఎన్నో రహస్య విషయములను తెలియజేయడము జరిగినది. మనిషి నిగూఢమైన

దైవజ్ఞానమును తెలియగలిగినా దేవుడు తనవరకు ఎలా తెలియజేశాడో తెలియని స్థితిలో ఉన్నాడు. ఖుర్ఆన్ గ్రంథములో ఎన్నో నిగూఢమైన ఆయత్‌లను చెప్పడమేకాక అవి తెలియుటకు కష్టమైనవని వాక్యము చివరిలో కొంతయినా గుర్తు చేసియుండును. అయితే ఆ వాక్యములు మీకు అవసరము లేదని చెప్పాడా, లేదు కదా! అవి అవసరమైనవనే గ్రంథములో చెప్పారు. గ్రంథములో చెప్పిన నిగూఢమైన విషయములను తెలియుటకు కూడా అవకాశమిచ్చాడు, తెలియజేశాడు. అయితే తెలివితక్కువ మనిషి కొన్నిటిని విశ్వసించలేకపోవుచున్నాడు. అటువంటి దేవుడు చెప్పిన నిగూఢమైన వాక్యమును ఖుర్ఆన్ గ్రంథములో సూరా 10, ఆయత్ 6లో ఉన్నదానిని చూస్తాము. **(10-6) "నిస్సందేహముగా భూమి, ఆకాశము లలో దేవుడు సృష్టించిన వస్తువులన్నిటిలోనూ రేయింబగళ్ళు ఒకదాని తర్వాత ఒకటి రావడము జరుగుచున్నది. దైవభీతిగలవారికి ఇందులో సూచనలు ఉన్నాయి."** ఈ వాక్యము సామాన్యముగా ఎవరికీ సులభముగా అర్థముకాదు. ఎందుకనగా! ఇది దేవుడు చెప్పిన సూక్ష్మమైన జ్ఞానముతో కూడుకొన్నదై యున్నది. సూక్ష్మజ్ఞానము దేవునికి తప్ప ఏ మనిషికీ తెలియదను మాట వాస్తవము. అలాగే ఏ మనిషికీ అది అర్థమయ్యేస్థితిలో లేదు. అందువలన తప్పనిసరిగా దేవుడు మనిషికి ఈ విషయమును ఎప్పుడో ఒకప్పుడు ఏదో ఒక విధముగా తెలియజేయును. అలా తెలియజేసిన విషయమునే ఇక్కడ వ్రాయడము జరిగినది, జాగ్రత్తగా బుద్ధిని ఉపయోగించి చూడండి. ఇక్కడ వాక్యము చివరిలో దైవభీతిగల వారికి ఇందులో సూచనలు ఉన్నాయని ప్రత్యేకముగా చెప్పారు. అందువలన వాక్యములో భూమి ఆకాశము ఉంటే పైకి భూమి ఆకాశమని చెప్పినా అవి భూమి ఆకాశములు కావని తెలియాలి. వాక్యములో సూక్ష్మవిషయముల

పోలిక మాత్రముండును. కావున భూమి ఆకాశము అంటే అలాగే అర్థము చేసుకోకూడదు. చెప్పిన దానిని చెప్పినట్లు అర్థము చేసుకొంటే ఆ వాక్యములో సూక్ష్మత ఏమీ లేనట్లగును. అందువలన భూమి, ఆకాశమునకు గుర్తుగా (అర్థముగా) క్రింద పాదములు మొదలుకొని పైన తల వరకూ శరీరమును తీసుకోవలెను. భూమి, ఆకాశములలో దేవుడు సృష్ఠించిన అను వాక్యమునకు శరీరములో సృష్ఠించబడిన అనియూ, వస్తువులన్నిటినీ అనగా శరీర భాగములన్నిటినీ అని తెలియవలెను.

క్రింద పాదములు భూమిమీద మోయుట వలన వాక్యములో భూమి అంటూనే శరీరములోని పాదములు జ్ఞాపకము రావలెను. అట్లే ఆకాశము అంటూనే పై భాగమున ఆకాశములోయున్న తల జ్ఞాపకము రావలెను. కాళ్ళు మొదలుకొని తలవరకున్న శరీరమును చెప్పునప్పుడు భూమ్యాకాశములు అనడము జరిగినది. అందులోని సమస్త వస్తువులు అనగా శరీరములోని 24 భాగములని అర్థము చేసుకోవలెను. మొత్తము మీద దేనినో చెప్పుటకు, దేనినో చెప్పుటవలన, ఆ ఉద్దేశ్యము ఎవరికీ తెలియకపోవడము వలన అది సూక్ష్మమైన వాక్యమయినది. ఈ వాక్యములో రేయింబగళ్ళు రావడము అని కూడా చెప్పారు. రేయింబగళ్ళు అనగా ఏమిటి? అని ఆలోచిస్తే రాత్రిపూట మనిషికి మరుపు జరుగుచున్నది. పగలు పూట ఎరుక రావడము జరుగుచున్నది. అనగా రాత్రిపూట నిద్రలో అన్నీ కోల్పోయి, ఏమీ తెలియని స్థితిలోనికి చేరిపోయిన మనిషి, పగలుపూట మెలకువలో అన్నిటియందూ ఎరుక కలిగి అన్ని అవయవములు పనిచేయు స్థితిలో ఉండును. నిద్రలో మరుపుతో సమానమైనది మరణము. అలాగే మెలకువలో ఎరుకతో సమానమైనది జననము. అందువలన రాత్రింబ గళ్ళు అనగానే జనన మరణములని తెలియవలెను. మొత్తము మీద ఈ

వాక్యములో శరీరము మరియు దానిలోపలి 24 భాగములకు మరణము వర్తించుచున్నది. అలాగే 24 భాగములకూ జననము వర్తించుచున్నదని తెలియుచున్నది. రేయింబగళ్ళు అను పదమునకు జననమరణములని అర్థమయినది కదా! ఇకపోతే ఈ వాక్యములోని ముఖ్యమైన సమాచారము ఒకే పదములో కలదు. అదియే రేయింబగళ్ళు ఒకదాని తర్వాత ఒకటి వస్తున్నవి అని చెప్పడమే విశేషము. విశేషమేమనగా! మనిషికిగానీ లేక ఏ రూపములోయున్న జీవరాశికిగానీ, చావుపుట్టుకలు ఒకదాని తర్వాత ఒకటి వస్తున్నవని చెప్పడమే ముఖ్యమైన సారాంశముగాయున్నది. మనిషికి జనన మరణములున్నవని ఖుర్‌ఆన్ గ్రంథములో ఎన్నో సూరాలలో, ఎన్నో ఆయత్‌లలో, ఎన్నో విధములుగా చెప్పియున్నారు. అయినా ముస్లీమ్ సమాజములో మనిషి ఒకమారే పుట్టి ఒకమారే చనిపోతాడు. తర్వాత పుట్టడముగానీ, గిట్టడముగానీ లేదు అను భావము పూర్తిగా ప్రాకిపోయినది. జిబ్రయేల్ ద్వారా దేవుడు ఎంతో ఉన్నతమైన జ్ఞానమును ముహమ్మద్ ప్రవక్తగారికి చెప్పించడము జరిగినది. ఆయన అదే జ్ఞానమునే తన సహచరులకు చెప్పి వినిపించడము జరిగినది. అంతవరకూ జరిగిన దానిలో జిబ్రయేల్ మహాజ్ఞాని అయినందున, దేవుని జ్ఞానమును సంపూర్ణముగా తెలిసినవాడు అయినందున, ఖుర్‌ఆన్ గ్రంథమును బోధించినవాడు ఆయనే అయినందున అక్కడ ఆయన చెప్పిన విషయములనే ఇక్కడ చెప్పుచున్నాము. అయితే ఎక్కడ ఏ పొరపాటు జరిగినదో తెలియదుగానీ, జిబ్రయేల్ చెప్పిన జ్ఞానము ఈనాడు ఆయన చెప్పిన ఉద్దేశ్యమునకు వ్యతిరేఖముగా ప్రచారమయి పోయినది. ఒకదాని తర్వాత ఒకటి జననము మరణము రాత్రింబగళ్ళు వచ్చినట్లు వస్తున్నాయి అని చెప్పినా, దానిని వదలి నేడు తప్పు భావము లోనికి పోయి దేవుని

జ్ఞానమునకు దూరముగా యున్నారు. ఇది సత్యము, ఇది అసత్యము అని చెప్పినా వినని స్థితిలో నేడు ముస్లీమ్‌లు చాలామంది యున్నారు. వారిలో దేవుడు ఒక్కడేయని ఒక్కనినే ఆరాధించు సుగుణము తప్ప జ్ఞానములో ఎంతో వెనుకబడియున్నారు. దేవుడిచ్చిన ఖుర్ఆన్ గ్రంథమును అర్థముకాని భాషలో చదివి, అర్థముకాని స్థితిలో ఉండుట వలన దేవుని విషయములో మోసపోవుచున్నారు. ఇప్పటికయినా పై వాక్యములోని భావమును అర్థము చేసుకోగలరని ఆశిస్తున్నాము.

మనుషులలో ఉన్న భావమునకు ఖుర్ఆన్‌లోని భావము వేరుగా కనిపించినప్పుడు, కొందరు ఈ ఖుర్ఆన్ మాకు సరిపోలేదు, మాకు సరిపోయే విధముగానయినా చెప్పండి లేకపోతే దీనిని మార్చి వ్రాసి అయినా చెప్పండి అని అడుగుతారు. అయితే దేవుని జ్ఞానము ఇదే అని తెలిసిన తర్వాత అజ్ఞానులకు అనుకూలముగా ఎట్టి పరిస్థితిలోనూ జ్ఞానము మార్చి చెప్పబడదు. దేవుని జ్ఞానము శాసనములతో కూడుకొన్నది, శాశ్వతమైనది, శాపమైనది. అది జరిగితీరునదేగానీ, మార్చబడునది కాదు. అందువలన అజ్ఞానులకు అనుకూలముగా జ్ఞానము మార్చబడదుగానీ, జ్ఞానమునకు అనుకూలముగా అజ్ఞానులే మారాలి. ఎందుకనగా! దేనినయినా ముద్రించు నది ముద్రగానీ, మొద్దుపోవునది ముద్ర కాదు. ముద్రించు ముద్ర నాణ్యమైన ఉక్కుతో తయారు చేయబడివుండును. ముద్రించబడునవి మిగతా మొత్తని లోహములతో చేయబడియుండును. అందువలన ముద్రరూపము లోహము మీదపడునుగానీ, లోహము రూపము ముద్రమీద పడదు. అలాగే దేవుని జ్ఞానము అజ్ఞాని మీద ముద్రింపపడుటకే యున్నదిగానీ, అజ్ఞాని యొక్క అజ్ఞానము దేవుని జ్ఞానమును మార్చలేదు. అగ్ని కట్టెలను కాల్చగలదు గానీ, కట్టెలు అగ్నిని ఆర్పలేవు. పెట్రోలు ఆవిరియై ఆకాశములో కలిసి

పోగలదుగానీ, ఆకాశము పెట్రోలులో కలిసిపోయి పెట్రోలు పరిమాణము పెరగదు. ఆవిరియైపోవు పెట్రోలు పరిమాణము తగ్గిపోవలసిందేగానీ, పెట్రోలు ఆకాశమును కలుపుకోలేదు. తన పరిమాణమును పెంచుకోలేదు. అట్లే జ్ఞానము అజ్ఞానములోనికి ఎక్కవలసిందేగానీ, అజ్ఞానము జ్ఞానములోనికి ఎక్కదు. అదే విధముగా ఎవరు ఏమనుకొనినా ఖుర్‌ఆన్ భావములు మారవు అని చెప్పుచూ సూరా 10, ఆయత్ 15లో ఈ విధముగా వ్రాశారు చూడండి. **(10-15) "వారి ముందు స్పష్టమైన మా వాక్యములను చదివి వినిపించినప్పుడు మా వాక్య భావములను ఏకీభవించలేక, మా మీద నమ్మకము లేనివారు "ఇది తప్పు వేరొక ఖుర్‌ఆన్‌ను తీసుకురా, లేదా ఇందులో కొంత సవరణ చెయ్యి" అంటారు. "(ఓ ప్రవక్తా!) వారికి చెప్పు నా తరఫున ఇందులో సవరణ చేసే అధికారము నాకేమాత్రము లేదు. నావద్దకు వాణి పంపబడే దానిని నేను ఉన్నది ఉన్నట్లు అనుసరించేవాడిని మాత్రమే! ఒకవేళ నేను గనుక నా ప్రభువు పట్ల అవిధేయతకు పాల్పడినట్లయితే ఒక మహాదినమున విధించబడే శిక్షకు భయపడుచున్నాను."** ఈ వాక్యమును ఎవరు చదివినా దేవుని జ్ఞానము మారునది కాదని తెలిసిపోగలదు.

మేము ఖుర్‌ఆన్ గ్రంథము ఒక మహోన్నతమైన దేవుని జ్ఞానమని ఎవరయినా మారవచ్చునుగానీ, అది శాశ్వతముగా ఉండునదనీ, అది మారునది కాదనీ చెప్పాము. అంతేకాక దైవజ్ఞానములో శక్తి ఇమిడి యున్నది. దానిని ఎవరు ప్రయత్నము చేసినా మార్చలేరు, అజ్ఞానుల పాలిట అది ఒక శక్తియని మేము చెప్పుచున్నాము. అంతేకాక ఖుర్‌ఆన్ గౌరవప్రదమైనదని 56వ సూరాలో చెప్పారు. అంతేగాక అందరికీ జ్ఞాన సందేశము అని 14వ సూరాలో చెప్పారు. ఇదంతయూ వినిన తర్వాత

ఖుర్‌ఆన్‌లోని జ్ఞానమునూ దాని గొప్పతనమునూ జీర్ణించుకోలేక, అదియొక మంత్రజాలము, దానిని చదివిన వారంతా దానికి వశమైపోతారు. ఎవరు చదివినా ఎంతటి నాస్తికవాది చదివినా, ఎంతటి హేతువాది చదివినా వారు కూడా అదే నిజమని దానివెంట పోతారు. అందులో ఏదో మంత్రశక్తి యున్నదని కొందరు అనడమేకాక, మిగతావారిని దానిని చదవద్దండనీ చదివితే మీరు కూడా మారిపోతారు, అందులో ఏదో మంత్రశక్తి యున్నదనీ అనడము కూడా జరుగుచున్నది. అదే విషయమునే సూరా 10, ఆయత్ 76, 77లలో ఈ విధముగా చెప్పారు చూడండి. **(10-76) "మావద్ద నుండి వారికి సత్యమైన నిదర్శనముగా జ్ఞానమువచ్చినప్పటికీ, వారు ఇది పచ్చిమంత్రజాలము అన్నారు." (10-77) "ఏమిటి? సత్యముతో కూడుకొన్న నిదర్శనము మీవద్దకు వచ్చిన తరువాత దానిని గురించి ఇలాంటి మాటలను అంటారా? ఇది మంత్రజాలమా? మంత్ర జాలము చేసేవారు సఫలీకృతులు కాలేరు అని మూసా చెప్పారు."** ఒక వాక్యము ఒక అజ్ఞానికి వ్యతిరేఖముగా కనిపిస్తే, దానిలో ఏదో లోపమున్నదనియే చెప్పునుగానీ, దానిని సమర్థించడు కదా! అట్లే దేవుని జ్ఞానమును కొందరు అజ్ఞానులు జీర్ణించుకోలేక దానిని మంత్రజాలమన్నారు. ఒక గురువు దగ్గరికి పదిమంది శిష్యులు చేరితే గురువు చెప్పే జ్ఞానము వారికి నచ్చక జ్ఞానమును అంతలోతుగా చెప్పితే ఎలాగని కొందరు, అంత గాఢముగా చెప్పితే ఎలాగని కొందరు, అంత కఠినముగా ఉన్నదున్నట్లు చెప్పితే ఎలాగని కొందరు చెప్పి కొద్దిగా మార్చి చెప్పమన్నారట. అప్పుడు గురువు అలా చెప్పుటకు వీలుపడదని జ్ఞానమును మార్చుటకు నాచేతకాదని చెప్పితే, ఆ గురువువద్దవున్న జ్ఞానమును నచ్చనివారు గురువు మీద ఏదో ఒకసాకు చెప్పి ఆయనవద్దకు రావడమును మానేశారు. ఒక శిష్యున్ని ఇతరులు

ఎందుకు నీవు గురువువద్దకు పోవడమును మానేశావు? అంటే శిష్యుడు ఇలా చెప్పాడు. "గురువుకు మెల్లకన్ను ఉన్నది, ఆయన ఖచ్చితముగా ఎటువైపు చూచేది తెలియదు. అందువలన నేను పోవడములేదు" అన్నాడట. మరియొకనిని అడిగితే "గురువు గంటకొకమారు మూత్రము పోయుటకు పోతాడు అది నాకు నచ్చులేదు" అని అన్నాడట. మరియొక శిష్యున్ని అడిగితే "ఆయన అంతాసరేగానీ గోసిపంచ కట్టుకోకుండా, అడ్డపంచ కట్టు కుంటాడు అది సరిపోలేదు" అని అన్నాడట. మరియొకనిని నీవు ఎందుకు గురువువద్దకు పోకుండా మానుకొన్నావు అంటే "ఆయన జ్ఞానము చెప్పేటప్పుడు నవ్వుతూ చెప్పుతాడు, జ్ఞానము చెప్పేటప్పుడు ఎంత భీకరముగా ఉండాలో అట్లు లేదు అందుకే నేను పోవడము లేదు" అన్నాడట.

ఈ విధముగా ఒక్కొక్కరు ఒక్కో విధముగా చెప్పారట. అందరి మాటలు విన్న ఒకడు అంతకూ ఆయన ఏమి చెప్పుచున్నాడని అందరినీ అడిగాడు. అప్పుడు "ఆయన జ్ఞానమునే చెప్పుచున్నాడు. అయినా అది మాకు సరిపోలేదు" అన్నారట. ఈ విధముగా దేవునిజ్ఞానము అర్థము కానివారు 'అందని ద్రాక్ష పుల్లన యని' అన్నట్లు, అర్థము చేసుకొను స్థోమత లేక, గురువు చెప్పు జ్ఞానమును అందుకోలేక, గురువుగారినే తప్పుపట్టినట్లు గ్రంథములోని జ్ఞానమును గ్రహించుకోలేనివారు దానిని మంత్రజాలము అన్నారు. దేవుని జ్ఞానమును అగౌరవముగా మాట్లాడితే దేవుని పాలకులు కాచుకొని ఎప్పుడో ఒకప్పుడు సమయస్ఫూర్తిగా శిక్షించుతారని మరువ కూడదు. అయితే ఖుర్ఆన్ గ్రంథమును చదివినవారు దానిని ఆరోపిస్తూ మంత్రజాలము, అదొక మాయాజాలము అని అనగా, అందులో కొందరు ఖుర్ఆన్ గ్రంథములోని జ్ఞానమును అర్థము చేసుకొన్నవారు ఖుర్ఆన్‌లో దేవుని జ్ఞానము ఉన్నతముగాయున్నదని చెప్పుచున్నారు. అది ఒక మాయాజలము, మంత్రజాలము అనినవారు ఒక వర్గముకాగా, అదియొక

గొప్ప జ్ఞాననిధియని చెప్పినవారు మరియొక వర్గముగా చీలిపోయారు. ఈ విధముగా దేవుని జ్ఞాన విషయములో మనుషులు విభేదించుకొని చీలిపోయి వున్నారనుట వాస్తవమే. ఎందుకనగా! ఇదే విషయమునే ఇదే గ్రంథమందు సూరా 10, ఆయత్ 19లో ఈ విధముగా చెప్పారు. **(10-19) "మొదటిలో జనులంతా ఒకే సంఘముగా ఉండే వారు. తర్వాత వారు విభేదించుకొన్నారు. నీ ప్రభువు తరఫునుండి ముందుగానే ఈ విషయము ఖరారు కాకుండా ఉన్నట్లయితే వారు విభేదించుకొనే విషయము ఎప్పుడో తేల్చివేయబడేది."** ఇక్కడ ఈ వాక్యములో ఒక విషయము అర్థమగుచున్నది. దేవుడు తనకు ఇష్టములేని వారిని తన జ్ఞానమునకు దూరము చేస్తానని చెప్పియున్నాడు కదా! అట్లే తనకు ఇష్టమయినవారిని తన జ్ఞానమునకు దగ్గర చేస్తానని చెప్పాడు కదా! అదే విధముగా మనుషులు దేవుని విషయములో కొన్ని వర్గములుగా తయారయినారు. దేవుని విషయములో కేవలము రెండు వర్గములే కాకుండా అందులో కొన్ని వర్గములుగా తయారయి వుండుట నేడు కనిపిస్తూనే యున్నది. ఈ విషయము దేవుడు తన వాక్యములలో అనేకమార్లు చెప్పియున్నాడు కావున వారు వర్గములుగా విభేదించుకొనియే ఉందురుగానీ, ఎప్పటికీ ఒక దారికి రారు. అలా వారిని ఒక దారికి తెచ్చి ఒక జ్ఞానమునే విశ్వసించునట్లు చేయుటకు ఎవరి చేతాకాదు. అది ముందే దేవుని నిర్ణయము. అది దేవుని నిర్ణయము కాకపోయివుంటే ఒక దారికి వచ్చే వారేమో!

ఒకే విషయములో భేదాభిప్రాయములు కలవారు చాలాచోట్ల చాలా మందికలరు. ప్రతి సమాజములోనూ వారి మధ్య భేదాభిప్రాయములు తప్పనిసరిగాయున్నాయి. అందువలన వారిమధ్యలోయున్న వేరువేరు

అభిప్రాయములలో న్యాయముగా ఏది గొప్పదో, ఏది తక్కువదో, ఏది మంచిదో, ఏది చెడుదో తేల్చి చెప్పటానికి ఒక ప్రవక్త అవసరము. ఒకవేళ వారి మధ్య యున్నది ప్రపంచ విషయమైతే వక్త అయినా న్యాయముగా తీర్పు చెప్పగలడు. ఒకవేళ వారిమధ్యయున్నది పరమాత్మ విషయమైతే వారికి తప్పనిసరిగా ప్రవక్త అవసరమగును. వక్త పనికిరాడు. ఇటువంటి సమస్యలుంటాయని ప్రతి సమాజమునకూ ఒక ప్రవక్తను దేవుడు పంపాడు. దేవుడు పంపగా వచ్చిన ప్రవక్త వారి సమాజములోనున్న సమస్యను లేక వ్యవహారమును న్యాయబద్ధముగా, హేతుబద్ధముగా విడదీసి తీర్పు చెప్పును. అట్లు వారి మధ్యలో ఒక పెద్దమనిషిలాగా ప్రవక్త లేకపోతే వారి వ్యవహారములు పరిష్కారములు కావు. ఈ విషయమును తెలుపుచూ ఖుర్ఆన్ గ్రంథములో సూరా 10, ఆయత్ 47లో ఈ విధముగా చెప్పారు చూడండి. **(10-47) "ప్రతి సమాజానికీ ఒక ప్రవక్తయున్నాడు. కాబట్టి వారి ప్రవక్త వారివద్దకు వచ్చినప్పుడు వారి వ్యవహారములో న్యాయబద్ధముగా తీర్పు చేయుబడుతుంది. వారికి ఎలాంటి అన్యాయమూ జరుగదు."** ప్రవక్త వచ్చినప్పుడు ఆ సమాజానికి సంబంధించి ఒక తీర్పు చెప్పాడనుకొనుము. ఆ తీర్పు ఆ దేశమునుబట్టి, ఆ కాలమునుబట్టి, అక్కడి పరిస్థితులనుబట్టి అది న్యాయముగా ఉండవచ్చును. ఉదాహరణకు ఒక సమాజములో దేవుడు తప్ప వేరే ఎవడూ గొప్పవాడు లేడు అను తీర్పు ఆ సమాజానికి సరిపోయేలాగున ప్రవక్త అయిన వ్యక్తి తీర్పు చెప్పి, దేవుని విషయములో వారికున్న సంశయములన్నీ తీర్చి, అనుమానమనునది లేకుండా చేసి, అందరూ ఒకే దేవున్ని ఆరాధించునట్లు చేశాడు. అక్కడికి అది సరిపోయింది. అది అన్ని విధములా సత్యమైన తీర్పే అయినది.

ప్రక్కదేశములో ఒక సమాజములో దేవుని విషయమందే ఒక సందిగ్ధము వచ్చిన వారు దేవుని ఆరాధనా విషయములో పేచీ పడుతున్నారు. అందరూ ఒకే దేవున్ని కొలవాలని, అందరికీ ఒకే దేవుడున్నాడని కొందరు చెప్పుచుండగా, కొందరు మాత్రము ఒకే దేవున్ని మేము ఒప్పుకొంటాము అయితే ఆ ఒక్క దేవుడే రెండుచోట్లయున్నాడు. రెండు రూపములలో యున్నాడు, మేము రెండుచోట్లా మ్రొక్కుతాము అంటున్నారు. ఇప్పుడు మొదటి దేశములో మొదటి సమాజమునకు తీర్పు చెప్పి సరిచేసిన ప్రవక్త అక్కడికిపోయి, మొదటి సమాజములో చెప్పిన తీర్పును చెప్పితే, వారికి సత్యముగా ఆ తీర్పు అన్యాయముదగును. మొదటి సమాజమునకు ప్రవక్త చెప్పిన న్యాయమైన తీర్పు రెండవ దేశములో, రెండవ సమాజములో అదే ప్రవక్త చెప్పిన తీర్పు ఎలా అన్యాయమైనదని ప్రశ్నరాగలదు. దానికి సమాధానము ఈ విధముగా కలదు. మొదట ప్రవక్త చెప్పిన దేశము వేరు, వారి సమాజము వేరు. ఇక్కడ దేశము మారినది సమాజము మారినది. అందువలన ఒకే ప్రవక్త చెప్పిన తీర్పు మరియొక సమాజములో మరోలా అన్యాయము కాగలదు. అందువలన అన్నీ తెలిసిన దేవుడు ఒక్కొక్క సమాజమునకు ఒక్కొక్క ప్రవక్తను పంపానని చెప్పుచూ ప్రతి సమాజానికీ ఒక ప్రవక్త యున్నాడని 10వ సూరాలో 47వ ఆయత్‌లో చెప్పడము జరిగినది.

అయినా ఇక్కడ ఒక అనుమానము అందరిలోనూ ఉండును. సమస్య ఒకటే అయినప్పుడు సమాజమువేరయినా, సమాజమున్న దేశము వేరయినా పరిష్కారము ఒకటేయుండును కదా! అలా కాకుండా ఒకచోట ఒక తీర్పు మరియొకచోట మరియొక తీర్పు ఎలా న్యాయబద్ధమగును? అని మనస్సులో ప్రశ్న మిగిలిపోగలదు. అయితే దేవుడే ప్రతి సమాజమునకు

ఒక ప్రవక్తను అనగా వేరువేరు సమాజములకు వేరువేరు ప్రవక్తలను పంపుతానని అన్నప్పుడు అంతలేనిది దేవుడు అలా ఎందుకు చెప్పును. అందువలన ఇక్కడ మనకు తెలియని రహస్యమేదోకలదని అర్థమగుచున్నది. ఒక సమాజములో దేవున్ని తప్ప ఎవరినీ మ్రొక్కవద్దనీ, అలా మ్రొక్కితే దేవునికి సమానముగా ఇంకొకరిని పెట్టుకొన్నట్లగుననీ, దేవుడు ఎప్పటికైనా ఒకడే ఉండవలెననీ, ఇతరులను దేవునితో సమానముగా పోల్చుకోకూడదనీ అదే న్యాయసమ్మతమైన తీర్పనీ చెప్పుకోవడము జరిగినది. మరియొకచోట మరియొక సమాజములో దేవున్ని ఆరాధించడమేకాక, దేవుని స్థానములో మరియొకరిని కూడా ఆరాధించడము జరుగుచున్నది. అప్పుడు ఇది న్యాయమేనా? అని దేవున్ని అడిగితే అది న్యాయమేనని దేవుడు కూడా చెప్పాడనుకొనుము. అప్పుడు దేవుడు కూడా ఏదో తప్పు చెప్పుచున్నాడని అనుకోవాలా! లేక దేవుడు చెప్పినది ఏదయినా సరియైనదే అనుకోవాలా! అని చూస్తే దేవుడు ఏది చెప్పినా అది సరియైనదే అగును. దేవుడు సరియైనదే చెప్పును కనుక దానిని సరియైనదేనని ఎవరయినా ఒప్పుకొని తీరవలసిందే.

ఉదాహరణకు ఒక విషయమును చెప్పుకొందాము. ఒక ఊరిలోని పంచాయితీ ప్రెసిడెంట్ ఒక చిన్న నాటకములో ఒక గుమస్తా వేషము వేశాడనుకొనుము. ఆ వేషము వేసినప్పుడు గుమస్తాకు అవసరమైన అలంకరణ చేసినవాడు అదే ఊరిలో వ్యక్తే అయినందున, వేషమునకు ముందుయున్న ప్రెసిడెంట్‌గారే వేషములో గుమస్తాగాయున్నాడని తెలియుట వలన, అతడు గుమస్తా వేషములోయున్న ప్రెసిడెంట్‌ను ప్రెసిడెంట్‌గానే గౌరవించి, పలకరించి మధ్యలో కాఫీ, టీ తెచ్చివ్వడము జరిగినది. అయితే అదే ఊరి మనిషి వేషములోయున్న ప్రెసిడెంట్‌ను చూచినా, అతను గుమస్తానే

అని అనుకున్నాడుగానీ, గుమస్తావేషములో యున్నవాడు ప్రెసిడెంట్ అని తెలియకపోవడము వలన, వాడు వేషములోయున్న వ్యక్తికి నమస్కారము చెప్పలేదు. అయితే ఈ సమస్యను చూస్తే ఎవరికి అర్థమయిన దానిప్రకారము వారు నడుచుకొనినా, ఇద్దరిదీ సరియైన పద్ధతేయని చెప్పవచ్చును. ఒకడు ప్రెసిడెంట్‌కు మాత్రమే మ్రొక్కడము సరియైన పద్ధతే అయినా, మరొకడు కూడా ప్రెసిడెంట్‌నే మ్రొక్కాడు. అయితే రెండవవాడు రెండు రూపములలో నున్న వానిని మ్రొక్కడము జరిగినది. మారువేషములో అనగా గుమస్తా వేషములోనున్న ప్రెసిడెంట్‌ను మ్రొక్కాడు. ఇద్దరూ ఒకరినే మ్రొక్కినా పైకి కనిపించేది, ఒకరు ఒకరిని మ్రొక్కినట్లు కనపడగా, మరొకడు ఇద్దరిని మ్రొక్కినట్లు కనిపించినది. ఇద్దరూ ఒకరే అని తెలిసిన వానిలెక్కలో వాడు చేసిన పనిలో ఏమీ తప్పులేదు. అయితే ఇద్దరూ ఒకటికాదు అని అనుకొన్న వాని లెక్కలో రెండవవాడు చేసినది తప్పేయగును. ఇటువంటి సందిగ్ధములు గల విషయములను తెలుపుటకు ఒక్కొక్క సమాజమునకు ఒక్కొక్క ప్రవక్తను పంపవలసిన అవసరము వచ్చినది. అయితే ఒక ప్రవక్త చెప్పిన దానికి మరొక ప్రవక్త చెప్పిన దానికి కొంత తేడా కనిపించినా, ఇద్దరు చెప్పినదీ ఒకే న్యాయమగును.

ప్రస్తుత కాలములో జిబ్రయేల్ ఒకే దేవున్ని ఆరాధించమని చెప్పినది వాస్తవమే. అది దేవుని విధానములో న్యాయమైన పద్ధతియే అగును. ముస్లీమ్ సమాజములో మొదట జిబ్రయేల్ చెప్పిన దానికి విరుద్ధముగా, దేవుని ప్రతినిధికి సాష్టాంగ నమస్కారము చేయమని అదే జిబ్రయేల్ రెండవ సారి చెప్పినమాట అన్యాయముగా కనిపించుచున్నప్పటికీ, జిబ్రయేల్ మొదట చెప్పినది రెండవమారు చెప్పినది న్యాయమైన విధానమేయని అర్థమగుచున్నది. ఒకే సమాజములోని ప్రవక్త మరొక సమాజములో

చెప్పితే అన్యాయముగా, అసత్యముగా చెప్పినట్లు కనిపించునని వేరువేరు సమాజములలో వేరువేరు ప్రవక్తలను దేవుడు పంపాడు. హిందూ సమాజములో భగవద్గీతయందు సాకార, నిరాకారములను ఇద్దరినీ మ్రొక్కమని చెప్పడము జరిగినది. ఖుర్ఆన్ గ్రంథములో కూడా నిరాకారమునే మ్రొక్కమని చెప్పినా 15వ సూరా, 29,30 వాక్యములలో భగవంతున్ని కూడా నమస్కరించమని చెప్పాడు. దేవుడు తన ప్రవక్తల ద్వారా చెప్పించినది సత్యమే అయినా, దానిని మనుషులు అర్థము చేసుకోలేక పొరపడుచున్నారు. 15-29,30లలో **"నా ప్రతినిధికి మ్రొక్కమని"** చెప్పగా మీరు ఒకే సమాజము అనీ, మా సమాజములో దేవున్ని తప్ప ఇతరులను మ్రొక్కమని చెప్పారు. చివరకు పై ఆయత్‌లో చెప్పిన నా మాటను లెక్కచేయకుండా నేను సాష్టాంగదండము చేయమంటే, సాధారణ నమస్కారమును కూడ చేయలేదు. నేను నా ప్రతినిధిలో ఉన్నది నా ఆత్మే అని చెప్పినా, నా మాటను లెక్కచేయలేదు. నేను, నా ఆత్మను నింపిన ప్రత్యేకమయిన మనిషీ ఇద్దరమూ ఒకటేనని తెలియలేకపోయారు. కొద్దికాలము నాటకములో గుమస్తా వేషము వేసిన ప్రెసిడెంట్‌ను, ప్రెసిడెంటేకాదన్నట్లు మీరు నన్ను తిరస్కరించారు. నా మాటయే మీకు ధర్మము. నా మాటను కాదనినవారు నా ధర్మమును కాదనినట్లేయగును. అందువలన నేను కూడా మిమ్ములను కాదంటాను అని దేవుడు అంటున్నాడు. ఈ విషయమును చెప్పుచూ సూరా 7, ఆయత్ 51లో ఈ విధముగా చెప్పుచున్నాడు చూడండి. **(7-51) "వీరు ఇహలోకములో నా ధర్మమును ఆటగా తమాషాగా కాలక్షేపముగా తీసుకొన్నారు. ఇహలోక జీవితము వారిని మోసానికి గురి చేసింది. కాబట్టి వారు ఈనాటి సమావేశాన్ని మరచినట్లే, నేను చెప్పిన ఆయతులలోని**

**సూచనలను త్రోసి పుచ్చినట్లే ఈ రోజు మేము కూడా వీళ్ళను విస్మరిస్తాము."** 10వ సూరా, 19వ ఆయత్‌లో చెప్పినట్లు మొదట అంతా ఒకే జ్ఞానముతో ఒకే సమాజముగాయున్న ప్రజలు విభేదించుకొని వేరువేరు సమాజములుగా విడిపోగా, 10వ సూరా, 47వ ఆయత్‌లో చెప్పినట్లు ప్రతి సమాజానికీ ఒక ప్రవక్తను పంపి వారి మధ్య న్యాయముగా తీర్పు చెప్పించి సయోధ్యగా మసలుకొనేటట్లు చేశాను. అయినా వారు 7వ సూరా, 51వ ఆయత్‌లో చెప్పినట్లు నేను చెప్పిన ఆయత్‌లను వాటి సూచనలను లెక్కచేయక వారి మత షరియత్‌లను ఏర్పరుచుకొన్నారు. వారి మత నియమములనే ముఖ్యమైన షరియత్‌లుగా చెప్పుకొని నా మాటను త్రోసిపుచ్చి, నేను నా ప్రతినిధిరూపములో వస్తే సాష్టాంగ నమస్కారము చేయమని సూరా15లో, ఆయత్ 29,30లలో చెప్పగా నామాటను ఏమాత్రము లెక్కించలేదు. అటువంటి వారిని నేను కూడా లెక్కచేయను. వారు నన్నే ప్రార్థించినా, నా మాటవినని వారి ప్రార్థనను నేను కూడా వినను అని దేవుడు ఎంతో తీక్షణముగా పై వాక్యములో చెప్పాడు కదా!

ఎవడయినాగానీ దేవుడు చెప్పినమాటను లెక్కచేయకుండా త్రోసి పుచ్చితే వానికి తగినట్లు దేవుడు చేయగలడు. అందరి జుట్టు ఆయన చేతిలోనే యున్నది. ఆయన ఎవరిని ఎలా ఆడించాలో అలాగే ఆడించగలడు. ఆయన (దేవుడు) అనుకున్నది అనుకున్నట్లే జరుగును. ఆయన ముందర మనుషుల మత నియమములుగానీ, మనుషులు సృష్టించుకొన్న ఆచారములు గానీ నిలబడవు. అదే విషయమునే ఖుర్‌ఆన్ గ్రంథములో సూరా 11, ఆయత్ 56లో ఇలా చెప్పడము జరిగినది చూడండి.

**(11-56) "నేను కేవలము అల్లాహ్‌నే నమ్ముకున్నాను. ఆయన నాకూ**

**ప్రభువే, మీ అందరికీ ప్రభువే. ప్రతి ప్రాణియొక్క జుట్టు ఆయన చేతిలోనే ఉంది. నిశ్చయముగా నా ప్రభువు సన్మార్గమున ఉన్నాడు."** ఈ వాక్యములో అందరి జుట్టు ఆయన చేతిలో ఉన్నదని ఒక హెచ్చరిక వచ్చినట్లే జిబ్రయేల్ చెప్పాడు. దేవుని మాటనుకాదని, ఆయన మాటను విననివానికి దానికి తగినట్లే చేయును. దేవుడు తన ప్రతినిధిని తానే పంపాననీ, అతనిలో యున్నది నా ఆత్మేననీ, అందువలన దేవదూతలందరూ సాష్టాంగ నమస్కారములు చేయుచున్నారనీ, మీరు కూడా ఎనిమిది అంగముల నమస్కారము చేయమని చెప్పాడు. అయితే ఆ మాటను లెక్కచేయక కనీసము ఒక్క అంగమయిన చేతులతో చేయు నమస్కారము కూడా చేయకపోయిన వారిని, తర్వాత జన్మలో వారి తలలోని మెదడులో గుణములను జుట్టును త్రిప్పి, చిల్లర దేవుళ్ళయిన విగ్రహారాధనలో పడునట్లు చేయును. తన ప్రతినిధికి నమస్కరించమంటే నమస్కరించనివారిని విగ్రహములకు, క్షుద్రదేవతలకు మ్రొక్కునట్లు వారి జుట్టునుబట్టి ఈడ్చి విగ్రహారాధకులలోనికి వేయు చున్నాడు. ఇదే విషయమునే ఖుర్ఆన్ గ్రంథములో ప్రస్తావించుచూ సూరా 10, ఆయత్ 66లో ఇలా చెప్పాడు చూడండి. **(10-66) "అల్లాహ్‌ను వదలి ఇతరత్రా దేవతలను దేవునికి సమానముగా పూజించెడివారు నిరాధారమైన ఊహలను అనుసరిస్తున్నారు. అంచనాలపై ఆధారపడుచున్నారు."** దేవుని ప్రతిరూపమును, ఆయన ప్రతినిధిని నమస్కరించని వానిని విగ్రహాలను, దయ్యాలను మ్రొక్కునట్లు దేవుడే చేయుచున్నాడు. ఏదో చేయాలని ఏదో చేసినట్లు మనుషుల పని అయినది. దేవుడు నన్ను, నా ప్రతినిధిని నమస్కరించమంటే నిన్ను నమస్కరిస్తాముగానీ, నీ ప్రతినిధిని మేము నమస్కరించమని దేవునిమాట విననివారు, వారు తీసుకొన్న గోతిలో

వారేపడినట్లు చివరకు విగ్రహారాధకులుగా మారిపోయారు. దేవుని మాటను వినకుండా తమ స్వంత కుట్రలు పన్నేవారికి దేవుడు వారికి తగినట్లే చేయగలడు. వారి అతితెలివి వారికే వంచన అవుతుంది. ఆ విషయమును గురించి సూరా 6, ఆయత్ 123, 124లలో ఇలా కలదు చూడండి. **(6-123) "ఇదే విధముగా మేము ప్రతి పట్టణములోనూ అక్కడ సర్దారులను అపరాధములు చేసే వారిగా వారిని చేశాము. అక్కడ వారు తమ పన్నాగములను పన్నుచున్నారు. అయితే వాస్తవముగా తమకు తెలియకుండానే తమను తాము వంచించుకుంటున్నారు. కానీ వారికి ఆ సంగతి తెలియదు." (6-124) " వారివద్దకు ఏదయినా దేవుని వాక్యము ఇలా చేయండని వచ్చినప్పుడు దైవప్రవక్తలకు ఇవ్వబడినదే మాకూ ఇవ్వబడనంతవరకు మేము విశ్వసించేది లేదు అని వారు అంటారు. తన జ్ఞానమును ఎవరికి అందచేయాలో దేవునికి బాగా తెలుసు. తన ప్రవక్తను ఎవరిని చేయాలో, ఎవరిని చేయకూడదో దేవునికి తెలుసు. అతి త్వరలోనే దేవునివద్దనుండి పరాభవమును పొందుతారు. తమ దుష్టపన్నాగాలకుగానూ కఠినాతి కఠినమైన శిక్షను అనుభవిస్తారు."**

దేవుని ఆయత్‌లను నమ్మనివారిని దేవుడు తననుండి దూరము చేస్తాడు. అయితే వారు వారి తెలివితో మేము బాగున్నాము అనుకొనినా, వారికి తెలియకుండానే చెడిపోవుచుందురు. వారికి తెలియకుండానే నష్ట పోవుచుందురు. ఇంకా కొందరు ప్రవక్తకు చెప్పినట్లు మాకు కూడా చెప్పితే మేము ఆయన మాట వింటాము. అంతవరకు వినము అనువారు కూడా కలరు. అయితే అప్పటికి వారిది మంచి తెలివిగానే కనిపించినా, చివరకు వారికంటే బుద్ధిహీనులు లేరని చెప్పవచ్చును. అటువంటి వారిని దేవుడు

మభ్యపెట్టి మంచి చేసినట్లే చేసి, వారికి స్వర్గసుఖములను ఇచ్చి శాశ్వతమైన దేవుని జ్ఞానమునకు దూరము చేయుచున్నాడు. ఎక్కడయినా కష్టాలలోనే మనిషికి దేవుడు జ్ఞాపకము వస్తాడు. మనిషికి అన్ని రకముల సుఖములు కలిగితే తనకు దేవునితో పనేమని ప్రశ్నించగలడు. అందువలన దేవుడు తనకు ఇష్టములేనివారికి సుఖములను ఇచ్చి తనను (దేవున్ని) మరచిపోవు నట్లు చేయుచున్నాడు. ఈ విషయమును తెలిసినవారు చెప్పినా, వారు వినని స్థితిలో సుఖములను అనుభవించుచుందురు. దేవుడు దేవతలను పూజించునట్లు చేసి, దానివలన కోరికలు తీరుచున్నవి సుఖములు కలుగుచున్నవనునట్లు చేసి, తనవైపు రాకుండా సుఖములకోసము విగ్రహారాధకులను చేయుచూ, తన జ్ఞానమును లెక్కచేయనివారికి సుఖముల శిక్షను కలుగజేయుచూ, అటువైపే పోవునట్లు చేయుచున్నాడు.

దేవుని జ్ఞానము ద్వారా లభించునది మోక్షము. దేవుని జ్ఞానమునకు భిన్నముగా యుంటూ తమది జ్ఞానమే అనుకొను వారికి స్వర్గ సుఖములను దేవుడే కలుగజేయుచున్నాడు. అయితే స్వర్గము అనునది ప్రత్యేకమయిన లోకము కాదు. భూమిమీద అనుభవించు సుఖములే స్వర్గసుఖములనీ, అట్లే భూమిమీద అనుభవించు కష్టములే నరక బాధలని తెలియవలెను. స్వర్గనరకములు రెండు భూమిమీద ఉన్నాయని తెలియనివారు అవి ఎక్కడో ఉన్నాయని అనుకొంటున్నారు.

స్వర్గ నరకముల కథలు పురాణములలో ఉండుట వలన వాటిని నమ్మవలసిన పనిలేదు అని చెప్పుకొంటున్నాము. అయితే స్వర్గలోకము అనుమాట శాస్త్రమయిన **భగవద్గీతలో రాజవిద్యా రాజగుహ్యా యోగమున 21వ శ్లోకమున** "తేతం భుక్త్వా స్వర్గలోకం విశాలం క్షీణే పుణ్యేమర్త్యలోకం విశన్తి" అని ఉన్నది కదా! ఈ మాట బ్రహ్మవిద్యా శాస్త్రమునయుండుట

వలన తప్పక నమ్మవలసియున్నది కదా! శాస్త్రములో చెప్పినవన్నీ సత్యము లయితే స్వర్గలోకము, నరకలోకము నిజముగా ఉండవలెను కదా!యని ఎవరయినా అడుగవచ్చును. దానికి మా సమాధానము ఏమనగా! స్వర్గము నరకము అనునవి ఉండడము వాస్తవమే అయితే, వాటిని మనము శాస్త్రము ప్రకారము అర్థము చేసుకోలేదు. పురాణముల ప్రకారమే అర్థము చేసుకొన్నాము. కావున వాటియొక్క నిజతత్త్వము మనుషులకు తెలియకుండా పోయినది. ఇంతకుముందు వ్రాసిన పేజీలో లోకముల ప్రసక్తి వచ్చినప్పుడు లోకము అను పదము **"ఏకము"** అను పదమునుండి పుట్టినదని చెప్పాము. అదే సూత్రముతో ఒక కోవకు చెందిన వారందరినీ ఏకము చేసి (కలిపి) ఒక లోకము వారని అనడము జరుగుచున్నదని కూడా చెప్పాము.

ఇంతవరకు స్వర్గనరకములను గురించి పురాణములు ఏమి చెప్పినా, వాటిని లెక్కచేయక శాస్త్రపద్ధతిలో "లోకము" అను పదమునకు అర్థమును తెలుసుకోగలిగాము. నేను ముందే చెప్పాను, శ్రద్ధవుంటే తెలియని విషయమంటూ లేదని ఇప్పుడు కూడా చెప్పుచున్నాను. నాకు శ్రద్ధయుంది కావున నాకు అంతరంగమున తెలిసిన విషయములనే పొందుపరచి చెప్పడము జరుగుచున్నది. లోకము అను పదమునకు వివరము బయటి వారు చెప్పితే ఎట్లున్నదో, లోపలి వారు చెప్పితే ఎట్లున్నదో తెలిసింది కదా! బయటివారు ఎంత చెప్పినా అందులో తృప్తిగానీ, ఆనందముగానీ లేకుండా సందిగ్ధములో పడిపోవడము తప్ప ఏమీ లేదు. **"ఏకము నుండి లోకము"** పుట్టుచున్నదని ఒక రహస్యమును తెలియగలిగాము. అదే విధానముతో గ్రహించగలిగితే "స్వర్గము" అను పదమునకు అర్థము, అలాగే నరకము అను పదమునకు అర్థము ఏమని తెలియగలదో ఇప్పుడు చూస్తాము. భగవద్గీతలో చెప్పిన త్రైత సిద్ధాంతమును ఖుర్ఆన్ గ్రంథములో కూడా

చెప్పారు. త్రైత సిద్ధాంతమును బైబిలులో కూడా చెప్పారు. భగవద్గీతను, బైబిలును అటుంచి ఖుర్ఆన్‌లోని వాక్యమును గమనించితే అక్కడ ముగ్గురిని గురించి చెప్పారు. **"త్రోలబడేవాడు, త్రోలేవాడు, చూచేవాడు"** అను ముగ్గురిలో ప్రతి మనిషీ త్రోలబడేవాడుగాయున్నాడు. ప్రతి మనిషినీ త్రోలేవాడుగా లోపలగలవాడు ఒకడున్నాడు. ఇకపోతే త్రోలబడేవానినీ, త్రోలేవానినీ ఇద్దరినీ చూచేవాని(సాక్షి)గా దేవుడున్నాడు. దేవుడు ఏమీ చేయడుగానీ త్రోలేవాడు మనిషిని జ్ఞానులలోనికో, అజ్ఞానులలోనికో త్రోలును కాబట్టి కొందరికి అజ్ఞానమూ, కొందరికి జ్ఞానమూ బోధించు చున్నాడు. లోపలయున్న సారథి (త్రోలేవాడు) ఎలా చెప్పాడు అని ఎవరికీ తెలియకుండానే ఎవరికయినా, ఏమయినా చెప్పగలడు. ఇటు అజ్ఞానమునూ బోధించగలడు, అటు జ్ఞానమునూ బోధించగలడు. వినేవానికి ఎలా చెప్పాడో కూడా తెలియకుండా చెప్పు నైపుణ్యము చెప్పేవానికి కలదు. లోపలయున్న వాడు కనిపించడు, తెలియడు కాబట్టి, వాడే తెలియకుండా చెప్పుచున్నాడు. ఒక విషయము తెలిసినవాడు కూడా తాను ఫలానావాడు చెప్పితే తెలియగలిగానని చెప్పలేదు. తనకు తానే తెలుసుకొన్నట్లు భావించుకొను చుండును.

ఎవరు ఏమనుకొనినా! నేను మాత్రము నాకు తెలిసిన విషయము నాలోనే నాకు తోడుగాయున్నవాడు తెలిపితేనే తెలిసిందని చెప్పుచున్నాను. స్వర్గమును గురించి నాకు తెలిసినది ఇలా ఉన్నది. నీటిని తీసుకొని వేడి చేసిన, వేడిని పొందిన నీరు పైకి, చల్లనీరు క్రిందికి పోవుచుండును. అలాగే గాలిని వేడిచేస్తే వేడిగాలి పైకీ, చల్లనిగాలి క్రిందికీ చేరగలదు. గాలి ఒక్కటే అయినా వేడిగాలి పైన, చల్లనిగాలి క్రింద యున్నట్లు, అదే విధముగా నీరు ఒక్కటే అయినా వేడినీరు పైన, చల్లని నీరు క్రిందయున్నట్లు, కర్మ

ఒకటే అయినా పాపము పుణ్యము అను రెండు భాగములుగా కలవు. నీరు ఒకటే అయినా వేడినీరు, చల్లనినీరు అని పేర్లు పెట్లబడినట్లు, కర్మయను నది ఒకటే అయినా అందులో పాపకర్మ, పుణ్యకర్మయని రెండు పేర్లతో యున్నది. వేడినీరు పైన, చల్లని నీరు క్రింద చేరినట్లు, వేడిగాలి పైకి, చల్లనిగాలి క్రిందికి చేరినట్లు, కర్మ నిలయమైన కర్మచక్రములో పుణ్యకర్మ పైన, పాపకర్మ క్రింద చేరుతున్నది. కర్మచక్రములో పన్నెండు భాగములందు బేసి సంఖ్యలయిన 3, 7, 11 స్థానములలో పాపము చేరుచుండును. అలాగే బేసి సంఖ్యలయిన 1, 5, 9 స్థానములలో పుణ్యము చేరుచుండును. మిగతా సరిసంఖ్యలయిన 2, 4, 6, 8, 10, 12 స్థానములందు పుణ్యము, పాపము రెండూ చేరుచుండును. అలా చేరిన పుణ్యకర్మ, స్థానములో పై భాగమున చేరుచున్నది. అలాగే పాపకర్మ, స్థానములో క్రింద చేరుచున్నది. కర్మచక్రములో పాపపుణ్యములు క్రింద పైన ఎలా చేరుచున్నవో, తర్వాత పేజీలోగల చిత్రపటములో నమూనా చూడవచ్చును.

కర్మచక్రము మన తలయందే వున్నదనీ, ఎవడు చేసుకొన్న కర్మ వాని తలయందుగల కర్మచక్రములో వాని పొరుగువానిచేత వ్రాయబడు చున్నదనీ, ముందే కొన్ని గ్రంథములందు మరియు **"కర్మపత్రము"** అను గ్రంథములోనూ చెప్పుకొన్నాము. అలా కర్మచక్రములో చేరు కర్మలో పుణ్యము కర్మచక్రములో పై భాగమున పాపముకంటే పైన నిలువవుండగా, పాపము క్రింది భాగమున చేరుచున్నదని చిత్రపటము ద్వారా కూడా ఇప్పుడు తెలుసు కొన్నాము. ఎవడు చేసుకొన్న పాపపుణ్యములను వాడే అనుభవించడము జరుగుచున్నది. కర్మచక్రములో అగ్రస్థానములోయున్న పుణ్యమును అనేక సుఖాల రూపములో మనిషి అనుభవించడము జరుగుచున్నది. వాడు చేసుకొన్న పుణ్యమును వాడే స్వయానా అనుభవించుచున్నాడు. కాబట్టి




**కర్మచక్రములో పాపపుణ్యములు - పుణ్యము పైన, పాపము క్రింద గలదు.**

అటువంటి పుణ్య సుఖములను అనుభవించడమునకు ప్రత్యేకమైన పేరు పెట్టారు. అగ్రమున నున్న పుణ్యమును స్వయముగా అనుభవించడమును గుర్తు చేయుచూ **"స్వ+అగ్రము"** అను రెండు శబ్ధములను కలిపి "స్వగ్రము" అని అనడము జరిగినది. "స్వగ్రము" అను పదము తక్కువ కాలములోనే "స్వర్గము" అను పదముగా పలుకబడి అదే వాడుక పదముగా నిలిచి పోయినది. స్వగ్రము అను పదములో రెండు ద్వంద్వాక్షరములు కలవు. స+వ=స్వ అనునది ఒకటికాగా, గ+ర=గ్ర అనునది రెండవది. అయితే రెండవ అక్షరములో "గ" నూ మరియు "ర" నూ ఉండడము జరిగినది. "ర" అను శబ్ధము నాశనమునకు బీజాక్షరముగా ఉండుట వలన "గ్ర" అను శబ్ధములో "ర" అనునది చివర పలుకడము కొందరికి (భాషా పండితులకు) ఇష్టము లేదు. చివరిలో నాశన శబ్ధము ఉండకూడదని

తలచిన పండితులు "ర" అను శబ్ధము ముందు పెట్టి "గ" అను శబ్ధమును వెనుక ఉంచడము జరిగినది. గ+ర=గ్ర అనుట పోయి ర+గ=ర్గ అను శబ్ధముగా మారిపోయినది. "స్వ"కు "ర్గ" శబ్ధమును చేర్చి "స్వర్గ" అనియు పూర్తి పదముగా "ము" చేర్చి "స్వర్గము" అని చెప్పడము జరిగినది. ఈ విధముగా "స్వగ్రము" అను పదము చివరకు భాషా పండితుల జోక్యముతో "గ్ర" అను అక్షరమును "ర్గ" అను అక్షరముగా మార్చడము జరిగినది.

పుణ్యఫలితము సుఖములు, పాపఫలితము కష్టములు అయినప్పుడు మనిషి సుఖములలో అభివృద్ధి చెందడమూ, కష్టములలో క్షీణించి పోవడమూ జరుగుచుండును. ఒక మనిషికి సుఖములు కల్గినప్పుడు ఉల్లాసముగా ఉండడమూ, సుఖముల వలన కల్గు సంతోషమునకు శరీరము లావు కావడము లేక కాంతిగా ఉండడము జరుగుట మనకు తెలిసిన విషయమే. పుణ్యము వలన అభివృద్ధి జరుగుచున్నదిగానీ ఏదీ క్షీణించడము గానీ, నాశనముగానీ జరుగడము లేదు. స్వగ్రము అను పదములో చివరిలో "ర" శబ్ధము ఉండడము వలన "ర" అనునది నాశనముకు గుర్తుగాయున్న శబ్ధమయిన దానివలన ఆ అక్షరమును చివరిలో ఉంచడము కొందరికి సరిపోలేదు. అగ్రములోయున్న పుణ్యమును స్వయముగా అనుభవించుట అను అర్థముకంటే స్వయముగా నాశనము చెందుట అను అర్థము ఎక్కువగా కనిపించుచున్నదనీ, అటువంటి అర్థము లేకుండా పోవుటకు ఉన్న పదములోనే "గ"ను వెనుకకు "ర"ను ముందుకు పెట్టితే చివరిలో నాశనమును సూచించు "ర" లేకుండా పోయినట్లు ఉండడమేకాక అక్షరములు రెండు ముందుది వెనకకు, వెనుకది ముందుకు ఉంటుందని, దానితో అక్షరములను పూర్తి తొలగించకుండా ఉంచినట్లుంటుందని తలచి ఆ విధముగా స్వగ్రమును స్వర్గము అను పదముగా మార్చిపెట్టారు. స్వర్గము

అను పదమునకు అర్థము మారనట్లు వాని పుణ్యమును వాడు స్వయముగా అనుభవించడము అనియే చెప్పారు. ఇట్లు పూర్వము నుండి స్వర్గము అను పదము సుఖముల అనుభవము అను అర్థమునిచ్చునదై ఉన్నది. అయితే స్వర్గలోకము అనడములో కొందరు పురాణములను ఆశ్రయించి అక్కడ తెల్పిన కథల ద్వారా స్వర్గలోకము ప్రత్యేకమైన ఇంద్రుని రాజ్యముగా లెక్కించుకొన్నారు. ఇంద్రుడు దేవతలరాజనీ, ఇంద్రలోకము ఆకాశము పైన కలదనీ, ఆ ఇంద్రలోకమే స్వర్గలోకముగా చెప్పబడుచున్నదనీ అందరూ అనుకోవడము జరిగినది. పురాణములు పుక్కిడినుంచి పుట్టినవనీ, అసత్యములతో కూడుకొన్న కథలనీ తెలియనివారు పురాణముల మాటే సత్యమని నమ్మారు. అంతేకాక పెద్దపెద్ద స్వామీజీలు సహితము పురాణముల గురించి తమ ఉపన్యాసములలో చెప్పడము వలన స్వామీజీల మాటలనే ఎక్కువగా నమ్మవలసి వచ్చి ఇంద్రుడు ఇంద్రలోకము ప్రత్యేకముగా యున్నదనీ, చనిపోయినవారు పుణ్యములను అనుభవించుటకు ఇంద్ర లోకమయిన స్వర్గలోకమునకు పోయి అచట అనేక సుఖములను అనుభవించి, పుణ్యము అయిపోయిన వెంటనే నరకలోకమునకు పోయి అక్కడ బాధలు, చిత్రహింసలు అనుభవించి పాపము కూడా అయిపోయిన వెంటనే మర్త్యలోకమయిన మనుషులలోకమున లేక భూలోకమున వచ్చి పుట్టుచున్నారని చెప్పుకోవడము జరుగుచున్నది. ఒకమారు ఏది బుర్రకు ఎక్కితే అదే నిజమని నమ్మువారు కలరు. అటువంటి వారికి ఏమాత్రమూ విచక్షణ ఉండదు. వారికి సత్యమును చెప్పినా వినే స్థితిలో ఉండరు. వారికి తెలిసినదే సత్యమని వాదించుచుందురు. అటువంటి వారిని వారి కర్మకు వదలివేయడము తప్ప మనము ఏమీ చేయలేము.

స్వర్గము అను పదము ఎట్లు తయారయినదో, దాని అర్థము ఏమిటో తెలుసుకోగలిగాము. పుణ్యకర్మను స్వయముగా అనుభవించుటను స్వర్గము

అంటున్నాము కదా! పుణ్యమునకు వ్యతిరేఖమయిన పాపమును కూడా ఎవడు చేసుకొన్నదానిని వాడు అనుభవించవలసిందే కదా! అప్పుడు దానికి కూడా అర్థమయిన పేరు ఉందా? అని కొందరు అడుగవచ్చును. దానికి మా సమాధానము ఏమనగా! స్వర్గము అను పదమునకు వ్యతిరేఖమయిన పదము నరకమే అని చెప్పగలము. ఎక్కడ స్వర్గము అంటున్నామో దానిప్రక్కనే నరకము అని అంటున్నాము. స్వర్గ నరకములని రెండు పదములను కలిపి చెప్పడము కూడా జరుగుచున్నది. పాప పుణ్యములలో మొదటిది లేక పైనగలది పుణ్యము. దానిని స్వయానా చేసుకొన్నవాడే అనుభవిస్తున్నాడని చెప్పినప్పుడు పుణ్యముకంటే క్రిందవున్న పాపమును కూడా చేసుకొన్నవాడే అనుభవించవలసియుండును. అందువలన పుణ్యము వద్ద వాడిన "స్వ" అను అక్షరమును నరకమువద్ద వాడవలసిన పని లేకుండా పోయినది. ఎవని పుణ్యమును వాడు అనుభవించినట్లు, ఎవని పాపమును కూడా వాడే అనుభవించునను విషయము అందరికీ తెలిసినదే కావున నరకము ముందర "స్వ" అను అక్షరమును చెప్పడము లేదు.

స్వర్గమును గురించి ఖుర్ఆన్ గ్రంథములో 55వ సూరాలో 45వ ఆయత్‌నుండి 77వ ఆయత్ వరకు మరియు 56వ సూరాలో 15 నుంచి 37వ ఆయత్‌వరకు స్వర్గ సుఖములను గురించి వ్రాశారు. అవన్నియూ మనిషికి ఆశను కల్పించి వాటికొరకే ప్రాకులాడునట్లు చేయగలవు. అరబ్ దేశములో ఖుర్ఆన్ పుట్టిన దానివలన అక్కడ ఎక్కువ ఎడారిప్రాంతము ఉండుట వలన సెలయేర్లు, పచ్చని తోటలు కనిపించవు. తోటలు, పారేనీళ్ళే వారికి స్వర్గముగాయుండును. కనుక స్వర్గమును గురించి చెప్పిన వాక్యములలో ఎక్కువగా పారే సెలయేర్లు, పండే పచ్చని తోటలను గురించి ఎక్కువగా చెప్పారు. ఇప్పుడు ఖుర్ఆన్‌లో చెప్పిన స్వర్గమును గురించిన

వాక్యములను గురించి చెప్పినవి చూస్తాము. స్వర్గమును గురించి చెప్పునప్పుడు 55వ సూరాలో ఎక్కువమార్లు దేవుడు ఇచ్చిన అనుగ్రహము లలో దేనిని కాదంటావు అని చెప్పారు. (55-45) "మీరు మీ ప్రభువు యొక్క ఏఏ అనుగ్రహాలను తిరస్కరిస్తారు." (46) "నీ ప్రభువు ఎదుట నిలబడి ఉండాలనే భయము కల్గినవారికి (భక్తి కాదు) రెండు తోటలుంటాయి." (48) "అవి రెండూ శాఖోపశాఖలుగా విస్తరించి వుంటాయి." (50) "ఆ రెండు తోటలలోనూ రెండు సెలయేర్లు ప్రవహిస్తూ ఉంటాయి." (52) "ఆ రెండు తోటలలోనూ ప్రతి పండూ రెండేసి రకములుగా ఉంటాయి." (54) "స్వర్గవాసులు దళసరి పట్టువస్త్రములు ధరించి, అత్తరు పరుపులపై దిండ్లకు ఆనుకొని దర్జాగా ఆసీనులైవుంటారు." (56) "వారిమధ్య చూపులు క్రిందికి వాలియుండే అందమైన స్వర్గ కన్యలు ఉంటారు. వీరిని పూర్వము ఏ మానవుడుగానీ ముట్టుకొనియుండడు." (58) "ఆ స్వర్గ కన్యలు అందాలలో కెంపులు, పగడాల మాదిరి ఉంటారు." (62) "ఆ రెండు తోటలే కాకుండా మరి రెండు తోటలు ఉన్నాయి." (64) "ఆ రెండు తోటలు గుబురుగా ముదురు ఆకుపచ్చ రంగుగా ఉంటాయి." (68) "ఆ రెండిటిలోనూ పండ్లూ, ఖర్జూరాలు, దానిమ్మపండ్లు పుష్కలముగా ఉంటాయి." (70) "అక్కడ సౌశీల్యవంతులు, సౌందర్యవతులు అయిన స్త్రీలు ఉంటారు." (72) "గుడారాలలో సురక్షితముగా ఉంచబడిన తెల్లని సుందరాంగులు కూడా యున్నారు." (56-18) "వారు గిన్నెలు, కుజాలు, గ్లాసులు పట్టుకొని మధువును నింపుకొని తిరుగుతూ ఉంటారు." (19) "మధుపానము వలన తలనొప్పి రావడముగానీ, బుద్ధి తికమక కావడముగానీ ఉండదు." (20) "వారు మెచ్చిన పండ్లు ఫలాలుకాక ఇంకా, (21) వారు ఇష్టపడిన పక్షుల మాంసము కూడా ఉంటుంది. (22) వారి కొరకు పెద్దపెద్ద

కన్నులుగల సుందరాంగులు ఉంటారు. (23) ఆ ఆడవారు దాచిపెట్టబడిన స్వచ్ఛమయిన ముత్యాల్లా ఉంటారు. (28) వారు ముండ్లులేని రేగుచెట్ల మధ్యలో ఉంటారు. (29) "ఇంకా ఒకదానిపై ఒకటి పేరుకొన్న అరటిగెలలు" (30) "సుదూరముగా విస్తరించియున్న నీడలు" (31) "ప్రవహించే నీళ్ళు" (32) " పుష్కలమైన పండ్ల ఫలాల మధ్య" (34) "ఎత్తయిన పరుపుల మధ్య హాయిగా ఉంటారు." (35) "మేము వారి భార్యలను ప్రత్యేకముగా ప్రభవింప జేశాము." (36) "మరి వారిని కన్యలుగా చేశాము." (37) "వారు మనసైన వారై సమవయస్కులై ఉంటారు." ఈ విధముగా స్వర్గమును ఖుర్ఆన్ గ్రంథములో వర్ణించారు. అక్కడివారి అభిరుచికి తగినట్లు సుఖములను గురించి చెప్పడము జరిగినది. ఎవరు ఏమి చెప్పినా స్వర్గము అనగా సుఖములతో కూడుకొనియుండునని ముందే చెప్పాము. అలా సుఖములతో కూడుకొన్న జీవితము ఎప్పుడున్నదో, ఎంతకాలమున్నదో, ఎక్కడున్నదో అది స్వర్గమనియే అర్థము. స్వర్గము అనునది ప్రత్యేక లోకముకాదు. స్వర్గ, నరకములు భూమిమీదనే మనుషుల జీవితములలోనే యున్నవి. అలా దేవుడు నిర్మించాడు. అలా నిర్మించియుండుట వలన సుఖములలోయున్న వాడు దేవునివైపు రాడు, దేవుని ధ్యాస కూడా రాదు. అందువలన మా లెక్కలో స్వర్గమయినా, నరకమయినా రెండూ శిక్షలేయని మేము అనుకొంటున్నాము. **స్వర్గము పుణ్యమును అనుభవించే శిక్ష, నరకము పాపమును అనుభవించే శిక్షయని తెలియవలెను.** దేవుడు తనవైపుగానీ, తన జ్ఞానమువైపుగానీ మనిషిని రాకుండా చేయాలనుకుంటే స్వర్గము అను శిక్ష విధించును.

వాస్తవము ఇలా ఉండగా, కొందరు దానిని గురించి ఆశలో మునిగి పోయి, అది ఎక్కడో మరొక లోకములోయున్నదని, దేవునికొరకు శ్రమపడి, దేవుని కొరకు చనిపోతే వెంటనే స్వర్గము వస్తుందని, భూమిమీద చాలీచాలని

బ్రతుకు బ్రతికేదానికంటే అన్ని సుఖాలు ఉండే స్వర్గము వస్తే మంచిది కదా!యని, అట్లే పెళ్ళి కూడా కాని దుర్భర జీవితముకంటే స్వర్గమునకు పోతే అక్కడ అందమైన ఆడవారు ఉంటారు కదా!యని ఆశించి తొందరగా స్వర్గమునకు పోవుటకు ముస్లీమ్‌లు కానివారిని, ఇతర దేవతలను పూజించు వారిని చంపితే దేవునికొరకు పని చేసినట్లుంటుందని, అలా దేవునికొరకు పని చేసినప్పుడు చనిపోతే స్వర్గమునకు పోవచ్చునని కొందరు ఉగ్ర వాదులుగా మారిపోయి తాము చనిపోవుట కొరకు ఇతరులను చంపేపనిని పెట్టుకొని భూమిమీద ఎన్నో మారణకాండములు చేయుచున్నారు. అట్లు చేయుట వలన స్వర్గము రాదని పాపమువచ్చి తర్వాత జీవితములో ఘోరమైన కష్టములను, బాధలను అనుభవించాలని వారికి తెలియదు.

నరకము అనునది ఎక్కడోలేదు, నరకము కూడా భూమిమీదనే మన జీవితములలోనే ఉన్నది. నరకముగానీ, స్వర్గముగానీ మూడు కారణముల చేత ఏర్పడుచున్నదని తెలియుచున్నది. అదెలాయనగా! మనిషి శరీరములోని తలయందు గల నాలుగుచక్రముల సముదాయములో క్రింది చక్రము పేరు గుణచక్రము. గుణచక్రము మూడు అరలుగా, మూడు గదులుగా ఏర్పడి అందులో జీవుడు నివసిస్తున్నాడు. గుణచక్రము మూడు భాగముల పేర్లు, బయటినుండి తామసభాగము, మధ్యలో రాజసభాగము, చివరిలో సాత్త్వికభాగము కలదు. ఈ మూడిటికి మధ్యలో ఒక భాగమున్నది. అది గుణభాగముకాదు. అది గుణములు లేని భాగము. గుణములున్న భాగములు మూడు గలవు కదా! అందులో ఒక్కొక్క భాగమునందు మంచి గుణములు ఆరు, చెడు గుణములు ఆరు మొత్తము పన్నెండు గుణములు ఉండును. ఈ గుణముల వలననే పాపపుణ్యములు వస్తున్నవి. పుణ్యముల వలన స్వర్గము, పాపములవలన నరకము కల్గుచున్నవని చెప్పవచ్చును.

మూడు గుణభాగములలోని ఆరు చెడుగుణముల వలన మూడు విధముల పాపములు వస్తున్నవి. తామసపాపము, రాజసపాపము, సాత్త్వికపాపము ఏర్పడుట వలన వాటివలననే నరకములు వస్తున్నవి. మూడు గుణ పాపములవలన నరకము కూడా మూడు విధములుగా యున్నది. దానినే సాత్త్విక నరకము, రాజస నరకము, తామస నరకము అని మూడు నరకములను చెప్పవచ్చును. నరకమును మూడు భాగములుగా మనిషి జీవితములో సంపాదించుచున్నాడు. అలాగే మూడు భాగములుగా అనుభవిస్తున్నాడు. ఇదే విషయమునే ఖుర్ఆన్ గ్రంథములో నరకము మూడు పాయలుగా ఉన్నదని చెప్పుచూ సూరా 77, ఆయత్ 29,30లలో ఇలా చెప్పబడినది. **(77-29,30) "మీరు ధిక్కరిస్తూయున్న ఆ నరకము వైపే పొండి." (30) "మూడు పాయలుగాయున్న ఆ నీడ (నరకము) వైపు నడవండి."** ఈ విధముగా చెప్పియుండుట వలన నరకము మూడు విధములుగా ఉన్నదని తెలియుచున్నది. ఇదే సూత్రము ప్రకారమే స్వర్గము కూడా మూడు భాగములుగానేయున్నది. మూడు పాయలుగా యున్న స్వర్గముగానీ, నరకముగానీ తప్పనిసరిగా జీవితములోనే అనుభవించాలని జ్ఞాపకముంచుకోవాలి. ఎక్కడో ఉన్నాయనుకోవడము దేవుని జ్ఞానము కాదు.

మనిషికి నరకమును అదే విధముగా స్వర్గమును విధించువారు దేవుని పాలకులుగలరు. ప్రపంచమంతా దేవునిపాలన దేవునిపాలకుల చేతనే జరుగుచున్నది. మనిషి జీవితమును గడుపుటకు పాలకులచేత పాలన ప్రతిక్షణము జరుగుచున్నది. ప్రపంచమంతా దేవుని పాలకులున్నారను విషయము ఇంతవరకు ఎవరికీ తెలియదు. దేవుని పాలకులు అనగా దేవుని సేవకులు ఎంతమంది ఉన్నారని ఖచ్చితముగా చెప్పలేముగానీ, కోట్ల

సంఖ్యలో మాత్రమున్నారని చెప్పవచ్చును. వారు భూమిమీదనూ, ఆకాశములోనూ అంతటా ఉన్నారు. అంతటాయున్న వారు దేవుని పాలనను సాగించుచూ దేవునిసేవ చేయుచున్నారు. మనిషిలోని విశ్వాసమును, అవిశ్వాసమును పరీక్షించుటకు శరీరమే వేదికగాయున్నది. శరీరములో పది స్థూలభాగములుగాయున్న కన్ను, ముక్కు, చెవి, చర్మము, నాలుక అను జ్ఞానేంద్రియములు ఐదు మరియు కాళ్ళు, చేతులు, నోరు, గుదము, గుహ్యము అను కర్మేంద్రియములు మొత్తము పది. సూక్ష్మముగాయున్న ఐదు వ్యాన, సమాన, ఉదాన, ప్రాణ, అపాన వాయువులు మరియు మనస్సు, బుద్ధి, చిత్తము, అహము అను తొమ్మిది కనిపించని సూక్ష్మభాగములు కూడా దేవునిపాలకులలో భాగములుగాయున్నవి. దేవుని పాలకులలో 19 మంది శరీరములోని పాలకులు శరీరములోనే నివసించు జీవున్ని పరీక్షించి వాడు విశ్వాసియా, అవిశ్వాసియా అని తేల్చివేయుచున్నవి. శరీరములోని 19 భాగములను దేవుని పాలకులనీ, దేవుని సేవకులనీ, దేవుని దూతలనీ చెప్పవచ్చును. శరీరములో ఈ 19 మందికాక బయట ప్రపంచములో కోట్లాదిమంది దేవుని పాలకులున్నారని తెలియవలెను.

ఇదే విషయమునే ఖుర్‌ఆన్ గ్రంథమందు తెలుపుచూ సూరా 74, ఆయత్ 31లో ఈ విధముగా చెప్పుచున్నారు చూడండి. **(74-31) "మేము నరక పాలకులుగా దేవదూతలను మాత్రమే ఉంచాము. ఇంకా అవిశ్వాసులను పరీక్షించడానికి మేము 19 మందిని మాత్రమే నిర్ధారించాము. గ్రంథవహులకు నమ్మకము కలగడానికి, విశ్వాసులు తమ విశ్వాసములో మరింత ముందుకు పోవడానికి, గ్రంథములోని విషయములను విశ్వసించిన వారు సంశయానికి గురికాకుండా ఉండడానికి మేమిలా చేశాము. ఇంకా హృదయాలలో రోగమున్న**

**వారికి, అవిశ్వాసులకు ఈ 19 దృష్టాంతము ద్వారా దేవుడు ఏమి చెప్పదలచాడో చెప్పటానికి కూడా మేము ఈ విధముగా చేశాము. ఈ విధముగా దేవుడు తాను కోరిన వారిని పెడదారి పట్టిస్తాడు. తాను కోరినవారికి సన్మార్గమును చూపిస్తాడు. దేవుని సైన్యాలను దేవుడు తప్ప ఇతరులు ఎవరూ తెలియరు, తెలియలేరు. ఈ నరక వృత్తాంతము మానవమాత్రుల బోధనార్థము ప్రస్తావించబడినది."**

శరీరములో అవిశ్వాసులను పరీక్షించటానికి 19 మందిని నిర్ధారించాము అని చెప్పినప్పుడు 19 మందిని వ్యక్తులుగా లెక్కించకూడదు. ప్రత్యేకమయిన పనులు చేయు అవయవములుగా గుర్తించవలెను. బుద్ధిలో అజ్ఞానమున్నదని చెప్పు నిమిత్తము హృదయములో రోగమున్నవారు అని చెప్పారు. అజ్ఞానమును రోగమనీ, బుద్ధిని హృదయమనీ చెప్పినట్లు అర్థము చేసుకోవాలి. మనిషి నరకానికిపోవడానికి శరీరములోని 19 భాగములను బట్టియుండును. అలాగే స్వర్గమునకు పోవుటకు కూడా ఈ 19 భాగములే కారణము. అట్లని అవి స్వయముగా ఆడునవి, చేయునవికావు. వాటిని ఆడించువాడు, వాటిచేత చేయించువాడు ఆత్మ కలడు. ఆత్మ చేయించే దానినిబట్టి 19 అవయవములు నడుచుకొనును. అందువలన దేవుడు తాను కోరినవారిని ఆత్మచేత, అవయవముల చేత ఆడించి నరకానికయినా పంపగలడు లేకపోతే స్వర్గానికయినా పంపగలడు. శరీరములో 19ని ఆడించువాడు ఆత్మయే. అట్లే మనిషి స్వర్గమును అనుభవించుటకుగానీ, నరకమును అనుభవించుటకుగానీ కోట్లాదిమంది పాలకులు అవసరము. ప్రపంచమంతా దేవుని పాలన సాగుచున్నది. ఆయన పాలనలో ఎంతమంది పాలకులు ఉన్నారో ఖచ్చితముగా ఎవరూ చెప్పలేరు. ఎన్ని కోట్లమంది యున్నారో ఎవరెవరున్నారో అది దేవునికి మాత్రమే తెలియునుగానీ, ఏ

మానవునికీ తెలియదు. దేవుని పరిపాలన ఒకటున్నదను విషయము కూడా ఇంతవరకు ఎవరికీ తెలియదనుకుంటాను.

నరకములో బాధించే యమకింకరులు, స్వర్గములో సుఖముల నిచ్చే సేవకులు ఉంటారని కొందరు పురాణములలో మరియు వారి గ్రంథములలో వ్రాసుకొన్నారు. వారు ఏమి వ్రాసుకొన్నా ఉన్న సత్యమును గ్రహిస్తే స్వర్గమును నరకమును అనుభవింపచేసే వారు దేవుని పాలకులే యనీ, వారు ప్రత్యేక లోకములలో లేరనీ, మనము జీవించు భూలోకములోనే యున్నారనీ, మన జీవితములలోనే సుఖదుఃఖ రూపములలో స్వర్గనరకము లను అనుభవింపజేయుచున్నారనీ తెలియుచున్నది. దేవునిపాలనలో శరీరములోని 19 అవయవములు కూడా భాగస్థులుగానే యున్నవని క్రొత్తగా తెలిసినా జరుగుచున్నదంతేయని అర్థమగుచున్నది. దేవుని పాలన జరుగు చున్నదను విషయము చాలామందికి క్రొత్తగా తెలిసినా దేవుని పాలకుల విషయము దేవునికి తప్ప ఇతరులకు ఎవరికీ తెలియదు. అందువలన నేను కూడా ఎంత సంఖ్యలో పాలకులున్నారో చెప్పడములేదు. దేవుని పాలనను అర్థము చేసుకోవడమే మహాజ్ఞానము. దేవుని పాలనను అర్థము చేసుకొన్న వాడు తొందరగా కర్మలనుండి బయటపడి మోక్షమును పొందును.

ఇప్పుడు కొందరు ఒక ప్రశ్నను అడుగవచ్చును. అదేమనగా! "మీరు క్రొత్తగా ఎవరూ ఇంతవరకూ ఎక్కడా చెప్పని విధముగా దేవుని పరిపాలన ఉన్నదని చెప్పారు. దేవుడు తన గ్రంథములో తన సైన్యము ఉందని చెప్పాడు. అయితే సైన్యమును గురించి చెప్పిన దేవుడే తన సైన్యమును గురించి చెప్పాలి కదా! దేవుడు చెప్పవలసిన విషయమును మధ్యలో మీరు జోక్యము చేసుకొని చెప్పారు. దేవుడు ఎందుకు పూర్తి సమాచారమును ఇవ్వలేదు. ఆయన తన 19 మంది దూతలు ఎవరో

చెప్పకనే మీరు శరీరములోయున్నవారని 19 సంఖ్య సరిపోవునట్లు శరీర అవయవములను గురించి చెప్పారు. ఆయన చెప్పవలసిన వాటిని ఆయన చెప్పకనే మీరు ఎందుకు చెప్పారు? మీరు చెప్పునది సత్యమేనని ఎలా నమ్మాలి?" అని అడుగవచ్చును. దానికి మా సమాధానము ఇలాగున్నది. ఆయన 19 మంది అని చెప్పాడు కావున ఆ 19 మంది ఎవరు? అని మేము చెప్పవలసి వచ్చినది. ఆయన చెప్పకనే మీరెందుకు చెప్పారని అడిగారు. ఆయన చెప్పలేదనేగా మేము చెప్పినది. ఆయన నేనే చెప్పుతానని చెప్పియుంటే దానిని నేను చెప్పడము తప్పగును. గ్రంథమును చదివిన తర్వాత గ్రంథములోని విషయములను విపులీకరించి చెప్పు బాధ్యత మాపై యున్నదని చెప్పాడుగానీ, నాపై యున్నదని ఆయన చెప్పాడా? మాపై అనగా ఆయన తరువాత ఆయన అనుగ్రహము పొందిన వారిమీదయని మీరెందుకు అనుకోకూడదు? అనుగ్రహము అనగా అనుసరించి గ్రహించుకోవడమును అనుగ్రహము అని అంటాము. దేవుడు చెప్పిన దానిని అనుసరించి నేను గ్రహించుకొన్నాను, కావున ఆయన అనుగ్రహమును పొంది ఆ విషయమునే మీకు మేము చెప్పడము జరిగినది. దేవుడు తన వారితో చెప్పించును కనుక వివరించి చెప్పు బాధ్యత మాపై వుంది అని బహువచనముతో చెప్పాడు. ఇదే విషయమును ఖుర్ఆన్ గ్రంథములో సూరా 75, ఆయత్ 18, 19లలో ఈ విధముగా చెప్పడము జరిగినది చూడండి. **(75-18) "మేము దీనిని (గ్రంథమును) పఠించినప్పుడు నీవు ఆ పారాయణాన్ని శ్రద్ధగా అనుసరించి వినుము. (19) "ఇక దాని భావమును విడమరచి చెప్పే బాధ్యత మా పైనే ఉంది."** ఈ వాక్యములో ఖుర్ఆన్ గ్రంథములోని విషయమును నీవు శ్రద్ధగా వినమనీ, అది అర్థమయ్యేలాగున చెప్పే బాధ్యత తమదేయనీ చెప్పినందువలన ఆయన అనుగ్రహము ఉంటే నేనయినా చెప్పవచ్చును లేక మీరయినా చెప్పవచ్చును.

దేవుడు తన గ్రంథములో తన ఆయత్‌లను ఏదో ఒక రకముగా విడదీసి చెప్పి మనుషులకు అర్థమయ్యేలా చేశాడు. అయితే దేవుడు ఎన్ని విధముల చెప్పినా మనిషి మాత్రము దానిని రవ్వంతయూ అర్థము చేసుకోకుండా మాట్లాడుచూనేయున్నాడు. దేవుడు ఎంతో కష్టపడి చెప్పిన జ్ఞానము కొన్ని వేలమందిలో ఒకనికి మాత్రమే అర్థమయివుంటుంది. మిగతా వారందరూ ప్రపంచ విషయములలో మునిగిపోయి తమ లాభనష్టములను లెక్కించుకొంటున్నారు. అటువంటి వారికి దేవుడు ఐశ్వర్యమును ఇచ్చి సమాజములో గొప్ప స్థితికి చేర్చితే అతను తన ఆస్తినీ, అంతస్థును చూచుకొని పొంగిపోవును. అటువంటివాడు అవిశ్వాసి లేక నాస్తికుడు అయితే తనతెలివి తేటలతోనే ఐశ్వర్యమును సంపాదించుకొన్నాననీ, దానికంతటికీ తన మేథాశక్తే కారణమని అనుకొంటాడు. అదే కొంత దేవునిమీద నమ్మకమున్నవాడయితే తనకున్న నమ్మకముతో తనకున్న ఐశ్వర్యమంతయూ దేవుడే ఇచ్చాడనీ, దేవుడు ఎంతో దయగలవాడనీ, తన భక్తులకు ఎటువంటి కొరతా లేకుండా చూచుకొంటాడనీ పొగడుచుండును. అతనికి కొంత విశ్వాసమున్న దానివలన పూర్తి జ్ఞానము లేనిదానివలన ఆ విధముగా అనుకోవడము జరుగుచున్నది. ఎంత ధనము వచ్చినా, ఎంత హోదా వచ్చినా, ఎన్ని సుఖములు కలిగినా అన్నీ కర్మవలన వచ్చునవే నని తెలియక తన కర్మను ప్రక్కన పెట్టి దేవున్ని పొగడుచున్నారు.

ఆ విధముగా ఐశ్వర్యవంతుడయినవాడు కొంత కాలమునకు వాని కర్మకొద్దీ ఉన్న ఐశ్వర్యమంతా పోయి, దాని వలన సమాజములో గౌరవము లేకుండాపోయి, ఎవరూ పలుకరించని స్థితిలోనికి వచ్చాడనుకొనుము. అప్పుడు వాడు జ్ఞానములేని కారణమున తన స్థితికి కర్మే కారణమని తెలియక దేవుడు తనను అన్యాయముగా బీదవానిని చేశాడని దేవున్ని నిందించును.

అంతో ఇంతో దేవుని మీద నమ్మకమున్నవాడు కూడా ఈ విధముగా తనకు ఐశ్వర్యము కలిగితే పొంగిపోయి దేవున్ని పొగడడమూ, ఒకవేళ ఐశ్వర్యము లేకుండా కరిగిపోయి కష్టాలు వచ్చినప్పుడు పూర్తిగా కృంగిపోయి దేవుడే అలా చేశాడని దేవున్ని నిందించడము జరుగుచున్నది. దీనికంతటికీ జ్ఞానము తెలియకపోవడమే కారణమని చెప్పవచ్చును. ఈ విషయమును ఖుర్ఆన్ గ్రంథములో ప్రస్తావిస్తూ సూరా 89, ఆయత్ 15,16లలో ఈ విధముగా చెప్పడమైనది చూడండి. **(89-15) "మనిషి పరిస్థితి ఎలాంటి దంటే అతని ప్రభువు అతన్ని పరీక్షించదలచి అతనికి గౌరవ మర్యాదలను, అనుగ్రహభాగ్యాలను ప్రసాదించినప్పుడు అతడు ఉబ్బిపోయి, నా దేవుడు నన్ను ఐశ్వర్యవంతున్ని చేశాడు అని అంటాడు." (89-16) "దేవుడు అతనిని పరీక్షించు నిమిత్తము అతని సంపాదనను తగ్గిపోవునట్లు చేసినప్పుడు అయ్యో! నా దేవుడే నన్ను అవమానమునకు గురిచేశాడు అని వాపోతాడు."** అంతేకాక మనిషిలోని అజ్ఞానము దేవుని గొప్పదనమునకు అగౌరవము కల్గించునట్లు మనిషి మాట్లాడునట్లు చేయుచున్నది. దానితో మనిషి దేవుని వద్ద న్యాయము లేదు అంటున్నాడు. మనిషికి లాభమువస్తే దేవున్ని మంచివాడు అంటాడు. లాభము రాకపోయి నష్టము వచ్చితే దేవుడంత చెడ్డవాడే లేడని దేవున్ని నిందించడము జరుగుతున్నది. లాభనష్టములుగానీ, సుఖ దుఃఖములుగానీ దేవునికి సంబంధములేవని మనిషి అనుకోవడము లేదు. అందువలన మనిషి సుఖములలో దేవున్ని పొగడడము అలాగే దుఃఖములలో దేవున్ని నిందించడము జరుగుచున్నది. ఏదయినా ఎవరి కర్మకొద్దీ వారికి లభించుచున్నదని మనుషులు తెలియలేకున్నారు.

మనిషికి 19 మంది శరీరములోనే దేవుని పాలకులు అవయవముల రూపములో ఉన్నారని చెప్పుకొన్నాము కదా! వాటిలో కర్మేంద్రియములలో చేయి ముఖ్యముకాగా, జ్ఞానేంద్రియములలో కన్ను ముఖ్యమైనది. ఇకపోతే అంతరేంద్రియములలో మనస్సు ముఖ్యమైనది. ఒక మనిషి ఒక విషయమును జ్ఞాపకము పెట్టుకొనుటకుగానీ, మరచిపోవడముగానీ మనస్సు వలననే జరుగుచున్నది. ఆ జ్ఞాపకము మనస్సు వలననే ఉంటున్నది. శరీరములో మననము చేయునది మనస్సు. అందువలన జ్ఞాపకముండడము గానీ, మరచిపోవడముగానీ దేవుని పాలకుడయిన మనస్సు వలన జరుగుచున్నది. మనస్సు కర్మను పాలించుటలో ఒక పాలకునివలెయుండి, ఆత్మ అనుమతితో శరీరములో పని చేయుచున్నది. ఆత్మ ఆధీనములోని మనస్సు దేవునికి ఇష్టమైనట్లు చేయుచున్నది. దేవునికి ఇష్టమైనట్లు ఆత్మే మనస్సును ఆజ్ఞాపించుచున్నది. ఈ విషయమై ఖుర్ఆన్ గ్రంథములో సూరా 87, ఆయత్ 6,7లలో ఇలా చెప్పారు చూడండి. **(87-6) "మేము నిన్ను గ్రంథమును చదివిస్తాము. మరి నీవు దానిని మరువలేవు." (87-7) "అయితే దేవుడు తలచినది మాత్రము మరువగలవు. ఆయన బయటికి చెప్పేదానినీ, చెప్పకుండా లోపలే పెట్టుకొన్న విషయములనూ పూర్తిగా ఎరిగినవాడు."**

మానవ శరీరములో జీవుడు ఒకచోట, ఆత్మ శరీరమంతా ఉండగా, దేవుడు శరీరములోపలా, శరీరము బయటా అంతటా వ్యాపించి యున్నాడు. శరీరమంతా అణువణువునా వ్యాపించియున్నందున శరీరములో దాగియున్న విషయములన్నియూ దేవునికి తెలియును. అలాగే దేవుడు కనిపించకుండా కాలస్వరూపుడై ప్రపంచమంతా వ్యాపించియున్నాడు, కావున ఆయనకు బయటనున్నదేదియూ రహస్యముగా లేదు. దేవుడు శరీరము

లోపల శరీరము బయటనున్న సర్వ విషయములూ తెలిసినవాడు. అయినా ఆయన ఎక్కడా ఎవరికీ తెలియకుండా లోపలా మరియు బయటా అంతటా ఉన్నాడు. దేవుడు శరీరములోపల, శరీరము బయట ఉన్నాడని అంటే విననివారై మేము భౌతిక శాస్త్రమును చదివాము. భౌతిక శాస్త్రములో పట్టాపొంది శరీరమునంతటినీ క్షుణ్ణముగా తెలిసియున్నాము. శరీరములో ఎన్నో పరిశోధనలు చేసి కొన్ని క్రొత్త రోగములను సహితము కనుగొన్నాము. శరీరములో అణిగి తెలియకయున్న రోగములను కనుగొన్న మాకు శరీరములో అణువణువునా తెలియును. శరీరమునకు సంబంధించిన ప్రతి విషయమూ మాకు తెలుసు. మాకు తెలియకుండా శరీరములో ఉన్నది ఏదీ లేదు. అటువంటి మా ముందర ఏమీ తెలియని నీవువచ్చి శరీరములో దేవుడున్నాడు, జీవుడున్నాడు, ఇంకొక ఆత్మయుంది అని అంటున్నావు. నీవు చెప్పవలసింది మా ముందర కాదు. ఏమీ తెలియని వారికి చెప్పు వారు నమ్మగలరు. అన్నీ తెలిసిన మా ముందర చెప్పితే అనవసరముగా మర్యాద పోగొట్టుకున్నవాడవైతావు అనికూడా అంటారు. అటువంటివారితో ఒకమారు నేను మాట్లాడడము జరిగినది. అప్పుడు వారి మాటకు ఘాటుగా సమాధానము ఇచ్చాము వారితో మాట్లాడిన మాట, ప్రతిమాటను వ్రాయుచున్నాము చూడండి.

**నేను :-** శరీరములో జీవుడు, దేవుడు మరియు ఆత్మ ముగ్గురూ ఉన్నారని మీకే కాదు దేశములోయున్న వారందరికీ చెప్పుచున్నాము. మీరు లేరని చెప్పగలరా?

**వారు :-** లేరనియేగా మేము చెప్పుచున్నది. ఉన్నారని మీరు ఎంతమందిని మోసము చేస్తారు?

**నేను :-** ముగ్గురు ఆత్మ, జీవాత్మ, పరమాత్మ శరీరములో లేరని మీరు శాస్త్రబద్ధముగా చెప్పగలరా?

**వారు :-** మేము చదివిన భౌతికశాస్త్రము ప్రకారమే చెప్పుచున్నాము. మేము చదివినంత మీరు చదువకపోయినా మమ్ములనే బుకాయిస్తారా?

**నేను :-** అయ్యా! అనవసరముగా ఎందుకు మాట్లాడుతారు? నేను మిమ్ములను బుకాయించనూ లేదు, బకాయి అడగనూ లేదు. నేను మిమ్ములను శరీరములో ముగ్గురు పురుషులైన ఆత్మ, జీవాత్మ, పరమాత్మ అనువారు శాస్త్రబద్ధముగా లేరా? అని అడుగుచున్నాను.

**వారు :-** భౌతికశాస్త్రము ప్రకారము లేరని చెప్పుచున్నాము.

**మేము :-** ముగ్గురు లేరని శాస్త్రబద్ధముగా ఒక్క ఆధారమునయినా చూపగలరా? **"ఒక విషయమును సమర్థించుటకు శాస్త్రము ఎంత అవసరమో అట్లే ఒక విషయమును ఖండించుటకు శాస్త్రము అంతే అవసరము"** అను సూత్రము ప్రకారము మీరు భౌతికశాస్త్రము ప్రకారమే ముగ్గురు లేరని ఖండించగలరా? అని అడుగుచున్నాను.

**వారు :-** మేము లేరనియేగా చెప్పుచున్నాము. శాస్త్రపద్ధతిగా ఉన్నారని ఎవరూ నిరూపించలేరు!

**మేము :-** మీరు శాస్త్రమును అడ్డము పెట్టుకొని గ్రుడ్డిగా మూడు ఆత్మలు లేవు అంటున్నారు. మీకు తెలిసిన భౌతిక శాస్త్రము 25 పాళ్ళు మాత్రమే 75 పాళ్ళు తెలియనిది కలదు. ఆ 75 పాళ్ళలో మీకు తెలియనిది ఎంతో గలదు. ఎన్నో విషయములు మీకు తెలియనివి గలవు. భౌతికము అంటే భూత సంబంధమైనదని అర్థము. భూతము అంటే ఏమిటో మీకు తెలియదు.

అటువంటప్పుడు భౌతికమును గురించి మాకు తెలుసు అని మీరు అంటే మేము నమ్మాలా? భౌతికము అంటే మరియొక నిగూఢమైన అర్థము కలదు. 'భౌ' అనగా కుక్క మొరగడము లేక మనిషి అరవడము అని అర్థము. తికము అనగా 'సందిగ్ధము' అని అర్థము. తికమక అంటే అర్థముగాని స్థితి అన్నట్లు తికము అంటే నిర్ధారణలేనిది, అర్థముకానిది, సందిగ్ధములో యున్నది అని అర్థము. భౌతికము అనగా అర్థముకాకున్నా మాట్లాడడము అని అర్థము. ఇదియని నిర్ధారణ చేసి చెప్పలేని మాటలను భౌతికము అంటాము. మీరు నేర్చినది ఎటూ తేల్చి చెప్పనిది. భూత సంబంధమైనదని భౌతికమునకు అర్థము ఉన్నప్పుడు జీవుడు ఒక భూతమైనప్పుడు మీకు జీవున్ని గురించి తెలియకపోతే భౌతికమును గురించి పూర్తి తెలియనట్లే కదా!

**వారు :-** నీవు మమ్ములను తికమక చేసి మాట్లాడుచున్నావు. భౌతిక శాస్త్రమును ఐదు సంవత్సరములు చదివితే 25 శాతమే చదివారని అంటున్నావు. భౌతికము అంటే భూత సంబంధమైనదని నిఘంటువులోని అర్థమంటున్నావు. అవన్నీ అవసరములేదు. శరీరమునకు సంబంధించిన ప్రశ్న అడుగు, చెప్పకపోతే అప్పుడు మేము చదివినది 25 పాళ్ళేనని ఒప్పు కుంటాము.

**మేము :-** శరీరములో మనస్సు అనునది ఉన్నదని అంటున్నారు కదా! అది శరీరములో ఎక్కడుందో మీకు తెలుసా?

**వారు :-** తలలోని మెదడునే మనస్సు అంటారు. అది తలలోనేయున్నది.

**మేము :-** మనస్సు తలలో ఉండేదానికి ఆకారమున్నదా? నిద్రపోయే వానిని

పిలిస్తే వాడు మెలుకువలోనికి వచ్చి పలుకుచున్నాడు. నిద్రలో వానికి అది ఎలా వినిపించుచున్నది?

**వారు :-** మనస్సుకు ఆకారము మెదడే. నిద్రపోయేవాడు మెదడు ద్వారానే లేచి పలుకుచున్నాడు.

**మేము :-** మీరు చెప్పిన రెండు జవాబులూ తప్పే. అంతెందుకుగానీ మనస్సు ఆకారము మెదడే అయితే బుద్ధి ఆకారము ఏమవుతుంది? మనస్సు, బుద్ధి రెండూ మెదడులోనే ఉన్నాయా? మనస్సు మెదడులో ఉన్నదనుటయే తప్పు. మనస్సు మెదడులో ఉంటే కాలును గోకితే మనిషి మెలుకువలోనికి ఎందుకు వస్తున్నాడు? కాలును గోకిన సమాచారము ఎలా మెదడుకు చేరింది? అంతకుముందు పాము మీదఎక్కి ప్రాకిపోయినా లేవనివాడు కాలును గోకుతూనే ఎందుకు లేచాడు? ఇప్పుడు గోకిన సమాచారము మెదడుకు పోయినట్లు, పాము ప్రాకినప్పుడు ఆ సమాచారము ఎందుకు మెదడుకు చేరి లేవలేదు? దీనికి ఖచ్చితమైన జవాబు చెప్పగలరా? చెప్పలేరు. చెప్పేది సత్యము కాకున్నా అదే సత్యమని మీరనుకొంటున్నారు. భౌతిక శాస్త్రమును సంపూర్ణముగా తెలియగలిగితే అప్పుడు తికమైన మాట కాకుండా, నిర్ధారణ అయిన మాటయగును. భౌతికము అనగా నిర్ధారణ లేని అరుపు, సత్యముకాని మాటయని అర్థము కదా! ఎప్పుడయితే భౌతిక శాస్త్రమును మనిషి సంపూర్ణముగా తెలియునో అప్పుడు నిర్ధారణ గల మాటయగును. అప్పుడు అర్థము ప్రకారము అభౌతికశాస్త్రమగును. అప్పుడు దాని అర్థమే మారిపోవును. అంతకుముందు భౌతికశాస్త్రము అనునప్పుడు నిఘంటువు అర్థము ప్రకారము భూత సంబంధమైన శాస్త్రము అని అర్థము. అభౌతికము అని పేరువచ్చినప్పుడు భూతసంబంధము కాకుండా అభూతసంబంధమగును. అభూత అనగా ఆత్మయని అర్థము.

భూత అనగా జీవాత్మయని అర్థముకాగా అభూత అనగా జీవము కానిదనీ, జీవముకంటే వేరైనదనీ జీవాత్మకంటే వేరుగాయుండునది ఆత్మయనీ అర్థమగును. అభౌతికమును తెలియగలిగినప్పుడు ఆత్మ విషయము కూడా వానికి తెలియును.

భౌతికశాస్త్రము సంపూర్ణముగా తెలియాలంటే దానితో అను బంధముగాయున్న బ్రహ్మవిద్యాశాస్త్రములో కొంత భాగమును తెలియగలిగి నప్పుడు భౌతికశాస్త్రము సంపూర్ణముగా తెలియగలిగి భౌతికము అభౌతికము గా మారిపోగలదు. అప్పుడు శరీరములో జీవాత్మతోపాటు ఆత్మకూడా ఉన్నదని తెలియును. అంతవరకూ పేరు వుండి ఆకారములేని మనస్సు, అట్లే శరీరములోనున్న బుద్ధికి ఆకారము కూడా ఉన్నట్లు తెలియును. భౌతికములో అంతవరకూ తెలియని ఎన్నో విషయములు అభౌతికములో తెలిసిపోవును. అప్పుడు భౌతికశాస్త్రమును పూర్తిగా చదివినట్లగును. ఇప్పుడు భౌతికశాస్త్రవేత్తలమను వారు చదివినది కేవలము నాలుగు భాగములలో ఒక భాగము మాత్రమే. ఇంకా మూడింతలు చదువవలసి యున్నదని భౌతికశాస్త్రవేత్తలు తెలియాలి. భౌతికశాస్త్రము సంపూర్ణమై పోయినప్పుడు, అది అభౌతికశాస్త్రముగా పేరు మార్చుకొన్నప్పుడు శరీరములోనే ఆత్మ, జీవాత్మ, పరమాత్మ మూడూ ఉన్నట్లు తెలియగలదు. శరీరములోనే ఆత్మ, పరమాత్మ, జీవాత్మయను మూడు ఆత్మలుగలవని తెలిసినప్పుడు శరీరములోనే దేవుడున్నాడను విశ్వాసము మనిషిలో కలుగును. శరీరములోనే దేవుడున్నాడని తెలిసినప్పుడు మనిషి భక్తితో మసలుటకు మొదలుపెట్టును. భౌతికశాస్త్రమును తెలిసినవారు పెద్ద చదువులు చదివినవారు దేవుడు అంటే నమ్మరు. అటువంటి వారికి దేవుని శాపము కాకపోయినా, దేవదూతల శాపము తప్పక పడుతుంది. ఈ

విషయమునే చెప్పుచూ ఖుర్ఆన్ గ్రంథములో సూరా 2, ఆయత్ 161లో ఇలా వ్రాయడము జరిగినది. **(2-161) "నిశ్చయముగా ఎవరైతే సత్యతిరస్కారులై అవిశ్వాసానికి పాల్పడితే, అదే అవిశ్వాసము లోనే చనిపోతే, అటువంటి వారిపై దేవునియొక్క శాపము ఉంటుంది. మరియు దేవదూతల శాపమూ, మనుషులందరి శాపమూ ఉంటుంది."**

మనిషి పుట్టిన తర్వాత ఎప్పుడో ఒకప్పుడు మరణము అను గడువు వస్తుంది. ఆ గడువు వచ్చినప్పుడు మనిషి అడవిలో ఉన్నా, ఊరిలోయున్నా, మెలుకువలోయున్నా, నిద్రలోయున్నా, రాత్రి అయినా, పగలయినా, ముసలి తనములో అయినా లేక చిన్న వయస్సులో అయినా మరణమును పొందడము ఖాయము. దానిని ఎవరూ తప్పించలేరు. తప్పించుకోలేరు. చనిపోయిన మనిషి తిరిగి వీర్యబిందువుతో తల్లిగర్భము నుండి రెండవ జన్మ తీసుకొనుననీ 53వ సూరా, 46,47 వాక్యములలో చెప్పడమైనది. తర్వాత జన్మలో చనిపోయినప్పుడు మొదటి జన్మ కర్మపత్రము ప్రకారము జీవించినవాడు తర్వాత వచ్చు జన్మలో కూడా అదే విధముగా జీవించును. ఈ విధముగా ఒకచోట చావడము మరియొక చోట పుట్టడము సృష్ట్యాది నుండి జరుగుతూనే యున్నది. అట్లుకాకుండా చనిపోయినవాడు ప్రళయము వరకు భూసమాధిలో ఉండునని కొందరు చెప్పుకొన్నట్లు జరుగదని ఖుర్ఆన్ గ్రంథము తేల్చి చెప్పింది. ఒకచోట చనిపోయినవాడు మరొకచోట పుట్టడము తథ్యము.

ఈ విధముగా ఎడతెరపిలేకుండా జరుగుచూనేయున్నది. అయితే ఎప్పుడో ఒకప్పుడు చనిపోయిన తర్వాత జన్మకు పోకుండా దేవునిలోనికి పోవుట జరుగవలసిందే. ఎవడయితే తన కర్మపత్రములో కర్మలు వ్రాసు

కోకుండా ఖాళీ చేసుకొనునో వాడు తిరిగి పుట్టవలసిన పనిలేదు. చివరకు సర్వజీవరాశులూ ఎప్పుడో ఒకప్పుడు ఒకటి ముందు ఒకటి వెనుక తప్పని సరిగా దేవునిలోనికి పోవలసిందేయని తెలియవలెను. మనిషి మొదట దేవునినుండి వచ్చాడు. అలా వచ్చినవాడు ఎన్ని జన్మలెత్తినా చివరకు దేవునియందు చేరిపోవలసిందే. సకల జీవరాసులకు గమ్యస్థానము దేవుడే. అందువలన ఎవరు ఎన్ని జన్మలు ఎత్తినా చివరకు మోక్షమును పొంది జన్మరాహిత్యమును చేసుకొని దేవునియందు ఐక్యము కావలసిందే. ఇదే విషయమును ఖుర్ఆన్ గ్రంథములో సూరా2, ఆయత్ 46నందు ఇలా వ్రాయడము జరిగినది. **(2-46) "చివరికి అందరూ తమ ప్రభువైన దేవున్ని కలుసుకోవలసిందేనని, ఆయన వైపుకే మరలిపోవలసి యుందని వారు నమ్ముతారు."** ఇదేకాక మరోచోట మరియొక సూరా 10, ఆయత్ 56నందు ఇలా చెప్పారు చూడండి. **(10-56) " ఆయనే జీవన్మరణాలను ఇచ్చేవాడు, మరియు మీరంతా ఆయనవైపుకే మరలింపబడుతారు."** మరయొకచోట సూరా 29, ఆయత్ 57లో ఇలా చెప్పారు. **(29-57) "ప్రతి ప్రాణీ చావును చవిచూస్తుంది. ఆ తరువాత మీరందరూ ఆయనవైపుకే మరలింపబడుతారు."** మరియొక సూరా 32, ఆయత్ 11లో ఈ విధముగా వ్రాశారు చూడండి. **(32-11) "వారితో ఇలా అను! మీపై నియమింపబడిన మృత్యుదూత మీ ప్రాణము తీస్తాడు. ఆ తరువాత మీరు మీ ప్రభువువద్దకు మరలింపబడుతారు."** మరియొకచోట సూరా 50, ఆయత్ 43నందు ఇలా కలదు. **(50-43) "నిశ్చయముగా మేమే జీవనమిచ్చేవారము మరియు మరణింప చేసేవారము. మరియు మీ అందరి మరలింపు మా వైపునకే జరుగుతుంది."**

దేవుడు జననమును, మరణమును ఇస్తున్నాడనీ పై వాక్యములలో తెలియుచున్నది. అలా ఎన్ని జన్మలు మారినా చివరకు ఎవరయినా దేవుని లోనికి చేరిపోవలసిందేనని చెప్పారు. ఇక్కడ కొందరు ముస్లీమ్‌లు చావు పుట్టుకలు మరిమరి జరుగవు. మనిషి ఒకమారే పుట్టి, ఒకమారే చనిపోవు చున్నాడు. చనిపోయిన తర్వాత భూమిలో పూడ్చిపెట్టడము జరుగుతా యున్నది. అలా పూడ్చిపెట్టిన తర్వాత ప్రళయ కాలము వరకు అతను ఆ గుంతలోనే ఉండును. ప్రళయములో అంతిమదినమున అందరినీ భూ సమాధులనుండి బయటికి సజీవముగా శరీరముతోనే లేపి, వాడు జీవించి నప్పుడు చేసుకొన్న పాపపుణ్యముల లెక్కచూచి వాడు మంచిపనులు చేసియుంటే, దేవున్ని విశ్వసించియుంటే అతనిని స్వర్గమునకు పంపుననీ, ఒకవేళ లేపబడినవాడు చెడుపనులను చేసియుంటే, దేవున్ని విశ్వసించ కుండా అవిశ్వాసిగాయుంటే అతనిని నరకమునకు పంపుననీ చెప్పుచున్నారు. అంతేకాక స్వర్గమునకుపోయినవాడు శాశ్వతముగా స్వర్గములో ఉండునని అట్లే నరకమునకు పోయినవాడు శాశ్వతముగా నరకములో ఉండుననీ కూడా చెప్పడము జరుగుచున్నది, వ్రాసుకోవడము జరిగినది. వారిమాటే నిజమయితే పైన చెప్పిన ఐదు వాక్యములలో మనిషి ఎప్పటికయినా దేవుని వైపు పోవలసిందే అనుమాట అసత్యమగును. మంచి చేసినవాడు స్వర్గానికీ, తప్పు చేసినవాడు నరకానికి పోతూవుంటే, ప్రళయమువరకు గుంతలో ఉండడము సరిపోయి, ప్రళయము తర్వాత స్వర్గ, నరకములకుపోయి తిరిగి పుట్టకుండా అక్కడే వుంటే దేవునివద్దకు పోవుమాట అబద్ధమగును కదా! చావుపుట్టుకలు లేవు అంటే దేవునిమాటకు వ్యతిరేఖముగా చెప్పినట్లు కాదా! 53వ సూరాలో, 46, 47 ఆయత్‌లలో తిరిగి తల్లిగర్భమునుంచే తండ్రి వీర్యబిందువుతోనే పుట్టిస్తానని చెప్పిన వాక్యము అర్థహీనము కాదా!

అందరికంటే దేవున్ని ఎక్కువగా విశ్వసించు ముస్లీమ్‌లు దేవున్ని ప్రేమిస్తూ, దేవుని మాటను ఖండించడము, కాదనడము మంచిదాయని అడుగు చున్నాము. అందువలన 'జన్మలు లేవు' అనుమాటను తిరిగి ఆలోచించుకో మని చెప్పుచున్నాను. ఎవరికొరకో దేవుని వాక్యమును తక్కువ చేసి మాట్లాడ కూడదు. ఎవరయినా దేవుని వాక్యములకు సరిగా చెప్పవలసినది పోయి అందరికంటే అమితముగా దేవున్ని ఆరాధించు ముస్లీమ్‌లు దేవుని వాక్యమునకు వ్యతిరేఖముగా మాట్లాడడము విచిత్రముగా ఉన్నది. దానిని కొంత ఆలోచించమని కోరుచున్నాము.

పై వాక్యములలో చెప్పిన భావము కేవలము అజ్ఞానముగా బ్రతుకు వారికి చెప్పినదనియే అర్థమగుచున్నది. ఎంతకాలము అజ్ఞానముగా బ్రతికినా ఎప్పటికయినా జ్ఞానమును ఆశ్రయించి దేవుని జ్ఞానము ద్వారానే దేవుని వద్దకు పోవలెనని ఆ వాక్యములలో అర్థము కలదు. మనిషి చివరికి కొంత జ్ఞానమును తెలిసి దైవములోనికి చేరవలెననుకొన్నప్పటికీ అతను అనుసరించు ధర్మము సరికానిదైతే చివరకు ఆలస్యముగానయినా, సరియైన ధర్మమును ఆచరించి దేవునివైపు పోవలసిందేనని తెలిపారు. ఈ విషయమును ఖుర్‌ఆన్ గ్రంథములో తెలియజేస్తూ సూరా 3, ఆయత్ 83,85 లలో ఈ విధముగా చెప్పారు చూడండి. **(3-83) "ఆకాశములోనూ, భూమిలోనూ ఉన్నవారంతా తమకు ఇష్టమున్నా, ఇష్టములేకపోయినా దేవునికి విధేయులైయున్నారు. మీరు దేవుని ధర్మమును కాకుండా మరో ధర్మాన్ని అన్వేషిస్తున్నారా? చివరకు వారంతా దేవునివైపుకే మరలింప బడుతారు."** ఇదే విషయమునే మరొకచోట సూరా 3, ఆయత్ 85లో ఈ విధముగా చెప్పారు చూడండి. **(3-85) "ఎవరయినా దేవుని ధర్మమును కాకుండా మరో ధర్మాన్ని ఆచరిస్తే అతని ధర్మము**

**స్వీకరించబడదు. అలాంటి వ్యక్తి పరలోకములో నష్టపోయిన వారిలో చేరిపోతాడు."** మనిషి అంతో ఇంతో దేవుని మీద ధ్యాసకల్గినవాడై దేవున్ని చేరుకోవాలను ప్రయత్నము చేయుచూ అసలయిన దేవుడు ఎవరో, అసలయిన ధర్మము ఏదో తెలియక ఇతర ధర్మములను అనుసరిస్తున్నాడు. కొందరు సక్రమమయిన మార్గములోనే నడువగా, కొందరు దారితప్పి నడుస్తున్నారు. దారి తప్పి నడువువారు కూడా చివరకు అసలయిన ధర్మములోనికి వచ్చి చివరకు సత్యమైన మార్గములోనే నడచి దేవునివైపు పోవుచున్నారు. తప్పుదారిన పోవువారిని కూడా దేవుడు తనవైపుకే మరలించుతాడు. దేవుని ధర్మమని పొరబడి ప్రకృతి ధర్మమును అనుసరించినవాడు చివరికి దేవుని చేత ప్రకృతి ధర్మమునుండి మరలించబడి దేవున్ని చేరగలడు. ప్రకృతి ధర్మమును ఆచరించినవాడు చివరికి కొంత సమయమును నష్టపోయినా చివరకు దేవున్నే చేరగలడు.

దేవుని ధర్మమును ఆచరించువాడు దేవునియందు చేరిపోవును. అలా చేరిపోవడమునే మోక్షము అంటాము, లేకపోతే జన్మరాహిత్యము (జన్మలు లేకుండా పోవడము) అని అంటాము. దేవునియందు చేరిపోయిన వాడు తిరిగి జన్మించడు. అయితే దేవుని ధర్మము ఆచరించకుండా దేవుని ధర్మమేయని పొరపడి, ప్రకృతి ధర్మమును ఆచరించువానికి, దేవునివైపు పోవుటకు సాధ్యముకాదు. అటువంటివాడు ఎంతకాలము ప్రకృతి ధర్మములను ఆచరించునో, అంతకాలము దేవునిదారి తప్పి నడచిన వాడగును. అట్లు ఎప్పటికయినా, ఎంతకాలానికయినా, దేవుని ధర్మమును ఆచరించి, దేవునిమార్గములో ప్రయాణించి, చివరకు దేవునియందు చేరిపోవలసిందే. కొంతకాలము ప్రకృతి ధర్మములను అనుసరిస్తూ, దేవుడు కాని దయ్యములను ఆరాధించుచూ, పాపపుణ్య విచక్షణ లేకుండా పనులు

చేసియుండుట వలన, కర్మలను ఎక్కువగా సంపాదించుకొని యుండును. అట్టివానికి పాపములు ఎక్కువే ఉండును. పుణ్యములూ ఎక్కువే ఉండును. పాపపుణ్యములను ఎక్కువ సంపాదించినవాడు కొంతకాలమునకు వానిలో బుద్ధి మార్పువలన, ప్రకృతి ధర్మమును వదలి పరమాత్మ ధర్మములను ఆచరించను మొదలుపెట్టును అనుకొనుము. అప్పుడు వాడు దేవుని మార్గములోనికి వచ్చినట్లేయగుచున్నది. వాడు దేవుని ధర్మమునే ఆచరించుట వలన, వాడు దేవునియందు ఐక్యమగుటకు కొద్దికొద్దిగా అర్హత సంపాదించు కొనుచుండును. దేవునిమార్గములోనికి ప్రవేశించినవాడు దేవున్ని చేరుటకు ఎంతకాలము పట్టును? అని కొందరు ప్రశ్నించవచ్చును. దానికి మా జవాబు ఏమనగా!

దేవునికి దగ్గరగాయున్నవాడు దేవున్ని తొందరగా చేరగలడు. దూరముగాయున్నవాడు ఆలస్యముగా చేరగలడు. అది ముందే వాడున్న దూరమునుబట్టియుండును. ఈ విషయము అర్థమయ్యేదానికి చిన్న ఉదాహరణను చెప్పుకొందాము. హైదరాబాద్ నుండి బెంగుళూరుకి 565 కిలోమీటర్ల దూరమున్నది. హైదరాబాద్‌నుండి బెంగుళూరువరకు జాతీయ రహదారి (హైవే) కలదు. హైదరాబాద్‌నుండి బెంగుళూరు వరకు బస్సులో ప్రయాణిస్తే పది స్టేజీలున్నాయనుకొనుము. హైదరాబాద్‌లో బస్సు ఎక్కిన వానికి బెంగుళూరు చేరటానికి పదిగంటల కాలము జరుగుచున్నది. ఎనిమిదో స్టేజీలో ఎక్కినవానికి ఎనిమిది గంటలకాలము పట్టును. అలాగే ఐదవ స్టేజీలో ఎక్కినవానికి ఐదు గంటల కాలము పట్టును. చివరి రెండవ స్టేజీలో ఎక్కినవానికి రెండు గంటల కాలమే పట్టును కదా! అదే ప్రకారమే పాపపుణ్యములను కర్మలను ఎక్కువ సంపాదించికొన్నవానికి ఎక్కువ కాలము, తక్కువ సంపాదించుకొన్నవానికి తక్కువ కాలముపట్టును. ఇక్కడ కూడా

చిన్న ఉపమానమును చెప్పుకొందాము. నీ దగ్గర పది టన్నుల బెల్లము చెరుకు ఉందనుకొనుము. చెరుకులు ఎవరివద్దయున్నా వానికి ఆ ఊరిగుడిలో ప్రవేశముండదు. చెరుకులు లేనివాడు ఎవడయినా ఊరిలోని గుడిలోనికి పోవచ్చునను నియమము ఒక ఊరిలో గలదు. ఆ ఊరిలో పది టన్నుల చెరుకున్న కర్మనాథ్ ఉన్నాడనుకొనుము. అతడు వారి ఊరిలోని గుడిలోనికి పోవాలంటే గుడి నియమము ప్రకారము అతని వద్దనున్న చెరుకంతా లేకుండా పోవాలి. అదే ఊరిలో ఇంకా కొందరు గుడిలోనికి పోవాలను ఉద్దేశ్యముతోనేయున్నారు. అయితే వారిలో రెండు టన్నులు ఒకరివద్ద ఉండగా, మరొకనివద్ద మూడు టన్నుల చెరుకున్నది.

రెండు టన్నుల చెరుకువాడు గంటకు ఒక చెరుకు గడను తినుచూ పగలు పన్నెండు చెరుకులను తినేవాడు. తింటూపోతే కొంతకాలనికి చెరుకు అయిపోవుట నిజమే అయినా ఆ పని చాలాకాలము పట్టును. అట్లు చాలాకాలము వరకు తినుకుంటూ కూర్చోకుండా ప్రతిరోజూ కొన్ని చెరుకులను అగ్గిపెట్టి దానిని ఎవరయినా చూచినా ఇది చెరుకని గుర్తు పట్టనట్లు కాల్చి వేయుచుండెను. ప్రతి దినము కొన్ని చెరుకులను తింటూ, నెలరోజులు తింటే అయిపోవు చెరుకులను ఒకేరోజు కాల్చుచుండెను. ఆ విధముగా రెండు వైపులా చెరుకులను లేకుండా చేయుచుండెను. అలా చేయుట వలన రెండుటన్నుల చెరుకుగలవాడు రెండు నెలలలో చెరకులన్నీ అయిపోగొట్టుకొని చివరికి ఆ ఊరి నియమము ప్రకారము ఒక్క చెరుకు కూడా లేకుండా చేసుకొని గుడిలో ప్రవేశించి గౌరవమును పొందాడు. అయితే మూడు టన్నుల చెరుకు గలవాడు ప్రతిరోజూ ఒక డజను చెరుకులను తింటూ ఉండెను. అయితే రెండు టన్నుల చెరుకువాడు అగ్గిపెట్టి కాల్చుకొన్నట్లు ఇతను కాల్చుకోలేకపోయాడు. మూడు టన్నుల వానివద్ద

అగ్గిలేదు, కాల్చే ఉపాయము తెలియదు. అందువలన అతనికి చెరుకులన్నీ అయిపోవుటకు మూడు సంవత్సరములు పట్టినది. ఇకపోతే పదిటన్నులు చెరుకుగల కర్మనాథ్ ప్రతి దినము తాను చెరుకులను తింటూ కొంత ఉపాయముతో చెరుకులను కాల్చుచుండెను. అయితే రెండు టన్నుల చెరుకును రెండునెలలలో కాల్చివేయగా ఆ విధముగా కర్మనాథ్ కాల్చలేకపోయాడు. రెండు టన్నుల వాడు బ్లోర్‌పెట్టి గాలి ఊదుతూ మంటను మండించుట వలన రెండు టన్నుల చెరుకు రెండు నెలలలో అయిపోయినది.

పది టన్నుల చెరుకుగల కర్మనాథ్ దగ్గర బ్లోర్ లేనిదానివలన గాలి ఊది మండించలేకపోయాడు. తనకు తెలిసిన పద్ధతిలో కొన్ని కట్టెలను చెత్తను వేసి అంటించి మండిన అగ్నిలో చెరుకును కాల్చను మొదలు పెట్టెను. అలా మండించుట వలన పచ్చిచెరుకు తొందరగా అంటుకొని మండక కొన్ని చెరుకులు మండుటకు గంటకాలము పట్టుచుండెను. ఆ విధముగా అతనివద్దనున్న పదిటన్నుల చెరుకులు అయిపోవుటకు ఐదు సంవత్సరముల కాలముపట్టినది. ఈ విధముగా వారికి తెలిసిన పద్ధతినిబట్టి ఉన్న ఓపికను బట్టి రెండు టన్నులవాడు రెండునెలలలో కాల్చివేయగా, మూడు టన్నులవాడు తిని అయిపోగొట్టుటకు మూడు సంవత్సరములు పట్టినది. ఇకపోతే పది టన్నుల కర్మనాథ్ రెండు విధములా ప్రయత్నము చేసినా కాల్చడములో నైపుణ్యత, తినడములో వేగము లేనిదానివలన అతనికి పూర్తిగా చెరుకులు అయిపోవుటకు ఐదు సంవత్సరములు పట్టినది. ఈ విధముగా ముగ్గురికీ మూడు రకముల కాలముపట్టినది. ముగ్గురూ వారు అనుసరించిన విధానములను బట్టి, వారివద్దయున్న చెరుకులనుబట్టి వారికి ఒక్కొక్కరికి ఒక్కొక్క విధమైన కాలము పట్టినదని చెప్పవచ్చును. అదే విధముగా కర్మయను చెరుకులు కలవారు ఉపాయముంటే రెండు రకముల చెరుకులను

(కర్మలను) లేకుండా చేసుకోవచ్చును. ఉపాయము లేకపోతే ఒక రకముగా అయినా తిని అయిపోగొట్టుకొన్నట్లు చేసుకోవచ్చును.

ఇప్పుడు అసలు విషయానికి వస్తాము. దేవునివద్దకు మనిషి పోవాలంటే ఒక నియమము కలదు. ఏ విధముగా గుడి ప్రవేశమునకు చెరుకులు లేకుండా ఉండవలెనో, అదే విధముగా దేవునివద్దకు పోవువానికి, మోక్షము పొందువానికి గతములో వాడు చేసుకొన్న పాపపుణ్యములను కర్మలు ఏమాత్రము లేకుండాపోయి ఉండాలి. కొద్దిపాటి కర్మయున్నా అతడు దేవునివద్దకు పోవుటకు అర్హుడుకాడు. పూర్తి కర్మరహితుడు మాత్రమే దేవునివద్దకు చేరగలడు. అయితే మనిషి దేవునివద్దకు పోవాలను ఉద్దేశ్యము వచ్చు లోపల వానికి ఎంతో కర్మవచ్చియుండును. ఎందుకనగా! వాడు ప్రకృతి మార్గములో ఎక్కువగా ప్రయాణించుట వలన అనేక కర్మలు వానికి తగులుకోవడము జరిగినది. దానిని కష్టసుఖముల రూపములో అనుభవించుతూపోతే కనీసము పది జన్మలకు కూడా అయిపోనంత కర్మయుండుట వలన, తొందరగా దేవునివద్దకు పోవుటకు యోగులవద్దకు పోయి ఉపాయమడుగగా, వారు జ్ఞానమను అగ్నితో కాల్చుకోవచ్చని చెప్పారు. అట్లే యోగము వలన అగ్నిని ఎలా తయారుచేసుకోవాలో కూడా చెప్పారు. అప్పుడు కర్మనాథ్ ఒక ప్రక్క కర్మను అనుభవించుచూ మరొక ప్రక్క కర్మ నాశనమగు కర్మయోగమును ఆచరించుచుండెను. అయితే కర్మయోగము చేయుటలో అనుభవము లేనిదానివలన కర్మయోగము నిదానముగా జరుగు చుండెను. కర్మయోగము పూర్తి సాఫల్యము లేనిదానివలన జ్ఞానాగ్ని కూడా అతనికి తక్కువ లభించుచుండెను. ఇదంతయూ గమనించిన ఆత్మ అతని శ్రద్ధనుబట్టి అతనికి సహాయము చేయాలనుకొన్నది. **శరీరములోనున్న ప్రతి జీవునికి సహచరుడు, సహాయకుడు, స్నేహితుడుగా ఆత్మ**

**యున్నది.** "మనిషి తనకర్మను తానే లేకుండా చేసుకోవాలి" అనునది ముఖ్యసూత్రము. అంతేకాక జీవాత్మ కర్మను ఆత్మ తొలగించదు అనుటకు 'ఎవరి కర్మనూ ఆత్మ తీసివేయదు' అను సూత్రము కూడా కలదు. ఈ సూత్రములను అతిక్రమించకుండా, తాను ఏమాత్రము జీవుని కర్మను లేకుండా చేయక, జీవుని కర్మను జీవుని చేత వేగముగా ఆత్మ అనుభవింప జేయుచున్నది. ఎంత వేగముగా అనుభవింపజేయును అంటే ఒక నెలకు సరిపోవు కర్మను ఒక నిమిషములో అనుభవింపజేయు చాకచక్యము ఆత్మకు గలదు. నిబంధనను అతిక్రమించకుండా జీవుని కర్మను వేగముగా అయిపోవునట్లు ఆత్మ ఒక్కడు మాత్రము చేయగలడు. దేవుడు ఏమీ చేయడు చూస్తూ ఉంటాడు. ఆత్మ చేస్తూ ఉంటుంది. ఆ విధముగా కర్మను లేకుండా చేయడములో జీవునికి మంచి సహాయము చేయుట వలన, ఆత్మను స్నేహితుడు అని గ్రంథములలో వ్రాయడము జరిగినది. 'హితుడు' అనగా మంచిని చేయువాడు. 'స్నే' అనగా దగ్గరగాయున్నవాడు అని అర్థము. స్నేహితుడు అనగా దగ్గరగాయుండి మంచి చేయువాడు అని అర్థము. మనిషికి అనగా జీవునికి ఒకడే స్నేహితుడు గలడు. వాడే నీలో ఉండే ఆత్మ. నీలో ఉండే ఆత్మ కర్మ విషయములో నీకు మేలు చేయదలిస్తే ఈ విధముగా చేయగలడు.

రాత్రిపూట మనిషి పడుకొని నిద్రపోవును. పగలంతా కర్మలను అనుభవించి కొంత అయిపోజేసినా, మనిషి కర్మయోగము ద్వారా క్రొత్త కర్మను రాకుండా చేసుకొనును. క్రొత్తది రాదు, పాతది అనుభవములో పోయింది. అందువలన వానిలో కర్మ కొంత తగ్గిపోయింది. అనుభవించు చూ పాతకర్మను అయిపోజేయాలంటే చాలాకాలము పట్టును, కనుక మనిషి ఉద్దేశ్యమునుబట్టి, వాని శ్రద్ధనుబట్టి, వానిలోని ఆత్మ వానికర్మను వానిచేతనే

అనుభవింపజేసి తొందరగా అయిపోవునట్లు చేయుచున్నది. వానిచేతనే అనుభవింపజేయుచున్నది అంటే, ఆత్మ ఏమి హితము చేసినది అని కొందరు అనుకోవచ్చును. ఆ విధముగా అనుకొనుటకు వీలులేనట్లు, ఎంతో కర్మను అయిపోవునట్లు ఒక స్వప్నములో గొప్పగొప్ప కర్మలను అనుభవింపజేసి, దానివలన మనిషికి ఏ బాధా లేకుండా చేయుచున్నది. ఆ విధముగా చేయుటకు స్వప్నము చాలా ఉపయోగపడుచున్నది. స్వప్నములో ఎంత కర్మ జరిగినా, ఒక విధముగా అనుభవించాడని చెప్పవచ్చును. మరొక విధముగా అనుభవించ లేదని కూడా చెప్పవచ్చును. స్వప్నములో కర్మను అనుభవించాడు అనుటకు ఆధారములు దొరుకుచున్నవిగానీ, స్వప్నములో అనుభవములు మనిషిని పూర్తిగా బాధించినట్లు ఆధారములు ఉండవు. అనుభవముల జ్ఞాపకములు కూడా తెల్లవారేసరికి లేకుండా పోవుచున్నవి. ఒక మనిషిలోని కర్మను సులభముగా తీసివేయడము వలన జీవునికి ఆత్మ ఎంతో మేలుచేసి, దేవునికి దగ్గరగునట్లు చేయుచున్నది. ఒక సంవత్సరములో జరుగవలసిన కర్మను ఒక గంటలో స్వప్నమునందు అయిపోవునట్లు చేసి, జీవున్ని అంటీ అంటనట్లు అనుభవింపజేసి, దానివలన జీవుడు ఏ భావమునూ పొందనట్లు ఆత్మ చేయుచున్నది. ఆత్మ ఆ విధముగా చేయడము ఎవరికీ తెలియని పెద్ద రహస్యముగాయున్నది. మనిషి శరీరములో పగలు మరియు రాత్రి జీవుని చేత కర్మలను ఆత్మ అనుభవింపజేసినా రాత్రిపూట ధ్యాసను లేకుండాచేసి అనుభవించినా అనుభవించనట్లే చేయుచున్నది. ఈ విధానమును జిబ్రయేల్ ముహమ్మద్ ప్రవక్తగారికి చెప్పుచూ సూరా 11, ఆయత్ 114లో ఈ విధముగా చెప్పడమైనది చూడండి. **(11-114) "దినము యొక్క రెండు అంచులలోనూ నమాజును స్థాపించు (ప్రార్థన చేయుము). రాత్రి గడియలలో కూడా నిశ్చయముగా పుణ్య**

**కార్యములు, పాపకార్యములను దూరము చేస్తాయి. హితబోధను గ్రహించగలిగితే వారికి ఇదొక హితోపదేశము."** ఈ వాక్యములో పుణ్యకార్యములు, పాపకార్యములను దూరము చేస్తాయి అని కలదు. అట్లు ఎప్పటికీ కర్మ కర్మను లేకుండా చేయదు. ఆ మాట ఆధ్యాత్మిక నియమములకే వ్యతిరేఖమగును, కర్మ కర్మను హరించదు. అందువలన రెండు కర్మలు లేకుండా పోవుచుండుట వాస్తవము, జరుగుచున్న సత్యము. యోగసాధన చేయనివానికి కూడా ఆత్మ సహాయము చేయుచూ రాత్రిపూట కర్మలను సులభముగా లేకుండా చేయుచున్నది. ఇట్లు అజ్ఞానులకు, జ్ఞానులకు ఇరువురికీ చేయుచూ అందరికీ ఆత్మే స్నేహితుడు అని అనిపించుకొన్నది. కొన్ని విషయములలో స్నేహితుడైన ఆత్మ మరికొన్ని విషయములలో మనుషుల ఎడల క్రూరముగా వ్యవహరించుచున్నది. అందువలన ఆత్మను అన్ని విధములా నటించుచున్న దని మాత్రము చెప్పగలము.

ఆత్మ మనిషికి మిత్రుడు మరియు శత్రువు. అంతేకాక ఆత్మ తండ్రి, తాత, మొదలగు అన్ని పాత్రలలో ఇమిడిపోగలదు. అందువలన ఆత్మను ఎవరూ గుర్తించలేరు. దానికి ఒక విధానమంటూ లేదు. అన్ని రకములుగా నటించగలదు. అందరినీ ఆడించగలదు. ఆత్మ శరీరములో చాలా ముఖ్యపాత్ర పోషించుచూ, జీవాత్మకు పరమాత్మకు మధ్యలో మెలుగు చున్నది. పరమాత్మ ప్రకృతి అను రెండిటిలో ప్రకృతి స్త్రీ సంబంధమైనది. పరమాత్మ పురుషుడని భగవద్గీత గుణత్రయ విభాగయోగములో చెప్పి యున్నారు. శరీరములో ప్రకృతితో ప్రకృతి కలిసి పుట్టినవన్నీ స్త్రీసంబంధమని చెప్పవచ్చును. పరమాత్మ చేత పుట్టినవి జీవాత్మ, ఆత్మ రెండూ పురుషులే, పరమాత్మ పురుషోత్తముడు. అయితే పురుషులుగాయున్న ఆత్మను జీవాత్మను మరియు పరమాత్మను అనేక సందర్భములలో అది ఇది అని స్త్రీలను

ఉచ్ఛాటన చేసినట్లు చెప్పుచుండుట వలన చాలామంది ఆత్మ, జీవాత్మలను స్త్రీలుగా పోల్చుకొన్నారు. వాస్తవముగా జీవాత్మ, ఆత్మలు స్త్రీతత్త్వము లేనివారు. వారిని పురుషులుగానే లెక్కించవలెను. దేవునికి దూతలయిన, సేవకులయిన ఆత్మ, జీవాత్మలను స్త్రీలుగా చెప్పకూడదు. అలాగే పరమాత్మ అంశలేని వారిని పురుషులుగా చెప్పకూడదు.

మేము ఏమి చెప్పినా గ్రంథములోని విషయములను ఆధారముగా చూపుచూ దేవుడు తన గ్రంథములో ఇలా చెప్పాడు అని చెప్పుచున్నాము. అయితే కొందరు గ్రంథమును ఏమాత్రము చూడరు. గ్రంథములోని విషయములను చదువరు. ఏమీ తెలియకనే తాము తమ మతమును ఉద్ధరించువారిలో మొదటివారమనుకొని జ్ఞానులతో వాదించుచుందురు. అటువంటి వారిని గురించి సూరా 22, ఆయత్ 8లో ఇలా చెప్పుచున్నారు చూడండి. **(22-8) "మరికొంతమంది జ్ఞానమునుగానీ, మార్గదర్శకత్వమునుగానీ, జ్యోతిర్మయమైన గ్రంథమునుగానీ, లేకుండానే దేవుని విషయములో అతివాదము చేయుచుందురు."** అటువంటివారు దేవుని ధర్మములను రక్షించడము లేదు, వారే ధర్మములను భక్షించుచున్నారు. దేవుడు తన జ్ఞానమును గ్రంథములో చెప్పిన దానిని లెక్కచేయక ప్రపంచ విషయములలో మునిగి తేలుచుందురు. అటువంటి మనిషిని ఒకే జన్మలో శాశ్వతముగా ఉండునట్లు దేవుడు ఎప్పుడూ చేయలేదు. ఎవడూ ఇంతవరకు ఎప్పుడూ శాశ్వతముగా ఒకే జీవితములో ఉండలేదు. ఒకడు జన్మించాడంటే అది శరీరముతోనే జరుగుతుంది. శరీరము ప్రతి దినమూ మార్పు చెందుతూ ఉంటుంది. అలా మార్పుచెందుచూ శిశుదశనుండి బాల్యదశ, బాల్య దశ నుండి యౌవ్వన, కౌమార, వృద్ధాప్య దశలకు చేరుకొని చివరకు మరణించడము కూడా జరుగును. ఇది ప్రతి జీవి శరీరములో

జరుగుచున్నది. ఒక శరీరముతో వందల సంవత్సరములు బ్రతికిన వారున్నారు. అరుదుగా వేయి, రెండువేల సంవత్సరములు బ్రతికిన వారు కూడా ఉన్నారు. అంతకంటే ఎక్కువ బ్రతికినవారు లేరు.

ప్రకృతియనగా మార్పుచెందునదని అర్థము. శరీరము ప్రకృతితో తయారగుట వలన తప్పనిసరిగా మార్పు చెందవలెను. అందువలన పుట్టిన శరీరము మరణించక తప్పదు. శరీరము మరణించినా అందులో జీవుడు మరణించడు, అతడు శరీరమును మారుచున్నాడు. పాత శరీరమును వదలినవాడు క్రొత్త శరీరమును ధరించుచున్నాడు. పాత శరీరములో చేసుకొన్న కర్మలన్నీ కర్మపత్రములో వ్రాయబడి వానివెంట వచ్చియుండుట వలన, వాడు చేసుకొన్నదానినే వాడు అనుభవించవలసియుండును. మనిషి మరణించినపుడు జీవుడు స్వయముగా శరీరమునుండి బయటికి రాలేడు. ఎందుకనగా వాడు ఏమీ చేతగానీ అవిటివాడు. తలలోనున్న నాలుగు చక్రముల అమరికలో గుణచక్రము అనబడు క్రింద చక్రములో జీవుడుండును. దానికి పైనున్న కర్మచక్రములో మనిషి చేసుకొన్న కర్మంతయూ వ్రాసిపెట్టబడియుండును. దానినే కర్మపత్రము అంటున్నాము. దానిపైన గల చక్రము కాలచక్రము. దానిలో 12 గ్రహములు ఉండును. ఆ పైన బ్రహ్మాచక్రము గలదు. అది దేవునికి సంబంధించినది. ప్రపంచము యొక్క ఆయుష్షు అందులో ఉండును. ఈ నాలుగు చక్రముల ఇరుసులో ఆత్మయుండును. ఆత్మ నాలుగు చక్రములను శరీరమునుండి బయటకు తెచ్చి క్రొత్త శరీరములో ప్రవేశించుచున్నది. ఒక మరణము జరిగింది అంటే వెంటనే మరొకచోట మరొక జననము జరుగును. నాలుగు చక్రములను ఆత్మ తీసుకొనిపోయి క్రొత్త శరీరములో ప్రవేశించడమే మరొక చోట పుట్టడము. అలా పోయి పుట్టిన శరీరములో ముందు శరీరములోని

19 మంది దేవదూతలు లేకుండా పోవుట వలన, క్రొత్త శరీరములో 19 మంది దూతలు క్రొత్తవారు ఉండుట వలన పాత శరీరములోని జ్ఞాపకములు క్రొత్త శరీరములో ఉండవు. అక్కడన్నీ క్రొత్తగ నేర్చుకోవలసియుండును. ఇదంతా ఒక మరణములోనూ మరియు వెంటనే జరుగు జననములోను జరుగుచుండును.

శరీరములో జీవునికి తోడుగాయున్న ఆత్మకు ఏ శరీరమును వదలినదీ, ఏ శరీరములో ప్రవేశించినదీ అన్నీ తెలుసు. అయితే జీవునికి అదేదీ తెలియదు. వాడు మూగవాడు, చెవిటివాడు, గ్రుడ్డివాడు అన్ని విధములా అంగవైకల్యుడు. వాడు అనుభవించేది తప్ప ఎన్నడూ ఏమీ చేయలేదు. చేసేది గీసేది అన్నీ ఆత్మే. అయితే జీవుడు తాను చేయని పనిని తానే చేసినట్లు అనుకోవడము వలన, వాడు చేయకున్నా జరిగెడి పనులలోనున్న పాపము మరియు పుణ్యము జీవుని లెక్కలోనే కర్మచక్రమందు చేరిపోవుచున్నవి. ఇదంతా జీవుని అధికప్రసంగము, అనవసర తతంగము అన్నట్లున్నది. తాను చేయనిదానికి, తాను మాట్లాడని దానికి అనవసరముగా కారణమగుచున్నాడు. అందువలన చేయని కర్మలను అనుభవించే దానికి ఒక శరీరమును వదలి మరొక శరీరమును చేరి, అక్కడ కూడా అదే తెలివి తక్కువతో అజ్ఞానముతో చేయని కర్మకు బాధ్యుడు అగుచున్నాడు.

సృష్ట్యాదిలోనే ఇతరులతోపాటు నీవు కూడా కొద్ది ముందు వెనుకగా పుట్టావు. ఆ రోజు ప్రారంభమయిన నీవు ఎక్కడా శాశ్వతముగా లేకుండా చనిపోవడము తిరిగి పుట్టడము చేయుచూ, శరీరములను మారుచూ వచ్చి నేడు ఈ శరీరములో ఇక్కడ ఉన్నావు. అయితే వెనుక ఎన్ని జన్మలు మారినది, ఏ ఏ శరీరములలో ఉన్నదీ ఎవరికీ జ్ఞాపకముండదు. ఇప్పుడున్న మానవ శరీరమే అన్ని జన్మలలోనూ ఉండేదని చెప్పలేము. కర్మనుబట్టి

జన్మలు వచ్చుచుండును. కావున గతములో ఏ కర్మలున్నాయో, ఏ జన్మలుండెడివో ఎవరికీ తెలియదు. జీవుడు గ్రుడ్డివాడు, చెవిటివాడు అన్ని విధములా అవిటివాడు కావున వానికి ఏమీ తెలియదు. గతజన్మలు ఎన్ని జరిగినదీ, ఏమి జరిగినది జీవునికి తెలియదు. శరీరములో జీవునితో ఎల్లపుడూ జోడు ఆత్మగాయున్న ఆత్మకు అన్నీ తెలుసు. అయితే అవసరమును బట్టి బయటికి తెలియజేయును. చాలామందికి పునర్జన్మ జ్ఞాపకములను ఆత్మయే కలుగజేశాడు. (పునర్జన్మలను తెలియజేయడములో ఆత్మపాత్ర ఎలా ఉన్నదో తెలియాలంటే మా రచనలలో **"పునర్జన్మ రహస్యము"** అను గ్రంథమును చదవండి.) ఇదంతయూ చూచిన తర్వాత ఏ జన్మలోనూ శాశ్వతముగా జీవుడు లేడు. ఇప్పుడున్న జన్మ కూడా శాశ్వతమైనది కాదు. అందువలన జీవితము నీటిమీద బుడగలాంటిదని పెద్దలు చెప్పుచుందురు. ఇదే విషయమును ప్రస్తావిస్తూ ఖుర్‌ఆన్ గ్రంథములో సూరా 21, ఆయత్ 34 లో ఈ విధముగా చెప్పారు చూడండి. **(21-34) "ఓ ప్రవక్తా! నీకు పూర్వము కూడా మేము ఏ మానవున్నీ శాశ్వతముగా జీవించి యుండేటట్లుగా చేయలేదు. ఒకవేళ నీవు చనిపోతే వాళ్ళు మాత్రము శాశ్వతముగా బ్రతికి ఉంటారా ఏమిటి?"** ఇక్కడ ఈ వాక్యములో భావము సర్వసాధారణముగా ఉన్నట్లు కనిపించినా ఈ వాక్యములో చెప్పిన భావమును ఎవరూ గ్రహించలేరని అర్థమగుచున్నది. ఈ వాక్యము రెండు భాగములుగాయున్నది. మొదటి భాగము "నీకు పూర్వము కూడా మేము ఏ మానవున్నీ శాశ్వతముగా జీవించియుండేటట్లు చేయలేదు" అని యున్నది. ఇందులో క్రొత్తగా అర్థము చేసుకొనునది ఏదీలేదు. రెండవ భాగము "ఒకవేళ నీవు చనిపోతే వాళ్ళు మాత్రము శాశ్వతముగా బ్రతికివుంటారా" అని కలదు. ఈ వాక్యములో రెండవ భాగమునందు కొంత విశేషత

కలదు. అయినా విశేషత ఏమీ లేనట్లు కనిపించుచూ సర్వసాధారణముగా చెప్పినట్లు ఉన్నది కదా! ఈ రెండవ భాగమయిన వాక్యములో ప్రవక్త చనిపోతే వాళ్ళు మాత్రము శాశ్వతముగా ఉంటారా అని అడిగారు. ఒకవేళ 'ప్రవక్త చనిపోతే వాళ్ళు మాత్రము శాశ్వతముగా ఉంటారా' అనడములో వాళ్ళు అనగా ఎవరు? అని ప్రశ్న రాగలదు. అయితే దానికి జవాబుగా మిగతా మనుషులు అని అర్థము కదా!యని అనవచ్చును. ఎవరూ శాశ్వతముకాదు, అందరూ చనిపోవలసిందేనని చెప్పుకొన్నాము. అక్కడ ఏ అనుమానమూ లేదు.

అయితే ఇక్కడ 'నీవు చనిపోతే వాళ్ళు శాశ్వతముగా ఉంటారా' అని చెప్పడములో ఏదో అర్థము దాగియుందని తెలియుచున్నది. ఇక్కడ చిన్న ఉదాహరణను చెప్పుకొందాము. సముద్రములో ఒక ఓడయందు 20 మంది మనుషులు ప్రయాణిస్తున్నారనుకొనుము. సముద్రములో ప్రయాణించు ఆ ఓడలో ఏదో లోపము ఏర్పడడము వలన ఓడ సముద్రములో మునిగిపోవడము జరిగినది. అప్పుడు అందులోని 20 మందీ చనిపోయారు. అయితే అందులో పడవను నడుపుచున్న వానికి రెండవ జన్మలో చిన్న వయస్సులో 4 లేక 5 సంవత్సరముల పిల్లవానికి పునర్జన్మ జ్ఞాపకము వచ్చి తన జీవితములో చివరిసారి ఓడను నడుపుచూ ఓడ ప్రమాదములో చనిపోయినట్లు చెప్పాడు. అప్పుడు తనతోపాటు ప్రయాణించుచున్న మిగతా 19 మంది కూడా చనిపోయి ఉంటారని అన్నాడు. దానిని వినిన వారు నీవు చనిపోయిన తర్వాత మిగతావారు బ్రతికివుంటారా? అని అనడములో మిగతావారు కూడా నీతోపాటు చనిపోయి ఉంటారని అర్థమును వెలిబుచ్చారని తెలియుచున్నది. ఇక్కడ గ్రహించవలసినది ఏమనగా! ఒకే ఓడలో ప్రయాణించు అందరూ ఒకేమారు

చనిపోయివుంటారని, ఎవరూ మిగులుటకు అవకాశములేదు అనుటకు గుర్తుగా నీవు చనిపోయిన తర్వాత వారు బ్రతికి ఉంటారా!యని అనడము జరిగినది. అందరూ ఒకేమారు చనిపోయారని దాని అర్థము.

అదే విధముగా ఒకే శరీరములో 20 భాగములుగానున్న శరీరమంతయూ జీవించుచున్నది. అందులో అనగా శరీరములో జీవుడు చనిపోయాడనుకొనుము. అప్పుడు మిగతా శరీరమంతయూ చనిపోవును. జీవుడు చనిపోతే మిగతా శరీర భాగములు మిగిలియుండునా? ఏమాత్రము మిగిలియుండవు. చావు శరీర భాగములలో ముఖ్యమైన జీవునికి వస్తే మిగతా శరీర భాగములన్నియూ తప్పక చనిపోవును. అదే విషయమునే "నీవు చనిపోతే వాళ్ళు మాత్రము శాశ్వతముగా బ్రతికి ఉంటారా" అని పై వాక్యములో అనడము జరిగినది. అక్కడ ఒకే శరీరములో జరుగు తతంగమును గుర్తు చేసుకోకుండా బయట ప్రపంచములో జరిగే పనుల మీదికి పోకూడదు. పై వాక్యములో ఒకవేళ నీ శరీరములో నీవు చనిపోతే నీతోపాటున్న మిగతా 19 మంది తప్పక చనిపోవుదురని భావము వచ్చునట్లు నీవు చనిపోతే మిగతావారుంటారాయని అనడము జరిగినది.

మనిషి జన్మలో ఒక క్రొత్త శరీరము తయారు కావాలంటే అది ప్రకృతినుండే తయారగుచున్నది. మరణములో అది తిరిగి ప్రకృతిలో కలిసిపోవుచున్నది. తిరిగి రెండవజన్మలో ప్రకృతి నుండి తయారయిన శరీరమే లభించుచున్నది. ఇది వరుసక్రమముగా జరుగుచున్నపని. ప్రపంచ వ్యాప్తముగా ఏ శరీరమూ శాశ్వతముగా లేదు. అందువలన ఎవరూ శాశ్వతముగా ఒకే జన్మలో ఉండరని తెలియుచున్నది. అందరూ ప్రకృతిలో పుట్టి, ప్రకృతిలో బ్రతికి, తిరిగి ప్రకృతిలోనే చనిపోవుచున్నారు. ఇదే విషయమునే ఖుర్ఆన్ గ్రంథములో సూరా 20, ఆయత్ 55 నందు ఇలా

వ్రాశారు చూడండి. **(20-55) "ప్రకృతి నుంచే మిమ్ములను మేము సృష్టించాము. మళ్ళీ ప్రకృతిలోనికే మిమ్ములను చేరుస్తాము. మరి ప్రకృతి నుండే మరోసారి మిమ్ములనందరినీ పుట్టిస్తాము."** మనిషినే కాక సమస్త జీవరాశులను పుట్టించేవాడు దేవుడే, మరణింపజేసేవాడు దేవుడే. శరీరము పోయినప్పుడు తిరిగి క్రొత్త శరీరమునిచ్చి రెండవ జన్మనిచ్చువాడు ఆయనే. ఇదే విషయమునే సూరా 45, ఆయత్ 26లో ఈ విధముగా చెప్పారు చూడండి. **(45-26) "ఓ ప్రవక్తా! వారికి చెప్పు దేవుడే మిమ్ములను బ్రతికిస్తున్నాడు. తర్వాత ఆయనే మిమ్ములను చంపుచున్నాడు. ఆ తర్వాత దేవుడే మిమ్ములను ప్రళయ దినాన సమీకరిస్తాడు. ఇందులో సందేహానికి తావేలేదు. కానీ చాలామంది ఈ విషయమును తెలుసుకోలేకున్నారు."** ఈ వాక్యము చివరిలో చాలామంది తెలుసుకోలేకున్నారని దేవుడు చెప్పాడు. దేవుడు చెప్పినట్లే, మనుషులు తిరిగి పుట్టరని కొందరు అనుచుండగా, కొందరు ప్రళయము వచ్చు వరకు చనిపోయినవాడు జన్మించడని ప్రళయము వచ్చినప్పుడు అంతవరకు చనిపోయిన వారంతా ఒక్కమారు గోరీలనుండి లేపబడుతారని అందరూ అనుకోవడము జరుగుచున్నది. ప్రళయదినమున దేవుడు అందరినీ సమీకరిస్తున్నాడు అని అంటే ఆ దినము అందరినీ గోరీలనుండి లేపును అని చెప్పుకొంటున్నారు. ప్రళయదినము అంటే శరీరమునకు ప్రళయము ఏర్పడిన దినమని దానినే చావు అంటున్నామని తెలియ లేకున్నారు. శరీరము ప్రకృతిలోని పంచభూతముల వలన తయారయినది. పంచభూతములకు ప్రళయము వచ్చి నాశనము కావడమును మరణము పొందడము అంటున్నాము. మరణము పొందిన తర్వాత తిరిగి ప్రకృతి నుండే దేవుడు పుట్టించుచున్నాడు. దేవుడు పని చేయనివాడు. ఆయన

పనులన్నిటినీ ప్రకృతిలోని ఆయన సేవకులే చేయుచున్నారని తెలియవలెను. ప్రకృతిలో కోట్లకొలది ఆయన సేవకులున్నారనీ, ఆయన పాలన ఖచ్చితముగా జరుగుచున్నదని చెప్పవచ్చును.

ప్రపంచమును దేవుడే పోషిస్తున్నాడని చెప్పడములో తప్పులేదుగానీ, దేవుడే అన్నిటినీ స్వయముగా చేస్తున్నాడనడము తప్పగును. దేవుడు ఏమీ చేయనివాడు కేవలము సాక్షిగా అన్నీ చూచేవాడు మాత్రమే. అయితే గౌరవార్థముగా దేవుడు చేస్తున్నాడని చెప్పినా, వాస్తవముగా దేవుడు ఏమీ చేయనివాడనీ, జరిగే పనులన్నిటినీ దేవుని పాలనలోని ఆయన శక్తులే అనగా ఆయన సేవకులే చేయుచున్నారని గ్రహించుకోవలెను. దేవుని పాలన ఎవరికీ అర్థముకాదు. ఆయన పనులను చేయు ఆయన సేవకులు ఎంతమంది ఉన్నారో ఎవరికీ తెలియదు. ఆయన సైన్యము ఎంతకలదో ఎవరికీ తెలియదని 74వ సూరా, 31వ ఆయత్‌లో చెప్పారు. దేవుని పాలకులలో కొందరు భూమిలోయున్నారు, కొందరు ఆకాశములో యున్నారు. భూమిమీద ఎంతోమంది బలమైన సేవకులు ఉండగా, ఆకాశములో కూడా ఎందరో బలమైన సేవకులు గలరు. బలవంతులు, బలహీనులు లేరుగానీ, వారు చేయు పనులనుబట్టి బలవంతులు, బలహీనులు అని చెప్పాము. జగతిలో అన్ని కార్యములనూ చేయువారు దేవునిపాలకులే. దేవుని పాలకులు ప్రపంచమంతా విస్తరించి, ఆకాశము లోనూ, భూమియందునూగలరు. ఆకాశములోనున్న వారిలో మేఘములు చాలాగొప్ప సేవకులుగా ఉన్నాయి. మేఘముల కార్యములు ప్రపంచములో ఇంతవరకు ఎవరికీ తెలియదు. మేఘములు తమ నీటితో సహా ఎన్నో చెట్లగింజలను తెచ్చి బీడు భూములలో వర్షముతోపాటు పడునట్లు చేసి, క్రొత్త రకమైన మొక్కలను పెంచుతున్నవి. ఏ విత్తనమూ లేని భూమిలోనికి

గడ్డివిత్తనములు తెచ్చివేయుచున్నవి. అప్పుడు ఖాళీగాయున్న భూమి గడ్డితో పచ్చగా పెరిగిపోవును. అలాగే భూమిలో పండిన పంటకు క్రొత్త రోగములను తెచ్చి వదులునది మేఘమే. మేఘమే రోగములను కూడా లేకుండా చేయుచున్నది. ఒక ప్రాంతములో లేని జంతువును కూడా మరొక ప్రాంతము నుండి తెచ్చి ఆ ప్రాంతములో వదలగలదు. నేడు భూమిమీద అన్ని విధముల విత్తనములు మనుషులు పెంచకున్నా మొలకెత్తు చున్నవి. ఆ ప్రాంతములో లేని చెట్టుయొక్క విత్తనము ఎవరు తెచ్చి వేశారు? అని ప్రశ్నించితే మేఘమే ఆ పని చేసినదని చెప్పవచ్చును. భూమిమీద ఎన్నో పనులకు, రోగములకు, పంటలకు, జంతువులకు మేఘములే కారణమని చెప్పవచ్చును. మనము ఎంత చెప్పుకొనినా దేవుని పాలనలో మేఘములు చేయు పనులు అన్నీ మనకు తెలియవు. మేఘములు చేయు కొన్ని పనులను మాత్రము చెప్పాము. మేఘము బీడు భూమిలో మనిషి విత్తనము వేయకున్నా పచ్చగా చెట్లు పెరుగునట్లు, గడ్డి మొక్కలు పెరుగునట్లు చేయుచున్నది. ఈ విషయమును ఖుర్ఆన్ గ్రంథములో చెప్పుచూ సూరా 16, ఆయత్ 65లో ఇలా కలదు. **(16-65) "దేవుడు ఆకాశమునుండి నీళ్ళను కురిపించి దానిద్వారా భూమి చచ్చిపోయిన తర్వాత దానిని తిరిగి బ్రతికిస్తున్నాడు. వినేవారికోసము ఇందులో నిదర్శనము ఉంది."** ఈ వాక్యము చివరిలో వినేవారికి నిదర్శనముంది అని చెప్పి యున్నారు. ఈ వాక్యము చివరిలో ఏదయినా గొప్ప రహస్యముంటే అలాగే చెప్పియుందురు. ఇందులో మేఘముల రహస్యమున్నట్లు తెలిసినది.

ఇంకా ఈ విషయమై మరొకచోట సూరా 57, ఆయత్ 17లో ఈ విధముగా చెప్పారు. **(57-17) "బాగా తెలుసుకోండి. భూమి మృతి చెందిన తర్వాత దేవుడే దానిని తిరిగి బ్రతికిస్తున్నాడు. మీరు అర్థము**

**చేసుకొనేందుకు మేము ఈ సూచనను విడమరచి చెప్పాము"** అని కలదు. రెండు ఆయత్‌లలోనూ చివరిలో చెప్పిన దానినిబట్టి చూస్తే ఇందులో ఏదో పెద్ద రహస్యమున్నట్లు తెలియుచున్నది. బాగా తెలుసుకోండని వాక్యము మొదట కూడా చెప్పారు. వాక్యములో 'మృతి చెందిన భూమిని దేవుడు తిరిగి బ్రతికిస్తున్నాడు' అని కలదు. భూమి బ్రతకడము అంటే భూమి పచ్చదనముగా మారిపోవుట అని అర్థమగుచున్నది. భూమిని తిరిగి పచ్చగా చేయువాడు దేవుడే అంటే దేవుడు ఎటూ చేయడు. దేవుని పాలనలోని వారే భూమిని బ్రతికిస్తున్నారు. అందువలన దానికి కారణము మేఘములని తెలిసిపోయినది. మేఘములను గురించి తెలుసుకోవడమే పై రెండు వాక్యముల సారాంశమని తెలియుచున్నది. కాబట్టి ఇప్పుడు మేఘములను గురించి సక్రమముగా తెలుసుకొందాము.

ఒక రోగము కొన్ని కోట్ల క్రిముల సముదాయమనిచెప్పుకొన్నాము. ఆ క్రిములను మైక్రోస్కోపుల ద్వారా ప్రత్యక్షముగా, స్థూలముగా చూడవచ్చును. ఆ క్రిముల ఆకారమును గుర్తించవచ్చును. అయితే మేఘములకు అటువంటి క్రిమిసముదాయముండదు. ఏ స్కోపుల ద్వారా మేఘములలోని స్థూలత్వమును చూడలేము. రోగముచేతిలో పడిన మనిషినిగానీ, జంతువునుగానీ, నీటిలోని చేపనుగానీ చూడవచ్చును. కానీ మేఘము చేతిలో పడిన మనిషినిగానీ, జంతువునుగానీ, చేపనుగానీ చూడలేము. మేఘమునున్నది ఏదీ కనిపించకుండా పోవును. మేఘము వదలినప్పుడు తిరిగి కనిపించును. రోగమునకు కొన్ని కోట్ల క్రిములుంటే, మేఘమునకు కొన్ని కోట్ల చేతులున్నవి. ఇలా రోగమునకు, మేఘమునకు ఎన్నో తేడాలున్నవి. ఇపుడు రోగముకంటే అన్ని విధముల గొప్పదైన మేఘమును గురించి తెలుసుకొందాము.

మేఘము ఒక భూతము అనుమాట కొందరికి విచిత్రముగా, విడ్డూరముగా కనిపించినా, మామాట నూటికి నూరుపాళ్ళు సత్యము. మేఘము అను భూతము లేక జీవుడు, దేవుని పరిపాలన విభాగములోని వాడే కావున, మేఘమునకు ప్రకృతినుండి వచ్చు ఆజ్ఞను ఆచరించడము మేఘము యొక్క కర్తవ్యము. ప్రకృతినుండి వచ్చు ఆజ్ఞను బట్టి చేయవలసిన పని ఎంత భయంకరమైనదైనా, ఎంత క్రూరత్వముతో కూడుకొన్నదైనా మేఘము చేసితీరును. దేవుని చట్టమును అనుసరించి ప్రకృతినుండి వచ్చు ప్రతి ఆజ్ఞను నెరవేర్చడము మేఘము యొక్క విధి విధానము. భూమిమీద రోగములు ఎన్నో రకములున్నట్లు, ఖగోళములో కూడా మేఘములు ఎన్నో రకములున్నవి. చాలామందికి మేఘము అంటే వర్షము కురుయునదని మాత్రము తెలుసు. మేఘము వర్షించడమేకాక, మిగతా ఎన్నో పనులను కూడా చేయుచున్నదని తెలియదు.

ఆకాశములోని మేఘమునకు ఒక రూపము ఉండదు. ఒక మేఘము అనేక రూపములను మార్చుకొనును. అంతేకాక మేఘము తెలుపు, నలుపు, ఎరుపు రంగులను మార్చుకొనును. మేఘము యొక్క ఆకారము ఏమాత్రము కనిపించకుండా అదృశ్యమైపోవును. అలా అదృశ్యమైన మేఘము తర్వాత ఎప్పుడైనా, ఎక్కడైనా కనిపించగలదు. అదృశ్యములోనున్న మేఘము, మొదట చిన్న ఆకారముతో అర్ధ అంగుళము పరిమాణమునుండి మొదలై దాదాపు 20 లేక 30 చదరపు కిలోమీటర్ల విస్తీర్ణము వరకు తన ఆకారమును పెంచుకొనును. ఈ విధముగా ఆకారము పెరిగిన మేఘము, ఎంతో బలము కలిగినదై, ఎన్నో చేతులు కలిగినదై ఉండును. కొన్ని కోట్ల చేతులు కలిగియున్న మేఘము, పరిమితము లేని బలము కలిగి, ఎంతటి బరువునైనా మోయగల స్థోమత కల్గియున్నది. ఆకాశములో మేఘములు ఎన్నో గలవు.

ఒక్కొక్క మేఘము కొన్ని లక్షల, కొన్ని కోట్ల టన్నుల బరువును మోయగల శక్తి కల్గియున్నది. మేఘము భూమిమీద నీటిని సూక్ష్మముగా కంటికి కనిపించకుండా తీసుకోగలదు. ఎక్కడైనా అరుదుగా మనిషి కంటికి కనిపించే విధముగా కూడా నీటిని మేఘము తీసుకొనును. మేఘము ఒక్క నీటినేకాక నీటిలోని చేపలను, తాబేళ్ళను కూడా పైకి తీసుకొని పోగలదు. కొన్ని చోట్ల మనుషులను, జంతువులను పైకి తీసుకొని పోయినట్లు చరిత్రగలదు. ఆ మధ్య కాలములో 118 మంది మనుషులను, కొన్ని జంతువులను ప్రత్యక్షముగా పైకి తీసుకొని పోయి వారిని క్రింద పడవేయడము, వారు చనిపోవడము జరిగినట్లు ఆంధ్రయూనివర్శిటిలో మేఘములను గురించి పరిశోధన చేయు ఒక ప్రొఫెసర్ చెప్పగా విన్నాము. మేఘములకు కనిపించని ఎన్నో చేతులున్న దానివలన ఎవరినైన, దేనినైనా పైకి తీసుకొని పోగలవు. పైకి తీసుకొని పోయిన వారిని క్షేమముగా భూమిమీదకు తీసుకవచ్చి వదలగలవు. లేకపోతే పై నుండి క్రిందపడవేసి చంపగలవు. మేఘము నీటితో సహా చేపలను తీసుకొని పోతే వాటిని క్షేమముగా, ఒక్క చేపకు కూడ దెబ్బతగలకుండా భూమికి దగ్గరగా తీసుకువచ్చి వదులుచున్నవి. పై నుండి క్రిందపడినట్లు మనకు ప్రత్యక్షముగా కనిపించినా చేపలు చనిపోకుండ క్రిందపడును.

మేఘము కొన్ని సమయములలో అరుదుగా మనకు కనిపించే విధముగా భూమిమీద నుండి దేనినైనా తీసుకుపోగలదు. ఉదాహరణకు స్థూలముగా కనిపించు చేపలను నీటితో సహా మేఘము పైకి తీసుకొని పోయినపుడు మేఘము యొక్క చేతులలో నీరు, చేపలు అన్ని ఉండును. మేఘము యొక్క చేతులు ఎవరికి కనిపించునవి కావు. అందువలన మేఘము చేతులలోనికి పోయిన నీరుగానీ, చేపలుగానీ కనిపించకుండ

పోవును. మేఘము తీసుకొని పోయిన నీరుగానీ, చేపలుగానీ, తాబేళ్ళు కానీ పైన మేఘములలో అదృశ్యముగా ఎవరికి కనిపించకుండ ఉండి పోవును. అందువలన ఒక మేఘములో ఎన్ని నీళ్ళున్నది ఎవరూ చెప్పలేరు. అలాగే ఇంకా ఏదైనా మేఘములో ఉండినా అది కూడ తెలియబడక అదృశ్య రూపములో ఉండును. అదృశ్యరూపములోనున్న చేపలను ఒక దినముగానీ, అంతకంటే ఎక్కువ కాలముగానీ మేఘము తన చేతులలో ఉంచుకోగలదు. అయినా అంతకాలము ఉంచుకొను అవసరము మేఘమునకు లేదు. మేఘము తన చేతిలో ఉంచుకొన్న వాటిని కొన్ని కిలోమీటర్ల దూరము వరకు తీసుకొని పోయి, ఎక్కడ వదలాలని నిర్ణయముంటుందో అక్కడే వదులును. కొన్ని చేపలనుగానీ, కొన్ని జంతువులనుగానీ ఆఫ్రికాఖండము నుండి ఆసియాఖండమునకు, ఆసియా ఖండమునుండి ఐరోపాఖండమునకు తీసుకొని పోగలదు. కొన్ని వేల కిలోమీటర్ల దూరము పైన ఆకాశములో ప్రయాణించు మేఘము, ఒక ఖండమునుండి మరొక ఖండమునకు చేరుచున్నది. జంతువులను ఒక ఖండమునుండి మరొక ఖండము వరకు, ఒక ప్రాంతమునుండి మరొక ప్రాంతము వరకు తీసుకు పోగలదు. ఆకాశములో మేఘమునందు కనిపించకుండావున్న చేపలుగానీ, తాబేళ్ళుగానీ, పాములుగానీ మేఘము వర్షించునపుడు వాటిని క్రిందికి వదలును. కనిపించని మేఘము చేతులు చేపలు మొదలగువాటిని క్రిందికి తీసుకొని వచ్చినపుడు, దాదాపు వంద అడుగుల పైనుండి చేపలు మొదలగునవి దృశ్యరూపమై కనిపించను మొదలుపెట్టును.

మేఘము ఒక నీటినేకాక, నీటితో సహా చేపలను తాబేళ్ళను, పాములను తీసుకొని పోయి మరొక ప్రాంతములో, మరొక దేశములో వదలుట వలన అక్కడకి అవి మేఘము వలన రవాణా చేయబడినవని

చెప్పవచ్చును. అలా రవాణా చేయబడుట వలన అక్కడలేని చేపల జాతిగానీ, తాబేళ్ళ జాతిగానీ, పాముల జాతిగానీ క్రొత్తగా అక్కడ కూడ కనిపించును. ఉదాహరణకు ఒక రోజు వార్తాపత్రికలో అరుదైన నక్షత్ర తాబేలు కర్నూలు జిల్లా 'అవుకు'లో కనిపించిందని వ్రాశారు. నక్షత్ర తాబేలుజాతి మన భారతదేశములో ఎక్కడాలేదనీ, ఆ జాతి తాబేలు ఆఫ్రికాఖండములో కలదని, ఈ దేశములో లేని తాబేలుజాతి, కర్నూలు జిల్లా అవుకుప్రాంతములో కనిపించడము ఆశ్చర్యమని వ్రాశారు. నాలుగైదు చిన్న నక్షత్రతాబేళ్ళు కనిపించినట్లు వ్రాశారు. నక్షత్ర తాబేళ్ళ ఫోటో కూడ అందులో ముద్రించారు. ఆ దినము అందరికి అది ఆశ్చర్యకరమైన వార్త అయినపుడు, దానిని అంతటితోనే వదలివేశారు. ప్రతి దానికి కనిపించే నిరూపణకావాలని వాదించే హేతువాదులు, ప్రత్యక్షముగా వ్రాసినవార్తను, ముద్రించిన తాబేలు బొమ్మను చూచి, ఇది అసత్యము. ఇక్కడలేని జాతి ఎలా వచ్చింది అని ఎందుకు ప్రశ్నించలేక పోయారో? మేధావులుగానీ, సామాన్యులుగానీ హేతువాదులుగానీ ఆ వార్తను చూచిన తర్వాత దేశములో ఎక్కడలేని జాతి ఉన్నట్లుండి ఇక్కడ ఎలా కనిపించింది? అని ప్రశ్నించుకోలేక పోయారు, దానిని గురించి ఆలోచించలేక పోయారు. మేధావుల ఆలోచనకు కూడ అవి లేని ప్రాంతములోనికి ఎలా వచ్చాయో, ఏ విధానము ద్వారా వచ్చాయో కూడ తెలియదు. దాని వెనుకనున్న సత్యమును తెలిస్తే మేఘముల ద్వారా వచ్చాయని ఎవరైనా ఒప్పుకోక తప్పదు.

ఒక్క తాబేళ్ళనేకాక, కొన్ని జాతుల పాములను, కొన్ని జాతుల చేపలను కూడ తెచ్చి, మరొక దేశములో, మరొక ప్రాంతములో వదులు చున్నవి. అందువలన వర్షము కురియునపుడు వర్షముతో సహా పాములు పడడము, చేపలుపడడము, తాబేళ్ళుపడడము కొందరు ప్రత్యక్షముగా చూచిన

వారున్నారు. అలాగే మేఘములు ప్రత్యక్షముగ నీటిని, నీటితో సహా చేపలను, కప్పలను ఒక చెరువునుండి తీసుకోవడము కొందరు ప్రత్యక్షముగ చూచారు. ఒక చెరువునుండి నీటినంతటిని మేఘము పీల్చుకోవడము ఫోటోతో సహా వార్తను ప్రచురించడము కూడ జరిగింది. ఈ మధ్యకాలములో మేఘము నీటిని తీసుకొంటున్న ప్రత్యక్షదృశ్యమని టీ.వీలలో కూడ ప్రసారము చేసి చూపించారు. మేఘము అరుదుగా దృశ్యరూపములో కనిపించే విధముగా ఎక్కడో ఒక చోట నీటిని ప్రజలకు దగ్గరగానున్న చెరువునుండి తీసుకొను చున్నది. అలా చేయడము వలన మేఘములు నీటిని ఈ విధముగా తీసుకొంటున్నవని ప్రజలకు తెలియవలెనని దేవుడే ఆ విధముగా చేయించాడని అర్థమగుచున్నది. మనము తెలుసుకొనుటకు ఆధారముగా ఎక్కడో ఒకచోట ఉన్న సత్యమును, మనకు కనిపించే విధముగా చూపించినా మనిషి దానిని అర్థము చేసుకొను స్థితిలో లేడు. ఇప్పుడు ఉన్న సత్యమును విప్పి చెప్పినా, విజ్ఞానులమనుకొను కొందరు మా మాటలను హాస్యాస్పదము గా తీసుకొంటున్నారు. మా మాటను అసత్యము అంటున్నారు. మనుషులకు ఏ విధముగా తెలియని కొన్ని విషయములను, కొందరు ఏ విధముగానూ నమ్మని విషయములను, దేవుడు ప్రత్యక్షముగా ఎక్కడో ఒకచోట చూపించును. అప్పటికి సత్యమును గ్రహించలేని మనుషులు విజ్ఞానులవు తారా? మేధావులవుతారా?

మేఘములు నీటినిగానీ, నీటితో సహా కొన్ని జీవరాశులనుగానీ తీసుకొని పోవునను సత్యము ఎవరికీ తెలియదు కనుక, కొన్ని సంవత్సరము లకు ఒకమారు, ఎక్కడో ఒకచోట ప్రత్యక్షముగ కనిపించునట్లు దేవుడు చేయించాడు. దీనిమాదిరే పునర్జన్మ విషయమును కూడా చూపించాడు. ఇది సత్యము అని చెప్పుటకు ఎటువంటి ఆధారము లేనిదానివలన, దానిని

కూడ కొన్ని సంవత్సరములకు ఒకమారు ఎక్కడో ఒకచోట అందరికి తెలియునట్లు, కొంత కాలము మాత్రము వెనుకటి జన్మ జ్ఞాపకము వచ్చిన వారిని దేవుడు కనిపింపజేయుచున్నాడు. ప్రత్యక్షముగా వెనుక జన్మ విషయములను చెప్పడమేకాక, చూపించడము జరిగినపుడు కూడ విజ్ఞానులము, మేధావులము అనువారు కొందరు, కనిపించే సత్యమును గ్రహించుకోలేని స్థితిలోవుండి, సత్యమును మూఢనమ్మకము అంటున్నారు. అటువంటివారు ప్రపంచ విధానములో ఎంత పెద్ద మేధావులు, విజ్ఞానులు అయినా, పరమాత్మ విధానములో వారి బుద్ధి, కనిపించే దానిని కూడ గ్రహించుకోలేని బలహీనముగా ఉన్నదని తెలియుచున్నది. ఒక విధముగా ప్రపంచ విధానములో మేధావులుకానటువంటి సామాన్య ప్రజలే, దేవుని విధానమును అర్థము చేసుకొను బుద్ధి బలము కల్గియున్నారని చెప్పవచ్చును. ఇటువంటి రెండు రకముల మనుషులేకాక, మూడవరకము మనుషులు కూడ చాలా అరుదుగా ఉన్నారు. వారు ఇటు ప్రపంచ విధానములోను మేధావులే, అటు పరమాత్మ విధానములోను మేధావులే అయివున్నారు. ప్రపంచ విషయములో మేధావులైన ఒక రకమువారు భూమిమీద కొందరే ఉండగా, ప్రపంచ విషయములో మేధస్సులేని రెండవరకము వారు భూమిమీద ఎక్కువగా ఉన్నారు. ఇకపోతే ప్రపంచ విషయములోను, పరమాత్మ విషయములోను రెండు విధముల మేధావులైన మూడవరకము వారు భూమిమీద బహు అరుదుగా ఉన్నారు. ఈ మూడు రకముల మనుషులలో దైవజ్ఞానము ప్రకారము చూస్తే, అరుదుగానున్న మూడవరకము వారు ఉత్తములు, ఎక్కువగానున్న రెండవ రకమువారు మధ్యములు, తక్కువగానున్న ఒకటవ రకమువారు అధములని చెప్పవచ్చును.

దేవుని జ్ఞానములో అధములై, ప్రపంచ జ్ఞానములో మేధావులైన వారు, సముద్రము నీరు ఆవిరై పైకిపోయి మేఘముగా ఏర్పడుచున్నదని

చెప్పుచున్నారు. ఎండాకాలము సూర్యుని వేడికి సముద్రము మీద నీరు ఆవిరై పోతున్నదని ప్రపంచ విజ్ఞానులు చెప్పుచున్నారు. అయినా మేము ఆ మాటను విశ్వసించడము లేదు. ఎందుకనగా! ఒక లోహమును కరిగించుటకు ఎంత వేడి, అవసరమవుతుందో, దానిని మెల్టింగ్ పాయింట్ డిగ్రీలు అని అంటారు. సీసమును (లెడ్‌ను) కరిగించుటకు ఎంత వేడి అవసరమో, దానికంటే ఎక్కువ వేడి రాగిలోహమును (కాపర్) కరిగించుటకు అవసరమగును. దీనినిబట్టి సీసము ఒక ఉష్ణోగ్రతవద్ద, రాగి మరొక ఉష్ణోగ్రతవద్ద కరుగుచుండుట వలన సీసముకు, రాగికి మెల్టింగ్ పాయింట్స్ డిగ్రీలు వేరువేరుగా ఉన్నాయని తెలిసింది. అలాగే నీరు ఆవిరి అగుటకు ఎంతవేడి అవసరమో, ఆ వేడిని బాయిలింగ్ పాయింట్ డిగ్రీలు అంటారు. ఇపుడు మనకు అవసరమైనది నీరు విషయము. కావున నీటి విషయమును చూస్తే నీరు నూరు (100) సెంటిగ్రేడ్ డిగ్రీలవద్ద మరిగి ఆవిరి అగును. అందువలన నీరు యొక్క బాయిలింగ్ పాయింట్ డిగ్రీలు వంద సెంటిగ్రేడ్ ఉష్ణోగ్రత అని చెప్పవచ్చును. మన ఇంటిలో ఒక పాత్రలో నీరును నింపి, పొయ్యి మీదపెట్టి వందడిగ్రీల వరకు వేడిచేస్తే అప్పుడు నీరు ఉడికి (మరిగి) ఆవిరి అగుచున్నదని అందరికి తెలుసు. ఆకాశములో సూర్యుని వేడివలన సముద్రము నీరు ఆవిరై, పైకి పోయి మేఘములు ఏర్పడుచున్నవని చాలామంది చెప్పుమాటలో సత్యము లేదని తెలియుచున్నది. సముద్రము నీరు ఆవిరి అగుటకు వంద డిగ్రీల వేడి అవసరము కదా! అంతవేడి సూర్యుని నుండి రాలేదు. సూర్యుని నుండి వచ్చు వేడి ఎండాకాలము 40 నుండి 45 డిగ్రీల వరకు ఉండును. ఎప్పుడైన అరుదుగా 50 డిగ్రీల వరకు ఉండవచ్చును. నీరు ఆవిరి అగుటకు వంద సెంటిగ్రేడ్ డిగ్రీల ఉష్ణోగ్రత అవసరమైనపుడు, సూర్యుని నుండి వచ్చు 40 లేక 45 డిగ్రీల

ఉష్ణోగ్రతకు నీరు ఆవిరైపోవు ప్రసక్తే లేదు. అందులన సూర్యుని వలన నీరు ఆవిరైపోతుందని, ఇంతవరకు మనము వినిన లేక చదువుకొన్న విషయము పూర్తి అసత్యమని తెలియుచున్నది.

ఇంత చెప్పినా "లేదు! సముద్రము నీరే ఆవిరై మేఘముగా తయారగుచున్నది. ఆ మేఘమునకు చల్లని గాలి తగిలినపుడు మేఘములలో ఆవిరి రూపములోనున్న నీరు చల్లనిగాలికి, నీరుగా మారి వర్షము పడుచున్నదని" మొండిగా వాదించు వారుండవచ్చును. అటువంటి వారిని మేము అనేక ప్రశ్నలు అడుగవలసి వచ్చును. ఆ ప్రశ్నలకు వారు మొండిగా, జవాబు కాని దానిని చెప్పడము తప్ప వేరు మార్గములేదు. సముద్రములో నీరుగానీ, ఒక డ్యామ్‌లో నీరుగానీ, చిన్న చెరువులో నీరుగానీ అన్నీ నీరే అగును. అన్నిటికి నూరు డిగ్రీల సెంటిగ్రేడ్ ఉష్ణోగ్రత బాయిలింగ్ పాయింట్ అగును. అటువంటపుడు చిన్న చెరువులోగానీ, పెద్ద డ్యామ్‌లోగానీ, అపారమైన సముద్రములోగానీ నీరు ఉడికి (మరిగి) ఆవిరి అవడము ఎవరైనా చూచారా? ఎవరూ చూడలేదు, అది ఎక్కడ జరుగలేదు. సూర్యుని నుండి నూరు సెంటిగ్రేడ్ డిగ్రీల వేడి రానపుడు, నీరు ఆవిరి అగుటకు వీలులేదని ఎవరైనా చెప్పవచ్చును. నీరు భూమిలోనికి ఇంకిపోవచ్చును. కానీ ఆకాశములోనికి ఆవిరైపోదు. అలాగే గాలిలోనికి నీరు కలిసి గాలిలో తేమ ఏర్పడును. కానీ నీరు ఆవిరై గాలిలో కలిసిపోలేదు. బండలమీద నీరుగానీ, తేమగానీ గాలికి ఆరిపోతుంది, కానీ ఆవిరై పోదు. తడిగుడ్డలలోని తేమ గాలిలోనికి ఆరిపోతుంది, కానీ ఆవిరై పోదు. ఎయిర్‌కూలర్‌లోని నీరు ఫ్యాన్‌గాలికి ఆరిపోతుంది, కానీ ఆవిరైపోదు. ఇట్లు నీరు ఆరిపోయే దానికి, ఆవిరై పోయేదానికి తేడా తెలియని కొందరు నీరు ఆవిరై మేఘాలుగా మారి పోతున్నదని అనుకోవడము జరుగుతున్నది. ఎవరు ఏమనుకొనిన

మేఘములు నీరును, నీటితోపాటు కొన్నిటిని తీసుకుంటున్నవని చెప్పుటకు ఆధారముగా వార్తాపత్రికలో వచ్చిన సమాచారమును క్రింద ఇస్తున్నాము చూడండి.

## చేపల జల్లులు... కురిసిన కప్పలు!

(ఈనాడు హైదరాబాద్ ఆదివారం 25 జూలై 2010, 28వ పేజీలో)

**(వర్షంతో పాటు వడగళ్ళు పడితే సంబరపడతారు... మరి చేపలు, కప్పలు కూడా పడితే? అవే కాదు నాణాలు, పిజ్జాలు కూడా పడ్డ సంగతి తెలుసా? అవే వింత వానలు!)**

✶ అమెరికాలోని అలబామా రాష్ట్రంలో ఓ కుటుంబమంతా కలిసి కారులో వెళ్తోంది. అకస్మాత్తుగా ఆకాశంలో ఓ చోట నల్లని మబ్బులు కమ్ముకుని వానపడింది. దాంతోపాటు దబదబమంటూ చేపలు కురిశాయి! పైగా అవి బ్రతికున్నవే!!

✶ సెర్బియా దేశంలో 2005లో కొన్ని ప్రాంతాల్లోని ప్రజలు హఠాత్తుగా ఇళ్ళలోకి పరుగులు తీశారు. ఎందుకో తెలుసా? వడగళ్ళలాగా చిన్న కప్పలు కురవడం ప్రారంభించాయి!

✶ ప్రపంచ వ్యాప్తంగా అనేక చోట్ల వింతవానలు కురిసిన సందర్భాలు ఎన్నో ఉన్నాయి. వీటినే 'ఆడ్ రెయిన్స్' 'స్ట్రేంజ్ రెయిన్స్' అంటారు. యాసిడ్ వర్షాలు, ఎర్రరంగులో కురిసే వానలు కూడా ఈ కోవలోకే వస్తాయి. అయితే మొసళ్ళు, పిజ్జాలు, కాసులు కూడా కురిసిన సందర్భాలు ఉన్నాయి. బలమైన సుడిగాలులు ఏర్పడినప్పుడు అవి ఏ చెరువులోని నీటినో పీల్చుకుంటాయని, ఆ గాలులు చెల్లాచెదురైనప్పుడు అందులోని చేపలన్నీ

వర్షంలా కురిసే అవకాశం ఉందని చెబుతారు. ఏమైనా ఇలాంటి వింత వానల గురించి వానాకాలంలో తెలుసుకోవడం ఆసక్తికరం.

- ✶ అర్జెంటీనాలోని ఓ ప్రాంతంలో 2007 ఏప్రిల్ 6న సాలీళ్ళ వర్షం కురిసింది. ఆ వానని ఒకతను ఫోటో తీశాడు కూడా!
- ✶ మన దేశంలో కేరళలో 2001లో ఎర్రరంగు వర్షం కురిసింది. దాన్ని 'బ్లడ్ రెయిన్' అని పిలిచారు.
- ✶ గుజరాత్‌లోని బాన్‌వాడ్‌లో, 2009 అక్టోబరు 24న చేపల వర్షం కురిసింది.
- ✶ కాలిఫోర్నియాలో 1869 ఆగష్టు 1న ఏదో జంతువుకు చెందిన శరీర భాగాలు కురిశాయి.
- ✶ ఇంగ్లాండులో 1894లో జెల్లీఫిష్‌లు రాలాయి.
- ✶ ఇంగ్లండ్‌లో 1881లో హెర్మిట్ పీతలు వందల కొద్దీ పడ్డాయి.
- ✶ కొలరాడో ప్రాంతంలో 1982 నుంచి 86 వరకూ ఏటా మొక్కజొన్న కంకులు కురిశాయి.
- ✶ ఇంగ్లాండ్‌లోని మాంచెస్టర్‌లో 1982 మే 28న నాణాల వాన కురిసింది. రష్యాలో మెర్చెరీ గ్రామంలో కూడా కాసులు రాలాయి.
- ✶ అమెరికాలోని సిల్వర్‌టౌన్‌లో 1877లో ఓసారి మొసళ్ళ వాన కురిసింది. ఒక్కో మొసలి 12 అంగుళాల పొడవుంది.
- ✶ మాంట్రియల్ అనే ఊరిలో 1857లో బల్లుల వర్షం పడింది.
- ✶ ఆఫ్రికాలో ఒకాయన కారుపై దబ్బుమని పెద్ద పిజ్జా పడింది.

★ హోండురస్ దేశంలో ప్రతి ఏడాది మే-జూలై నెలల మధ్య చేపల వాన కురుస్తుంది. వాటిని వండుకుని తింటారు కూడా.

ప్రత్యక్షముగ క్రిందపడిన ఇన్ని వస్తువులు ఆవిరియై పోలేదు కదా! నీటిని వేడి ద్వారా ఆవిరి చేసి, ఆ ఆవిరిని చల్లబరచి తిరిగి నీరగునట్లు ప్రయోగశాలలో చేసి చూపించవచ్చును. అదే మాదిరి సముద్రము నీరు ఆవిరై మేఘరూపములో ఉండగా, చల్లని గాలి తగలడము వలన ఆవిరి తిరిగి నీరై, వర్షము కురవడము జరుగుచున్నదని కొందరు చెప్పినా, నీరు ఆవిరై, ఆవిరి చల్లబడి నీరవుతుందను సూత్రము చెప్పినా, ఆ విధానమును ప్రయోగము చేసి, చూపించినా, ఆ సూత్రము సారాయిని తయారు చేసుకోవడానికి ఉపయోగపడుతుంది, కానీ వర్షము కురిసే దానికి ఉపయోగపడడము లేదు. కొందరు వారికి తెలిసిన సూత్రము ప్రకారము, మేఘమధనము చేసి వర్షాలను కురిపిస్తామని ప్రయత్నము చేసినా, మేఘ మధనము ద్వారా కూడ వర్షాలు కురుస్తాయని నిరూపణకు రాలేదు. మేఘ మధనము చేసినా, వర్షము కురవని సందర్భములున్నవని దీనినంతటిని గమనిస్తే, మేఘములు మన ఇష్టప్రకారము పని చేయవనీ, దేవుని ఇష్టము ప్రకారము పని చేయునని తెలియుచున్నది.

మేఘము వర్షించినపుడు వచ్చు నీరు, కొన్ని లక్షల చెరువులు నిండేంత ఉండును. వర్షించిన నీరు వరదలై పారుచున్నది. భూమిలోనికి కొంతనీరు ఇంకిపోయినా, కొంత నీరు పల్లముగానున్న గుంతలలో నిలిచి పోయినా, చివరకు సముద్రము వరకు వర్షము నీరు ప్రవహించుచున్నదంటే ఎన్ని నీళ్ళు పైకి పోయి ఉండాలో మీరే లెక్కించుకోండి. అంత నీరు ఆవిరి రూపములో పైకి చేరినదని చెప్పుటకు వీలులేదు. చివరకు ఒక లీటరు నీరు కూడ సూర్యరశ్మి ద్వారా ఆవిరై పైకి పోయిందనుటకు అవకాశము

లేదు. అందువలన మేము చెప్పునది ఏమనగా! మేఘము జీవము గల భూతము. అది ఇంకొకరి ఆజ్ఞకు లోబడి పని చేయుచున్నది. తనకు వచ్చు ఆజ్ఞ ప్రకారము, భూమిమీద నీరును కంటికి కనిపించకుండా సూక్ష్మముగా పైకి తీసుకోగలుగుచున్నది. మేఘములోని నీరు ఆవిరి రూపములో వచ్చినది కాదు, మేఘము స్వయముగా తీసుకొన్నదేనని తెలియాలి. ఇటు ప్రపంచ జ్ఞానము, అటు దైవజ్ఞానము తెలిసిన మేధావులైన మూడవరకము వారు చెప్పు ప్రకారము, దేవుని పాలనలో మేఘములు ముఖ్యపాత్ర పోషిస్తున్నవి. మనుషులు బ్రతుకుటకు త్రాగునీరును, ఆహార ధాన్యములు పండుటకు అవసరమైన నీరును, మనిషికి జీవనాధారమై ప్రతిచోట ఉపయోగపడు నీరును అందించడము మేఘముల యొక్క ముఖ్య కర్తవ్యము. మనుషులు చేసుకొన్న పాపపుణ్యము ప్రకారము, వారికి పంటలు పండాలన్నా, భూమి సారవంతముగా ఉండాలన్నా, మేఘముల వర్షము మీద ఆధారపడి ఉండును. అంతేకాక మనుషులను వరదల ద్వారా హింసించుటకుగానీ, చంపుటకుగానీ మేఘములదే ముఖ్యపాత్ర!

దేవుని పాలనలో సేవకులై, దైవత్వము యొక్క గొప్పతనమును తెలిసిన మేఘములు, నేటికాలములో అజ్ఞానములో మునిగిపోయి దైవత్వమును పూర్తి మరచిపోయిన మనుషులనూ, జ్ఞానులను దైవ జ్ఞానమున్న గ్రంథములను గౌరవించని వ్యక్తులనూ, ప్రపంచ ధనము అయిన డబ్బు ముందర దేవున్ని కూడా లెక్కచేయని మానవులనూ, కానుకలు, ముడుపులు ఇస్తే దేవుడు కూడ తమ పనిని చేస్తాడు అనుకొను వ్యాపార దృష్టికల్గిన మనుషులనూ, చూచిన మేఘములు తమ దేవుని రాజ్యములో ఉండి దేవున్ని గౌరవించని వారి మీద విసుగుకల్గియున్నవి. అందువలన మనుషుల పాపము వంతుకు వచ్చినపుడు, మనుషులను బాధించుచున్నవి.

చిన్న ఉదాహరణ ప్రకారము చూస్తే, ఒక వరదవచ్చి ఊరంతా జలమయమై పోయి తిండిగింజలుగానీ, కట్టుబట్టలుగానీ చేతికి దొరకకుండా పోయినపుడు, తమకు పిడికెడు అన్నము కూడ దొరకనపుడు, తమ పిల్లలు ఆకలితో ఏడుస్తూ ఉంటే, తమకు ఆహారము లేని కారణమున శరీరములోని శక్తి లేకుండా పోవుచున్నపుడు, ఈ వరద ఎంత పని చేసినదని బాధపడుచున్నపుడు మేఘము అదే ప్రాంతములో వర్షించను మొదలుపెట్టితే, ఇక వర్షము వద్దు, వర్షము వస్తే మా ప్రాణాలు పోతాయి, మమ్ములను కాపాడమని దేవున్ని ప్రార్థించినా, ఇంతకాలము డబ్బు తప్ప దేవుడే గుర్తుకు రాని మీకు ఆపద సమయములో మాత్రము దేవుడు గుర్తుకు వస్తాడా? అని మేఘములు వర్షించి, నీటిలో మునిగిపోవు పరిస్థితిని తెచ్చుచున్నవి. కొన్ని ప్రాంతములలో నీటినుండి బయటపడకుండా చనిపోవునట్లు చేయుచున్నవి. కొందరి ఇళ్ళను వర్షము వలన కూలిపోవునట్లు చేసి, ఇంటిలోని వారందరినీ దయదాక్షిణ్యము లేకుండా చంపివేయుచున్నవి. ఇవన్నియూ దేవునికి తెలియకుండ జరగడము లేదు. దేవునికి తెలిసినా, నా పాలన బాగా సాగుచున్నదనుకొంటాడు, నా సైన్యము బాగా పని చేస్తున్నదని అనుకుంటాడు. ఇక్కడ కొందరు ఒక ప్రశ్న అడుగవచ్చును. "ప్రాణాపాయ స్థితిలో తమ ప్రాణములు పోతాయను భయముతో దేవున్ని వేడుకుంటే దీన స్థితిలోనున్న వారిని చూచి దేవునికి కొద్దిగ అయినా దయరాదా? తమ సైనికుడు చేయు భీభత్సమును చేయవద్దని, తమ సైనికుడైన మేఘమునకు చెప్పలేడా?" అని అడుగవచ్చును. దానికి దేవుడు ఈ విధముగా సమాధానము చెప్పవచ్చునని అనుకుంటాను. "నన్ను భక్తితో వేడుకొమ్మని భగవద్గీతలో చెప్పానుగానీ, భయముతో వేడుకొమ్మని నేను ఎక్కడా చెప్పలేదు. భయము పరధర్మమని అది నా ధర్మమేకాదని, అది

మీకు అజ్ఞానాన్నే ఇస్తుందని, పర ధర్మమైన భయముకంటే, స్వధర్మములో మరణమైనా మంచిదేనని భగవద్గీతలో కర్మయోగమున 35వ శ్లోకములో చెప్పియున్నానని మరువవద్దు. నీకు అభిషేకములు చేయించానే? ఆకు పూజలు కట్టించానే? వేలు ఖర్చుపెట్టి కుంకుమార్చనలు, లక్షలు ఖర్చుపెట్టి తులసి అర్చనలు, కోట్లు ఖర్చుపెట్టి నగలు, కిరీటాలు చేయించానే? మామీద కొంచెమైన దయరాదా? మమ్ములను కాపాడవా? అని కొందరు అంటున్నారు.

దానికి నా సమాధానము ఏమనగా! నేను గుణరహితుడనని గీతయందు చెప్పాను. నాకు గుణములే లేనపుడు, దయా గుణము ఎలా వస్తుంది? కావున నాకు దయలేదు. నా మాదిరి నా సేవకుడైన మేఘమునకూ దయలేదు. ఆకు పూజలు, అర్చనలు, అభిషేకములు చేయించానే అని అడుగువారున్నారు. ఆ మాటను నేను ఒప్పుకుంటాను. మీరు వేలు, లక్షలు ఖర్చుపెట్టి నాకు అర్చనలు చేయించేటపుడు, దేవుడు సర్వవ్యాపి సర్వాంతర్యామి అని అనుకోకుండా, నేను గుడిలో మాత్రమున్నవాడిగా, నా ఎదురుగా నిలుచున్నవాడు, ఎవడో కూడా తెలియని గ్రుడ్డివానిగా నన్ను లెక్కించి, నేను ఫలానావాడిని, నీకు పూజచేయిస్తున్నాని నాకు తెలియునట్లు, నాది ఫలానా వంశము, ఫలానా గోత్రము, ఫలానా నామధేయము అని మీ అడ్రస్ పూజారి చేత చెప్పిస్తారా? అలాంటపుడు నీవు ఎవరో తెలియని నేను, నిన్ను రక్షించే దానికి నీవు పిలిచినపుడే రావాలంటే కుదరదు. ఎందుకు కుదరదనగా, నీలాగా చాలామంది అడ్రస్‌లు చెప్పిపోయారు కదా! నీకు వరదలు వచ్చినపుడు, నీకంటే వందరూపాయలు ఎక్కువ ఖర్చుపెట్టి పూజ చేసినవాని కొంప అంటుకొని వాడు పిలుస్తున్నాడు. అదే సమయము లోనే కోట్లు ఖర్చుపెట్టి కిరీటము చేయించినవాడు కడుపునొప్పితో

బాధపడుచూ నన్ను కాపాడు అంటున్నాడు. అలాంటపుడు ఎవడు ఎక్కువ ఖర్చుపెట్టాడని నేను కూడా లెక్క చూచుకొని తక్కువ ఖర్చుపెట్టిన వారిని వదలి, ఎక్కువ ఖర్చుపెట్టిన వానివద్దకు పోవాలంటే వాని అడ్రస్ వెదుకుచు పోవాలి. ఎక్కువ తక్కువల లెక్క చూచుకొని పోయేదానికి కొంత సమయము, వాడు చెప్పిన అడ్రస్ వెదకుచూ పోయేదానికి కొంత సమయము వృథా అవుతుంది కదా! అలా వెదకుచూ పోయినా వాడు చెప్పిన అడ్రస్, గోత్రము, పేరుమాత్రము ఉన్నది, ఇంటినెంబరు పూజారికి చెప్పలేదు. నేను గోత్రము, పేరును పట్టుకొనిపోతే అదే పేరు, అదే గోత్రమున్నవాళ్ళు పదిమంది ఉన్నట్లు తెలిసింది. ఇంటినెంబర్ లేని దానివలన అదేపేరు, అదే గోత్రమున్న పదిమందిలో ఎవనికి కడుపునొప్పి ఉందో ఎలా తెలుస్తుంది? పదిమందిలో ఎవడు పిలిచాడో తెలియక వెనక్కివచ్చాను. అప్పుడు మీరు అడ్రస్ చెప్పినా, పూర్తి ఇంటినెంబర్‌తో సహా చెప్పకపోయిన దానివలన, నేను చివరకు కడుపునొప్పి వచ్చినవాని దగ్గరకు పోలేకపోయాను.

మీరు నన్ను గ్రుడ్డివానిగా అనుకోకుండా, సర్వవ్యాపిగా లెక్కించి, ఆ రోజు గోత్రము, పేరు చెప్పకుండా పూజ చేసియుంటే ఈ రోజు నేను కూడ సులభముగ నీవద్దనే ఉండేవాడిని, అలా కాకుండా నాకు మీ అడ్రస్ చెప్పి నన్ను అవమానపరుస్తున్నారు. అటువంటి మిమ్ములను నేనెందుకు కాపాడాలి? మీరు పూజచేస్తే కాపాడుతానని నేను ఎక్కడా చెప్పలేదు. నన్ను అర్థముతో ఆరాధిస్తే దానివలన జ్ఞానము కల్గునని, జ్ఞానము వలన మీ కర్మలు పోవునని, దానివలన మీరు రక్షింపబడుదురని గీతయందు చెప్పాను గానీ, అర్థములేని పూజలు చేస్తే మిమ్ములను కాపాడుతానని చెప్పలేదు. అందువలన మీరు అర్థము తెలిసి ఆరాధనలు చేయండి అర్థము తెలిసి చేస్తే జ్ఞానశక్తికల్గి దానివలన మీరు కాపాడబడుతారు. కానీ నా వలన

ఎవరూ కాపాడబడరు. నేను పెట్టిన చట్టము ప్రకారము నా మేఘములు పనిని చేయుచున్నవి. మేఘములు ఎవరిని హింసించినా, చంపినా అది నా పాలనలోని చట్టరీత్య జరిగినదేగానీ వేరుకాదు.

మేఘములు ద్రవపదార్థమైన నీటివర్షమునేకాక, ఘన పదార్థమైన మంచు లేక ఐస్‌ముక్కలనుగానీ, పెద్ద మంచుగడ్డలనుగానీ, మంచుపొడిని గానీ తెచ్చి క్రిందవేయడము జరుగుచున్నది. ఎక్కువ శీతలప్రాంతములలో మంచుపొడి మేఘములనుండి రాలుతుంది. ఉష్ణప్రాంతములో వర్షా కాలమున చిన్న చిన్న మంచుముక్కలు రాలడము జరుగుతుంది. ఎప్పుడైనా అరుదుగా పెద్దపెద్ద మంచుబండలు క్రిందికి పడడము కూడ జరుగుతుంది. ఈ మధ్యకాలములో మంచుముక్కల వర్షము లేక వడగండ్ల వాన ఎక్కువగా కురిసింది. వర్షముతోపాటు వడగండ్లు (మంచుముక్కలు) పడడమును వడగండ్లవాన అంటాము. వడగండ్ల వానపడడము వలన అరటితోటలు, బొప్పాయితోటలు ఎక్కువగా దెబ్బతిన్నాయి. దానివలన రైతులు నష్ట పోయారు. మేఘమునుండి విసరివేయబడిన మంచుముక్క బుల్లెట్‌లాగ (తుపాకీగుండులాగా) అరటిగెలను తాకడమువలన అరటికాయలు రంధ్రాలుపడి చీలిపోయాయి. అలాగే బొప్పాయి కాయలురంధ్రాలు పడిపోయాయి. పచ్చి అరటికాయలు, పచ్చిబొప్పాయి కాయలు గట్టిగా ఉండినప్పటికి, వేగముగా వచ్చి తగిలిన వడగండ్లవలన రాళ్ళలాగ గట్టిగ ఉన్న కాయలు కూడ రంధ్రాలు పడిపోయాయి. ఈ విధముగా మంచు ముక్కల వర్షమువలన ఎన్నో పంటలు పూర్తిగా నాశనమై రైతులు నష్టపోయి, నానా బాధలు పడడమేకాక అప్పులు తీర్చలేక, ఆత్మహత్యలు చేసుకొనునట్లు మేఘములు చేయుచున్నవి. 2010వ సంవత్సరము కర్నూలు జిల్లాలో స్పీడ్‌గా పోయే బస్సుమీద వడగండ్ల వాన కురియుట వలన బస్సు అద్దములు

పగిలి లోపలి ప్రయాణీకులకు గాయములై, ఆసుపత్రికి పోయినట్లు టీ.వీలో వార్తను చూచాను. ఈ విధముగా మేఘములు వర్షములు, వరదల రూపములోనే కాకుండా, మంచు తుఫాన్‌రూపములో కూడ మనుషులను కష్టాలపాలు చేయుచున్నవి. మంచు కురియడము వలన చిన్నదారులు, పెద్ద రహదారులు పూడిపోయి కనిపించకుండా పోవడము వలన, రోడ్లమీద పోవు రవాణా వ్యవస్థ అంతా స్థంభించి పోవుచున్నది. ఇళ్ళపైకప్పుల మీద మంచు పేరుకోవడము వలన పైకప్పులు బరువెక్కి కూలిపోవుచున్నవి. మంచుపొడి ఎడతెరపి లేకుండ రాలడము వలన ఇళ్ళు, వాహనములు, రోడ్లు, చిన్న చిన్న చెట్లు అన్నీ మునిగిపోవుచున్నవి. దానివలన ఆ ప్రాంత ప్రజలు పడే అవస్థలు వర్ణనాతీతము!

తన ఆకారమును, పరిమాణమును మార్చుకొను మేఘములు, కొన్ని చదరపు కిలోమీటర్ల పరిధి వరకు ఆకాశములో విస్తరించుకొని ఉండును. అలా విస్తరించుకొన్న మేఘముల పరిధిలోనికి విమానములుగానీ, హెలిక్యాప్టర్లుగానీ వస్తే, కొన్నిటిని ఏమీ చేయక వదలి వేయును. కొన్నిటిని మాత్రము, తన చేతులతో విమానములను కూడ క్రిందికి నెట్టివేయును. మేఘములు విమానములను బలముగా మరియు వేగముగా క్రిందికి త్రోయడము వలన విమానములను నడుపువారికి విమానము కంట్రోల్ కాకపోవడమేకాక ఏమి జరుగుచున్నదని పైలెట్లకు అర్థము కాకుండా పోవును. వారు తేరుకొనే లోపలే విమానము క్రిందపడి ప్రమాదము జరిగిపోవును. ఈ మధ్యకాలములో మేఘములు విమానములను క్రిందికి త్రోయడము అక్కడక్కడ జరిగింది. అంతేకాక నాటి ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి రాజశేఖర్‌రెడ్డిగారు ప్రయాణించు హెలిక్యాప్టర్ కూడా మేఘముల వలననే ప్రమాదానికి గురియైనదని, మేఘములు క్రిందికి

త్రోయడము వలన హెలి క్యాప్టర్ వేగముగా క్రిందకివచ్చి భూమికి కొట్టుకొన్నదని పరిశోధనలోనే తేలింది. అంతేకాక ఆంధ్రాయూనివర్శిటిలో మేఘములను గురించి రీసర్చ్ చేయు ప్రొఫెసర్ **"క్యుములోనింబస్"** మేఘములు ప్రమాదకరమైనవని, అవి విమానములను సహితము క్రిందికి త్రోయగలవని, వాటినే రాక్షస మేఘములంటామని న్యూస్‌పేపర్‌లో ప్రకటించారు.

మేఘములు వర్షాలు, వరదల రూపములోనే కాకుండా, వడగండ్ల వానరూపములో, మంచుపొడి తుఫాన్‌రూపములో, ఆకాశమబ్బులైన క్యుములోనింబస్ మేఘాలరూపములో మనుషులను ఎన్నో కష్టాలపాలు చేయుచున్నవి. అంతేకాక కొన్ని విదేశాలలో సుడిమేఘాలరూపములో కూడా విజృంభించుచున్నవి. విదేశాలలోని సుడిమేఘములను బహాషా నేషనల్ జియోగ్రఫి టీ.వీ ఛానల్‌లోగానీ, డిస్కవరిఛానల్‌లోగాని చూడవచ్చును. చాలామంది సుడిమేఘాలను, సుడిగాలిగా అనుకోవడము జరుగుచున్నది. కానీ అది సుడిగాలి కాదు. గాలివలె పనిచేయుట వలన సుడిమేఘాలను సుడిగాలిగా చాలామంది పొరబడి అనుకోవడము జరుగుచున్నది. సుడి మేఘమును గురించి చెప్పుకొంటే ఆకాశములో అదృశ్యముగానున్న సుడి మేఘము దృశ్యరూపములోనికి మారి, పది నుండి ఇరవై ఎకరాల విస్తీర్ణముగా విస్తరించి అక్కడినుండి క్రిందికి వ్యాపించును. పైన పది ఎకరముల విస్తీర్ణముగల మేఘము క్రిందికి వచ్చేటప్పటికి దాదాపు నాలుగవవంతు విస్తీర్ణముగా తయారగును. పైన పది ఎకరముల విస్తీర్ణముగా కనిపిస్తూ, క్రిందికి విస్తీర్ణవ్యాసము తగ్గుతూ భూమిమీదకు వచ్చేటప్పటికి రెండు లేక రెండున్నర ఎకరముల విస్తీర్ణముగా ఉండును. పైన వెడల్పుగా కనిపిస్తున్న మేఘము క్రింద భూమిమీద ఆకారము తక్కువ

వెడల్పుగా కనిపించును. అలా కనిపించిన ఆకారము ముందుకు కదలుచువచ్చుచుండును. గంటకు పది నుండి ఇరవై కిలోమీటర్ల వేగముతో సుడి మేఘము ముందుకు కదులుచూ పోవుచుండును. అలా కదులుచున్న మేఘము, కొన్ని ఊర్లమీద ప్రయాణించడము జరుగుచున్నది.

సుడి మేఘము పై నుండి క్రింద భూమివరకు ఉండును కదా! క్రింద భూమిని తాకినకొన, రెండు మూడు ఎకరముల విస్తీర్ణముగా ఉంటూ వేగముగా సుడి తిరుగుచుండును. మేఘము క్రిందికొన, సుడి తిరుగడము వలన భూమిమీద ఏమున్నా, అది మేఘము యొక్క బలమునకు తట్టుకోలేక మేఘము వెంట తిరుగుచు పైకెగురును. అలా సుడిమేఘములో చిక్కుకొన్న, చిన్నచిన్న కార్లు కూడ గిర్రున తిరుగుచూ పైకి లేచి, సుడి వ్యాసము యొక్క అంచు దగ్గర నుండి విసరివేయబడును. ఉదాహరణకు కోళ్ళఫారమ్‌ను నిర్వహించు ఇనుపరేకుల షెడ్‌గానీ, సిమెంట్‌రేకుల షెడ్ గానీ సుడిమేఘము ప్రయాణించు దారిలో ఉందనుకొనుము. సుడిమేఘము ఆ షెడ్‌ల మీదకు వస్తూనే, మేఘము సుడి తిరుగు వేగమునకు మరియు బలమునకు, షెడ్‌మీద ఉన్న రేకులు పైకి లేచి మేఘములో తేలిపోతూ, సుడి తిరుగుచూ విసిరివేయబడినట్లు దూరముగా పడిపోవుచుండును. మేఘము కదలి పోయేకొలదీ దారిలోనున్న ఏవైనా తేలిక వస్తువులనుండి, బరువు వస్తువుల వరకు పెరికి త్రిప్పి విసిరివేయడము జరుగుచుండును. సుడి మేఘము ఎక్కడికి వచ్చినా విధ్వంసము జరిగినట్లే అవుతుంది. ఆ మేఘమును దూరమునుండి గమనించిన మనుషులు, దానిలో చిక్కుకోకుండా ఇళ్ళు వదలి పారిపోవుదురు. ఆ మేఘములో చిక్కుకొన్న పశువులు కూడ వందల అడుగులు పైకిలేచి, మేఘములో గిర్రున తిరగడము టీ.వీ. ఛానళ్ళలో చూడడము జరిగింది. ఒక ఊరుమీద ఆ మేఘము ప్రయాణించి పోయిన

తర్వాత, ఆ ఊరును చూస్తే చీపురుతో ఊడ్చినట్లు పై కప్పులు ఊడిపోయిన ఇండ్లు, చెల్లాచెదురుగా పడిన వాహనములు మొదలగునవి భయంకరముగా కనిపించును. నిన్నటి దినము ఒక దేశములో సుడిమేఘము ప్రయాణించ డమును టీ.వీ.ఛానల్‌లో చూచాను. అది ప్రయాణించకముందు విమానా లను రిపేరు చేయు పెద్దషెడ్‌లను దూరమునుండి చూపించారు. ఆ మేఘము ఆ షెడ్‌మీదకు వచ్చినపుడు, పై కప్పులు సుడితిరుగుచు, మేఘములో లేచి పోవడము, గిర్రున తిరుగుచూ దూరముగా పై నుండి విసిరివేసినట్లు పడి పోవడము ప్రత్యక్షముగా కనిపిస్తూవుంది. సుడిమేఘము ఆ ప్రాంతమును దాటిపోయిన తర్వాత అక్కడికి పోయి ఆ దృశ్యములను చూపించగా షెడ్‌లలో నిలబడివున్న విమానాల రెక్కలు విరిగిపోయి ఉన్నాయి. కొన్ని విమానాలు ప్రక్కకు తిరిగి పడివున్నాయి. చూచేదానికి ఎవరైనా పెద్ద రౌడీమూక (కొన్ని వందలమంది రౌడీలగుంపు) వచ్చి విధ్వంసము చేసినట్లు, అన్నిటినీ పగులకొట్టినట్లు కనిపిస్తున్నది. సుడిమేఘము, గాలి సుడితిరిగినట్లు, గాలిలో వస్తువులు లేచిపోయినట్లు, కొట్టుకుపోయినట్లు చేయుచున్నది. కావున వాస్తవానికి అది మేఘమే అయినా, చాలామంది దానిని సుడిగాలి అనుకోవడము జరుగుచున్నది.

మేఘము అనునది ఒకటే అయినా మానవుడు చేసుకొన్న పాపమును బట్టి అది ఐదు రకములుగా పనిని చేయుచు ఐదు రకముల పేర్లను కలిగియున్నది. 1. వర్షమును కురియునపుడు వర్షమేఘము అంటాము. 2. మంచుముక్కలు పడునపుడు వడగండ్ల మేఘము అంటాము. 3. పొడిమంచు పడునపుడు మంచుమేఘము అంటాము. 4. విమానాలను కూలద్రోయునపుడు మబ్బుమేఘము అని మనము అంటాము. శాస్త్రవేత్తలు రాక్షసమేఘము లేక క్యుములోనింబస్ మేఘము అని అంటారు.

5) సుడిగాలిలాగా ప్రయాణిస్తూ దొరికిన వస్తువులన్నిటినీ పైకిలేపి విసిరివేయు మేఘమును సుడిమేఘము అంటాము. ఐదు రకాలపేర్లు కల్గి ఐదు విధములుగా మేఘము, మనుషులను చిత్రహింసలపాలు చేయడమేకాక ఘోరముగా మనుషులను చంపివేయుచున్నది. ఎక్కడో యమలోకముందని చెప్పుకోవడము తప్ప దానిని ఎవరూ చూడలేదు. కానీ మేము ఇక్కడే యమలోకముందని చెప్పినా, వాస్తవమును ఎవరూ గ్రహించలేకున్నారు. యమలోకములో మనిషియొక్క పాపము చిత్రగుప్తుని చేత లెక్కించబడి చిత్రగుప్తుడు చెప్పిన లిస్టు ప్రకారము అనుభవించవలసి యున్నది. దానిని అనుభవింప చేయువారు యమకింకరులు. యమ ధర్మరాజు రాజ్యములో, యమకింకరుల ద్వారా, పాపులైన ప్రజలను పాలించడము జరుగుచున్నది.

పూర్వము వ్యాసుడు యమలోకము అను దానిని గరుడపురాణము లలో చెప్పినా, ఇప్పుడు **ప్రబోధానందయోగీశ్వరులు** 'యమలోకము' అనునది బ్రహ్మవిద్యాశాస్త్రములో కలదని చెప్పినా, యమలోకమును పరిశీలించితే మూడు ముఖ్యమైన భాగములు తెలియుచున్నవి. ఒకటి యమధర్మరాజు, రెండు యమకింకరులు, మూడు ప్రజలు లేక జీవులు. దానినే ఒకటి ప్రభువు, రెండు పాలకులు, మూడు పాలించబడువారు అనవచ్చును. ఇక్కడ ప్రభువు ఎవరు? పాలకులు ఎవరు? పాలించబడువారు ఎవరు? అని ప్రశ్నించుకొనినట్లయితే, ప్రభువు యమధర్మరాజు, పాలకులు యమ కింకరులు, పాలించబడువారు జీవులు అని చెప్పవచ్చును. యమధర్మరాజు, యమకింకరులు అను పేర్లలో రెండిటియందు **'యమ'** అను పదమును తీసివేస్తే, మిగిలేది మొదట ధర్మరాజు, తర్వాత కింకరులు. కింకరులు అనగా సైనికులు అని చెప్పవచ్చును మరియు సేవకులు అని చెప్పవచ్చును.

సేవకులుగానీ, సైనికులుగానీ, రాజు క్రింద రాజు ఆధీనములో పని చేయువారు అయినపుడు రాజు, కింకరులు అంటే సరిపోతుంది. కానీ రాజు ముందర **"ధర్మ"** అనే పదము ఒకటి ప్రత్యేకముగా ఉన్నది. ఏ దేశములో అయినా, ఏ రాజ్యములో అయినా రాజు ఉంటాడు. రాజు అను పదము ముందర ఏమీ ఉండదు. కానీ ఇక్కడ రాజు ముందర **"ధర్మ"** అనే ప్రత్యేకమైన పదము ఎందుకున్నది అని యోచించవలసిన అవసరమున్నది. **"ధర్మ"** అనే పదమునకు దగ్గరగా సరిపోవు పదము **"నిబంధన"**. నిబంధన అనగా బంధములేనిది (బంధింపబడనిది) అని అర్థము. ప్రపంచములోని బంధనములలోకెల్ల పెద్దబంధము **"కర్మబంధము"** కర్మచేత బంధింపబడనివాడు లేక కర్మబంధనము లేనివాడు దేవుడు తప్ప ఎవరూ లేరు. అందువలన దేవున్ని రాజు అని చెప్పినపుడు ఆయన అందరి రాజులాంటివాడు కాదు, ఈ రాజు ప్రత్యేకమైనవాడు అని చెప్పుచూ, ఆ ప్రత్యేకత ఏమిటో అందరికీ తెలియునట్లు **"ధర్మరాజు"** అన్నారు. గరుడ పురాణములో వ్యాసుడు చెప్పిన యమధర్మరాజు, ఎక్కడో ఎవడూ చూడని యమలోకములో ఉంటాడు. బ్రహ్మవిద్యలో మేము చెప్పు యమధర్మరాజు మనకు కనిపించు విశ్వములోనే ఉన్నాడు. వ్యాసుడు చెప్పిన గరుడ పురాణములోని యమధర్మరాజును గురించి తెలుసుకొంటే కాల క్షేపమౌతుంది. మేము చెప్పు యమధర్మరాజును గురించి తెలుసుకొంటే కర్మక్షేపమౌతుంది.

ఇపుడు మనకు కర్మక్షేపము (కర్మనాశనము)ను గురించిన యమ ధర్మరాజును గురించి తెలుసుకొనుటయే ముఖ్యము. ఒక రాజ్యములో రాజు, రాజు క్రింద పనిచేయు సైనికులైన సేవకులుంటారు. ఇక్కడ మనము చెప్పుకొను రాజు ప్రత్యేకత కల్గియున్నాడు. కావున రాజును ధర్మరాజు

అనడము జరిగినది. ఇంకా గమనిస్తే ధర్మరాజుకు ముందర మరియు కింకరులకు ముందర "యమ" అను పదముకలదు. ఇటు ధర్మరాజు ముందర అటు కింకరుల ముందర ఉండుటలో ఏమి విశేషముకలదని యోచించి చూస్తే కొంతవరకు అర్థమగుచున్నది. అదేమనగా! యమ అనగా పెద్ద అనియూ, గొప్ప అనియూ చెప్పవచ్చును. దీనిప్రకారము యమధర్మరాజు అనగా పెద్ద ధర్మరాజు అని అర్థము. అలాగే యమ కింకరులు అనగా పెద్ద కింకరులు అని అర్థము. అన్నిటికంటే మించిన పెద్దది ఏదైతే ఉందో దాని ముందర "యమ" అను పదమును వాడవచ్చును. విశ్వములో దేవునికంటే మించిన రాజుగానీ, భూతములకంటే మించిన కింకరులుగానీ లేరు. కావున దేవున్ని యమధర్మరాజు అని, భూతములను యమకింకరులని చెప్పడము జరిగినది. యమ అనగా పెద్ద అయితే, నియమ అనగా చిన్నదని అర్థము. అందువలన దేవున్ని యమము కలవాడనీ, నియమము లేనివాడని చెప్పవచ్చును. కావున కొన్ని చోట్ల దేవున్ని నియమ నిష్ఠలు లేనివాడు అని అన్నారు. అట్లే భూతములను నియమము లేనివని చెప్పవచ్చును.

విశ్వమునందు బలములోగానీ, పనులు చేయుటలోగానీ భూతముల కంటే మించినవి లేవు. కనుక మహాభూతములనుగానీ, స్వల్పభూతములను గానీ, ఉపభూతములనుగానీ యమకింకరులు అని అనవచ్చును. అనేక ఉపభూతములలో, ఒకానొకటి అయిన మేఘము అను భూతము ఎంత పెద్దదో, ఎంత పెద్ద బలముకలదో చెప్పుకొన్నాము. మేఘము అను భూతమునకు కొన్ని కోట్ల చేతులున్నాయి అనియూ, ఆ చేతులకు బలము లెక్కలేనంతకలదని కూడా చెప్పాము. యమకింకరులు అన్నపుడు మేఘము నకు కూడ 'యమ' అను పదము వర్తిస్తుంది. కావున మేఘమును మించిన

బలము, భూమిమీద ఏ జీవరాసికీ లేదని చెప్పవచ్చును. మేఘమునకున్న బలము ఏ జీవరాసికీ లేదన్నపుడు, ఏ జీవరాసికీ ఉపయోగపడని బలము మేఘమునకు ఉపయోగపడినదని చెప్పవచ్చును. ఉదాహరణకు పోయిన సంవత్సరము చైనాలో, ఒక ప్రాంతములో అరవై (60) లక్షల టన్నుల పొడిమంచు కురిసిందనీ, మరియొక చోట ఎనభై (80) లక్షల టన్నుల పొడిమంచు కురిసిందని వార్తలలో చెప్పడము, చూపించడము జరిగింది. రెండు ప్రాంతములలో కురిసిన మంచుయొక్క బరువును చూస్తే, 140 లక్షల టన్నులు! దీనినిబట్టి మేఘముల చేతులకు ఎంత బలమున్నదో చెప్పలేము. ఒక లారీకి పది టన్నుల బరువును వేస్తాము. ఆ లెక్క ప్రకారము మేఘము కురిసిన పొడిమంచు 14 లక్షల లారీలలోనికి నింపవచ్చును. దీనినిబట్టి చూస్తే ఉపభూతమైన మేఘమును యమ కింకరుడని అనవచ్చును.

మనిషి శరీరములోని 19 భాగములు కూడా దేవుని సేవకుల క్రిందికే జమకట్టబడినారు. దేవుని సేవకులు కోట్ల సంఖ్యలో ఉన్నారని చెప్పాము. ఆయన సేవకులు లేక దూతల సంఖ్య ఎంత ఉన్నది మనుషులకు ఎవరికీ తెలియదు. దేవుని సైన్యములోయున్న వారందరూ దేవుని సేవకులు గానే చెప్పుచున్నాము. ఇంతకు ముందు మేఘములు కూడా భూతములే యని చెప్పాము. భూతములుకాక గ్రహములు అనునవి కూడా కలవు. వారందరూ దేవుని సేవకులుగాయున్నారు. వీరు కాకుండా ప్రపంచ సంబంధమైన దేవతలు, గ్రామదేవతలు అనువారు కూడా మనుషులకు కనిపించకుండాయున్నారు. దేవతలు, క్షుద్రదేవతలు అనువారు దేవుని సేవకులు కారు. దేవుని సైన్యములో వీరులేరు. ప్రపంచములోని జీవులే వారి కర్మప్రకారము దేవతలుగా, క్షుద్రదేవతలు (గ్రామ దేవతలు)గా పుట్టి

చలామణి అగుచున్నారు. కొందరు మనుషులు అసలయిన దేవున్ని వదలి, దైవజ్ఞానము తెలియనివారై జీవులైన ప్రపంచ దేవతలను, గ్రామదేవతలను మ్రొక్కడము జరుగుచున్నది. వారే నిజమైన దేవుళ్ళని నమ్మి వారివైపు పోవడమే జరుగుచున్నది. అయితే దేవతలు, గ్రామదేవతలలో కొందరు తాము కూడా మనుషులవలె ఉన్నాము తప్ప తాము గొప్పవారము కాదని వినయ విధేయతలతో దేవున్ని ఆరాధించుచున్నారు. అటువంటివారు చాలామంది గ్రంథములను చదివి అందులో ఏది పెద్దదో తెలుసుకోగలుగు చున్నారు. దేవుని జ్ఞానమును జీర్ణింపజేసుకొని దేవున్నే ఆరాధించుచూ దేవునివైపు పోవుచున్నారు. ప్రపంచ దేవతలను, గ్రామదేవతలను ఖుర్‌ఆన్ గ్రంథములో జిన్నులు లేక జిన్నాతులు యని అనడము జరిగినది. జిన్నులలో కొందరు దైవభీతి, దైవభక్తికల్గియుండి, వారు మనుషులకు కనిపించక పోయినా, మేము మనుషులవలె జీవాత్మలమే అనుకొని గర్వము లేకుండా ఉందురు. అటువంటివారు ఖుర్‌ఆన్ గ్రంథమును చదివి దాని గొప్పతనమును తెలిసినవారై ఖుర్‌ఆన్, ముందు వచ్చిన రెండు గ్రంథములను ధృవీకరించుచున్నదని చెప్పుచున్నారు. ఆ విషయమునే ఖుర్‌ఆన్ గ్రంథములో సూరా 46, ఆయత్ 30లో ఇలా వ్రాశారు చూడండి. **(46-30) "వారిలా అన్నారు. ఓ నా జాతి ప్రజలారా! మూసా తర్వాత అవతరింపజేసిన గ్రంథమును మేము విన్నాము. అది తనకు పూర్వమున్న దైవగ్రంథములన్నిటినీ ధృవీకరిస్తోంది. ఇంకా అది సత్యము, ధర్మము వైపునకు నేరుగా దారి చూపుచున్నది."** ఈ విధముగా ఖుర్‌ఆన్ గ్రంథమును అర్థముచేసుకొని అది బైబిలును, భగవద్గీతను ధృవీకరించు చున్నదని తెలుపుచున్నారు. ఇలాంటివారు కొందరు దేవతలలో గ్రామదేవతలలో ఉండగా! మరికొందరు జిన్నులు (దేవతలు, గ్రామ

దేవతలు) అజ్ఞానము కలవారై తాము కూడా దేవతలమేయని, మేము ఎవరికీ కనిపించని శక్తివంతులమని గర్వపడుచూ, తమను పూజించువారికి దేవుళ్ళుగా యున్నారు. మనుషులు కూడా అజ్ఞానములో యున్నవారై అసలయిన దేవున్ని వదలి దేవతలను, గ్రామదేవతలను మ్రొక్కుచున్నారు. అలా ప్రజలు కొందరు జిన్నులను ఆరాధించడము వలన వారి ఆరాధనలను స్వీకరించుచూ తాము కూడా శక్తివంతమైన దేవతలమే అనుకొన్నారు. అటువంటివారికి మనుషులకు వచ్చు కర్మనే వచ్చును. ఆ కర్మనుండి వారు తప్పించుకోలేరు. చివరకు వారు దేవతలలోయుండి సంపాదించుకొన్న పాపమును మనుషులుగా పుట్టి అనుభవించువారు కూడా కలరు. తమను మ్రొక్కు ప్రజలను చూచి జిన్నులు (దేవతలు, గ్రామదేవతలు)లను గురించి ఖుర్ఆన్‌లో సూరా 72, ఆయత్ 6లో ఈ విధముగా కలదు. **(72-6) "అసలు విషయము ఏమిటంటే కొందరు మనుషులు కొందరు జిన్నాతులను ఆరాధించేవారు కలరు. ఈ కారణముగా జిన్నాతుల పొగరు మరింత పెరిగి పోయింది."** ఈ వాక్యమునుబట్టి చూస్తే దేవతలు, గ్రామదేవతలు (జిన్నులు) తమను మనుషులు కొందరు ఆరాధించడము వలన మేము కూడా గొప్పవారమేయని తమనుతాము భావించుకొని గర్వపడుచున్నారు. అలా గర్వపడి వారు దేవున్ని మరచిపోయారు. అటువంటివారికి దేవుడు తగిన శిక్షవేసి, వారు చేసుకొన్న కర్మకు దేవునికి దూరమగునట్లు చేసి, మానవ జన్మ వచ్చునట్లు చేసి, అక్కడ కర్మలను అనుభవించునట్లు చేయును.

జిన్నులలో అనగా దేవతలలో గ్రామదేవతలలో స్త్రీలుయున్నారు, పురుషులుయున్నారు. వారిలో కొందరు మంచిమార్గములో పోవుచూ మంచి జ్ఞానులుగాయున్నవారు ఉన్నారు. కొందరు అజ్ఞానులుగాయున్నవారు గలరు.

దేవతలుగాయున్న వారిని పురుషులనే కాకుండా దేవుడు స్త్రీలను కూడా పుట్టించాడు. దేవుని లెక్కలో ఇద్దరూ జీవులేయనివుండును. అయితే వారు చేసుకొన్న కర్మల తేడాల వలన జీవుళ్ళు స్త్రీ, పురుష శరీరములను ధరించుచున్నారు. దేవతలందు, గ్రామదేవతలయందే కాకుండా భూమిమీద మనుషులలో స్త్రీ పురుషులను దేవుడు జన్మింపజేసి వారి శరీరముల వలన స్త్రీ పురుష సంతతి పుట్టునట్లు చేశాడు. స్త్రీ పురుషులే కాకుండా మనుషులలో నపుంసకులు కూడా పుట్టుచున్నారు. ఎవరు ఎట్లుండినా అదంతా మనుషులు చేసుకొన్న కర్మనుబట్టియుండును. వాని కర్మనుబట్టియే వాడు పురుషుడుగానో, స్త్రీగానో లేక నపుంసకుడుగానో పుట్టుచున్నాడు. అయితే దేవుని లెక్కలో అందరూ సమానమే. మనిషి మూడు జాతులుగా పుట్టుటకు కారణము కలదు. దేవుని సృష్టిలో స్త్రీ సంబంధమైన ప్రకృతి మొదట పుట్టినది. తర్వాత పురుష సంబంధమైన రెండు ఆత్మలు జీవాత్మ, ఆత్మ యను పేరుతో పుట్టాయి. జీవాత్మ ప్రకృతి సంబంధమైన గుణములలో ఉండిపోవడము వలన అతనిలో పూర్తి ఆత్మతత్త్వము లేకుండాపోయి ప్రకృతి తత్త్వము కూడా చేరియుండుట వలన జీవుడు నపుంసకుడుగాయున్నాడు. ఆత్మ ఎప్పటికీ తన ధర్మమును కోల్పోకుండాయుండుటవలన ఆత్మ పురుషుడుగానేయున్నది. ఆత్మ పురుషుడు, జీవాత్మ నపుంసకుడు, ప్రకృతి స్త్రీ అని మూడు విధముల గుర్తించుకొనుటకు మూడు జాతులను మనుషుల యందు దేవుడు పుట్టించాడు. భూమిమీద మూడు జాతులను చూచినప్పుడు జ్ఞానమున్నవాడు ప్రకృతిని, ఆత్మను, మధ్యలోయున్న జీవాత్మను గుర్తు చేసుకోగలడు.

జీవులు వారివారి కర్మలనుబట్టి మనుషులుగా పుట్టినా లేక దేవతలుగా, గ్రామదేవతలుగా పుట్టినా వారియందు మూడు జాతులు

కనిపించుచున్నవి. మనుషులలోనేకాక దేవతలయందు కూడా నపుంసకులు గలరు. ఎవరు ఏ శరీరముతో పుట్టినా అందులోని జీవులందరూ దేవునికి సమానమే. ఎవరయినా దేవుని జ్ఞానమును తెలిసి మోక్షమును పొంద వచ్చును. మనుషులుగా పుట్టిన స్త్రీ పురుషులలో మరియు నపుంసకులలో ఎవరయినా సరే పుణ్యమును సంపాదించి స్వర్గ సుఖములను రెండవ జీవితములో అనుభవించవచ్చును. అలాగే వారు సంపాదించుకొన్న పాపమును రెండవ జీవితములో కష్టాల రూపములో అనుభవించుచున్నారు. సుఖదుఃఖములు వారివారి కర్మనుబట్టి ఆత్మ అనుభవించునట్లు చేయు చుండును. దేవునికి మాత్రము అందరూ సమానమే. అయితే కొందరు స్త్రీలకు స్వర్గ సుఖములుండవు అంటున్నారు. వారు ఎక్కడో స్వర్గలోకము ఉన్నదని అక్కడపోయి స్వర్గములో సుఖములు అనుభవించాలని వారను కొనుచూ అది పురుషులకే, స్త్రీలకు లేదని చెప్పుచున్నారు. ఆ విషయము ఖుర్ఆన్‌లో ఎక్కడా వ్రాయలేదు. స్వర్గసుఖములు అందరికీ సమానమేయని ఖుర్ఆన్ గ్రంథములో సూరా 40, ఆయత్ 40లో ఇలా కలదు చూడండి. **(40-40) "ఎవడయినా పాపానికి పాల్పడితే దానికి సరిసమానమైన పాప ఫలమే వానికి లభిస్తుంది. మరెవరయినా పుణ్యకార్యములను చేస్తే అతడు పురుషుడయినా, స్త్రీ అయినా వారంతా స్వర్గములోనికి ప్రవేశిస్తారు. వారక్కడ లెక్కలేనంత ఉపాధిని పొందుతారు."** భూమిమీదనే స్వర్గసుఖములు, నరక కష్టములున్నాయని మరువకూడదు.

కొందరు ఈ విధముగా అంటూ ఉంటారు, వారి లెక్కలో స్త్రీలు సైతాన్‌తో సమానమట, అందువలన వారికి మసీద్‌యందుగానీ (ప్రార్థన స్థలమందు గానీ) కబర్ స్థానమందుగానీ (స్మశానమందుగానీ), స్వర్గములో గానీ ప్రవేశము లేదు అని అంటూవుంటారు. అయితే దేవుడు తన

గ్రంథమందు ఎప్పుడూ అట్లు చెప్పలేదు. స్త్రీ సైతాన్‌తో సమానమైతే దేవుడు ఆడవారి గర్భములో సంతతి కలుగజేయుచున్నాడు కదా! వారి కర్మనుబట్టి కొందరి స్త్రీలకు సంతతిని దేవుడే కల్గించుచున్నాడు. అలాగే కర్మనుబట్టి కొందరి స్త్రీలను గొడ్రాల్లుగా చేయుచున్నాడు. స్త్రీల శరీరములో దూరి వారికి సంతతిని కల్గించునపుడు స్త్రీ పురుషుడు ఇద్దరూ దేవునికి సమానమే కదా! అంతేకాక ప్రతి స్త్రీ శరీరములో జీవాత్మ, ఆత్మ ఉండడమే కాకుండా దేవుడు కూడా సాక్షిగా చూస్తూయున్నాడు. దేవుడు తన ఇష్టము ప్రకారము వారియందే ఉన్నాడు కదా! ఈ విషయమై సూరా 42, ఆయత్ 49,50లలో ఇలా కలదు చూడండి. **(42-49) "భూమి ఆకాశముల సామ్రాజ్యము దేవునిదే. ఆయన అనుకొన్నది సృష్టిస్తాడు. తాను అనుకొన్నవారికి ఆడపిల్లలను ఇస్తాడు, తాను అనుకొన్నవారికి మగపిల్లలను కూడా ఇస్తాడు." (42-50) "లేదా వారికి మగపిల్లలను, ఆడపిల్లలను కలిపి ఇస్తాడు. మరి తాను కోరినవారిని సంతాన హీనులుగా చేసేస్తాడు. ఆయన మహాజ్ఞాని, సంపూర్ణ అధికారం కలవాడు."**

ప్రపంచములో ఆడపిల్లలను, మగపిల్లలను పుట్టించేది ఆయనే. పుట్టించేవానికి చంపే హక్కు కూడా యున్నది. అందువలన మనుషులను చంపేవాడు కూడా దేవుడే. దేవునికి తెలియకుండా ఒక్క పనికూడా జరుగడములేదు. దేవుడే ప్రపంచములో జీవరాశులను పుట్టించుచున్నాడు మరియు హరించుచున్నాడు. అందరినీ పుట్టించుచుండుట వలన దేవున్ని సృష్టికర్తయని అన్నారు. అలాగే అందరి శరీరములను నాశనము చేసి చంపువాడు కూడా దేవుడే. అందువలన దేవున్ని ప్రళయకర్త అనికూడా అన్నారు. ఇదే విషయమే ఖుర్ఆన్ గ్రంథములో సూరా 15, ఆయత్ 23 నందు ఇలా కలదు. **(15-23) "ప్రాణము పోసేది, ప్రాణము తీసేది**

**కూడా మేమే. చివరికి వారసులము కూడా మేమే."** ఇదే విషయమునే మరొకచోట సూరా 50, ఆయత్ 43లో ఇలాకలదు. **(50-43) "మేమే బ్రతికిస్తున్నాము, మేమే చంపుతున్నాము. ఎట్టకేలకు మావైపుకే మరలి రావలసియున్నది."**

పై వాక్యములలో ప్రాణము పోసేది మేమే, ప్రాణము తీసేది మేమే అని చెప్పారు. తర్వాత మేమే బ్రతికిస్తున్నాము, మేమే చంపుతున్నాము అని రెండు రకముల చెప్పడమైనది. ఇందులో ప్రాణము పోసేది, బ్రతికించేది రెండూ మంచి పనులే. ప్రాణము తీసేది, చంపేది రెండూ చెడు పనులే. ఈ రెండూ పాపపు పనులే అయితే చేసేది దేవుడు. దేవుడు ఇంత చెడు పనులు చేయునా! అలా చేస్తే పాపమురాదా!యని ఎవరయినా అడుగవచ్చును. దానికి మా సమాధానము ఇలా కలదు. గుణములున్న వానికి మంచిచెడు గుణములుండును కావున వానికి మంచిపనులు, చెడు పనులు అని తేడాయుండును. గుణములు లేనివానికి మంచిపని, చెడు పని రెండూ ఒక్కటే. దేవుడు గుణరహితుడు, ఆయనకు గుణములు లేవు. అందువలన దేవుని లెక్కలో మంచి, చెడు అనునవి లేవు. అలాగే పాప పుణ్యములు కూడా గుణములతో చేసినవానికే వచ్చును. అందువలన ఆయనకు పాపము కూడా రాదు. ఆయన సృష్టికర్త కావున ప్రాణము పోయుచున్నాడు. అలాగే ఆయన లయకర్త కావున ప్రాణము తీయు చున్నాడు. సృష్టికర్త మరియు లయకర్త అయిన దేవుడు పుట్టుకనుండి చావుకు మధ్యలోగల జీవితమునకు కూడా ఆయనే కర్త కావున ఆయనను పోషకకర్త అనికూడా అనుచున్నాము. దానిప్రకారము సృష్టి, స్థితి, లయ ములకు దేవుడే కర్తగాయున్నాడు. అందువలన ఆయనను సృష్టి, స్థితి, లయకర్తగా చెప్పుచున్నారు.

చాలామంది దేవున్ని తండ్రియని అంటున్నారు. మనుషులంతా ఆయన సంతతే అని అంటున్నారు. ఆ మాట వాస్తవమేనా! అని అడిగితే ఆయనకు భార్యలేదు తండ్రి ఎలా అగును? అను ప్రశ్నరాగలదు. ఈ విషయమై ఖుర్ఆన్ గ్రంథములో సూరా 6, ఆయత్ 101లో ఈ విధముగా ఉన్నది. **(6-101) "ఆకాశమునూ భూమినీ తయారు చేసినవాడు ఆయనే. దేవునికి భార్యయే లేనప్పుడు ఆయనకు సంతానము ఎలా కలుగుతుంది? ఆయన ప్రతి వస్తువునూ సృష్టించాడు. ప్రతి జీవరాశినీ సృష్టించాడు. ఆయనకు ప్రతీదీ బాగా తెలుసు."** ఈ వాక్యములో ఆకాశమును, భూమిని మొదలుకొని మధ్యలోయున్న ప్రతీదీ దేవుడే సృష్టించాడు అని చెప్పబడినది. దీనినిబట్టి అన్నిటికీ సృష్టికర్త ఆయనే అని అందరూ చెప్పవచ్చును. సృష్టికర్తను కన్నతండ్రియని కూడా అనవచ్చును. అన్ని రకముల దేవుడు అందరికీ తండ్రియే. అయితే ఆయనకు భార్యలేదు కదా! ఆయన నీకుగానీ, నాకుగానీ తండ్రి ఎలా అగును? అని ప్రశ్న రాగలదు. **దేవుని మీద ఎప్పుడు ప్రశ్నవచ్చుచున్నదో అప్పుడు ఆయన మీద అనుమానము వచ్చినట్లేయగును. ఎప్పుడు దేవునిమీద అనుమానము వచ్చినదో అప్పుడే మనమీద మాయపని చేసి దేవునికి దూరముగా పంపుచున్నదని తెలియవలెను.** ఆయన నిన్ను పుట్టించాడా లేదా అని చూచుకో! దేవుడు తప్ప ఎవరూ నిన్ను పుట్టించనప్పుడు నిన్ను పుట్టించినవాడు ఒకడే అయినప్పుడు ఆయన నీకు తండ్రియగునుకదా! ఆయన తప్ప వేరే తండ్రిలేదు కదా! అలాంటప్పుడు తండ్రి దేవుడేయని రూఢిగా తెలిసినప్పుడు ఆయన భార్యతో నీకేమి పని? దేవుడు మనిషి అయితే మనిషికున్నట్లు ఆయనకు కూడా ఒక భార్య ఉండవలసిన అవసరముంటుంది. ఆయన మనిషేకానప్పుడు ఆయనకు భార్యలేదే

యని అడగడమే తప్పగును. ఆకాశమును, భూమిని వాటిలోనున్న సమస్తమునూ సృష్ఠించినది ఆయనే అయినప్పుడు ఆయన భార్యతో నీకేమి పని? నిన్ను సృష్ఠించినది దేవుడేయని తెలిసికూడా దేవున్ని ఎప్పుడయినా తండ్రి యనిగానీ, నాన్నా అనిగానీ పిలిచావా? పిలువలేదు. ఆయన భార్య ఫలానా అని తెలిస్తే ఆమెనైనా అమ్మా అని పిలుస్తావా? అదీ నమ్మకము లేదు. దేవుడు భౌతికముగా కనిపించేవాడయితే ఆయనకు కనిపించే భార్య ఉండేది.

దేవుడు అభౌతికుడు. కనిపించనివాడుగాయున్నాడు. 'కనిపించే వానికిగానీ, కనిపించని వానికిగానీ భార్యలేనిదే సంతానముండదు' అను సూత్రము గలదు. ఒక పురుషుడు ఒక స్త్రీయున్నప్పుడే అక్కడ ఏదయినా పుట్టుతుంది. ఒకటి సృష్ఠించబడాలి అంటే స్త్రీ పురుషుడు ఇద్దరూ ఉండవలసిందే. సమస్త జీవరాశులూ ఇంత ప్రపంచమూ పుట్టిందంటే తప్పకుండా దీనికంతటికీ కారణమయిన స్త్రీ పురుషులు ఇద్దరూ ఉండవలసిందే. దేవుడు పురుషుడని ముందే తెలిసిపోయింది. భగవద్గీతలో (తౌరాత్ గ్రంథములో) దేవుడు **"నేను పురుషున్ని"** అని పురుషోత్తమప్రాప్తి యోగమను అధ్యాయమున 17,18 శ్లోకములలో ప్రకటించాడు. అంతేకాక గుణత్రయ విభాగయోగమున 3వ శ్లోకములో **"నాకు ప్రకృతియే భార్యగాయున్నదని"** కూడా ప్రకటించాడు. నాల్గవశ్లోకమున **"సర్వజీవరాశులకు ప్రకృతి తల్లికాగా, నేను తండ్రిగా యున్నాను"** అన్నాడు. సర్వజీవరాశులకూ తల్లి ప్రకృతియని కూడా భగవద్గీత విజ్ఞానయోగమందు చెప్పబడినది. అయితే కనిపించే ప్రకృతి ఎలా అందరికీ తల్లిగా యున్నదో, కనిపించని దేవుడు అందరికీ తండ్రిగా ఎట్లున్నాడో ఎవరికీ తెలియదు. ప్రకృతి తల్లి, పరమాత్మ తండ్రియని తెలియాలంటే దేవుని జ్ఞానము తెలియాలి. దేవుని జ్ఞానము తెలియాలంటే దైవగ్రంథములను చదవాలి. దైవగ్రంథములు

చదివినప్పుడు బ్రహ్మవిద్యాశాస్త్రము తెలియును. అప్పుడు శాస్త్రబద్ధముగా దేవుడు పురుషుడనీ, అలాగే శాస్త్రబద్ధముగా ప్రకృతి స్త్రీయనీ తెలియగలదు. ఎప్పుడయితే సంపూర్ణ జ్ఞానము తెలియునో, అప్పుడు దేవునిమీద సంపూర్ణ విశ్వాసము ఏర్పడును. సంపూర్ణ విశ్వాసము ఏర్పడినప్పుడు దేవుడు నిన్ను ఒప్పుకొనును. దేవుడు ఎప్పుడు నిన్ను ఒప్పుకొనునో, అప్పుడు మాయ నిన్ను తననుండి వదలి దేవున్ని చేరునట్లు చేయును. దేవునికి సమ్మతి కానంతవరకు మాయ ఎవరినీ వదలదు. మాయ వదలకపోతే మాయను దాటి ఎవడుగానీ దేవునివైపు పోలేడు.

పై వాక్యములో ఒక సందిగ్ధత యున్నది. దానిని బహుషా ఎవరూ గమనించియుండరు. ఒకవైపు భార్యయేలేనప్పుడు ఆయనకు సంతానము ఎలా కలుగుతుందని చెప్పుచూ, మరొకవైపు ప్రతి వస్తువునూ, భూమినీ ఆకాశమును, సమస్తమునూ సృష్ఠించినది ఆయనే అని చెప్పడము జరిగినది. అంటే ఆయనకు అందరూ పుట్టారని చెప్పుచూ, ఆయనకు భార్యలేనప్పుడు సంతానము ఎలా కలుగుతుందని చెప్పడమైనది. దీనినిబట్టి ఆయనకు సంతానమున్నదనా లేక లేదనా? సమస్తమూ సంతానముగా ఉన్నాయనేగా వాక్యములో చెప్పినది. భార్యయే లేనప్పుడు సంతానమెలా కలుగుతుందని అడుగడములో ఆయనకు భార్య ఉంటేనేగా భూమి, ఆకాశము సమస్తమూ పుట్టినదని ఆయన మనలను అడిగినట్లున్నది. ఈ వాక్యములో దేవుడు తనకు భార్యలేదని చెప్పలేదు. భార్య లేకపోతే సంతానము ఎలా కలుగుతుందని ప్రశ్నించి, భార్యలేదని అనుకోవడము మీ పొరపాటని చెప్పుచున్నాడు. అందువలన మేము ప్రకృతియే భార్యగా ఉందని చెప్పాము. ప్రకృతి భార్యగా ఉందను మాటను ధృవీకరించుచూ, భార్యలేకుండా సంతానము ఎలా కలుగుతుందని ఖుర్ఆన్ గ్రంథములో చెప్పడమైనది.

దేవుడు మనుషులలోని జ్ఞానమును పరీక్షించు నిమిత్తము మూడు సమాజములుగా మనుషులను చీల్చి ప్రతి సమాజమునకూ ఒక గ్రంథమును ఇచ్చాడు. చివరిలో సత్యసమేతమైన ఖుర్ఆన్ గ్రంథమును ఇచ్చాడు. ఈ ఖుర్ఆన్ గ్రంథము తనకన్నా ముందువచ్చిన బైబిలు, భగవద్గీత జ్ఞానమును ధృవీకరించుచున్నది. అందువలన కొన్ని పరస్పర విషయములనుగానీ, వ్యవహారములు గానీ, దేవుడిచ్చిన ఖుర్ఆన్ గ్రంథమునకు అనుగుణముగా పరిష్కరించుకో! ఇతరుల మనోవాంఛలకు అనుకూలముగా నిర్ణయమును చెప్పవద్దు. ఖుర్ఆన్‌లో చెప్పిన ప్రకారమే చెప్పు. మూడు సమాజముల మనుషులుగా దేవుడు మనుషులను విభజించినది, మనుషులను పరీక్షించుటకేగానీ ఇతరము ఏమీ లేదు. దేవుడు మనుషులనందరినీ ఒకే సమాజముగా పుట్టించువాడే. అయితే మూడు గుంపులుగా పుట్టించితే వారందరి భావములు బయటపడిపోవునని తెలిసి అలాగే పుట్టించాడు. హిందూసమాజములో దేవుడు పుట్టునని చెప్పుచున్నారు. అదే ఇస్లామ్ సమాజములో దేవుడు పుట్టడు అని చెప్పియున్నారు. ఇక్కడ ఒక్కొక్క సమాజమునకు ఒక్కొక్క భావమున్నది. అదే విధముగా హిందూ సమాజములో దేవునికి భార్య ఉన్నదని చెప్పుచుండగా, ఇస్లామ్ సమాజములో దేవునికి భార్యలేదు, పిల్లలు లేరని చెప్పుచున్నారు. ఈ విధముగా అనేక విషయములలో పరస్పర భేదములున్నవి. పరస్పర భేదముల వలన దేవుడు మనుషులను పరీక్షించి మనుషులలో ఎంతమటుకు జ్ఞానమున్నదో వారికే తెలియునట్లు చేశాడు.

ఏ మతములో ఏ విషయము పొడచూపినా అది దైవగ్రంథముల ద్వారానే పరిష్కారము చేయుట ఉత్తమమైన పని. భగవద్గీతలోయున్నదే ఖుర్ఆన్ గ్రంథములో ఉన్నది. ఖుర్ఆన్ గ్రంథములో క్రొత్తగా చెప్పబడిన

జ్ఞానమున్నట్లు భగవద్గీతలో కూడా ఉండును. ఖుర్‌ఆన్ గ్రంథము భగవద్గీతను ధృవీకరించుచున్నప్పుడు భగవద్గీత జ్ఞానము ఖుర్‌ఆన్‌లో ఉండును. అందువలన మనుషులు కొన్ని విషయములలో భేదాభిప్రాయములు కల్గియున్నా గ్రంథములు మాత్రము ఏకాభిప్రాయము కల్గియున్నవి. భగవద్గీతలో దేవునికి భార్య ఉందని సమస్త ప్రపంచమూ దానిలోని వస్తువులు, జంతువులు, మనుషులు అందరూ దేవుని చేత సృష్ఠింపబడినారని, సృష్ఠించబడినవన్నీ దేవుని సంతతేనని చెప్పియున్నారు. ఆ విషయమును ఖుర్‌ఆన్‌గ్రంథము సమర్థించునదిగా ఉన్నప్పుడు భగవద్గీతకు వ్యతిరేఖముగా చెప్పియుండదు కదా! భగవద్గీత ఖుర్‌ఆన్‌కు వ్యతిరేఖముగాలేదు. అదే విధముగా ఖుర్‌ఆన్ భగవద్గీతకు వ్యతిరేఖముగా లేదు. ఖుర్‌ఆన్ గ్రంథములో పైన చెప్పిన వాక్యములో భార్యయే లేనప్పుడు ఆయనకు సంతానమెలా కలుగుతుంది? అను ప్రశ్నను ప్రశ్నించినప్పుడు, భగవద్గీతలో దేవునికి భార్య ఉన్నదను మాటకు వ్యతిరేఖముగా ఖుర్‌ఆన్ వాక్యము కనిపించినా వాస్తవముగా అది వ్యతిరేఖముకాదు. భగవద్గీతలో చెప్పిన జ్ఞానమునే ఖుర్‌ఆన్ గ్రంథము సమర్థించుచూ దేవునికి భార్యలేకపోతే సంతానమైన సమస్తము ఎలా పుట్టినవని అడుగుచున్నట్లున్నది. ఈ విషయము బాగా అర్థమగుటకు ఖుర్‌ఆన్ గ్రంథములో కూడా సూరా 5, ఆయత్ 48లో ఈ విధముగా చెప్పుచున్నారు చూడండి. **(5-48) "ఓ ప్రవక్తా! మేము నీ వైపునకు ఈ గ్రంథమును సత్యసమేతముగా అవతరింపజేశాము. ఇది (ఖుర్‌ఆన్) తనకన్నా ముందు వచ్చిన గ్రంథాలను సత్యమని ధృవీకరించుచున్నది. మరియు వాటిని పరిరక్షించుచున్నది. కాబట్టి నీవు వారి పరస్పర వ్యవహారాలపై దేవునికి అనుసరించి వ్రాసిన ఈ గ్రంథమునకు అనుగుణముగానే తీర్పు చెయ్యి. నీవద్దకు వచ్చిన ఈ సత్యమును వీడి వారి**

**మనోవాంఛలను అనుసరింపకు. మీలో ప్రతి ఒక్కరికోసము మేము ఒక విధానాన్ని మార్గమును నిర్ధారించాము. అల్లాయే (దేవుడే) గనుక తలిస్తే మీ అందరినీ ఒకే సమాజముగా చేసియుండేవాడు. అయితే మీకు ఇచ్చిన దానిలో మిమ్మల్ని పరీక్షించాలన్నది ఆయన అభిలాష. కాబట్టి మీరు సత్కార్యములు చేయడములో త్వరపడండి. మీరంతా మరలిపోవలసింది దేవునివైపుకే. ఆ తర్వాత మీరు పరస్పరము విభేదించుకొనే విషయాల గురించి ఆయన మీకు తన తీర్పు తెలియజేయును."**

పైన మేము చెప్పిన విషయమునే ఈ వాక్యములో కూడా చెప్పి యున్నారు. ఇతర సమాజములలోని వ్యవహారములను కూడా తన జ్ఞానముతోనే పరిష్కారము చేసుకొమ్మని చెప్పాడు. ఏ సమాజములోనివాడు ఆ సమాజములోని జ్ఞానమును అనుసరించి వారి సమస్యలకు పరిష్కారమును తెలియవచ్చును. ఖుర్ఆన్ గ్రంథము మహోన్నతమైనది. ఇది మహోన్నత మైనదైతే ఈ గ్రంథము ధృవీకరించు గ్రంథములు కూడా మహోన్నతమైనవే యగును. పూర్వమున్న ఇద్దరు ప్రవక్తల ద్వారా తౌరాత్, ఇంజీలు అను రెండు గ్రంథములు వచ్చాయి. ఆ తర్వాత ఖుర్ఆన్ గ్రంథము వచ్చినది. ఈ గ్రంథమును చెప్పినది జిబ్రయేల్ అను గ్రహము. ఈ గ్రంథముతో సహా మూడు దైవగ్రంథములగుచున్నవి. ప్రథమ దైవగ్రంథము, ద్వితీయ దైవ గ్రంథము, అంతిమ దైవగ్రంథము అనునవే మూడు దైవ గ్రంథములు. మూసా ప్రవక్త ద్వారా వచ్చినది తౌరాతు గ్రంథము. అలాగే ఈసా ప్రవక్త ద్వారా వచ్చినది ఇంజీలు గ్రంథము. చివరిలో జిబ్రయేల్ ద్వారా వచ్చినది ఖుర్ఆన్ గ్రంథము. ఈసా అంటే ఏసు అని తెలియవలెను. ఏసును గ్రంథములో ఈసా అని వ్రాశారు. ఇంజీలు అనగా బైబిలు అని అర్థము.

ఖుర్‌ఆన్‌కంటే ఆరువందల (600) సంవత్సరముల ముందు బైబిలు గ్రంథము పుట్టినది. మూసా అనగా అప్పటికాలములో మోసే అనెడివారు. మూసా ప్రవక్త ద్వారా తౌరాతు గ్రంథము వచ్చినది. అది బైబిలుగ్రంథము కంటే మూడువేల (3000) సంవత్సరముల ముందు తౌరాతు గ్రంథము పుట్టినది. ఖుర్‌ఆన్‌కంటే 3600 సంవత్సరముల ముందు తౌరాత్ గ్రంథము వచ్చినది. మూసాను మోసే అనినా రెండక్షరముల పేరు మరొకటి ఆయనకు ఉండేది. మూసా చరిత్ర ఖచ్చితముగా ఎవరికీ తెలియదు. మూసా ద్వారా వచ్చిన తౌరాత్ గ్రంథము ఏ భాషలో వ్రాసినదీ తెలియదు. మూసాయే మోసే అని కొందరు అంటున్నారు. మూసానే మోసే అను విషయము కూడా ఖచ్చితముగా తెలియదు. అసలు మూసా ఎవరో కూడా తెలియదు. ఈసా అంటే ఏసుయనీ, ఇంజీలు అంటే బైబిలు అనీ అందరికీ తెలుసు, అది వాస్తవమే. అయితే మూసా ఎవరో తెలియదు. తౌరాత్ ఏదో తెలియదు.

మన లెక్కలో తౌరాత్ అంటే భగవద్గీతయనీ, బైబిలుకంటే ముందు వచ్చినదనీ చెప్పుచున్నాము. ఖుర్‌ఆన్‌కంటే ముందువచ్చిన రెండు దైవ గ్రంథములు భగవద్గీత, బైబిలు అని తెలిసిపోయినది. రెండూ దైవగ్రంథములు కాగా చివరిలో వచ్చిన ఖుర్‌ఆన్ కూడా దైవగ్రంథమే అయినది. అయితే మూడు దైవ గ్రంథముల విషయములు ఏ మానవునికీ దేవుడు తెలుపలేదు. ఈ మూడు గ్రంథములను చెప్పినవారు మానవులు కాదని తెలిసిపోయినది. మూసా, ఈసా ఇద్దరూ మానవమాత్రులు కాదని తెలిసినది. ఈసా (ఏసు) రెండువేల (2000) సంవత్సరముల క్రిందటివాడే అయినందున ఆయన చరిత్ర అందరికీ తెలుసు. అయితే మూసా చరిత్ర ఖచ్చితముగా ఎవరికీ తెలియదు. తౌరాత్ గ్రంథమును భగవద్గీతయని గుర్తించగలిగాము. ఖుర్‌ఆన్ ఆధారముతోనే తౌరాత్‌ను గుర్తించాము. ఖుర్‌ఆన్ సమర్థించు,

ధృవీకరించు గ్రంథములలో మొదటిది తౌరాతు గ్రంథమయినందున సులభముగా అది భగవద్గీతయని తెలిసిపోయినది. అలాగే భగవద్గీతను చెప్పినది కృష్ణుడని కూడా తెలిసినది. మొదట పుట్టిన తౌరాత్ గ్రంథము యొక్క జ్ఞానమునే బైబిలుయనీ, ఖుర్‌ఆన్ అనీ చెప్పడము జరుగుచున్నది. భగవద్గీత జ్ఞానమునే విడదీసి కొంత బైబిలుయనీ, కొంత ఖురాన్ అనీ చెప్పడము జరిగినది. ఈ విషయమును ఖుర్‌ఆన్ గ్రంథములో సూరా 6, ఆయత్ 91 లో ఇలా కలదు చూడండి. **(6-91) "అల్లాహ్ (దేవుడు) ఏ మానవమాత్రునిపైనా ఎలాంటి విషయాన్నీ అవతరింపజేయలేదు అని చెప్పగా, ఈ అవిశ్వాస జనులు దేవున్ని అర్థము చేసుకోవలసిన విధముగా అర్థము చేసుకోలేదు. వారిని అడుగు మరి మూసా తెచ్చిన ఆ గ్రంథాన్ని ఎవరు అవతరింప చేసినట్లు? ఆ గ్రంథము ఒక జ్యోతి! మానవుల కొరకు మార్గదర్శకత్వము! మీరు దానిని వేరువేరు కాగితములుగా విభజించి చూపుచున్నారు. ఎన్నో విషయాలను దాచేస్తున్నారు. మీకుగానీ, మీ పెద్దలకుగానీ తెలియని ఎన్నో విషయములు ఇందు మూలముగా మీకు నేర్పబడ్డాయి. దాన్ని అవతరింపజేసినవాడు అల్లాహ్‌యే (దేవుడే) అని చెప్పు. ఆ తర్వాత వాళ్ళను వారి వ్యర్థవిషయాలలోనే ఆడుకోనివ్వు"** ఈ వాక్యములో మనుషులకు తెలియని చాలా విషయములు తెలియుచున్నవి. దైవజ్ఞానమును అందించిన శ్రీకృష్ణుడు, ఏసు ఇద్దరూ సాధారణ మానవులు కాదని తెలియుచున్నది. భగవద్గీత గ్రంథములో జ్ఞానజ్యోతి ఉందని తెలియు చున్నది.

దేవుడు తెల్పిన జ్ఞానమును గ్రహించుకొను స్థోమత మనిషికి లేకుండా పోయినది. దేవుడు, భక్తి అను అన్ని విషయములు ఈ వయస్సులో

వద్దు, ముసలివాళ్ళు అయినప్పుడు చూస్తాము అనువారు కలరు. అదే ప్రపంచ విషయములలో అయితే ఎక్కువ ఆసక్తిని చూపుచుందురు. ప్రపంచ సంబంధ దేవతల భక్తిలోనూ, గ్రామదేవతల భక్తిలోనూ పూర్తి శ్రద్ధకలిగి వాటిలో పాల్గొనడము కూడా ఉండును. వారమునకు ఏడుదినములు ఉన్నాయి. ఆ ఏడు దినములు ఏడు ప్రత్యేకతలు కలిగియున్నాయి. ఆది, సోమ, మంగళ మూడు దినములు దైవత్వమునకు సంబంధించినవిగా ఉన్నాయి. ఆ మూడు రోజులు పూర్తి నియమములను పాటించితే, ప్రార్థన చేయగలిగితే మంచి ఫలితము లభించును. ఆదివారము సృష్ఠికి ముఖ్యమైనది. ఆదివారము రోజు సృష్ఠి ప్రారంభమైన దినము. ఆ దినము సృష్ఠికర్తయిన దేవున్ని స్మరించుకోవలెను. సోమవారము జ్ఞాన చిహ్నమైన రోజు ఆ దినము దేవుని జ్ఞానమును తెలియవలెను లేక చదువవలెను. మంగళవారము మోక్షమునకు సంబంధించిన దినము. ఆ దినము మోక్షమును గురించి చింతించవలెను. బుధవారము రోజు మంత్రముల దినము. గురువారము గురువును గురించి చెప్పుకోవడము, గురువు చెప్పిన జ్ఞానమును తెలుసుకోవడము. శుక్రవారము దానమునకు సంబంధించిన దినము. ఆ రోజు ఇతరులకు ధనమును, జ్ఞానధనమును రెండు రకముల దానము చేయవచ్చును. శనివారము చివరిరోజు. చెడు పనులు ఆ రోజు చేసుకోవచ్చును. ఆదివారము సృష్ఠి అయిన దేవుని దినము ఆ రోజు శు చి శుభ్రముగా ఉండవలెను. శనివారము భ్రష్టుపట్టిన దినమని ఆ రోజు మాంసభక్షణా దినమని అనుకొనెడివారు.

భారతదేశములో ఆదివారము పవిత్ర దినమని, శనివారము అపవిత్ర దినమని అందువలన శనివారము మాంసము తినవచ్చునని, జూదము ఆడవచ్చుననీ, ఇంకా ఏమయినా చేయవచ్చుననీ చెప్పుకొనెడివారు.

ఆదివారమును పవిత్ర దినముగా చూచుకొనెడివారు. ఆదివారము ఇల్లు కడిగి స్నానముచేసి శుచి శుభ్రతగా దైవభక్తి కలిగి, సృష్ఠికర్తయిన దేవున్ని ఆరాధించెడివారు. అయితే కాలక్రమమున శనివారము పవిత్రదినముగా మారిపోయి, ఆదివారమే అపవిత్రదినముగా మిగిలిపోయినది. ప్రస్తుత కాలములో భారతదేశమందు శనివారము ఇల్లు అలికి శుచి శుభ్రతగా భక్తికల్గి ఏదో ఒక దేవున్ని ఆరాధించడము అలవాటైపోయినది. ఆదివారము పవిత్రత లేకుండాపోయి అపవిత్రముగా మారిపోయి చివరకు మాంస భక్షణా దినముగా మారిపోయినది. చేయరాని పనులన్నిటినీ ఆదివారమే చేస్తున్నారు. నేడు ముస్లీమ్‌లకు శుక్రవారము పవిత్ర దినముగా ఉన్నది. పూర్వము శనివారముకంటే ముందురోజు శుక్రవారము ముస్లీమ్‌లకు పవిత్రముగా ఉండగా, శనివారము తర్వాత ఆదివారము హిందువులకు పవిత్రదినముగా ఉండేది. అయితే నేడు శుక్ర, శనివారములు రెండూ పవిత్ర దినములుగా మారిపోయి ఆదివారము అందరికీ అపవిత్ర దినముగా ఉన్నది. ఈ విషయమై ఖుర్ఆన్ గ్రంథములో సూరా 16, ఆయత్ 124లో ఈ విధముగా వ్రాశారు చూడండి. **(16-124) "ఎవరు శనివార విషయములో విభేదించుకొన్నారో వారికి మాత్రమే దాని విశిష్ఠత విధించబడినది. అసలు విషయమేమిటంటే నీ ప్రభువు (దేవుడు) స్వయానా ప్రళయ దినమున వారి విభేదములపై వారి మధ్య తీర్పు చేస్తాడు."** ఈ వాక్యములో ఎవరయితే శనివార విషయములో విభేదించుకొన్నారో వారికి మాత్రమే దాని విశిష్ఠత తెలియబడుతుందని చెప్పారు. అయితే అక్కడ చెప్పిన ప్రకారము ప్రళయ దినమున తీర్పు అని ఉందికదా! ఆదివారము సృష్ఠిదినమైతే, శనివారము ప్రళయదినమవుతుందని, నాశనదినమవుతుందని సూచనగా చెప్పాడు దీనినిబట్టి శనివారమును పవిత్ర

దినముగా కాకుండా అపవిత్రదినముగా చూచుటే సరియైన పద్ధతని దీనిభావము.

పైన శనివారము, ఆదివారము, శుక్రవారము అని చెప్పి శనివారము కంటే ప్రక్కనయున్న శుక్రవారము ముస్లీమ్‌లకు, అలాగే ఆదివారము హిందువులకు ముఖ్యమైన దినములని చెప్పాము. అంతేకాక ఇరువురికీ శనివారము నాశన దినమే (ప్రళయ దినమే) అని కూడా చెప్పాము. అయినా పూర్తి అర్థమయి వుండదనుకుంటాను. కొన్ని విషయములు అలాగే అర్థము కావు. అందువలన ఖుర్‌ఆన్ గ్రంథములో ఇదే విషయమును చెప్పుచూ సూరా 17, ఆయత్ 45లో ఈ విధముగా చెప్పారు. **(17-45) "ఓ ప్రవక్తా! నీవు ఖుర్‌ఆన్‌ను పఠిస్తున్నప్పుడు మేము నీకూ పరలోకాన్ని నమ్మని వానికీ మధ్య కనిపించని ఒక తెర వేస్తాము."** ఈ వాక్యములో ఏదయినా విశ్వసించినప్పుడే అర్థమవుతుంది, విశ్వసించనప్పుడు అర్థముకాదని, అర్థము కాకుండా నేనే చేస్తానని దేవుడు చెప్పాడు. అందువలన ఒక విషయము అర్థముకావాలంటే అతనిలోని విశ్వాసమే ముఖ్యమని తెలియుచున్నది. విశ్వాసములేని వానికి విషయములను చెప్పేవాడు ఎంత చెప్పినా వినేవానికి ఏమీ ఎక్కకుండా వారి మధ్యలో దేవుడే తెర దింపియుండును. అందువలన చెప్పేవాడు ఎంతశ్రమపడి చెప్పినా, వినేవాడు ఎంతసేపు వినినా అంతా బూడిదలో పోసిన పన్నీరులాగా అయిపోవును. అందువలన ఎక్కడయినా, ఎవరికయినా జ్ఞానము చెప్పకముందు వాడు విశ్వాసియో, అవిశ్వాసియో ఎవరో ముందే చూసుకో! ఒకవేళ విశ్వాసి అయితే చెప్పు. చెప్పిన దానికి ఫలితము దొరకుతుంది. అవిశ్వాసి అయితే నీవు చెప్పే దానికంటే వానితో చెప్పించుకోవడమే మంచిది.

ఎందుకనగా! స్వర్గమును గురించి చెప్పితే ఎవరయినా అట్లే నమ్మేస్తారుగానీ, పరలోకమును (మోక్షమును) గురించి చెప్పితే సామాన్యముగా ఎవరూ నమ్మేవారుండరు. భక్తిమార్గమున పోతే స్వర్గము వస్తుందని వారే చెప్పేస్థితిలో ఉంటారు. అటువంటప్పుడు నీవు మోక్షము అంటే అతడు స్వర్గము అంటాడు. నీవు పరలోకము అంటే వాడు స్వర్గలోకము అంటాడు. అందువలన మోక్షమును గురించి ప్రవక్త చెప్పినా వినరని, నీవు ఖుర్‌ఆన్‌ను చదువుచున్నప్పుడు నీకూ అవిశ్వాసులకూ మధ్యలో కనిపించని తెరవేస్తాము అని అన్నారు. కనిపించని తెర అనగా ఎవరికీ తెలియని మాయపొర అని అర్థము. ఆ పొర వీరికి మధ్యలో ఉండదుగానీ, వినేవారి తలలో వినే భావమునకు అడ్డముగా మాయతెర వేయబడును. మాయతెర అనగా గుణముల ఆలోచనలని అర్థము. ప్రవక్త పరలోకమును గురించి చెప్పుచూయుంటే, వినేవాడు అవిశ్వాసి అయితే వానికి లోపలే గుణములు అడ్డుపడును. ఒక్కప్రక్క తానే తెలిసినవాడినను గర్వము (ఐదవ గుణము) పొడచూపగా, తనకంటే బాగా చెప్పువాడాయను అసూయ గుణము (ఆరవ గుణము) పొడచూపి జీవున్ని గుణచక్రములో తికమక చేసి వినిన విషయము ఏమీ అర్థముకాకుండా చేయును. అప్పుడు చెప్పినవానికి వృథాప్రయాస. విన్నవానికి గుణముల ప్రయాస తప్పదు. అందువలన చెప్పేవాడు వినేవాడు ఎటువంటివాడో కొంత గమనించి, వాడు విననిస్థితిలో ఉంటే ఆ విషయము కొద్దిగా అర్థమవుతూనే వానిని వదలిపెట్టడము మంచిది. అట్లు కుదరకపోతే వానితోనే చెప్పించుకోవడము మంచిది. మేము వినేవారికి చెప్పుతాము. చెప్పేవారితో వింటాము. మాకు చెప్పేదానికంటే వినేదే ఎక్కువ ఉండునేమో!

ఖుర్‌ఆన్ గ్రంథమును ఎవరు ఎట్లు అర్థము చేసుకొనినా అది ఇటు జన్మలను అటు మోక్షమును తెలుపుటకే వచ్చినదని చెప్పవచ్చును.

చెప్పేవాడు సక్రమముగా చెప్పకపోతేనో, వినేవాడు సక్రమముగా వినకపోతేనో ఖుర్‌ఆన్ గ్రంథము అర్థముకావడములో తేడావచ్చును. ఈ గ్రంథములో జ్ఞానము తెలియకపోతే జన్మము, తెలిస్తే మోక్షముకల్గునని చెప్పుచున్నది. ఇదే విషయమునే ఖుర్‌ఆన్ గ్రంథములో సూరా 18, ఆయత్ 2,3లలో ఇలా చెప్పారు. **(18-2) "ఈ గ్రంథమును సరైనదిగా తయారు చేసియుంచాము. తనవద్దనుండి విధింపబడే కఠినమైన శిక్ష గురించి హెచ్చరించటానికి, మంచి పనులు చేసే విశ్వాసులకు ఉత్తమ ప్రతిఫలము ఉందని శుభవార్తలు ఇవ్వడానికి, (18-3) "అందులో శాశ్వతముగా ఉందురని తెలుపటానికి"** అని చెప్పారు. ఖుర్‌ఆన్ గ్రంథము రెండే రెండు సూచనలను ఇచ్చినది. ఒకటి జన్మలుంటే చేసుకొన్న కర్మలకు శిక్షలు తప్పవని చెప్పటానికీ, రెండవది విశ్వాసులయినవారికి ఉత్తమ ప్రతిఫలితము మోక్షముంటుందనీ, అది శాశ్వతముగా ఉంటుందనీ చెప్పటానికి ఖుర్‌ఆన్ గ్రంథము వచ్చినది.

దేవుడు జన్మలను, మోక్షమును తెలియజేయు గ్రంథమును ఇవ్వగా, మనుషులు దానిని ఏమాత్రము తెలుసుకోలేక పోవడమేకాక, అసలయిన దేవున్ని వదలి, బూటకపు దేవుళ్ళయిన దేవతలను, గ్రామదేవతలను ఆశ్రయించారు. వారినే నమ్ముకొని కష్టపడి ఖర్చు చేయుచూ వారిని ఆరాధించుచున్నారు. అటువంటి చిల్లర దేవుళ్ళను విశ్వసిస్తే ఏమాత్రమూ సుఖముండదు. వారి వలన మోక్షము రాదు. ఈ విషయమునే ఖుర్‌ఆన్ గ్రంథమందు తెలియజేయుచూ సూరా 25, ఆయత్ 3లో ఇలా వ్రాసి యున్నారు. **(25-3) "వారు అల్లాహ్‌ను వదలి బూటకపు దేవుళ్ళను కల్పించుకొన్నారు. వారు అంటే ఆ బూటకపు దేవుళ్ళు ఏ వస్తువునూ సృష్టించలేరు, పైగా వారు కూడా సృష్టించబడినవారే. వారు తమ**

**స్వయానికి తగినట్లు లాభనష్టాలు చేకూర్చుకొను అధికారము లేనివారై ఉన్నారు. జీవన్మరణములు కూడా వారి చేతిలో లేవు. మరణా నంతరము తిరిగి లేచే శక్తి కూడా వారివద్ద లేదు."** ఇదే విషయమునే ఇదే ఖుర్‌ఆన్ గ్రంథములో మరియొకచోట సూరా 27, ఆయత్ 64లో ఇలా చెప్పారు. **(27-64) "తొలిసారి సృష్టించిందెవరు చెప్పండి?. మళ్ళీ రెండవసారి పుట్టించగల వారెవరు? భూమి, ఆకాశముల నుండి మీకు ఉపాధిని సమకూర్చేవాడెవడు? ఏమిటి! అల్లాహ్‌తో పాటు ఇంకొక ఆరాధ్య దేవుడు కూడా ఉన్నాడా? మీరు సత్యవంతులే అయితే ఆమేరకు మీ ప్రమాణము ఏదయినా తీసుకరండని చెప్పు."** ఇదే విషయమును మరొకచోట సూరా 30, ఆయత్ 40లో ఈ విధముగా చెప్పారు చూడండి. **(30-40) "దేవుడే మిమ్ములను సృష్టించాడు. మీకు ఉపాధి కల్పించువాడు ఆయనే. ఆయనే మిమ్ములను చంపువాడు. ఆ తర్వాత మిమ్ములను బ్రతికిస్తాడు. చెప్పండి! ఈ పనులలో దేన్నయినా చేయువాడు మీరు కల్పించిన భాగస్వాములలో ఎవరయినా ఉన్నారా? వారు కల్పించే దేవతలనుండి దేవుడు ఎంతో పవిత్రుడు ఉన్నతుడు."** ఇదే విషయమును మరొకచోట సూరా 31, ఆయత్ 13లో ఈ విధముగా చెప్పుచున్నారు. **(31-13) "లుఖ్మాన్ తన కుమారుడికి హితబోధ చేయుచూ ఇలా అన్నాడు. "ఓ నా ముద్దుల పుత్రుడా! దేవునికి భాగస్వాములను కల్పించకు. దేవునికి భాగస్వాములను కల్పించటము నిస్సందేహాముగా ఘోరమైన అన్యాయమగును."**

ఇక్కడ చెప్పిన నాలుగు వాక్యములలోనూ దేవున్ని ఒక్కనినే ఆరాధించక దేవుని స్థానములో దేవతలను, గ్రామదేవతలను చేర్చి వారిని ఆరాధించడము వలన దేవున్ని వారి స్థాయికి తగ్గించినట్లగుచున్నది. దేవుని

స్థానము చాలాగొప్పది. అటువంటి వానితో సమానముగా మిగతా దేవతలను ఉంచడము చాలా అన్యాయమగునని ఈ వాక్యములో చెప్పారు. మీరు ఎవరినయితే ఆరాధించుచున్నారో వారు కూడా దేవునిచేత సృష్ఠించ బడినవారే. దేవునికి పుట్టినవారిని దేవునితో సమానముగా చూడడము తప్పేయగును. మొదట అందరిలో జ్ఞానమే ఉండేది అందరూ దేవున్నే విశ్వసించేవారు. అయితే జనన మరణములు జరుగగా క్రొత్త శరీరములలో చేరు దేవుళ్ళు తమ పూర్వపు జ్ఞానము జ్ఞాపకము వచ్చులోపల క్రొత్తగా నేర్చిన అలవాట్ల వలన జన్మజన్మకూ క్రమేపీ జ్ఞానము తగ్గుచూ పోయి అజ్ఞానము పెరుగుతూ వచ్చినది. ఈ విధముగా మార్పుచెందుచూ పోయి చివరకు జ్ఞానము స్థానములో అజ్ఞానము చేరిపోయినది. ఏకేశ్వరోపాసన జాగాలో బహుదేవతారాధన వచ్చినది. ఇప్పటికీ కొందరికి బహుదైవారాధన బాగా కనిపించినా వెనకకు పోయిచూస్తే ఇప్పుడు చేయునది తప్పుగా కనిపించును. అందువలన బహుదైవారాధన చేయడము చాలా అన్యాయము అని ఈ గ్రంథములో చెప్పడమైనది.

ఏమీ తెలియనివారు బహుదైవారాధనకు అలవాటు పడిపోయారు. వారికి ముందుజన్మలలోని జ్ఞానము తెలియకుండా పోయినది. అటువంటి వారికి వారుచేయుచున్నది అజ్ఞానము పనియని తెలిపి సక్రమమైన మార్గములో నడుపుటకు వారిని దారి మళ్ళించి ఏకేశ్వరోపాసన చేయించుటకు దేవుడు తన ప్రయత్నములో మొదట ఒక ప్రవక్తను పంపి జ్ఞానమును చెప్పించాడు. అది కొంతవరకే పరిమితమైపోయిన దానివలన రెండవ ప్రవక్తను కూడా పంపాడు. ఆయన వచ్చి జ్ఞానము చెప్పినా అదికూడా కొంతవరకే పరిమితమై పోయినది. విశాలముగా అందరికీ తెలియుటకు మూడవ ప్రవక్తను కూడ పంపాడు. అలా పంపినా అది

కూడా వెంటనే పూర్తి ప్రపంచమంతా వ్యాపించలేకపోయినది. కొన్నివందల, వేల సంవత్సరములు గడువగా, ఆ ముగ్గురు ప్రవక్తలు చెప్పిన జ్ఞానము విశ్వవ్యాప్తముగా వ్యాపించినా, ముగ్గురూ చెప్పిన దానిని ప్రజలు అర్థము చేసుకోలేక తప్పుగా అర్థము చేసుకోవడము వలన, ప్రజలలో పూర్తి జ్ఞానము వ్యాపించక జ్ఞానము ఇంకా సందిగ్ధములోనేయున్నది. వచ్చిన ప్రవక్తలను మీరు కూడా మనుషులే కదా! మీరు చెప్పినది మేమేందుకు వినాలి? అని కొందరు ప్రశ్నించి చెప్పిన జ్ఞానమును వినకుండా పోవుచున్నారు. ముగ్గురు ప్రవక్తలు చెప్పినా వినని స్థితి కొందరిలో ఉండగా, వినిన వారిలో అర్థముకాని స్థితి కొందరిలో యున్నది. ఈ విధముగా భూమిమీద దేవుని జ్ఞానము ఆటంకముగా సాగుచున్నది. ఇదే విషయమునే ప్రస్తావిస్తూ ఖుర్ఆన్ గ్రంథములో సూరా 36, ఆయత్ 14,15లలో ఈ విధముగా చెప్పారు. **(36-14) "మేము వారివద్దకు ఇద్దరిని (ఇద్దరు ప్రవక్తలను) పంపగా మొదట ఆ ఇద్దరినీ వారు ధిక్కరించారు. తర్వాత ఆ ఇద్దరికీ అండగా మూడవ వానిని కూడా పంపాము. అప్పుడు ఆ ప్రజలతో మేము మీవద్దకు ప్రవక్తలుగా పంపబడ్డాము అని ముగ్గురు చెప్పారు." (36-15) దానికి వారు "మీరు కూడా మాలాంటి మానవమాత్రులే కదా! కరుణామయుడయిన దేవుడు అసలు దేనినీ అవతరింపజేయలేదు. మిమ్ములను ప్రవక్తలుగా పంపలేదు. మీరు చెప్పేదంతా పచ్చి అబద్ధము"** అని సమాధానమిచ్చారు. ఈ విధముగా దేవుడు తన నుండి ముగ్గురు ప్రవక్తలను పంపినా! మూడు గ్రంథములను ఇచ్చినా!! ముగ్గురినీ కొందరు నమ్మడము లేదు. మూడు గ్రంథములను కాదను నాస్తికులు గలరు. అంతేకాక కొందరు ఒక ప్రవక్తను నమ్మి ఇద్దరు ప్రవక్తలను నమ్మని వారున్నారు. అలాగే ఒక గ్రంథమును నమ్మి మిగతా రెండు గ్రంథములనూ

అసూయతో చూచువారున్నారు. కొందరు ముగ్గురినీ మనుషులే అని చెప్పుచూ, మూడు గ్రంథములనూ కల్పన గ్రంథములనువారు కూడా కలరు. ఈ విధముగా ప్రపంచములోని ప్రజలు చిత్రవిచిత్రముగాయున్నారు. అయితే దేవుడు పంపిన ముగ్గురు ప్రవక్తలను కలిపి ఒక వ్యక్తిగా చేసి పంపితేగానీ, ప్రజలు వింటారను నమ్మకము లేదు. అదే విధముగా మూడు గ్రంథములను కలిపి ఒకే గ్రంథముగా పంపితే ఒకవేళ వినగలరేమో! అని అను కొంటున్నాము. మన ఆశ, మన ఉద్దేశ్యము ఎలా ఉన్నా దేవుడు ఎలా నిర్ణయించునో అలాగే జరిగి తీరుతుంది. దేవునికి తెలియకుండా ఏమీ జరుగదు. ప్రజలు కొందరు దేవున్ని నమ్మినా నమ్మనట్లు, కొందరు నమ్మకున్నా నమ్మినట్లు పైకి కనిపిస్తున్నారు. కొందరు దేవుని జ్ఞానమును చెప్పడములో బాగా చెప్పి గొప్ప జ్ఞానులనిపించుకొనినా, అందరూ అతనిని జ్ఞానియని పొగడినా చివరికతను అజ్ఞానిగా మిగిలి పోవుచున్నాడు. తాను చెప్పినది వినేవారి కొసమే నా కోసముకాదని అంటున్నాడు. తనబుద్ధితో తాను సంపాదించుకోవాలని ప్రయత్నము చేయుచున్నాడు. వాస్తవముగా కర్మనుబట్టి లాభము నష్టము వస్తుందని చెప్పిన అతనే అది వినేవారికేనని తనకు ఆ మాట మీద నమ్మకము లేదని తన బుద్ధితో తను సంపాదించుకోవాలని ప్రయత్నించుచున్నాడు. అలాంటివారు చెప్పేది ఒకటి చేసేది మరొకటి అయినందున వారివద్ద దేవుడు కూడా మోసపోవునేమో! అని అనిపించుచున్నది. కర్మప్రకారమే అన్నీ జరుగును అనీ, ఆత్మే అన్ని విధములా అందరినీ నడిపించుచున్నదనీ చెప్పి, లోపల నేనే నా తెలివి ప్రకారము నడుస్తున్నాననీ, నా తెలివి ప్రకారమే డబ్బును సంపాదించు చున్నాను. నా తెలివిని బట్టే మర్యాద ఉంది అని అనుకొనుచున్నారు. అందరినీ కర్మప్రకారము ఆత్మేనడుపుచున్నదని చెప్పి తన బుద్ధిప్రకారము

తాను నడుచుచున్నానని లోపల అనుకోవడము బయటివారికి ఏమాత్రము తెలియదు కదా! అప్పుడు వినేవారందరినీ మోసము చేసినట్లే కదా! అందరూ అతనిని జ్ఞాని అనుకొనుట వాస్తవమే అయినా అతనున్నది అజ్ఞానములోనే కదా! అటువంటప్పుడు దేవుడయినా ఇటువంటి వారి విషయములో పొరపడును కదా!యని కొందరనుకోవచ్చును. దానిని గురించి మేము ఏమి చెప్పుచున్నామంటే!

దేవుడు ఎక్కడో ఏడవ ఆకాశములో లేడు. దేవుడు అందరి హృదయములలో నివాసమున్నాడు. ప్రతి సజీవ శరీరములో జీవాత్మ, ఆత్మలున్నచోట ఆత్మ ఏమి చేయుచున్నదనీ, జీవాత్మ ఏమి అనుభవిస్తున్నాడనీ సాక్షిగా చూస్తూయున్నాడు. ఆ విధముగా ప్రతి శరీరములోనూ అణువణువునా వ్యాపించియున్న పరమాత్మ వాని మెదడులో (హృదిలో) ఏమి జరుగుచున్నదని చూడగల్గుచున్నాడు. అందరినీ సాక్షిగా ప్రతి క్షణము గమనించు పరమాత్మకు తెలియనిదంటూ ఏమీలేదు. దేవునివద్ద రహస్యమనునది లేదు. ఆయనకు తెలియనిది ఉంటేకదా! దానిని రహస్యమనేది. ఆయనకు అన్నీ తెలిసినప్పుడు రహస్యము అను ప్రశ్నే లేదు. ఈ విషయమును ఖుర్ఆన్ గ్రంథములో చెప్పుచూ సూరా 20, ఆయత్ 6,7లలో ఈ విధముగా చెప్పారు చూడండి. **(20-6) "ఆకాశములో, భూమిలో, ఆ రెండిటి మధ్యనా ఇంకా నేల అడుగు భాగమున ఉన్న ప్రతీదీ ఆయనదే." (20-7) " నువ్వు మాటను బిగ్గరగా పలికినా మెల్లగా పలికినా అతిగోప్యముగా విన్నవించుకొన్నా ప్రతీదీ ఆయనకు తెలుసు."** ఇదే భావమున్న విషయమునే మరియొక చోట సూరా 67, ఆయత్ 13,14లలో ఈ విధముగా చెప్పారు చూడండి. **(67-13) "మీరు మీ మాటలను రహస్యముగా మెల్లగా పలికినా,**

**బిగ్గరగా పలికినా దేవునికి తెలియకుండా ఉండవు. నిశ్చయముగా ఆయన మీ గుండెలలోని గుట్టును ఎరిగినవాడు."** **(67-14) "ఏమిటి? మిమ్మిలను పుట్టించిన ఆయనే మీ గుట్టును ఎరుగకుండా ఉంటాడా? ఆయన సూక్ష్మగ్రాహి, సర్వాన్నీ కనిపెట్టుకొని యున్నవాడు."** దేవుడు మనిషిలోనే కాకుండా మనిషి బయటకూడా విశ్వమంతా వ్యాపించి యున్నాడు. ఆయన లేని చోటు ఏదీ లేదు. ఆయన ప్రపంచవ్యాప్తముగా అణువణువునా వ్యాపించియున్నాడు. అందువలన మానవులలో ఎవడు ఎటువంటివాడో ఆయనకు బాగా తెలుసు. అలాగే దేవదూతలనబడు ఆయన పాలకులలో అందరినీ ఆయన తెలిసినవాడే ఆయన అందరిలో ఉండగా, ఆయనకు తెలియని మనుషులుగానీ, ఆయనకు తెలియని దేవదూతలుగానీ ఎవరూ లేరు. అందరూ ఆయనకు తెలుసు.

భూమిమీద తన జ్ఞానము తెలియుటకు తన జ్ఞానమును చెప్పు ప్రవక్తలను దేవుడు ముందే ఎన్నుకొనును. తన ప్రవక్తలను మనుషుల నుండి కొందరినీ, దేవదూతలనుండి కొందరినీ నిర్ణయించుకొనును. ప్రవక్త అనగా జ్ఞానమును బోధించువాడు అని అర్థము. దేవుడే దిగివచ్చి బోధించినా అతనిని కూడా ప్రవక్త అనియే చెప్పవచ్చును. ముఖ్యమైన జ్ఞానమును చెప్పువారందరూ ప్రవక్తలే. ఖుర్‌ఆన్ గ్రంథమును భూమిమీద ప్రజలకు తెలియజేయుటకు దేవదూతలలో జిబ్రయేల్, మనుషులలో ముహమ్మద్ ప్రవక్తలుగా పనికి వచ్చారు. సూత్రము ప్రకారము ఇద్దరినీ ప్రవక్తలనియే చెప్పాలి. దైవగ్రంథము బయటికి రావాలంటే దానికి ఉపయోగపడిన వారందరూ ప్రవక్తలేయగుదురు. మనము ఖుర్‌ఆన్ గ్రంథమునే చూచినట్లయితే జిబ్రయేల్ చెప్పకపోతే ఖుర్‌ఆన్ గ్రంథము బయటికి వచ్చేదేకాదు. అలాగే ముహమ్మద్ ప్రవక్తగారికి చెప్పిన జ్ఞానమును వినిన

ఆయన తిరిగి తన అనుచరులకు బోధించెడివాడు. అప్పుడు ముహమ్మద్ కూడా ప్రవక్త అయినాడు. ఖుర్ఆన్ జ్ఞానము బయటికి వచ్చుటకు ముఖ్యముగా ఇద్దరు ప్రవక్తలు ఉపయోగపడినారు. ఒకరు మనిషికాగా, మరొకరు కనిపించని గ్రహము. జిబ్రయేల్ దేవుని పాలనలోనివాడు అయినందున అతనిని దేవుని సేవకుడు అని అనవచ్చును.

ఖుర్ఆన్‌కంటే ముందు వచ్చిన బైబిలును చెప్పినది ఏసు. ఏసు సామాన్య మానవుడు కాదు. ఏసును దేవుడు పంపగా, దేవుని సమాచారమును తీసుకొని వచ్చిన దేవుని దూతయని చెప్పవచ్చును. బైబిలును చెప్పుటకు ముందే దేవుడు ఏసును ఎన్నుకొన్నాడు. అలాగే ఖుర్ఆన్‌ను చెప్పుటకు సేవకులలో జిబ్రయేల్‌ను, మనుషులలో ముహమ్మద్‌ను ఎన్నుకొన్నాడు. ఈ విధముగా తన జ్ఞానమును పంచుటకు ఎవరు పనికి వస్తారో వారినే దేవుడు నిర్ణయించుకొనును. ఆ విషయమును ఖుర్ఆన్ గ్రంథములో ప్రస్తావించుచూ సూరా 22, ఆయత్ 75లో ఈ విధముగా చెప్పారు చూడండి. **(22-75) "అల్లాహ్‌యే దైవదూతలలో నుండి, మానవులలో నుంచి తన సందేశహరులను ఎంపిక చేసుకొంటాడు. నిశ్చయముగా దేవుడు అంతా వింటాడు. అన్నిటినీ చూస్తాడు."** దేవుడు తన ప్రవక్తలను నిర్ణయించుకొని వారిని మనుషుల మధ్యలోనికి పంపి తన జ్ఞానమును చెప్పించును. అప్పుడు తన ప్రవక్తలకు వహీ ద్వారా వచ్చిన జ్ఞానమునే మీరు చెప్పండి. అది ఏ విధముగాయున్నా ఫరవాలేదు. మొదట వహీ ద్వారా (వాణిద్వారా) వచ్చిన జ్ఞానమునే చెప్పమని చెప్పాడు. ద్వాపరయుగములో కృష్ణుడు అర్జునునకు చెప్పిన భగవద్గీత మొదట వహీద్వారా వచ్చిన జ్ఞానమే. అలాగే బైబిలు జ్ఞానము కూడా మొదట దేవుడు ఆకాశవాణి నుండి చెప్పించిన జ్ఞానమునే చెప్పాడు. అదే

విధముగా ఖుర్ఆన్ గ్రంథములోని జ్ఞానము కూడా సృష్ట్యాదిలో ఆకాశవాణి చెప్పిన జ్ఞానమునే జిబ్రయేల్ చెప్పాడు. అదే విషయమును అనగా మొదట వహీద్వారా వచ్చిన విషయము (జ్ఞానము)నే చెప్పమని దేవుడు తన ప్రవక్తలకు చెప్పాడు. ఆ విషయమునే ఖుర్ఆన్ గ్రంథములో ప్రస్తావించుచూ సూరా 6, ఆయత్ 105, 106లలో ఈ విధముగా చెప్పాడు చూడండి. **(6-105) "ఈ విధముగా మేము సూచనలను విభిన్నకోణములనుంచి విశదీకరిస్తూ ఉంటాము. "నీవు ఎవరివద్దనో పాఠాలు నేర్చుకొన్నావు" అని వారు చెప్పేటందుకు, దానిని విజ్ఞులకు బాగా స్పష్టపరి చేందుకుగానూ మేమిలా చేస్తాము." (6-106) "ఓ ప్రవక్తా! నీవు మాత్రము నీ ప్రభువు తరఫునుంచి నీవద్దకు వహీద్వారా పంపబడుతున్న విధానాన్ని అనుసరిస్తూవుండు. ఆయనతప్ప మరో ఆరాధ్యదైవము లేదు. అజ్ఞానులను పట్టించుకోవద్దు."** దేవుడు సృష్ట్యాదిలో తన జ్ఞానమును శాశ్వతముగా భూమిమీద ఉండునట్లు ఆకాశవాణి నుండి జ్ఞానమును చెప్పించాడు. ఆ దినము సూర్యున్ని ఎన్నుకొని సూర్యునికి తన జ్ఞానమును మొట్టమొదట ఆకాశశబ్ధము ద్వారా తెలియజేశాడు. ఆ విధముగా మొదట బయటపడిన జ్ఞానము శాశ్వతముగా భూమిమీద నిలిచిపోయినది. తర్వాత ద్వాపరయుగములో ధర్మములు అధర్మములుగా మారినపుడు కృష్ణుడు సృష్ట్యాదిలో చెప్పిన జ్ఞానమునే చెప్పుచున్నాను విను! అని అర్జుననకు వాణి ద్వారా వచ్చిన జ్ఞానమునే చెప్పాడు. తర్వాత అదే జ్ఞానమే బైబిలుగా చెప్పబడినది. సృష్ట్యాదిలో వాణిద్వారా వచ్చిన జ్ఞానమునే జిబ్రయేల్ ముహమ్మద్ ప్రవక్తకు చెప్పడము జరిగినది.

సృష్ట్యాదిలో వచ్చిన జ్ఞానము నేడు మూడు దైవగ్రంథముల రూపములోయున్నది. మూడు దైవగ్రంథములు వేరువేరుగా కనిపించినా, వేరువేరు మతముల గ్రంథములనిపించినా, వాటిలో ముఖ్యసారాంశము సృష్ట్యాదిలో చెప్పిన జ్ఞానమే ఉన్నది. మూడు గ్రంథములలోని వహీ జ్ఞానమునకు కొంతమార్పులు చేర్పులు యున్నా, వాటిని ప్రక్కన పెట్టి చూడగలిగితే, సృష్ట్యాదిలో దేవుడు చెప్పిన జ్ఞానము మూడు గ్రంథములలో ఉన్నట్లు తెలియుచున్నది. సృష్ట్యాదిలో చెప్పిన జ్ఞానము ఇప్పటి వరకు రావడానికి కారణము కలదు. మొదట చెప్పిన జ్ఞానములో జీవమున్నది. దానినే జ్యోతి అంటున్నాము. ఆ జ్యోతి ఆరిపోకుండా శాశ్వతముగా ఉండుటకు అది సిద్ధాంతముతో చెప్పబడినది. **ఆ సిద్ధాంతము భగవద్గీతలో పురుషోత్తమప్రాప్తి యోగమున 16,17 శ్లోకములలోయున్నది. అలాగే రెండవ దైవగ్రంథమయిన బైబిలులో మత్తయి సువార్తలో 28వ అధ్యాయ మందు 19వ వచనము గలదు. చివరి దైవగ్రంథమయిన ఖుర్ఆన్‌లో సూరా 50, ఆయత్ 21 నందు ఆ సిద్ధాంతము గలదు.** ఈ విధముగా దేవుని జ్ఞానము సిద్ధాంత రూపములో అన్ని దైవగ్రంథములలో కనిపించు చున్నది.

ఆదిలో చెప్పిన జ్ఞానము సిద్ధాంతముతో ముడివేయబడిన దానివలన అది ఎప్పటికీ శాశ్వతముగా ఉండగలదు. సిద్ధాంతము అంటే శాసనము అని అర్థము. శాసనము ఎప్పటికీ శాశ్వతముగా ఉండునదిగావున, దేవుడు చెప్పినది సిద్ధాంత జ్ఞానమైనందున అది జ్యోతితో కూడుకొన్నదై ఉన్నది. జ్యోతితోకూడుకొన్న దానివలన దాని జ్యోతే దానికి జీవమైయున్నది. జీవమున్న దానికి శక్తి కూడా ఉంటుంది. సిద్ధాంతముతో కూడుకొన్న దైవగ్రంథము ఏదయినా! అనగా ప్రథమ దైవగ్రంథము, ద్వితీయ

దైవగ్రంథము, అంతిమ దైవగ్రంథము ఏదయినా వాటిలో జీవము, శక్తి తప్పకయుండును. ఆ సూత్రమును అనుసరించి మేము వ్రాసిన అన్ని గ్రంథములూ సిద్ధాంతముతోనే కూడుకొన్నవి అయినందున అన్ని గ్రంథములలోనూ జ్యోతి (జీవము) లేక జీవనజ్యోతి కలదు. మా గ్రంథము లలో ప్రతిదానికీ జీవమున్నది. జీవమున్న ప్రతిదానికీ శక్తియున్నది. శక్తియున్న ప్రతిదానికీ ఉద్దేశ్యము కూడా ఉన్నది. ఇప్పటివరకు **మేము వ్రాసిన 56 గ్రంథములకు జీవము , శక్తి, ఉద్దేశ్యము మూడూ కలవు.** ఇక్కడ మీ గ్రంథములకు ఏ ఉద్దేశ్యమున్నదని అడుగవచ్చును. దానికి మా సమాధానము. మా గ్రంథములు చదివిన వారిని ఎవరినయినా దేవునివైపు ధ్యాస కల్గునట్లు చేయడమే ఉద్దేశ్యముగా గలవు. మీ గ్రంథములలో ఏమి శక్తియుంది? అది మీరెలా చెప్పగలుగుచున్నారని అడుగవచ్చును. దానికి కూడా మా సమాధానము ఇలా కలదు. శక్తి అంటే వేరేగా అర్థము చేసుకోవద్దండి. కర్మను కాల్చు విధానమునే మేము శక్తి అంటున్నాము. కర్మ అనుభవించువాడు మా గ్రంథములకు, మా జ్ఞానమునకు శరణుజొచ్చిన వాడు ఎవడయినాగానీ, వానిలోని కర్మనుకాల్చు శక్తికలిగియున్నాయి. మా గ్రంథములను నమ్మిన ఏ వ్యక్తి అయినా శరీరములో బాధను పొందునప్పుడు గ్రంథమును బాధయున్నచోట పెట్టితే ఆ బాధను లేకుండా చేయు పనిలో గ్రంథము నిలిచిపోయి బాధయున్నచోటనే శరీరమునకు అంటుకొని పోవుచున్నది. ఇది ప్రత్యక్షముగా కనిపించునది కావున తప్పనిసరిగా గ్రంథములలో శక్తియున్నదని ఒప్పుకోక తప్పదు. గ్రంథములలోయున్నది జ్ఞానశక్తికనుక అది తనను విశ్వసించిన వాని కర్మను దహించును. దేవుడు చెప్పిన సిద్ధాంతమును అనుసరించి చెప్పిన మా గ్రంథములలో శక్తియున్నట్లు తెలియుచుండగా, దైవగ్రంథములని పేరుపెట్టబడిన భగవద్గీత, బైబిలు,

ఖుర్ఆన్ గ్రంథములలో అపారమైన శక్తియుండును. అలాగే జ్యోతికూడా యుండును. అందువలన ఎంతకాలము జరిగినా ఇదే జ్ఞానమే మరీమరీ ప్రజలలోనికి వచ్చుచుండును. **ఈ జ్ఞానము తప్ప ప్రపంచములో వచ్చు జ్ఞానమేలేదు.** కాలక్రమములో క్రొత్తక్రొత్త జ్ఞానములు వచ్చినా వాటియందు జీవముండదు గనుక అవి మృత శరీరములతో సమానము. కొంతకాలము నకు నశించి పోగలవు. సృష్ట్యాదిలో దేవుడే జీవము పోసి, శక్తిని, ఉద్దేశ్యమును ఇచ్చి పంపిన జ్ఞానము అయినందున ఈ జ్ఞానము సృష్టి ఉన్నంతవరకూ ఉండును. దేవుడున్నంతవరకూ ఉండును. **దేవుడు పోడు, దేవుని సృష్టీ పోదు, అలాగే ఈ సిద్ధాంత జ్ఞానమూ పోదు.** ఇది ముమ్మాటికీ వాస్తవము.

ఇది సిద్ధాంత జ్ఞానమే అనుటకు సాక్ష్యముగా ఖుర్ఆన్ గ్రంథమందు సూరా 4, ఆయత్ 174లో ఈ విధముగా వ్రాశారు చూడండి. **(4-174) "ప్రజలారా! మీవద్దకు మీ దేవుని తరఫునుండి స్పష్టమైన నిదర్శనము (బుర్ హాన్) వచ్చేసింది. ఇంకా మీవద్దకు స్పష్టమైన జ్యోతిని పంపాము."** ఈ వాక్యములో 'నిదర్శనము' అను పదము వచ్చినది. దానినే బుర్హాన్ అనికూడా చెప్పారు. నిదర్శనము అనగా ఏమో, మనము చెప్పుకొందాము. బుర్హాన్ అనగా ఏమిటో ముస్లీమ్ పండితులు వ్రాసినది చూద్దాము. నిదర్శనము అనగా కనిపించకుండా ఉండునదని అర్థము. దర్శనము అనగా కనిపించునదని అర్థము. 'ని' అనగా లేదు, కాదు అని అర్థము. నిదర్శనము అనగా కనిపించనిది అని చెప్పవచ్చును. దేవుడు చెప్పిన జ్ఞానములో కనిపించకయున్న సిద్ధాంతమని చెప్పవచ్చును. భగవద్గీతలో, బైబిలులో, ఖుర్ఆన్‌లో ఒకే సిద్ధాంతమున్నా అది ఎవరూ గుర్తించలేనట్లు ఉన్నది. అందువలన సిద్ధాంతమును నిదర్శనము అని అన్నారు. సిద్ధాంతమును అరబ్బీ భాషలో "బుర్హాన్" అని చెప్పారు.

బుర్‌హాన్ అంటే ఏమిటో ముస్లీమ్ పండితులు వ్రాసిన విధానమును, వివరమును ఇప్పుడు చూస్తాము. **అరబ్బీ భాషలో 'బుర్హాన్" అని ఉంది. బుర్హాన్ అంటే స్పష్టమైన ఆధారము, నిదర్శనము అని అర్థము. ఈ ఆధారము గనుక ఒకసారి వచ్చిన తరువాత సందేహాలకు, అనుమానాలకు ఏమాత్రము ఆస్కారము వుండదు. అందుకే దీనిని జ్యోతిగా చెప్పడమైనది.** ఆధారము అనగా చెప్పిన విషయమునకు ఆధారముగాయున్న సిద్ధాంతమని అర్థము. నిదర్శనము అనినా సిద్ధాంతమనే నిదర్శనము అని అనవచ్చును. జ్యోతి అంటే దీపము లేక ప్రాణము అని అర్థము. దైవగ్రంథములలో జ్యోతి ఉండుట వాస్తవమే. దైవగ్రంథములలో ఏమి సిద్ధాంతమున్నదో తొందరగా కనిపించదు. భగవద్గీతలో కనిపించిన సిద్ధాంతము ఖుర్‌ఆన్‌లో యున్నా అది యున్నట్లు కనిపించదు. ఎంతో జ్ఞానమున్నవారు మూడు గ్రంథములలో ఒకే సిద్ధాంతమున్నదని గ్రహించగలరు. మేము వ్రాసిన **"మూడు గ్రంథములు, ఇద్దరు గురువులు, ఒక బోధకుడు"** అను గ్రంథములో మూడు గ్రంథములలో నున్న సిద్ధాంతమును చూపాము. ఒకే సిద్ధాంతము మూడు గ్రంథములలో రంగు, రూపును మార్చుకొని ఎవరికీ తెలియకుండా, ఎవరూ గుర్తించకుండా యున్నదానిని మేము చూపడము జరిగినది. అంతేకాక సిద్ధాంతము యొక్క ప్రాధాన్యత కూడా ఆ గ్రంథములో చెప్పాము.

సిద్ధాంతముతో కూడుకొన్న జ్ఞానమును ముగ్గురు ప్రవక్తలతో మూడు గ్రంథములుగా చెప్పించినా, ఆకాశమునుండి వచ్చిన జ్ఞానమును చెప్పినా, వినకుండా ప్రవక్తలను కూడా ఎదురించి మాట్లాడినవారు ఎందరో గలరు. అటువంటివారిని వారి కర్మకే వదలివేయాలి. అటువంటి వారికి ఏమి చెప్పినా వినే స్థితిలో ఉండరు. వారు దేవునికి వ్యతిరేఖ జాతిగా పుట్టిన వారు. వారిమీద దేవుని శాపముండుట వలన వారు దేవుని జ్ఞానమునకు

దూరముగానే ఉందురు. అటువంటి వారిని గురించి ఖుర్‌ఆన్ గ్రంథములో ప్రస్తావించారు. సూరా 3, ఆయత్ 184 లో వారిని గురించి ఈ విధముగా చెప్పారు. **(3-184) "ఇంతగా బోధపరచినప్పటికీ వారు నిన్ను ధిక్కరిస్తే, నీకు పూర్వము కూడా స్పష్టమైన నిదర్శనాలను (సిద్ధాంత బోధలను) సహీఫాలను (పైన ఆకాశమునుండి వచ్చిన జ్ఞానమును) జ్యోతిర్మయ గ్రంథమును తీసుకవచ్చిన ప్రవక్తలు కూడా అటువంటి ధిక్కారానికి గురి అయ్యారు."** ప్రవక్తలను ధిక్కరించువారు ఎందరోయున్నారు. వారికి ఏమి జ్ఞానము తెలియకున్నా అందరినీ విమర్శించుటే వారి పనిగా కొందరు ఉందురు. కొందరికయితే జ్ఞానమనినా ప్రవక్తలనినా, ఏమాత్రము సరిపోని వారై ఏదో చెప్పరాని అసూయ వారిలో ఉండును. ప్రవక్తలతో ఎవరి వలనా వారికి కష్టము, నష్టము కలుగకున్నా, వారంటే వీరిలో సరిపోని విధానముండును. అందువలన ఎక్కడయినా ప్రవక్తలను గురించి వ్యతిరేఖముగా మాట్లాడడమే వారి ముఖ్య ఉద్దేశ్యమై ఉండును. అటువంటి వారిని చూచి జ్ఞానము తెలిసినవారు కూడా చెడిపోవుటకు అవకాశమున్నది. అందువలన వారి మాటలకు, వారి చేష్టలకు దూరముగా ఉండడము మంచిదని ఖుర్‌ఆన్ గ్రంథములో సూరా 4, ఆయత్ 140లో ఈ విధముగా చెప్పుచున్నారు చూడండి. **(4-140) "దేవుడు తన గ్రంథములో ఇది వరకే మీవద్దకు ఈ ఆజ్ఞను అవతరింపజేశాడు. ఎవరైనా దేవుని వాక్యములను తిరస్కరిస్తూ, పరిహాసమాడుచున్నట్లు, మీరు విన్నట్లయితే వారు ఆ మాటలను విడిచిపెట్టి వేరే మాటలను మాట్లాడడము మొదలు పెట్టనంతవరకు ఆ సమూహములో వారితో కలిసి కూర్చోకండి. ఒకవేళ మీరు కూడా అక్కడేయుంటే మీరు కూడా ఆ సమయములో వాడిలాంటి వారుగానే పరిగణింపబడుతారు.**

**దేవుడు నిశ్చయముగా కపటులను, అవిశ్వాసులనందరినీ నరకములో త్రోగుచేయనున్నాడు."** ఈ వాక్యములో గుర్తుపెట్టుకోవలసిన ఒకమాటను చెప్పారు. అదేమనగా! ఒకవేళ మీరు కూడా 'జ్ఞానమును, ప్రవక్తలను హేళనగా మాట్లాడే వారి దగ్గరయుంటే వారిలాగానే పరిగణింపబడుతారు' అని కలదు. ఇక్కడ ఎవరి లెక్కలో వారిలాగా పరిగణింపబడుతారు? అను ప్రశ్న రాగలదు. దేవుని లెక్కలో మీరు కూడా చెడ్డవారిగా లెక్కింపబడుతారని చెప్పుటకు వీలులేదు. ఎందుకనగా! దేవుడు దేనినీ పట్టించుకోడు. ఆయన కేవలము అందరినీ చూస్తూ ఉండేవాడేగానీ దేనినీ లెక్కించుకొనువాడు కాదు. అటువంటప్పుడు ఎవరిలెక్కలో చెడ్డవారిగా లెక్కించబడుతారని అడగడము సమంజసమే. దానికి జవాబుగా ఇలా చెప్పవచ్చును. దేవుడు ఎవరినీ పట్టించుకోడు. అందువలన దేవుడు ఎవరిని గురించీ ఏమీ అనుకోడు. పట్టించుకొనేది, పరిగణనలోనికి తీసుకొనేది అంతయూ దేవుని పరిపాలనయే చేయుచుండును. ఒకవేళ జ్ఞానమును హేళనగా మాట్లాడువారున్న చోట నీవు ఉంటే ఆ సమయములో అక్కడేయున్న గ్రహములుగానీ, భూతములు గానీ నిన్ను కూడా వారిలోనికే లెక్కించుకొనును. ఒకవేళ ఆ సమయానికి అక్కడ ఏ గ్రహము గానీ, ఏ భూతముగానీ లేకపోతే సమస్యేయుండదు. ఒకవేళ వారు ప్రవక్తలను, జ్ఞానమును చెడుగా మాట్లాడు సమయానికే ఖచ్చితముగా అక్కడికి వచ్చారనుకొనుము అప్పుడు నీవు అక్కడేయుంటే నీవు కూడా అక్కడున్న వారిలోనికే లెక్కించబడుతావు. గ్రహముల దృష్ఠిలోగానీ, భూతముల దృష్ఠిలో గానీ చెడుగా లెక్కించబడితే వారు వేయు శిక్షలకు నీవుకూడా గురి కావలసిందే. అందువలన జ్ఞానమునకు వ్యతిరేఖముగా మాట్లాడు వారివద్ద ఉండవద్దని పై వాక్యములో చెప్పారు. అందువలన అజ్ఞానులవద్దయుండక వారికి దూరముగా ఉండడము మంచిది.

దేవుడు సృష్ఠి పూర్వము ఒక రకముగాయున్న దేవుడు సృష్ఠి తర్వాత ఆయన సాక్షిగా మాత్రమున్నాడు. ఎవరినీ పట్టించుకోవడము లేదు. ఆయన ఏమీ చేయక అన్నిటినీ ఆయన పాలనకు వదలివేశాడు. దేవుని పాలకులే అన్నీ చేయుచూ సృష్ఠినంతటినీ నడుపుచున్నారు. సృష్టికి పూర్వము అన్నీ దేవుడే చేశాడు. సృష్ఠినంతటినీ ఆయనే సృష్ఠించాడు. తర్వాత సృష్ఠిని నడుపుటకు తన పరిపాలనను కూడా ఏర్పరచాడు. తర్వాత ఆయన దేనినీ పట్టించుకోలేదు. అన్ని పనులనూ దేవుని పరిపాలనలోని వారే చేయుచున్నారు. దేవుడు రూప, నామ, క్రియలు లేనివాడైయున్నాడు. క్రియలు లేనివాడు అంటే పనిచేయనివాడు అనియూ పనిలేనివాడు అనియూ అర్థము గలదు. అయితే దేవుడు అన్నిటికీ సాక్షిగాయుండుటకు మరియు అందరికీ సాక్షిగాయుండుటకు సర్వవ్యాపిగాయున్నాడు. దేవుడు జీవరాసుల శరీరములలోనూ, శరీరముల బయటా, అంతటా వ్యాపించియున్నాడు. అంతరంగములోనూ, బాహ్యములోనూ అంతటా అణువణువునా వ్యాపించియున్నాడు. అలాయుండుట వలన దేవుని పాలనను కూడా దేవుడు చూస్తున్నాడు. ప్రతి వస్తువు మొదటిలోనూ ఆయనే ఉన్నాడు, చివరిలోనూ ఆయనే ఉన్నాడు. ఇక్కడ ఉన్నాడు అక్కడ లేడు అనుటకు వీలులేకుండా భూమిలోనూ ఆకాశములోనూ అంతటా వ్యాపించియున్నాడు. దేవుడు అంతటాయున్నా ప్రతి మనిషికీ దగ్గరగాయున్నా ఎవరికీ తెలియకుండా, ఎవరూ గుర్తించకుండాయున్నాడు. అందువలన ఖుర్ఆన్ గ్రంథములో దేవున్ని గురించి చెప్పుచూ సూరా 57, ఆయత్ 3,4లలో ఇలా చెప్పారు చూడండి. **(57-3) "ఆయనే మొదటివాడు. చివరివాడూ. ఆయనే నిగూఢము. ఆయనే బాహ్యము, ఆయనే ప్రతీదీ తెలిసినవాడు." (57-4) "ఆయనే భూమి, ఆకాశాలను ఆరు రోజులలో సృష్ఠించాడు.**

**తర్వాత సింహాసనాన్ని అధిష్ఠించాడు. భూమి లోపలికి పోయేది, అందులో నుంచి బయటికి వచ్చేది, ఆకాశమునుండి క్రిందికి దిగేది, ఆకాశములోనికి ఎక్కేది అంతా ఆయనకు బాగా తెలుసు. మీరు ఎక్కడయున్నా మీతోనే ఆయన ఉన్నాడు. మరి మీరు చేసే పనులన్నిటినీ దేవుడు చూస్తూనేయున్నాడు."**

దేవుడు అంతటాయున్నాడని అన్నీ ఆయనకు తెలుసునని చెప్పుకొన్నాము కదా! అంతటా ఆయన ఉన్నప్పుడు అన్నీ ఆయనలోనే ఉన్నాయి అని చెప్పినా సరిపోవును. అంతటా ఆయన ఉన్నప్పుడు, అన్నీ ఆయనలోనే ఉన్నాయనడములో తప్పులేదు. శరీరములోపల, శరీరము బయట దేవుడున్నాడు అనినప్పుడు శరీరమే ఆయనలో ఉంది అనినా సరిపోవును. అందువలన బయటనున్న భూమినీ, ఆకాశమునూ శరీరముతో పోల్చి భూమి శరీరము యొక్క పాదములనీ, ఆకాశము శరీరము యొక్క తలయనీ భూమి, ఆకాశముల మధ్యలోని సమస్తము తల, కాళ్ళ మధ్యలోనున్న శరీరమనీ పోల్చి తత్త్వవేత్తలు అన్నారు. అంతేకాక బయటకు చెప్పుకొనే దానికంటే ఒక శరీరములో చెప్పుకొని చూస్తే దేవుడు, దేవుని జ్ఞానము దగ్గరగా అర్థమగునని పెద్దలు శరీరమును కేంద్రముగా చూచుకోమని చెప్పారు. అలా పోల్చి చూస్తే ఖుర్ఆన్‌యందు ఒక వాక్యములో సూరా 4, ఆయత్ 132లో ఇలా కలదు చూడండి. **(4-132) "ఆకాశములో, భూమిలో ఉన్న వస్తువులన్నీ దేవుని ఆధీనములోనే ఉన్నాయి. కార్యనిర్వాహకారిగా అల్లాయే గలడు."** మరియొకచోట సూరా 20, ఆయత్ 6లో ఇలా కలదు. **(20-6) "ఆకాశములో, భూమిలో రెండిటికీ మధ్యన ఇంకా నేల అడుగు భాగమున ఉన్న ప్రతీదీ ఆయనదే."** మరియొక చోట సూరా 22, ఆయత్ 64లో ఈ విధముగా ఉన్నది. **(22-64)**

**"భూమి ఆకాశములలో వున్న సమస్తమూ ఆయనదే. నిశ్చయముగా దేవుడు ఏ అక్కర లేనివాడు, ప్రశంసనీయుడు."** ఇదే విషయమునే మరొకచోట సూరా 26, ఆయత్ 24లో ఇలా చెప్పారు. **(26-24) "మీరు నమ్మగలవారే అయితే వినండి. ఆయన ఆకాశము లకు, భూమికీ వాటి మధ్యనున్న సమస్త వస్తువులకూ అధిపతి."** మరియొకచోట ఇదే విషయమునే సూరా 27, ఆయత్ 25లో ఈ విధముగా చెప్పారు. **(27-25) "ఆకాశములోనూ, భూమిలోనూ నిక్షిప్తమైయున్న సమస్త వస్తువులనూ వెలికితీసేవాడు, మీరు గోప్యముగా ఉంచే మరియు బహిర్గతము చేసే విషయాలన్నీ తెలిసినవాడైన అల్లాహ్‌కు వారు సాష్టాంగ పడవలసింది. కానీ వారలా చేయుటములేదు."** ఇటువంటి విషయమే సూరా 30, ఆయత్ 25,26లలో కూడా ఈ విధముగా చెప్పారు. **(30-25,26) "ఆయన సూచనలలో ఇది కూడా వుంది. భూమి, ఆకాశములు ఆయన ఆదేశముతోనే నెలకొని ఉన్నాయి. మరి ఆయన మిమ్ములను పిలువగానే ఒక్క పిలుపుపైనే మీరంతా భూమిలోనుంచి బయటికి వస్తారు." (30-26) "ఆకాశాలలో, భూమిలో ఉన్న ప్రతి వస్తువూ ఆయనదే. అన్నీ ఆయన ఆజ్ఞకే లోబడి ఉన్నాయి."** ఇటువంటి విషయమే మరొకచోట సూరా 48, ఆయత్ 14లో ఈ విధముగా చెప్పారు చూడండి. **(48-14) "భూమి, ఆకాశముల సర్వాధికారము అల్లాహ్‌దే. తాను కోరిన వారిని ఆయన క్షమిస్తాడు. తాను కోరిన వారిని శిక్షిస్తాడు. దేవుడు అపారముగా క్షమించే వాడు మరియు కరుణించేవాడు."**

ఈ వాక్యములన్నిటినీ చూచిన తర్వాత వీటిని బయటికి చెప్పుకొంటే మాటిమాటికీ ప్రశ్నలు పుట్టుచుండును. అన్ని ప్రశ్నలకూ జవాబు

ఉండునట్లుగా, ప్రశ్నలే రాకుండునట్లుగా భూమిని, ఆకాశమును రెండిటినీ శరీరముగా పోల్చి చూచుకోవలెను. అన్నిటియందూ ఉన్నదానిని చెప్పునప్పుడు, అన్నీ దానియందే ఉన్నాయనినా అర్థము సరిపోవును కదా! అదే విధముగా భూమి, ఆకాశములను శరీరమందే పోల్చుకొని చూచినా సరిపోవును. ఇప్పుడు అలాగే చూస్తాము. భూమి అంటే శరీరము యొక్క క్రింది భాగమయిన కాళ్ళని ముందే ఒకమారు చెప్పాము. ఇప్పుడు తిరిగి మరొకమారు జ్ఞాపకము చేయుచున్నాము. ఆకాశము అంటే శరీరములోని తల భాగమని అర్థము చేసుకోవాలి. భూమి, ఆకాశముల మధ్యలోనున్న సమస్తము దేవుని ఆధీనములో ఉన్నాయి అన్నప్పుడు శరీరములోని ప్రతి అవయవము, ప్రతి భాగము దేవుని ఆధీనములో ఉన్నాయి అని తలచవలెను. అలా శరీరములో పోల్చుకొన్నప్పుడే దేవుడు నీకు దగ్గరగా అర్థమగును, బయటికి పోల్చుకొంటే నీకేమీ లాభము లేదు. భూమికీ, ఆకాశమునకూ మధ్యలోయున్న సమస్తమునకూ అధిపతి అని చెప్పినప్పుడు నీ శరీరము మొత్తమునకు దేవుడు అధిపతిగాయున్నాడని తలచవలెను. దేవుడు అధిపతిగాయుండి తన సేవకులచేత శరీరమును నడుపుచున్నాడు. అందువలన ఆయన దూతలు 19 మంది నిన్ను పరీక్షించుచున్నారని ఇదే గ్రంథమందే చెప్పియున్నారు. 19 మంది దూతలు అనగా ఐదు కర్మేంద్రియములు, ఐదు జ్ఞానేంద్రియములు, ఐదు గాలులు, నాలుగు అంతఃకరణములయిన మనస్సు, బుద్ధి, చిత్తము, అహము. ఈ 19 దేవుని దూతలైనప్పుడు నీ శరీరము మొత్తము దేవుని పాలనలో ఉన్నట్లే కదా! దేవుని పాలనలో అతి ముఖ్యమైన పాలకుడు ఆత్మ. అతను దేవుని కర్తవ్యమును నెరవేర్చుచున్నాడు.

శరీరములోని విధానమంతటికీ దేవుడు అధిపతిగాయున్నా, ఆయన ఏ కార్యమునూ చేయక మౌనముగా చూస్తూ అక్షిగా లేక సాక్షిగాయున్నాడు.

ఆయన శరీరమునకు అధిపతిగాయుండుటవలన ఆయన ఏమీ చేయకున్నా, ఆయన సేవకులు శరీరమును పాలించుచున్నారు. శరీరమును పాలించు వారిలో అతిముఖ్యమైనవాడు ఆత్మ. ఆత్మ అన్ని అధికారములు కలిగి శరీరములోని మిగతా అవయవములను కదిలించి, నడిపించుచూ జీవితము సాగునట్లు చేయుచున్నాడు. ఒక జీవుడు శరీరములో జీవితమును సాగించుటకు ఆత్మ అన్ని విధములా ఎల్లప్పుడూ పనిచేయుచున్నాడు. శరీరమునూ, శరీరములోని సేవకులుగాయున్న భాగములను తెలియని వానికి జ్ఞానము ఏమీ తెలియదని చెప్పవచ్చును. శరీరము ప్రకృతి ఐదు భాగములతో తయారయినది. ప్రకృతి ఐదు భాగములు శరీరములోని 25 భాగములుగా తయారయివున్నది. ఆకాశము, భూమి అని చెప్పబడు శరీరము ఆకాశము, భూమి, గాలి, అగ్ని, నీరు అను ఐదు భాగములతో తయారయినది. ప్రకృతికి దేవుడే పెద్ద కావున భూమి, ఆకాశము వాటికి మధ్యనున్న సమస్తమునకూ దేవుడు పెద్దయని అన్నారు.

బయట ప్రపంచము పంచభూతములతో తయారయినది. అలాగే లోపలి ప్రపంచమయిన శరీరము పంచభూతములతోనే తయారయినది. పంచభూతములనగా ఆకాశము, గాలి, అగ్ని, నీరు, భూమి. ఈ ఐదు, ఐదు భూతములుగాయున్నవి. బయట ప్రపంచములో దేవుడున్నాడు అలాగే లోపలి ప్రపంచములో కూడా దేవుడున్నాడు. నీవు ఉండేది లోపల ప్రపంచములోనే కనుక, లోపల ప్రపంచములో దేవున్ని తెలియుటే ముఖ్యము. లోపలి ప్రపంచములో దేవున్ని తెలియగలిగితే, బయట ప్రపంచములోని దేవున్ని తెలిసినట్లగును. లోపలి శరీరము ఎట్లు తయారయినది తెలియ గలిగితే, అందులో వుండే నీవు, నీ తోడు ఆత్మ ఇద్దరికీ సాక్షిగాయున్న మరియు అందరికీ సాక్షిగాయున్న పరమాత్మ తెలియును. అందువలన

ముందు పంచభూతములనూ, వాటివలన శరీరము ఎలా ఏర్పడినదో తెలియకపోతే ఎవడూ జ్ఞాని కాలేడు అని కొందరు పెద్దలు చెప్పారు. కొందరు అదే విషయమునే ఒక పద్యముగా చెప్పారు, ఆ పద్యము ఇలా కలదు.

పంచతత్త్వములను పంచీకరించక
మంచి యతులమన్న మాటలన్న
కుంచమందు గజము గ్రుడ్డుపెట్టిన విధంబు
అఖిల జీవసంగ ఆత్మలింగ.

పంచభూతములు ఒకదానితో ఒకటి కలిసి ఎలా శరీరమయినదో తెలియకనే మేము మంచి జ్ఞానులము అంటే గంపక్రింద ఏనుగు గ్రుడ్డుపెట్టింది అని అన్నట్లుండును. ఏనుగు గంపక్రింద గుడ్డుపెట్టుట ఎంత అసత్యమగునో పంచతత్త్వములను తెలియనివాడు నేను జ్ఞానిని అనడము అంతే అసత్యమగును. పంచభూతముల విషయము సంపూర్ణముగా తెలిసినవాడు బయట కనిపించు పంచభూతములయిన ఆకాశము, గాలి, అగ్ని, నీరు, భూమి శరీరములో కూడా ఉన్నాయని తెలిసి, బయట ప్రపంచమున్నట్లే లోపలి ప్రపంచము కూడా ఉన్నదనీ, లోపలి ప్రపంచమే శరీరమనీ తెలిసి శరీరములోనే దేవున్ని తెలియగలిగితే తొందరగా సాధ్యమగును. అలా కాకుండా బయట ప్రపంచములో ఎంత వెదకినా ఎంత ప్రార్థన చేసినా దేవుడు తెలియబడడు.

బయట ప్రపంచములో సూర్యుడు ఉదయించుచున్నాడు, అలాగే అస్తమించుచున్నాడు. సూర్యాస్తమయము, సూర్యోదయములు బయట రాత్రింబగళ్ళు ఏర్పడుచున్నవి. అదే లోపలి ప్రపంచమయిన శరీరములో రాత్రికి బదులు నిద్రయూ, పగలుకు బదులు మెలుకువలున్నాయి. బయట

రాత్రింబగళ్ళు లోపల నిద్ర మెలుకువలుగా ఉన్నాయి. ఈ విధముగా బయట ప్రపంచమును లోపలి ప్రపంచముగా శరీరములో చూచుకోగలిగితే ఎంతో జ్ఞానము తెలియగలదు. ఇదే విషయమును ఖుర్ఆన్ గ్రంథములో సూరా 3, ఆయత్ 190 నందు ఇలా చెప్పారు చూడండి. **(3-190) "నిశ్చయముగా భూమి, ఆకాశముల సృష్టిలో రేయింబగళ్ళ రాకపోకలలో విజ్ఞులకు ఎన్నో సూచనలున్నాయి."** ఇదే విషయమునే మరియొకచోట సూరా 6, ఆయత్ 96లో ఇలా చెప్పారు చూడండి. **(6-96) "ఉదయాన్నే వెలికి తీసేవాడు ఆయనే. ఇంకా ఆయన రాత్రిని విశ్రాంతి సమయముగా చేశాడు. సూర్యచంద్రుల లెక్కను నిర్ధారించాడు. ఇదంతా సర్వాధిక్యుడు, మహాజ్ఞాని అయిన దేవుడు చేసిన నిర్ధారణ."** విజ్ఞులకు ఇందులో ఎన్నో సూచనలున్నాయి అని 3-190 వాక్యములో కలదు. అదే 6-96వ వాక్యములోనికి వచ్చిచూస్తే పగలు మొదలు అనగా ఉదయమున వెలికి తీసేవాడు ఆయనే అని ఉన్నది. వెలికితీసేవాడు ఉదయముననే అని ఉండుట వలన అందరి దృష్టి బాహ్యములోనున్న సూర్యునివైపుపోవును. ఉదయాన్నే సూర్యుడు భూమినుండి బయటికి వస్తున్నాడు కదా! సూర్యున్నే ఉదయము వెలికి తీస్తున్నానని దేవుడు చెప్పాడని అందరూ అనుకొంటున్నారు. అయితే అది లోపలి ప్రపంచములోనికి లెక్కించుకొంటే ఉదయముననే నిద్రనుండి జీవున్ని బయటికి తీయువాడు ఆత్మ అని తెలియుచున్నది. దేవుడు చేసేపనిని ఆత్మే చేయుచుండుట వలన, జీవున్ని మెలుకువలోనికి తెచ్చినది ఆత్మ అని తెలియవలెను. అట్లే రాత్రిని జీవునకు విశ్రాంతిగా చేశాడని చెప్పవచ్చును. బయట ప్రపంచములో రాత్రి సూర్యునికి విశ్రాంతియని అనుకోకూడదు. ఈ వాక్యములో సూర్యచంద్రుల లెక్కలను నిర్ధారించువాడు దేవుడేయని కలదు.

సూర్యచంద్రులనుబట్టి రాత్రింబగళ్ళు, దినములు, వారములు, నెలలు, సంవత్సరముల లెక్కలున్నాయని అనుకోకూడదు. సూర్యచంద్రులనుబట్టి శరీరములో కూడా లెక్కలు గలవు.

శరీరము లోపల పెద్దనాడి బ్రహ్మానాడియని గలదు. దానినే వెన్నుపాము అని అంటాము. దానిప్రక్కనే రెండు నరములు గలవు. వాటినే సూర్యచంద్రనాడులు అంటాము. బ్రహ్మానాడిలోని నరములు కుడి ఎడమ ప్రక్కగల సూర్యచంద్రనాడులతో కలిసి శరీరమునకు అంతటికీ ప్రాకి యుండును. సూర్యచంద్రనాడులే శరీరములోని ఊపిరితిత్తులతో సంబంధ పడియుండి ప్రతిక్షణము శ్వాస ఆడునట్లు చేయుచున్నవి. బ్రహ్మానాడినుంచి వచ్చిన నరములు సూర్యచంద్రనాడుల ద్వారా శ్వాసను ఆడించుచున్నవి. శ్వాసను ఆడించడములో ప్రతి దినమునకు ఒక లెక్కయున్నది. 21600 శ్వాసలు ఆడినప్పుడు ఒక దినముగా లెక్కించబడును. మనిషికి బయటి సూర్యచంద్రుల ఉదయము అస్తమయములనుబట్టి ఒక దినముగా లెక్కించబడుచున్నది. అట్లుకాకుండా లోపలి సూర్యచంద్రనాడులు శ్వాసలను నడుపు విధానమునుబట్టి మనిషి ఆయుష్షులో ఒక దినముగా లెక్కించబడు చున్నది. బయట సూర్యచంద్రుల లెక్కప్రకారము అందరికీ సమానముగా రాత్రి పగలు ఉండును. లోపల సూర్యచంద్రనాడులనుబట్టి ప్రతి మనిషికీ రాత్రి పగలు వేరువేరుగా ఉండును. ఎవరికయినాగానీ 21600 శ్వాసలు ముక్కురంధ్రములలో ఆడితే ఒక దినముగా లెక్కించబడును. కొందరికి శ్వాస వేగముగా నడుస్తుండుటవలన 21600 శ్వాసలు తొందరగా అయిపోవును కావున వానికి ఒక దినము తొందరగా అయిపోయినట్లే. అట్లే ఒకనికి శ్వాస నిదానముగా నడుచును, వానికి శ్వాసలు నిదానముగా నడుచుటవలన వాని శ్వాసలు 21600 నిదానముగా అయిపోవును.

అప్పుడు వానికి ఒక దినము నిదానముగా అయిపోవును. జరిగే శ్వాసలను బట్టి ఒక దినము అని చెప్పవచ్చునుగానీ, 24 గంటలనుబట్టి దినము అని చెప్పుటకు వీలులేదు. బయటి ప్రపంచములో సూర్యోదయము సూర్యాస్తమయమునుబట్టి 24 గంటలకు ఒక దినముగా లెక్కించగలుగు చున్నాము. అయితే లోపలి ప్రపంచమయిన శరీరములో సూర్యచంద్రనాడులు నడుపు శ్వాసలనుబట్టి కొందరికి 22 లేక 23 గంటలకు ఒక దినమగు చున్నది. కొందరికి 25 లేక 26 గంటలకు ఒక దినమగుచున్నది. అందువలన రాత్రిని శరీరములోని జీవునకు విశ్రాంతి సమయముగా చేశాడు, సూర్యచంద్రుల లెక్కలను నిర్ధారించాడు అని వాక్యములో చెప్పడమైనది. భూమి ఆకాశములను బయట లెక్కించుకొనుట స్థూలమగును. అదే శరీరములోపల లెక్కించుకొనుట సూక్ష్మమగును. పై వాక్యములో చెప్పిన దానినిబట్టి శరీరములోపల సూక్ష్మముగా లెక్కించు కోవడమే మంచిది. జీవుడు శరీరములోయున్నాడు కావున శరీరములోనే భూమి, ఆకాశముల లెక్కను చూచుకోవాలి. అలా సూక్ష్మముగా శరీరములో చూడగలిగినపుడు శరీరములోనే సూక్ష్మముగాయున్న దేవుడు తెలియగలడు. 3-190లో భూమి, ఆకాశముల సృష్టిలో రేయింబగళ్ళ రాకపోకలలో విజ్ఞులకు ఎన్నో సూచనలున్నాయి అని చెప్పారు. విజ్ఞులకు ఎన్నో సూచనలు అంటే జ్ఞానము కలిగి తెలుసుకొనువారికి ఎంతో రహస్యము తెలియునని అర్థము. ఈ ఆయత్ ప్రకారము మనము కొంత రహస్యమును తెలుసుకో గలిగాము.

బాహ్యములో ఎంతో పెద్ద ప్రపంచమున్నది. అంతరములో ప్రపంచ మంతా లోపలేయున్నది. బయట కనపడు ప్రపంచమంతా శరీరములోపల యున్నదంటే ఎవరయినా నమ్మగలరా? నమ్మేదానికి వీలే లేదని చెప్పవచ్చును.

అలాగే ఎంతో పెద్ద దేవుడు ప్రపంచ వ్యాప్తముగాయున్న దేవుడు చిన్న శరీరములో ఉన్నాడంటే నమ్మగలరా? ఆ మాటకూడా నమ్మేదానికి వీలులేదు. అయినా విశ్వాసమున్న వానికి అది సత్యమే, విశ్వమంతా శరీరములోపల బ్రహ్మనాడియందే ఇమిడియున్నది. అలాగే విశ్వవ్యాప్తముగాయున్న దేవుడు శరీరములోనేయున్నాడు. అందువలన పై వాక్యములలోని భూమి, ఆకాశములను మనము శరీరములోనే చెప్పుకొని అదియే ముఖ్య జ్ఞానము అనుకొన్నాము. స్థూలముగా ఒక అర్థముంటే సూక్ష్మముగా ఒక అర్థముండును. ఆధ్యాత్మికమంతా సూక్ష్మముమీద ఆధారపడియున్నది. స్థూలముగా చెప్పిన విషయములను సూక్ష్మముగా గ్రహించవలసియుంటుంది. ఉదాహరణకు ఒక వస్తువును తయారు చేయుటకు దానివెనకాల ఎంతో కృషి చేయవలసియుంటుంది. అలాగే ఒక యంత్రమును తయారు చేయుటకు ఎంతో నైపుణ్యతతో చేయవలసియుంటుంది. అయితే వస్తువులు, యంత్రములు మొదలగునవి ఎన్నోయున్న, మొత్తము ప్రపంచమును చేయుటయు చెప్పలేనంత కాలము, చెప్పలేనంత పని ఉంటుంది. స్థూల ప్రపంచమును తయారు చేయుటకు ఎంతకృషి జరుగవలెనో ఎంతకాలము పట్టునో ఎవరికీ తెలియదు. అటువంటి దానిని కాలముతో పనిలేకుండా, కార్యముతో పనిలేకుండా ఎవరయినా చేయగలరంటే ఒప్పుకొంటామా! లేదు అదెలా సాధ్యమగునని అడుగుతాము. సాధ్యముకాదని చెప్పుతాము. అయితే ఖుర్ఆన్ గ్రంథములో సూరా 2, ఆయత్ 117లో వ్రాసియున్న దానిని చూస్తాము. **(2-117) "భూమి, ఆకాశములను ప్రప్రథమముగా సృష్టించినవాడు దేవుడే. ఆయన ఏ పనినైనా చేయ సంకల్పించు కొన్నప్పుడు దాన్ని 'అయిపో' అని అంటే చాలు, అది అయిపోతుంది."** ఇదే విషయమునే మరొకచోట సూరా 36, ఆయత్ 82లో ఇలా చెప్పారు.

**(36-82) "ఆయన (దేవుడు) ఎప్పుడైనా ఏదయినా వస్తువును చేయ సంకల్పించుకొని 'అయిపో' అని ఆదేశించగానే అది అయి పోతుంది."**

ఈ వాక్యములలో చెప్పిన దానినిబట్టి చూస్తే దేవుడు దేనినీ చేయడు. ఆయన చేయకుండానే ఆయన సంకల్పముతోనే అన్నీ చేయగలిగాడు అని చెప్పారు. అట్లు జరిగిందాయని ప్రశ్నించుకొని చూస్తే దేవుడు చేయని మాట నిజమే. అయితే ఆయన సంకల్పించుకొనగానే ఆయన సేవకులు ఆయన పాలకులు దానిని చేయుచున్నారు. 36-82లో ఆయన ఏ వస్తువును చేయదలచినా దానిని ఆయన పాలకులు చేయుచున్నారు. ఆయన అయిపో అంటే అయిపోవుచున్నమాట వాస్తవమే. మీ దృష్టిని అంతవరకే పెట్టుకోవద్దండి. ఆయనమాట లేక ఆయన సంకల్పము వెనుక ఏమి జరుగుచున్నదో చూడండి. దేవుడు కనిపించనివాడు, దేవుని పాలకులు కూడా కనిపించనివారే. జరిగిన పని మాత్రము కనిపించేది. కనిపించేది కనపడనివారు కనిపించని దేవుని ఆజ్ఞతో చేయుచున్నారని ఎవరికీ తెలియదు. అందువలన దేవుడు అయిపో అంటే ఎలా అవుతుందని ప్రశ్న వస్తుంది. ఆయనమాట వెనుక ఎందరో చేయువారున్నారను విషయము తెలిస్తే పై వాక్యము మీద ఏ అనుమానమూ రాదు.

ఇప్పుడు చెప్పిన దానికి భిన్నముగా ఖుర్ఆన్ గ్రంథములోనే దేవుడు ఒకపనిని చేయడానికి ఇంతకాలము పట్టినదని చెప్పారు. అప్పుడు దేవుడు పని చేయకున్నా అయిపోతుంది అని చెప్పినవారే ఆయన ఒక దానిని చేయుటకు కొంతకాలము పట్టినదని చెప్పడమేమిటి? దేనిని సత్యమని నమ్మాలి? అను ప్రశ్న రాగలదు. ఇక్కడ 'అయిపో' అంటే అయిపోవునది, అక్కడ చేయవలసిన పనేమొచ్చినది? అలా చేసినప్పుడు భూమి, ఆకాశమునే

చేయకుండా 'అయిపో' అని ఎలా చేయగలిగాడు? అను ప్రశ్నలు రాగలవు. దేవునిమీద అనుమానము వచ్చునట్లు చెప్పిన వాక్యము ఏదో చూస్తే సూరా 7, ఆయత్ 54లో ఇలా చెప్పారు **(7-54) "నిస్సందేహముగా దేవుడే మీ రాజు. ఆయన ఆకాశములను, భూమినీ ఆరు రోజులలో సృష్టించాడు. ఆ తరువాత సింహాసనముపై ఆసీనుడయ్యాడు. ఆయన రాత్రిని పగటిపై కప్పివేస్తాడు. అది దాన్ని వేగముగా వెంబడిస్తూ వస్తుంది. ఇంకా ఆయన సూర్యచంద్రులను, నక్షత్రాలను తన ఆజ్ఞకు కట్టుబడివుండే విధముగా సృష్టించాడు. వినండి సృష్టి ప్రక్రియ ఆయన స్వంతము. ఆజ్ఞాపన ఆయన సొత్తు. సకల లోకాల ప్రభువైన దేవుడు అపారమైన శుభాలు కలవాడు."** ఇదే విషయమునే మరొకచోట సూరా 10, ఆయత్ 3లో ఈ విధముగా చెప్పారు. **(10-3) "నిశ్చయముగా మీ రాజు దేవుడే. ఆయన ఆకాశాలను, భూమిని ఆరురోజులలో సృష్టించాడు. తర్వాత సింహాసనాన్ని (అర్షను) అధిష్ఠించాడు. ఆయన సమస్త వ్యవహారాలనూ నిర్వహిస్తున్నాడు. ఆయన అనుమతిలేకుండా (ఆయన సమక్షములో) సిఫారసు చేయగలవాడు ఎవడూ లేడు. అటువంటి అల్లాయే దేవుడు. కాబట్టి మీరు ఆయననే ఆరాధించండి. ఇంత చెప్పినా మీరు గుణపాఠము గ్రహించగలరా?"** ఇంచుమించు ఇదే విషయమునే ఖుర్ఆన్ గ్రంథములో మరొకచోట సూరా 50, ఆయత్ 37,38లలో కూడా ఈ విధముగా చెప్పారు చూడండి. **(50-37) "హృదయాన్ని కలిగియుండి లేదా శ్రద్ధకలిగియుండి ఆలకించండి. సావధానముగా మసలుకొనే ప్రతి వ్యక్తికీ ఇందులో హితబోధ కలదు." (50-38) "నిశ్చయముగా మేము భూమి, ఆకాశములను వాటి మధ్యయున్న అన్నింటినీ ఆరుదినాలలో సృష్టించాము. మరి మాకు**

**అలసట ఏమాత్రము రాలేదు."** ఈ వాక్యములలో దేవుడు ఆరురోజులలో భూమినీ, ఆకాశమునూ సృష్ఠినంతటినీ సృష్ఠించాడని చెప్పారు. అంతేకాక శ్రద్ధగలిగి సావధానముగా మసలుకొనేవానికి ఇందులో హితబోధ కలదని కూడా చెప్పారు. దేవుడు ఏమీ చేయడు, ఆయన చేయదలచుకొన్న దానిని 'అయిపో' అంటే అయిపోతుందని చెప్పినవారు, ఇక్కడేమో ఆయన భూమి, ఆకాశముల సృష్ఠిని తయారు చేయుటకు ఆరురోజులు పట్టినదని చెప్పారు. ఈ రెండు వాక్యములను చూచిన ఎవరయినా ఇవి ఒకదానికొకటి విరుద్ధముగా ఉన్నాయి అని చెప్పకమానరు. ఇందులో ఒకటి సత్యమయితే మరొకటి అసత్యమగును. అందువలన సత్యాసత్యమయిన మాటలను దేవుడు ఎందుకు చెప్పాడు? అని అనుమానము రాగలదు. అయితే జాగ్రత్తగా శ్రద్ధగా వినేవానికి ఇందులో హితబోధ కలదను సూచనను కూడా చెప్పారు. సూచన అన్నప్పుడు ఏదో మనకు తెలియని రహస్యముందని అర్థమగు చున్నది. ఇంతకుముందు 'అయిపో' అంటే ఎలా అయిపోతుందని ప్రశ్నించు కొని, దేవుడు అనుకొన్న వెంటనే ఆయన పాలకులలోని గ్రహములు, భూతములు అందరూ ఆ పనిని చేయుచున్నారని దేవుడు ఏమీ చేయడనీ చెప్పుకొన్నాము.

అక్కడికి ఆ సమస్య అర్థమయిపోయినది. అయితే మరి ఇక్కడ క్రొత్తగా దేవుడు తన సృష్ఠిని ఆరురోజులలో సృష్ఠించాడు అని వ్రాశారు. దేవుడు ఆరు రోజులు చేశాక ఏడవరోజు సింహాసనాన్ని అధిష్ఠించాడు అని కూడా వుంది. ఆయన సమస్త వ్యవహారాలనూ చూస్తాడు అని చెప్పడము వలన ఇక్కడ దేవుడే స్వయముగా ఆరురోజులు పని చేశాడు అని కలదు. దీనికేమంటారు? అని ఎవరయినా ప్రశ్నించగలరు. అప్పుడు మనము కొంత ఇరుకున పడక తప్పదు. అయితే ఇక్కడ కొంత యోచిస్తే శ్రద్ధగలవానికి

సూచనగలదు అని ఉన్నది కదా! అందువలన అక్కడ చెప్పిన విషయమును కొంత ఆలోచిస్తే ఈ విధముగా మనకు అర్థము అగుచున్నది. సూచన అన్నప్పుడు అదేదో రహస్యమై ఉండును. అందువలన చెప్పిన విషయమును స్థూలముగా అర్థము చేసుకోకూడదు. ఆరురోజుల పని ఏడవరోజు విశ్రాంతి అన్నప్పుడు ఎవరయినా ఆరురోజులు పని చేసిన తర్వాత పని జాగాను వదలి స్వంత జాగాలో విశ్రాంతి తీసుకోవడము జరుగుచుండును. వారమునకు ఏడు దినములున్నమాట నిజమే కదా! ఆరు రోజులు ఆఫీస్‌లో ఉద్యోగము చేసినవాడు ఏడవరోజు ఇంటిలో విశ్రాంతి తీసుకొంటున్నాడు కదా! అదే విధముగా ఆరురోజుల పని తర్వాత దేవుడు తన సింహాసనాన్ని అధిష్ఠించాడు అని వ్రాశారు. అలా చెప్పినప్పుడు ఆరు రోజుల పనిని స్థూలముగా బయట ప్రపంచములోనికి తీసుకోకుండా శరీరములోనికి వర్తించునట్లు చూచుకోగలిగితే మనకు సూక్ష్మముగా ఇలా అర్థము కాగలదు. మన శరీరములో బ్రహ్మనాడియందు ఏడునాడీకేంద్రములు గలవు. అందులో ఆరు నాడీకేంద్రములు శరీరము పనిలో లగ్నమై ఉంటాయి. ఏడవ నాడీకేంద్రములో దేవుడు నివాసమై యున్నాడు. దేవుడి నివాసము అనగా ఆయన ఆత్మకు నివాసము అని అర్థము. దేవుడు ఒకచోట నివాసముండడు. ఆయన శరీరమంతా అణువణువునా వ్యాపించియుండును. అయితే దేవునివలె నటించు ఆత్మ ఏడవ నాడీకేంద్రములో నివాసము ఏర్పరచు కొన్నది. ఏడవ కేంద్రములో యున్న ఆత్మ తనశక్తిని శరీరమంతా ఆరు నాడీకేంద్రముల ద్వారా వ్యాపింపజేయుచున్నాడు. సూర్యుడు ఆకాశములో యున్నా సూర్య కిరణములు భూమండలమంతా ప్రాకినట్లు, ఆత్మ ఏడవ కేంద్రములోయున్నా ఆత్మశక్తి శరీరమంతా ఆరు నాడీకేంద్రముల ద్వారా ప్రాకుచున్నది. ఇదంతా ప్రతి మానవుని శరీరములో ఉన్న విధానము.

మనిషి హిందువుకావచ్చును, లేక ముస్లీమ్ కావచ్చును లేక క్రైస్తవుడు కావచ్చును. ఎవరయినా ఏ మతస్థుడయినా లోపలి విధానము తెలియకపోతే దేవుడు చెప్పిన పై వాక్యములకు ఏమీ అర్థము తెలియదు. ఆరు రోజుల పని అనగా లేక ఆరురోజుల సృష్ఠి అనగా ఆరు నాడీకేంద్రముల నిర్మాణమని అర్థము చేసుకోవలెను. భూమి, ఆకాశముల సృష్ఠి అన్నప్పుడు బయట ప్రపంచము లోనికి పోకుండా శరీరములోనే చూచుకోవలెను. శరీరములో ఆరు నాడీ కేంద్రముల ద్వారా పని చేయించు ఆత్మ ఏడవ నాడీకేంద్రములో స్థిరస్థాయిగా ఉండుటవలన ఏడవ దినమును దేవుని సింహాసనము అని అన్నారు. మనిషి తాత్కాలిక మరణము పొందినప్పుడు ఆరు నాడీకేంద్రముల పని నిలిచిపోయి శరీరము మృతదేహముగా కనిపించును. అయినా ఏడవ నాడీకేంద్రములో ఆత్మ అట్లే ఉండును. ఆత్మయుండుట వలన జీవాత్మ కూడా గుణచక్రములో ఉండును. మనిషి చనిపోకున్నా తాత్కాలిక మరణములో చనిపోయినట్లే లెక్కించబడును. అటువంటివారు తిరిగి బ్రతికిన సంఘటనలు అనేకము జరిగాయి. అది ఎట్లా సాధ్యమయినది ఎవరికీ అర్థము కాదు. శ్వాసను బంధించి ప్రాణాయామము చేసిన మనిషిలో ఆరు నాడీకేంద్రములు నిలిచిపోయి ఏడవ నాడీకేంద్రములో ఆత్మయుండుట వలన ప్రాణాయామ సమయములో శ్వాస ఆడదు. రక్తప్రసరణము జరుగదు. చనిపోయిన దేహమువలెనున్న శరీరము తిరిగి ప్రాణాయామము తర్వాత యథాస్థితికి వచ్చును. ఇదంతయూ గమనించితే శరీరములో ఆరు నాడీకేంద్రములు ఆరు రోజులకు గుర్తుగాయుండగా, ఏడవ నాడీకేంద్రము ఆదివారమునకు గుర్తుగాయున్నది. ఆది అనగా మొదట పుట్టినదియని అర్థము. ఆదివారము అనగా సృష్ఠి దినము అని అర్థము. శనివారము అనగా చివరి దినము, నాశనమగు దినము. అన్నిటికీ చెడిన

దినము అని అర్థము. ఆదివారము మొదలు శనివారము వరకు బయట దినములకు పేర్లుయున్నా, అవి లోపలి కేంద్రములకు గుర్తుగా పెట్టబడిన పేర్లు. 'ఆరురోజులు సృష్ఠించాడు' అంటే ఆరు దినములకు ఆరు కేంద్రములను సృష్ఠించాడని అర్థము. ఏడవ స్థానములో దేవుడుండుట వలన ఆరు రోజుల సృష్ఠి తర్వాత తన సింహాసనము మీద కూర్చొన్నాడని చెప్పారు. శరీరములోని నిర్మాణమును కూడా ఆయన పాలకులే చేశారు. ఆయన ఏమీ చేయనివాడే. కొన్ని విషయములు బయట పోలికలను పోల్చి చెప్పినా అవి నిగూఢముగాయున్న విషయములని తెలియవలెను. దేవుడు పనిచేయనివాడు అనుమాట ఎప్పటికీ కొట్టివేయబడదు. ఎందుకనగా! దేవుడు రూప, నామ, క్రియా రహితుడు. ఆయన ఎప్పటికీ పని చేయడు. ఆయన అనుకొన్నదేదయినా అయిపోతూవుంటుంది. ఆయన వెనుక పనిని చేయువారు కోట్లమంది పాలకులు గలరు. ఆయన పాలకులలో ఒక్కొక్కరికి రెండు చేతులు మొదలుకొని వేల చేతులు, లక్షల చేతులుగలవారు గలరు. అందువలన ఎంతటి పనినయినా క్షణములలో చేయువారు గలరు. భూమిని ఒక్కరే కంపింపజేయగలరు. ఒక్కరే సముద్రములో సునామీని లేపగలరు. ఎంతటి కార్యమునయినా చేయగలరు. ఎంతటి భీభత్సమునయినా సృష్ఠించ గలరు. దేవుని ఆజ్ఞకు లోబడి పనిచేయువారు మనకు కనిపించరు. మనకు తెలియదు. దేవుడు అంటే వెదుకబడేవాడు. దేవుడు అంటే అంతుదొరకని వాడు. దేవుడు అంటే అర్థము కానివాడు. ఆయన అనుకుంటే అన్నీ జరిగి పోవును. ఆయన ఏమీ చేయడు. చేసేదంతా ఆయనవారే. ఆరురోజుల సృష్ఠి ఆయన చేసినదే అయినా ఆయన చేయలేదు. ఆయన వారే చేశారు. ఆరు రోజుల సృష్ఠి అనంతరము ఆసనమును అధిష్ఠించాడు. శరీరములో ఆరు కేంద్రముల అవతల నివాసమున్నాడు. ఈ విషయమును గురించి ఎక్కువ చెప్పవలసిన పనిలేదు.

శరీరము బయట ఆకాశము, భూమి ఉన్నది. అలాగే అదే ఆకాశము భూమి శరీరములోపల యున్నది. శరీరము లోపలయున్న ఆకాశము భూమి లోపలిప్రళయము వచ్చుట నిజమే అయినా ఎప్పుడు ప్రళయము వస్తుందో ఎవరికీ తెలియదు. శరీరములోపల ప్రళయము వస్తే అక్కడగల భూమి కంపించును, నీరు పొంగిపొరలిపోవును. అగ్ని ప్రేలిపోవును. గాలి అదుపులేకుండా అల్లాడి నిలిచిపోవును. చివరికి అన్నీ నాశనమైపోవును. దానినే ప్రళయము అంటాము. శరీరములోపలి ప్రళయము వస్తే శరీరమే నాశనమయిపోయి అందులో ఆత్మ నివసించకుండాపోవును. జీవుడు కూడా ఆత్మతోపాటు శరీరమును వదలిపోవును. దానినే మరణము అంటాము. అంతకూ ఆ ఘడియ ఎప్పుడు వస్తుందని అడుగువారు కొందరుంటారు. అది ఎప్పుడు వచ్చేది ఎవరికీ తెలియదు. శరీరములో చాలా విపత్కరమైన, కష్టమైన ఆ సమయము ఎప్పుడు వస్తుందో ముందు ఎవరికీ తెలియదు. ఆ మరణ సమయము లేక ఆ ప్రళయసమయము ఎవరికి ఎప్పుడు సంభవించునది దేవునికే తెలుసు. మనుషులకు ఎవరికీ తెలియదు. ఈ విషయమును గురించి ఖుర్ఆన్ గ్రంథములో సూరా 7, ఆయత్ 187లో ఇలా వ్రాసియున్నారు చూడండి. **(7-187) "ఇంతకీ ఆ ఘడియ ఎప్పుడు వస్తుంది? అని వారు నిన్ను ప్రళయ దినము గురించి అడుగుతున్నారు కదా!" ఆ విషయ జ్ఞానము మాత్రము నా ప్రభువువద్దనే వుంది. ఆ సమయము ఆసన్నమైనప్పుడు ఆయన మాత్రమే దానిని ప్రత్యక్ష పరుస్తాడు. అది ఆకాశములోనూ, భూమిలోనూ మహా బరువైనది. అది విపత్కరమైన సంఘటనగా ఉంటుంది. అది అకస్మాత్తుగానే మీపై వచ్చిపడుతుంది" అని వారికి చెప్పు. నీవు పరిశోధన చేసి కనుగొన్నట్లు భావించి వారు నిన్ను అడుగుతున్నారు. "దాని జ్ఞానము**

**కేవలము దేవుని దగ్గర మాత్రమే ఉంది. కానీ చాలామంది ఈ విషయాన్ని తెలుసుకోలేరు అని వారికి చెప్పు."**

మరణము అనబడు ప్రళయము శరీరములో ఎప్పుడు వస్తుందో, ఏ మానవునకూ ముందు తెలియదు. అది దేవునికీ, దేవుని సేవకులకూ మాత్రమే తెలుసు. దేవునికి తెలుసు తర్వాత దేవుని సేవకులకు తెలుసు. మరణమును శరీరములో ప్రళయముగా తెచ్చువారు దేవుని పాలకులే కావున వారికి కూడా తెలుసు. దేవునికి తెలుసు అంటే ఆయనవద్దయున్న ఆయన పాలకులకు కూడా తెలుసు అనియే చెప్పవచ్చును. మరణమను ప్రళయమును అమలుపరుచువారు దేవునిపాలకులే. ప్రళయమును దేవుడే ప్రత్యక్షపరుస్తాడు అని వాక్యములోయున్నది. అలా చెప్పడము న్యాయమేగానీ దేవుడు ఏమీ చేయడు అంతా ఆయన పాలకులే చేస్తున్నారు. అయినా దేవుని గౌరవార్థము ఆయనే చేస్తున్నాడని చెప్పారు. దేవుని పాలకులు ఎప్పుడో ఒక రోజు శరీరములో ప్రళయమును తెస్తారు. ఆ రోజు భూమి, ఆకాశములలో మహాబరువైన దినముగా ఉంటుంది. విపత్కర సంఘటనగా ఉంటుంది. ఆ సంఘటన ముందు తెలిసి రాదు. అకస్మాత్తుగా వచ్చి పడుతుంది. మరణదినము ఎవరికయినా ముందు తెలియునా? ఎవరికీ తెలియదు. అకస్మాత్తుగా ఒకరోజు వచ్చి మీద పడుతుంది. అంతవరకు ఎంతో కాలము బ్రతుకుతానని కలలు కన్నవాడు చచ్చి ఊరకుంటాడు. అదియే ప్రళయ దినము. అదియే అంతిమదినము.

ప్రపంచములో రెండురకముల ళయములు కలవు. అందులో ఒకటి ళయము రెండవది ప్రళయము. ళయము అనగా నాశనమని అర్థము. ప్రపంచములో ఎక్కడో ఒకచోట పంచభూతములు చెలరేగిపోయి కొంతవరకు వాటి పరిధిలో నాశనమును సృష్టించడమును ళయము

అంటున్నాము. ఈ మధ్యకాలములో విశాఖ ప్రాంతములో వచ్చిన తుఫాన్ లాంటి దానిని ళయము అని అనవచ్చును. పంచభూతములలో గాలి, నీరు చెలరేగిపోయి కల్గించిన భీభత్సములో ఎన్నో చెట్లు, ఎంతో ఆస్తి లేకుండా పోయినవి. కొంత ప్రాంతమంతా నాశనమైన దానిని ళయము అంటున్నాము. ళయము అనునది కొంతకాలమునకు ఒకమారు పంచ భూతములలో ఒకటి లేక రెండు లేక మూడు చెలరేగిపోయి చేయు భీభత్సమును ళయము అంటున్నాము. చాలామంది దానిని ప్రళయముగా చెప్పుచుందురు. తర్వాత ఎప్పుడో ఒకప్పుడు ప్రళయము వస్తుందని కూడా చెప్పుచుందురు. **వాస్తవముగా ప్రళయము అనునది బయట ప్రపంచములో ఎప్పటికీ రాదు.** ఎన్ని యుగములు గడచినా రాదు. ఈ నా మాటను తేలికగా తీసుకోవద్దండి. ప్రళయము ఎప్పటికీ రాదనునది శాస్త్రబద్ధమైన మాట. అది నాకు తెలిసే చెప్పుచున్నాను. బయట ప్రపంచములో వచ్చునది ళయమేగానీ, ప్రళయముగాదు. ప్రళయము లోపలి ప్రపంచమయిన శరీరములో వచ్చును. ప్ర అనగా పుట్టినది, ళయము అనగా నాశనము అని అర్థము. పుట్టినదంతా లేకుండా నాశనమైపోవడమును ప్రళయము అంటాము. బయటి ప్రపంచములో పుట్టిన పంచభూతములు ఎప్పటికీ లేకుండాపోవు. పంచభూతములు పోకుండా వాటి బలమును చూపి నాశనమును కల్గించడమును ళయము అంటున్నాము.

పుట్టిన శరీరములోనున్న పంచభూతములు గతులు తప్పి నాశనము కావడమును ప్రళయము అంటున్నాము. ప్రళయములో పంచభూతములే నశించిపోవుచున్నవి. ళయములో పంచభూతములే నాశనము చేయుచున్నవి. పంచభూతములు నాశనము కాకుండా తమ బలముతో వినాశనమును సృష్ఠించడమును ళయము అంటున్నాము. పంచభూతములే తమ బలమును

కోల్పోయి నశించడమును ప్రళయము అని అంటున్నాము. ఇంతకుముందు శరీరములో వచ్చు ప్రళయమును అనగా మరణమును గురించి 7-187 వాక్యములో చెప్పుకొన్నాము. ఇప్పుడు బయట ప్రపంచములో జరుగు ళయము గురించి చెప్పుచున్నాము. బయట ప్రపంచములో అగ్ని చేయు నాశనము అగ్నిపర్వతములు బ్రద్ధలయి అగ్ని బయటికివచ్చి, భూమిమీద నీటివలె ప్రవహించుచూ అడ్డువచ్చిన దానినంతా కాల్చి బూడిద చేయు చుండును. అది ఒక రకముకాగా ఏదో ఒక కారణముచేత అడవులలో అగ్ని చెలరేగి అరణ్యమును, దానిలోని జీవజాలమును కాల్చి బూడిద చేయును. మరియొకరకము జనావాసములలో నిప్పుచెలరేగి మంటలుగా వ్యాపించి కొందరి ఆస్తిని, కొందరి మనుషులను, జంతువులను నాశనము చేయును. ఈ విధముగా ఎన్నో రకముల అగ్ని అను ఒక భూతమే భూమిమీద భయంకరమైన భీభత్సమును సృష్ఠించుచున్నది. అదే విధముగా భూమి చెలరేగి భూకంపముగా భారీ నాశనమును చేయుచుండగా, గాలి చెలరేగితే దాని బలమును ఎవరూ అంచనా వేయలేరు. దేనినయినా పెకలించి క్రింద వేయగలదు. విశాఖ దగ్గర వచ్చిన ప్రకృతి భీభత్సములో గాలి వేల సంఖ్యలో చెట్లను కూల్చివేయడమేకాక, కొన్ని వేల కరెంటు స్థంబములను పెకలించి ప్రక్కన వేసినది. ఇళ్ళ పైకప్పులను ఎత్తి ప్రక్కన పారవేసినది. అనేక రకములుగా గాలి తన బలమును చూపి నాశనమును చేసినది. నీరు వర్షరూపములో వస్తే వరదలను సృష్ఠించగలదు. ఉత్తరదేశమున కేదార్‌నాథ్‌లో కొన్ని గంటలలో మూడువందల సెంటీమీటర్ల వర్షము కురిసి, కొన్ని ఊర్లను సహితము నీటిలో కొట్టుకుపోవునట్లు చేసినది. పెద్ద భవనములు సహితము పేకమేడలలాగా నీటిలో కొట్టుకపోయాయి. ఎందరో దుర్మరణము పాలయినారు. భక్తితో వచ్చిన శివభక్తులను కూడా

వదలక నాశనము చేసిన సంగతి అందరికీ తెలిసినదే. గాలి, అగ్ని, నీరు, భూమి ఈ నాలుగు ఎంతటి లయమునయినా సృష్ఠించగలవు. ఇక ఆకాశమను భూతము బలమును చూపితే ఆకాశములోయున్న గోళములు సహితము ప్రేలిపోగలవు. విమానములను కూల్చివేయగలదు. వాతావరణమునే మార్చివేసి భూమినే మార్చివేయగలదు. ప్రకృతిలోని ఐదు భూతములు మహాశక్తివంతమయినవి. వాటి శక్తిని అంచనా వేయలేము. అందువలన ప్రకృతిలోని ఐదు భూతములను మహాభూతములని అన్నాము. పంచభూతములయిన ఆకాశము, గాలి, అగ్ని, నీరు, భూమి అను ఐదు తమ బలమును చూపడము లయము అంటాము. పంచభూతములు బలమును కోల్పోవడమును మరణము లేక ప్రళయము అంటాము.

లయము అయిన బయట నాశనము ప్రకృతి భాగములచేత ఎప్పుడయినా జరుగవచ్చును. పంచభూతములలో పెద్దది ఆకాశము. ఆకాశముయొక్క అనుమతితో మిగతా నాలుగు భూతములు చెలరేగి నాశనమును చేయును. ఆకాశము మేఘరూపముగా సంచరించుచూ ఎన్నో కార్యములను చేయుచున్నది. భూమి పంటలనిచ్చి జీవరాసులను జీవించుటకు ఉపయోగపడుచున్నది. గాలి ప్రాణవాయువును ఇచ్చి జీవులను బ్రతుకునట్లు చేయుచున్నది. అగ్ని ఉష్ణోగ్రతనిచ్చి వాతావరణమును కాపాడుచున్నది. అగ్ని లేకపోతే చలికి చచ్చిపోకతప్పదు. నీరు వర్ష రూపముగా ఎక్కడ కురువాలో అక్కడ కురుస్తున్నది. ఈ నాలుగు భూతములను మేఘము అను ఆకాశభూతము ఆజ్ఞలిచ్చి నడుపుచున్నది. ఎక్కడ తుఫాను వచ్చినా, ఎక్కడ అగ్ని పర్వతములు ప్రేలినా, ఎక్కడ సునామీ వచ్చినా, ఎక్కడ ప్రకృతి భీభత్సము జరిగినా అక్కడ మేఘము యొక్క ఆజ్ఞలేనిది జరుగదు.

భూమిమీద మేఘముల ఆదేశముతో ప్రకృతి భీభత్సములు ఎన్నో జరుగుచున్నవి. అయితే అవి ఎప్పుడు జరుగుతాయో ముందే చెప్పలేము. జరిగేదానికి కొన్ని గంటలముందు తెలుసుకొనినా జరిగే విపత్తును, నాశనమును తప్పించలేము. ఇదే విషయమునే అంతిమ దైవగ్రంథమందు సూరా 7, ఆయత్ 4లో ఈ విధముగా చెప్పారు చూడండి. **(7-4) "ఎన్నో జనావాసాలను మేము రూపుమాపాము. వాటిపై మా శిక్ష రాత్రివేళలో లేక మధ్యాహ్నము వారు విశ్రమిస్తున్న సమయములోనో వచ్చిపడింది."** ఇక్కడ చెప్పినవాక్యము బయట ప్రపంచములో జరిగే ళయమును (నాశనమును) గురించి చెప్పినదేయని తెలియవలెను. ఈ వాక్యము కేవలము ళయమును గురించి చెప్పగా, దీనికంటే ముందు చెప్పిన 7-187 వాక్యము ప్రళయమును గురించి చెప్పినది. ఈ రెండు ఆయతులలో (వాక్యములలో) ళయమునకు, ప్రళయమునకు తేడాను బాగా గమనించవచ్చును. బయట ఎప్పుడో వస్తుందను ప్రళయమును గురించిన అపోహను తలలో నుండి తీసివేసుకోవలెను. బయట ప్రపంచములో ప్రళయము రాదు, లోపలి ప్రపంచములో ళయము రాదు. రెండూ వేరువేరుగాయున్నవి. వేరువేరుగానే వస్తాయి. మనిషి ప్రళయమును పొందితే తిరిగి ప్రభవమును పొందవలసియున్నది.

ప్రళయము అనగా మరణము. ప్రభవము అనగా జననము అని అర్థము. ప్రళయము చెందిన ప్రతి వ్యక్తి తిరిగి ప్రభవమును పొందవలసిందే. ప్రభవమును పొందినవాడు తిరిగి ప్రళయమును పొందడము తప్పక జరుగును. అందువలన జనన మరణములు అనివార్య కార్యములని ప్రథమ దైవగ్రంథము భగవద్గీతలో సాంఖ్యయోగమున 27వ శ్లోకమందు చెప్పారు.

శ్లో॥ జాతస్య హిధ్రువో మృత్యుః ర్ధ్రువం జన్మ మృత స్యచ ।
తస్మాద పరిహార్యేర్థే నత్వం శోచితు మర్హసి ॥

**భావము :- "పుట్టిన వానికి మరణము తప్పదు. మరణించిన వానికి పుట్టుక తప్పదు. అనివార్యమైన ఈ విషయమును గురించి శోకించుట మంచిది కాదు."** జనన మరణములను ఎవరూ ఆపలేరు. అవి అనివార్యమైన కార్యములు. మరణించినవాడు తిరిగి పుట్టుతాడని ప్రథమ దైవగ్రంథములో చెప్పినట్లే అంతిమ దైవగ్రంథములో కూడా చెప్పారు. అయితే కొందరు దానిని నమ్మడము లేదు. కొందరేమో తిరిగి జన్మించడమును ఒప్పుకోకున్నా దేవుడు వానిని తిరిగి లేపుననీ, వానిని లేపిన తర్వాత తీర్పు చెప్పి అటు స్వర్గమునకో, ఇటు నరకమునకో పంపునని చెప్పుచున్నారు. అట్లు లేపబడిన వాడు స్వర్గనరకమునకు పోతాడుగానీ తర్వాత జన్మకురాడు అని అంటున్నారు. వారికి స్వర్గనరకములు భూమిమీద గడుపు జీవితములోనే ఉన్నాయని తెలియదు. చనిపోయినవాడు భూసమాధిలో ఉండగా, ప్రళయము వచ్చినప్పుడు దేవుడువచ్చి సమాధినుండి లేపి శిక్షవేసి పంపును అని ఎవరో చెప్పితే, అదే నిజమనుకొనువారు కొందరుగలరు. అయితే ఆ మాటను దేవుడు తన మూడు గ్రంథములందు ఎక్కడా చెప్పలేదు. అయితే కొందరు ప్రళయ కాలములో ఎవరు లేపుతారు? అని అడుగువారు కూడా కలరు. అటువంటి వారిని గురించి వారికి చెప్పవలసిన సమాచారమును గురించి అంతిమ దైవగ్రంథము ఖుర్ఆన్‌లో సూరా 17, ఆయత్ 51,52 లలో ఈ విధముగా చెప్పారు. **(17-51) "మీ మనసులకు ఎంతో కష్టమైనదిగా తోచే మరేదైనా సృష్టిగా మారినా (తిరిగి పుట్టడము జరిగినా) మిమ్ములను తిరిగి లేపేవాడు ఎవరు? అని మిమ్ములను వారు అడుగుతారు. అప్పుడు ఓ ప్రవక్తా! తొలిసారి పుట్టించినవాడే మలిసారి కూడా పుట్టిస్తాడని చెప్పు.**

**దానికి వారు తమ తలలను ఆడిస్తూ, అంతకీ అది ఎప్పుడు జరుగు తుందని అడుగుతారు. అది త్వరలోనే జరుగవచ్చునని వారికి సమాధాన మివ్వు. (17-52) "ఆ రోజు మిమ్ములను ఆయన (దేవుడు) పిలుస్తాడు. అప్పుడు మీరు ఆయనను స్తుతిస్తూ ఆయన పిలుపుకు హాజరు పలుకుతారు. అప్పుడు మీరు కొద్ది సమయము మాత్రమే ప్రపంచములో ఉన్నామని అనుకుంటారు."** ఇక్కడ చెప్పిన వాక్యమును చాలామంది తప్పుగా అర్థము చేసుకొన్నారు. దేవుడు పిలుస్తాడు అని అంటే చనిపోయినవారు గుంతలలోనే ఉంటారని దేవునిమాటకు వారు బయటికి బ్రతికివస్తారని అనుకోవడము జరుగుచున్నది. ఆ విధముగా అనుకొనుటకు సాక్ష్యాధారములు ఏమీ లేవు. దేవుడు పిలిచేవాడు కాదు. ఆయన పని చేయడు అని మరచిపోకూడదు. ఆయన ఇంతవరకు ఎవరినీ పిలువలేదు. ఆయన మాటను ఇంతవరకు వినినవారు ఎవరూ లేరు. మనిషి చనిపోతే వానిలోని జీవుడు, ఆత్మ శరీరమునుండి బయటికి పోవడము జరుగుచున్నది. మృతదేహమును భూమిలో పూడ్చిపెట్టగా అది కుళ్ళిపోవడము అందరికీ తెలిసినదే. ప్రకృతిలోని ఐదు భాగములు ప్రళయమును పొందడము మరణము అంటున్నాము. చనిపోయిన జీవుడు క్రొత్త శరీరమును ఆశ్రయించి మరుక్షణమే క్రొత్త జన్మను తీసుకొంటున్నాడు. ఇదంతయూ అనివార్య కార్యమని ఇంతకుముందే చెప్పుకొన్నాము. అయితే దేవుడు చేయని పనిని దేవునికి అంటగట్టడము దేవుడు చెప్పనిమాటను దేవుడు చెప్పాడనడము మంచిదికాదు. ఆయన చెప్పిన మాటలకు వ్యతిరేఖముగా చెప్పినట్లగును. ఎవడు తొలిసారి పుట్టించాడో మలిసారి కూడా ఆయనే పుట్టించుచున్నాడని చెప్పవచ్చునుగానీ, గుంతలోనుంచి లేపును అనేది తప్పు. దేవుడు చేయవలసిన పనిని ఆయన పాలకులు చేయుచున్నారని, తొలిసారి మలిసారి రెండుమార్లూ ఆయన సేవకులే అతనిని పుట్టించుచున్నారు.

అయితే జననము ఎప్పుడు మరణము ఎప్పుడని ఎవరికీ తెలియదు. తెలియనిదానిని  తొందరలో జరుగునని అనుకోవడము మంచిది. మరణము దానివెంటనే జననము ఎప్పుడనునది దేవునికి ఆయన పాలకులకు మాత్రమే  తెలుసు.

ప్రతి మనిషీ చనిపోతున్నాడు తిరిగి పుట్టుచున్నాడు.  చని పోవడములో ఆ జన్మ జ్ఞాపకము అంతటితోనే ఆగిపోవును.  అంతవరకూ తన శరీరములో జ్ఞాపకము కలుగజేయుచూయున్న దేవదూత అతనిని వదలిపోవును.  శరీరములోవున్న 19 మంది దేవదూతలు మరణములో అతనిని వదలిపోవుదురు.  అందువలన జ్ఞాపకముచేయు మనస్సు అనునది లేకుండాపోయిన దానివలన  మనిషి వెనుకజన్మలో ఎక్కడవుండినాననునది తెలియదు.  సృష్ట్యాదినుండి ఒకడు ఎన్నో జన్మలు ఎత్తినా జరిగిపోయిన ఒక జన్మకూడా జ్ఞాపకము లేదు.  అయితే ఆత్మ ప్రతి జన్మలోనూ జీవునికి తోడుగాయుండుట వలన ఆ జీవుడు ఎన్ని జన్మలు ఎత్తినదీ, ఏ జన్మలో ఎక్కడున్నదీ గతజన్మలలో ఏయే హోదాలలో, ఏయే ఉద్యోగములు చేసినదీ అన్నీ ఆత్మకు తెలుసు.  జీవునికి స్వయముగా జ్ఞాపకము పెట్టుకొను శక్తి లేదు.  జీవుడు అన్ని విధములా అవిటివాడు అని ముందే చెప్పాము. అందువలన జీవునికి ఏమీ తెలియదు.  జీవునికి తోడుగాయున్న ఆత్మ శరీరములో యున్న 19 మంది దూతలకు కూడా బలమునిచ్చి నియమించి వారితో పనిచేయించుచుండెడిది.  ఆత్మ అందరికీ శరీరములోనున్న అన్ని అవయవములకూ శక్తినిచ్చి నడిపించుచుండుట వలన ప్రతీదీ ఆత్మకు తెలుసు. ఒక జీవుడు ఎప్పుడు ఏ జన్మలో ప్రవేశించినదీ ఎప్పుడు ఏ జన్మలో నుంచి బయటికి వచ్చినదీ అన్నీ తెలుసు.  అలాగే పూర్వము ఎవరు ఎక్కడ పుట్టినది,  తర్వాత ఎక్కడ పుట్టబోవునది ఆత్మకు తెలుసు.  ఆత్మకు తెలిసిన

విషయములన్నియూ ఆత్మను జీవాత్మను సాక్షిగా చూస్తున్న పరమాత్మకు కూడా తెలుసు. ఇదే విషయమునే ఖుర్ఆన్‌లో సూరా 15, ఆయత్ 24లో ప్రస్తావిస్తూ ఈ విధముగా చెప్పారు. **(15-24) "నీకు పూర్వము సాగిపోయిన వారిని మేము ఎరుగుదుము. తర్వాత వచ్చేవారిని కూడా ఎరుగుదుము."**

ప్రథమ దైవగ్రంథము భగవద్గీతలో కృష్ణుడు ఒక సందర్భములో జ్ఞానయోగమను అధ్యాయమందు చెప్పుచూ ఇట్లన్నాడు. "అర్జునా! ఇది నాశరహితమైన జ్ఞానము. దీనిని సృష్ట్యాదిలో సూర్యునికి చెప్పియుంటిని. అతడు (సూర్యుడు) మనువుకు చెప్పాడు. మనువు ఇక్ష్వాకుడు అను సూర్య వంశము రాజుకు చెప్పాడు. ఇక్ష్వాకుడు మిగతా రాజులకు, ఋషులకు చెప్పడము జరిగినది. ఆ విధముగానే నేను చెప్పిన జ్ఞానమును ఆనాడు అందరూ తెలియగలిగారు. క్రమేపీ మాయాప్రభావము వలన నేడు తెలియకుండా పోయినది. అందువలన ఆ పురాతన జ్ఞానమును, రహస్య మైన జ్ఞానమును ఇప్పుడు నీకు తిరిగి నేను చెప్పుచున్నాను, జాగ్రత్తగా విను!" అని అనగా! ఆ మాటకు అర్జునుడు ఒక ప్రశ్న అడిగాడు. అదేమనగా! సృష్ట్యాదిలో సూర్యుని జన్మ కలిగినది. నీవు పుట్టినది ఇప్పుడు. సృష్ట్యాదిలో సూర్యునికి నీవు ఎలా చెప్పగలిగావు? అప్పుడు నీవు లేవు కదా!యని అడిగాడు. దానికి కృష్ణుడు జవాబు ఈ విధముగా చెప్పాడు. "సృష్ట్యాదినుండి నేను ఉన్నాను, నీవూ ఉన్నావు. అందరూ ఉన్నారు. అప్పటినుండి నాకు ఎన్నో జన్మలు కలిగాయి, నీకూ ఎన్నో జన్మలు కలిగాయి. అయితే నేను వాటిని వరుసగా తెలిసియున్నాను. నీకు మాత్రము ఒక జన్మకూడా జ్ఞాపకము లేదు" అని చెప్పాడు. అందువలన ఆత్మకు శరీరములో యున్న జీవుని విధానమంతయూ తెలియును కనుక పూర్వమునుండి జన్మలు

మారు వారు మాకు తెలుసు తర్వాత మారబోవు వారు కూడా తెలుసునని పై వాక్యములో చెప్పడమైనది.

దేవునికి ఇంతకుముందు చనిపోయిన వారు తెలుసు. ఇప్పుడు చనిపోయి పుట్టుచున్నవారూ తెలుసు. చనిపోయిన వ్యక్తికి రెండవ శరీరమును ఇచ్చి, వానికి ప్రాణమునిచ్చి, గ్రహించుకొనుటకు బుద్ధిని ఇచ్చి, భూమిమీదికి పంపగా తనను సృష్ఠించిన దేవున్ని మరచి ప్రపంచ విషయము లలో కలిసిపోయి తిరుగుచుండును. దేవుడు ఒక జన్మలో చంపుచున్నాడు. రెండవ జన్మలో పుట్టించుచున్నాడు. తనలాగే చనిపోయే వారిని చూస్తున్నాడు. పుట్టువారిని చూస్తున్నాడు. అయినా నేను చనిపోయి పుట్టాను అను ధ్యాస ఏమాత్రము మనిషికి లేదు. తాను కూడా ఎప్పుడో ఒకప్పుడు చనిపోవలసి యున్నా ఆ భయముగానీ, ఆ ఆలోచనగానీ తనలో లేకుండా తాను శాశ్వతముగా బ్రతుకువానివలెనే అన్ని విషయములందు వ్యవహరి స్తున్నాడు. ఇదే విషయమునే ఖుర్ఆన్ గ్రంథములో చెప్పుచూ సూరా 6, ఆయత్ 122లో ఇలా వ్రాశారు. **(6-122) "మృతుడుగాయున్న ఒక వ్యక్తికి మేము జీవితమును ప్రసాదించి, అతనికి జ్యోతిని ఇవ్వగా దానిని పుచ్చుకొని అతడు జనులమధ్య సంచరిస్తున్నాడు. అలాంటి వ్యక్తి కటిక చీకటిలో కూరుకపోయి వాటినుండి ఏమాత్రము బయటపడలేని వానిగా యున్నాడు. ఇదే విధముగా సత్య తిరస్కారులకు వారి పనులు వారికి ఎంతో అందమైనవిగా తోస్తాయి."** ఇదే విషయమునే మరొకచోట సూరా 10, ఆయత్ 34లో ఈ విధముగా చెప్పారు. **(10-34) "ఏమిటి? మీరు మొదటిసారి సృష్ఠించి రెండవసారి కూడా దానిని పునరావృతము చేసేవాడెవడైనా ఉన్నాడా? అని దేవుని భాగస్వాములుగా పెట్టుకొన్న వారిని అడుగు. దేవుడే తొలిసారి**

**సృష్టిస్తాడు, మలిసారి కూడా ఆయనే సృష్టిస్తాడు. మరి అలాంటప్పుడు మీరు సత్యమునుండి ఎటు కొట్టుకు పోతున్నారు"** అని వారిని అడుగు. ఇదే విషయమునే మరొకచోట సూరా 10, ఆయత్ 56లో ఈ విధముగా వ్రాయడము జరిగినది చూడండి. **(10-56) "దేవుడే ప్రాణము పోస్తాడు. దేవుడే ప్రాణము తీస్తాడు. మీరంతా ఆయనవద్దకే మరలించబడ తారు."** ఈ వాక్యములలో మనకు తెలిసినది ఏమనగా! దేవుడు మనిషిని చనిపోయిన తర్వాత అతనికి తిరిగి పునర్జన్మ ఇచ్చి దానితోపాటు కొంత జ్ఞానమును (జ్యోతిని) ఇచ్చి పంపుచున్నాడు. అయితే మనిషి పుట్టిన తర్వాత తాను ఎందుకు పుట్టాను? అని కొంతయినా ఆలోచించకుండా మనుషులలో కలిసి పోయి, అజ్ఞానము లో మునిగిపోయి, కటికచీకటివంటి అజ్ఞానములో బ్రతుకుచున్నాడు. అటువంటివారికి ఇతరులు దేవున్ని గురించి, జ్ఞానమును గురించి చెప్పినా గ్రుడ్డివానికి అద్దము చూపినట్లు, నపుంసకునికి రంభను ఇచ్చినట్లుండును. తాను నపుంసకుడై రంభను అందముగా లేదన్నట్లు, తాను అజ్ఞానియై జ్ఞానులనే తెలివితక్కువవారని చెప్పును. తనదగ్గర భక్తి లేదా!యన్నట్లు దేవున్ని కాకుండా గ్రామదేవతలనో, చెట్లుపుట్టలనో మ్రొక్కుచుండును. అటువంటివారు సత్యమునకు దూరముగా పోవుచూ తామున్నది సత్యములోనేయని చెప్పుచుందురు. దేవుడు మిమ్ములను తొలిసారి పుట్టించాడు, రెండవసారి కూడా పుట్టించాడు. మీరు ఆరాధించు గ్రామదేవతలు, దేవతలు కూడా దేవుని చేత పుట్టించబడినవారే. దేవుడు మిమ్ములను మీరు ఆరాధించే దేవతలను జీవులయిన వారినందరినీ, శరీరము ధరించి ఆకారము కల్గిన వారందరినీ దేవుడే ప్రాణము తీస్తున్నాడు దేవుడే ప్రాణము పోస్తున్నాడని మరువకూడదు.

ఇక్కడ మరొకమారు జ్ఞాపకము చేయుచున్నాను. దేవుడు ప్రాణము తీస్తాడు, దేవుడు ప్రాణము పోస్తాడు అని చెప్పినా ఆధ్యాత్మికములో దేవుని

గౌరవార్థము అలాగే చెప్పాలి. వాస్తవముగా దేవుడు ఏ పనినీ చేయనివాడే. ఆయన జరిగే పనులకు సాక్షిగాయున్నాడు తప్ప కార్యము చేయువాడుగా లేడు. జరిగేపనిని ఆయన సేవకులు, ఆయన పాలకులు చేయుచున్నారు. దేవుడు పురుషుడు, ఆత్మ పురుషుడు, జీవాత్మ పురుష ఆకారము కల్గిన నపుంసకుడు. అయినా పురుషుని క్రిందికే జమకట్టవచ్చును. ఈ ముగ్గురు మినహా ఉన్నదంతా ప్రకృతియే. ప్రకృతియనగా స్త్రీయని అర్థము. దేవుని పని ఏది జరిగినా, దేవుడు ఏది చేశాడని చెప్పినా అదియంతయూ ప్రకృతి వలన జరుగుచున్నది. జీవులకు చావుపుట్టుకలను దేవుడు చేయుచున్నా డనినా, వాస్తవానికి దేవుడు చేయలేదు, ప్రకృతియే చేయుచున్నదని ప్రథమ దైవగ్రంథమయిన భగవద్గీతలో విజ్ఞానయోగమను అధ్యాయమున ఆరవ శ్లోకమందు ఇలా చెప్పారు.

శ్లో॥ ఏత ద్యోనీని భూతాని సర్వాణీత్యు పధారయ ।
అహం కృత్స్నస్య జగతః ప్రభవః ప్రళయస్తథా ॥

**భావము :- "సర్వజీవరాసులకు జన్మమును చేతనా, అచేతనా ప్రకృతులే చేయించుచుండును. నేను వాటి పుట్టుకకు కారణభూతునిగాయున్నాను."** అని దేవుడు చెప్పియున్నాడు. ప్రతి జీవరాసి జన్మమును మరియు మరణమును కదలెడి ప్రకృతి, కదలని ప్రకృతియని రెండు రకములుగా యున్న ప్రకృతియే చేయుచున్నది. నేను వాటి జన్మలకు హేతుభూతుడుగా యున్నానని దేవుడు చెప్పడముతో ఆయన ఏ పనినీ చేయలేదని ఆయన తన చట్టము వలననే అన్నీ జరిగిపోతున్నాయని తెలియుచున్నది. ప్రకృతిని రెండు భాగములు చేసి చెప్పడమైనది. ఒకటి మార్పుచెందే ప్రకృతి మరొకటి మార్పు చెందని ప్రకృతియని చెప్పారు. మార్పుచెందని ప్రకృతి బయట గలదు. మార్పు చెందే ప్రకృతి శరీరములోగలదు. మార్పు చెందని

ప్రకృతి ఎన్నియుగములు గడచినా బయట అట్లేయుండును. మార్పుచెందు ప్రకృతి శరీరములో మారుచూ బాల్యము నుండి శరీరమును వృద్ధాప్యము వరకు తీసుకొని పోవుచున్నది. మొత్తము మీద ప్రకృతియే అన్నీ చేయుచున్న దని తెలియుచున్నది.

ఆత్మ పురుషతత్త్వము గలది. అలాగే జీవాత్మ కూడా పురుషతత్త్వము గలది. ఆత్మ, జీవాత్మ పరమాత్మనుండి వచ్చినవి. అందువలన ఆత్మను జీవాత్మను పురుషులు అని అనుచున్నాము. పరమాత్మను పురుషోత్తముడు అని అంటున్నాము. ఈ విషయము భగవద్గీతలో పురుషోత్తమప్రాప్తి యోగమున 18వ శ్లోకమందు **"అక్షరునికంటే శ్రేష్ఠుడు, క్షరునికంటే ఉత్తముడు అగుటవలన చెప్పిన జ్ఞానములోనూ చెప్పబోయే జ్ఞానములోనూ నన్నే పురుషోత్తమునిగా జ్ఞానులు చెప్పుచున్నారు"** అని గలదు. దేవుడు పురుషోత్తముడని చెప్పబడుచున్నాడు. ఆత్మ నాశనముగాని పురుషునిగా, జీవాత్మ నాశనమయ్యే పురుషునిగా చెప్పుచున్నారు. జీవాత్మ, ఆత్మ ఇద్దరినీ దేవుని దూతలుగానే చెప్పవచ్చును. దేవుని ఆజ్ఞమేరకు ఆత్మ కర్మలను అనుభవింపజేయువాడుగా ఉండగా, జీవాత్మ కర్మ అనుభవించువాడుగా యున్నాడు. దేవుని ఆజ్ఞమేరకు ప్రపంచములో ఇద్దరూ కీలక పురుషులుగా యున్నారు. అయితే అవిశ్వాసులు ఆత్మను, జీవాత్మను దేవునిలోని భాగములుగా లెక్కించక, ప్రకృతిలోని భాగములుగా లెక్కించి, వారిని కూడా స్త్రీ తత్త్వము గలవారిగా చెప్పుచున్నారు. ఈ విషయమును గురించి ఖుర్ఆన్ గ్రంథములో సూరా 53, ఆయత్ 27లో ఈ విధముగా చెప్పారు చూడండి. **(53-27) "పరలోకాన్ని విశ్వసించనివారు దైవదూతలకు ఆడవారి పేర్లు పెడతారు."** ఇక్కడ దైవదూతలు అనగా ఆత్మ, జీవాత్మలుగా లెక్కించాలి. వారికి ప్రకృతి ఏది? పురుషుడు ఎవరు? అను తారతమ్యము

తెలియదు. దేవున్ని విశ్వసించనివారికి ఆధ్యాత్మికము అంటే ఏమిటో తెలియదు. అందువలన ప్రకృతియంటే స్త్రీతత్త్వమని కూడా తెలియదు.

వివరముగా చెప్పుకొంటే ప్రకృతి స్త్రీయనీ, పరమాత్మ పురుషుడనీ ఇంతకుముందే చెప్పుకొన్నాము. దేవుడు మొదట ప్రకృతిని తయారు చేసి తర్వాత ఆత్మ, జీవాత్మలను సృష్ఠించాడు. ఆత్మ, జీవాత్మలు పరమాత్మలోని భాగములుగాయున్నాయి. ప్రకృతిని తన భార్యగా చేసుకొని, ప్రకృతి వలన తనవలన మిగతా జీవరాసులను సంతతిగా పుట్టించాడు. ఇక్కడ ప్రకృతి యనగా స్త్రీతత్త్వము అని తేలిపోయినది. జీవాత్మ, ఆత్మ కాకుండా మిగతా ఏది పుట్టినా ప్రపంచములో అది అంతయూ ప్రకృతి సంబంధమే. బయట ప్రపంచములో స్త్రీ, పురుష, నపుంసక జాతులు ఉన్నట్లే, కనిపించని వారు కూడా మూడు రకములుగాయున్నారు. స్త్రీ, పురుష, నపుంసకులలో జీవాత్మ, ఆత్మ, ప్రకృతితో తయారయిన శరీరములున్నట్లే కనపరాని దేవదూతలలో స్త్రీలు, పురుషులు, నపుంసకులు కూడా యున్నారు. వారు చేయు పనికి కర్మ ఉండదు. వారు కర్మను అనుభవించరు. గ్రహములు, భూతములు అను రెండు పేర్లుగా పిలువబడువారు ప్రపంచములో కనిపించెడు స్త్రీ, పురుష, నపుంసకులుగాయున్నట్లే కనిపించని దేవుని పాలనలో కూడా స్త్రీ, పురుష, నపుంసకులున్నమాట వాస్తవమే. అయినా బయట కనిపించే వారిని దేవుని పక్షము వారనీ, కనపరాని దేవుని పాలకులను ప్రకృతి పక్షము వారనీ రెండు రకములుగా విభజించి చెప్పవచ్చును. **'పురమునందు నివసించువారిని పౌరులు'** అని అంటాము. పాలనలోవున్న ఊరును పురము అంటాము. చివరకు పౌరులు అంటే పాలనలోయుండే పురములోని వారని అర్థము. స్త్రీ, పురుషులను పౌరులు అంటున్నాము. అలాగే పాలించేవారిని పాలకులు అంటున్నాము. పురములోనున్న వారిని పౌరులు అన్నట్లు,

పురములో లేనివారిని పాలకులు అంటున్నాము. పాలకులకు ఒక నివాసము అంటూ ఉండదు. అవసరమునుబట్టి స్థానమును మార్చుకొనుచుందురు. పురమును పాలించువారు పాలకులు, పురములో ఉండువారు పౌరులు అని జ్ఞాపకముంచుకోవాలి. పౌరులు కనిపించువారుగాయున్నారు. పాలకులు కనిపించనివారుగాయున్నారు. పౌరులలో స్త్రీ, పురుష, నపుంసకులున్నట్లే పాలకులలో కూడా స్త్రీ, పురుష, నపుంసకులున్నారు. అయితే పౌరులు ఆత్మల తరపున ఉన్నవారు, పాలకులు ప్రకృతి తరపున ఉన్నవారిగా విభజన జరిగినది. అయితే పౌరులు ప్రకృతివైపుకు పోయారు. పాలకులు దేవునివైపు పనిచేయుచున్నారు. పేరు ఏదయినా ఆచరణ పేరుకు తగినట్లుయుండదన్నట్లు ప్రకృతి, పరమాత్మయని రెండు భాగములుగా యున్న పాలకులు, పౌరులు దానికి వ్యతిరేఖదిశలలో పనిచేయుచున్నారు. ప్రజలు, సైన్యము అని ప్రజలలో రెండు రకములున్నట్లు ఆత్మలుగల వారిలోనే పౌరులు, పాలకులు రెండు రకములుగాయున్నారని తలచవలెను.

పౌరులలో అనగా మానవులలో ఆడవారైనా, మగవారైనా, నపుంసకులయినా వారిలో జీవాత్మ ఆత్మలుండును. జీవాత్మకు కర్మ యుండగా, ఆత్మ కర్మ ప్రకారము జీవాత్మను నడుపుచుండును. జీవాత్మను నడుపుటకు లోపలి ఆత్మేకాక బయట పాలన ఎంతో అవసరము. బయట పాలనలోని పాలకులలో స్త్రీ, పురుష, నపుంసకులలో జీవాత్మ అనబడునది ఉన్నదని పేరుకు చెప్పుకొన్నా అందులో జీవాత్మ లేదు. ఆత్మ ఒక్కటేయున్నది. ఆత్మయే జీవాత్మవలె నటించుచున్నది తప్ప ప్రత్యేకమయిన జీవుడు పాలకులలో లేడు. ఆత్మ ఎక్కడున్నా జోడు ఆత్మలుగా ఉండవలెనను సూత్రము పౌరులకేగానీ, పాలకులకు లేదు. అయినా పాలకులను కూడా భూతములు అని అంటున్నాము. అలాగే గ్రహములు అని కూడా

అంటున్నాము. గ్రహము అనగా గ్రహించుకొనునది. భూతము అనగా కనిపించని శక్తిగలది. ఎలా చెప్పినా రెండిటినీ ఆత్మయనియే చెప్పవచ్చును. అందులో జీవాత్మ ఉందనుటకు అలా చెప్పారుగానీ, ఆత్మే జీవాత్మ పాత్ర చేయుచున్నది. పాలకులయిన గ్రహములలో, భూతములలో కర్మ అంటుకొను విధానము లేదు. "కర్మయుంది అంటే జీవుడు ఉండాలి" అను సూత్రము ప్రకారము, కర్మ లేదు, జీవుడు లేడు. దేవుని పాలకులు ఎవరూ స్వయముగా ప్రవర్తించలేరు. వారు ఆత్మ ఆజ్ఞప్రకారము కదులుచున్నారు. ఏ పనిని చేసినా నేను చేశాను అను భావము వారిలో లేదు. ఆత్మ చేయిస్తే చేశానను భావము తప్ప వేరు భావము ఉండదు. అందువలన వారికి కర్మలేదు. పాలకులందరూ ప్రకృతివైపువారే, పాలించబడువారందరూ పురుషుని (పరమాత్మ) వైపువారు.

ఆధ్యాత్మికమును బాగా తెలిసినవారు అనగా ఆత్మల విభజన బాగా తెలిసినవారు దైవజ్ఞానము, ప్రకృతి విధానము బాగా తెలిసిన జ్ఞానులు ఇప్పుడు మేము చెప్పినట్లే దేవుని పాలకులు అయినవారందరూ అనగా దేవుని వైపునుండి పనిచేయు దేవదూతలందరూ స్త్రీ జాతివారనీ, దేవుని పాలనలోనున్న ప్రజలందరూ పురుషజాతివారనీ చెప్పడమైనది. దేవుని పాలకులు, ప్రజలు అందరూ దేవుని సంతానమే అయినా దేవదూతలు లేక దేవుని పాలనలోని పాలకులు దేవుని కుమార్తెలనీ, దేవుని పాలకుల చేత పరిపాలింపబడు ప్రజలను దేవుని కొడుకులనీ చెప్పుచున్నారు. పాలకులందరూ ప్రకృతివైపు వారని, ప్రకృతివైపు వారిని కూతుళ్ళు అనడము జరిగినది. అది ఎంతో గొప్ప జ్ఞానముతో కూడుకొన్నమాటగా యున్నదని చెప్పుచూ ఖుర్ఆన్ గ్రంథములో సూరా17, ఆయత్ 40లో ఈ విధముగా చెప్పారు. **(17-40) "మీ ప్రభువు (దేవుడు) మీకోసము కొడుకులను**

**కేటాయించి తన కోసము దూతలను కూతుళ్ళుగా చేసుకొన్నాడా? నిశ్చయముగా మీరు చాలా పెద్దమాట అంటున్నారు."** మరియొక చోట సూరా 52, ఆయత్ 39లో ఇలా వ్రాశారు చూడండి. **(52-39) "అల్లాకైతే అందరూ ఆడపిల్లలూ, మీకైతే అందరూ మగపిల్లలా?"** ఈ మాటను సామాన్యులు విని ఆశ్చర్యముగా అలాగనా! అంటున్నారు. ఇప్పుడు మీకు కూడా ఆశ్చర్యముగానే ఉంది కదా!

పై రెండు వాక్యములలో తెలిసిన జ్ఞానులు సత్యమే చెప్పగా కొందరికి అది ఆశ్చర్యముగా కనిపించునట్లు వ్రాశారు. అయితే కొందరు ముస్లీమ్‌లు ఈ మాటను తప్పు చెప్పినట్లు అనుకొన్నారు. వాక్యములో ఆశ్చర్యమున్నది, గొప్పమాట చెప్పారని కూడాయున్నది. ఎంతపెద్దమాట అని వ్రాసిన మొదటి వాక్యములో ఎంత తప్పుమాట అన్నట్లు వ్రాసుకొన్నారు. ఆధ్యాత్మికము తెలిసినవారు ఎవరూ దానిని తప్పుగా చెప్పుటకు వీలులేదు. దేవుడు కూడా ఆ మాటను తప్పుమాటగా ఎక్కడా చెప్పలేదు. అందువలన కొన్ని నిగూఢమైన వాక్యాలకు అర్థము తెలియకపోవడము సహజమే. అయితే వాటిని అర్థము చేసుకొనుటకు ప్రయత్నము చేయడములో తప్పులేదు కదా! ఇంతవరకు కొందరు ఒకే దేవున్ని మ్రొక్కాలి అంటున్నారు. కొందరు అనేకమందిని మ్రొక్కుచున్నారు. ఎవరిది తప్పు, ఎవరిది ఒప్పు అనుటకు దైవ గ్రంథములను చూడవలసిందే. దైవ గ్రంథములలో శాస్త్రబద్ధమైన జ్ఞానముండును. అందరూ దానిప్రకారము మంచేదో, చెడ్డేదో తెలియ వచ్చును. గ్రంథములని నిర్ణయము చూడకుండా ఎవరికి త్రోచినది వారు మంచిది అనుకొంటే మంచిదికాదు. దేవుడు ఒప్పుకోడు.

వాక్యములో కనిపించు విషయమును యోచించి తెలుసుకోకపోతే మనము దేవుడు చెప్పినది సరిగా గ్రహించుకోలేనట్లగును. భూమి,

ఆకాశములు అని వ్రాసినది చూచి బయటి ప్రపంచములోనికి పోయి కంటికి కనిపించునవే అని అనుకోకూడదు. ఆధ్యాత్మికవిద్య ప్రకారము శరీరములోపల భూమి, ఆకాశమున్నట్లు చూచుకొన్నప్పుడు సరియైన సమాధానములు దొరుకుననీ, కొంత జ్ఞానము తెలియుననీ చెప్పుకొన్నాము. సూర్య చంద్రులను దేవుడు సృష్ఠించాడు సూర్యుడు ఎక్కువ వెలుగు కలిగియున్నాడు, చంద్రుడు తక్కువ వెలుగు కలిగియున్నాడని చెప్పితే తక్కువ వెలుగు చంద్రునికీ, ఎక్కువ వెలుగు సూర్యునికీ ఉన్న విషయము అందరికీ తెలుసుకదా! దాని అవసరమేమి? అని ఇతరులు ప్రశ్నించవచ్చును. ఆ ప్రశ్నకు మనము ఏమీ జవాబు చెప్పలేము. వారు అడిగిన దానిలో కూడా న్యాయమున్నది కదా! ఆ విషయములో చెప్పుకొను జ్ఞానము ఏమీలేదు. అదే కొంత ఆలోచిస్తే ఆధ్మాత్మిక జ్ఞానము అందులో ఇమిడియున్నట్లు తెలియగలదు. ఇక్కడ ఒక విషయమును ఉదాహరణగా తీసుకొని దానిలో పైన కనపడు అర్థముయేమో, కనిపించకయున్న అర్థముయేమో చూస్తాము. సప్తాకాశములు అనుమాట ఒకచోట వచ్చినది. అది పైకి చూస్తే ఆకాశమున్నది గానీ సప్తాకాశము లేదు. సప్తాకాశము అంటే ఏమిటి? అని ఆలోచించవలసి వచ్చుచున్నది. సప్తాకాశములు అనుమాటను ఖుర్‌ఆన్‌లో సూరా 23, ఆయత్ 17లో ఈ విధముగా వ్రాశారు. **(23-17) "మేము మీపై సప్తాకాశములను సృష్ఠించాము. మేము సృష్ఠి విషయములో అజాగ్రత్తగా లేము."** ఇదే విషయమునే మరొకచోట సూరా 30, ఆయత్ 8లో ఇట్లు చెప్పారు. **(30-8) "ఏమిటి వారు తమపుట్టుక గురించి లోతుగా ఆలోచించడము లేదా! దేవుడు భూమి, ఆకాశములను వాటి మధ్యనున్న సమస్తమును అత్యుత్తమ రీతిలో నిర్ణీతకాలము కొరకు మాత్రమే నిర్మించాడు. అయితే**

**చాలామంది తమ ప్రభువును (దేవున్ని) కలుసుకోవాలను విషయమును మరచిపోయారు."** మరొకచోట ఇదే విషయమునే సూరా 67, ఆయత్ 3లో ఈ విధముగా చెప్పారు. **(67-3) "ఆయన ఏడు ఆకాశములను ఒక దానిపై ఒకటి నిర్మించాడు. నీవు ఎటు చూచినా కరుణామయుని సృష్టిప్రక్రియలో ఎటువంటి లోపము కానలేవు. కావాలంటే మరోసారి దృష్టిని సారించి చూడు. నీకేమయినా లోపము కనిపిస్తుందేమో!"** ఈ మూడు వాక్యములు వేరువేరుగాయున్నా భావము మాత్రము ఒకటే యున్నది. మొదటి వాక్యములో ఏడు ఆకాశములను సృష్టించాము, సృష్టి విషయములో జాగ్రత్తగా ఉంటాము అని అన్నారు. ఈ వాక్యములో ఏమీ ప్రశ్నించుటకు లేదుగానీ ఏడు ఆకాశములనునని అర్థముకావు. తర్వాత మూడవ వాక్యము 67-3లో మనిషి ఎంతో తెలియవలసినది ఉన్నది. ఏడు ఆకాశములను ఒకదానిమీద ఒకటి నిర్మించాను అన్నాడు. ఇక్కడ ఆకాశములను ఒకదానిమీద ఒకటి నిర్మించాననడము ఏమిటి? అట్లు బయట ఎక్కడా కనిపించలేదే? అను ప్రశ్న రాగలదు. బయట చూస్తే ఆకాశము ఒకటే కలదు. విమానములోగానీ, రాకెట్‌లోగానీ పైకిపోయి చూచినా ఎక్కడా ఆకాశము పొరలుగానీ, హద్దులుగానీ, ఒకదానిమీద ఒకటి మరొకటి ఉన్నట్లుగానీ కనిపించవు. విజ్ఞానశాస్త్రము ప్రకారము, ఖగోళశాస్త్రము ప్రకారము ఆకాశము అంతా ఒకటేగానీ, ఆకాశములో పొరలుగానీ, హద్దులుగానీ ఏమీ లేవు. అయితే ఏడు ఆకాశములనీ, అవి కూడా ఒకదానిమీద ఒకటనీ అంత అసత్యమును చెప్పవలసిన అవసరమేమి వచ్చినదని ఎవరయినా అడుగవచ్చును? రెండవ వాక్యములో **30-8 వాక్యములో ఒక ముఖ్యమైన మాటగలదు. "ఏమిటి, వారు తమ పుట్టుకను గురించి లోతుగా ఆలోచించలేదా?"** అని ఉండడమును చూస్తే ఇది ఏదో పైనగల ఆకాశములు కావనీ, మనిషి సృష్టికి సంబంధించిన

విషయమనీ కొద్దిగా అర్థమగుచున్నది. అదే వాక్యములోనే **"దేవుడు భూమి, ఆకాశములను వాటి మధ్యనయున్న సమస్తమునూ అత్యుత్తమరీతిలో నిర్మించాడు"** అని ఉంది. అంతేకాక ముఖ్యముగా గమనించవలసిన విషయమేమనగా! **"నిర్ణీత కాలము వరకే నిర్మించాడు"** అని ఉన్నది. నిర్ణీత కాలము అంటే ఏమిటో? కొంత ఆలోచించవలసిన పనిగలదు. ఈ వాక్యములో ఎంతో విలువయిన జ్ఞానమును దాచిపెట్టి దేవుడు మనకు అందించినట్లయినది. ఇటువంటి నిగూఢమైన వాక్యములను ముస్లీమ్‌లు అర్థము చేసుకోవాలంటే చాలా కష్టము. వాటికి వివరము ఆధ్యాత్మికములో కొమ్ములు తిరిగినవారు కూడా చెప్పడము కష్టమే. ఎక్కడా తిరిగి ప్రశ్న ఉద్భవించకుండా జవాబును చెప్పవలసియుండును. ఎక్కడయినా ప్రశ్నవచ్చి దానికి జవాబు లేకపోతే అది సంపూర్ణ జ్ఞానము అనిపించుకోదు. సంపూర్ణ జ్ఞానమును తెలియుటకు ప్రయత్నిద్దాము.

30-8 వాక్యములో చెప్పినట్లు మన పుట్టుకలను గురించి లోతుగా ఆలోచిస్తే మనిషి పుట్టుకలో వచ్చిన శరీరములో దేవుని సృష్ఠి చాలా గొప్పగా కనిపించుతూయున్నది. శరీరమును అర్థము చేసుకొనే కొద్దీ దేవుడు చెప్పిన జ్ఞానము కూడా అర్థమగుచున్నది. దేవుడు భూమినీ, ఆకాశములనూ వాటి మధ్యలోనున్న సమస్తమునూ అత్యుత్తమరీతిలో సృష్ఠించాను అని అన్నాడు. భూమి, ఆకాశము విషయములో మేము ఇంతకుముందే ఒకటి రెండు చోట్ల బయట ఆకాశమును, భూమిని చూడవద్దండి. భూమి, ఆకాశము రెండూ మన శరీరములోనే ఉన్నాయని చెప్పియున్నాము. ఇప్పుడు కూడా అదే విషయమునే చెప్పుచూ శరీరములో క్రిందయున్న పాదములను భూమిగా లెక్కించుకొని, తలను ఆకాశముగా లెక్కించుకోవలెను. క్రింద కాళ్ళు, పైన తల మధ్యలోనున్న శరీరమునంతటినీ కలిపి భూమి ఆకాశముల

మధ్యనున్న సమస్తము అని అన్నారు. ఆ లెక్క ప్రకారము దేవుడు చెప్పిన భూమి ఆకాశము వాటి మధ్యలోనిది అంతా కలిపి ఆధ్యాత్మిక దృష్ఠితో చూస్తే అది మన శరీరము తప్ప వేరు ఏదీ కాదు. ఆకాశములు ఏడు ఒకదానిమీద ఒకటిగలవని కూడా పై చివరి వాక్యములో గలదు. ఆకాశము అంటే తలయని చెప్పుకొన్నాము కదా! తలనుంచి బయలుదేరి క్రింది వరకు వీపులో వ్యాపించియున్న వెన్ను నరము మొత్తము ఏడు భాగములుగా ఉండుట అందరికీ తెలుసు. వెన్నులో పెద్ద నరమయిన బ్రహ్మనాడి తలలోనుండి క్రింద గుదస్థానము వరకు ఉన్నది. అలా ఉన్నది మొత్తము ఏడు నాడీకేంద్రములుగాయున్నది. పైన ఏడవ నాడీకేంద్రమును ఏడవ ఆకాశము అంటున్నారు. మెదడు ఏడవ కేంద్రముగా ఉండుట వలన దానిని ఏడవ ఆకాశమని చెప్పవచ్చును. 'నాడీ అనగా ఎదురులేనిది' అని అర్థము. 'అడ్డు లేనిది' అని కూడా చెప్పవచ్చును. ఆకాశము శూన్యముగా ఉండును కావున దానిని అడ్డులేనిది, ఎదురులేనిది అని చెప్పవచ్చును. కత్తి తీసుకొని ఆకాశములో ఎటు త్రిప్పినా దానికి ఢీ కొనునది ఏదీ లేదు. ఆకాశములో కత్తిని పైనుండి క్రిందికి, క్రిందినుండి పైకి త్రిప్పినా, ఆకాశములో అడ్డముగా నరికినట్లు త్రిప్పినా కత్తిని ఢీకొనునది ఏదీలేదు. **నా** అనగా **లేదు** అని అర్థము గలదు. ఆకాశములో ఢీకొనునది ఏదీలేదు కావున ఆకాశమునకు మరొకపేరు 'నాడీ' అని అనుచున్నాము. నాడీ అంటే దానిని ఢీకొట్టునది లేదని చెప్పవచ్చును. ఆకాశము శూన్యమయి నందున, శూన్యమును ఢీకొనునది ఏదీ లేనిదానివలన నాడీ అనుపేరుతో ఆకాశమును చెప్పవచ్చును. శరీరములో వెన్నుపాముయందు, లేక బ్రహ్మనాడి యందు ఏడు నాడీకేంద్రములుండుట వలన ఆ ఏడు నాడీకేంద్రములను ఏడు ఆకాశములుగా చెప్పారు. ఏడు ఆకాశములు శరీరములో ఉన్నాయిగానీ, బయటలేవు. బయట ఉన్నది ఒక ఆకాశమే.

నాడీకేంద్రములు క్రిందినుండి ఒకదానిమీద ఒకటి ఉండడము వలన పై వాక్యములో ఏడు ఆకాశములను ఒకదానిమీద ఒకటి నిర్మించాము అని దేవుడు చెప్పాడు. ఏడు నాడీకేంద్రములను ఏడు ఆకాశములుగా చెప్పిన తర్వాత భూమికి ఆకాశమునకు మధ్యయున్న సమస్తమును అత్యుత్తమరీతిలో సృష్ఠించాను అన్నాడు. ఆ మాట వాస్తవమే. తలనుండి కాళ్ళవరకుయున్న మధ్య శరీరములో ఎన్నో ఎముకలు, కండలు ఉండడమే కాక, ఎన్నో గ్రంథులు, ఎన్నో ముఖ్యమైన అవయవములు, రక్తమును శుభ్రముచేయు ఊపిరితిత్తులను, రక్తమును వడబోయు మూత్రపిండములను, రక్తమును ప్రసరింపజేయుటకు ఉపయోగపడు గుండెను, రక్తమును పరీక్షించి పంపు కాలేయమును ఎన్నో ముఖ్యమైన అవయవములను ఎవరూ తయారు చేయలేని విధముగా ఉత్తమరీతిలో తయారుచేసియుంచాడు. అందువలన భూమి ఆకాశముల మధ్యలోనున్న సమస్తమును సృష్ఠించాడు అని చెప్పారు. ఇక్కడ చెప్పుకోవలసిన ముఖ్యమైన విషయము ఏమంటే? ఎంతో ఉత్తమ రీతిలో తయారు చేయబడిన శరీరమును నిర్ణీత గడువువరకు ఉండునట్లు ముందే అవయవములను దేవుడు తయారుచేసి శరీరములో ఉంచాడు. దేవుడు నిర్ణయించిన గడువు అయిపోయిన వెంటనే ఆ అవయవములు పనిచేయవు. మందుల తయారీలో మాన్యుఫ్యాక్చర్ తేదీని తర్వాత ఎక్స్‌పైర్డ్ తేదీని మందుల పట్టీ మీద వ్రాసి పెట్టినట్లు ప్రతి అవయవమునకు ఎక్స్‌పైర్డ్ తేదీని (పని చేయకుండా చనిపోవు తేదీని) నిర్ణయించి కర్మపత్రములో ముద్రించి పంపియుండును.

శరీరములో ఏ అవయవము ఎప్పుడు ఎట్లు పనిచేయవలసినదీ, ఎప్పుడు పూర్తిగా నిలిచిపోవునదీ దేవుడు ముందుగానే నిర్ణయించిన దానివలన ఎప్పుడు ఏ అవయవమునకు ఏ రోగము రావాలో ఆ రోగమే

వస్తున్నది. ఈ విధముగా జీవితములో అవయవములు హెచ్చుతగ్గులుగా పనిచేయునట్లు దానివలన రోగములు అప్పుడప్పుడు ఆయా అవయవము లకు వచ్చునట్లు దేవుడు చేయడమేకాక అన్ని అవయవములు ఒక గడువు వరకే పనిచేయునట్లు నిర్ణయించి నిర్మించియుండుట వలన ఆ గడువుకు ఖచ్చితముగా మరణము సంభవించుచున్నది. ఈ విషయమునే 30-8 వాక్యములో 'నిర్ణీత కాలము వరకు నిర్మించాడు' అని వ్రాయబడియున్నది. వాక్యము మొదటిలో తమ పుట్టుకను గురించి లోతుగా ఆలోచించడము లేదా? అని ప్రశ్నించాడు. ఖుర్ఆన్ గ్రంథమును చదివిన ఏ ముస్లీమ్‌కయినా ఈ మాట ప్రశ్నగానేయున్నది. దానిప్రక్కనే ఎవరి దృష్టికీ అందనిరీతిలో వాక్యమును ఇలా చెప్పాడు. **"దేవుడు భూమి ఆకాశమును వాటి మధ్యనున్న సమస్తమును అత్యుత్తమరీతిలో నిర్ణీతకాలము కొరకు మాత్రమే నిర్మించాడు."** ఈ మాట సాధారణముగానే కాకుండా సావధానముగా ఆలోచించిన ఎవరి దృష్ఠీ శరీరములోనికి పోదు. ఏ వాక్యమునూ సూక్ష్మముగా చూడకూడదని వ్రాసుకొన్నవారికి ఈ సూక్ష్మ జ్ఞానము అర్థము కాగలదా?యని దేవుడు ప్రశ్నించుచున్నాడు.

30-8 వాక్యములో చివరియందు ఒక ముఖ్యమైన మాట చెప్పారు. అది ఏమనగా! "చాలామంది దేవున్ని కలుసుకోవాలను విషయమును మరచి పోయారు'' అని కలదు. ఎటు తిరిగి స్వర్గానికి పోయి సుఖాలు అనుభవించాలని అనుకోవడము తప్ప తమ దేవునివద్దకు పోవాలను ఆలోచనగానీ, దిగులుగానీ ఏమాత్రము ఎవరికీ లేదు. దేవునివద్దకు చేరాలనుకొనువారికి అతనికున్న శ్రద్ధవలన అర్థముకాని విషయములు కూడా అర్థము కాగలవు. అందువలన దేవునియందు చేరాలనీ ఈ జన్మలు వద్దనీ దేవున్ని కోరుకోండి. సప్తాకాశములు శరీరములోనే ఉన్నాయి అని

చెప్పాను. ఇప్పుడు దానికి తోడు మరొకమాటను కూడా చెప్పుచున్నాను చూడండి. బయట ఆకాశములో సూర్యుడు, చంద్రుడు ఉండుట అందరికీ తెలిసిన విషయమే. నేను ముందునుంచీ ఒక విషయమును చెప్పుచునే యున్నాను. శరీరము బయట దేవుడున్నాడు, శరీరములోపల దేవుడున్నాడు. శరీరము బయట దేవున్ని తెలియాలంటే చాలాకష్టము. భూమినుంచి ఆకాశము వరకు విశాలముగాయున్న వానిని తెలియలేము. అదే భూమి ఆకాశము, అదే దేవుడు శరీరములో యున్నప్పుడు శరీరములో కొద్దిపాటి జాగాలో వెదకి దేవున్ని తెలియవచ్చును. బయలు ఉన్నదానినే శరీరము లోపల పెట్టి దేవుడు మంచి అవకాశమును ఇచ్చాడు. దేవుడిచ్చిన అవకాశమునుబట్టి దేవున్ని సులభముగా తెలియవచ్చును. భగవద్గీతలో క్షేత్రక్షేత్రజ్ఞ విభాగయోగమను అధ్యాయమున 18వ శ్లోకమందు భావము ఇలా కలదు. **"జ్యోతులలోకెల్ల మిక్కిలి పెద్ద జ్యోతియగుచు, ప్రకృతికంటే వేరుగా నున్న దేవుడు జ్ఞానము, జ్ఞానగమ్యమైన పరమాత్మ సర్వజీవరాసుల హృదయములో (బ్రహ్మనాడిలో) నివాసమైయున్నాడు."** శరీరములోని బ్రహ్మనాడిలో దేవుడున్నాడని దేవుడే తెలియజేసినప్పుడు విశాలముగానున్న ప్రపంచములో వెదుకుట తెలివితక్కువ పనియగును. అందువలన శరీరము లోనే తెలియుటకు ఖుర్‌ఆన్‌లోని కొన్ని ఆయత్‌లనుగానీ, లేక భగవద్గీతలోని కొన్ని శ్లోకములనుగానీ, లేక బైబిలులోని కొన్ని వాక్యములనుగానీ ఆధారము చేసుకోవలెను.

ఇంతకు ముందు ఏడు ఆకాశములను గురించి చెప్పుకొన్నాము. ఇప్పుడు ఆకాశములోని సూర్యచంద్రులను గురించి తెలియగలిగితే సూర్య చంద్రులు మారుపేరుతో, మారురూపముతో శరీరములోగలరని తెలియు చున్నది. అదెలా సాధ్యము అని చూచిన ఇలా తెలియగలదు. బ్రహ్మనాడిలో

దేవుడున్నాడు. బ్రహ్మనాడి ఏడు నాడీకేంద్రములుగా విభజింపబడియున్నది. దానినే ఏడు ఆకాశములు అని చెప్పడమైనది. బ్రహ్మనాడి ప్రక్కలో కుడిఎడమగా రెండు ముఖ్యమైన నాడులుగలవు. వాటిని ఇడ, పింగళ అని రెండిటిని అంటారు. ఇడ, పింగళ నాడులనే సూర్య చంద్రనాడులని చెప్పవచ్చును. బ్రహ్మనాడినుండి బయటికి వచ్చిన చిన్నచిన్న నాడులు సూర్యచంద్రనాడులతో కలిసి అక్కడినుండి శరీరమునకు బయలు దేరుచున్నవి. సూర్యచంద్రులు బయట ఎట్లున్నారో లోపల సూర్యచంద్ర నాడుల శక్తికూడా అట్లేయున్నది. సూర్యచంద్ర నాడులనుండి బయలు దేరిననాడులు ఊపిరితిత్తులతో సంబంధపడియున్నవి. సూర్యచంద్రనాడులు బ్రహ్మనాడినుండి వచ్చు ఆత్మశక్తిని ఉపయోగించుకొని ఊపిరితిత్తులను ఎల్లప్పుడూ కదిలించుచూ శ్వాసను ఆడునట్లు చేయుచున్నవి. శరీరములో శ్వాస ఆడుచున్నదంటే అది సూర్య చంద్రనాడుల ద్వారానే జరుగుచున్నదని తెలియవలెను. బయట ప్రపంచములో సూర్యచంద్రులను గుర్తించినట్లే ఇది సూర్యుడు, ఇది చంద్రుడు అని మన శరీరములో కూడా గుర్తించుటకు అవకాశమున్నది. సూర్యుడు బయట పగలుపూట ఎక్కువ ప్రకాశవంతముగా ఉండును. రాత్రిపూట కనిపించడు. ఆకాశములో రాత్రిపూట కనిపించు వాడు చంద్రుడు. చంద్రుడు సూర్యునంత ప్రకాశము లేకుండా కొంత కాంతివంతముగా ఉండును. సూర్యుని వెలుగును సూర్యరశ్మి అంటాము. చంద్రుని వెలుగును వెన్నెల అంటాము. సూర్యరశ్మి (ఎండ) వేడిగా ఉంటుంది. వెన్నెల చల్లగా ఉంటుంది.

శరీరములోయున్న సూర్యచంద్రులు వారి నాడుల ద్వారా శరీరముతో సంబంధము కల్గియున్నారు. వారి సంబంధము ముక్కు రంధ్రములలో ఆడే శ్వాసతో సంబంధపడియున్నది. పగలు సూర్యుడు,

రాత్రి చంద్రుడు ఉన్నట్లు రెండు ముక్కురంధ్రములలో ఒకటి సూర్యుని గుర్తుగా, మరొకటి చంద్రుని గుర్తుగాయున్నది. సూర్యుడు కాంతిలో ఎక్కువ వాడు గనుక సూర్యనాడి సంబంధ శ్వాస ముక్కు రంధ్రములో ఎక్కువగా కనిపించుచుండును. అట్లే చంద్రనాడి శ్వాస ముక్కురంధ్రములో తక్కువ కనిపించుచుండును. రెండు ముక్కురంధ్రములలో శ్వాస ఆడు విధానమును గ్రహించితే, ఒక ముక్కురంధ్రములో ఎక్కువగాలి, మరొక ముక్కు రంధ్రములో తక్కువగాలి వచ్చిపోవుచుండును. ఇది అందరి శరీరములో ఉండే విధానమే కావున, ఎక్కువ గాలివచ్చు ముక్కురంధ్రమును సూర్యనాడియనీ, తక్కువ గాలివచ్చు ముక్కురంధ్రమును చంద్రనాడియని గుర్తుపట్టవచ్చును. కుడిప్రక్కన ముక్కురంధ్రములో శ్వాస ఎక్కువ వచ్చిపోతూ ఎడమప్రక్కన ముక్కురంధ్రములో శ్వాస తక్కువ వచ్చిపోతూవుంటే ఆ సమయములో సూర్యనాడి కుడిప్రక్క, చంద్రనాడి ఎడమప్రక్క ఆడుచున్నదనీ తెలియవలెను. ఒక్కో సమయములో శ్వాసలు ఒక్కొక్క రకముగాయుండును. సూర్యుడు శరీరములో కుడిప్రక్కయుంటే కుడిప్రక్క ముక్కురంధ్రములో గాలి ఎక్కువ రావడము జరుగును. అప్పుడు దానిని అనుసరించి ఎడమ ప్రక్క రంధ్రములో గాలి తక్కువ వచ్చుచుండును. సూర్యచంద్రులు శరీరములో కుడిప్రక్కవారు ఎడమప్రక్కకు ఎడమప్రక్కవారు కుడిప్రక్కకు మారుచుందురు. అందువలన సూర్యనాడి ఎల్లప్పుడు కుడిప్రక్కనే ఉండదు. అప్పుడప్పుడు ఎడమప్రక్కన కూడా ఉండును. ఈ విధముగా ముక్కురంధ్రములలో ఆడే గాలినిబట్టి ఎక్కువ కాంతియుండువాడు సూర్యుడు అన్నట్లు, ఎక్కువ గాలి వచ్చు రంధ్రమును సూర్యనాడిగా గుర్తించవచ్చును. తక్కువగాలి వచ్చు రంధ్రమును చంద్రనాడిగా గుర్తించవచ్చును. సూర్యుడు మనకి కుడిప్రక్కన ఉన్నప్పుడు చంద్రుడు ఎడమప్రక్కనయుండును. బయట ప్రపంచములో పున్నమిరోజు

చంద్రుడు తూర్పువైపున పుట్టుచుంటే సూర్యుడు పడమరవైపున మునిగిపోవు చుండును. అదే విధముగా శరీరములో కూడా కుడిఎడమల గానే సూర్యచంద్రనాడులుండును. రెండు ముక్కు రంధ్రములలో ఏ మనిషికీ సమాన శ్వాస ఉండదు.

మనిషి అనువాడు ఏ మతస్థుడయినాగానీ వాని ముక్కురంధ్రము లలో ఒక రంధ్రములో ఎక్కువ గాలి, మరొక రంధ్రములో తక్కువ గాలి వచ్చుచుండును. సూర్యచంద్రులు అమావాస్యకు, పున్నమికి దిశలు మార్చుకొన్నట్లు శ్వాస కూడా అప్పుడప్పుడు మారుచూ కుడిప్రక్క ఎక్కువవచ్చునది అప్పుడప్పుడు ఎడమప్రక్కకు మారిపోయి ఎడమప్రక్క ఎక్కువ కుడిప్రక్క తక్కువ వచ్చును. శరీరములో ఎవరి ప్రమేయము లేకుండా అనగా బయటి మనిషి ప్రయత్నము లేకుండానే మారిపోవుచుండును. శరీరములోని ఆత్మే ఆ విధముగా మారునట్లు చేయుచున్నది. మనిషి శరీరములో శ్వాస రెండు ముక్కురంధ్రములలో ఎక్కువ తక్కువగా ఆడుచుండుట వలన పోతులూరి వీరబ్రహ్మముగారు తన తత్త్వములో శ్వాసలను కడవ ముంత అని రెండు రకములుగా ఒకటి పెద్దదిగా మరొకటి చిన్నదిగా ఉండునట్లు చెప్పాడు. **'కాళ్ళు, చేతులు లేనివాడు కడవ ముంత చేతబట్టి'** అని వాక్యమును వ్రాశాడు. కాళ్ళు చేతులు లేనివాడు అనగా రూపము లేని శ్వాస అని అర్థము. శ్వాస గాలిగాయుండుట వలన దానిని కాళ్ళు చేతులు లేనివాడు అని అన్నాడు. రెండు ముక్కురంధ్రములలో ఒక దానియందు ఎక్కువ, ఒకదానియందు తక్కువ ఆడుచుండుట వలన మట్టితో చేసిన పెద్ద కడవను, చిన్న ముంతను దానికి పోల్చి చెప్పారు. ఇదంతయూ శరీరములోని ఆత్మజ్ఞానము అయినందున అంతిమ దైవగ్రంథము ఖుర్‌ఆన్‌లో సూరా 10, ఆయత్ 5 లో ఈ విధముగా చెప్పారు చూడండి.

**(10-5) "సూర్యున్ని ప్రకాశమానముగానూ, చంద్రున్ని కాంతివంతము గానూ చేసినవాడు దేవుడే. మీరు సంవత్సరముల సంఖ్యనూ, లెక్కలనూ తెలుసుకోవడానికి చంద్రుని దశలను కూడా ఆయనే నిర్ధారించాడు. దేవుడు వీటిని సత్యబద్ధముగా తప్ప నిరర్థకముగా తయారు చేయలేదు. తెలుసుకోగల వారికొరకు దేవుడు ఈ సూచనలను విడమరచి చెప్పుచున్నాడు."**

బుద్ధిగ్రాహిత శక్తియున్నవాడు గ్రహించుకొనునట్లు ఈ ఆయతులను దేవుడు చెప్పాడు. ఇక్కడేకాక మరొకచోట సూరా 71, ఆయత్ 15,16లలో కూడా ఈ విధముగా చెప్పారు. **(71-15) "దేవుడు సప్తాకాశలను (ఏడు ఆకాశములను) ఎలా ఒకదానిపై ఒకటిగా సృష్టించాడో మీరు చూడడము లేదా? (71-16) "మరి వాటిలో చంద్రున్ని కాంతి వంతముగా చేశాడు. సూర్యున్ని దేదీప్యమానముగా చేశాడు."** 15వ వాక్యమును చూచిన తర్వాత కూడా గూఢార్థముగా చెప్పకూడదు అను వారుండరని అనుకుంటాను. ఏడు ఆకాశములను ఒకదానిమీద ఒకటి ఎలా సృష్టించాడో మీరు చూడడము లేదా? అని అంటే శరీరములో ఉన్న విధానము మీకు తెలియదా, ఇంకా తెలుసుకోవడము లేదాయని ప్రశ్నించి నట్లున్నది. 10-5లో మీరు సంవత్సరముల సంఖ్యను లెక్కలను తెలుసు కోవడానికి చంద్రునికి దశలను కూడా నిర్ధారించాము అని చెప్పినప్పుడు, బయట సంవత్సరములను తెలుసుకోవడానికి సూర్యున్నిబట్టి లెక్కించవచ్చును గానీ చంద్రున్నిబట్టి లెక్కించము. ఇక్కడ సంవత్సరములను లెక్కించడానికి చంద్రుని దశలను తయారు చేసి నిర్ధారించాము అని ఉంది అంటే బయట ప్రపంచము లెక్కకాదు మనిషి శరీరములో ఎంతకాలము బ్రతుకవలెనో ఎట్లు బ్రతుకవలెనో దాని లెక్క అని అర్థమగుచున్నది. చంద్రదశలు మనిషి

జీవితమునకు సంబంధించినవి. జ్యోతిష్యశాస్త్రములో చంద్రుని దశలనుబట్టి మనిషి ఇలా బ్రతుకగలడనీ, ఇంత ఆయుష్షు వరకు బ్రతుకగలడనీ చెప్పు చుందురు. ఇక్కడ అందరికీ తెలుసు చంద్రదశలు బయట ప్రపంచము నకు వర్తించవు. బయట ప్రపంచమునకు సూర్యగమనమునుబట్టి నెలలు, సంవత్సరములు నిర్ణయమయినాయి. సూర్యగమనములో పన్నెండు రాశు లను సూర్యుడు దాటిపోతే ఒక సంవత్సరమనీ, అలా అరవై (60) సంవత్సరములు గడచునంతవరకు వాటికి అరవై పేర్లుగలవనీ, అవియే ప్రభవ, విభవ అను పేర్లు అనీ చెప్పుచున్నారు. చంద్రదశలు బయట సంవత్సరములను లెక్కించవు. మనిషి పుట్టిన నక్షత్రమునుబట్టి చంద్ర దశలు లెక్కించి చెప్పుదురు. చంద్రదశలు పన్నెండు గలవు. పన్నెండు దశలు అయిపోవుటకు 120 సంవత్సరములు పట్టును. మనిషి జీవితములో దశల కాలమును క్రింద కనబరుస్తున్నాము చూడండి.

| గురుపార్టీ దశలు | | శనిపార్టీ దశలు | |
|---|---|---|---|
| 1) సూర్యుని దశ | - 10 సం॥ | 7) శని దశ | - 13 సం॥ |
| 2) చంద్ర దశ | - 10 సం॥ | 8) బుధ దశ | - 10 సం॥ |
| 3) కుజ దశ | - 7 సం॥ | 9) కేతు దశ | - 7 సం॥ |
| 4) రాహు దశ | - 10 సం॥ | 10) శుక్ర దశ | - 13 సం॥ |
| 5) గురు దశ | - 13 సం॥ | 11) మిత్ర దశ | - 7 సం॥ |
| 6) భూమి దశ | - 13 సం॥ | 12) చిత్ర దశ | - 7 సం॥ |
| మొత్తము సం॥ | 63 సం॥ | మొత్తము సం॥ | 57 సం॥ |

**దశా సంవత్సరములు వరుస క్రమముగా వ్రాసుకుంటే ఇలా కలవు.**

| | | | |
|---|---|---|---|
| 01) | సూర్య దశ కాలము | - | 10 సంవత్సరములు |
| 02) | చంద్ర దశ కాలము | - | 10 సంవత్సరములు |
| 03) | కుజ దశ కాలము | - | 7 సంవత్సరములు |
| 04) | రాహు దశ కాలము | - | 10 సంవత్సరములు |
| 05) | గురు దశ కాలము | - | 13 సంవత్సరములు |
| 06) | భూమి దశ కాలము | - | 13 సంవత్సరములు |
| 07) | శని దశ కాలము | - | 13 సంవత్సరములు |
| 08) | బుధ దశ కాలము | - | 10 సంవత్సరములు |
| 09) | కేతు దశ కాలము | - | 7 సంవత్సరములు |
| 10) | శుక్ర దశ కాలము | - | 13 సంవత్సరములు |
| 11) | మిత్ర దశ కాలము | - | 7 సంవత్సరములు |
| 12) | చిత్ర దశ కాలము | - | 7 సంవత్సరములు |

చంద్రదశలు మనిషి పుట్టుకనుబట్టియుండుట వలన, మనిషి జీవితమును నడుపునవిగా ఉండుట వలన ఇక్కడ చెప్పిన వాక్యములన్నిటినీ శరీర అంతరంగములోనే వివరించి చెప్పుకోవలెను. అలా చెప్పుకొన్నప్పుడే ప్రశ్నరాని సమాధానములు దొరుకును. అట్లుకాక బయట అర్థము తీసుకొంటే ఏమాత్రము అర్థముకాదు. దేవుడు చెప్పిన భావము పూర్తిగా చెడిపోవును. దేవుని ఉద్దేశ్యమే మనకు చేరదు. అందువలన వీటిని అంతర్ముఖముగానే అర్థము చేసుకోవాలి. ఇంత వివరముగా చెప్పినా దేవుని జ్ఞానముపట్ల గ్రుడ్డిగా వ్యవహరించే మనుషులకు దేవుడు తర్వాత ఏమీ అర్థము కాకుండా చేయగలడు. శరీరములోని బుద్ధికూడా దేవుని

19 మంది దూతలతో ఒకడైయుండుట వలన బుద్ధిని సక్రమముగా లేకుండా వక్రమముగా మార్చివేస్తే, అది దేవుని ఆజ్ఞ (ఆత్మ ఆజ్ఞ) ప్రకారము దేవుని విషయములలో తప్పుదారి పట్టించి నీవున్నది మంచిమార్గములోనేయని వాని బుద్ధి చెప్పును. అప్పుడు అతడు తన బుద్ధి ప్రకారము నేను నిజమైన జ్ఞానములో ఉన్నానని అనుకొనుచుండును. ఇదే విషయమునే వివరించి చెప్పుచూ ఖుర్ఆన్ గ్రంథములో సూరా 43, ఆయత్ 36,37లలో ఈ విధముగా చెప్పారు. **(43-36) "కరుణామయుడయిన దేవుని స్మరణపట్ల గ్రుడ్డిగా వ్యవహరించే వ్యక్తిపై మేము సైతానును నియమిస్తాము. ఇకవాడే అతనికి సహవాసిగా ఉంటాడు." (43-37) "ఆ సైతాను వాడు సన్మార్గమున పోకుండా అడ్డుకుంటాడు. మరి వారేమో మేము సన్మార్గముపైనే ఉన్నామని భ్రమపడుచూ వుంటారు."**

దేవుని వాక్యములను సరియైన పద్ధతిలో అర్థము చేసుకోకుండా అందులో ఉండేది ఇంతే, ఇంతకంటే ఏమీలేదు అనేవారి గర్వమును చూచి దేవుడు బుద్ధియను దూతను వానిఎడల సైతానుగా మార్చి తప్పుదారిలో నడిపించునట్లు చేయును. అటువంటివారు తాము తప్పుదారిలో యున్నామను విషయము తెలియక మేము అందరికంటే మంచిమార్గములో ఉన్నామనుకొనుచుందురని పై వాక్యములలో తెలుపడమైనది. అందువలన **జ్ఞాన విషయములవద్ద నాకు తెలుసు అను గర్వముకంటే నాకు తెలియదు అను వినయమును పెట్టుకోండి.** ఇక్కడ ముఖ్యముగా చెప్పుచున్నది దేవుని వాక్యమును సరిగా అర్థము చేసుకోమని, అపార్థము చేసుకోవద్దనియే చెప్పు చున్నాము. మేము చెప్పునది మంచేగానీ, చెడుకాదు. మనిషి తిండి విషయములో దేవుడు ప్రథమ దైవగ్రంథములో కొన్ని మాటలను చెప్పాడు. అక్కడ అంతా కర్మనుబట్టి ఆహారము మనిషికి దొరుకుతుంటుంది. వాని

ఇష్టమునుబట్టి దొరకదు అని చెప్పాడు. ఆ మాటను అర్థము చేసుకోలేని కొందరు నేను హోటల్‌కుపోయి అక్కడున్న పదార్థముల పట్టిక చూచి నా ఇష్టముప్రకారము నేను చెప్పిన దానినే తెచ్చి పెట్టుచున్నారు కదా! అప్పుడు నా ఇష్టప్రకారమే ఆహారము దొరికినది కదా! మీరు ఎవరి ఇష్టప్రకారము ఆహారము లభించదు, కర్మనుబట్టి ఆహారము లభించునని చెప్పారు కదా! ఇక్కడ కర్మ అను ప్రసక్తే లేదు కదా! నా ఇష్టప్రకారమే జరిగినది కదా! కర్మప్రకారము ఏమీ జరుగలేదు కదా! అని అడుగవచ్చును. దానికి మా సమాధానము ఈ విధముగా కలదు. దేవుడు ఏది చెప్పినా అందులో అసత్యము ఉండదు. అది సత్యముగా ఉండడమేకాక, శాస్త్రబద్ధమై ఉంటుంది. మనకు పూర్తి వివరము తెలియక పై వాక్యములలో చెప్పినట్లు నాకు తెలుసు అనుకోవడమే పొరపాటు. హోటల్ పట్టికలోనున్న ఆహారమును నా ఇష్టముప్రకారము నేను అడిగాను కదా! అక్కడ కర్మ అనునది ఏమీ లేదు కదా! అని అడిగినదానికి ఖచ్చితమైన జవాబు కొరకు ప్రశ్న ఏమంటే? నీ ఇష్టము అనునది ఎక్కడనుంచి వచ్చినదో నీకు తెలుసా? శరీరములో జరుగు యంత్రాంగమును గురించి ఏమీ తెలియకనే పైన జరుగు పనులనుబట్టి అన్నీ నేనే చేస్తున్నాను కదా! అనుకొనినా ఏది నీవు చేయలేదు. అన్నీ నా ఇష్టము ప్రకారమే నేను తెప్పించుకొన్నాను కదా! అనినా అక్కడ కూడా నీ ఇష్టము ఏమీ లేదు. నీ శరీరములో కర్మచక్రము ఉంది, ఆ సమయానికి ఏది తినాలని నిర్ణయమై ఉన్నదో, దానినే తినునట్లు కర్మ బుద్ధిని ప్రేరేపించగా దానిని నీవు అడిగావు. అలా నీవు ఇష్టపడి అడిగిన దాని వెనుక కర్మయే పని చేసిందిగానీ, నీవు ఏమీ చేయలేవు. నేను చాలామార్లు చెప్పాను. శరీరములో జీవుడు గ్రుడ్డివాడు, చెవిటివాడు అన్ని విధములా అవిటివాడు అని చెప్పుచునే వస్తున్నాము. శరీరములో

నీతోపాటుయున్న మిగతా భాగములు పనిచేయగా, ఆత్మ చేయించుచుండగా శరీరము ద్వారా పనులు జరుగుచున్నవి. జరుగుచున్న పనులను ప్రక్కనుండి చూస్తున్న నీవు నేనే చేయుచున్నానని అనుకోవడము తెలివి తక్కువ అనీ, అజ్ఞానమనీ రెండు విధముల చెప్పవచ్చును. భగవద్గీతలో మోక్ష సన్న్యాసయోగమున 61వ శ్లోకమున **"జీవులను నేను జంత్రగాడు బొమ్మలనాడించునట్లు ఆడించుచున్నానని"** చెప్పాడు. దేవుడు ఆడించే బొమ్మలలో నేను నీవు అందరమూ బొమ్మలమే. ఆయన కర్మనుబట్టి ఆడించుచుండును. ఆయన ఆత్మచేత సర్వులనూ ఆడించుచున్నాడు. ఆ విషయము తెలియక ఇంట్లో నేను ఇది చేశాను, హోటల్‌లో అది తిన్నాను అని అనుకొంటున్నావు. ఇంట్లో చేయించినది, హోటల్‌లో తినిపించినది నిన్ను ఆడించు ఆత్మేనని తెలుసుకో.

ఇంటిలో చేయించినది కూడా ఆత్మేననీ, కర్మప్రకారమే చేస్తున్నామనీ, ఏదీ మనము స్వంతముగా చేయలేదనీ చెప్పవచ్చును. దానికి ఒక ఉదాహరణను చూస్తాము. ముహమ్మద్ ప్రవక్తగారు కొన్ని విషయములలో చీటీవేసి తన భార్యలలో ఒకరిని ఎన్నుకొనేవాడు. ప్రయాణ సమయములో తనవెంట ఎవరు రావాలను నిర్ణయము స్వంతము తీసుకోకుండా చీటీవేసి లాటరీ తీసినట్లు తీసి చీటీలో వచ్చినపేరుగల ఆమెను తనవెంట తీసుకెళ్ళే వాడు. చీటీవేయడము లాటరీవంటిది కాదు. నిజానికి భార్యలందరి హక్కులు సమానమైనవి. వీరిలో ఒకరికి మరొకరిమీద ప్రాధాన్యత ఇవ్వడానికి ఎలాంటి సమంజసమైన కారణమూ లేదు. ఇక ప్రవక్త మహనీయులు స్వయముగా ఎవరినయినా ఎన్నుకొంటే ఇతర సతీమణులకు బాధ కలుగుతుంది. వారిలో పరస్పర ఈర్ష్యాద్వేషాలు ఉత్పన్నమయ్యేదానికి కూడా ప్రేరణకావచ్చు. అందువలన ఆయన చీటీ ద్వారా నిర్ణయము

తీసుకొనేవాడు. షరియత్ ప్రకారము కొందరు వ్యక్తుల మధ్య ధర్మసమ్మత మైన హక్కు అందరికీ సమానమైనప్పుడు ఒకరిపైన మరొకరికి ప్రాధాన్యత ఇచ్చే సమంజసమైన కారణము ఏదో లేకపోగా హక్కుమాత్రము ఒకరికే ఇవ్వడము సాధ్యమయిన సందర్భములో చీటీ వేయడము ఒక్కటే సరియైన పద్ధతి.

ఇదంతా ఇక్కడ ఎందుకు చెప్పామనగా! బయట హోటల్‌లో పదకొండు పదార్థములు కలవనుకొనుము. అప్పుడు ఏదో ఒకటి తెప్పించు కొని తినడము జరిగినది. అలా జరిగినది కర్మప్రకారమే అని చెప్పు కొన్నాము. అయితే ఇక్కడ ఇంటిలోని పదకొండుమంది భార్యలలో తన ఇష్టమొచ్చిన వారిని ప్రవక్తగారు ఎందుకు తీసుకవెళ్ళలేదు. అంటే అక్కడ కూడా కర్మ ఎవరిని తీసుకెళ్ళాలా అను విషయము మీద చీటీవేసి నిర్ణయము చేసినది. అది పైకి మనకు తెలిసిన విధానము ప్రకారము అందరికీ సమ్మతముగా ఉండినట్లు చీటీ విధానమును ఎన్నుకొనినా అది కూడా కర్మేననీ, కర్మ అలా చేయించినదనీ అనుకోవలసి వస్తున్నది. ఈ విధముగా కర్మ ఎవరికీ అర్థము కాకుండా అన్నీ తానే చేయునట్లు నమ్మించి, చేయిస్తున్నదని తెలియవలెను. ఈ విధముగా కొన్ని పనులు చిత్ర విచిత్రముగా ఉంటాయి. వాటిని కర్మప్రకారము జరుగుచున్నవని చెప్పుట దుర్లభముగా ఉండును. ఒక పని జరుగుచున్నదంటే అది కర్మ కారణముతోనే జరుగును. దానిని ఆత్మే చేయించునని జ్ఞాపకముంచుకోవలెను.

ఒక్క దేవుని జ్ఞానవిషయములో కర్మ అనునది ఉండదు. మిగతా ప్రపంచ విషయములయందు ప్రతిదానికీ కర్మ వ్రాయబడి ఉండును. ముందే వ్రాయబడిన కర్మప్రకారమే అన్నీ జరుగుచుండును. ఇప్పుడు తిండి

విషయము వచ్చినది. దీనిని వివరించి చూస్తే ఇది జ్ఞాన విషయము కాదు. తిండి ప్రపంచ విషయము. ప్రపంచ విషయము కర్మ ఆధీనములో ఉండును. అందువలన తిండిమీద ప్రేమ, ఇష్టము కర్మప్రకారమే వచ్చును. అంతటితో అయిపోదు. ఒక వస్తువు తినవలసియుంటే మరియొక వస్తువు మీదికి దృష్ఠి మరల్చి దానిని తినాలని ఇష్టము కల్గించి చివరకు అది లభించకుండా చేసి కర్మప్రకారము నిర్ణయమైన దానినే తినిపించును. అప్పుడు వాడి కోర్కె తీరక వాడు తినాలనుకొన్నది తినకపోయినందుకు, అది లభించనందుకు బాధపడునట్లు కూడా చేయును. అలా బాధపడవలెనని ముందే నిర్ణయముంటే అలాగే చేయును. ఒకవేళ వాడు తినాలనుకొన్నది తృప్తిగా తిని సంతోషపడవలసినదియుంటే అలాగే చేయించును. అప్పుడు వాడు నేను అనుకొన్నట్లు తిన్నానని సంతోషపడును. ఇదంతయూ మనిషికి తెలియకుండా ముందే నిర్ణయమున్నట్లు జరుగును. జరుగుచున్నది చూచేది తప్ప మనిషి ఏమీ చేయలేడు. చేస్తాను అనుకోవడము పొరపాటు. ఇది మెట్ట వేదాంతమని అనుకోవద్దండి. ఇది వేదములకు సంబంధించిన విషయము ఏమాత్రము కాదు. స్వచ్ఛమైన శాస్త్రబద్ధ జ్ఞానము. అందువలన దేవుడు చెప్పిన వాక్యములలో కూడా ఇప్పుడు మేము చెప్పిన విధానమే కనిపించుచున్నది. అంతిమ దైవగ్రంథము ఖుర్ఆన్‌లో ఈ విషయమును గురించి సూరా 2, ఆయత్ 168లో ఈ విధముగా చెప్పారు. **(2-168) "ప్రజలారా! భూమిలో ధర్మసమ్మతమైన, పవిత్రమైన వస్తువులను (పదార్థములను) అన్నిటినీ తినండి. కానీ షైతాన్ అడుగుజాడలలో మాత్రము నడవకండి, షైతాన్ మీకు బహిరంగ శత్రువు."** ఈ ఆహార విషయమును గురించి మరొకచోట సూరా 2, ఆయత్ 173లో ఇలా వ్రాశారు. **(2-173) "అల్లాహ్ మీకొరకు నిషేధించినవి ఇవే. చచ్చిన**

**జంతువుల రక్తము, పందిమాంసము, ఇంకా ఇతర దేవతలకు నైవేద్యము పెట్టిన ప్రసాదములు. అయితే ఉద్దేశ్యపూర్వకముగా కాకుండా, హద్దులను అతిక్రమించకుండా గత్యంతరము లేని స్థితిలో తింటే పాపము రాదు. నిస్సందేహముగా దేవుడు క్షమించేవాడు, దయ చూపేవాడు."** ఇంతేకాక ఈ విషయమును ఇంకా మరొకచోట చెప్పడమైనది. సూరా 10, ఆయత్ 59లో ఈ విధముగా చెప్పారు చూడండి. **(10-59) "దేవుడు మీకోసము ఆహారమును అవతరింప జేయగా! దానిలో కొంత భాగాన్ని మీరు మీ కోసము నిషేధించుకొని మరికొంత భాగాన్ని ధర్మసమ్మతము చేసుకొన్నారే దీనికి మీ సమాధానము ఏమిటి? అని వారిని అడుగు. ఏమిటి ఈ విధముగా దేవుడు మీకు ఆదేశించాడా? లేక మీరే దేవునికి అబద్ధాలను అంటగట్టుచున్నారా? వారిని అడుగు."**

2వ సూరా 168వ ఆయత్‌లో ధర్మసమ్మతమైనవి, పవిత్రమైనవి తినమని చెప్పారు. ఇక్కడ ధర్మమేది, ధర్మసమ్మతమైనది ఏది? అని ప్రశ్న రాకతప్పదు. ఆధ్యాత్మిక ధర్మము ప్రకారము కర్మలో నిర్ణయమైనవి ధర్మ సమ్మతమైనవని అర్థమగుచున్నది. అందువలన ఇవి తినకూడదు అని దేవుడు కూడా ఖచ్చితముగా చెప్పలేదు. ఎందుకనగా! ఏవి తినకూడదని చెప్పామో కర్మలో అవియే వ్రాసిపెట్టబడియుంటే తప్పక తినవలసివస్తుంది. అప్పుడు అవి నిషేధము అనినా కర్మ ఒప్పుకోదు. అందువలన కొన్ని పదార్థములు మనిషికి అనారోగ్యమైనవని అవి తినకూడదని వాక్యములో చెప్పినా, వాటిని పూర్తి నిషేధించి చెప్పలేదు. ఒకవేళ తినవలసి వస్తే, ఇక తప్పదు అను సమయములో తినినా పాపమురాదు అని చెప్పాడు. అదే పనిగా నీవై నీవు తినకుండా, ఒక పద్ధతిని అతిక్రమించకుండావుంటే కర్మరీత్యా తినవలసివచ్చి తిన్నప్పుడు తప్పుకాదు అని కూడా 2-173 వ

వాక్యములో చెప్పడమైనది. అయితే పందిమాంసము, రక్తము, ఇతర దేవతలకు అర్పించిన ప్రసాదములు తినవద్దని గ్రంథములో చెప్పినట్లు వ్రాశారు. కానీ ఆ మాటను అన్నీ తెలిసిన దేవుడు చెప్పియుండడు. ధర్మ సమ్మతమైనవి, పవిత్రమైనవి తినమని చెప్పాడు. ఈ మాట సూత్రము ప్రకారము చెప్పినది. దేవుడు తినవలసినవి అన్నియూ ధర్మసమ్మతమైనవి అన్నాడు. ఆ మాట పద్ధతి ప్రకారము చెప్పినది. ఫలానిదే తినవద్దని చెప్పడములో ధర్మము లేదు. అందువలన ఇటువంటి కల్పితము మాటలను అవకాశమున్నప్పుడు చెప్పు అలవాటు మనిషికి ఉన్నది. కావున 10-59లో ఈ విధముగా చెప్పాడు. "నేను ఆహారమును మీకొరకు అవతరింపజేశాను. దానిలో మీరు కొంత భాగాన్ని నిషేధించుకొని, కొంత భాగమును ధర్మ సమ్మతమని చెప్పుకొన్నారు. అందులో ఏది ధర్మసమ్మతము కాదో మీరు చెప్పగలరా!" అని అడిగారు. కొందరు ఆవులను తింటారు. ఆవు మాంసము వారికి రుచిగా ఉంటుంది. శుభ్రముగా ఉంటుంది. ఆవులను తినేవారికి వారున్న ప్రదేశమునుబట్టియో, వాతావరణమునుబట్టియో మరి ఏ ఇతర కారణములవలనో ఫలానా పందిమాంసమును తినకూడదు అని అంటున్నారు. పంది తప్ప అన్ని జంతువులనూ తినవచ్చును అని చెప్పుచున్నారు. దానికి కారణము అలా పందిని తినకుండా మిగతావన్నీ తినవచ్చుననే వారిలో ఒకమంచి పేరున్న వ్యక్తిని, అంతో ఇంతో జ్ఞానము తెలిసిన వ్యక్తిని, మచ్చుకైనా అబద్ధము చెప్పని సచ్ఛీలుని ఆహార విషయము అడిగాను. దానికి ఆయన మీరు నన్ను అడగడము నాకు నవ్వు వస్తుందని నవ్వాడు. ఎందుకు నవ్వుచున్నావు? అని అడిగితే మాకంటే దేవుని జ్ఞానము మీకు బాగా తెలుసు! అటువంటి మీరు నన్ను అడగడము నవ్వుకాక ఏమి వస్తుంది! అని ఇట్లు చెప్పాడు. మీకు అన్నీ తెలుసు! మానోటి ద్వారా

ఏమి చెప్పుతారో వినవలెనని మీరు అడుగుచున్నారు. మీకు నేను అబద్ధమును చెప్పలేను, ఉన్నది ఉన్నట్లు చెప్పితే అన్ని జంతువులకూ చర్మము ఊడివస్తుంది. ఒకే ఒక పందికి చర్మము లేదు, అది ఊడిరాదు. అది లోపల కండలోనికి కలిసి పోయివుండును. ఈ విషయము చెప్పినది నీళ్ళులేని ఎడారిగాయున్న అరబ్ (గల్ఫ్) ప్రాంతములో అక్కడ పందిని తినాలనుకుంటే దాన్ని కడిగే దానికి కనీసము నాలుగు డ్రమ్ముల నీళ్ళు అవసరము. కడుగకుండా అశుభ్రముగా ఉండేదానిని తినలేము. అందువలన 'అందని ద్రాక్ష పుల్లన' అన్నట్లు, పందిమాంసమును తినవద్దండి అని అక్కడివారు చెప్పారు. అక్కడికి అది సమంజసమే. మిగతా జంతువులను కడుగవలసిన పనిలేదు. చర్మము పెరికివేస్తే తాజామాంసము దొరుకుతుంది. అందువలన అవి ఏవీ నిషేధము కాదన్నారు. కేవలము పందిమాంసము మాత్రము నిషేధము ఎందుకు? అని దేవుడు అడిగితే దానికి సమాధానము ప్రపంచ సంబంధమైనది చెప్పవలసిందేగానీ, ధర్మ సమ్మతమైన సమాధానము లేదు.

మిగతా జంతువులు శాఖాహారమునే కాకుండా మాంసాహారమును తిను అన్ని జంతువులనూ తినవచ్చును. అయితే అడవిలో కేవలము శాఖాహారమును అనగా, భూమిలో గడ్డలను తిని బ్రతుకు పందిలో ఏమి చెడుయుండును? పంది శరీర నిర్మాణము మెడలావుగాయుండి పైకి ఎత్తలేని విధముగాయుండును. దాని తల శరీరము కలిసిపోయి ప్రత్యేకముగా మెడలేని దానివలన దానిగొంతు ఎక్కడున్నదో సరిగా తెలియని దానివలన, దాని గొంతుకోసి చంపలేము. కనుక అన్ని రకముల అనుకూలము లేని జంతువు పందికాబట్టి దానిని తినకూడదని చెప్పుకొన్నారుగానీ, అది ధర్మ సమ్మతము కాదు అనుటకు వీలులేదు. పంది తలఎత్తి తినలేదు కావున

భూమిలోని వస్తువులనే తినాలి లేక భూమి ఉపరితలము మీదయున్న దేనినయినా తినగలదు. భూమికంటే రెండు అడుగుల ఎత్తులోయున్న దానిని తినవలెనంటే దానికి కష్టమే. అందువలన అడవిలోనివయితే క్రింద పడిన కాయలు, పండ్లను తినును. భూమిలో లోతులోయున్న గడ్డలను, దుంపలను తినును. అడవిలో అంతకంటే ఇతరము ఏమీ దానికి లభించదు. ఊరిలో తిరిగే వాటికి భూమి ఉపరితలము మీద కనిపించు వాటినే తినును. ఊరిలో భూమిలో దుంపలు దొరకవు. అందువలన భూమిమీదవున్న అన్నిటినీ తినడములో అశుద్ధపదార్థములను, మలమును తినుట వలన దానిని శుభ్రము చేయలేమని నీళ్ళు లేనివారు నిషిద్ధమన్నారు. మిగతావారు పందులను మంచి ఆహారమిచ్చి పెంచుతున్నారు. కేవలము శాఖాహారముతో బ్రతికిన జంతువు ధర్మసమ్మతము కాదు అనుటకు వీలులేదు. దేవుడు ఆ మాటను చెప్పియుండడు. మధ్యలో మనుషులు చెప్పారంటే తప్పక ఒప్పుకోవచ్చును. కానీ దేవుడు చెప్పాడు అంటే తప్పగును. ధర్మసమ్మతము కాదు అంటే తప్పగును. అందువలన 2-173 వాక్యములో దేవుడు ఈ విధముగా ఆదేశించాడా! అని దేవుని తరపున జిబ్రయేల్ అడిగిన మాటకు ఎవరయినా సమాధానము చెప్పగలరా? మీరు తినని దానిని మీకు ఇష్టము లేనిదానిని దేవుడు తినమని చెప్పలేదుగానీ, దేవుడు ఇలా చెప్పాడు అని దేవుని మీద నింద వేయకూడదు.

జీవుడు శరీరములో గుణచక్రమందు గుణములలో చిక్కుకొని యుండుట చేత ఆశ అనుగుణము తిండి విషయములో ఫలానాది తినాలని కోరిక పుట్టించుచుండును. జీవునికి గుణమునుబట్టి కోరికయుండవచ్చును గానీ, ఆ కోరిక నెరవేరునో, నెరవేరదో అది అతని కర్మనుబట్టియుండును. కోరికయున్నంతమాత్రమున అది తీరునను నమ్మకము లేదు. ఉదాహరణకు

నాకు పులుపు పదార్థములు ఎక్కువ ఇష్టము. మన ఇష్టమునుబట్టి మనము ఏ గుణభాగములో యున్నామోనను విషయము కూడా తెలిసిపోవును. ఉప్పుకారము తామస గుణభాగములో యున్నవారికి తినాలను కోర్కె యుండును. రాజస గుణభాగములోయున్నవానికి పులుపు తినాలను కోర్కె యుండును. అట్లే సాత్త్విక గుణభాగములోయున్న వానికి తీపి పదార్థముల మీద కోర్కెయుండును. అది వాని సహజత్వము అని వాని గుణములను బట్టి చెప్పవచ్చును. అయితే వాని కర్మచక్రములో కర్మవేరుగాయుండి సాత్త్వికునకు తీపి తినాలనియున్నా, వానికి తామసుడు తినాలను ఉప్పు కారము వస్తువులే దొరుకుచుండును. దానితో వాడు ఇష్టము లేకపోయినా దొరికింది తిని సర్దుకోవలసివచ్చును. ఈ విధముగా ఆశ ఉన్నంత మాత్రమున కర్మయున్నదని అనుకోలేము. అందువలన తిండి విషయము లోనే కాకుండా అన్ని విషయములలో కూడా అనుకొన్నవి కొన్ని, అనుకోనివి కొన్ని జరుగుచుండును. కొందరికి కర్మ అనుకూలముగాయుంటే అనుకొన్నవి చాలా, అనుకోనివి కొన్ని జరుగుచుండును. మరి కొందరికి అనుకొన్నవి తక్కువ, అనుకోనివి ఎక్కువ జరుగుచుండును. అదంతా కర్మనుబట్టి యుండునని తెలియవలెను.

ఖుర్‌ఆన్ గ్రంథములో ఎన్నో జ్ఞానవిషయములు మనిషిని ఆశ్చర్య చకితుని చేయులాగా చెప్పబడియున్నవి. ఖుర్‌ఆన్ గ్రంథము సర్వమానవాళికి సంబంధించినదియైనా ముస్లీమ్ సమాజమువారు ఇది మా గ్రంథము అని అంటున్నారు. దేవుడు అలా ఇది ఒక ప్రత్యేక సమాజమువారి గ్రంథమని చెప్పలేదుగానీ, **81-27వ ఆయత్‌లో "ఇది సర్వమానవుల గ్రంథము" అని చెప్పబడినది.** అందువలన దీనినిగానీ, దైవగ్రంథమయిన దేనినిగానీ ఇది మా గ్రంథము అని ఎవరూ అనకూడదు. దైవగ్రంథములు

మూడూ అందరి గ్రంథములు. అయితే భగవద్గీత భారతదేశ భాషలయిన హిందీ, తెలుగులో ఎక్కువగా వ్రాయబడినది. మిగతా భాషలలో అక్షరములు తక్కువగా యుండుట వలన శ్లోకములను వ్రాయలేకపోయినా భావమును వ్రాసుకొన్నారు. అట్లు చెప్పినా భగవద్గీత కేవలము పది, పన్నెండు భాషలలోనే యున్నట్లు వినికిడి. అదే బైబిలు గ్రంథము 14 వందల భాషలలో వ్రాయబడియున్నది. ఖుర్ఆన్ ఎన్ని భాషలలో వ్రాయబడినదో మాకు తెలియదుగానీ తెలుగు భాషలో ఏడు లేక ఎనిమిది అనువాద గ్రంథములు వచ్చాయి. వారు తమ ఖుర్ఆన్ గ్రంథము హిందువులకు తెలియాలను ఉద్దేశ్యముతో తెలుగుభాషలో అనువదించి వ్రాసిన గ్రంథములను కొన్ని వేలు, కొన్ని లక్షల గ్రంథములను ఉచితముగా ఇవ్వడము జరిగినది. వారు చేసినది మంచిపనేయని చెప్పవచ్చును. వారు తెలుగులో వ్రాసి ఇచ్చినందుకు ఖుర్ఆన్ అంటే ఇట్లున్నదని ఈనాడు మనకు తెలిసినది లేకపోతే తెలిసేది కాదు. వారు చేసినది చాలామంచి పనే అయినా ఉద్దేశ్యములో కొంత లోపముందనే చెప్పవచ్చును. ఎందుకనగా! వారు మతవ్యాప్తి ఉద్దేశ్యముతోనే గ్రంథములను ఉచితముగా ఇచ్చారు. ప్రస్తుతము నావద్ద ఏడు గ్రంథములు వేరువేరు వ్యక్తులు వ్రాసినవి గలవు.

దాదాపు నేను అన్ని గ్రంథములను చూచాను కొద్దిగా పొడవు పొట్టిగా వేరువేరుగా వ్రాసినా అన్నిటియందు ఒకే భావముగలదు. అందరు రచయితలూ ఒకే దారిలో నడచి అందరిదీ ఒకే భావమున్నట్లు వ్రాశారు. అయితే మేము వాక్యమును చూస్తూనే మాకు అనిపించేది రూపాయి విలువ యున్న వాక్యమునకు కనీసము పదిపైసలు భావమును కూడా చెప్పలేదని పించినది. కొన్ని వాక్యములకు భావము పూర్తి వ్యతిరేఖ దిశలో ఉండడము ఆశ్చర్యమయినది. దేవుడు తన గ్రంథములో స్థూల, సూక్ష్మ వాక్యములున్నా

యని 3వ సూరా 7వ ఆయత్‌నందు చెప్పినా సూక్ష్మ విషయములను పూర్తిగా వదలివేసి, అన్నిటినీ స్థూలముగా వ్రాయుట వలన భావమునకు న్యాయము చేయలేకపోయారని అర్థమయినది. ఆయత్‌లో **'దేవుడు పుట్టుతాడు నమస్కరించండి'** అనియుంటే క్రింద వివరములో 'దేవుడు పుట్టడు నమస్కరించవద్దు' అని వ్రాశారు. ఎందుకిలా వ్రాశారు? అని కొందరు ముస్లీమ్‌లను ఖుర్‌ఆన్‌ను చదివిన వారిని అడిగాము. వారు అరబ్బీ భాషలోనే చదువవలెనను నియమము ప్రకారము అరబ్బీ భాషలో చదువుట వలన మాకు ఏమీ తెలియదని ఒప్పుకొన్నారు. వారిని వదలి బోధకులుగాయున్న వారివద్దకు పోయి అడిగితే "మీకు అరబ్బీ రాదు దానిఅర్థము వేరు మీకు తెలియదు" అన్నారు. మాకు అరబ్బీ రాదు మీకు వస్తుంది కదా! వచ్చిన వారే కదా తెలుగులో వ్రాశారు. మీరు వ్రాసిన దానినే కదా! మేము అడుగుచున్నది. మీరు వ్రాసిన దానికి మీరే వివరము చెప్పకపోతే మాకెలా అర్థమవుతుంది? అని అడిగితే దానికి వారు "కేవలము ఖుర్‌ఆన్‌ను మాత్రమే చదువకూడదు, ఖుర్‌ఆన్‌కు తోడుగా హదీసులను కూడా చదివితే అర్థమవు తుంది" అని అన్నారు.

ఈ విధముగా కొందరు పొంతనలేని మాటలను మాట్లాడుచున్నారు. కొందరయితే భక్తితో ఖుర్‌ఆన్ గ్రంథమును చదివినా వారు వారికి తెలియని అరబ్బీభాషలోని అక్షరములను నేర్చుకొని చదివారు తప్ప దానిలోని భాష తెలియదు, భావము తెలియదు. కనీసము జిబ్రయేల్ ఖుర్‌ఆన్ జ్ఞానమును చెప్పాడను విషయము కూడా తెలియదు. వారు ముహమ్మద్ ప్రవక్త చెప్పాడు అంటున్నారు. 23 సంవత్సరములు జిబ్రయేల్ చెప్పినట్లుగానీ, జిబ్రయేల్ హీరా కొండగుహలలో ప్రవక్తగారికి చెప్పాడనిగానీ తెలియదు. మీరు చదివారని వారిని అడిగితే మాకు భాష తెలియదు, చదివేదానికి మాత్రము

అరబ్బీ అక్షరములు నేర్చుకొని ఖుర్ఆన్‌ను అరబ్బీలోనే చదవాలను నియమము ప్రకారము చదువుచున్నాము అని చెప్పుచున్నారు. తెలుగులో చదువుకొని తెలుసుకోవచ్చును కదా!యని మేము అడిగితే మా షరియత్ (ఇస్లామీయ చట్టము) ఒప్పుకోదు అని అంటున్నారు. మేము తప్పనిసరిగా అరబ్బీలోనే చదవాలి అని అంటున్నారు. అర్థములేనిది వ్యర్థము కదా! తెలియని భాషలోనే ఎందుకు చదవాలి, తెలిసిన భాషలో ఎందుకు చదవ కూడదు? అంటే మా మతము షరియత్ అని అంటారు. ఎవరి షరియత్ లన్నాగానీ దేవుని జ్ఞానము తెలియుటకు ఉపయోగపడాలి కదా! మతము ప్రాధాన్యముకాదు కదా!యని అంటే మా పెద్దలు ఒప్పుకోరు అంటున్నారు. వీరికి పెద్దలు కావాలో, లేక దేవుడు కావాలో మాకు తెలియడము లేదు. భాష విషయములో అంతిమ దైవగ్రంథమందు ఏమి చెప్పారో చూస్తే సూరా 14, ఆయత్ 4లో ఈ విధముగా కలదు చూడండి. **(14-4) "మేము ఏ ప్రవక్తను పంపినా, అతను విషయమును స్పష్టముగా విడమరచి చెప్పటానికి వీలుగా తన జాతివారి భాషలో మాట్లాడేవానిగా చేసి పంపాము. ఆపైన అల్లాహ్ తాను కోరినవారిని అపమార్గము పట్టిస్తాడు, తాను కోరిన వారికి సన్మార్గము చూపిస్తాడు. ఆయన సర్వాధిక్యుడు, వివేకవంతుడు."** దైవ గ్రంథములో దేవుని సందేశము ఈ విధముగాయుండగా దేవుడు అర్థమయ్యే దానికి మీ భాషలోనే ప్రవక్తను పంపుతానని చెప్పియుండగా అర్థముకాని భాషలో ఎందుకు చదవాలి? అని ప్రశ్నరాక తప్పదు. 'దేవుడు వరమిచ్చినా పూజారి అడ్డము పడినాడు' అన్నట్లు దేవుడు ప్రవక్తనే తమ భాషలో పంపుతానని చెప్పినా, ఖుర్ఆన్ ఎక్కడ పుట్టిందో అదే భాషలో చదవమనడము అక్కడ ఆ ప్రాంతము వారికి సరిపోతుంది గానీ, ఇతర ప్రాంతముల వారికి ఎలా సరిపోతుంది? ఎలా

అర్థము కాగలదు. అందువలన భారతదేశములోని వారికి అరబ్బీ భాష తెలియనివారికి ఖుర్ఆన్ గ్రంథము అర్థము కాలేదనియే చెప్పవచ్చును. అందువలన అంతిమ దైవగ్రంథము యొక్క రుచిగానీ, దానిలోని ఆనందముగానీ ఇక్కడ అరబ్బీ భాషలో చదువువారికి తెలియలేదనే చెప్పవచ్చును. అరబ్బీ భాషను పూర్తిగా నేర్చినవారు కొందరు ఉండవచ్చును. వారు వాక్యములను బాగా అర్థము చేసుకొని చదివి ఉండవచ్చును. అయితే వారికి వాక్యములోని పై భావము మాత్రము తెలియునుగానీ, వాక్యములోని నిగూఢ అర్థము తెలియదని చెప్పవచ్చును.

ఖుర్ఆన్ గ్రంథములో ఎక్కువ శాతము సూక్ష్మ అర్థముతో కూడుకొన్న వాక్యములు గలవు. వాటిని 'ముతషాబిహాత్' వాక్యములు అని అంటారు. స్థూలముగా ఉండే వాక్యములను "ముహ్కమాత్" వాక్యములని అంటారు. దేవుడు వీటి విషయము సూరా 3, ఆయత్ 7లో చెప్పియున్నా సూక్ష్మముగా ఉండే వాక్యములను గుర్తించక అన్నిటినీ స్థూలముగానే చూచుట వలన సూక్ష్మవాక్యముల విషయము ఏమాత్రము తెలియకుండాపోయినది. మేము చాలామార్లు సూక్ష్మముగా ఉండే వాటిని సూక్ష్మముగానే అర్థము తీసుకోవలెను. వాటిని స్థూలముగా అర్థము చేసుకోకూడదని చెప్పాము. అలా చెప్పు మమ్ములను కొందరు ముస్లీమ్‌లు ఏమన్నారో తెలియుటకు వారు ఆ వాక్యము నకు వ్రాసిన వివరమును చూస్తే అర్థమవుతుంది 3-7వ వాక్యములో **"ముతషాబిహాత్ వాక్యముల నిజభావము దేవుడు తప్ప మరెవరూ ఎరుగరు"** అని చెప్పారు. దాన్ని ఆసరాగా తీసుకొని ఒకవేళ దేవుడే దిగివచ్చి చెప్పినా వినని స్థితిలో మనిషియున్నాడు. దేవుడు సూక్ష్మమైన వాక్యములున్నాయి అన్నప్పుడు అవి దేవునికి తప్ప ఎవరికీ తెలియవు అన్నమాట వాస్తవమే. అయితే దేవుడు స్వయముగా ఎవరితో చెప్పడు, తాను అనుకొంటే ఎవరితో

నయినా చెప్పించగలడు. అటువంటప్పుడు దేవుడు ఎవరితో చెప్పిస్తాడో యని ఎదురు చూడవలసిందిపోయి ఎవరు చెప్పినా అదికాదు అంటే ఆ ముతషాబిహాత్ వాక్యములు అందరికీ ఎప్పుడు తెలుస్తాయి? అని మేము అడుగుచున్నాము. 'ముతషాబిహాత్' అను వాక్యములకు దేవుడు వివరమును చెప్పించుటకు తన దూతను పంపాడనుకోండి. అప్పుడు ఆ దూతవచ్చి చెప్పితే ఇది దేవునికి తప్ప ఎవరికీ తెలియదుపో! అని అంటే దేవుడు చేసిన ప్రయత్నము వృథా అగును కదా! ఆ వాక్యములకు అర్థము దేవునికి తప్ప ఎవరికీ తెలియదు అని వాక్యములోయున్న మాట నిజమే. అయితే అదే వాక్యములో బుద్ధి, శ్రద్ధయున్నవాడు ఆ వాక్యములను గ్రహించుకోగలడు అని అక్కడే చెప్పారు కదా! బుద్ధి శ్రద్ధయున్నవారు గ్రహించుకోవాలంటే వారికి ఎవరయినా చెప్పితేకదా! వారు గ్రహించుకోగలిగేది. వారు గ్రహించు కొనుటకు దేవుడు తన దూతను పంపినా నీకు తెలియదుపో! నీవు చెప్పినది సరికాదుపో! అంటే ఆ వాక్యములు మనుషులకు ఎప్పుడు తెలుస్తాయి? వాటి అర్థమును బుద్ధి శ్రద్ధయున్నవారు ఎప్పుడు గ్రహిస్తారు? ఎప్పటికీ ఆ వాక్యములకు అర్థము తెలియకపోతే గ్రంథములో ఆ వాక్యములుండి ఏమి ప్రయోజనము? దేవుడు వాక్యములను గ్రంథములో ఇచ్చిన తర్వాత ఎప్పుడయినా ఆయనే వాటికి అర్థము తెలియజేయాలి కదా! తెలియజేయు బాధ్యత ఆయనదే కదా! అలాంటప్పుడు దేవుడు నేరుగా ఎవరితో మాట్లాడడు. తను పంపిన వారిచేత చెప్పించును. అప్పుడు దేవుడు ఎవరినో ఒకరిని పంపి ముతషాబిహాత్ వాక్యములకు అర్థము చెప్పించితే దానిని విశ్వసించక, వాక్యములో చెప్పినమాటను పట్టుకొని ఇది దేవునికి తప్ప ఎవరికీ తెలియవు అంటే వారికి అవి ప్రాప్తము లేదని అర్థమగుచున్నది.

నా గ్రంథములో రెండు రకముల వాక్యములున్నవని చెప్పినది దేవుడే. రెండవ రకము వాక్యములకు భావము నాకు తప్ప ఎవరికీ తెలియదని చెప్పినదీ ఆయనే. ఆయనే నా వాక్యములను బుద్ధి, శ్రద్ధయున్నవాడు గ్రహించుకుంటాడు అని కూడా చెప్పాడు. అలా వాడు గ్రహించుకోవాలంటే ఇతరులతో ఆయనే చెప్పించాలి. అలా ఇతరులతో చెప్పించినప్పుడు వాటిని బుద్ధి ఉపయోగించి తెలుసుకొనుటకు ప్రయత్నము చేయాలి. చెప్పబడే విషయములు శాస్త్రబద్ధమైనవో, కాదో చూడాలి. అర్థము కాకపోతే ప్రశ్నించి తెలుసుకోవాలి. అదేదీ లేకుండా మొదటికే మేము వినము, ముందే దేవుడు చెప్పాడు నాకు తప్ప ఎవరికీ తెలియవని అంటే ఒకవేళ దేవుడే మారువేషములో వచ్చి చెప్పినా దేవున్నే ఎదురించి నీకు తెలియదుపో అనవచ్చునా? ఇక్కడే చాలామంది ముస్లీమ్‌లు అవిశ్వాసానికి గురియగుచున్నారు. చెప్పబడే విషయమును గ్రహించలేకపోవుచున్నారు.

ఇప్పుడు ముతషాబిహాత్ (సూక్ష్మముగాయున్న) వాక్యమును ఒక దానిని చూస్తాము. దానిని మేము సూక్ష్మమైనది అని అంటున్నాము. ఇతరులు దానిని ముహ్కమాత్ (స్థూలమైన) వాక్యము అంటున్నారు. వేమన యోగి పద్యములు పైకి ఒక విధముగా కనిపించినా లోపల ప్రత్యేకమయిన అర్థముతో కూడుకొనియుండును. ఉదాహరణకు **"చిన్నది ఎల ప్రాయంబున కన్నది పతిలేక సుతుని కడుచిత్రముగన్"** అను వేమనయోగి పద్యమును చూస్తే ఈ వాక్యములో స్థూలముగా అందులోని విషయము కనిపించుచునే యున్నది. అయినా దీనిభావము నిగూఢ అర్థముతో కూడుకొనియున్నది. ఒకవేళ స్థూల భావముతో చెప్పినా చెప్పవచ్చును. స్థూల భావము బాగా పైకి కనిపించుచున్నది. స్థూలముగా చెప్పుకొంటే "ఒక యువతి యుక్త వయస్సులోనే పెళ్ళికాకముందే భర్త లేకుండానే కొడుకును కనింది" అని

చెప్పవచ్చును. స్థూలముగా అట్లే కనిపించుచున్నది. అయితే వేమనయోగి స్వయముగా ఈ విధముగా చెప్పాడు. "నా పద్యము వేయి విధముల అర్థము నిచ్చునట్లు కనిపించినా నేను చెప్పినది ఆత్మజ్ఞానమును గురించియే" అన్నాడు. స్వయముగా వేమన చెప్పిన తర్వాత పై వాక్యమునకు స్థూలముగా భావమును చెప్పితే అంతకంటే తెలివితక్కువ పనిలేదని చెప్పవచ్చును. అదే విధముగా దేవుడు స్వయముగా నేను చెప్పినవి ముతషాబిహాత్ వాక్యములని చెప్పినా వాటిని స్థూలముగా (ముహ్కామాత్‌గా) చెప్పుకొంటే అంతకంటే అజ్ఞానము లేదని చెప్పవచ్చును.

ఇప్పుడు అంతిమ దైవగ్రంథము అయిన ఖుర్ఆన్‌లో సూరా 34, ఆయత్ 2లో వ్రాసియున్న దానిని చూస్తాము. **(34-2) "భూమిలోనికి వెళ్ళేదీ, దానినుండి వెలువడేదీ, ఆకాశమునుండి దిగేదీ, అందులోనికి (ఆకాశములోనికి) ఎక్కిపోయేదీ అంతా ఆయనకు తెలుసు. ఆయన అపార కరుణాప్రదాత, క్షమాశీలుడు."** ఈ వాక్యమును సర్వ సాధారణముగా అందరూ స్థూలముగానే చూడగలరు. దేవుడు స్థూలముగానే అందరికీ అర్థమయ్యేలాగా చెప్పాడు కదయ్యా! ఇందులో అర్థముకానిదే మున్నది? అనవసరముగా ఏదో చెప్పాడని అనేకమైన అర్థాలు ఎందుకు తీసి ప్రజలను పెడత్రోవ పట్టిస్తారు? అని అడుగవచ్చును. భూమిలోనికి విత్తనములు వెళ్ళుతున్నాయి. దానినుండి మొక్కలు బయటికి వస్తున్నాయి. అలాగే ఆకాశములోనుండి వర్షము వస్తావుంది. తర్వాత అదే నీరే ఆవిరై పైకి ఆకాశములోనికి పోతావున్నది. ఇవన్నియూ దేవుడు తెలుసు అని చెప్పాడు. ఇందులో రహస్యమేమున్నది? అని అడుగవచ్చును. దానికి మేము ఏమి చెప్పుచున్నామనగా! దేవుడు మనుషులకు చెప్పినది దైవజ్ఞానము. అయితే వర్షము కురిసేది, పంటలు పండేది, నీరు ఆవిరై పైకి పోయేది అందరికీ తెలిసిన ప్రపంచ జ్ఞానము, దేవుడు చెప్పినది

పరమాత్మజ్ఞానము. దేవుని వాక్యములోనుంచి పరమాత్మ జ్ఞానమును చూడమని చెప్పుచున్నాము గానీ, అంతకంటే వేరుగా మేము ఏమీ చెప్పలేదు కదా! అని అడుగుచున్నాము.

భూమి, ఆకాశము అని చెప్పగానే బయట దృష్టిని వదలి అంతర్ముఖముగా ఆలోచించితే భూమి ఆకాశము అనునవి క్రింద కాళ్ళు మొదలుకొని పైన తలవరకుయున్న శరీరమని తెలియవలెను. పై వాక్యములో శరీరమును గురించి చెప్పాడని బాగా అర్థమగుచున్నది. శరీరములో జరుగుచున్న కర్మ విధానమును బాగా అర్థమగుటకు ఈ వాక్యమును చెప్పాడని అర్థమగుచున్నది. కర్మ విధానములో ఇది నిగూఢమైన వాక్యము. పైకి చూచే దానికి ఇందులో కర్మ ఏమీ కనిపించదు. లోతుగా చూడగలిగితే ఇందులోని రహస్యమంతా బయటపడగలదు. మనిషి చేయు కార్యము ద్వారా కర్మ కలుగుచున్నది. కార్యములో పుట్టుకొచ్చిన కర్మ మనిషి శరీరములోని కర్మచక్రములో చేరుచున్నది. కర్మచక్రము తలలోయున్నది కావున ఆకాశములోనికి ఎక్కేది అని వాక్యములో వ్రాశారు. ఆకాశములోనికి ఎక్కేది క్రొత్తగావచ్చు ఆగామికర్మ అని తెలియవలెను. శరీరములో తలలోని కర్మచక్రములోనికి ఎక్కిన ఆగామికర్మ, సంచితకర్మగా కర్మచక్రములోనే క్రిందికి దిగుచున్నది. ఆగామికర్మ సంచితముగా మారడమును ఆకాశములో నుండి దిగేది అని చెప్పడము జరిగినది. ఆకాశమునుండి దిగేదియనగా ఆగామి రూపమునుండి సంచితముగా మార్పుచెందడము అని అర్థమగుచున్నది. సంచితముగా మారిన కర్మ మరణములో ప్రారబ్ధముగా మారుచున్నది. ప్రారబ్ధముగా మారి అమలుజరుగు కర్మను భూమిలోనికి దిగేదియని చెప్పడమైనది. శరీరముద్వారా ఆచరించబడి అనుభవింపబడుచున్నది కావున దానిని భూమిలోనికి దిగేదియని అర్థము చేసుకోవాలి.

కర్మేంద్రియముల ద్వారా అనుభవించడము వలన కర్మేంద్రియములలో కాళ్ళు, చేతులు మిగతా రెండు క్రిందయున్నవి. కావున దానిని భూమిగా పోల్చి భూమిలోనికి దిగేది అని చెప్పారు. కర్మేంద్రియముల ద్వారా ప్రారబ్ధము ఆచరింపబడిన కార్యములో తిరిగి ఆగామికర్మగా మారుచున్నది. ఆగామిగా మారిన కర్మను భూమినుండి వెలువడేదియని అన్నారు. ఆగామిగా వచ్చిన కర్మ తిరిగి కర్మచక్రమును చేరడమును ఆకాశములోనికి ఎక్కుచున్నది అని చెప్పారు. ఆగామిగా ఆకాశములోని తలలోనికి ఎక్కిన కర్మ సంచితముగా మారడమును ఆకాశమునుండి దిగడము అని చెప్పారు. సంచితము మరణములో ప్రారబ్ధముకావడము శరీరములో అనుభవించడ మును భూమిలోనికి దిగేది అన్నారు. ప్రారబ్ధకర్మ అనుభవమునకు వచ్చి ఆగామికర్మగా మారిపోవడమును తిరిగి ఆకాశములోనికి ఎక్కుచున్నదని చెప్పుచున్నారు. ఈ విధముగా ఆగామిగా ఎక్కిన కర్మ సంచితముగా మారిపోయి, సంచితము జన్మలో ప్రారబ్ధముగా మారిపోయి ప్రారబ్ధము ఆచరణలో తిరిగి ఆగామిగామారి కర్మచక్రమును చేరడమును ఆకాశము లోనికి ఎక్కేది, ఆకాశమునుండి దిగేది అని చెప్పి తర్వాత భూమిలోనికి వెళ్ళేదీ అన్నారు. భూమినుండి వెలువడేది అని చెప్పారు. ఆగామికర్మ కొన్ని సంవత్సరములకు సంచితకర్మగా మారిపోవడము, సంచితము జన్మలో ప్రారబ్ధముగా మారిపోవడము ప్రారబ్ధము జీవితములో తిరిగి ఆగామిగా మారిపోవడమును ఆకాశములోనికి ఎక్కేది, దిగేదియనీ అలాగే భూమిలోనికి వెళ్లేదీ, దానుండి వెలువడేదియనీ చెప్పడమైనది.

శరీరములో సమస్తమూ ఉన్నదనీ, బయటగల అన్నీ శరీరములోనే ఉన్నాయని, అంతర్ముఖముగా చూచుకొన్నప్పుడే సూక్ష్మమైన జ్ఞానము అర్థము కాగలదనీ చెప్పుకొన్నాము. శరీరములో నీవు జీవునిగా ఉన్నావు. బయట

నీవు ఒక మనిషిగా లెక్కించబడినా, శరీరములో మాత్రము జీవునివే. నీవు బయట మనిషివే బయట నీకు భార్య ఉన్నది. అయితే నీవు శరీరములో జీవునివేకాక, నీకు శరీరములోనే భార్య కూడా యున్నది. ఈ మాట బయట చోద్యముగానేయుండును. అయినా అంతర్ముఖ జ్ఞానరీత్యా మా మాట సత్యమే. భూమిమీద ఒకని భార్య అనుకూలము లేకుండా ప్రతికూలముగా ప్రవర్తించుచుండును. మరొకని భార్య అనుకూలముగా ప్రవర్తించుచుండును. ఇంకొకని భార్య కొంత అనుకూలముగా కొంత ప్రతి కూలముగా ప్రవర్తించుట చూచియేయున్నాము. ఇది బయట భార్యల విధానము. అయితే ప్రతి మనిషికీ అనగా శరీరములోని ప్రతి జీవికీ శరీరములోనే ఒక భార్యకలదు. శరీరములోని ప్రకృతి సంబంధమైనదే భార్యగాయున్నది. ప్రకృతి సంబంధమైనది ఏది? అని యోచిస్తే ప్రకృతి వలన పుట్టిన గుణములే నీకు భార్యగాయున్నదని చెప్పవచ్చును. ప్రకృతి జనిత గుణములు మొత్తము పన్నెండుగలవు. అందులో ఆరు మంచి గుణములు, ఆరు చెడు గుణములు గలవు. జీవునికి జీవితములో మంచి గుణములు ఎక్కువ ఉపయోగపడుచుంటే అతని భార్య అనుకూలముగా యున్నదని చెప్పవచ్చును. కర్మరీత్యా జీవునికి చెడుగుణములు జీవితములో ఎక్కువగా ఉపయోగపడుచుంటే అతని భార్య వ్యతిరేఖముగా ప్రవర్తించుచూ అతనిని ఇబ్బంది పెడుతున్నదని చెప్పవచ్చును. కొందరి శరీరములో కర్మరీత్యా కొన్ని చెడు గుణములు, కొన్ని మంచి గుణములు ఉపయోగ పడుచూ అతనికి సమముగా సుఖము, దుఃఖములు కలుగజేయుచుండును. ఈ విధముగా భార్య అనబడు గుణములు జీవునితో ఎల్లప్పుడూ సంబంధపడి యుండి వానిని వేధించడమో, బాధించడమో లేక సంతోషింపజేయడమో చేయుచుండును. అందువలన ఇదే విషయమునే అంతిమ దైవగ్రంథము

ఖుర్‌ఆన్‌యందు ప్రస్తావించుచూ సూరా 30, ఆయత్ 20, 21లలో ఈ విధముగా చెప్పారు చూడండి. **(30-20) "ఆయన సూచనలలో ఒకటేమంటే ఆయన మిమ్ములను మట్టితో పుట్టించాడు. ఆ తర్వాత మీరు మానవులుగా మారి వ్యాపిస్తున్నారు." (30-21) "మరి ఆయన సూచనలలో ఒకటేమంటే ఆయన మీకోసము స్వయముగా మీలో నుంచే భార్యలను సృష్టించాడు. మీరు వారివద్ద ప్రశాంతత పొందటానికి ఆయన మీ మధ్య ప్రేమనూ, దయా భావమునూ పొందుపరిచాడు. నిశ్చయముగా ఆలోచించే వారికోసము ఇందులో ఎన్నో సూచనలు ఉన్నాయి."**

సూత్రప్రాయముగా చెప్పిన వాటిని సూచనలు అంటున్నారు. దేవుడు చెప్పిన ఒక సూచనలో ఎన్నో సూచనలున్నాయి అనడము జరిగినది. వాక్యము మొదటిలో ఒక సూచన ఏమంటే అని మొదలుపెట్టి ఆ ఒకదానిలోనే ఎన్నో సూచనలు ఉన్నాయి అనడము జరిగినది. అంటే పైకి కనిపించేది ఒకటుంటే లోపల కనిపించని భావములు మరికొన్ని ఉంటాయని దాని అర్థము. ఆ లెక్కప్రకారము శరీరములోనే నీకు భార్యను సృష్టించాను అని వాక్యములో చెప్పాడు. వారివద్ద అనగా భార్యవద్ద ప్రశాంతత పొందడానికి ప్రేమనూ, దయనూ, మంచిగుణములను ఉంచాడని చెప్పారు. మంచి గుణములలో రెండుమాత్రము సూచనగా చెప్పారు. మనము అర్థము చేసుకొంటే ఇంకా మంచి గుణములు ప్రశాంతతనిచ్చునవి నాలుగున్నాయి. ఒకరు కర్మరీత్యా పుణ్యము చేసినవానికయితే ప్రశాంతత పొందడానికి ఆరు మంచి గుణములను దేవుడు సృష్టించాడు. అలాగే ఒక మనిషి వాడు చేసుకొన్న పాపము ప్రకారము ప్రశాంతతలేకుండా బ్రతకడానికి ఆరు చెడు గుణములను కూడా దేవుడు తయారు చేశాడు. మంచి చెడు రెండు

గుణములు పనిచేయగా శాంతి అశాంతుల మధ్య కొంచెము అనుకూలము, కొంచెము అనానుకూలముగా కూడా బ్రతుకడము జరుగుచున్నది. 'దేవుడు మట్టితో చేశాడు' అని అనేకమార్లు చెప్పడము జరుగుచున్నది. మరికొన్ని చోట్ల భూమి, ఆకాశము అని కూడా చెప్పడము జరిగినది. వాటిని కనిపించే అర్థముతో చెప్పుకోకూడదు. అందువలన నిగూఢ అర్థముతోనే చెప్పుకొంటున్నాము.

ఇదే 30వ సూరాలో 24వ ఆయత్‌నందు మరొక నిగూఢమైన విషయమును చెప్పాడు చూడండి. **(30-24) "ఇంకా ఆయన సూచనలలో ఇంకొకటి ఏమిటంటే, ఆయన మిమ్ములను భయపెట్టడానికీ, ఆశపెట్టడానికీ మెరుపును చూపిస్తున్నాడు. ఆకాశమునుండి వర్షము కురిపిస్తున్నాడు. మరి దానిద్వారా మృతభూమికి జీవము పోస్తున్నాడు. ఇందులో కూడా బుద్ధిగల జీవుల కోసము ఎన్నో నిదర్శనములు ఉన్నాయి."** ఈ వాక్యములో రెండే విషయములుగలవు. ఒకటి ఆయన మిమ్ములను భయపెట్టడానికి, ఆశపెట్టడానికి మెరుపును చూపిస్తున్నాడు. రెండవది ఆకాశమునుండి వర్షము కురిపిస్తున్నాడు, మరి దానిద్వారా మృతభూమికి జీవము పోస్తున్నాడు. ఇవితప్ప విషయము ఏమీలేదుగానీ చివరిలో ఒక హెచ్చరికను చెప్పాడు. ఇందులో బుద్ధియున్న వారికి ఎన్నో నిదర్శనములున్నాయి అన్నాడు. నిదర్శనములనగా అర్థమును ముందే ఒకమారు చెప్పుకొన్నాము. ఇప్పుడు అదే ఇక్కడ జ్ఞాపకము చేయుచున్నాను. దర్శనము అనగా చూచుట అని అర్థము. 'ని' అనగా లేదు, నిదర్శనము అనగా కనిపించనిది అని అర్థము. బుద్ధితో యోచన చేయువారికి ఎన్నో కనిపించని విషయములున్నవని చివరిలో చెప్పారు. కనుక పైకి కనిపించు విషయములుగా ఈ వాక్యములోని దేనినీ చెప్పకూడదు. మెరుపు అనగా

బయట ఆకాశములో మెరిసే మెరుపును గురించి చెప్పకూడదు. బయట మెరుపు దర్శనమే అవును నిదర్శనముకాదు. అలాగే వర్షము బయట ప్రపంచములో కురియు వర్షముగా చెప్పుకోకూడదు. ఎందుకనగా అది దర్శనమే అగుచున్నది. అందువలన ఈ వాక్యములను నిగూఢమైన నిదర్శనముగానే చెప్పుకోవాలి. ఆకాశములో మెరిసే మెరుపు అనగా తలలో వచ్చు ఆలోచన అని అర్థము. కొందరు తలలో ఆలోచన మెరిసింది అని మాటల సందర్భములలో అనడము వినియే ఉందుము. ఆకాశము అనగా మనిషి తలయని ఇంతకుముందు చాలామార్లు చెప్పాము. తలలో వచ్చే ఆలోచననుబట్టి మనిషి ఒకమారు ఆశలోపడుచున్నాడు. వచ్చిన ఆలోచననుబట్టి భయపడడము కూడా జరుగుచున్నది. వ్యాపారము ఆలోచన మెరిసినప్పుడు లాభము వచ్చునని ఆశపడుచున్నాడు. పోట్లాట శత్రువుల ఆలోచన వచ్చినప్పుడు భయము కల్గుచున్నది. అంతేకాక ఆకాశమునుండి వర్షము కురిపిస్తున్నాడు అని కలదు. ఆకాశము అనగా తలయని చెప్పుకొన్నాము. కొన్ని సమయములలో పైనుండి వళ్ళంతా చెమట కారిపోవడమును వర్షము కురిపించుటయను భావమునకు సరిపోవుచున్నది. చెమట పై నుండి క్రిందికే కారుచుండుట వలన ఆకాశమునుండి వర్షము కురియుచున్నదనీ చెప్పాడు. శరీరములో చెమట కారుట వలన శరీరములోని ధాతుకణములన్నీ మలినమును కోల్పోయి ఆరోగ్యముగా ఉండును. శరీరములో చనిపోవు ధాతుకణములు చనిపోకుండా ఉండుటకు అవకాశమున్నది. ప్రతిదినము కొన్ని ధాతుకణములు చనిపోతూవుండును. కొన్ని వాటి స్థానములో క్రొత్తవి పుట్టుచుండును. శరీరములో చెమట కారిపోవడము వలన చనిపోయే ధాతుకణముల సంఖ్య తగ్గిపోవును క్రొత్తగా పుట్టే ధాతుకణముల సంఖ్య పెరుగును. అప్పుడు మృత భూమికి జీవము

పోసినట్లగుచున్నది. ఇదంతా లోపల జరుగుచుండుట వలన బయట పోలికను మెరుపు మెరుస్తుందియని, వర్షము వస్తుందని చెప్పి తర్వాత ఇందులో బుద్ధిగలవారికి ఎన్నో నిదర్శనములున్నాయి అని అన్నారు.

దేవుడు మనిషిని సృష్టించాడు, అతని మెదడులో మెరుపులను సృష్టించాడు. మెదడులోని నాడులలో కరెంటు మెరుపులు మెరిసినప్పుడు ఆలోచన రావడము వాస్తవముగా జరుగుచున్నది. భౌతికశాస్త్రము ప్రకారము మెదడులో ఎడతెరపిలేని కరెంటు మెరుపులు వస్తుండడము వలన, ఎడతెరపి లేని ఆలోచనలు వస్తున్నాయని పరిశోధనలో తెలిసిపోయినది. దేవుడే సాక్షిగాయుండగా, ఆత్మ మెరుపులను పుట్టించుట వలన, మనిషిలోని ఆలోచనలన్నీ దేవునికి తెలిసిపోవుచున్నవి. దేవుడు మెదడులోనూ, శరీర మంతయూ వ్యాపించియున్నాడు. జీవుడున్న గుణచక్రములో కూడా యున్నాడు. అందువలన జీవుని భావము ఏమున్నదీ దేవునికి తెలుసు. దేవుడు జీవునకు అతి సమీపముగా ఉండుట వలన దేవునికి అన్నీ తెలుసు. ఇదే విషయమునే అంతిమ దైవగ్రంథము ఖుర్‌ఆన్‌లో ప్రస్తావించుతూ సూరా 50, ఆయత్ 16,17లలో ఇలా వ్రాయబడి ఉన్నది. **(50-16) "మేము మనిషిని సృష్టించాము. అతని మదిలో మెదిలే ఆలోచనలు సయితము మాకు తెలుసు. మేము అతని ప్రాణనాళముకంటే కూడా అతనికి చేరువలో యున్నాము." (50-17) "తీసుకోవలసిన ఇద్దరూ తీసుకోవడానికి వారిలో ఒకరు కుడిప్రక్క మరొకరు ఎడమప్రక్క యుంటారు."** ఇక్కడ 17వ వాక్యములో ఇద్దరూ ఒకరు కుడిప్రక్క మరొకరు ఎడమ ప్రక్కయుంటారు అని వ్రాశారు. ఇది సూక్ష్మముగా చెప్పిన వాక్యము కావున ఇద్దరు అని వాక్యములో ఉంటే ఇద్దరున్నారని అనుకోకూడదు. కుడిప్రక్క ఎడమప్రక్క అనినారు, అందువలన ఇద్దరు ఒకరు కుడిప్రక్కన మరొకరు

ఎడమప్రక్కన యున్నారని, ఇద్దరు దూతలు ఉన్నారని కొందరు చెప్పడము జరుగుచున్నది. మరికొందరు పాపమును వ్రాసుకొనేదానికి ఒక దూత, పుణ్యమును వ్రాసుకొనేదానికి మరొక దూత ఇద్దరు దూతలు కుడి ఎడమగాయున్నారని చెప్పుచున్నారు. వాక్యములో ఉన్నది ఉన్నట్లు అర్థము చేసుకోకూడదు. వాక్యములోయున్న అంతర్గత ఉద్దేశ్యమును చూడవలెను.

ఆ విధముగా అంతర్గతములో జరుగుచున్న విధానమును చూస్తే మెదడులోని నాడులలో మెరిసే కరెంటు మెరుపులు కొన్ని కుడినుండి ఎడమకూ, మరికొన్ని ఎడమనుండి కుడికీ మెరుస్తున్నవి. అందువలన కుడి ఎడమ ప్రక్కల ఇద్దరు దూతలున్నారని చెప్పారు. వాస్తవానికి అక్కడ దూతలు ఎవరూ లేరు. ఉండే ఇద్దరూ యజమానులే. ఆ యజమానుల పేర్లు ఒకరు ఆత్మ, మరొకరు పరమాత్మ, వారినే ఒకరిని తోలేవాడు అనియూ, మరొకరిని చూచేవాడనీ అనుచున్నాము. వీరు ఇరువురు అనగా ఆత్మ, పరమాత్మ ఏడవ ఆకాశము అనబడు మెదడునందు నివాసముంటూ శరీరమంతా వ్యాపించియున్నారు. జీవుడు (జీవాత్మ) తలలోని గుణచక్రములో ఒక్కచోట మాత్రముండగా, ఆత్మ, పరమాత్మ ఇద్దరూ శరీరమంతా వ్యాపించి యున్నారు. ఆత్మ శరీరము వరకే వ్యాపించియుండగా, పరమాత్మ శరీరము బయట కూడా వ్యాపించియున్నాది. గుణచక్రములోని జీవాత్మ వరకూ ఇద్దరూ వ్యాపించియుండడము వలన మేము అతనికి దగ్గరగాయున్నాము అని వాక్యములో చెప్పడము జరిగినది. దేవుడు మనుషులను సృష్ఠించాడు అతను జీవితమును సాగించుటకు శరీరము లోపల కొన్ని విధానములను తయారు చేసిపెట్టాడు. బయట ప్రపంచములో కూడా బ్రతికేదానికి కొన్ని ఏర్పాట్లు చేశాడు.

ఆ విధముగా చేయుటకు బయట ప్రపంచములో నిర్జీవముగా యున్న ప్రదేశములో జీవమున్న చెట్లు చేమలను సృష్టించాడు. బయట ప్రపంచములో ఖాళీగాయున్న స్థలములలో చిన్న చెట్లను మహా వృక్షములను పొడగాటి తీగలను దేవుడు తయారు చేసి వాటికి ఆకులను ఉంచాడు. ఆకుల ద్వారా వాటికి శ్వాసకలుగునట్లు చేశాడు. మనుషులు బ్రతకాలంటే ఆహారముకంటే గాలి ముఖ్యము. ఆహారము లేకపోయినా మనిషి బ్రతుక వచ్చును. అయితే గాలి లేకపోతే కొన్ని నిమిషములు కూడా మనిషి బ్రతుకలేడు. గాలియున్నా అందులో మనిషికి ఉపాధి అయిన ప్రాణవాయువు అవసరము. ప్రాణవాయువు మనము పీల్చబడే గాలిలో ఉంటుంది. ఒకమారు శ్వాసను లోపలికి పీల్చితే అందులో కొంత ప్రాణవాయువు శరీరములోనికి పోయి, మనిషి బ్రతుకుటకు అవసరమైన శక్తిని ఇచ్చుచున్నది. ఒకమారు లోపలికి పోయిన గాలిలోని ప్రాణవాయువు శరీరములో చేరిపోయిన తర్వాత శరీరములోయున్న వృథాగా కాలిపోయిన గాలి నిస్సారమైన గాలి (కార్బన్‌డై ఆక్సైడ్) శ్వాసలో బయటికివచ్చును. నిస్సారమైన గాలినే బొగ్గుపులుసు వాయువు అంటారు. ఈ విధముగా మనిషి శ్వాసించిన ప్రతిసారీ ప్రాణవాయువు కొంత ఖర్చవుతున్నది. ప్రాణవాయువు లోపలికి పోయి శరీరములో ఉపయోగపడి శరీరములో ధాతు కణములలో కాల్చబడి చివరికి బొగ్గుపులుసు వాయువుగా బయటికి వస్తున్నది. ప్రాణవాయువును ఆక్సిజన్ అని అంటారు. బయటవున్న ఆక్సిజన్ (ప్రాణవాయువు) మనుషులు, జంతువులు పీల్చు శ్వాసలో ఖర్చయి కార్బన్‌డై ఆక్సైడ్‌గా (బొగ్గుపులుసు వాయువుగా) మారిపోవుచున్నది. అట్లు ఒక దినములోనే ప్రపంచ వ్యాప్తముగాయున్న ప్రాణవాయువంతా శ్వాసలలో ఖర్చయిపోయి తర్వాత పీల్చుటకు ప్రాణవాయువు లేకుండా పోవుచున్నది.

గాలిలో ప్రాణవాయువు లేకపోతే మనిషి చనిపోవు ప్రమాదము కలదు. అందువలన అటువంటి పరిస్థితి రాకుండా దేవుడు ముందే చెట్లను, వృక్షములను తయారు చేసి మనుషులు వదలిన బొగ్గుపులుసు వాయువును చెట్లు, చేమలన్నీ పీల్చి దానివలన అవి బ్రతుకునట్లు చేశాడు. మనిషి బ్రతికేదానికి (జీవనోపాధికి) ప్రాణవాయువు ఎలా అవసరమో అలాగే చెట్లు బ్రతికేదానికి బొగ్గుపులుసు వాయువు (కార్బన్‌డై ఆక్సైడ్) అవసరమైనది. చెట్లు, వృక్షములు, తీగలు కార్బన్ డై అక్సైడ్‌ను తమ ప్రాణమునకు ఉపయోగపడునట్లు చేసుకొని తర్వాత బయటికి ప్రాణవాయువును వదలుచున్నవి. అందువలన ప్రతి దినము మనుషులు పీల్చగా అయిపోతున్న ప్రాణవాయువు చెట్ల ద్వారా తిరిగి తయారయి వస్తున్నది. అదే విధముగా మనుషులు తిరిగి వదలిన బొగ్గుపులుసు వాయువు చెట్లకు అయిపోకుండా భర్తీ చేయబడుచున్నది. మనుషులు బ్రతకాలంటే ఆక్సిజన్‌ను వదలు వృక్షములు చెట్లుడండాలి. చెట్లు బ్రతకాలంటే కార్బన్ డై ఆక్సైడ్‌ను వదులు మనుషులు, జంతువులు ఉండాలి. ఈ విధముగా దేవుడు అవినాభావ సంబంధమును చెట్లకు, మనుషులకు పెట్టాడు. ఈ విషయమును తెలియజేయు నిమిత్తము అంతిమ దైవగ్రంథములో సూరా 50, ఆయత్ 11లో ఈ విధముగా చెప్పారు. **(50-11) "దాసుల (మానవుల) ఉపాధి నిమిత్తము వీటిని ఉత్పత్తి చేశాము. మేము నిర్జీవముగాయున్న ప్రదేశానికి జీవము పోశాము. అదే విధముగానే సమాధులనుండి జీవరాసులు బయటికి రావలసి యున్నది."**

ఈ వాక్యములో మనుషుల ఉపాధి నిమిత్తము దేవుడు నిర్జీవముగా యున్న ప్రదేశమును చెట్లు చేమలతో జీవము పోయడము జరిగినది. తర్వాత అవి బ్రతికే దానికి అవసరమైన కార్బన్ డై ఆక్సైడ్ కొరకు గర్భమునుండి

(సమాధులనుండి) జంతువులను, మనుషులను బయటికి వచ్చునట్లు చేశాడు. చెట్లు, వృక్షములు భూమినుండి బయటికిరాగా మనుషులను, జంతువులను గర్భము అను సమాధినుండి వచ్చునట్లు చేశాడు. అండజ, పిండజములు రెండూ సమాధినుండి లేచివచ్చు ప్రాణులుగాయున్నవి. అలాగే చెట్లు, వృక్షములు, లతలు ఉద్భిజములుగా యున్నవి. చెట్లుయున్నంత మనుషులు, జంతువులు ఉండును. అలాగే మనుషులు జంతువులున్నంతగా భూ సమాధినుండి వచ్చు చెట్లు, వృక్షములు ఉండును. అందువలన దాసుల ఉపాధి నిమిత్తము ప్రాణము పోశాము అన్నాడు. తర్వాత వాటి కొరకు తల్లిగర్భ సమాధులనుండి మనుషులు రావలసియున్నదని చెప్పాడు. గర్భ సమాధి నుండి వచ్చు మనుషుల కొరకు భూ సమాధినుండి వచ్చు చెట్లనూ, భూసమాధినుండి వచ్చు చెట్లకొరకు గర్భ సమాధినుండి వచ్చు మనుషులను తయారు చేశాడు. దీనితో దేవుడు ఎంతటివాడో చెప్పకనే కొద్దిగయినా అర్థముకాగలదు.

దేవుడు మనుషులను సృష్టించాడు. వారికొరకు, వారి ప్రాణము కొరకు చెట్లను తయారు చేశాడు. ఎండిన భూమిని పచ్చగజేసి మనుషులకు ప్రాణవాయువును ఇచ్చాడు. అట్లే వృక్షజాతి ప్రాణమునకు అవసరమైన గాలిని ఇచ్చుటకు మనుషులను సృష్టించాడు. మనుషులు చెట్లకొరకు, చెట్లు మనుషులకొరకు, తెలియకనే బ్రతుకుచున్నట్లు అర్థమయినది. దేవుడు మనుషులను చెట్లను పుట్టించినా, మనుషులు చెట్లు తమకు తెలియకుండానే ఒకరికొకరు ఉపాధినిచ్చుచూ బ్రతుకుచున్నారు. దేవుడు పుట్టించిన మనుషులలో చెట్లలో మతములు లేవు, మతద్వేషములు లేవు. అవి ఒకదానికొకటి ఏ హానీ చేసుకోలేదు. అయితే మనుషులు మాత్రము మతములుగా విడిపోయారు. మతద్వేషములు పెంచుకొన్నారు, ఒకరినొకరు

హింసించుకొంటున్నారు. దేవుని జ్ఞానము ఏమీ తెలియకున్నా తెలిసినవారి వలె ప్రవర్తించుచూ, ఇతరుల ఎదుట తాము గొప్ప జ్ఞానులవలె ప్రదర్శించు కొంటున్నారు. ప్రజల దృష్టిలో అట్టివారు గొప్ప జ్ఞానులుగా లెక్కించబడినా, దేవుని లెక్కలో వారు అజ్ఞానులుగాయున్నట్లు దేవుడు గుర్తించునని వారికి తెలియదు. దేవుడు చెప్పిన జ్ఞానమును అర్థము చేసుకోలేక, దేవుని మార్గములో ప్రయాణిస్తున్నామని తలచి, ఇతరులు దేవుని మార్గములో ప్రయాణించలేదనీ, అటువంటివారిని చంపుటయే దేవుని సేవయనీ అనుకొని, ఆ సాకుతో జీహాద్ అని పేరుపెట్టి (ధర్మయుద్ధము అని పేరుపెట్టి) ఇతరులను చంపుచున్నారు. ఈ విధానము మంచిది కాదనీ మీరు చేయు ధర్మయుద్ధములో ధర్మములేదనీ మేము తెలుపుచూ, ఆ విషయమును **"జీహాద్ అంటే యుద్ధమా?"** అని ఒక గ్రంథము కూడా వ్రాశాము. దానిని చదివిన తర్వాత కొందరు తమ తప్పును తెలుసుకోగలిగారు, కొందరు తమది తప్పని తెలిసినా దానిని ఒప్పుకొను స్థితిలో లేరు. అటువంటి వారు మేము జీహాద్‌ను గురించి ఏమీ తెలియకనే వ్రాశామని చెప్పారు. హిందువుకు ఖుర్‌ఆన్ గురించి ఏమి తెలియునని హేళనగా మాట్లాడుకోవడము కూడా జరిగినది.

ఇప్పుడు మేము వ్రాసిన **"అంతిమ దైవగ్రంథములో జ్ఞాన వాక్యములు"** అను గ్రంథమును చూచిన తర్వాత ఈ గ్రంథమును గురించి విపులముగా, నిగూఢమైన విషయములను బయటికి తీసి చెప్పిన మొదటి వ్యక్తిగా మమ్ములను చెప్పుకుంటారని చాలామంది ముస్లీమ్‌లే అంటున్నారు. కొన్ని విషయములను చూచినవారే ఆ విధముగా చెప్పుచున్నారంటే ఇందులో అన్ని విషయములను చూస్తే ఏమనగలరో ముందు చూడగలము. ఎందరు పొగడినా, కొందరయినా మమ్ములను విమర్శించువారుండవచ్చును. దేనినయినా దేవునివైపునుండి వచ్చినవిగానే మేము స్వీకరింతుము. దేవునికి తెలియకుండా ఏమీ జరుగదు. అప్పుడు మమ్ములను పరీక్షించుటకే

పొగడ్తలుగానీ, విమర్శలుగానీ దేవుడే కల్పించాడు అని అనుకుంటాము. అందువలన మేము పొగడ్తలకు పొంగిపోము. నిందలకు కృంగిపోము. మేము దేవుని సేవ చేయాలను ఉద్దేశ్యముతోనే ఆయన ఇచ్చిన జ్ఞానమునే మేము వ్రాయగలిగాముగానీ, మా స్వంతము ఇందులో లేశమయినా లేదు.

నేను ఒకప్పుడు ఒక ముస్లీమ్ యువకునితో మాట్లాడడము జరిగినది. అప్పుడు అతను జీహాద్ అను విషయమును గురించి మాతో కొంత చెప్పడము జరిగినది. ఈ విషయమును **"జీహాద్ అంటే యుద్ధమా?"** అను గ్రంథములో కూడా ప్రస్తావించాము. అప్పుడు ఆయన మాతో మాట్లాడిన విషయములు ఇక్కడ పొందుపరచి చూపుచున్నాము. సామాన్యముగా జీహాద్‌ను గురించి బయటికి మాట్లాడరు. అయితే ఆ రోజు మాట్లాడడము జరిగినది.

**భాషా :-** జీహాద్‌ను నేను నా జీవిత వృత్తిగా తీసుకొన్నాను. నేను స్వచ్ఛమైన జీహాదీని. దేవునిమార్గములో అన్నిటికంటే ఉత్తమమైన పనియగుట వలన దానినే నేను ఎంచుకొన్నాను.

**నేను :-** జీహాద్ అనే పదము ఖుర్ఆన్ గ్రంథములో వెతికినా దొరకదు. జీహాద్ అను పదమే ఖుర్ఆన్ గ్రంథములో చెప్పనప్పుడు, దానిని నీవు దేవునిమార్గములో ఉత్తమపనిగా ఎట్లు అనుకొన్నావు. జీహాద్ అనేది ఒక వృత్తియా? జీహాద్ అనేది ఏ పనిని చెప్పుచున్నది?

**భాషా :-** అల్లామార్గములో ఆటంకములు కలుగజేయువారినీ, అల్లాను విశ్వసించనివారినీ, అల్లాస్థానములో ఇతరులను ఆరాధించువారినీ ఎదుర్కొని పోరాడి చంపడమే పవిత్రయుద్ధము లేక జీహాద్ అంటారని మీకు తెలియదా?

**నేను :-** అంతిమదైవగ్రంథమయిన ఖుర్ఆన్‌లో లేని విషయమును నేను నమ్మను. పవిత్రయుద్ధము అను పేరును విన్నాను. దానినే జీహాద్ అనడము

కూడా విన్నాను. పవిత్రయుద్ధము అంటే అది పవిత్రముగానే ఉండాలి తప్ప అపవిత్రముగా ఉండకూడదు. దేవుని జ్ఞానమునకు, దేవుని మాటకు, ఖుర్‌ఆన్‌లోని వాక్యమునకు వ్యతిరేఖమయిన పనిని పవిత్ర యుద్ధము అని చెప్పడము తప్పగును. ఖుర్‌ఆన్ వాక్యమునకు, దేవుని వాక్యమునకు విరుద్ధముగాయున్నది ఎప్పటికీ పవిత్రము కాదు. అజ్ఞానులయినవారు జ్ఞానము తెలియనంతవరకు దేవున్ని విశ్వసించరు. అటువంటి వారికి దేవుని జ్ఞానమును తెల్పి, దేవుని జ్ఞానము యొక్క రుచిని చూపి దేవుని మార్గమువైపు మరల్చాలిగానీ, చంపడము మంచిదికాదు. **దేవుని అనుమతి లేనిదే ఎవడుగానీ జ్ఞాని కాలేడు, అజ్ఞాని కాలేడు. ఒక మనిషిని అజ్ఞానిగా మార్చుటకుగానీ, జ్ఞానిగా మార్చుటకుగానీ దేవుడే అధిపతి.** ఈ విషయమును **ఖుర్‌ఆన్ గ్రంథములో ఆరవ సూరాలో 110, 111వ ఆయత్‌లలో వ్రాయబడియున్నది. అల్లా అనుకుంటే ఏమయినా చేయ గలడు.** అంతేగానీ మనము దేవుడు చెప్పని పనిని చేస్తే అది పాపపు పని అవుతుందిగానీ, ఎంతమాత్రము పవిత్రమైన పనికాదు, పవిత్రయుద్ధమూ కాదు.

ఒక మనిషిని చంపి "వాడు అజ్ఞాని, దేవున్ని విశ్వసించనివాడు" అని చెప్పితే వచ్చిన పాపము పుణ్యముగా మారదు. ఈ విషయమును గురించి పవిత్ర ఖుర్‌ఆన్ గ్రంథములో సూరా 5-32వ ఆయత్‌లో ఇట్లు చెప్పడమైనది. **(5-32) "ఒక వ్యక్తి హత్యకు బదులుగాగానీ, లేదా భూమిలో కల్లోలము వ్యాపింపజేసినందుకు బదులుగాగానీ, కాకుండా ఎవడైనా ఒక వ్యక్తిని చంపితే అతడు సర్వమానవజాతిని చంపినట్లేయగును. ఎవడైనా ఒక మనిషి ప్రాణాన్ని కాపాడితే అతడు సర్వమానవజాతి ప్రాణాలను కాపాడినట్లే యగును ఈ విషయమును మా ప్రవక్తలు**

**తెలియజేశారు. అయినా అక్రమాలు చేస్తూ ఇతరులను చంపువారు కలరు".** దేవుడు ఈ విషయమును తెలియజేసిన తర్వాత పవిత్రయుద్ధము అనుట పెద్దపొరపాటగును. అంతేకాక పెద్ద అజ్ఞానమగును.

**భాషా :-** మా పెద్దలు మీరు చెప్పినట్లు చెప్పలేదు. అజ్ఞానులను, విగ్రహారాధకులను చంపడమే పవిత్రయుద్ధమనీ, అదే నిజమైన దేవుని కార్యమనీ, దేవుని కార్యములో చనిపోయినా స్వర్గమునకు పోవచ్చుననీ చెప్పారు. అది సత్యము కాదంటారా?

**నేను :-** పవిత్రయుద్ధమనే పేరే (జీహాద్ అనే పేరే) దైవగ్రంథమయిన ఖుర్ఆన్‌లో లేదు. అది మనుషులు పెట్టిన పేరేగానీ, దేవుడు చెప్పిన పేరు కాదు. ఒక విధముగా పవిత్రయుద్ధము అంటే దేవునిమార్గములో పోరాటము అని చెప్పవచ్చును. దేవుని మార్గములో పోరాటము అంటే స్థూలముగా బయట సంబంధయుద్ధము కాదు. శరీరములోనే సూక్ష్మముగా కనిపించకయున్న గుణములతో పోరాటమని తెలియవలెను.

హిందూ, ముస్లీమ్, క్రైస్తవులలో హిందువుల యందు, ముస్లీమ్‌ల యందు జీహాద్ అనేది కలదు. జీహాద్ అనునది ముస్లీమ్‌లలో కొందరు గొప్పగా చెప్పుకొంటున్నారు. హిందువులలో జీహాద్ అనే పేరు లేకున్నా, ముస్లీమ్‌లలో యున్న జీహాద్‌ను పోలిన కార్యములయిన దాడులను హిందువులు చేయుచున్నారు. క్రైస్తవులు ఏమాత్రము చేయని దానిని ముస్లీమ్‌లు పేరు చెప్పి చేస్తున్నారు. హిందువులు పేరు చెప్పకుండా చేయుచున్నారు. జీహాద్ అనేదానిని దేవుడు ఎక్కడయినా తన గ్రంథములలో చెప్పాడాయని చూస్తే, ఏ గ్రంథములోగానీ ఆ పేరు ఎక్కడా ప్రస్తావనకు రాలేదు. అయినా ముస్లీమ్‌లు దానిని దేవుని కొరకు చేయు కార్యమని చేయుచున్నారంటే, ఎక్కడో వారు తప్పుదారి పట్టించబడినారని తెలియు

చున్నది. సాధారణ ముస్లీమ్‌లను తప్పుదారి పట్టించినది వారి మతబోధకులే యని మనము ముందే చెప్పుకొన్నాము. వారి మతబోధకులే ముస్లీమ్‌లను తప్పుదారి పట్టించారనుటకు మనవద్ద ఒక సాక్ష్యముగలదు. అదేమనగా! ఈ మధ్యకాలములో కంప్యూటర్‌లోని ఫేస్‌బుక్ అను సైట్‌లో క్రొత్తగా జ్ఞానమును తెలుసుకొను ఒక హిందువు, "జీహాద్ అనే పేరుతో మనుషుల ప్రాణములను తీయడము మంచిదా? దేవుడు దానిని ఒప్పుకొంటాడా?" అని ప్రశ్నించాడు. ఆ ప్రశ్నకు ముస్లీమ్ మత ప్రచార సంఘముల వారు (ఆ సంఘముల పేర్లు ఇక్కడ వ్రాయదలచుకోలేదు.) కంప్యూటర్‌లోనే సమాధానము ఇచ్చారు.

ఫేస్‌బుక్‌లో వారు ఇచ్చిన సమాధానము ఇలా కలదు. "జీహాద్‌ను గురించి మాట్లాడుచూ దేవుడు మనుషులను చంపమని చెప్పాడా? దేవుడు దానిని ఒప్పుకొంటాడా? అని ప్రశ్నించారు. మేము దేవుడు చెప్పిన పనినే చేయుచున్నాము. జీహాద్ అనునది దేవునికొరకు చేయు పవిత్రయుద్ధమని మీరు మరువకూడదు. మీకు ఈ విషయము ఎక్కడ వ్రాశారు అని అనుమానముంటే పవిత్రఖుర్‌ఆన్ గ్రంథములో **"అత్ తౌబా" అనే 9వ సూరాలో 5వ ఆయత్‌లో** చూడండి. మనుషుల గొంతులు కొయ్యమని దేవుడు చెప్పినట్లు మీకే అర్థమవుతుంది" అని వ్రాసియుంచారు. ఫేస్‌బుక్‌లో వారి సమాధానమును చదివిన హిందువు ఆ విషయమును నాతో అడుగడము జరిగినది. దేవుడే స్వయముగా మనుషులను చంపమని చెప్పియుంటాడా! అని నన్ను అతను ప్రశ్నించడమైనది. దానికి దేవుడు ఏ సందర్భములో అలా చెప్పాడో చూచి చెప్పుతానని నేను చెప్పాను. తర్వాత తీరిక సమయములో **9వ సూరాలోని 5వ ఆయత్‌ను** చూచాను. దానిని చూచినవారు ఎవరయినా దేవుడు ఇతర మతస్థులను చంపమని చెప్పాడని

చెప్పగలరు. అయితే ఆ వాక్యము చివరిలో **"నిశ్చయముగా అల్లా క్షమించేవాడు, అపార కరుణామయుడు"** అని ఉన్నది. వాక్యము చివరిలో యున్న దేవుడు క్షమాశీలుడు, కరుణామయుడు అను మాటకు పైన చంపమని చెప్పినమాటకు ఏమాత్రము పొంతన కుదరలేదు. ఒకటి తూర్పు, ఒకటి పడమరలాగాయున్నవి. అప్పుడు ఆ వాక్యమును గురించి కొంత యోచించవలసిన పని ఏర్పడినది.

ఇంతకుముందే దేవుని జ్ఞానమును దేవుని వాక్యములను స్థూల అర్థముతో తీసుకోకూడదు అని చెప్పాము. **దేవుని జ్ఞానము 75 పాళ్ళు సూక్ష్మముగా (ముతషాబిహాత్‌గా) యున్నదనీ, కేవలము 25 పాళ్ళు మాత్రము స్థూలముగా (ముహ్కమాత్‌గా) యున్నదని చెప్పకొన్నాము.** ఇక్కడ **9వ సూరా, 5వ ఆయత్‌ను** ఏమాత్రము స్థూలముగా తీసుకోకూడదు. స్థూలముగా అర్థము చేసుకొంటే వాక్యము చివరిలోయున్న దేవుడు క్షమించేవాడు, కరుణగలవాడు అనుమాట తప్పగును, లేక అసత్యమగును. క్షమించేవాడు, కరుణించేవాడు ఎవడుగానీ మనుషులను మనుషులే చంపమని చెప్పడు. అందువలన క్షమించేవాడు కరుణించేవాడు సత్యమయితే మనుషులను మనుషులే చంపమని చెప్పుమాట అసత్యమగును. చంపమని తన ముస్లీమ్‌లకు అల్లా చెప్పియుంటే చివరిలో దేవుడు క్షమించేవాడు, కరుణించేవాడు అని చెప్పియుండడు. ఇక్కడ తప్పు భావమును అర్థము చేసుకొను అవకాశమున్నది. కాబట్టే ఈ వాక్యము చివరిలో దేవుడు క్షమించేవాడు, కరుణించేవాడు అని చెప్పడము జరిగినది. అక్కడ 9వ సూరాలో 5వ వాక్యములో ఈ విధముగా ఉన్నది. **(9-5) "నిషిద్ధ మాసాలు గడచిపోయిన తర్వాత చెడుమార్గమున పోవువారినీ, ముష్రిక్కులను (కపటులను) మాట తప్పినవారిని ఎక్కడ దొరికితే అక్కడ చంపండి**

**మరియు వారిని పట్టుకోండి, ఇంకా వారిని చుట్టుముట్టండి మరియు ప్రతిమాటు వద్ద వారికై పొంచియుండండి. అయితే వారు పశ్చాత్తాపపడి నమాజ్ స్థాపించి జకాత్ ఇస్తే వారిని వారి మార్గాన వదలిపెట్టండి. నిశ్చయముగా అల్లా క్షమాశీలుడు, కరుణించేవాడు."** అని గలదు.

ఇక్కడ ఈ సూరాలో ఏముందో బాగా ఆలోచిస్తే, జీహాద్‌కు ఈ ఆయత్‌కు ఏమాత్రము సంబంధము లేదు. అంతేకాక ఈ వాక్యములో చాలా తెలివైన మేధావులు కూడా తప్పు భావములో పడిపోయారు. ఎవరు ఎవరిని చంపాలని దేవుడు చెప్పాడో ఏమాత్రమూ ఒక్కరు కూడా ఆలోచించ లేదు. ఈ ప్రపంచమును సృష్ఠించడములోనూ, నాశనము చేయడములోనూ మూలకారకుడు దేవుడే. దేవుడు కారకుడేగానీ, కార్యకుడుకాడు, అంటే పనిచేసేవాడు కాదు. ఆయన అనుకుంటే ఏ పనియైనా అట్లే జరిగిపోగలదు. ఇదే విషయమునే **2వ సూరా 117వ ఆయత్‌లో "ఆయన దేనినీ చేయడు. ఆయన చేయదలచిన దానిని 'అయిపో' అంటే అయిపోగలదు."** అని వ్రాయబడియున్నది. దీనినిబట్టి దేవుడు అనుకుంటే లేక చెప్పితే చేసేవారు న్నారని తెలియుచున్నది. దేవుడు ప్రపంచమును పాలించుటకు తన ఆధీనములో ఎందరో పాలకులను పెట్టుకొన్నాడు. దేవుని ఆజ్ఞను నెరవేర్చుటకు కనిపించని పాలకులు దేశమంతా వ్యాపించియున్నారు. తన పాలకులచేత దేవుడు మనుషులను సృష్ఠించాడు మరియు చంపుచున్నాడు. ప్రతి పనికి దేవుడు మూలకారకుడేగానీ, ఆయన పనిని చేయడు. జరుగవలసినపనిని చేయువారూ, ఆయన మాటను ఆచరించు పాలకులూ ఎక్కడపడితే అక్కడ యున్నారు. దేవుడు కనిపించడు, దేవుని పాలకులూ కనిపించరుగానీ, దేవుని పాలనమాత్రము భూమిమీద జరిగి పోతూవుంటుంది. అయితే దేవుడు ఏమి ఆజ్ఞ ఇస్తున్నాడని ఎవరికీ

తెలియదు. కావున ఆయన ఆజ్ఞ ఎటువంటిదో తెలియుటకు ఇక్కడ **9వ సూరాలో 5వ ఆయత్‌ను** చెప్పాడు. **దేవుని పాలనను సాగించువారు, ఎవరినయినా శిక్షించువారు, ఎవరికైనా ఏమయినా చేయువారు అయిన తన పాలకులకు నిషిద్ధ దినములలో కాకుండా మిగతా దినములలో ముష్రిక్కులను చంపమని చెప్పాడు. కొంతమందిని బంధించమని చెప్పాడు. కొంతమందిని చుట్టుముట్టమని చెప్పాడు. కొంతమందిని మాటువేసి పొంచియుండండి అని చెప్పాడు.** ఇక్కడ గమనించితే అందరినీ చంపమని చెప్పలేదు. కొందరిని పట్టుకోమనీ, కొందరిని చుట్టుముట్టమనీ, కొందరిని మాటు దగ్గర పొంచియుండమనీ చెప్పాడు, చెప్పింది దేవుడు, విని ఆచరించవలసినవారు ఆయన పాలకులు లేక దూతలు. ఆయన కొన్ని కార్యములను తన దూతలకు లేక తన పాలకులకు చెప్పితే, మధ్యలో విన్న మనుషులు అది నాకే చెప్పాడనీ, నేనే ఇతరులను చంపుతాననీ, అదే జీహాద్‌యనీ, దేవుని కార్యమును చేయడమే పవిత్రయుద్ధమని ఎందుకు అనుకోవాలి? నీకు సంబంధము లేని వాటిని నీకే చెప్పాడని అనుకోవడము పొరపాటు కాదా! దేవుడు ముష్రిక్కులపట్ల ఈ విధముగా ఆజ్ఞ ఇస్తాడని **9వ సూరా, 5వ ఆయత్‌లో** కలదు. ఆ ఆజ్ఞను నెరవేర్చువారు ఆయన పాలకులుండగా, ఆ కార్యమును నేను చేయాలని మనిషి ఎందుకు అనుకోవాలి?

ఈ వాక్యము మొదటిలోనూ, వాక్యము చివరిలోనూ రెండు గేట్ల లాగా రెండు వాక్యములు కలవు. ప్రారంభములోని మొదటి వాక్యమును, ముగింపులోని చివరి వాక్యమును గమనించితే, ఏమాత్రము తెలివియున్న మనిషి కూడా ఆ వాక్యము మనుషులకు చెప్పినదని అనుకోడు. ఈ వాక్యములో మొదట నిషిద్ధమాసములు గడచిన తర్వాతయని చెప్పబడినది.

నిషిద్ధ మాసములు అంటే ఏమిటో ఎవరికయినా తెలుసా? లేకపోతే దేవుడు ఎక్కడయినా ఎవరికయినా ఇవి నిషిద్ధ మాసములని చెప్పాడా? దేవుడు చెప్పలేదు. మనిషికీ తెలియవు. అటువంటి సందర్భములో ఎవరికి ఇష్టమొచ్చినవి వారు నిషిద్ధమాసాలుగా కొందరు ముస్లీమ్ పండితులు చెప్పుకోవడము జరుగుచున్నది. అయినా వారిమాట నిజమని వారికే నమ్మకము లేదు. అటువంటప్పుడు నిషిద్ధమాసాలు అని దేవుడు ఎందుకు ఆ పేరును అక్కడ చెప్పాడని ఎవరికయినా ప్రశ్నరాగలదు. దానికి జవాబు ఈ విధముగా కలదు. మనిషి పుట్టినప్పుడే అతని కర్మపత్రము ప్రకారము కొంతకాలము సుఖములు, కొంతకాలము కష్టములు అనుభవించాలని దేవుడు నిర్ణయించి పంపియుండును. దేవుని నిర్ణయము ప్రకారము మనిషి సుఖములను అనుభవించు కాలములో కష్టములు అనుభవించుటకు వీలులేదు. అందువలన మనిషి పుణ్యకాలము సుఖములు అనుభవించు కాలమనీ, ఆ సమయము కష్టములు అనుభవించుటకు నిషిద్ధకాలమగుననీ, ఆ కాలములో సుఖములే అనుభవించాలిగానీ, కష్టములు అనుభవించుటకు వీలులేదని తెలియుచున్నది. అందువలన మనిషి పుణ్యకాలమును దేవుడు నిషిద్ధ మాసములనీ, నిషిద్ధ కాలమనీ చెప్పాడు.

కర్మపత్రములో మనిషికి ఉన్న పుణ్యకాలము అతని కష్టములకు నిషిద్ధకాలమగును. అందువలన నిషిద్ధ కాలము మనిషి మనిషికీ వేరువేరుగా యుండును. అట్లయిన మనిషి కష్టముల నిషిద్ధ కాలము, సుఖముల షిద్ధ కాలము ఎప్పుడుండునో ఏ మనిషికీ తెలియదు. షిద్ధము నిషిద్ధము అన్నియూ కర్మపత్రములోని కర్మరహస్యములు. కర్మపత్రమేమిటో, అందులో ఏ కర్మలున్నవో ఏ మనిషికీ తెలియదు. అటువంటపుడు నిషిద్ధకాలము మనిషికి ఎలా తెలియగలదు? తెలియుటకు అవకాశమే లేదు. అయితే ఆ

మాటను చెప్పినది మనిషికికాదుయని జ్ఞాపకముంచుకోవలెను. దేవుడు నిషిద్ధకాలమును గురించి చెప్పినది తన క్రిందయున్న పాలకులకు. దేవుని పాలకులకు మనుషుల తలలోని కర్మ, అందులోని పాపపుణ్యములు తెలుసు. దేవుడు చెప్పినట్లు మనిషి పుణ్యకాలమయిన నిషిద్ధకాలమును వదలి పాప కాలము వచ్చిన వెంటనే వారికున్న కర్మప్రకారము కొందరు చంపబడుదురు, కొందరు బంధింపబడుదురు, కొందరు ముట్టడించబడుదురు. దేవుడు చెప్పినట్లు ఎవరికి ఏమి జరుగవలెనో వాటినన్నిటినీ, కంటికి కనిపించని దేవుని పాలకులు చేయుదురు. మనిషి పుట్టినప్పటినుండి ఎవడూ దేవుని పాలకుల ఆధీనములో లేకుండా బ్రతుకలేదు. వాని జీవితములో ఏమి కావలసియుంటే అవి, ఏమి జరుగవలసియుంటే అవి జరుపువారు దేవుని పాలకులే. దేవుడు ఏమీ చేయకయుండును. చేయవలసిన పనులన్నిటినీ దేవుని పాలకులే చేయుదురు.

ఎంతటి కర్మను (పాపమును) చేసుకొన్నవాడుగానీ, వాడు దేవుని మార్గమును అనుసరించి, దేవుని జ్ఞానమును తెలియగలిగితే, అటువంటి వాని పాపమును దేవుడు క్షమించును. దైవజ్ఞానము లభించినవాని కర్మలు అగ్నిలో కట్టెలు కాలిపోయినట్లు జ్ఞానమను అగ్నిలో కాలిపోవునని భగవద్గీతలో భగవంతుడు చెప్పాడు. అందువలన దేవున్ని పై వాక్యములో క్షమించువాడని అన్నారు. దేవుని జ్ఞానమును తెలిసి దేవుని మార్గములో పయనించువాని కర్మలు (పాపములు) కాలిపోవునట్లు, దేవుడు చేయు చుండుట వలన దేవున్ని కరుణామయుడు అన్నారు. మనుషులు దేవున్ని కరుణామయుడు, దయామయుడు అనినా, దేవునికి వాస్తవముగా కరుణ లేదు, దయలేదు. ఆయన గుణములకు అతీతుడు.

ఒక మనిషి తన జీవితమును ఎలా గడుపుచున్నదీ, అతను ఎవరి ఆధీనములో బ్రతుకుచున్నదీ, ఎవరి ఆధీనములోవుండి చనిపోవునదీ మనిషికి

తెలియునట్లు **దేవుడు 9వ సూరా, 5వ ఆయత్‌ను చెప్పాడు.** ఈ ఆయత్‌లో మనిషియెడల దేవుడు తన ఆజ్ఞను ఏమని తన పాలకులకు ఇచ్చుచున్నాడో అర్థమగులాగున పై వాక్యము కలదు. అయితే ఈ వాక్యములో ఇంత సారాంశముయున్నదని తెలియని మనుషులు, మనుషులను చంపమని చెప్పినదీ, బంధించమని చెప్పినదీ, తమకేనని అలా చేయడమే పవిత్రయుద్ధ మని అనుకొంటున్నారు. అలా అనుకోవడము పెద్దపొరపాటగును. అది తన దూతలకు, పాలకులకు చెప్పినమాటగానీ, మనుషులకు చెప్పిన వాక్యముకాదు. దానిని **"జీహాద్"** అని చెప్పుట పూర్తి తప్పగును. ఈ వాక్యమునకూ జీహాద్ అనే దానికీ పోలికే లేదు. జీహాద్ అంటే మనుషులను చంపడము అసలే కాదని తెలియాలి.

జీహాద్ అంటే పవిత్రయుద్ధము అని అర్థముంటే, అది పవిత్రమైన కార్యముగా ఉండాలిగానీ, మనుషులను చంపు అపవిత్రకార్యముగా ఉండకూడదు. ఒక మనిషి ఇతర మనుషులను చంపడము పాపముపని యగును. అందువలన అది అపవిత్రకార్యమగును, పవిత్రకార్యము కాదు. పవిత్ర యుద్ధమంటే ఒక విధముగా అది యుద్ధమేకాదని చెప్పవచ్చును. దేవుని మార్గములోని పోరాటమును పవిత్రయుద్ధము అని అనవచ్చునుగానీ, సాటి మనుషులను చంపునది పవిత్రత అనిపించుకోదు. అటువంటి కార్యములు పవిత్రయుద్ధము కానేకావు. అన్ని విధముల ఆలోచించినా చివరకు దేవుని మార్గములో శ్రమపడడమును పవిత్రయుద్ధముగా చెప్పవచ్చును. దేవుని మార్గమంటే ఏమిటి? అది ఎక్కడున్నది? ఎట్లుంటుంది? అని కొందరు ప్రశ్నించవచ్చును. దానికి సరియైన సమాధానము చెప్పితే దేవుని మార్గము సూక్ష్మమైనది, స్థూలమైనది కాదు. అందువలన అది కంటికి కనిపించునది కాదు. అటువంటి మార్గమును

ఇట్లుంటుందియనిగానీ చెప్పుటకు వీలులేదు. దేవున్ని తెలియుటకు చేయు కార్యములనే దేవునిమార్గము అనవచ్చును. అటువంటి కార్యములో పడే శ్రమను దేవుని మార్గములో పోరాటము అని చెప్పవచ్చును.

ఇప్పుడు తిరిగి **9వ సూరా, 5వ ఆయత్‌లోనికి** వస్తాము. ఆ వాక్యములో మనము చెప్పుకోవలసినది ఇంకా కొంతయున్నది. దేవుడు ముష్రిక్కులను (కపటులను, మాట తప్పినవారిని) నాల్గురకముల శిక్షించమనీ, చంపమనీ చెప్పిన తర్వాత ఒకవేళ వాడు పాశ్చాత్తాపపడి నమాజ్‌ను స్థాపించి, జకాత్‌ను ఇస్తే వారిని వారి మార్గాన వదలిపెట్టండి అని వున్నది కదా! నమాజ్, జకాత్ ముస్లీమ్ మతములోని ఆరాధనా మార్గములని వాటినే దేవుని మార్గమని చెప్పుకొన్నాము. ఒకవ్యక్తి ముస్లీమ్‌గా పుట్టి నమాజ్ చేయకుండా, జకాత్ ఇవ్వకుండాయుంటే అట్టివానిని మాట తప్పినవాడనీ, తన మతములోనున్న మాటను తప్పినవాడనీ, కపట హృదయము కలవాడనీ చెప్పవచ్చును. అప్పుడు అటువంటి వానిని శిక్షించమని దేవుడు తన దూతలకు చెప్పడము జరిగినది. ఆ విధముగా దేవుని పాలకులు శిక్షించినప్పుడు ఎవడయినా తన తప్పును తాను తెలుసు కొని, పాశ్చాత్తాపపడి దేవుని మార్గమును అనుసరించాలని తలచి దేవుని ప్రార్థన అయిన నమాజ్ చేస్తూ, జకాత్‌ను ఇస్తే వాడు దేవుని మార్గములోనికి వచ్చినట్లేయగును. అప్పుడు వానిని శిక్షించవలసిన పనిలేదు. వాని తప్పులన్నీ దేవుడు క్షమించుట వలన దేవుని పాలకులు అతనిని శిక్షించ కుండా వానిని వాని మార్గమున వదలిపెట్టమని చెప్పినట్లు ఆ వాక్యములో గలదు. వానిని వానిమార్గమున అని అంటే వాడు అనుసరిస్తున్న దేవుని మార్గమున అని అర్థము. అలా వదలిపెట్టుట వలన వానిని శిక్షనుండి

క్షమించినట్లగుచున్నది. అందువలన దేవుడు క్షమించువాడు అని వాక్యము చివరిలో చెప్పడమైనది.

ఇంత వివరముగా చెప్పినప్పటికీ కొందరు నిషిద్ధ కాలము లేక నిషిద్ధ మాసములు అను మాట దగ్గర కొంత అనుమానము కల్గి మా మాటను నమ్మకుండాయున్నారు. అటువంటివారికి ముస్లీమ్ పెద్దలు చెప్పిన వివరమును చూడమని ఇక్కడ ఆ వివరమును పొందుపరుస్తున్నాను చూడండి. ("అంతిమ దైవగ్రంథము ఖుర్ఆన్" అను గ్రంథములో మహా జ్ఞాని 'హాఫిజ్ సలాహుద్దీన్ యూసుఫ్" గారు వ్రాసిన వ్యాఖ్యానమును ఇక్కడుంచాము.) **("నిషిద్ధమాసాలంటే ఏవి? ఈ విషయముపై భిన్నాభిప్రాయములున్నాయి. 1) రజబ్ 2) జీఖ అద 3) జిల్‌హాజ్ 4) ముహర్రమ్ అను నాలుగు మాసాలే నిషిద్ధమాసములని ఒక అభిప్రాయముంది. అయితే జిల్‌హాజ్ నెల 10వ తేదీన ఈ ప్రకటన వెలువడింది. ఈ రకముగా ఈ ప్రకటన వెలువడిన రోజు నుండి కేవలము 50 రోజుల గడువు ఇవ్వబడింది. ఈ గడువు ముగియ గానే ముష్రిక్కులను పట్టుకొని వారిని హతమార్చేందుకు అనుమతి ఇవ్వబడింది. అయితే ఇమామ్ ఇబ్నె కసీర్ ఈ అభిప్రాయముతో ఏకీభవించలేదు. ఈ ఆయత్‌లో ప్రస్తావింపబడిన నిషిద్ధ మాసాలు ఆ నిషిద్ధ మాసాలు కావనీ, వాస్తవానికి ఇది జిల్‌హాజ్ 10వ తేదీనుండి రబీవుస్సానీ 10వ తేదీవరకు గల గడువు అని ఆయన అభిప్రాయ పడ్డాడు. మరి వీటిని నిషిద్ధ మాసాలు (అష్‌హురే హురుమ్) అని ఎందుకు అనడము జరిగింది? అని అంటే తెగతెంపుల ప్రకటన జరిగిన తర్వాత ఆ నాలుగు నెలల్లో ముష్రిక్కులు యుద్ధము**

**చేయటానికి గానీ, వారికి వ్యతిరేఖముగా ఎటువంటి చర్యనుగైకొన టానికిగానీ, అనుమతి లేకపోయింది. తెగత్రెంపుల ప్రకటన జరిగిన తీరును బట్టి ఈ రెండవ అభిప్రాయమే సహేతుకము అనిపిస్తోంది. వాస్తవము అల్లాహ్కే ఎరుక")**

వాస్తవముగా దైవజ్ఞానమును అనుసరించి ఫలానా దినములే నిషిద్ధమాసములని చెప్పుటకు వీలులేదు. ఎవరి కర్మనుబట్టి వారికి నిషిద్ధ కాలముండునని చెప్పవచ్చును. పైన చెప్పిన **5వ ఆయత్** వాక్యమును బాగా అర్థమగుటకు తర్వాత భవిష్యత్తులో అనుమానములు రాకుండుటకు **9వ సూరాలోనే "6వ" ఆయత్ను** కూడా వివరించి చెప్పుకుంటే జీహాద్ మీదయున్న భ్రమ అంతయూ తొలగిపోవును. ఆరవ ఆయత్ ఈ విధముగా కలదు. **(9-6) "ఒకవేళ ముష్రిక్కులలో ఏ వ్యక్తి అయినా నీ శరణు కోరితే, అతను దైవజ్ఞానమును వినేంతవరకు అతనికి నీవు ఆశ్రయము ఇవ్వు. ఆ తరువాత అతనిని అతని సురక్షిత స్థానానికి చేర్చు. వారు జ్ఞానము తెలియని వారగుటచేత, వారిపట్ల నీవు ఈ విధముగా వ్యవహరించు".** ఇప్పుడు ఈ వాక్యములో కూడా మన తెలివిని ఉపయోగించి భావమును అర్థము చేసుకోవలెను. అట్లుకాకుండా పైపైన చూడగలిగితే మరియొక రకముగా అర్థమగును. అందువలన వాస్తవము తెలియునట్లు ఈ వాక్యమును గురించి యోచించాలి. దేవునిమార్గములో నాలుగు పనులను చెప్పినా అందులో వెనుకలగల రోజా, హజ్లకంటే ముఖ్యమైనవి నమాజ్, జకాత్యని తెలియాలి. మనిషి అజ్ఞానములోయుండి దేవదూతల చేత శిక్షింపబడునప్పుడు, వారి హృదయములో మార్పువచ్చి జ్ఞానమార్గములో పోవాలనుకొన్నవాడు అంతరంగములో నేను ఈ బాధలనుపడలేను. నేను ఇప్పటి నుండి దైవమార్గములో ప్రయాణిస్తానని అనుకొనువాడు దేవున్ని

శరణు జొచ్చినట్లే, అప్పుడు దేవుని దూతని కూడా శరణుజొచ్చినట్లేయగును. దేవుడు ఏమీ చేయనివాడు కావున అప్పుడు వాని శరణ్యమును వానిని శిక్షించు దూత లేక పాలకుడు అయినవాడే స్వీకరించవలెను. అటువంటి వానికి దైవజ్ఞానమును తెలియునట్లు దేవదూతయే అవకాశము కల్గించును. అతనికి దైవజ్ఞానము తెలియునంతవరకు దేవదూత ఏ శిక్ష విధించకుండా వుండును. అప్పుడు మనిషి దేవదూతయొక్క ఆశ్రయములో ఉన్నట్లే లెక్క. అతడు సంపూర్ణ జ్ఞానము తెలిసిన తర్వాత వానికి ఏ బాధ విధించకుండా దేవదూత వానిని వదలిపెట్టును. అప్పుడు వానిని సురక్షిత స్థానములో వదలి పెట్టినట్లే యగుచున్నది. జ్ఞానము తెలియని మనుషుల ఎడల దేవుడు తనదూతను కఠినముగా ప్రవర్తింప చేయకుండా చేయడమేకాక, ఆ మనిషికి జ్ఞానమును తెలియునంతవరకు కాచుకొనియుండి జ్ఞానమును తెలుసు కోగల్గితే, వానిని సురక్షితముగా వదలిపెట్టునట్లు చేయుచున్నాడు. ఒకవేళ వాడు జ్ఞానమును తెలియకుండా తిరిగి అజ్ఞానము వైపుపోతే, వానికి దూతనుండి రక్షణ యుండదు. దూత తప్పక వానిని పీడించి సురక్షితముగా లేకుండా చేయును.

9వ సూరా 5,6 వాక్యములనుబట్టి ఒక మనిషిని హింసించువాడు గానీ, రక్షించువాడుగానీ, వానివద్దయున్న పాలకుడేయని తెలియుచున్నది. మనిషి దేవుని జ్ఞానము తెలియగలిగితే, దూతనుండి రక్షణ ఉంటుంది. జ్ఞానమును తెలియకపోతే, దూతనుండి శిక్షయుంటుంది. ఇది ముస్లీమ్‌లకు మాత్రమే చెప్పిన జ్ఞానము అని అనుకోకూడదు. ఇందులో చెప్పిన జ్ఞానము అన్ని మతస్థులకూ వర్తించును. అందువలన మతరక్షణకని ఒక మనిషి మరొక మనిషిని హింసించడముగానీ, చంపడముగానీ చేస్తే అది తప్పక పాపమగునుగానీ, దేవునిమార్గములో మంచిపనికాదు. దేవుని కొరకు

చేయు పవిత్రయుద్ధమూ కాదు. ఈ మధ్యకాలములో మతద్వేషములతో ఒకరినొకరు చంపుకొనుచూ దానిని పవిత్రయుద్ధమని అనుకొంటున్నారు. మతములకొరకు, మతరక్షణకొరకు ఒకరినొకరు చంపుకోవడము అన్ని మతములలో జరుగుచున్నది. అయితే ముస్లీమ్‌లు ప్రత్యేకించి పవిత్ర యుద్ధమనీ, దేవునికొరకు చేయు కార్యమనీ దానినే జీహాద్ అని చెప్పు చున్నారు.

**ముస్లీమ్ :-** మీరు జీహాద్ లేక పవిత్రయుద్ధమును గురించి చెప్పుచూ ఆ పేరుగానీ, ఆ మాటగానీ ఖుర్‌ఆన్ గ్రంథములో లేదన్నారు కదా! అయితే **2వ సూరా,216వ ఆయత్‌లో "మీకు నచ్చనిదైనా, అసహ్యాకరమైనా యుద్ధము చేయడము మీకు విధిగా నిర్ణయించబడినది. మీకు నచ్చని విషయమే మీకు మేలయినది కావచ్చు మరియు మీకు నచ్చే విషయమే మీకు హానికరమైనది కావచ్చు. కానీ అల్లాహ్‌కు అంతా తెలుసు. మీకు ఏమీ తెలియదు"** అని కలదు. దీనిని గురించి మీరేమంటారు?

**నేను :-** ఇక్కడ చెప్పినది మనుషలను చంపుకొనే యుద్ధము కాదు. దైవ మార్గములో శ్రమపడడమును మనిషి జీవితములో యుద్ధముగా యున్నదని వర్ణించి చెప్పారు. దైవమార్గములో పోరాటమువలె జీవితమును సాగించడమును ధర్మయుద్ధము అంటాము. ధర్మముచేత అధర్మములను నాశనము చేయడమును ధర్మయుద్ధము అనవచ్చును. ధర్మయుద్ధములో నష్టమురావచ్చును, బంధువులు దూరము కావచ్చును, ఉన్న సంపద పోవచ్చును, ఆస్తులు పోవచ్చును, భార్యాపిల్లలు పోవచ్చును. అందువలన ధర్మయుద్ధము అందరికీ నచ్చనిపనిగాయున్నది. అయినా ఉన్నవన్నీ పోయినా అన్నిటికంటే మించినది మనకు లభించవచ్చును. పై వాక్యములో కూడా మీకు నచ్చని విషయమే మీకు మేలయినది కావచ్చును అని చెప్పారు.

9వ సూరా 24వ ఆయత్‌లో ఇలా కలదు **(9-24) "మీ తండ్రి తాతలు, మీ కుమారులు, మీ సోదరులు, మీ స్నేహితులు, మీ బంధువులు, మీరు సంపాదించిన ఆస్తిపాస్తులు, మీ వ్యాపారాలు, మీ ప్రీతికరమైన భవనములు అల్లాహ్‌కంటే, అల్లామార్గములో పోరాటముకంటే మీకు ఎక్కువ ప్రియమైన వైతే అల్లాహ్ మీకు సన్మార్గమును చూపడు."** అని ఉన్నది కదా! ఇక్కడ దేవుని విషయములో ప్రాకులాడడమును పోరాటము అని చెప్పుచున్నారు. దేవుని మార్గములో పోరాటము అంటే దేవుని కొరకు చేయు పనులన్నియూ పోరాటమనియే చెప్పవచ్చును. అదే విధముగా దేవుని మార్గములోని నమాజ్, జకాత్ చేయుటలో అయిష్టత ఏర్పడును. అప్పుడు మనిషి తనలోని గుణములతో ఘర్షణ పడవలసివచ్చును. దానినే ఇక్కడ యుద్ధమన్నారు.

**ముస్లీమ్ :-** యుద్ధము అంటే ఆయుధములతో చేసేదనీ, పవిత్రయుద్ధము అంటే దేవుని కొరకు చేయునదనీ, అవిశ్వాసులను చంపేది అనీ మా పెద్దలు చెప్పగా విన్నాను. మీరేమో వేరు విధముగా చెప్పుచున్నారు.

**నేను :-** నీకు బాగా అర్థము కావాలంటే ఇంకా వివరముగా చెప్పుతాను చూడు. కత్తులతో లేక బాంబులతో మనుషులను చంపుదానిని అపవిత్ర యుద్ధము అని అనవచ్చును. అలా చంపునది తనమేలు కొరకేగానీ దేవుని మేలు కొరకు కాదు. బయటిక్రియల వలన, బయటయుద్ధముల వలన దేవుడు తెలియబడడు, దేవుడు తెలియాలంటే దేవునికొరకు శరీరములోపల గల గుణములచే ఎంతో ప్రతిఘటన చేయవలసియున్నది. శరీరములోని గుణములే మనిషిని వక్రమార్గమును పట్టించి దేవునికి దూరము చేయు చున్నవి. శరీరములోని తలయందుగల గుణములే సైతాన్ రూపములో యున్నవి. సైతాన్ అనగా ఆధ్యాత్మికరంగములో మాయ అంటున్నాము. మాయలోని భాగములే మనిషిలోని ఆరు గుణములు. వీటినే మనిషికి

శత్రువర్గము అని చెప్పవచ్చును. శత్రువర్గము అంటే శత్రువుల గుంపు అని అర్థము. ఈ ఆరు గుణములు మనిషికి భీకరమైన శత్రువులుగా యున్నాయి. మనిషి బయట శత్రువులతో పోరాడితే బయటయుద్ధము అవుతుంది. లోపలి శత్రువులయిన ఆరుగురితో పోరాడితే లోపలి యుద్ధము అవుతుంది.

| బయటి యుద్ధము | లోపలి యుద్ధము |
|---|---|
| 1) బయటియుద్ధము రక్తపాతముతో కూడుకొనియుంటుంది. | 1) లోపలియుద్ధము రక్తపాత రహితముగా ఉంటుంది. |
| 2) బయట ఒక శత్రువును చంపినా చచ్చిన వానిని గురించి ఏడ్చేవారుంటారు. | 2) లోపల ఆరుమందిని చంపినా ఏడ్చేవారు ఎవరూ లేరు. |
| 3) బయట శత్రువులను చంపితే దేవుడు తెలియబడక పోవడమే కాక పెద్దమొత్తములో పాపము మాత్రము వస్తుంది. బయట శత్రువును చంపితే పోలీస్ కేసులుంటాయి, న్యాయ స్థానములో శిక్షయుంటుంది. | 3) లోపల శత్రువును ఒక్కరిని చంపినా, ఆరుమందిని చంపినా కేసులూవుండవు, శిక్షలూ వుండవు. ఏమాత్రము పాపము రాదు. |
| 4) బయట శత్రువులను చంపడము వలన దేవుడు దూరమగును. | 4) లోపల గుణ శత్రువులను చంపడము వలన దేవునికి దగ్గరగుటకు అవకాశముగలదు. |

| | |
|---|---|
| 5) బయట శత్రువులను చంపుట వలన నరకప్రాప్తి తప్పదు. | 5) లోపలి శత్రువులను చంపుట వలన మోక్షము లభించును. |
| 6) బయట శత్రువులను చంపుట వలన బయట ఆస్తులు రావచ్చును. | 6) లోపలి గుణ శత్రువులను చంపుట వలన బయట ఆస్తులు పోవచ్చును. |
| 7) బయటయుద్ధముతో బయటి రక్తపాతముతో ఇతరుల ఆస్తిని దక్కించుకోవచ్చును. | 7) లోపలి యుద్ధము వలన బయట ఆస్తులు ఉన్నవి కూడా పోవచ్చును. దగ్గర బంధువులు దూరము కావచ్చును. |
| 8) బయట ఏ శత్రువును చంపినా అది బాహ్యాయుద్ధము క్రిందికి వచ్చును. | 8) లోపల ఏ గుణమును లేకుండా చేసుకొనినా అది అంతరయుద్ధమగును. అంతరయుద్ధములో మనిషి గుణములను శత్రువులను జయించితే బయట ఏ లాభము రాదు. |
| 9) బయట జరుగు యుద్ధము ఆయుధములచేత చేయబడునదిగా ఉన్నది. ఆయుధముల చేత చేయు విచ్ఛిన్నము (యుద్ధము)లో | 9) లోపలి యుద్ధము వలన జనన మరణములు లేని మోక్షము లభించును. |

| | |
|---|---|
| ఆయుష్షు హరించు మరణములు జరుగును. | |
| 10) బయట జరుగు యుద్ధమునకు అజ్ఞానుల ఆశీస్సులు, అజ్ఞానుల సలహాలు, అజ్ఞానుల ప్రేరణయుండును. | 10) లోపల జరుగు యుద్ధమునకు జ్ఞానుల యొక్క సలహాలు, జ్ఞానులయొక్క ఆశీస్సులు, జ్ఞానులయొక్క ప్రేరణ ఉండును. |
| 11) బయట యుద్ధమును అజ్ఞానులు సహితము చేయగలరు. | 11) లోపలి యుద్ధమును జ్ఞానులు మాత్రమే చేయగలరు. |
| 12) బయట యుద్ధమునకు కండబలమూ, శరీర బలమూ అవసరము. | 12) లోపలియుద్ధమునకు కండబలము, శరీర బలము అవసరము లేదు. జ్ఞానబలముతో చేయవచ్చును. |
| 13) బయట యుద్ధము చేయటకు తర్ఫీదు (ట్రయినింగ్) అవసరము | 13) లోపలియుద్ధమునకు ట్రయినింగ్ (తర్ఫీదు) అవసరము లేదు. |
| 14) బయట యుద్ధమునకు శరీర కవచములు, మందమైన దుస్తులు అవసరము. | 14) లోపలియుద్ధమునకు కవచములు, మందము గుడ్డలు అవసరము లేదు. చిన్న గోసి పెట్టుకొని అయినా యుద్ధము చేయవచ్చును. |

| | |
|---|---|
| 15) బయటయుద్ధములో సైన్యము అవసరము. | 15) లోపలి యుద్ధమునకు సైన్యము అవసరము లేదు. |
| 16) బయటి యుద్ధము అజ్ఞానముతో చేయవచ్చును. | 16) లోపలియుద్ధము జ్ఞానముతో చేయవలెను. |

యుద్ధము అంటే ఆయుధములచేత చేయునదే అని అనుకో కూడదు. యుద్ధము రెండు రకములుగా యున్నది.

ఇక్కడ ముఖ్యముగా తెలియవలసినదేమంటే, ఖుర్‌ఆన్‌లో యుద్ధము అను పదమును వాడినా, అది దేవునిమార్గములో యుద్ధమేగానీ, ప్రపంచ మార్గములోని బయటి యుద్ధముకాదని తెలియవలెను. అట్లుకాకుండా దుప్పటి అంటే కప్పుకుండేదియనీ, కత్తి అంటే పొడిచేది అనీ అనుకోకూడదు. దుప్పటి అంటే కప్పుకొనేదే కాకుండా పరుచుకొనే దానికి కూడా పనికి వస్తుంది. అలాగే కత్తి అంటే పొడిచేదేకాదు కాయగూరలను తరుగునదని కూడా అని అర్థము చేసుకోవాలి. అట్లే యుద్ధము అంటూనే మనుషులను చంపేదే కాదు, మనుషులను ఎల్లకాలము చనిపోకుండా మోక్షములో ఉంచునదని కూడా తెలియవచ్చును.

ఇదంతా గమనించిన తర్వాత జీహాద్‌యనీ, పవిత్రయుద్ధమనీ పేరు పెట్టుకొని, దానిని దైవగ్రంథములకు జోడించి పెట్టడము వలన దైవ గ్రంథములకు కూడా మర్యాద లేకుండా చేసినట్లగుచున్నది. అందువలన ఖుర్‌ఆన్ గ్రంథములో **జీహాద్** అనే పదమే లేదని చెప్పాము. ఖుర్‌ఆన్ గ్రంథములో అక్కడక్కడ దేవుని మార్గములో పోరాటమని, దేవుని మార్గములో ధర్మయుద్ధమని యున్నదిగానీ, జీహాద్ అనే పదమే లేదు. దైవగ్రంథమయిన

ఖుర్‌ఆన్ గ్రంథములో లేని పదమును పట్టుకొని మతములో ముఖ్యమైన కార్యముగా దానిని గురించి చెప్పుకోవలసిన అవసరమేముంది? దేవుడు తన గ్రంథములలో చెప్పని దానిని గురించి మాట్లాడుకోవడము, ముఖ్యముగా చేయడము, దేవునికి ఇష్టము లేని పనియగును. దేవునికి ఇష్టము లేని బయట యుద్ధమును, మనుషులను చంపుకార్యమును పవిత్రయుద్ధము అని అనకూడదు.

**ముస్లీమ్ :-** మీరు చెప్పునదంతా సత్యమే అనిపించినా, ఒకవైపు నాలో కొంత అనుమానము పీడిస్తూనేయున్నది. ఖుర్‌ఆన్ గ్రంథములో బాహ్య యుద్ధమును గురించే చెప్పారని మేము నమ్మునట్లు **మూడవ సూరా (3) 140వ ఆయత్‌నందు** కలదని అనుకొంటున్నాను. ఆ వాక్యములో ఉన్నది జీహాద్‌యేనని మా పెద్దలందరూ చెప్పుచున్నారు. దీనికి మీరేమంటారు?

**నేను :-** మీరు ఏమి చెప్పినా నేను బయటియుద్ధమును ఒప్పుకోను. నేనే కాదు దేవుడు కూడా ఒప్పుకోడు. అటువంటప్పుడు ఏ పారాలోగానీ, ఏ సూరాలోగానీ, ఏ ఆయత్‌లోగానీ దేవుడు బాహ్యయుద్ధమును గురించి చెప్పియుండడు. సరే! నీవు చెప్పిన 3వ సూరా 140వ ఆయత్‌ను చూస్తాము అందులో ఇలా వున్నది. **(3-140) "ఒకవేళ ఇప్పుడు మీరు గాయపడితే వాస్తవానికి ఆ జాతివారు (మీ విరోధులు) కూడా అదే విధముగా గాయపడ్డారు. మేము ఇలాంటి దినాలను ప్రజలమధ్య త్రిప్పుచూయుంటాము. మరియూ అల్లాహ్ మీలో నిజమైన విశ్వాసులెవరో చూడడానికి మరియు సత్యస్థాపనకు తమ ప్రాణాలను త్యాగము చేయగల వారిని ఎన్నుకోవడానికి ఇలా చేస్తూ వుంటాడు. వాస్తవానికి అల్లాహ్ దుర్మార్గులను ప్రేమించడు"** అని అక్కడ చెప్పడమైనది. ఈ వాక్యములో గాయపడడము, ప్రాణత్యాగము చేయడము అని వుండుటవలన అది నిజముగా బయటియుద్ధమే అని

అనుకొనుటకు అవకాశముగలదు. ఇక్కడ ముఖ్యముగా చెప్పుకోవలసిన విషయమొ కటున్నది. అదేమనగా! ఈ వాక్యము చివరిలో **"అల్లాహ్ దుర్మార్గులను ప్రేమించడు"** అని ఉన్నది. బాహ్యయుద్ధము దేవుని లెక్కలో ఇతరులను బాధించు దుర్మార్గమేయగుట వలన దానిని ఖండిస్తూ దేవుడు దుర్మార్గులను ప్రేమించడు అని చెప్పాడు. అంతేకాక ప్రాణత్యాగము యుద్ధములోనే కాదు ఎక్కడయినా జరుగవచ్చును. ఈ వాక్యములో సత్యస్థాపనకై అని అనగా జ్ఞానమును నెలకొల్పుటకు అని అర్థము. సత్యస్థాపనకు ప్రాణాలను సహితము లెక్కచేయని వానిని ఎన్నుకోవడానికి, దేవుడు విశ్వాసులెవరో గుర్తించటానికి, దేవుడు అపాయకర దినములను గాయపడుటకు అవకాశమున్న దినములను, ఒక్కొక్కపుడు దేవుడు సృష్టిస్తావుంటాడు. దేవుడు మనుషుల మధ్య కార్యములలోనో, సమస్యలలోనో సృష్టించి తికమక పడునట్లు చేసి మనిషిలోని సహనమును పరీక్షించు చుండును. అంతేగానీ అపాయకరమైన దినములను, గాయములను, ప్రాణత్యాగములను దేవుడు సృష్టించి మనిషిని భయపెట్టి పరీక్షించడమేగానీ, వాస్తవ యుద్ధము బయట చేయు యుద్ధము అని అనుకోకూడదు.

ఇదే విషయమునే ప్రస్తావించుచూ 47వ సూరా 31వ ఆయత్‌లో ఇలా చెప్పాడు. **(47-31) "నిశ్చయముగా మీలో ధర్మయుద్ధము చేసేవారెవరో, మరియు సహనము వహించేవారు ఎవరో చూచేవరకు మేము మిమ్ములను తప్పక పరీక్షిస్తాము. మరియు మేము మీ ప్రజ్ఞావచనాలను కూడా పరీక్షిస్తాము"** అని చెప్పడము జరిగినది. పై వాక్యములోగానీ, క్రింది వాక్యములోగానీ, బాహ్యయుద్ధమునకు సంబంధించిన విషయమే లేదు. 3వ సూరా 140వ వాక్యములో దేవుడు దుర్మార్గులను ప్రేమించడు అని చెప్పడమును, 47వ సూరా 31వ వాక్యములో మేము మీ ప్రజ్ఞావచనాలను కూడా పరీక్షిస్తాము

అని అనడములో, ఇదంతయూ బాహ్యసంబంధ కార్యము కాదు, అంతరంగమున బుద్ధికి సంబంధించిన విషయమని తెలిసిపోవుచున్నది. క్రింది వాక్యములో స్పష్టముగా ధర్మయుద్ధము చేసేవారెవరో, సహనము వహించే వారెవరో చూచేవరకు మిమ్ములను తప్పక పరీక్షిస్తాము అని చెప్పాడు కదా! పరీక్ష అంటే పేపరు పెన్నుతో వ్రాసేది కాదు. దేవుని పరీక్షలన్నియూ కార్యరూపములో యుండును. ఆ కార్యములు గాయములు తగులువైన కావచ్చును, లేక ప్రాణము పోతుందేమోనను భయము కల్గించునవైనా కావచ్చును. ఉదాహరణకు అటువంటి పరీక్ష కార్యములను ఒక దానిని చెప్పుకొని చూస్తాము.

ఒక భక్తుడు దేవునిసేవ చేయు నిమిత్తము మా ఆశ్రమములో పని చేయుటకు వచ్చాడు. అతడు స్వచ్ఛందముగా సేవ చేయుటకు వచ్చినప్పుడు అతనికి ఒక ప్రమాదము జరిగినది. ఆ ప్రమాదములో వేడినూనె మీద పడడము కాళ్ళు కొంత కాలడము జరిగినది. వడలు చేయు సమయములో బాగా కాగిన నూనె మీద పడడము చూస్తే చచ్చిపోతారేమో అన్నంత భయమును కల్గించునదిగా ఆ దృశ్యమున్నది. చావు పరిస్థితి రాకున్నా కొంత వరకు గాయములు కావడమూ, తిరిగి కొన్ని రోజులకు నయము కావడమూ జరిగినది. ఇక్కడ దేవుని సేవ చేయుటకు వచ్చిన వ్యక్తిని పరీక్షించుటకు మేము ఇలాంటి దినములను ప్రజల మధ్య త్రిప్పుచుంటాము అని చెప్పినట్లు దేవుడే పరీక్ష నిమిత్తము అలా చేశాడని పై వాక్యములనుబట్టి తెలియుచున్నది. 3వ సూరా 140వ ఆయత్‌లో చెప్పినట్లు కొన్ని చెడు జరుగు దినములను సంఘటనలను తన భక్తుల మీదనే దేవుడు విధించి చూస్తున్నాడని కొంతవరకు అర్థమయినది. దేవుని సేవలో జ్ఞాన ప్రచారము ముఖ్యమైన సేవగా మేము చెప్పుచుంటాము.

అలాంటి జ్ఞానప్రచార సేవలో పాల్గొనుటకు మూడు కిలోమీటర్ల దూరములోయున్న మా ప్రచార వాహనము వద్దకు రావాలని ఒక వైశ్య కుటుంబములోని భార్యాభర్తలు ఇంటి వద్దనుండి మోటర్‌సైకిల్ మీద బయలుదేరారు. వారిది మంచి ఉద్దేశ్యమే అయినా, వారి సహనమును పరీక్షించుటకు దేవుడు వారి వాహనమునకు అటువంటి వాహనమే కొద్దిగా తగులునట్లు చేసి, భార్యాభర్తలను క్రింద పడునట్లు చేసి కొద్దిగా గాయ పరచడము జరిగినది. ఇదంతయూ పై వాక్యములలో చెప్పినట్లే జరిగినది. అప్పుడు యుద్ధము కాకున్నా గాయములు కావడము జరిగినది కదా! యుద్ధము కాకున్నా ప్రాణాపాయము జరుగునేమో అన్నంత భయము కల్గినది. అప్పుడు గాయపడిన వారి సహనమును దేవుడు చూస్తున్నాడు. అట్లే వారి వివేక వచనలములను కూడా వింటున్నాడు. ఇటువంటి సంఘటనలను ప్రజల మధ్య త్రిప్పి పరీక్షించుచుండునని పై వాక్యములాగా దేవుడు చెప్పడము జరిగినదని మరువకూడదు. గాయములు, ప్రాణా పాయములు జరుగుటకు బాహ్యయుద్ధమే అవసరము లేదు. దేవుడు మనిషిని పరీక్షించు నిమిత్తము జరిగిన పనిలో విధానము అట్లున్నదని గ్రహించవచ్చును.

**ముస్లీమ్ :-** దేవుడు అందరికీ అధిపతి, అందరిలోని రహస్యము తెలిసిన వాడు అనియూ భూమిమీద ఆకాశములోని రహస్యములన్నీ దేవునికి తెలుసు అని ఖుర్‌ఆన్ 2వ సూరాలో 33వ ఆయత్‌నందు కలదు చూడండి. **(2-33) "నిశ్చయముగా నేను మాత్రమే భూమ్యకాశముల అగోచర విషయా లను ఎరుగుదునని మీతో చెప్పలేదా? మరియు మీరు ఏది బహిర్గతము చేస్తారో మరియు ఏది దాస్తారో కూడా నాకు బాగా తెలుసు"** అని కలదు. దీనినిబట్టి దేవునికి అన్నీ తెలుసు. ఏ మనిషిలో ఏమున్నదో ఆయనకు

తెలుసు. అటువంటప్పుడు ఏ మనిషిలో ఎంత సహనమున్నదీ, దేవునికి తెలియదా? గాయపెట్టి, భయపెట్టి పరీక్షించనిదే దేవునికి తెలియదా? అన్నీ తెలిసిన దేవుడు మనుషులను ఎందుకు పరీక్షించుచున్నాడు?

**నేను :-** సర్వప్రపంచములో, ఏ మనిషిలో ఏమున్నది, ఏమి చేసినదీ దేవునికి బాగా తెలుసు. అటువంటప్పుడు ఎవరిలో ఎంత సహనమున్నది అను విషయము కూడా దేవునికి బాగా తెలుసు. అయినా దేవుడు మనుషులను పరీక్షకు గురి చేయుచున్నాడు. ఆ పరీక్షలలో ఎవరికీ అర్థముకాని అపాయములను కల్పించి ఎవరు ఎంత భయపడుచున్నదీ, ఎవరు ఏమను కొనుచున్నదీ నమోదు చేయుచున్నాడు. అన్నీ తెలిసి అలా ఎందుకు చేయు చున్నాడనగా! దైవమార్గములో ఎవనికి ఎంత సహనమున్నదో దేవునికి ముందే తెలుసు. అయితే భక్తుడయిన వానికి తనకు ఎంత సహనమున్నదో తెలియాలంటే పరీక్షయుండవలసిందే, అందువలన పరీక్ష మనిషికే అవసరము, అతని భావము కూడ ఏమున్నదో అతనికి తెలియుటే ముఖ్యము. అందువలన మనుషులకు తన విషయము తనకు తెలియుట కొరకు పరీక్ష అవసరము. అంతేగానీ దేవునికి తెలియకగాదు. సర్వ ప్రపంచములోని మనుజులకు ప్రతి దినము సమస్యల రూపములో పరీక్షలు జరుగుచునేయున్నవి. అందులో కొందరు మాత్రము నెగ్గుతున్నారు. మిగతా అందరూ ఓడిపోవుచున్నారు. ఎవరి ఓటమి వారికి తెలుసు. అయితే అందరి ఓటమి గెలుపులు దేవునికి మాత్రము తెలుసు.

**ముస్లీమ్ :-** "బాహ్యప్రపంచ యుద్ధము దైవమార్గములో లేనేలేదు. ఒకవేళ అది యున్నది అంటే అజ్ఞానమగును." అని మీరు చెప్పుచున్నారు కదా! అట్లయితే గురువులుగా యున్నవారూ, బోధకులుగా యున్నవారూ ఎందరో

బాహ్య యుద్ధములను గురించి చెప్పి ప్రజలను తప్పు మార్గములోనికి పంపుచున్నారు. అటువంటి వారికి దేవుని శిక్షయుంటుందా?

**నేను :-** దేవుని జ్ఞానమును వక్రమార్గము పట్టించిన వానికి తప్పని సరిగా శిక్షవుంటుంది. ఈ విషయమును గురించి 2వ సూరా 159వ వాక్యములో ఇలా కలదు చూడండి. **(2-159) "నిశ్చయముగా చెప్పుచున్నాను. ఎవరయితే మేము అవతరింపజేసిన స్పష్టమైన బోధలను మార్గ దర్శకత్వాలను, ప్రజల కొరకు దివ్యగ్రంథములో స్పష్టపరచిన పిదప కూడా దాచుతారో వారిని అల్లాహ్ తప్పక శిక్షిస్తాడు, శపిస్తాడు, బహిష్కరిస్తాడు మరియు శపించగల వారు కూడా వారిని శపిస్తారు"** అని చెప్పియున్నాడు. దీనినిబట్టి దేవుని జ్ఞానమువద్ద భయములేకుండా పోయినవారికీ, దేవుని జ్ఞానము ఒకటుంటే ఇంకొకటి బోధించువారికీ, లేనిజ్ఞానమును ఉన్నట్లు తానే స్వయముగా కల్పించి చెప్పువానికీ, దైవమార్గములో దైవజ్ఞానములో లేని బాహ్య యుద్ధమును గురించి చెప్పి, అదే జీహాద్‌యని నమ్మించి ప్రజలను జీహాదీలుగా మార్చి, దేవుడు చెప్పని యుద్ధములను, దేవుడు చెప్పని హింసలను రేకెత్తించువానిని, అజ్ఞానమునకు మూలమైనవాడుగా దేవుడు వానిని గుర్తించి, వానికి కొన్ని యుగముల పాపమును అంటగట్టును. దానితో వాడు శాశ్వతముగా నరక బాధలను అనుభవించవలసివచ్చును. దేవుని దృష్ఠిలో అటువంటి వానికి ఎప్పటికీ క్షమాపణ ఉండదు. అందువలన ప్రపంచ విషయములలో ఎట్లున్నా ఫరవాలేదు. దేవుని జ్ఞానమువద్ద జాగ్రత్తగా యుండవలెనని తెలుపుచున్నాము.

ఒక మనిషి పుట్టిన తర్వాత చనిపోవడము జరుగుచున్నది. మొదట మనిషి పుట్టినప్పుడు అతనికి కర్మపత్రముండదు. తర్వాత ఒక జన్మలో

చేసుకొన్న కర్మలన్నీ కలిపి కర్మపత్రము తయారు చేయబడుతుంది. కర్మపత్రము ప్రకారము రెండవ జన్మలో వాడు అనుభవించునది ఉండును. అందువలన మనిషికి కర్మపత్రము మెడలోవేసి పంపబడును అని ఖుర్ఆన్‌లోనే చెప్పారు. ఈ విషయము **"కర్మపత్రము"** అను గ్రంథములో విపులముగాయున్నది. మనిషికి చావు ఒక్కటే, పుట్టుక ఒక్కటే అను నినాదమును ఖుర్ఆన్ ఒప్పుకోవడము లేదు. మనిషికి రెండవ జన్మ వీర్య బిందువుతోనే జరుగును అని 53వ సూరాలో 46, 47 ఆయత్‌లలో చెప్పబడినది. ఈ విధముగా మనిషి ఒకమారు చనిపోయి రెండవమారు పుట్టడము జరుగుచున్నది. ఇట్లు జన్మలు మారుచునే ఉన్నవి. అయినా జన్మలు మారుటకు ఏమి అవసరము వచ్చినదనీ ఒకే జన్మలో జీవించి యుండునట్లు చేయవచ్చును కదా! అని ఎవరయినా అడుగవచ్చును. అలాగయితే పాఠశాలలో తరగతులు అవసరముండదు. వరుసగా అన్ని సంవత్సరముల చదువు చెప్పితే సరిపోతుందిగదా! యనునట్లుంటుంది. ఒకే జీవితమును సాగించుటలో బడిలో తరగతులు లేనట్లగును. ఎవడు ఎంత చదువుతున్నాడని తెలియకపోయినట్లు అందరి జీవితములలో జ్ఞానము ఎంతున్నదీ తెలియకుండాపోవును. అంతేకాక మనిషి చేసుకొన్నది తిరిగి ప్రారబ్ధముగా మారుటకు వీలుపడదు. అందువలన దేవుడు అన్ని విధములా యోచించి మనకి చావు పుట్టుకలను ఏర్పాటు చేశాడు.

ఆ ఏర్పాటులో మనిషి ఏ జన్మలో ఎంత దేవునివైపుకు పోతున్నాడు. ఎంత మాయవైపుకు పోతున్నాడను లెక్క తేలిపోవును. వెనుక జన్మనుబట్టి ముందు జన్మ నిర్ణయించబడుచుండును. ఈ విషయమును గురించి చెప్పుచూ సూరా 67, ఆయత్ 2లో ఈ విధముగా చెప్పారు. **(67-2) "మీలో మంచి పనులు చేసేవారెవరో పరీక్షించే నిమిత్తము ఆయన చావు బ్రతుకులను**

**సృష్టించాడు. ఆయన శక్తిశాలి మరియు క్షమాశీలి."** ఇక్కడ మంచి పనులు అంటే దేవునికి సంబంధించిన పనులని అర్థము చేసుకోవాలి. దైవ సంబంధ కార్యములు ఒక జన్మలో చేసినా, చేయకపోయినా అవి రెండవ జన్మలో కనిపించును. అప్పుడు మనిషి తనకు తానుగా నేను జ్ఞానినా! అజ్ఞానినా!! అని చూచుకొనుటకు అవకాశముండును. ఇతరులు చెప్పితే తెలుసుకొనేదానికీ, తాను స్వయముగా తెలుసుకొనే దానికీ ఎంతో తేడాయుండును. అందువలన దేవుడు మనిషికి చావు బ్రతుకులను సృష్టించాడు. అలా కొన్ని జన్మలు గడువగానైనా తనమీద తనకు ధ్యాసవచ్చి, తనను తాను జ్ఞానిగానో, అజ్ఞానిగానో గుర్తించగలడను సూచనతో, మనిషికి దేవుడు చావుపుట్టుకలను ఇచ్చాడు. ఎంతకాలమునకయినా తనను తాను లెక్కించుకోవలసిందే, చివరికి దేవునివైపు పోవలసిందేనని తెలియగలడు.

దేవుడు తన దూతల ద్వారా మనుషులను వారు చేసుకొన్న పాప పుణ్యములను అనుసరించి మళ్ళీమళ్ళీ పుట్టించుచున్నాడు. అయినా మనిషి తనలో జ్ఞానమున్నదా? అజ్ఞానమున్నదా? యని చూచుకోకుండా జీవితమును గడుపుచున్నాడు. మనిషి బయట ప్రపంచములో ఎన్నో విద్యలు నేర్చి, ఎంతో విజ్ఞానిగాయుండినా, చివరకు తన విషయములో ఏమాత్రము ఆలోచించకుండా చదువురానివాడు ప్రవర్తించినట్లు ప్రవర్తించుచున్నాడు. గ్రుడ్డిగా జ్ఞానవిషయములపట్ల ప్రవర్తించుచున్నాడు. అజ్ఞానమును అశాస్త్రమును బోధించువారివద్దకు పోయి, అదే నిజమైన జ్ఞానమని అంటున్నాడు. అక్కడ వారి మేధాశక్తి ఏమయినదో అర్థముకాకున్నది. కొందరయితే ఏదో ఒకటుంటే చాలులేయని, వారు నమ్మినది అసత్యమని తెలిసినా దానినే ఆచరించుచున్నారు. మరికొందరు తాము అనుసరించునదే సరియైనదని మొండివాదన చేయుచున్నారు. చివరకు వారందరూ కలిసి

దేవున్ని నమ్ముకోకుండా మాయా జ్ఞానమునే నమ్ముకొన్నారు. ఇదే విషయమునే అంతిమ దైవగ్రంథము ఖుర్ఆన్‌లో ప్రస్తావించుతూ సూరా 4, ఆయత్ 117నందు ఈ విధముగా చెప్పారు. **(4-117) "వారు దేవున్ని వదలి స్త్రీలను మొరపెట్టుకొంటున్నారు. వాస్తవానికి వారసలు పొగరు పోతు సైతానును ఆశ్రయించియున్నారు."** ఇక్కడ దేవున్ని వదలి స్త్రీలను మొరపెట్టుకొంటున్నారని చెప్పడములో ప్రకృతి సంబంధ దేవతలను ఆరాధించుచున్నారని అర్థము. దేవుడు పురుషుడుకాగా, ప్రకృతి గుణములతో ఆరాధింపబడువారందరూ స్త్రీ సంబంధ దేవతలేనని చెప్పవచ్చును. ఈ మాట కొందరు మేము స్త్రీ దేవతలను ఎప్పుడూ మ్రొక్కలేదు, పురుషుడయిన శేషాద్రిని మ్రొక్కుచున్నాము అంటున్నారు. అయినా నీవు మ్రొక్కునది స్త్రీ దేవతనేయని చెప్పవచ్చును. భూమిమీద అనగా ప్రపంచములో దేవుడు ఒక్కడే పురుషుడు. దేవుని మినహాయున్నవారంతా స్త్రీ తత్త్వమే. అందువలన మీరు పురుష దేవున్ని పూజించినా వాస్తవముగా మీరు స్త్రీ దేవతను పూజించి నట్లే లెక్కించబడును. అందువలన దేవున్ని వదలి మిగతా ఎవరిని ఆరాధించినా ప్రకృతి జనితమైన స్త్రీని ఆరాధించినట్లేయగును. అందువలన దేవుని విషయములో జ్ఞానము కల్గియుండండి.

దేవుడు సృష్ఠి ఆదిలో చెప్పిన జ్ఞానమును జిబ్రయేల్ ముహమ్మద్ ప్రవక్తగారికి చెప్పాడు. దేవుడు చెప్పినది చెప్పినట్లు జిబ్రయేల్ అందించగా! ముహమ్మద్ ప్రవక్తగారు అదే విషయమునే తన అనుచరులకు కొంతమందికి చెప్పడము జరిగినది. ప్రవక్తగారికి చదువురాదు కావున ఆయన తాను విన్నది ఇతరులకు చెప్పడము జరిగినది. వినిన విషయములను 23 సంవత్సరముల తర్వాత క్రోడీకరించి వ్రాయడము జరిగినది. వ్రాసినవాడు ముహమ్మద్ ప్రవక్త కాదు. ఆయన చెప్పినవాడు మాత్రమే. ప్రవక్తగారికి

63వ సంవత్సరము వయస్సులో స్మశానానికి ప్రార్థనకు పోయివచ్చు సమయములో రాత్రి 3 గంటల ప్రాంతములో తలనొప్పి ప్రారంభముతో వ్యాధి మొదలయినది. అది ఏ వ్యాధి అయినదీ నిర్ధారణ లేదుగానీ, దానితోనే ఆయన 14 రోజులకు చనిపోవడము జరిగినది. ఆయన చనిపోతాడని ఎవరూ ఊహించలేదు. ఆయన అకస్మాత్తుగానే చనిపోయాడని చెప్పవచ్చును. ప్రవక్తగారికి 40వ సంవత్సరమునుండి ఆయన చనిపోవు వరకు జిబ్రయేల్ ద్వారా జ్ఞానము చెప్పబడినది. చివరి సందేశము ఏ ఆయత్‌తో అయిపోయినదో ఇప్పుడు ఎవరికీ తెలియదనియే చెప్పవచ్చును. అప్పుడు ఆయన విన్నది విన్నట్లు తన అనుచరులకు చెప్పేవాడు గనుక ఆ దినములలో జిబ్రయేల్ చివరిగా ఏ జ్ఞానము చెప్పాడో వారికి తెలిసే యుంటుంది. ప్రవక్తగారు చనిపోవు వరకు అనగా 40 సంవత్సరముల వయస్సునుండి 63 సంవత్సరముల వయస్సు వరకు అప్పుడప్పుడు ఖుర్ఆన్ జ్ఞానము జిబ్రయేల్ ద్వారా చెప్పబడినది. ఉన్నట్లుండి ప్రవక్తగారు జబ్బుపడిపోవడము వలన, ప్రవక్తగారు హీరా కొండ గుహల లోనికి పోవడానికి కుదరలేదు. అంతటితో ఖుర్ఆన్ జ్ఞానము ఆగిపోయినది. చివరి దినము ఆయన ఎప్పుడు జిబ్రయేల్ జ్ఞానము విన్నాడో ఎవరూ ఖచ్చితముగా వ్రాయలేదు. ప్రవక్తగారి జీవిత చరిత్రలుగల రెండు గ్రంథములను చదివాముగానీ, ఆ రెండు గ్రంథములలో కూడా ఆయన చేసిన యుద్ధముల సమాచారము ఎక్కువగాయున్నదిగానీ ఖుర్ఆన్ గ్రంథ సమాచారమును వ్రాయలేదు.

ఖుర్ఆన్ గ్రంథము ప్రవక్తగారు బ్రతికియున్నప్పుడే గ్రంథరూపము చేశారు అనుటకు ఎక్కడా ఆధారములేదు. జిబ్రయేల్ పూర్తి చెప్పాను అని కూడా తన ఆయత్‌లలో చెప్పలేదు. అందువలన ప్రవక్తగారు బ్రతికియుంటే

ఇంకా కొంతకాలము ఖుర్ఆన్ జ్ఞానమును జిబ్రయేల్ చెప్పేవాడు. ప్రవక్తగారు అకస్మాత్తుగా జబ్బుపడిపోవడము వలన ఖుర్ఆన్ అంతటితో ఆగిపోయిందని అనుకుంటాము. ఖుర్ఆన్ ఆగిపోతుందని ప్రవక్తగారుగానీ, ప్రవక్త అనుచరులుగానీ అనుకోలేదు. ప్రవక్తగారు ఉన్నంత వరకు ఖుర్ఆన్ ఇంకా వస్తుందను నమ్మకముతోయుండుట వలన, అది ఇంకా పూర్తి కాలేదు అను నిశ్చయముతో ఉండుట వలన, ఖుర్ఆన్ గ్రంథమును వ్రాయాలని వారు అనుకొని ఉండరు. ప్రవక్తగారు చనిపోయిన దానివలన ఇక ఖుర్ఆన్ గ్రంథము రాదని తెలిసిన తర్వాత అంతవరకూ వచ్చిన జ్ఞానమును గ్రంథరూపము చేయాలని ప్రవక్త అనుచరులు అనుకోవడము జరిగి యుండును. ఆనాడు వారు నివసించిన ప్రాంతము ఎక్కువమంది నిరక్షరాస్యులే. చదువురానివారు ఎక్కువ ఆయన అనుచరులలోయుండెడి వారు. ఒకరో ఇద్దరో చదువు వచ్చినవారు ఉంటే ఉండవచ్చును. లేక వారు కూడా ఉండకపోవచ్చును. ఎలాగయితేనేమి! అందరూ కలిసి తమకు జ్ఞాపకమున్న వాక్యములను చదువు వచ్చినవారితో వ్రాయించడము జరిగినది. ఎవరికి జ్ఞాపకము వచ్చినది వారు చెప్పి వ్రాయించిన గ్రంథమే ఖుర్ఆన్. అందువలన అందులోని వాక్యములు వరుసక్రమముగా ఉండవు. విషయము కూడా వరుసక్రమముగాయుండదు. అంతేకాక ఒకే విషయము రెండుమార్లు కూడా వచ్చియుండును. ప్రవక్తగారు చెప్పిన విషయములను చెప్పడములో కొన్నిటిని మరచిపోయి ఉండవచ్చును. జిబ్రయేల్ చెప్పిన జ్ఞానము అంతా వచ్చియుంటుందను నమ్మకము లేదు. అలాగే జిబ్రయేల్ చెప్పినది ప్రవక్తకు, ప్రవక్త చెప్పినది ఆయన అనుచరులకు, అనుచరులనుండి వ్రాసేవారికి మారియుండుట వలన జిబ్రయేల్ చెప్పిన జ్ఞానములో భావము కొంత మారియుండవచ్చును. ఎలాగయితేనేమి! చివరకు గ్రంథము బయటికి

వచ్చినది. ఇప్పుడు ముఖ్యముగా ఆలోచించవలసినది ఏమంటే జిబ్రయేల్ చెప్పిన దైవజ్ఞానము ఎంత గ్రంథరూపమయినది అనునది ముఖ్యము కాదుగానీ, గ్రంథరూపమయిన దానిలో ఎంత గ్రహించుకుంటున్నాము అనునది ముఖ్యము.

ఎంతోకొంత మన అదృష్టముకొద్దీ మనకు గ్రంథములోని విషయములు అన్నీ కాకపోయినా కొన్నయినా వ్రాయబడినాయి. అయితే మనిషి దేవున్ని చేరుకోవడానికి గ్రంథములోనిదంతా అవసరములేదు. ఆ గ్రంథములో కేవలము ఐదుపాళ్ళు తెలుసుకొన్నా మనిషి దైవజ్ఞానమును సంపూర్ణముగా తెలిసినట్లగును. ఇంతవరకూ చెప్పిన విషయములు ఎంతో గొప్ప జ్ఞానముతో కూడుకొన్నవని తెలిసినది. ఇప్పుడు చెప్పుకొన్నది **6236** వాక్యములలో కేవలము 136 విషయములను మాత్రమే వివరించి చెప్పాము. ఈ నూట ముప్పయి ఆరు వాక్యములను అర్థము చేసుకోగలిగినా మనిషి ప్రపంచమును విడచి దేవుని సాన్నిధ్యమునకు చేరవచ్చును. ఇప్పుడు మేము వివరించిన వాటిని ఎవరూ అపార్థము చేసుకోకుండా వ్రాశాము. అయితే అంతిమ దైవగ్రంథములో మేము వ్రాయని ఎన్నో విషయములను ఇతరులు ఉన్న భావముతో కాకుండా వేరు భావముతో అర్థము చేసుకొను అవకాశము గలదు. జిబ్రయేల్ ఏ ఉద్దేశ్యముతో చెప్పాడో, ఆ ఉద్దేశ్యమునే మనిషి పొందుతాడను నమ్మకములేదు. జిబ్రయేల్ చెప్పినది ఒక దారి అయితే మనకు అర్థమయ్యేది మరొక దారి కావచ్చును. ఎన్నోచోట్ల పొరపాటు పడుటకు అవకాశమున్నది. ఏసుప్రభువు విషయములో జిబ్రయేల్ చెప్పినది ఒకరకమైతే, అందరూ అర్థము చేసుకొన్నది మరొక రకమైనది. ఏసు శిలువ విషయములో అదే జరిగినది. చెప్పే విషయమును నేరుగ చెప్పక కొద్దిగా మలుపుత్రిప్పి చెప్పడము ఖుర్ఆన్‌లో ఉండే గొప్పతనము. అలా చెప్పడము

వలన శ్రద్ధ, బుద్ధియున్నవాడే తెలియగలడనీ, అందరికీ సులభముగా దేవుని జ్ఞానము అర్థముకాకూడదనే ఆ విధముగా చెప్పారు. గ్రంథమును స్నానము చేసి ముట్టుకో, స్నానము చేయకుండా ముట్టుకోవద్దు అని పెద్దలు చెప్పారు అనుకో! అందులో విశేషతయుంటుంది అని అనుకోవలసిందేగానీ విమర్శించకూడదు. స్నానము చేయకుండా ముట్టుకుంటే ఏమవుతుంది? అని అడిగే వారు కూడా ఉండవచ్చును. స్నానము చేయకుండా అయినా ముట్టుకోవచ్చును, చదువవచ్చును. అయితే మనకు తెలియనిది ఏదో ఒకటి జరిగితీరును. శవాలను ఎలా తిట్టినా ఫరవాలేదు, ఎలా కొట్టినా ఫరవాలేదు. అదే బ్రతికియున్న మనిషి శవములాగా పడుకొనియున్నప్పుడు వాడిని కొట్టితే ఏమయితుంది? అలాగే తిట్టితే ఏమవుతుంది? అనుకొని తిట్టితేగానీ, కొట్టితేగానీ ఏదో ఒకటి తిరుగుక్రియ ఉండునట్లు, అన్నీ గ్రంథములే అయినా వాటిలో జీవముండదు. వాటిని స్నానము చేయకుండా ముట్టుకొన్నా, చదివినా ఏమీకాదు. అదే జీవమున్న గ్రంథమును స్నానము చేయకుండా ముట్టుకొన్నా, నిబంధనను అతిక్రమించి ప్రవర్తించినా, ఆ గ్రంథముల ద్వారా ఏదో ఒకటి చెడు జరిగితీరును. ఆ విషయము అందరికీ తెలియదు. కావున కొందరు తెలిసినవారు అంతిమ దైవగ్రంథమునుగానీ, మధ్యమ దైవగ్రంథమునుగానీ, ప్రథమ దైవగ్రంథమును గానీ పవిత్రమైన చోట ఉంచండి. పవిత్రముగా యున్నప్పుడే చదవండి అని చెప్పియుందురు.

అంతిమ దైవగ్రంథములో కొన్ని విషయములు నిగూఢముగా చెప్పడము వలన దానికి ప్రత్యేకమైనశక్తి, జీవము (జ్యోతి) ఉన్నదని చెప్పవచ్చును. అందువలన ఈ మూడు దైవగ్రంథముల శక్తి ఎవరికీ అర్థముకాదు. అర్థము అయినా, కాకపోయినా ఈ మూడూ శక్తివంతమైన గ్రంథములు. అందులో ఏ సంశయమూ లేదు. ఏసు విషయము ఎదురుగా

చెప్పినా, అర్థముకాని విధముగా యున్నదంటే, అందులో తనకు ఇష్టమైన వానికే అర్థమగులాగున, తనకు ఇష్టము లేనివానికి అర్థము కాకుండా ఉండులాగున ఆ గ్రంథము చేయుచున్నది. ఇప్పుడు ఆ గ్రంథమునకు ఇష్టమైనవారిగా కావాలంటే ముందు దేవునికి ఇష్టమైనవారిగా ఉండాలి. అప్పుడే నీవు గ్రంథమునకూ అందులోని జ్ఞానమునకూ ఇష్టమైన వానిగా మారగలవు. అప్పుడే అక్కడున్న జ్ఞానము అర్థము కాగలదు. బయట ఎంత పేరు ప్రఖ్యాతులున్నా, ఎంతోమందిలో గొప్ప జ్ఞాని అనిగానీ, బోధకుడు అనిగానీ, గురువు అనిగానీ అనిపించుకొన్నప్పటికీ గ్రంథమునకు నీవు ఒప్పుదల కాకపోతే అందులోనిది ఒక్కముక్క కూడా అర్థముకాదు. ఇప్పుడు ఉదాహరణకు ఏసు మరణమును గురించి గ్రంథములో వ్రాసినది చూస్తే, అంతిమదైవ గ్రంథము ఎటువంటిదో మీకు కొద్దిగా అయినా అర్థము కాగలదు.

ఏసు విషయము బైబిలులోగలదు. తర్వాత ఇక్కడ ఖుర్ఆన్‌లో కూడా గలదు. ముందువచ్చిన గ్రంథములను ఈ గ్రంథము ధృవీకరించు చున్నది. కావున అక్కడ విషయము ఇక్కడ కూడాయున్నది. అయినా అక్కడ అర్థముకానివారికి ఇక్కడ కూడా అర్థముకాదు. అక్కడ అర్థమయిన వారికి ఇక్కడ కూడా అర్థము కాగలదు. ఏసు విషయము ఇక్కడ ఖుర్ఆన్ గ్రంథములో సూరా4, ఆయత్ 157,158లలో ఈ విధముగా చెప్పి యున్నారు. దానిని ఇప్పుడు చూస్తాము. **(4-157) "మర్యమ్ కుమారుడైన దైవప్రవక్త ఈసాను మేము హతమార్చాము అనడము వలన, వారు ఆయన శిక్షను చూచారు. నిజానికి వారు ఆయనను చంపనూలేదు, శిలువపైకి ఎక్కించనూలేదు. నిజము ఏమిటంటే వారికొరకు ఆయనను పోలిన వ్యక్తి రూపొందించబడ్డాడు. ఈసా విషయములో విభేదించిన**

**వారు ఆయన వ్యవహారములో సందేహమునకు గురి అయ్యారు. అంచనాలను అనుసరించడము తప్ప వారికి ఈ విషయమై ఖచ్చితముగా ఏమీ తెలియదు. అసలు వారు ఆయనను చంపలేదు."** **(4-158) "పైగా దేవుడు తనవైపు ఆయనను ఎత్తుకొన్నాడు. దేవుడు సర్వాధిక్యుడు, మహావివేకి."** ఇంతేకాక మరొకచోట ఏసును, ఏసు విషయమును గురించి 4వ సూరాలోనే 171వ ఆయత్‌నందు ఇలా అంటున్నారు చూడండి. **(4-171) "మీరు ధర్మము విషయములో, అతిశయిల్లకండి, సత్యము తప్ప అల్లాహ్‌కు మరోమాట అయిన అసత్యమును ఆపాదించకండి. మర్యమ్ కుమారుడైన ఈసా కేవలము దైవప్రవక్త. అంతేకాక ఆయన సాధారణ ప్రవక్తకాదు, దేవుని ఆజ్ఞతో దైవ ఆదేశముద్వారా పుట్టించబడిన ఆత్మ. ఆ ఆత్మను మరియమ్‌వైపు మళ్ళించి ప్రయోగించాడు. ఇంకా ఆయన దేవుని దగ్గరనుండి వచ్చిన ఆత్మ మాత్రమే. కావున మీరు దేవున్ని ఆయన పంపిన ప్రవక్తలను అందరినీ విశ్వసించండి. దేవుడు ముగ్గురు అనకండి. దేవుడు ఒక్కడే ముగ్గురు కాదు. (త్రిత్వము వాదనను మానండి) ఇందులోనే మీకు మేలుంది. ఆరాధ్యుడగు దేవుడు (అల్లాహ్) ఒక్కడు మాత్రమే. ఆయనకు కుమారుడున్నాడను విషయానికి దేవుడు అతీతుడు, పరిశుద్ధుడు. ఆకాశములోనూ, భూమిలోనూ ఉన్నదంతా ఆయనకు చెందినదే. కార్యానిర్వాహకారిగా దేవుడు ఒక్కడే చాలు."**

ఇక్కడ మూడు ఆయత్‌లు చెప్పబడినవి. అందులో చివరిలో చెప్పిన 171 ఆయత్‌ను ముందుగా గ్రహించగలిగితే పై రెండు వాక్యములు సులభముగా అర్థమగుటకు అవకాశము గలదు. ధర్మము అంటే ముందు కొద్దిగా తెలిసియుంటే దానిని గురించి తప్పుగాగానీ, అసత్యముగాగానీ

చెప్పుకొనుటకు వీలుండదు. దేవుడు కార్యములను చేయడు. ఆయన చేయించు ఆజ్ఞ మాత్రమే అయివున్నాడు. అటువంటివాడు తన ఆజ్ఞచేత తన ఆత్మనే ఏసుగా పంపించాడు అనుటకు సాక్ష్యముగా, ఏసు దేవుని దగ్గరనుంచి వచ్చిన ఆత్మ మాత్రమే అని వాక్యములోగలదు. దీనినిబట్టి దేవుడు పంపిన ఈసా లేక ఏసు స్వయముగా దేవుడు పంపిన ఆయన ఆత్మయే అని తెలియగలదు. అందువలన ఆయన అందరి ప్రవక్తలలాంటి ప్రవక్తకాదు. దేవుని ఆజ్ఞతో వచ్చినవాడని తెలిసిపోయినది.

15వ సూరా 29వ ఆయత్‌లో చెప్పినట్లు దేవుడు తన ఆత్మనే ఏసుగా పంపాడు. అయితే ఆ విషయము మనుషులకు తెలియదు. ఏసు వచ్చి తండ్రి, కుమారుడు, పరిశుద్ధాత్మ అని త్రిత్వమును చెప్పాడు. అయినా పరిశుద్ధాత్మయే దేవుడు అని చెప్పాడు. అయితే ఆ మాట మనుషులకు అర్థము కాలేదు. ఆయన (ఏసు) బ్రతికిన 33 సంవత్సరములలో ఎవరికీ అర్థము కాలేదు. చివరిలో ఆయన ఒక శిక్షకు గురి అయ్యాడు. ఏసును శిలువ మీద వ్రేలాడదీయడమే ఆనాడు ఆయనకు పడిన శిక్ష. అయితే ఆయన వాస్తవముగా శిక్షార్హుడుకాడు. అటువంటి సమయములో ప్రజల దృష్టిలో ఆయన శిక్షార్హుడు. దేవుని దృష్టిలో శిక్షార్హుడుకాదు. ఈ రెండూ జరగాలి. ప్రజల అజ్ఞానము ప్రకారము ఆయనను శిలువను ఎక్కించి శిక్షను వేశారు. అప్పుడు ఏసు ఏసుగా లేడు. **ఏసును సైనికులు పట్టుకున్నప్పుడునుండి శిలువ వేయబడేంతవరకు ఒక పెద్ద మాయ జరిగింది.** దానిని తెలిసినవారే మాయ అంటారు. తెలియనివారు జరిగినదే సత్యము అంటారు. ఇక్కడ వాక్యములో ఏసును శిలువ ఎక్కించనూ లేదు. నిజానికి వారు ఆయనను చంపనూలేదు అని అన్నారు. ఈ వాక్యమును చెప్పినది మహాజ్ఞాని అయిన జిబ్రయేల్. ఆయన చెప్పిన వాక్యము ఎప్పటికీ

అసత్యముకాదు, పూర్తి సత్యమే. అందువలన 4-171 వాక్యములో మొదటనే మీరు ధర్మము విషయములో దేవుని మాటకు అసత్యమును ఆపాదించకండి అన్నారు. ఈ విషయము దేవుని ఆజ్ఞతో జిబ్రయేల్ చెప్పాడు. ఆ విషయముతో జిబ్రయేల్‌కు పనిలేదు, చెప్పవలసిన అవసరము లేదు. అయినా చెప్పాడు అంటే, ఖుర్‌ఆన్ జ్ఞానము ఏసు చెప్పిన జ్ఞానమును కూడా సమర్థించుచున్నది, ధృవీకరించుచున్నది. అందువలన ఏసు విషయమును తప్పక తెలియవలసియున్నది. అలా తెలియకపోతే ఆయనను అపోహలలో ముంచివేయడము కాకుండా, ఆయన జ్ఞానమును కూడా అపోహలలో ముంచివేయగలరు. అందువలన ఏసు మరణమును గురించి జిబ్రయేల్ తప్పనిసరిగా చెప్పవలసి వచ్చినది. ఇప్పుడు తప్పనిసరిగా మనము కూడా చెప్పుకోవలసి వచ్చినది.

ఇప్పటికే ఆ దినము ఏమి జరిగిందో తెలియక ఒకప్రక్క క్రైస్తవులు ఒక విధముగా చెప్పుచున్నారు. మరొక ప్రక్క ముస్లీమ్‌లు మరొక విధముగా చెప్పుచున్నారు. క్రైస్తవులు బైబిలులో వ్రాసిన విధముగా, ఆనాడు ప్రత్యక్ష సాక్షులు చూచిన దానిని వ్రాసిన దానిని చెప్పుచున్నారు. అంతవరకు వారిది తప్పులేదు. అయితే అక్కడ వారికి తెలియనిది ఏసు చనిపోడను విషయము. వారు ఏసు శిలువ మీద చనిపోయాడు అనీ, తర్వాత మూడవ రోజు ఆదివారము ఉదయము బ్రతికివచ్చాడనీ చెప్పుచున్నారు. **ఇక్కడ ఏసు చనిపోయాడు అనడము క్రైస్తవులది తప్పు. అంతవరకు ఏసుకు శిక్ష వేసినది, ఆయనను శిలువ ఎక్కించినది అన్నీ వారు చెప్పునది ఒక విధముగా వాస్తవమే. అయితే ముస్లీమ్‌లు తమ గ్రంథమందు ఇలా వ్రాశారు అనీ, ఏసు చనిపోలేదు అనీ అంటున్నారు. వారి గ్రంథములో జిబ్రయేల్ పై వాక్యములో చెప్పినట్లు నిజానికి వారు ఆయనను చంపలేదు అనుమాట**

**వాస్తవమే.** అయితే **ఏసుకు శిక్షవేయలేదు, శిలువను ఎక్కించనూ లేదు అన్నమాట ఒక విధముగా పూర్తి తప్పు.** అయితే ఇప్పుడు మేము చెప్పినది కొంత అటు, కొంత ఇటుగా చెప్పి ఏదీ పొంతన లేకుండా చెప్పినట్లు కనిపిస్తున్నది కదా! అట్లే కనిపించునని మాకు తెలియును. అయినా అన్నీ తెలిసి ఈ మాట మేము చెప్పాము. ఇటు క్రైస్తవులు చెప్పు దానిలో కొంత సత్యమున్నది. అటు ముస్లీమ్‌లు చెప్పుమాటలో కొంత సత్యమున్నది. అయినా వారిది ఏది సత్యమో, ఏది సత్యముకాదో వారికే సరిగా తెలియదు. ఆ కాలములో ఏమి జరిగినది, జరిగినది ఏది సత్యము, ఏది అసత్యము అని తెలియాలంటే ఇప్పుడు మనము అక్కడికిపోయి వివరించుకొందాము.

ఆ దినము గురువారము రాత్రి ఏసు అతని శిష్యులు పదకొండు మంది "గెత్సేము" అనే చోటికి ప్రార్థన చేయుటకు వచ్చి ఆయన శిష్యులనందరినీ ఒకచోట కూర్చోబెట్టి కొంత దూరముపోయి ఒకచోట ఒంటరిగా ప్రార్థన చేయుచుండెను. అయినా ఆయన శిష్యులు నిద్రపోవుచుండగా, రెండుమార్లు వారివద్దకు వచ్చి వారినిలేపి మేల్కొనమని చెప్పి మూడవమారు ఆయన ప్రార్థన చేయుటకు పోయాడు. అప్పటికే అర్థరాత్రి అయియుండుట వలన ప్రార్థన చేయుచూ ఏసు కూడా నిద్రలోనికి పోయాడు. ఏసు నిద్రపోయిన విషయము ఈనాటికి ఎవరికీ, ఏ క్రైస్తవునికీ తెలియదు. ఎవరికీ తెలియనది నీకెలా తెలుసు? అను ప్రశ్న మీకు రావచ్చును. అక్కడేయున్న నాకు ఎందుకు తెలియదు అని నాలోయున్న వాడు అడిగితే మీరేమి అంటారు? అందువలన వినండి, ప్రశ్నించకండి. ఇక్కడ కావలసినది సత్యము, విశ్వాసము. విశ్వాసముంచి వినండి సత్యము తెలియబడుతుంది. ఏసును యూదా ఆ రాత్రి పట్టించాడు. అప్పుడు ఏసు నిద్రలోనేయున్నా ఆయన శరీరము దేవుడు పంపిన ఆత్మ చేత

మెలుకువగాయున్నది. అక్కడికి వచ్చిన సైనికులు ఏసును పట్టుకొన్నామను కొన్నారు గానీ, వారు ఏసు శరీరమును పట్టుకొన్నారు. ఏసు నిద్రలో లోపలయున్నాడు. బయట ధ్యాస ఏసుకు ఏమాత్రము లేదు. అప్పుడు ఏసు శరీరమును నడిపించువాడు ఆత్మయే. ఆత్మయే అందరినీ నడిపించు చున్నా, ఏసును కూడా అంతవరకు ఆత్మే నడిపించినా ఏసు మెలుకువలో యుండెడివాడు అయితే అప్పుడు ఏసు జ్ఞాపకములో లేదు. కావున పైన ఏమి జరిగినది ఏసుకు ఏమాత్రము తెలియదు. అందరి శరీరములనూ ఆత్మే నడిపించుచున్నది. అయితే అందరికీ జ్ఞప్తియుండి మెలుకువలో యున్నారు గావున బయట ఏమి జరుగుచున్నది శరీరములోని జీవునికి తెలుసు. అయితే ఇక్కడ ఏసు పూర్తి నిద్రలోయుండిపోయాడు. బయట జరుగు తతంగము ఆయనకు ఏమాత్రము తెలియదు. ఈ విషయమును తెలియని మనుషులు, సైనికులు ఏసును పట్టుకున్నామని అనుకొన్నారు. అయితే ఆయన శరీరమును మాత్రము పట్టుకున్నారు. అప్పటినుండి శిలువ వేయబడేవరకు పెద్దమాయ జరిగింది అని ముందే చెప్పాను కదా! అప్పటినుండి ఏసు మౌనముగాయుంటూ రెండు మూడు మాటలకంటే ఎక్కువ మాట్లాడలేదు. ఎక్కువ మౌనముగాయున్నవాడు, రెండు మూడు మాటలు మాట్లాడినవాడు ఏసుకాదని ఎవరికీ తెలియదు.

చివరికి ఏసు చేత శిలువను మోయించుకొనిపోయి అతనిని శిలువను ఎక్కించి శిక్షను వేశారు. అయితే శిలువను ఎక్కించినది శిక్ష వేసినది ఏసుకే అని అందరూ అనుకొన్నారుగానీ, ఏసుకి ఆ శిక్ష వేయలేదు. ఆయన శరీరమునకు శిక్ష వేశారని గ్రహించలేకపోయారు. అందువలన ఖుర్ఆన్‌లోని 4-157 లోని వాక్యములో **"వారు ఆయనను చంపనూలేదు, శిలువను ఎక్కించనూ లేదు"** అని వ్రాశారు. జిబ్రయేల్ చెప్పిన ఈ మాట

నూటికి నూరుపాళ్ళూ వాస్తవమే. అయితే క్రైస్తవులు ప్రత్యక్షముగా చూచారు కావున శిలువను ఎక్కించినదీ, శిక్ష వేసినదీ వారిలెక్కలో సత్యమే. ఏసును శిలువమీద ఎక్కించిన తర్వాత కొంతసేపటికి ఏసు శరీరములోని ఆత్మ కదలక మెదలక నాటకీయముగా నిలిచిపోయినది. అప్పుడు అక్కడున్న వారంతా ఏసు చనిపోయాడనుకొన్నారు. శరీరములోని ఆత్మ తన ఆరు నాడీకేంద్రములను నిలిపివేసి ఏడవ కేంద్రములో ఉండిపోవుట వలన అంతవరకూ కదలుచున్న శరీరము కదలకుండా నిలిచిపోయినది. అప్పుడు శరీరములో జీవము యున్నదని ఎవరు తెలియగలరు? ఆ సమయములో అన్నీ నిలిచిపోయి, శ్వాస ఆడక రక్తప్రసరణము కూడా నిలిచిపోవడము వలన అందరూ శరీరము చనిపోయిందని అంటారు. ఆ విధముగానే క్రైస్తవులందరూ ఏసు శిలువమీద చనిపోయాడు అని అనుకుంటున్నారు. వాస్తవానికి ఏసు శిలువ మీద చనిపోలేదు అనుమాటయే వాస్తవమగును. మరణమును గురించి చాలామందికి తెలియునుగానీ, తాత్కాలిక మరణమును గురించి ఎవరికీ తెలియదు. ఏసు ఆ సమయములో తాత్కాలిక మరణమును పొందియున్నాడని ఎవరూ గ్రహించలేదు. అటువంటి మరణము ఒకటుందనిగానీ, అటువంటి మరణమును పొందినవారు కొంతసేపు లేక కొంతకాలము, లేక కొన్ని దినములు చనిపోయి తిరిగి ప్రాణముతో బ్రతుకుదురనీ ఎవరికీ తెలియదు. ఈ మా మాట వాస్తవమను టకు ఉదాహరణగా ఒక జరిగిన విషయమును చూడండి.

## (జమ్ముకాశ్మీర్‌లోని అబ్దుల్ అజీజ్ కథ)

2009 డిశంబర్ 7వ తేదీన టివీ9 లో మధ్యాహ్నము 1–30 నిమిషములకు ఒక కథనము ప్రసారమైనది. అదేమనగా! అప్పటికి వారము రోజుల క్రితము అనగా 2009 నవంబరు, 30వ తేదీన జమ్ము

కాశ్మీరులోని రాజౌరి అను గ్రామములో అబ్దుల్ అజీజ్ అను 60 సంవత్సరముల వృద్ధుడు చనిపోయాడు. అతను ముస్లీమ్ అయిన దానివలన ఇస్లామ్ సాంప్రదాయము ప్రకారము అతనిని భూమిలో పూడ్చిపెట్టడము జరిగింది. అతనిని పూడ్చిపెట్టిన మూడు రోజులకు అతను సాధారణముగా చనిపోలేదనీ, ఎవరో హత్య చేశారని ఆరోపణ పోలీసులకు చేరింది. వెంటనే పోలీసులు కేసు వ్రాసుకొని స్మశానానికి పోయి అబ్దుల్ అజీజ్ శవమును బంధువుల సమక్షములోనే వెలికి తీశారు. వెలికి తీసిన అబ్దుల్ అజీజ్ శరీరమును పోస్టుమార్టమ్ (శవపరీక్ష) కొరకు ప్రభుత్వ ఆసుపత్రికి పంపించారు. అందులోని డాక్టర్ శవపరీక్ష చేయను మొదలు పెట్టాడు. మొదట తల భాగమును పరీక్షించుటకు తలమీద చర్మమును తీయుటకు కత్తితో తలమీద కొట్టడము జరిగింది. తలమీద గాయమైంది. అప్పుడు అందరికీ ఆశ్చర్యమగునట్లు అంతవరకు చనిపోయిన అబ్దుల్అజీజ్ లేచి కూర్చొని నన్నేమి చేయుచున్నారని ప్రశ్నించాడు అలా అతను లేచి అడుగడము డాక్టర్‌కు నమ్మశక్యము కాలేదు. అయినా డాక్టరు తేరుకొని అతను అడిగిన ప్రశ్నకు నిన్ను శవపరీక్ష చేయుచున్నామని చెప్పాడు. దానికి అబ్దుల్అజీజ్ నేను బ్రతికే ఉన్నానుకదా! అని అన్నాడు. అంతలో డాక్టర్‌గారు అబ్దుల్అజీజ్ యొక్క బంధువులకు విషయమును తెలుపగా, బయటనున్న బంధువులు వచ్చి ఆయనను తీసుకుపోవడము జరిగినది. మూడు రోజుల క్రిందట అబ్దుల్అజీజ్ చనిపోయినపుడు పదిహేను నిమిషముల తర్వాత పరీక్షించి చూచి అతను చనిపోయాడని చెప్పాననీ అజీజ్ విషయములో అద్భుతము జరిగిందని డాక్టరు చెప్పడము జరిగింది. రాజౌరి గ్రామ ప్రజలు కూడా తమ చేతులతో పూడ్చిపెట్టిన అబ్దుల్అజీజ్ మూడు రోజుల తర్వాత బ్రతికి రావడమేమని ఆశ్చర్యమును వ్యక్తము చేశారు. ఈ సంఘటన జరిగి ఇప్పటికి కేవలము ఐదు సంవత్సరముల ఆరు నెలలు మాత్రమే

అవుతుంది. ఈ విషయమును అందరికీ తెలిసేలాగ ఆ రోజే టీవీ ఛానళ్ళు అన్నీ ప్రసారము చేశాయి. ఈ సంఘటన కూడ డాక్టర్ల సమక్షము లోనే జరిగింది. కావున ఎవరూ దీనిని ఖండించడానికిగానీ, మూఢ నమ్మకమనుటకుగానీ వీలులేదు.

## (విశాఖ జిల్లాలో జరిగిన ఒక సంఘటన)

విశాఖజిల్లాలో అరకు లోయకు పోవు దారిలో శృంగవరపుకోట అను ఊరు కలదు. శృంగవరపుకోట మండలమునందు అక్కడికి 12 కిలోమీటర్ల దూరములో సారెపురము అను గ్రామము కలదు. సారెపురము గ్రామములో 67 సంవత్సరముల వయస్సున్న సముద్రమ్మ అను పేరుగల ఆడమనిషి ఉండేది. ఆమెకు దాదాపు పది సంవత్సరములనుండి హైబిపి. మరియు షుగర్‌వ్యాధి ఉండేవి. ఆమె శృంగవరపు కోటలోని సీనియర్ డాక్టరయిన ధర్మలింగాచారి వద్ద వైద్యము చేయించుకొనేది. ఎం.బి.బి. యస్ డాక్టరు ధర్మలింగాచారిగారు మంచి పేరుగాంచిన దాదాపు 60 సంవత్సరముల వయస్సుగల అనుభవజ్ఞుడు. ఇప్పటికి 6 సంవత్సరముల పూర్వము ఒకరోజు సాయంకాలము 6 గంటల సమయములో సముద్రమ్మను డాక్టరు ధర్మలింగాచారి వద్దకు తీసుకరావడము జరిగినది. అంతకుముందే ప్రభుత్వ ఆసుపత్రిలో చనిపోయిందని చెప్పిన తర్వాత అక్కడికి తీసుకవచ్చారు. అప్పుడు డాక్టరు గారు ఆమెను చూడగా ఆమె శరీరములో బి.పి గానీ, నాడిగానీ ఏమాత్రము లేదు. ఆమె శ్వాసగానీ, నాడి (పల్స్)గానీ ఏమాత్రము లేనందున ఆమెను చనిపోయినట్లు నిర్ధారించిన డాక్టరు "ఇంటికి తీసుకెళ్ళండి, ఈమె చనిపోయింది, ఈమెకు వైద్యము అవసరములేదు అన్నాడు." అప్పుడు వారు 12 కిలోమీటర్ల దూరములోనున్న వారి గ్రామమునకు తీసుకెళ్ళారు. అప్పటికే రాత్రి అయినందున ఉదయమే

ఆమెను పూడ్చాలనుకొన్నారు. తెల్లవారగానే వర్షము ప్రారంభమై రెండు రోజులు ఏమాత్రము వదలకుండా కురియుచుండుట వలన బయటికి పోయేదానికి అవకాశమే లేకుండా పోయింది. సముద్రమ్మ శవాన్ని అలాగే మూడురోజులు వరండాలోనే ఉంచారు. మూడు రోజుల తర్వాత నాల్గవరోజు ఉదయము ఆమె లేచి కూర్చొని అందరినీ పిలిచిందట. అప్పుడు ఆమె బంధువులు ఆమె బ్రతికినట్లు గ్రహించి వెంటనే డాక్టరు ధర్మలింగాచారి గారికి ఫోన్ చేయడము జరిగింది. పదిహేను రోజులు గడచిన తర్వాత ఆమెను డాక్టరుగారి దగ్గరకు తీసుకరావడము జరిగింది. అప్పుడు డాక్టరు నీవు చనిపోయి మూడురోజులు అట్లే ఉన్నావు కదా! అప్పుడు నీకు యమభటులుగానీ, యమలోకముగానీ ఏమైనా కనిపించారా? అని అడిగాడు. దానికి ఆమె నాకు ఏమీ కనిపించలేదు అని చెప్పిందట. ఈ సంఘటన కూడా ఒక డాక్టరు సమక్షములో రెండు సంవత్సరముల క్రిందట జరిగినది. అందువలన దీనిని కూడ ఎవరూ కాదనుటకుగానీ, మూఢనమ్మక మనుటకుగానీ వీలులేదు. **(మరో సంఘటన గూర్చి ప్రక్కపేజీలో చూడండి.)**

ఏసు శుక్రవారము మధ్యాహ్నము మూడు గంటల ప్రాంతములో శిలువవేయబడిన ఏసును చనిపోయాడని నిర్ధారించుకొన్న తర్వాత ఏసు అనుచరులు సాయంకాలము ఏసు శరీరమును తీసుకొనిపోయి భూగర్భ సమాధిలో ఉంచారు. అలా తీసుకుపోయిన ఆయన శిష్యులు ఏసు శరీరమును శవముగానే భావించారు. అప్పటికది శవములాగేయుంటుంది. అయినా ప్రాణము లోపలయుంటుంది. పైన చెప్పిన ఉదాహరణలను చూస్తే తాత్కాలిక మరణము కొంత అర్థముకాక తప్పదు. ఏసు శరీరములో గురువారము రాత్రినుండి నిద్రలోయున్నవాడు శుక్రవారము సాయంకాలము సమాధిలో ఉంచగా తాత్కాలిక మరణములో సమాధియందు 33 గంటల

# చితి నుంచి ప్రాణాలతో..!

చెన్నై, న్యూస్‌లైన్: అనారోగ్యంతో బాధపడుతున్న తమిళనాడు కరూర్ జిల్లా కృష్ణరాయపురానికి చెందిన 50 ఏళ్ళ ముత్తుస్వామి మంగళవారం మరణించాడని డాక్టర్లు తేల్చేశారు. మృత దేహాన్ని తీసుకెళ్ళి అంతిమ సంస్కారం చేసుకోవాలని సలహా కూడా ఇచ్చారు. వయసు పైబడ్డం, అనారోగ్యం పీడించడంతో ముత్తుస్వామి నిజంగానే చనిపోయి ఉంటాడని భావించిన బంధువులు చితికి ఏర్పాట్లు చేశారు. శ్మశానంలో బంధువులు గుమిగూడారు. ఇక తలకొరివి పెట్టడమే తరువాయి. చితిపై పడుకోబెట్టిన శవాన్ని అంతిమంగా చూసేందుకు వచ్చిన ముత్తుస్వామి చెల్లెలు పాపాత్తి, దుఃఖాన్ని ఆపుకోలేక పార్థివ దేహంపై పడి బిగ్గరగా రోదించింది. 'అన్నా నన్నొదిలి వెళ్ళిపోతావా?' అంటూ శోకాలు పెట్టింది. అంతే! చనిపోయాడనుకున్న ముత్తుస్వామిలో కదలిక!! కాళ్ళూ చేతులూ కదిలాయి. అంతేకాదు, ఇంతలో చిన్నపాటి 'మూలుగు' కూడా ధ్వనించింది. మరికొన్ని సెకన్లలోనే కాళ్ళూ, చేతుల్లో తేలిక పాటి కదలిక. కన్నీటి సంద్రంలో మునిగిపోయిన బంధువులు ఈపరిణామంతో ఒక్కసారిగా ఆశ్చర్యానందాలకు లోనై బిగ్గరగా

- చెల్లెలి రోదనతో 'కన్నుతెరిచిన' అన్న
- వైద్యుల నిర్లక్ష్యంపై సర్వత్రా చర్చ!

'ముత్తుస్వామి.. ముత్తుస్వామి' అంటూ ఒక్కపెట్టున అరిచారు. వీరి అరుపులకు నిద్ర నుంచి లేచినట్టుగా చితిపై నుంచి లేచాడు ముత్తుస్వామి. 'ఏమిటి? ఏమైంది?' అని బంధువులను ఎదురు ప్రశ్నించాడు. దీంతో అందరూ హర్షాతిరేకాల మధ్య ముత్తుస్వామిని కౌగిలించుకుని, తిరిగి ఆస్పత్రికి చేర్చారు. ముత్తుస్వామి ఏకైక కుమార్తెకు సోమవారమే వివాహం కావడం గమనార్హం.

**వైద్యుల నిర్లక్ష్యం:** అనారోగ్యంతో బాధపడుతూ పది రోజుల కిందట స్థానిక ఆస్పత్రిలో చేరిన ముత్తుస్వామిపై వైద్యులు నిర్లక్ష్యంగా వ్యవహరించారని బంధువులు విమర్శించారు. వైద్యులు చేసిన ఘన కార్యంపై దుమ్మెత్తి పోశారు. కాగా, ఈ వార్త కరూర్ జిల్లాలో దావానలంలా వ్యాపించింది. దీంతో సర్వత్రా దీనిపైనే చర్చసాగింది.

కాలమున్న తర్వాత ఆయన తాత్కాలిక మరణమునుండి జ్ఞాపకము వచ్చి అనగా మెలుకువలోనికి ఆత్మ తీసుకరాగా, ఏసు జ్ఞప్తిలోనికి వచ్చి లేచి రావడము జరిగినది. అప్పటికి అది క్రైస్తవులందరికీ వింతగానే కనిపించినా దేవుడు నిర్ణయించిన మూడు రకముల మరణములలో అది తాత్కాలిక మరణమని ఎవరికీ తెలియదు. అప్పటి క్రైస్తవులు ప్రత్యక్షముగా చూచిన విషయమునే చెప్పారు కావున ఏసుకు శిలువ మీద శిక్ష వేశారు. ఆయన శిలువమీద చనిపోయాడు అనుట ఒక విధముగా ప్రత్యక్ష సత్యమే అయినా, ఆయన శిక్షకు గురికాలేదు, ఆయన శిలువను ఎక్కలేదు. ఆయన శిలువ మీద చనిపోలేదు అన్నదే పరోక్ష సత్యము. ఆ దినము చూడకున్నా తన జ్ఞానముతో సూక్ష్మముగా జరిగిన విషయము సత్యమని జిబ్రయేల్ చెప్పాడు. జిబ్రయేల్ చెప్పినది పరోక్షముగా నూటికి నూరుపాళ్ళు సత్యమే. అయితే ప్రత్యక్షముగా ఆ రోజు చూచినది ఏసును శిలువమీదికి ఎక్కించారనీ, ఆయన చనిపోయాడనీ చెప్పుచుండుట సత్యమే. ఇక్కడ రెండు సత్యములు ఎలా జరుగునని ప్రశ్నిస్తే దానికి మా జవాబు ఈ విధముగా గలదు.

ఆ రోజు ప్రత్యక్షముగా చూచినవారు పైకి కనిపించు ఏసు శరీరమును చూచారు తప్ప, శరీరములో ఏసు ఉన్నాడా లేదాయని చూడలేదు. ఏసు ఎంతసేపు నిద్రలోయున్నదీ, ఆయన ఎప్పుడు తాత్కాలిక మరణములోనికి పోయినదీ పైకి కనిపించు విషయముకాదు గనుక వారు ఏసును శిలువపై ఎక్కించువరకు యుండి తర్వాత శిక్ష అమలు జరిగిన తర్వాత చనిపోయాడని నమ్ముచున్నారు. క్రైస్తవులు చూచినది ప్రత్యక్ష యదార్థము. జిబ్రయేల్ చెప్పినది పరోక్ష యదార్థము. ఇరువురిదీ సత్యమే అయినా ఎవరిది ప్రత్యక్ష సత్యము, ఎవరిది పరోక్ష సత్యము అని తెలియబడకపోవడము వలన క్రైస్తవులు చెప్పిన దానిని ముస్లీమ్‌లు

అసత్యమంటున్నారు. అదే విధముగా ముస్లీమ్‌లు చెప్పినది క్రైస్తవులు అసత్యమంటున్నారు. ఇక్కడ మేము ఏమి చెప్పుచున్నామంటే ప్రత్యక్షముగా కనిపించినది శరీరమే కదా! అందులో ఎవరున్నది తెలియదుకాబట్టి జిబ్రయేల్ జ్ఞానదృష్ఠితో చూచినదే సత్యము అంటున్నాము. క్రైస్తవులు ప్రపంచ దృష్ఠితో చూచారు కావున వారికి కనిపించినది ప్రత్యక్ష సత్యమే అయినా అది స్థూలదృష్ఠేగానీ, సూక్ష్మదృష్ఠి కాదు. అందువలన అంతిమ దైవగ్రంథములో పరోక్షముగా చెప్పినదే నిజమైన సత్యమనీ, క్రైస్తవులు ఆనాడు ప్రత్యక్షముగా చూచినది సత్యమే అయినా అది నిజమైన అసత్యమని తెలియవలెను. ఇప్పుడు మేము చెప్పినది గ్రహించుకొనువారికే అర్థమగును.

ఏసు చనిపోయిన తర్వాత ఆదివారము ఉదయము సజీవుడై బయటికి వచ్చాడు అని క్రైస్తవులు చెప్పుచుండగా, ఆయన చనిపోలేదు అని ముస్లీమ్‌లు అనుచున్నా వీరు వారు 4-158 వాక్యములో పొరపాటుపడి మాట్లాడుచున్నారు. ఆ వాక్యములో దేవుడు ఏసును తనవైపు పైకి ఎత్తుకొన్నాడు అని చెప్పుచున్నారు. వాక్యములో ఆ మాటయున్నా, అది వాస్తవమే అయినా కనిపించే వాక్యమువేరు, అర్థము చేసుకొను భావము వేరని తెలియవలెను. ఏసును దేవుడు అలాగే పైకి తీసుకపోయాడు, ఏసును పోలిన వ్యక్తిని పట్టుకొని వచ్చి శిలువమీదికి ఎక్కించి చంపివేశారు అని అంటున్నారు. ఏసునే చంపారు అని క్రైస్తవులు అనగా! ఏసులాంటి పోలికలున్న మనిషిని శిలువను ఎక్కించారనీ, అతనినే చంపారనీ దానితో ఏసు శిలువమీద మరణించాడని క్రైస్తవులు పొరపాటు పడినారనీ, వాస్తవముగా ఏసు వారికి దొరకలేదనీ, దేవుడు ఆయనను తనవైపుకు ఎత్తుకొన్నాడనీ ముస్లీమ్‌లు చెప్పుచున్నారు. అలా అనుకుంటే ముస్లీమ్‌లు కూడా పూర్తిగా పొరపాటు పడినట్లేయగును. వీరికంటే క్రైస్తవులే కొంత

మేలనిపిస్తుంది. వాస్తవానికి వీరికిగానీ వారికిగానీ ఏసు మరణమును గురించి సత్యము తెలియలేదని అర్థమగుచున్నది. జిబ్రయేల్ చెప్పినది కనపరాని సత్యము. క్రైస్తవులు చూచినది కనిపించే అసత్యము. క్రైస్తవులు చూచినది భౌతికముగా సత్యమే అయినా, అభౌతికముగా అసత్యము. అలాగే జిబ్రయేల్ చెప్పినది అభౌతికముగా సత్యము. అయితే ఈ రెండూ ముస్లీమ్‌లకు అర్థము కాలేదు. మొదటికే మోసము అన్నట్లు కనిపించే ఏసు శరీరమును శిలువమీదికి ఎక్కించినా అది ఏసును పోలిన మనిషి అనడము పూర్తి తప్పు. దీనినిబట్టి జిబ్రయేల్ సత్యమును చెప్పినా, ముస్లీమ్‌లుగానీ, క్రైస్తవులుగానీ అర్థము చేసుకోలేదని చెప్పవచ్చును.

ఏసు సమాధినుండి 33 గంటల తర్వాత లేచివచ్చాడు అని చెప్పుకొన్నాము. క్రైస్తవులు కూడా అదే చెప్పుచున్నారు. అంతవరకు లేని ఏసు ఆదివారము ఉదయము తెల్లవారుజామున లేవడము జరిగినది. గురువారము రాత్రి రెండు గంటలకు నిద్రలోనికి పోయిన ఏసు మూడవరోజు మూడు గంటల ప్రాంతములో లేచాడు. గురువారము రాత్రి నిద్రలోనికి పోయిన ఏసు శరీరములో ఎక్కడవుండి తిరిగి లేచాడు? అంతవరకూ జరిగినది తెలియదా? అను ప్రశ్నకు జవాబుగా ఇట్లు చెప్పుకోవచ్చును. గురువారము రాత్రి నిద్రలోనికి పోయిన ఏసు బ్రహ్మనాడిలో తన మనసు నిలిచిపోగా తానుమాత్రము గుణచక్రములోనే ఏమీ తెలియని స్థితిలో ఉండిపోయాడు. బయట సైనికులు తేవడము, న్యాయస్థానములో తీర్పు జరుగడము, తర్వాత శిలువ వేయడము వరకు ఆయన నిద్రలోనే ఉన్నాడు. అప్పటికి దాదాపు రాత్రి రెండుగంటలనుండి పగలు మూడు గంటల వరకు అనగా 12 లేక 13గంటలు నిద్రలోనే ఉండిపోయాడు. శిలువ వేసినంత వరకుయున్న ఆత్మ లోపలికి అణిగిపోయి మరణించినట్లు నటించి బయటికి

కనిపించునట్లు చేసినది. అప్పుడు ఆత్మ గుణచక్రము మధ్యభాగములోయున్న బ్రహ్మనాడిలోనికి చేరిపోయినది. అప్పుడు సప్త నాడీకేంద్రములలో ఆరు కేంద్రములు నిలిచిపోయి ఏడవ కేంద్రము అట్లే యుండును. దానినే మరణము అంటాము. అలా ఆరు కేంద్రములు నిలిచి పోయినప్పుడు శరీరములో జరుగు ఏ కార్యమూ జరుగదు. అప్పుడు మరణము అంటారు. మరణములో ఆత్మలోపలయుంటే అది తాత్కాలిక మరణమగును. తాత్కాలిక మరణములో జీవుడు గుణముల మధ్య ఉండకూడదు. అందువలన బ్రహ్మనాడిలోయున్న ఆత్మయే దేవునివలె జీవున్ని తనవైపు లాగుకొని బ్రహ్మనాడిలో చేర్చుకొనుచున్నది. శరీరములో ఏసుగా యున్న జీవున్ని దేవుని ఆత్మ అయిన ఆత్మయే తనవైపు లాగుకొని బ్రహ్మనాడిలో చేర్చుకొనుచున్నది. అప్పుడది అక్కడనుండి మరణముగా పరిగణింపబడును. అంతవరకూ నిద్రగాయున్నది, అప్పుడు మరణముగా లెక్కించబడుచున్నది. ఏసు అప్పుడు తాత్కాలిక మరణమును పొందాడని చెప్పవచ్చును. శరీరము లోపల జరిగినది జిబ్రయేల్ చెప్పగా దానిని అర్థము చేసుకోలేనివారు దేవుడే ఏసును పైకి ఆకాశముకు తనవైపు లాగుకొన్నాడని అనుకొంటున్నారు. దేవుడు శరీరములోనే యున్నాడు. శరీరములోనే ఆత్మ, జీవాత్మను దేవునివైపులాగి మరణములోనికి చేర్చుచున్నది. అది తాత్కాలిక మరణము లోనే అలా జరుగుచున్నది.

ఏసుకు జరిగినది అంతే, అదే విషయమునే జిబ్రయేల్ చెప్పాడు. జిబ్రయేల్ చెప్పినది ముస్లీమ్‌లకు అర్థముకాలేదు. క్రైస్తవులకూ అర్థము కాలేదు. జరిగిన సత్యమును బయటికి చెప్పువారు లేనందున ఇంతవరకు ఆ వివరము బయటికి రాలేదు. ఏసు తాత్కాలిక మరణములో 33 గంటలుండి తిరిగి మెలుకువలోనికి రావడము జరిగినది. అంతకుముందు

పన్నెండు (12) గంటల కాలము నిద్రలో గడిపిన ఏసు నిద్రనుండి నేరుగా తాత్కాలిక మరణములోనికి పోయాడు. అక్కడనుండి బయటికి వచ్చు వరకు బయట ఏమి జరిగినదీ ఏసుకు తెలియదు. అందువలన బయట జరిగిన ఒక్క అనుభవమును కూడా ఏసు అనుభవించలేదు. ఏసు గురువారము రాత్రి లోపలికి పోయి ఆదివారము రాత్రి బయటికి వచ్చాడు. దానితో మూడు రోజులు లేకుండా పోయి వచ్చినట్లయినదిగానీ, ఆయన చనిపోయిన తర్వాత 33 గంటలు మాత్రమే సమాధిలోయున్నాడు. సమాధినుండి బయటికి వచ్చిన తర్వాత 33 మార్లు తన శిష్యులకు కనిపించాడు. ఆ తర్వాత ఎవరికీ కనిపించలేదు. ఇదంతా చూస్తే ఖుర్ఆన్‌లో జిబ్రయేల్ చెప్పినది అసత్యముకాదు. బైబిలులో క్రైస్తవులు చదివినదీ అసత్యముకాదు. అయితే దేవుడు వాక్యములో చెప్పినా గ్రహించలేని స్థితిలో మనుషులు ఉన్నారు. అందువలన పూర్తి భావముతో అంతిమ దైవగ్రంథము ముస్లీమ్‌లకు అర్థము కాలేదు. అదే విధముగా క్రైస్తవులకు మధ్య దైవగ్రంథము అర్థము కాలేదు. ఇకపోతే ప్రథమ దైవగ్రంథము హిందువులకు అర్థము కాలేదని చెప్పవచ్చును. ఇప్పటికయినా అర్థము చేసుకోగలరని ఆశిస్తూ ముగిస్తున్నాము.

**ఒక విషయమును సమర్థించుటకు శాస్త్రము ఎంత అవసరమో, అట్లే ఒక విషయమును ఖండించుటకు శాస్త్రము అంతే అవసరమగును.**

**అసత్యమును వేయిమంది చెప్పినా అది సత్యము కాదు,**
**సత్యమును వేయిమంది కాదనినా అది అసత్యము కాదు.**

# ముస్లీమ్-హిందువుల అనుబంధ ఫోటోలు

మనిషి అంటే వాడు ఏ మతములోయున్నా మనిషే. దేవుడు అంటే ఆయన ఏ దేశములోయున్నా దేవుడే. మనిషికి ఏ మతమూ అంటుకొని లేదు. అలాగే దేవునికి ఏ దేశమూ అంటుకొనిలేదు. మనిషి మతముతో సంబంధము లేకుండా పుట్టాడు. దేవుడు దేశముతో సంబంధము లేకుండా ఉన్నాడు. మనిషి మతమును వదలితే దేవునిలోనికి పోగలడు. ఈ విధానమును అనుసరించి దేవుడు తెల్పిన జ్ఞానమును తెలిసిన మనుషులు తమతమ మతములను ప్రక్కనపెట్టి దేవునికి మతమునకు సంబంధము లేదనీ, మతధ్యాస మాయధ్యాసయగుననీ, మతమునకు అతీతముగా మతాతీతుడైనప్పుడే దేవునికి మనిషి ఇష్టుడు కాగలడనీ తెలిసినవారు అన్ని మతములలోనూయున్నారు. అటువంటి వారి దృష్టిలో మతము అనునది లేకుండా దేవుడు, దేవుని జ్ఞానమే ముఖ్యముగా ఉండును. అటువంటివారు మతమునుండి ఒక్కొక్క మెట్టుదిగుచూ, దేవుని జ్ఞాన మార్గములో ఒక్కొక్క మెట్టు ఎక్కుచుందురు. అటువంటివారు ఏ మతములో యున్నా వారు దేవునివైపు పోవాలన్నదే వారి ఉద్దేశ్యము. నేడు కొందరు ముస్లీమ్‌లు ఈ గ్రంథములో చెప్పినట్లు దేవునికి ఇష్టులుగా మారిపోయారు. వారి మతములో ఎన్నో నియమ నిబంధనలున్నా మతముకంటే మాకు దేవుడే ముఖ్యము అంటున్నారు. ఆ పద్ధతిలో మూడు దైవగ్రంథములను చదివి గ్రంథములలో ఏమున్నదో తెలుసుకోగలిగారు.

ముస్లీమ్‌లకు అంతిమ దైవగ్రంథము ఖుర్‌ఆన్ చాలా ముఖ్యమైనది. ముస్లీమ్‌లందరూ ఖుర్‌ఆన్ గ్రంథమును అతిక్రమించిపోరు. ఖుర్‌ఆన్ గ్రంథములో జ్ఞానమును తెలిసిన ముస్లీమ్‌లందరికీ అందులో మూడు

గ్రంథములకు సంబంధించిన ముఖ్యమైన వాక్యము ఒకటి కలదు. అది **'అల్ మాయిదా'** అను ఐదవ సూరాయందు, 68వ ఆయత్‌లో ఇలా కలదు. **(5-68) ఓ ప్రవక్తా! వారికి చెప్పు. "మీరు తౌరాతును (భగవద్గీతను), ఇంజీలును (బైబిలును), మీ ప్రభువు తరఫున మీవద్దకు వచ్చిన 'అంతిమ దైవగ్రంథము ఖుర్‌ఆన్‌ను మీ జీవితములలో నెలకొల్పనంత వరకూ మీరు ఏ ధర్మముపైనా లేనట్లే" నీ ప్రభువు తరఫున వచ్చిన ఖుర్‌ఆన్‌ను చూచి వారిలోని అనేకులకు గర్వము, తిరస్కారవైఖరి మరింత అధికమయింది. అయితే నీవు ఈ తిరస్కారులను లెక్కచేయకు.** మతఛాందసవాదులు ఎక్కడయున్నా వారు ఇతర మతముల మీద అసూయ కల్గియుందురు. క్రైస్తవులు ఖుర్‌ఆన్‌ను చూచి అసూయపడు వారున్నారు. అట్లే భగవద్గీతను, బైబిలును చూచి అసూయపడు ముస్లీమ్‌లు యున్నారు. వారిలో ఇది మా గ్రంథముకాదు అను అసూయ, మాకు అంతా తెలుసు అను గర్వము ఉన్నాయి. అయితే మూడు గ్రంథముల జ్ఞానము తెలియనిదే వాడు ఏ ధర్మములోనూ లేనట్లేనని పై వాక్యములో చెప్పడమైనది. **మూడు గ్రంథములను మీ జీవితములలో నెలకొల్పనంత వరకు, మీరు ఏ ధర్మములోనూ లేనట్లేయని** అన్నారు. అందువలన ఏ మతస్థుడయినాగానీ, వాడు మూడు గ్రంథముల జ్ఞానము తెలియకపోతే వాడు వాని ధర్మములో లేనట్లే. ఒక క్రైస్తవుడు ప్రథమ దైవగ్రంథమయిన భగవద్గీతను తెలియకపోతే వాడు వాస్తవముగా క్రైస్తవుడే కాదు. అలాగే ఒక ముస్లీమ్ ప్రథమ దైవగ్రంథమును గురించి తెలియకపోతే వాడు వాని ధర్మములో లేనట్లే. మిగతా మతస్థులు కూడా ఇతర గ్రంథములను తెలియకపోతే వారు వారి ధర్మములో లేనట్లే అంతేకాదు వారు ఏ

ధర్మములోనూ లేనట్లేయగును. అందువలన ఖుర్ఆన్‌లో 5-68 ఆయత్ తెలిసిన ముస్లీమ్‌లు కొందరు ప్రథమ దైవగ్రంథమయిన తౌరాత్ గ్రంథము లోని జ్ఞానమును తెలియగలిగి, అంతిమ దైవగ్రంథము ఖుర్ఆన్‌లో 15-29 ఆయత్‌లో చెప్పినట్లు దేవుడు పంపిన దేవుని ప్రతినిధిగా కృష్ణున్ని తలచి, కృష్ణాష్టమిరోజు కృష్ణుని మీద భక్తిభావముతో, దేవుని ఆత్మయని గౌరవభావముతో తమ పిల్లలకు కృష్ణుని వేషమువేసి, పండుగ జరుపుకొను వారు కూడా కలరు. వారిని నిజమైన జ్ఞానులని అనవచ్చును. మేము చెప్పుమాట అసత్యమని మమ్ములను ఎవరయినా అనవచ్చును. అయితే అలా అనుటకు అవకాశము లేకుండా, ఇది సత్యము అని తెలుపుటకు ఇక్కడ కృష్ణుని వేషము ధరించిన ముస్లీమ్ పిల్లలనూ, వారి పెద్దలనూ, భగవద్గీత రథము బొమ్మను చూపుతున్న ముస్లీమ్‌లను ఫోటోలలో చూడవచ్చును. ఇది చూస్తే ఖుర్ఆన్‌లోని 5-68 వాక్యము అర్థముకాగలదని అనుకొంటున్నాను.

ఈ గ్రంథము అచ్చుకాకముందే ఇందులోని తప్పుఒప్పులను చూచిన వారు ఐదుమందియున్నారు. అందులో ఒకరు ప్రస్తుతము ముస్లీమ్ మతములోయున్న వ్యక్తి. అతను గ్రంథమునంతటినీ చదివిన తర్వాత గ్రంథమంతా బాగానేవుందిగానీ, ఇందులో నా తరపున రెండు ప్రశ్నలు ఉన్నాయి అన్నాడు. అప్పుడు ఆ ప్రశ్నలేవో అడగమని మేము చెప్పాము. అప్పుడు అతడు ఈ విధముగా అడిగాడు.

**ప్రశ్న :-** మీరు తౌరాత్ గ్రంథమును భగవద్గీతగా వర్ణించి చెప్పారు. తర్వాత తౌరాతు గ్రంథమును శ్రీకృష్ణుడు చెప్పారని చెప్పారు. మీరు వ్రాసిన జ్ఞానము అద్భుతముగాయున్నది గానీ, తౌరాతు గ్రంథము విషయములో నాకు అనేక సంశయములు వచ్చుచున్నవి. తౌరాతును మోసేప్రవక్తకు దేవుడు ఇచ్చినట్లు కలదు. మోసే ప్రవక్తనే ఖుర్ఆన్‌గ్రంథములో మూసా అన్నారు. మూసా ప్రవక్త మోసేప్రవక్త ఇద్దరూ ఒకటేనని తెలిసిపోయినది. ఏసును ఈసా అనీ, బైబిలును ఇంజీలు అనీ ఖుర్ఆన్ గ్రంథములో చెప్పగా విన్నాము. మోసే ధర్మశాస్త్రమును గురించి బైబిలులో అనేకచోట్ల ప్రస్తావనకు వచ్చినది. మోసేనే అంతిమ దైవగ్రంథములో మూసాయని చెప్పడమేకాక మూసాకు ఇచ్చినది తౌరాతు గ్రంథమని కూడా చెప్పారు. దీనినిబట్టి బైబిలులో యున్న మోసే, ఖుర్ఆన్‌లోయున్న మూసా ఇద్దరూ ఒక్కటేనని తెలిసిపోయినది. మూసాకు ప్రసాదించిన గ్రంథము తౌరాతుయని ఉండగా, మీరు తౌరాతు గ్రంథమంటే భగవద్గీతయనీ, మూసా అంటే శ్రీకృష్ణుడనీ చెప్పడము మాకు కొంత ఆశ్చర్యముగా కనిపించడమేకాక పూర్తి అసత్యముగా కూడా కనిపించు చున్నది. మీరు చెప్పిన జ్ఞానము సత్యమే. అయితే మీరు చెప్పిన తౌరాతు గ్రంథ విషయము సత్యముకాదేమో అని అనిపిస్తూయున్నది. మాకు వచ్చిన సంశయమును మేము చెప్పాము. దీనికి మీరు ఏమంటారో చూడాలని వుంది. ఒక ప్రక్క జ్ఞానవిషయములో మీరు అసత్యము చెప్పరను నమ్మకము

యున్నది. ఎందుకనగా మీరు అసత్యము చెప్పేవారయితే మిమ్ములను చూస్తే జిన్నులనబడు దేవతలు భయపడవు. దేవతలే మీకు నమస్కారము చేయుచున్నారంటే మీరు జ్ఞానములో సక్రమముగాయున్న జ్ఞానశక్తివంతులని అర్థమగుచున్నది. అటువంటి మిమ్ములను సత్యవంతులుగానే లెక్కించు కోగలము. అయితే మూసా అనబడు మోసే ప్రవక్తకు దేవుడు ఇచ్చినది తౌరాతు గ్రంథమయినప్పుడు దానిని భగవద్గీతయని చెప్పడము మాకు కొంత విడ్డూరముగాయున్నది. దీనికి మీరేమంటారు?

**జవాబు :-** నేను అసత్యము చెప్పానని నిర్ణయానికి రాకుండా అనుమానము వచ్చినదని, ఉన్నది ఉన్నట్లు అడిగారు. కావున దానికి నేను తప్పక జవాబు ఇవ్వదలచుకొన్నాను. ఆ నేపథ్యములో నేను మిమ్ములను ఒక ప్రశ్న అడుగు చున్నాను. ఏసును ఈసా అని అన్నారు వాస్తవమే. బైబిలును ఇంజీలు అన్నారు వాస్తవమే. అయితే మోసేనే మూసా అని ఋజువేమికలదని అడుగుచున్నాను. మూసాకు తౌరాతుగ్రంథము ఇవ్వబడినది వాస్తవమే. మోసేగాయున్న మూసా, తౌరాతు గ్రంథమును చెప్పిన మూసా ఇద్దరూ ఒక్కరేనా? ఈ విధముగా గతములో ఎవరూ ప్రశ్నించలేదు. అయితే మేము ఇప్పుడు ప్రశ్నించుచున్నాము. మా ప్రశ్నకు ఎవరయినా స్పందించి ఈ ప్రశ్న అడగడమే తప్పు, మోసే ధర్మశాస్త్రము అని బైబిలులో పేరుగాంచిన దానినే మూసా చెప్పిన తౌరాతుయని ఖుర్ఆన్‌లో చెప్పారు, మూసా ప్రవక్తను ప్రజలు ఒప్పుకొనేదానికి **అతనికి మొదట తౌరాతును దేవుడు ఇచ్చాడు.** అయితే మూసా అను రెండక్షరముల పేరున్న వ్యక్తి కృష్ణ అను రెండక్షరముల పేరున్న వ్యక్తి ఇద్దరూ ఒకటేనని తెలియనివారు కృష్ణమూసాను, మోసేమూసా అని అనుకోవడము జరిగినది. మోసే ప్రవక్త అయినా, ఆయన ఒక మానవుడు. కృష్ణుడు మానవుడే అయినాకానీ, ఇతను దేవుని ప్రతినిధి,

దేవుని జ్ఞానము దేవుని ప్రతినిధికే తెలుసు. ఎందుకనగా! దేవుడు తన జ్ఞానమును తన ప్రతినిధికి ఇచ్చి పంపియుండును. అంతేకాక దేవుని ప్రతినిధి దేవునిలోని భాగమైయున్నాడు. అతను దేవుని ఆత్మనే కల్గియున్నాడు. కావున అతనికి దేవుని జ్ఞానము పూర్తి తెలిసియుండును. కృష్ణునికి 'కృష్ణా' అను పేరేగాక 'మూస' అను పేరు కూడా ప్రత్యేకించి జ్ఞానులు అనెడివారు. 'మూస' అను బిరుదు భగవద్గీతను చెప్పిన తర్వాత కృష్ణునికి వచ్చినదని తెలియుచున్నది.

సిద్ధాంతమును చెప్పిన వానిని 'సిద్ధాంతి' అంటాము. శాస్త్రమును చెప్పిన వానిని 'శాస్త్రి' అంటాము. అలాగే ముద్రవేయు దానిని 'మూస' అంటాము. కృష్ణుడు భగవద్గీతను చెప్పి దానిని ఒక గ్రంథముగా ముద్ర వేశాడు. అదియే నేడు ప్రథమ దైవగ్రంథముగా ఉన్నది. భగవద్గీతలో పురుషోత్తమప్రాప్తి యోగమున 16,17 శ్లోకములలో గల **'త్రైత సిద్ధాంతము'** అను శాసనమును కృష్ణుడు శాశ్వతముగా ఉండునట్లు బ్రహ్మవిద్యా శాస్త్రములో ముద్రించాడు. అది ముద్రించిన శాసనము. అందువలన కృష్ణున్ని భగవద్గీత చెప్పిన తర్వాత 'శాసనమును ముద్రించిన మూస' అన్నారు. ఆ మూస ఎక్కడున్నా అదే సిద్ధాంతమునే ముద్రించును. ఆ మూసనుండి వేరే ముద్రరాదు. కృష్ణుడు త్రైత సిద్ధాంతమునకు శాశ్వతముగా యున్న మూస. ఆ మూసలో ఏమి పోసినా అది త్రైత సిద్ధాంత ఆకారమును సంతరించుకొని త్రైత సిద్ధాంత ముద్రగా మారిపోగలదు. అందువలన కృష్ణున్ని అప్పటికాలములో జ్ఞానము తెలిసిన జ్ఞానులు 'మూసా' అను బిరుదును ఆయనకు చెప్పారు.

ముద్రించు దానిని మూస అనడము సహజమే. అయితే ప్రకృతి జనిత మాయ మనుషులను తన మాయలో మభ్యపెట్టుటకు 'మూస'కు

'మూసా' అను దీర్ఘమును వచ్చునట్లు చేసినది. అంతేకాక మోషేనే మూసయని పిలుచునట్లు చేసినది. ఖుర్ఆన్ గ్రంథములో దేవుని ఆజ్ఞచేత ప్రకృతి మోషేను మూసాయనీ, కృష్ణున్ని కూడా మూసాగా పిలుచునట్లు చేసి మనుషులను తప్పుదారి పట్టించినది. కృష్ణమూసను, మోషేమూసాలో కలిపివేసింది. అందువలన ఎవరు మూసానో, ఎవరు మూసనో తెలియక ఇద్దరినీ ఒకే మూసాగా మనుషులు చెప్పుకోవడము జరుగుచున్నది. ఖుర్ఆన్‌లో చెప్పిన వాక్యములలో మోషేమూసా యున్నాడు, కృష్ణమూస యున్నాడు. అయితే ఖుర్ఆన్‌కంటే 600 సంవత్సరముల ముందు చెప్పిన బైబిలులోని మూసానే, ఖుర్ఆన్‌లో ఉన్నాడని అందరూ అనుకొన్నారు. అయితే అంతకంటే 3000 సంవత్సరముల ముందు వచ్చిన భగవద్గీతలోని మూసాను గురించి ఎవరూ అనుకోవడములేదు. భగవద్గీతలోని మూస ఎవరో తెలియని దానివలన, అందరూ బైబిలులోని మోషేనే మూసాయని అనుకొన్నారు. అయితే మూడవ అంతిమ దైవగ్రంథములో చెప్పినది రెండు గ్రంథములలోని వారున్నారని అనుకోవడములేదు. అందువలన కృష్ణ మూసను అందరూ తెలియకుండాపోయి, మోషే మూసానే అందరూ లెక్కించుకోవడము జరుగుచున్నది.

మోషేమూసా ప్రవక్త అయినా, అతను సాధారణ మనిషియే, సాధారణ మనిషి మీద దేవుని జ్ఞానము ఎప్పుడూ అవతరించదు. దేవుని జ్ఞానము ఏ మానవునకూ తెలియదు అన్నట్లు, దేవుని జ్ఞానము ఏ మానవుని మీదా అవతరించలేదని చెప్పవచ్చును. ఇదే విషయమునే అంతిమ దైవ గ్రంథము ఖుర్ఆన్‌లో సూరా 6, ఆయత్ 91యందు ఈ విధముగా వ్రాసి యున్నారు. **(6-91) "దేవుడు ఏ మానవమాత్రునిపైనా ఎలాంటి జ్ఞాన విషయాన్నీ అవతరింపజేయలేదు". అని పలికినప్పుడు ఈ అవిశ్వాస జనులు దేవున్ని అర్థము చేసుకోవలసిన విధముగా అర్థము**

**చేసుకోలేదు. వారిని అడుగు "మూసా తెచ్చిన ఆ (తౌరాతు) గ్రంథాన్ని ఎవరు అవతరింపజేసినట్లు? ఆ గ్రంథము ఒక జ్యోతి, మానవుల కొరకు మార్గదర్శకత్వము. మీరు దాన్ని వేరువేరు కాగితములుగా, (వేరువేరు గ్రంథములుగా) విభజించి చూపుతున్నారు. ఎన్నో విషయములను దాచేస్తున్నారు. మీకుగానీ మీ పెద్దలకుగానీ తెలియని ఎన్నో విషయములు ఇందు మూలముగా మీకు నేర్పబడ్డాయి." దాన్ని (తౌరాతును) అవతరింపజేసినవాడు అల్లాహ్‌యే" అని చెప్పు. ఆ తర్వాత వాళ్ళను వారి వ్యర్థ విషయములలోనే ఆడుకోనివ్వు.**

ఈ ఆయత్‌ను చూచిన తర్వాత మనుషులయిన వారిమీద తన జ్ఞానమును దేవుడు అవతరింపజేయలేదని తెలిసినది. అయితే దేవున్ని మనుషులు సరిగా అర్థము చేసుకోలేదనీ, అందువలన తౌరాతును మూసా అయిన మోసే మీద అవతరింపజేశాడనీ పొరపాటుగా అనుకోవడము జరిగినదనీ, మూసా తెచ్చిన గ్రంథమును అనగా తౌరాతు గ్రంథమును ఎవరు అవతరింపజేశారో అడగండి అని వాక్యములో చెప్పడమైనది. ఆ మాట చెప్పడము వలన మూసా గ్రంథమును మూసాకు ఎవరిచ్చారో కూడా తెలియదనేగా అర్థము. మూసాకు దేవునిచేత ఇవ్వబడిన గ్రంథము భగవద్గీత అదియే తౌరాతు గ్రంథము. ఆ గ్రంథములో మీకు, మీ పెద్దలకు తెలియబరచబడిన ఎన్నో విషయములున్నాయని చెప్పారు. అంతేకాక మొదట కృష్ణమూసా చేత ఇవ్వబడిన ప్రథమ దైవగ్రంథమయిన తౌరాతు లేక భగవద్గీతయే తర్వాత బైబిలుగా, ఆ తర్వాత ఖుర్‌ఆన్‌గాయున్నది. కావున మార్గదర్శకమైన దానిని వేరువేరు కాగితములుగా విభజించుకొన్నారు అని చెప్పారు. నేడు భగవద్గీతలోని జ్ఞానవిషయములే మిగతా రెండు గ్రంథములుగా బైబిలు, ఖుర్‌ఆన్‌గా ఉండుట వలన ఆ విధముగా చెప్పారు.

వేరువేరు కాగితములుగా, వేరువేరు గ్రంథములుగా కనిపించు దానిని (భగవద్గీతను) అవతరింపజేసినవాడు దేవుడేయని వాక్యము చివరిలో చెప్పారు.

ఈ వాక్యములో ఏ మానవమాత్రుని మీదా తన జ్ఞానమును అవతరింపజేయలేదనీ, దేవుడు చెప్పుట వలన తౌరాతు గ్రంథమును ప్రవక్తయైన మూసాకు ఇవ్వలేదనీ, అతని మీద అవతరింపజేయలేదనీ తెలియుచున్నది. అనగా మోషే అను మూసాకు ఇవ్వలేదని తెలిసినది. అయితే ఇచ్చినది ఎవరికి? ఎవరు? అని ప్రశ్నించుకొని చూస్తే, కృష్ణ మూసాకు ఇవ్వడము జరిగినదని, దేవుడే ఇచ్చాడని తెలియుచున్నది. ఇక్కడ కొందరు ఈ విధముగా ప్రశ్నించవచ్చును. అదేమనగా! కృష్ణమూసాకే గ్రంథమును ఇచ్చాడని ఎలా చెప్పగలరు? మోషేమూసాకు ఇవ్వలేదని మీరు ఎలా చెప్పగలరు? మీరు చెప్పు దానికి ఏదయినా ఆధారమున్నదా? అని ప్రశ్నించవచ్చును. దానికి మా జవాబు ఇలా కలదు చూడండి. మోషే ప్రవక్త కేవలము మనిషి మాత్రమే. ఆయన దేవుని ప్రతిరూపమయిన ఆయన ప్రతినిధికాదు. అందువలన ఆయనకు దేవుడు తన జ్ఞానమును ఇవ్వలేదు. మీరు గ్రంథము ఇచ్చారు? అంటే ఎవరు ఇచ్చారు అని దేవుడు పై వాక్యములో ప్రశ్నించాడు. అందువలన మోషేకు జ్ఞానగ్రంథము ఇవ్వలేదని తెలియుచున్నది. అంతేకాక దానికి నిరూపణగా బైబిలు గ్రంథములో యోహాన్ సువార్త ఆరవ అధ్యాయమున 32వ వాక్యమున ఈ విధముగా వ్రాయబడి యున్నది. **(యోహాన్ 6-32) "పరలోకము నుండి వచ్చు ఆహారము మోషే మీకియ్యలేదు. నా తండ్రియే పరలోకము నుండి వచ్చు నిజమైన ఆహారమును మీకనుగ్రహించుచున్నాడు."** అంతేకాక అదే సువార్త, అదే అధ్యాయములో 25,26,27వ వాక్యములలో

కొంత ఆధారము దొరుకుచున్నది. ఏసును వెదకుచూ కొందరు వచ్చి **(6-25) "బోధకుడా! నీవు ఎప్పుడు ఇక్కడికి వచ్చితివని అడుగగా! (ఏసు ఇలా అన్నాడు.), (6-26) "మీరు సూచనలను చూచుట వలన కాదుగానీ, రొట్టెలు భుజించి తృప్తి పొందుట వలననే నన్ను వెదకు చున్నారని మీతో నిశ్చయముగా చెప్పుచున్నాను." (6-27) "క్షయమైన ఆహారము కొరకు కష్టపడకండిగానీ, నిత్య జీవము కలుగజేయు అక్షయమైన ఆహారమునకే కష్టపడండి. మనుష్య కుమారుడు దానిని మీకిచ్చును.", (6-28) "అందుకే తండ్రియైన దేవుడు ఆయనకు ముద్రవేసియున్నాడని చెప్పెను."**

ఇక్కడ ఈ వాక్యములో అక్షయ ఆహారము, క్షయ ఆహారము అని రెండు రకముల ఆహారములను చెప్పారు. క్షయమైన ఆహారము అనగా నశించిపోవు ఆహారమని అర్థము. క్షయము అనగా నాశనము అనియూ, అక్షయము అనగా నాశనముకానిదని అర్థము. క్షయమైన ఆహారము ప్రతి దినము మనము స్థూలముగా భుజించు రొట్టెలు, అన్నము మొదలగునవి. అక్షయమైన ఆహారమనగా అది స్థూలమైనదికాదు, కంటికి కనిపించునదికాదు, చెవులకు వినిపించునది మాత్రమే, అదియే దేవుని జ్ఞానము. దేవుని జ్ఞానము జీవునికి నాశనముకాని ఆహారమని చెప్పడము జరిగినది. మనుషులు భుజించి తృప్తిపొందు ఆహారము కొరకే వెదుకు చుందురుగానీ, నాశనముకాని జ్ఞానము కొరకు వెదకరని పై వాక్యములో చెప్పారు. మనము నిత్యము తినే ఆహారము తిన్న కొద్దిసేపటికే మూడు లేక నాలుగు గంటలకే జీర్ణమై నాశనమై పోవుచున్నది. అదే జ్ఞానమను ఆహారము ఒకమారు తలలోనికి వేస్తే రెండవమారు దాని అవసరము ఉండదు. తలలోయున్నదానిని తిరిగి ఎప్పుడయినా వాడుకొని బయటికి చెప్పుకోవచ్చును. క్షయమైన ఆహారమును ఒకమారు కడుపులోనికి వేస్తే

అది నశించిపోవునుగానీ, తిరిగి బయటికి ఆహారముగా రాదు. తలలో వేసిన జ్ఞాన ఆహారము నశించదు. అందువలన దేవుని జ్ఞానమును అక్షయమైన ఆహారము అన్నారు. నాశనముకాని ఆహారమైన జ్ఞానము దేవునినుండి వచ్చినది. కావున దానిని పరలోకమునుండి వచ్చు ఆహారము అనికూడా అన్నారు. ఇక్కడ ముఖ్యముగా చెప్పునదేమనగా! ఏసు తనను వెదుకుచూ వచ్చినవారితో మాట్లాడుచూ 'మీకు కావలసినది స్థూల ఆహారమే గానీ, సూక్ష్మజ్ఞానము కొరకు మీరు వెదకడములేదు' అన్నాడు. అంతేకాక తనను చెప్పకుండా, నేను అని చెప్పకుండా మీకు అవసరమైతే 'మనుష్య కుమారుడు అక్షయమైన ఆహారమును మీకిచ్చును' అని అన్నాడు. తర్వాత వెంటనే 28వ వాక్యములో "తండ్రియైన దేవుడు ఆయనకు ముద్రవేసి యున్నాడు" అని చెప్పాడు. ఈ వాక్యములో కూడా తనను చెప్పకుండా రెండవ వ్యక్తినే చెప్పాడు. ఇక్కడ మనుష్యకుమారుడని ఏసు ఎవరిని చెప్పాడు? అంతేకాక తండ్రియైన దేవుడు ఎవరికి ముద్రవేసియున్నాడు? అని ప్రశ్నించక తప్పదు.

అలా ప్రశ్నించి చూచితే ఏసు స్వయముగా మనుష్య కుమారుడని ప్రత్యేకించి ఒక వ్యక్తిని చెప్పాడు. అంతేకాక దేవుడు ఆయనకు ముద్ర వేసియున్నాడు అనికూడా చెప్పాడు. ముద్రగాయున్నవాడు, మనుష్య కుమారుడు ఇద్దరూ ఒక్కరే అని ఈ వాక్యములనుబట్టి అర్థమైపోయినది. ఒకవేళ తనకంటే ముందుయున్న మోషేప్రవక్తను గురించి అక్షయ ఆహారము ఇచ్చినవానిగా అనుకుంటారేమోనని **(6-32) వ వాక్యములో "పరలోకము నుండి వచ్చు ఆహారము మోషే మీకు ఇవ్వలేదు"** అన్నాడు. అప్పుడు మోషే కూడా కాదని తెలిసిపోయినది. అయితే ఏసు చెప్పిన మనుష్య కుమారుడు మరియు ముద్రవేయబడినవాడు ఎవరుండవచ్చును! అని ఆలోచిస్తే, చెప్పింది స్వయముగా ఏసే అయినందున, ఆయన కాకుండా

వేరే ఇంకొకరిని గుర్తించ వలసియున్నది. మోషేకంటే ముందు వచ్చినవాడు, ముద్రగలవాడు, పరలోక ఆహారమును ఇచ్చువాడు మనిషిగా, మనిషి కుమారుడుగా వచ్చినవాడు ఒక్క కృష్ణుడు తప్ప ఎవరూ లేరని తెలియు చున్నది. దేవునిముద్ర కల్గినవాడు అని కూడా ఉండుట వలన కృష్ణుడు కూడా మూసగా చెప్పబడినాడని తెలిసిపోయినది. ఈ విధముగా బైబిలు ఆధారముతోనూ, ఖుర్‌ఆన్ ఆధారముతోనూ కృష్ణున్ని తౌరాతు గ్రంథము ఇచ్చిన మూసాగా గుర్తించగలిగాము. కృష్ణుడు మూసా అను మాట క్రొత్తగా యుండినా ఏసు చెప్పిన మనుష్య కుమారుడు, ముద్రకల్గినవాడు, అక్షయ ఆహారమును ఇచ్చువాడు మోషేకంటే ముందుయున్న కృష్ణుడని తెలిసి పోవుచున్నది. కృష్ణుడు తౌరాతు గ్రంథమును ఇచ్చినవాడు అనుటకు ***బైబిలులోని యోహాను సువార్తయందు ఆరవ అధ్యాయములోగల 26,27, 28,32 వాక్యములే ఆధారమని చెప్పవచ్చును.*** యూదుల ప్రవక్తయైన మోషేకు, తౌరాతుకు ఏమాత్రము సంబంధములేదని చెప్పవచ్చును. దీనితో **'తౌరాతు'** అనగా **'భగవద్గీత'**యని తెలిసిపోవుచున్నది. ఇంత చెప్పినా కొందరు మొండిగా తౌరాతు అంటే భగవద్గీత కాదు అంటే, తౌరాతు గ్రంథమును మీరు చూపగలరా? అని అడుగుచున్నాము. ఇంజీలు అనగా బైబిలు అని తెలిసిపోయినది. దానిప్రకారము ఇంజీలుకంటే ముందుయున్న గ్రంథము తౌరాతు అయినప్పుడు, బైబిలున్నట్లే తౌరాతు కూడా ఉండవలెను కదా! ఇంజీలు అంటే బైబిలు అయినప్పుడు, దానికంటే ముందువచ్చిన తౌరాతు అంటే భగవద్గీత కాదని మీరెలా చెప్పగలరు? మీ మాటకు ఏదయినా ఆధారమున్నదా? యని మేము అడుగుచున్నాము. వాస్తవముగా తౌరాతు అంటే ఎవరికీ తెలియదు. దానిని అదే పేరుతో ఎవరూ చూడలేదు. ఇంజీలును అదే పేరుతో మనము చూడలేదు కదా! ఇంజీలును బైబిలుగా చూచినప్పుడు, తౌరాతును భగవద్గీతగా చూడడములో ఏమి కష్టము? అని

అడుగుచున్నాము. ఎవరు ఏమి చెప్పినా తౌరాతు అంటే ప్రథమ దైవ గ్రంథమనీ, ఇంజీలు అంటే ద్వితీయ దైవగ్రంథమనీ, అంతిమ దైవగ్రంథమైన ఖుర్ఆన్ సాక్ష్యమిచ్చు చున్నది. అనేక సందర్భములలో ఖుర్ఆన్ భగవద్గీతలోని జ్ఞానమును ధృవీకరించుచూ చెప్పడమే దీనికి సాక్ష్యమని చెప్పవచ్చును. అంతేకాక బైబిలు మరియు ఖుర్ఆన్ రెండు గ్రంథములు భగవద్గీతను చాలామార్లు ధృవీకరించుచూ వచ్చాయి. ఇదంతయూ కొంత జ్ఞాన దృష్టియున్నవారికి మాత్రమే పూర్తిగా అనుమానము లేకుండా అర్థము కాగలదు.

**ప్రశ్న :-** ముస్లీమ్ సమాజము నేడు ప్రపంచ వ్యాప్తముగా 160 నుండి 170 కోట్ల జనాభా వరకు కలదు. అందులో దాదాపు సగముమంది స్త్రీలు ఉంటారు. అనగా దాదాపు 90 కోట్లమంది స్త్రీలు ఉంటారని ఒక అంచనా. అయితే దాదాపు అందరూ ముసుగు వేసుకొనే కనిపిస్తుంటారు. వారికి ఇష్టమున్నా, ఇష్టములేకపోయినా ముసుగు తప్పనిసరిగాయుండ వలెనను నియమము దైవజ్ఞానమునకు సంబంధించినదా? లేక వారి సామాజిక జీవితమునకు వారు ఏర్పరచుకొన్నదా? మీకు తెలిసినంతవరకు చెప్పండి.

**జవాబు :-** ముసుగు పద్ధతి ఒక రకముగా మంచిపద్ధతేగానీ ఇది జ్ఞానమునకు సంబంధించిన విషయము కాదు. సమాజ శ్రేయస్సు కొరకు ముహమ్మద్ ప్రవక్తగారు ఏర్పరచిన జీవన విధానములో ఇది ఒకటి. ఇది పూర్తి ప్రపంచ విషయము అయినందున మేము ఎటూ తేల్చి చెప్పలేము. పరదా లేక ముసుగు పద్ధతి వచ్చిన విధానము **"ఖుర్ఆన్ అవగాహనము"** అను గ్రంథమునుండి సేకరించి ఇక్కడ తెలుపుచున్నాము. నాకు తెలిసినంత వరకు ముహమ్మద్ ప్రవక్తగారికి పదకొండుమంది భార్యలుండేవారు. వారిలో

అతిచిన్న వయస్సుగల ఆమెపేరు ఆయిషా, ఆమెను గౌరవముగా హజ్రత్ ఆయిషా అనెడివారు. ఆమె గొప్ప జ్ఞానిగా ఉండేది. ప్రవక్త తర్వాత జ్ఞానము తెలిసినది హజ్రత్ ఆయిషా అని చెప్పవచ్చును. ప్రవక్త గారికి 51 సంవత్సరము వయస్సులో 6 సం॥ముల వయస్సున్న ఆయిషాను వివాహమాడారు. తర్వాత ఆయిషాకు 9 సం॥ వయస్సులో ఆయిషా కాపురానికి వచ్చింది. ప్రవక్త 63 సం॥ వయస్సులో చనిపోయాడు. అప్పటికి ఆమె వయస్సు 18 లేక 19 సంవత్సరములు ఉండేవి. ఆమె చిన్న వయస్సులోనే మహాజ్ఞానిగా ఉండేది. అయితే ఆమెకు బహుశా 16 సం॥ వయస్సులో ఒక సంఘటన జరిగినది. ఆ సంఘటనతో పరదా లేక ముసుగు పద్ధతి వచ్చినది.

అది హజ్రత్ ఆయిషా (ర) మీద అపవాదు మోపిన ఉపద్రవం. ఆ సంఘటనా వివరాలు స్వయంగా ఆవిడగారి నోటనే వినండి, దానివల్ల పరిస్థితుల స్వరూపం పూర్తిగా కళ్ళముందు నిలుస్తుంది. మధ్యమధ్యన వివరణ అవసరమయిన విషయాలను మేము ఇతర ఉల్లేఖనాల ఆధారంగా బ్రాకెట్లలో అదనంగా ఉటంకించాము, తద్వారా మహనీయ ఆయిషా సిద్దీకా(ర) చేసిన వివరణాక్రమంలో ఎటువంటి అంతరాయం కలగదు. ఆవిడగారు ఇలా సెలవిచ్చారు.

"దైవ సందేశహరులు తమ నియమానుసారం తాను ప్రయాణానికి వెళ్ళేటప్పుడు తన సతీమణులలో ఎవరు తనవెంట వెళ్ళాలో అనేది చీటీవేసి నిర్ణయించేవారు. బనీ ముస్తలిక్ యుద్ధం సందర్భంలో చీటీ నా పేరిట వచ్చింది. నేను ఆయన వెంట వెళ్ళాను. తిరుగు ప్రయాణంలో మేము మదీనాకు చేరువయినప్పుడు, ఒక మజిలీలో రాత్రివేళ దైవ సందేశహరులు (స) మకాం వేశారు. ఇంకా చీకటి ఉండగానే బయలుదేరే సన్నాహాలు

జరుగసాగాయి. నేను లేచి కాలకృత్యాలు తీర్చుకోవడానికి వెళ్ళాను. తిరిగి వచ్చేటప్పుడు బస దగ్గరికి చేరేసరికి నా కంఠంలోని హారం ఎక్కడో తెగిపడిపోయిందన్న విషయం గ్రహించాను. నేను దాన్ని వెదకనారంభించాను, అంతలోనే బిడారు బయలుదేరింది. సాధారణంగా బయలు దేరే సమయంలో నేను 'హౌదా' (స్త్రీల కొరకు ఉపయోగించే పల్లకిలాంటిది) నెక్కి కూర్చునేదాన్ని. నలుగురు దాన్ని ఎత్తి ఒంటెపైన పెట్టేసేవారు. మహిళలు ఆ కాలంలో ఆహార లోపం వల్ల చాలా బక్కపలచగా ఉండే వారము. నా "హౌదా" నెత్తేటప్పుడు ఎత్తిన వారికి నేను అందులో ఉన్నానో లేదో గ్రహింపు కలగలేదు. వారు తెలియక ఖాళీ 'హౌదా' నెత్తి ఒంటెపైన పెట్టి బయలుదేరారు. నేను నా కంఠహారం తీసుకుని అక్కడికి చేరినప్పుడు అక్కడ ఎవ్వరూ లేరు. చివరికి నేను దుప్పటికప్పుకుని అక్కడే నడుం వాల్చాను. ముందుకు వెళ్ళిన తరువాత వారు నేను లేనని గమనిస్తారు, అప్పుడు వెదుక్కుంటూ ఎలాగూ వచ్చేస్తారని అనుకున్నాను. అదే స్థితిలో నాకు నిద్రపట్టింది. తెల్లవారుఝామున సఫ్వాన్ బిన్ ముఅత్తల్ సులమీ, నేను పడుకున్న చోటున వెళ్ళడం తటస్థించింది. నన్ను చూడగానే గుర్తుపట్టారు. ఎందుకంటే పరదా ఆదేశాలు రాకపూర్వం వారు నన్ను అనేక పర్యాయాలు చూసి ఉన్నారు. (ఈయన గారు బద్ర్ యుద్ధంలో పాల్గొన్న బద్రీ సహచరులు) వీరికి తెల్లవారు ప్రొద్దెక్కేవరకు పడుకునే అలవాటు ఉండేది. అందువల్ల సైన్యపు మజిలీలో ఆయన కూడా ఎక్కడో నిద్రపోతూ ఉండిపోయారు, ఇప్పుడు లేచి మదీనాకు బయలుదేరారు. నన్ను చూచి ఆయన ఒంటెను ఆపుకున్నారు. ఆయన నోటినుండి అప్రయత్నంగా "ఇన్నా లిల్లాహి వ ఇన్నా ఇలైహి రాజిఊన్, దైవప్రవక్త (స) సతీమణి ఇక్కడే ఉండిపోయారా?" అని పలికారు. ఈ ధ్వనివల్ల నాకు మెలుకువ వచ్చేసింది. నేను లేచి వెంటనే ముఖంపైన ముసుగు వేసుకున్నాను. ఆయన

నాతో ఏమీ మాటలాడలేదు. తన ఒంటె తెచ్చి నాకు సమీపాన కూర్చోబెట్టారు. తాను దూరంగా తొలిగి నిలబడ్డారు. నేను ఒంటెపైకి ఎక్కాను. ఆయన దాని ముక్కుతాడు పట్టుకుని బయలుదేరారు. మధ్యాహ్నం వేళకు మేము సైన్యాన్ని అందుకున్నాము. అప్పుడే అది ఒక మజిలీలో ఆగింది. సైన్యంలోని వారికి నేను వెనక ఉండిపొయ్యానన్న విషయం ఇంకా తెలియదు. దీని మీద అపవాదు మోపేవారు అపవాదులు రేపారు; వీరి అందరిలో అగ్రగణ్యుడుగా ఉన్నవాడు అబ్దుల్లా బిన్ ఉబై. అయితే నాకు అదంతా ఏమీ తెలియదు, నాపైన ఏ కథలల్లుతున్నారో నేనెరుగను.

(ఇతర ఉల్లేఖనాల ప్రకారం, సఫ్వాన్ ఒంటెపైన హజ్రత్ ఆయిషా (ర) సైనిక బిడారులో ప్రవేశించినప్పుడు, ఆమె అలా వెనుక ఉండిపోయారని తెలుసుకున్న వెంటనే అబ్దుల్లా బిన్ ఉబై ఎలుగెత్తి పలికాడు, "దైవం మీద ఒట్టు, ఈవిడ భద్రంగా రాలేదు. చూడండయ్యా, మీ ప్రవక్తగారి సతీమణి మరో వ్యక్తితో రేయి గడిపింది, ఇప్పుడు అతను అమెను బహిరంగంగా తీసుకువస్తున్నాడు?") "మదీనా చేరగానే నేను అనారోగ్యానికి గురయ్యాను. దాదాపు ఒక నెల రోజులు మంచంపై నుంచి లేవలేదు. నగరంలో ఈ అపవాదు రెక్కలు కట్టుకుని వ్యాపిస్తోంది. దైవ సందేశహరుల (సల్లల్లాహు అలైహి వ సల్లం) చెవులకు కూడా అది సోకింది. కానీ నాకు ఎలాంటి సమాచారం లేదు. అయితే నాకు బాధ కలిగించిన విషయం దైవప్రవక్త వైఖరి. సాధారణంగా నేను అస్వస్థతకు గురయితే ఎలా శ్రద్ధ చూపేవారో అలాంటి శ్రద్ధ కానరాలేదు. ఆయన ఇంటికి వస్తే కేవలం ఇంటిలోని వారిని మాత్రమే అడిగి పరామర్శించేవారు, "ఎలా ఉంది ఈవిడ?' అని. స్వయంగా నన్ను పలకరించేవారు కూడా కారు. దీనివల్ల నాకు అనుమానం కలిగేది, ఏదో విషయం తప్పక ఉందని. చివరికి ఆయన అనుమతితో మా పుట్టింటికి వెళ్ళిపోయాను, వారు నా శుశ్రూష సరిగ్గా చేయగలుగుతారని.

"ఒకరోజు రాత్రివేళ కాలకృత్యాల కొరకు నేను మదీనా వెలుపలికి వెళ్ళాను. ఆనాటి వరకు మా ఇండ్లల్లో మరుగుదొడ్లు ఉండేవికావు, మేము బయలు ప్రదేశానికే వెళ్ళేవాళ్ళము. నాతోపాటు మిస్తహ్ బిన్ ఉసాస తల్లి కూడా ఉండింది. ఆవిడ మా నాన్నగారికి పిన్నమ్మకూతురు. (ఇతర ఉల్లేఖనాల ప్రకారం ఆ కుటుంబం మొత్తం పాలనాభారం హ్రజత్ అబూబక్ర్ సిద్దీక్ (ర) బాధ్యతలో ఉండేది. ఈ ఉపకారాన్ని కూడా లెక్కచేయక మిస్తహ్ కూడా, హ్రజత్ ఆయిషా (ర)కు వ్యతిరేకంగా అపవాదులు వ్యాపింప జేసిన వారిలో ఉండేవారు) దారిలో ఆవిడకు ఎదురుదెబ్బ తగిలింది. అప్రయత్నంగా ఆమె నోట 'మిస్తహ్ నాశనం గాను' అన్న మాటలు వెలువడ్డాయి. నేను, "మంచి తల్లివే. కొడుకును శపిస్తావేమిటి? పైగా కొడుకు కూడా బద్ర్ యుద్ధంలో పాల్గొన్నవాడు" అని అన్నాను. దానికి ఆవిడ, "అమ్మా, నీకు అసలు తెలియదా ఏమిటి?" అంటూ ఆమె పెద్ద గాథ వినిపించింది. అబద్ధాలకోరు జనం నా గురించి ఎటువంటి మాటలల్లుతున్నారో పూసగ్రుచ్చినట్లు చెప్పింది. (కపటులు కాక స్వయంగా ముస్లిముల్లో ఈ ఉపద్రవానికి గురయినవారిలో మిస్తహ్, ప్రసిద్ధ ఇస్లామ్ కవి హస్సాన్ బిన్ సాబిత్, హ్రజత్ జైనబ్ సోదరి హమ్నా బిన్తె జహష్ చాలా ప్రముఖ పాత్ర వహించారు) ఈ గాథ విని నేను బిత్తరపోయాను, కత్తివాటుకు నెత్తుటి చుక్కయినా లేదు, నేను వెళ్ళిన అవసరం కూడా మరచిపోయాను, నేరుగా ఇంటికి తిరిగి వెళ్ళాను. రాత్రంతా ఏడుస్తూనే గడిపాను."

ఇంకా ముందుకు సాగి హ్రజత్ ఆయిషా (ర) ఇలా సెలవిచ్చారు. "నేను లేనప్పుడు దైవ సందేశహరులు (స), అలీ (ర), ఉసామా బిన్ జైద్ (ర) ని పిలిపించి వారి సలహానడిగారు. ఉసామా నా విషయంలో మంచిమాట పలికారు, ఇంకా ఇలా అన్నారు, 'దైవప్రవక్తా! మీ సతీమణిలో మేము మంచిని తప్ప మరేమీ చూడలేదు. ఇదంతా అసత్యం, అబద్ధ

ప్రచారం చేస్తున్నారు.” పోతే అలీ (ర) ఇలా అన్నారు, ‘దైవప్రవక్తా, మహిళల కొరతలేదు, మీరు ఆవిడకు బదులు మరో పెళ్ళి చేసుకోగలరు. విచారణే జరపాలని అనుకుంటే సేవకురాలయిన బానిసను పిలిపించి పరిస్థితిని విచారించవచ్చు.’ తదనుగుణంగా సేవకురాలిని పిలిపించడం జరిగింది. ఆమెను అడగ్గా ఇలా చెప్పింది, ‘మిమ్మల్ని సత్యబద్ధంగా పంపిన దైవం సాక్షి, నేను ఆమెలో ఎలాంటి చెప్పుకోదగ్గ చెడునూ చూడలేదు, ఒకటే లోపం, నేను పిండి కలిపి ఏదయినా పనికివెడుతూ, అమ్మా కాస్త పిండిని గమనించు అని చెప్పిపోతాను, కానీ ఆవిడ నిద్రపోతారు, మేకవచ్చి పిండిని కాస్తా కాజేస్తుంది’ అదే రోజున దైవప్రవక్త (స) ప్రసంగంలో ఇలా సెలవిచ్చారు, ‘ముస్లిములారా, నా ఇంటివారిపైన అపవాదులు మోపి నన్ను అమితంగా బాధిస్తున్న వ్యక్తి దాడుల నుండి నా గౌరవాన్ని రక్షించేవారు ఎవరయినా ఉన్నారా? దైవం సాక్షి, నేను నా భార్యలోనూ ఎటువంటి చెడుగును చూడలేదు, నిందమోపబడుతున్న ఆ వ్యక్తిలోనూ నేను చెడును కానలేదు. అతడు నేను లేనప్పుడు నా ఇంటికి కూడా ఎన్నడూ రాలేదు. అని చెప్పి తర్వాత ఆ విజృంభణ కాలంలోనే సామాజిక సంస్కరణ కోసం ప్రవక్తగారి చేత దిగువన పేర్కొన్న నిర్దేశాలు ఇవ్వబడ్డాయని ద్యోతకమవుతుంది (తెలియబడుతున్నది.)

1) ప్రవక్త సతీమణులకు తమ ఇండ్లల్లో గౌరవప్రదంగా కూర్చోవాలని, అలంకరణలు చేసుకుని బయటికి వెళ్ళకూడదని, పరాయి పురుషులతో మాట్లాడవలసి వస్తే మృదువుగా మాట్లాడరాదని, ఎవరయినా అనవసరపు ఆశలు పెంచుకునే అవకాశం ఇవ్వరాదని ఆదేశించడం జరిగింది.

2) ప్రవక్తశ్రీ (స) ఇంటిలో అనుమతి లేకుండా పరపురుషులు ప్రవేశించడాన్ని నిషేధించడం జరిగింది; పవిత్ర సతీమణులను ఏదయినా అడగదలిస్తే పరదా చాటుగా అడగాలని నిర్దేశించడం జరిగింది.

3) పెళ్ళికి నిషిద్ధంగాని పురుషులు (గైర్ మహరమ్), నిషిద్ధమయిన బంధువుల (మహరమ్) మధ్య వ్యత్యాసాన్ని నిర్ణయించడం జరిగింది. పవిత్ర సతీమణుల నిషిద్ధ బంధువులే స్వేచ్ఛగా ఇండ్లల్లోకి రాకపోకలు సాగించగల రని ఆదేశించడం జరిగింది.

4) ప్రవక్త సతీమణులు ముస్లిములకు మాతృమూర్తులని, సరిగ్గా స్వంత తల్లిలానే వారు ముస్లిములకు శాశ్వతంగా నిషిద్ధమయిన వారని తెలుపడం జరిగింది. అందువలన ప్రతి ముస్లిమ్ వారి ఎడల తన మనోభావాలను పరిశుద్ధంగా ఉంచుకోవాలని బోధించడమూ జరిగింది.

5) ముస్లిములను హెచ్చరించడం జరిగింది, ప్రవక్తను బాధపెట్టడం, ప్రపంచంలోనూ, పరలోకంలోనూ దేవుని అభిశాపానికీ, పరాభవకరమయిన శిక్షకూ కారణభూతమవుతుందని తెలుపడం జరిగింది. అలాగే ఒక ముస్లిమ్ మానాభిమానాలపైన దాడి చెయ్యడం, అతనిపైన అధర్మంగా నిందమోపడం కూడా మహాపాపమని హెచ్చరించడం జరిగింది.

6) ముస్లిమ్ మహిళలందరికీ ఆదేశించడం జరిగింది, వారు బయటికి వెళ్ళవలసి వచ్చినప్పుడు దుప్పట్లతో తమను తాము బాగా కప్పుకుని కొంగు ముఖాన వ్రేలాడదీసుకుని మరీ వెళ్ళాలని.

7) స్త్రీలు బయటికి వెళ్ళినా తమ అలంకరణల్ని కప్పిపుచ్చుకునే వెళ్ళాలి. అంతేకాక ధ్వని చేసే ఆభరణాలు ధరించి కూడా బయటికి వెళ్ళకూడదని ఆదేశించడం జరిగింది. ఈ విధముగా ఆనాడు ఏర్పరచిన పరదా పద్ధతి నేటివరకూయున్న విషయము మీకు తెలిసిందే.

## సమాప్తము

